ॐ




మరాఠీ నుండి తెలుగు అనువాదకులు

శ్రీ చిప్ప నారాయణ స్వామి - షోలాపూర్




సోలాపూర్ - మహారాష్ట్రము

శ్రీ బ్రహ్మవిద్యానన్దగిరి స్వాములవారిచే పరిష్కరింపబడినది

Computerized by: Swami Shri Barahmavidyananda giri,

Shri Sadguru Maharshi Malayalaswami Ashram,

Plot No.48, Kalavati nagar,(New sunil nagar) M.I.D.C. Solapur (MH) 413006.

Contact: 7017550722; 7843036503.

గ్రంథావిష్కరణము: శ్రీ సిద్ధారూఢస్వామి నిర్వాణ దివసము: శ్రావణ కృష్ణపక్ష పాడ్యమి.

తేది. 31-08-2023.

https://archive.org/details/@swami_brahmavidyananda Email: aumhreemaum@gmail.com

https://www.youtube.com/@advaitasiddhaantam6305/playlists



శ్రీ సద్గురు సిద్ధారూఢస్వాములవారి జననము: దుర్ముఖినామ సంవత్సర చైత్ర శుద్ధ నవమి తేదీ. 26-03-1836,

నిర్వాణ దివసము: శుక్లనామ సంవత్సర శ్రావణ కృష్ణపక్ష పాడ్యమి, తేదీ. 21-08-1929.

---

గ్రంథ ప్రాప్తి స్థానము


Shri Sadguru Maharshi Malayalaswami Ashram,

Plot No.48, Kalavati nagar,(New sunil nagar) M.I.D.C. Solapur (MH) 413006.

Contact: 7017550722; 7843036503.



వెల. రూ.499=00


---

మహారాజపోషకులు:

1. శ్రీ బ్రహ్మచారి అజయ్ చైతన్య, శ్రీ మలయాళస్వామి ఆశ్రమము, సోలాపూర్.
2. శ్రీ జనార్ధన్ మైలే s/o ముకుంద్ గారు, శ్రీ మలయాళస్వామి ఆశ్రమము, సోలాపూర్.
3. కీ.శే.శ్రీ రాజీర్ సబ్బన్ గారు, శ్రీ మలయాళస్వామి ఆశ్రమము, సోలాపూర్.
4. శ్రీ కట్రెడ్డి గాలి రెడ్డి, వసుంధర గార్లు–(దంపతులు),గ్రా.గజ్జలకొండ, మం. మార్కాపురం, ప్రకాశం జిల్లా.
5. శ్రీ నాగరాల భాస్కర్, సులోచన గార్లు–(దంపతులు), కర్నూలు.
6. శ్రీ దత్తాత్రేయ గుర్రమ్ గారు, (ప్రవీణ్ జీన్స్), సోలాపూర్.
7. శ్రీ విజయ్ కుమార్ దండి గారు, (అమృత సోడీ సెంటర్),సోలాపూర్.
8. శ్రీ గోవింద్ శ్రీరామ్ గారు, సోలాపూర్.
9. శ్రీ పుల్లయ్య తొగర్ చేటి గారు, గోవిందపల్లె, నంద్యాల.
10. శ్రీ దేవీదాస్ ఇట్టమ్ గారు, సోలాపూర్.

# రెండు మాటలు

|| శ్రీ సిద్ధారూఢ సద్గురు పరబ్రహ్మణే నమః ||

శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృతము శ్రీ శివదాస స్వామివారిచే మరాఠీ భాషలో ఓవీ బద్ధంగా విస్తారముగా అద్భుతంగా ఏబది ఆఱు అధ్యాయములుగా వ్రాయబడింది. తెలుగు భాషలో ఉపలబ్ధి లేదు. కాని, శ్రీ సిద్ధారూఢ సద్గురు సమగ్ర కథామృతమును సవిస్తరముగా శ్రవణముచేసి తరించాలనే జిజ్ఞాస నాలో కలిగి మా సద్గురుదేవులగు శ్రీ చిప్ప నారాయణ స్వాములవారి వద్దకు వెళ్ళి, శ్రీ సిద్ధారూఢ సద్గురు కథామృతమును మాకు దయతలచి వినిపించమని ప్రార్థించినాను. అప్పుడు శ్రీగురుదేవులన్నారు–శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృతము తెలుగు భాషలో ముద్రణ లేదయ్యా! దానిని ఎవరైనా తెలుగులో వ్రాస్తే బాగుండును. తెలుగువారికి చాలా ఉపయోగపడియుండెడిది–

అప్పుడు నేనన్నాను–స్వామీజీ! ఇటువంటి సద్గురు సేవా భాగ్యము బహుదుర్లభము. అందుకు నేను సిద్ధంగా ఉన్నాను. కాని, నాకు మరాఠీ భాష తెలియదు. మీరు మమ్ములను అనుగ్రహించి సద్గురు కథామృతమును మరాఠీ ఓవీలను చదివి వినిపించండి. మీరు చెబుతూ ఉంటే నాకు సద్గురు సిద్ధారూఢ కథామృత శ్రవణము చేసినట్లవుతుంది, వింటూ వింటూ నేను దానిని తెలుగులో వ్రాస్తూ ఉంటాను. దానితో మన ఇద్దరి అభీష్టములు నెరవేరగలవు.

అందుకు సద్గురుదేవులు సమ్మతించి ఈ ఆలోచన బాగుందయ్యా–అలాగే చేద్దాము అన్నాడు. అంతే, చక్కటి శుభముహూర్తములో ప్రారంభించినాము. గురుదేవులు ధారాళంగా చెప్తూ ఉంటే, నేను వెంట వెంట అతి వేగంగా వ్రాస్తూ ఉండేవాడిని. దానిని ఇంటికి తిరిగి వచ్చినాక మళ్ళీ చక్కగా వేరే నోటుపుస్తకములో వ్రాసేవాడిని. ఇట్లు, దాదాపు పదునెనమిది నెలలు స్వాములవారు చెప్తూ ఉంటే నేను వ్రాసినాను. ఇది ఇరువది సంవత్సరముల క్రిందటి విషయము. ఇంతవరకు లిఖిత పూర్వకముగా వ్రాసి ఉంచబడిన శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృతమును గ్రంథరూపములో తీర్చిదిద్దే అవకాశము దొరకలేదు. ఈ మధ్యలోనే మా శ్రీగురుదేవులు పరమపదవినిజెందినారు.

ఇప్పుడు, తెలుగువారికి సద్గురు సిద్ధారూఢ కథామృతమును అందజేయవలెనను మా శ్రీగురుదేవుల సంకల్పమును నెరవేర్చుటకై, వారి జ్ఞాపకార్థము ఈ సద్గ్రంథమును తెలుగులో రూపొందించడమైనది. దీనియొక్క కంప్యూటర్ పని పూర్తిగా మేమే చేసియున్నాము. ఒక్కొక్క అధ్యాయ క్రమంగా డాక్యుమెంట్స్ తయారుచేసి మా అంతేవాసియగు శ్రీ చంద్రమోహన్ యేముల్ గార్కి వాట్సప్ లో పంపించేవారము. ఆయన ప్రూఫ్ రీడింగ్ చేసి మళ్ళీ మాకు పంపేవారు. ఇట్లు, గురుసేవారూపంలో మాకు ఎంతో సహకరించిన శ్రీ చంద్రమోహన్ యేముల్ గార్కి ఈశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములను, భక్తి జ్ఞాన వైరాగ్యములను అనుగ్రహించి జీవన్ముక్తిని ప్రసాదించుగాక!

మరాఠీ భాషలోని శ్రీ సిద్ధారూఢ కథామృతము గ్రంథములోని ఒక్క ఓవీనిగూడ వదలకుండా యథాతథముగా తెలుగులో అనువదించడమైనది. అవసరమగుచోట శాస్త్రప్రమాణములనుగూడ ఇచ్చి, అచ్చటచ్చట ముముక్షువులకుపయుక్తమగు విశేష వ్యాఖ్యానమునుగూడా చేసియున్నాము. గ్రంథమున మొదటనే విషయసూచిక ఇవ్వడమైనది. ఈ సద్గ్రంథ అనువాదాత్మక రచనలో ఏమైనా గుణదోషములు దొరలినచో విజ్ఞులు సర్దుకొని చదువుకోగలరని మనవి.

Note:- ఇంకా ఎక్కడైనా spelling mistakes కనుపించినచో వాటిని ఒక కాగితముపై పేజీనంబరు సహితముగా వ్రాసి photo తీసి image లను పైన ఇవ్వబడిన contact number కు వాట్సప్ చేయగలరని మనవి.

శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి
చరణరేణువు
స్వామి బ్రహ్మవిద్యానంద



---

**ఉధృత గ్రంథములు:-**

శ్రీమద్భగవద్గీత

శ్రీమద్భాగవతము

శ్రీమన్మహాభారతము

శ్రీయోగవాసిష్ఠము

ఉపనిషత్తులు

పురాణములు

వేదాన్త పఞ్చదశి

శ్రీ జగద్గురు ఆద్యశంకరాచార్యులవారి ప్రకరణ గ్రంథములు



ॐ




## విషయసూచిక

  

**ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యో నమః ఓం శ్రీ సరస్వత్యై నమః**

## శ్రీ సిద్ధారూఢ చరిత్ర ప్రారంభము




**శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।**

**గురుః సాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః॥**

**శ్రీ సిద్ధారూఢ పరబ్రహ్మణే నమః**

ఓంకార స్వరూపుడవైన, ఓ సద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము.నీవు నిర్గుణ నిరాకార పరబ్రహ్మస్వరూపుడవై, అనాది అనంతస్వరూపుడవై యుండియు గణేశ-శారదా మొదలుకొని అనేక సగుణసాకారరూపములుగా ప్రకటమై నటించినావు.నీయొక్క కృపాదృష్టిని ప్రసరించి,నీ చరిత్రరూప యీ సద్గ్రంథముయొక్క రచన నిర్విఘ్నముగా కొనసాగునట్లు ఆశీర్వదింపుము.

నీయొక్క జ్ఞానదేవావతారములో నీ కృపచేత చతుష్పాద జంతువైన మహిషము (దున్నపోతు)ముఖమునుండి వేదములను పలికించి జగత్ప్రసిద్ధమైన అద్భుతమును చూపించినావు. అటువంటి మహిషముతో సమానమైన మందబుద్ధిగల నన్ను అగాధమైన దివ్యలీలలతో కూడిన నీయొక్క పరమపవిత్రమైన చరిత్రను రచనజేయుటకు అనుగ్రహించుము స్వామీ.

ఎవరి కృపచేత మూగవాడు అమృతతుల్యమైన వాక్కులు పలుకగలడో, రెండు కాళ్ళులేని కుంటివాడు పర్వతమునుగూడ అవలీలగా దాటగలడో, అభాగ్యుడగు పుట్టుగ్రుడ్డి జగద్వైచిత్ర్యమును దర్శించగలడో—అటువంటి ప్రత్యగభిన్నపరబ్రహ్మస్వరూపుడవు, అవ్యాజకరుణామూర్తివైన ఓ సద్గురు సిద్ధనాథా! నీయొక్క దివ్యచరితమును ప్రకటముచేయుటకు తగిన శక్తిసామర్థ్యములను, భ్రమప్రమాదాదిరహిత బుద్ధికౌశల్యమును-స్ఫూర్తిని ప్రసాదించి అనుగ్రహింపుము.

**శ్లో॥ మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్।**

**యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్॥** (భవిష్యమహాపు.బ్రాహ్మపర్వము 1-3)

నీవు స్వతస్సిద్ధ చిత్స్వరూపుడవై యుండియు, మాయాయోగముచే అనేక చిత్రవిచిత్ర రూపములు ధరించి, ఎల్లప్పుడు మమ్ములను ఆటబొమ్మలుగా జేసి లీలామాత్రముగా ఆడిస్తున్నావు.

"**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా।** (గీత.18-61)

నీవు వినోదముగానైన సరే ఆజ్ఞాపిస్తే, గొప్ప శిలయైనను వైఖరీవాణిచే ఉపనిషదర్థమును ప్రకటించగలదు. అట్లుండగా, సర్వాంతర్యామివైన నీవు నా హృదయమందుండి, నీయొక్క కృపచే, మందప్రజ్ఞుడనగు నాచేత యీ సద్గ్రంథమును వ్రాయించగలవనుట అతిశయోక్తికాదు.

జగత్కర్తయగు కమలాసనుడవు(బ్రహ్మదేవుడవు) నీవే అయి ఉన్నావు. విశ్వపాలకుడవై విష్ణుమూర్తిగా నీవే వెలసియున్నావు. రుద్రరూపము దాల్చి సృష్టి సంహారకర్తగా నీవే యున్నావు.

**శ్లో।।గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।**

**గురుః సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః।।**

మాయోపాధిక ఈశ్వరుడే తనయొక్క ఉపాధిరూప మాయయందలి సత్త్వ, రజ, తమస్సులను మూడు గుణభేదములచే తానే స్వయంగా విష్ణు బ్రహ్మ రుద్రరూపములచే ప్రకటమాయెను. (సిద్ధాస్తబిందు 8వ శ్లోక వ్యాఖ్య)

ప్రేమతో నీ మధుర నామగర్జన జేసినచో విఘ్నములు దశదిశలా పారిపోవును. నీయొక్క నామ గానమహిమచే నీ చరిత్రను వర్ణించుటకు అద్భుతమైన స్ఫూర్తి గలుగును.

**శ్లో।।అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః।**

**పుమాన్విముచ్యతే సద్యః సింహత్రస్తైర్వృకైరివ।।** (వి.పు.6-8-19)

సింహము గర్జించుటతోడనే తోడేళ్ళబారిన పడిన మృగము లేదా మేక ఎట్లు విడువబడునో, అట్లు ఎవరి నామసంకీర్తనమాత్రముచే మనుష్యుడు సకల పాపములనుండి ముక్తుడగునో,అటువంటి సద్గురు దేవునికి నా హృత్పూర్వక ప్రణామములు. దయాసాగరుడవైన, మాతృస్వరూపుడవైన ఓ సద్గురునాథా! నాయొక్క శ్రేయస్సునుగోరి ప్రేమపూర్వకముగా వేడుకుంటున్న నా హృదయమందు వసించి ఈ చరిత్రను వ్రాయుటకు ఆజ్ఞాపించుము స్వామీ!(సద్గురుదేవున్ని తల్లితో పోల్చిచెప్తూ) ఓ సద్గురుమాతా! అంతఃకరణమందు వసించి సంపూర్ణంగా నీయొక్క కథను నీవే చెప్పగలవు. జడుడనైన నన్ను కేవలము నిమిత్తముగా జేసికొని, ఒక లీలను గావించుచున్నావు. ఓ సద్గురుదేవా! త్రికరణములను(మనోవాక్కాయములను) సంపూర్ణముగా నీకు సమర్పించి నమస్కరించుచున్నాను.

ఇప్పుడు—సద్గురుదేవునిపట్ల ఎవరికి అనన్యభక్తి,శ్రద్ధ,ప్రేమ ఉంటుందో,అటువంటి సకల సంతు-మహాత్ముల(సత్పురుషుల)యొక్క చరణారవిందములకు వందనములు సమర్పించుచున్నాను. ఎవరియొక్క కృప లేశమాత్రమైనను కలిగినయెడల సకలజీవులు భవసాగరమునుండి తరించగలరో, అట్టి సద్గురుదేవునియొక్కసేవ స్వయంగా ఈశ్వరుడే అత్యాదరముతో చేయగలడు. అట్టి సద్గురు-

దేవునకు తనయొక్క శిష్యుడు బ్రాహ్మణుడై, శూద్రుడై, మహమ్మదీయుడై లేదా ఇతర హీనజాతులకు చెందినవాడుగా ఉండాలని తరతమ భేదము లేదు.

**శ్లో॥అయం బన్ధురయం నేతి గణనా లఘుచేతసామ్।**

**ఉదారచరితానాం తు వసుధైకకుటుంబకమ్॥** (మహో.6-71)

సద్గురుదేవుడు సమభావన, సమ్యగ్దర్శనము గలిగి ఉంటాడు. ఆయనయొక్క ముఖకమలమునుండి సర్వకాలసర్వావస్థలయందును నిరంతరము పరమాత్మ నామస్మరణ జరుగుతూ ఉంటుంది. అటువంటి శ్రీగురుదేవులసేవ సాక్షాత్ శ్రీవిష్ణుభగవానుడే కింకరుడై వచ్చి చేస్తాడు.(శ్రీ మహాభక్త విజయములో ప్రసిద్ధము)

ఓ శ్రోతలారా! పవిత్రమైన "**హుబ్లీ**" క్షేత్రమునందు తాను ఆశ్రమమునందుండి భక్తులను కాపాడుచున్న శ్రీసద్గురుసిద్ధారూఢస్వామియొక్క దివ్యమైన, భవ్యమైనచరిత్రను ఇప్పుడు మీరు సావధానచిత్తులై వినగలరు. చైతన్యఘనుడగు ఆ సద్గురు మహారాజు, పరిపూర్ణుడై, సర్వాంతర్యామియై వసించియున్నాడు. ఏభక్తులైతే ఆస్వామిని అనన్యభావముచే భజింతురో,వారిని భవసాగరమునుండి తరింపజేసి మోక్షమును ప్రసాదించగలడు.ఆయన షోడశకళాపరిపూర్ణుడు. ఆయనకు సకల శాస్త్రములు ముఖోద్గతము(కంఠస్థము). భక్తులకోర్కెలు తీర్చుటలో కల్పతరువుగా ప్రసిద్ధినొంది, సిద్ధనాథుడై శోభాయమానముగా ప్రకాశిస్తున్నాడు.

శ్రీ సద్గురుదేవుడు ప్రాతఃకాలమున మరియు సంధ్యాసమయంలో వేదాన్తరహస్యములను భక్తులకు శ్రవణము చేయిస్తూ, జ్ఞానామృతమును గ్రోలింపజేసి(త్రాగించి)భవ(జన్మమరణ) దుఃఖమును నివృత్తి(నష్టము) చేస్తూ ఉండేవాడు. సద్గురు సిద్ధనాథుని సాన్నిధ్యమునకు ప్రతినిత్యము నాలుగు విధముల భక్తులు తమ పురుషార్థమును గోరి వచ్చెడివారు. అటువంటి భక్తులయొక్క అధికారమును, మనః స్థితిని గమనించి, వారి యభీష్టమును బట్టి వారికి బోధచేసేవాడు.

**శ్లో॥చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున।**

**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥** (గీత.7-16)

మొదట, అర్థార్థిభక్తులు లౌకికభోగములైన గృహారామక్షేత్రములను, పుత్రమిత్రకళత్రాదులను, ధనకనక వస్తువాహనాదులను కోరి సద్గురు సాన్నిధ్యమునకువచ్చి అడుగుచుండెడివారు. ఇట్టి భక్తులు నశ్వరములైన(అశాశ్వతమైన) పదార్థములను అడుగుచున్నారని తెలిసికొని దయాసాగరుడైన సిద్ధనాథుడు వారికి పరమాత్మయొక్క పరమపవిత్రమైన నామస్మరణ బోధించేవాడు. ఆ పవిత్రమైన నామస్మరణద్వారా భక్తులయొక్కఅభీష్టములు సిద్ధించుచుండెను.సద్గురుకృపచేత వారియొక్క అభీష్టములు నెరవేరుచున్నందున, ఆ భక్తులు అత్యాదరభావముచేత నిత్యము ఆ నామస్మరణ చేయుచుం-

డెడివారు. ఎట్లో ఒకట్లు సకామముతో నెందుకుగాదు, ఆ నామస్మరణద్వారా వారి అంతఃకరణము శుద్ధమగుచుండెడిది.

రెండవరకము భక్తులు–సంసారముయొక్క తాపత్రయములచే కొట్టబడి, మోక్షసుఖమును గోరి సద్గురుచరణసాన్నిధ్యమునకు వచ్చి విధిపూర్వకముగా సాష్టాంగదండ[1]వత్ప్రణామములు చేస్తూ అత్యంత దీనభావముచేత, సంసారతాపత్రయమునుండి రక్షించమని సద్గురువునకు శరణుజొచ్చి వేడుకుంటూ వారికి కలిగిన భవదుఃఖమును ప్రకటము చేసేవారు.

ఈ ప్రకారముగా దీనభావముతో విన్నవించుకున్న ఆ భక్తులయొక్క ఆర్తనాదమును ఆలకించిన అపారదయాహృదయుడు, అవ్యాజకరుణామూర్తియగు సద్గురుదేవుడు వారి దీనత్వమును తెలిసికొని ఆ భక్తుల కొఱకు శాస్త్రశ్రవణము మరియు నామజపము–ఈ రెండు సాధనములను వారి శ్రేయస్సును కోరి ఉపదేశించేవాడు. ఆ రెండు సాధనములయొక్క ధృడత్వమువలన అంతఃకరణము అతిపవిత్రమై శాస్త్రశ్రవణమందు, భజనయందు ప్రీతికలిగియుండుటవలన, సారహీనమైన సంసార దుఃఖమునుండి అనాయాసముగా విడివడుచుండెడివారు. ఇట్లు,ఒకవైపు ప్రాపంచిక వ్యవహారములలో నిమగ్నులై,మరొకవైపు పరమార్థము (పరమాత్మ చింతన)చేసేవారు. కాని, ప్రాపంచిక వ్యవహారములు శ్రేయోమార్గమగు పరమాత్మ చింతనయందు ప్రతిబన్ధకములుగా తోచుచుండెను.ఈ ప్రకారముగా కొంతకాలము సాధనలు చేస్తూచేస్తూ పరమాత్మప్రాప్తియందు ధృడచిత్తులగుటచే చివరకు విరక్తినొంది మోక్షమునుగోరి సంసారమును త్యజిస్తారు.

**"సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామన్తే నృణాం మోక్షేచ్ఛా జాయతే।** (పైంగలో.౭-౯)

ఇక–మూడవరకం అధికారిపురుషులు సాధనచతుష్టయ సంపత్తియుక్తులై(ధృడమైన వివేక వైరాగ్యాదులచేత) సాంసారిక వ్యవహారములను పూర్తిగావదిలేసి సద్గురుసన్నిధిలో నివసిస్తూ, భయ,భక్తి,ప్రేమ మరియు అత్యంతసేవాతత్పరులై నిష్కామభావనచేత సద్గురుసేవ చేసేవారు. గురుదేవుని ఆజ్ఞమేరకు భిక్షకువెళ్ళి, ఆ తెచ్చిన భిక్షను సద్గురుచరణములయందు అర్పించి, గురువు దయతలచి "భిక్షను స్వీకరింపుము" అని ఆజ్ఞాపిస్తే సేవించేవారు. లేదా గురుదేవుడు ఆజ్ఞనొసంగు వరకు ఉపవాసము ఉంటూ, సద్గురుచరణములను ఆశ్రయించుకొని ఉండేవాడు.

**శ్లో॥భిక్షాన్నం భోజయేన్నిత్యం నైకాన్నాశీ కదాచన।**

**నివేద్య గురవేఽశ్నీయాద్వాగ్యతస్తదనుజ్ఞయా॥** (బృహన్నారదీయము 1-౨౯);

**శ్లో॥సమాహృత్య తు తద్భైక్ష్యం యావదర్థమమాయయా।**

---

1 **శ్లో॥పద్భ్యాం జానుభ్యాం కరాభ్యామురసా శిరసా దృశా।**

**వచసా మనసా చైవ ప్రణామోఽష్టాంగ ఉచ్యతే॥**(శ్రీ శంకరాచార్య విరచిత ప్రపంచసారము 6-114)

**నివేద్య గురవేఽశ్నీయాదాచమ్య ప్రాఙ్ముఖః శుచిః॥** (మను.2-51)

శిష్యుడు-తనకు మరియు గురుదేవునికి సరిపడు భిక్షను మాత్రము నిష్కపటభావముచే తీసి కొంచ్చి గురువునకు సమర్పించాలి. ప్రతినిత్యము ఒకే గృహమునుండి భిక్షను స్వీకరించగూడదు. వా-క్సంయమనము గల్గియుండి శిష్యుడు "భిక్షను స్వీకరింపుమ"ని గురుదేవుడు ఆజ్ఞాపించినపుడు మాత్రమే శుచిర్భూతుడై, పూర్వాభిముఖుడై, ఆచమనాదులుచేసి, దైవార్పితముగావించి భిక్షాన్న-మును భుజించాలి.జ్ఞానసాగరుడైన సద్గురుముఖకమలముద్వారా ప్రకటమయ్యే జ్ఞానామృతవేదాంత ధారను నిత్య, నిరంతర, ఆదరనీయముగా శ్రోత్రేంద్రియముద్వారా సాదరముగా సేవించేవారు. సద్గురువు భోదించిన వేదాంతమును యథాతథముగా శ్రవణముచేసిన పిదప, సాధకులు ఏకాంత స్థలమునకువెళ్ళి కూర్చొని, పరస్పరము తమలోతాము2 చర్చించుకొని, ధృఢభావముతో మననము చేసెడివారు. ఇట్లు,గురుగృహమున అనుదినము శ్రవణమననములు చేయుటద్వారా చిత్తమందున్న దారుణమైన విషయాసక్తి నివృత్తమయ్యెడిది.

ఇక–అత్యుత్తమమైన నాలుగవరకం అధికారి, ధృడమైన వివేక వైరాగ్యములచే ఎల్లప్పుడు మనన నిదిధ్యాసనాదులను చేయుటవలన అంతఃకరణము అతిపవిత్రమయ్యి "**అహంబ్రహ్మాస్మి**" అనే వృత్తిని పొంది, సదా "**సోఽహం**" భావనచేత "**ఆ పరమాత్మనే నేను**" అని ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూపుడై ఉండేవాడు. ఉత్తమోత్తమమైనటువంటి ఆ అధికారికి దయామయుడైన సద్గురుదేవుడు తన సన్నిధానమున కూర్చుండబెట్టుకొని, దేనిచే బ్రహ్మాత్మైక్య బోధ కలుగునో, అట్టి గుహ్యమైన మహావాక్యమును ఉపదేశించేవాడు. బ్రహ్మాత్మలయొక్క ఏకత్వబోధను కృపాసాగరుడైన గురుదేవుని ముఖారవిందముద్వారా యథాతథముగా శ్రవణమనననిదిధ్యాసములచే సంశయ విపరీత రహిత-ముగా బ్రహ్మాత్మలయొక్క ఏకత్వమును నిశ్చయము చేసినందున ద్వైతాద్వైతమైన భిన్నభిన్నవృత్తులు నశించెడివి. సకలమనోవృత్తులు ఉపశమించెడివి. ఎల్లప్పుడూ ఆత్మాకారవృత్తియందే ఉండుటవలన ఆత్మానందమునే పొందుతూ ప్రశాంతస్వరూపుడై ఉండేవాడు. ఆ ఉత్తమాధికారి సద్గురువుయొక్క పరిపూర్ణమైన కృపనుపొంది, ఈశ్వరునికన్న శ్రేష్ఠమైనటువంటి, సర్వాధిష్ఠానమగు బ్రహ్మరూపుడై "**బ్రాహ్మీస్థితి**"ని పొందేవాడు. ఇటువంటి "**బ్రాహ్మీస్థితి**"ని పొందిగూడ ఎల్లప్పుడు సద్గురువును అత్యంతవినమ్రుడై, దీనభావముచే సేవించుకుంటూ, సకలప్రపంచమును బ్రహ్మస్వరూపముగా దర్శించి, అందరిపైన దయ, సమదృష్టిని కలిగి ఉండేవాడు.

**శ్లో॥సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని।**

**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥** (గీత. 6-29)

2 తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రభోధనమ్ । ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥ (వే.పం.7-106)

ఈ ప్రకారముగా నాలుగువిధముల అధికారిపురుషులు సద్గురుసన్నిధానమునకు వచ్చుచుం-డెడివారు. సద్గురుదేవుడు వారియొక్క అభీష్టములమేరకు అధికారత్వమును గమనించి యుక్తమైన బోధనుచేస్తూ ఉండేవాడు. దూరదూర ప్రాంతములనుండి అనేకభక్తజనులు వచ్చుచుండేవారు. సిద్ధ-నాథునియొక్క కరుణాకటాక్షముచే వారి కోరికలు (మనోరథములు) ఈడేరుచుండెడివి.

ఇట్లు, సద్గురుసిద్ధమూర్తి సిద్ధాశ్రమముయందే ఎల్లప్పుడు ఉండిగూడ, దేశాంతరములందున్న భక్తులయొక్క ఆర్తనాదమును విని దుఃఖములను దూరముచేయుటకు వారికి అక్కడే దర్శనమిచ్చి, ఆ భక్తులయొక్క కష్టములను పరిహరించి(పోగొట్టి), వారి సేవలను పూజలను అందుకొని, వారికి అఖండమైన భక్తి కలిగియుండులాగున ఆశీర్వదించి,కరుణాఘనుడైన సిద్ధనాథుడు వారిని ఉద్ధరిం-చేవాడు.

ఏయే సమయంలో, ఏయే ప్రదేశంలో, ఎటువంటి చమత్కారమైన లీలలను ప్రదర్శించి-నాడో, అవన్నియు ఆనాటి భక్తులకు ప్రత్యక్ష గోచరములే. కాని, రాబోయే తరాల భక్తులుగూడ స్వామివారి దివ్యలీలలను తెలుసుకొని తరించడానికి వీలుగా సద్గురుదేవుడు అపారమైన కృపచే ఈ దివ్యగ్రంథమును వ్రాయడానికి ఆజ్ఞాపించెను. ఈ దివ్యవిభూతిరూపమైన సద్గురునాథుని చరిత్రను ఎవరైనను విన్నను, చదివినను వారియొక్క పాపములు సమూలముగా నష్టమై, వారికి బ్రహ్మానం-దరూపమైన శాంతి లభిస్తుంది. ఈ విధముగా గురుదేవుని వరదానముంది. సద్గురుప్రసాదరూప కరుణారసభరితమైన ఈ సద్గ్రంథము అధికారులకు మరియు అనధికారులకు, పుణ్యాత్ములకు మరి-యు పాపాత్ములకు, ఎటువంటి మందబుద్ధికలవారికిగాని (సర్వులకు)సంతోషమును చేకూర్చ గలదు.

లేఖకుని చేతిలోని కలమువలె నన్ను నిమిత్తముగా జేసికొని, శ్రీ సద్గురుదేవుడు నాయొక్క అంతఃకరణమునందు మరియు శరీరమంతటను వ్యాపించి, తానే స్వయంగా ఈ సద్గ్రంథమును వ్రాయించుచున్నాడు. సద్గురు సిద్ధనాథుని ఆజ్ఞచే రచింపబడిన ఈ సద్గ్రంథమున శుద్ధభావయుక్త-మైన యే గుణములు (సద్విషయములు) గలవో, అవి సద్గురుదేవుని యొక్కవిగా మరియు ఏవేవి అశుద్ధభావయుక్తమైన దోషములు గలవో, అవి జడమతిగల నావిగా తెలిసికొని, బుధజనులు మన్నించగలరని ప్రార్థన. ( గ్రంథకర్త )

**శ్లో॥యదత్ర సౌష్టవం కించిత్తద్గురోరేవ మే నహి।**

**యదత్రాసౌష్టవం కించిత్తన్మమైవ గురోర్నహి॥**(మధుసూదనసరస్వతి-సిద్ధాన్తబిన్దు చివరలో)

దయాసాగరుడైన శ్రీ సిద్ధనాథునియొక్క చరిత్ర, స్వామియొక్క జన్మస్థానము మొదలుకొని, జన్మవిశేషము, లీలావిశేషము,విభూతివిశేషము సవిస్తరముగా తెలుపుమని శ్రోతాభక్తులు అభ్యర్థిం-చగా, నా యొక్క (వక్తయొక్క)హృదయము ఆనందముచే ప్రఫుల్లితమైనది. కావున, ఓ శ్రోతలారా!

అమృతతుల్యమైన స్వామివారి దివ్యచరిత్రను చెప్పుచున్నాను. ఏకాగ్రచిత్తముతో సావధానముగా శ్రవణము చేయగలరని నాయొక్క మనవి.

దేనియొక్క శ్రవణమాత్రముచే సకలపాపములు పటాపంచలై భస్మముకాగలవో, అటువంటి మంగళకరమైన శ్రీ సిద్ధారూఢ కథామృతమును, దాసానుదాసుడైన శివదాసు, శ్రీ సిద్ధారూఢ సద్గురు చరణారవిందములకు సమర్పిస్తూ, ఈ సద్గ్రంథముద్వారా సర్వజనులకు ఆనందము చేకూరుగాక! అని ఆశిస్తూ ఈ ప్రథమాధ్యాయమును ముగిస్తున్నాను.

**ఓం సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వేసన్తు నిరామయా।**

**సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖభాగ్భవేత్।।**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







**ఓం శ్రీ గణేశాయనమః**                    **ఓం శ్రీ గురుభ్యోనమః**                    **ఓం శ్రీ సరస్వత్యై నమః**

# రెండవ అధ్యాయము

**పద్యానువాదము:**—దేవాదిదేవుడు-మహాదేవుడు-మహేశ్వరుడు అయినటువంటి సాక్షాత్పరమ శివుడే శ్రీ సిద్ధారూఢ యతీన్ద్రునిగా ఈ పుణ్యభూమియందు అవతరించి సకల అజ్ఞప్రాణులను(జీవు లను) ఉద్ధరించి భవసాగరమునుండి తరింపచేయడానికి వచ్చినటువంటి కృపామూర్తి. ''గురుశాం- తప్ప'' ''దేవమల్లమ్మ'' అను పుణ్యదంపతులకు పుత్రరత్నంగా జన్మించి ఈ భూమండలమందు కీర్తిని స్థాపించినాడు. సచ్చిత్సుఖసాగరరూపమైన ఓ సద్గురునాథా! నేను భక్తియుక్తుడనై నీ దివ్యపాదార విందములకు శిరసా వందనములు సమర్పించుచున్నాను, స్వీకరింపుము స్వామీ!

ఓ మంగళస్వరూపుడవగు సిద్ధగురువరా! నీకు మనస్ఫూర్తిగా నమస్కారములు. నీయొక్క దివ్యమంగళస్వరూపమును స్మరించినంత మాత్రముచేతనే సకలవిఘ్నములు విలయమొందును. నీవు నాహృదయమందు నివసించి ఈ సద్గ్రంథమును నిర్విఘ్నముగా నాయొక్క హస్తములద్వారా రచించగలవు. ఓ దయాసాగరుడవైన సిద్ధారూఢ యతీన్ద్రా! నీవు స్వరూపముచే అఖండముగా [సజాతీయ,విజాతీయ,స్వగతభేదరహితుడవై(లేక)దేశకాలవస్తుపరిచ్ఛేదరహితుడవై] యుండికూడా భక్తులను ఉద్ధరించే నిమిత్తముచే(మిషచే) పరిచ్ఛిన్నదేహమును ధరించి ఈ లోకములో అవతరించితివి.

**శ్లో॥జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ।** (శ్రీమద్భాగవతము 10-14-55)

బ్రహ్మవిచారముచేయు సాధకులకు ఆశ్రయమగు ఈ పరమపవిత్రమైన భరతభూమి జ్ఞాని-మహాత్ములకు జన్మస్థానమని ప్రపంచంలో ప్రఖ్యాతిగలదు. అటువంటి భరతభూమిలో,మనోహర-మైన నిజాముదేశమందు ***"వంశదుర్గము"*** అనే పేరుగల గ్రామముగలదు. ఆ గ్రామంలో ***"గురు-శాంతప్ప"*** మరియు మహాపతివ్రతయగు ***"దేవమల్లమ్మ"*** అను యీ పవిత్రదంపతులు శివభక్తులై ఎల్లప్పుడూ శివనామ స్మరణయందే రమించేవారు. ఆ పుణ్యదంపతులు నిరంతరము వృషభ-ధ్వజుడగు సదాశివుని మనసా ధ్యానిస్తూ సేవిస్తూ ఉండేవారు. ఇంటికివచ్చిన అతిథులకు, సాధు-సత్పురుషులకు విధిపూర్వకముగా గృహస్థ ధర్మమునుసరించి సత్కారములు చేయుచుండెడివారు.

**శ్లో॥అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతి నివర్తతే।**

**స దత్వా దుష్కృతం తస్మై పుణ్యమాదాయ గచ్ఛతి॥** (స్కం.పు.3-6-23)

ఎవరి గృహమునుండి అతిథి, భిక్ష లభించక భగ్నాశుడై(నిరాశచే)వెడలిపోవునో, అతడు ఆ గృహస్తులకు తనయొక్క పాపమునిచ్చి, వారి పుణ్యమును గొనిపోవును.

వివేక వైరాగ్యాది సాధనచతుష్టయసంపత్తి గలిగియుండి ఎల్లప్పుడు వారి (స్వ)సద్గురువగు "శ్రీ వీరభద్రస్వామి"వారిని గృహముయందే పూజిస్తూ ఉండేవారు. వారి సేవలచే పరితృప్తుడైన, ఆ సద్గురునాథుడు (వీరభద్రస్వామి) బ్రహ్మానన్దభరితుడై వారిపై దయగలిగి,వారికి అతిగోప్యమైన బ్రహ్మ-జ్ఞానాన్ని యథాతథముగా బోధిస్తూ బ్రహ్మానందపరవశులుగ చేసేవాడు. బ్రహ్మాత్మలయొక్క ఏకత్వ-మును ప్రతిపాదించే సద్గ్రంథములను శ్రవణము చేయించేవాడు. అనర్థకారియగు దేహాదిక ప్రపం-చమును "**నేతినేతి**"(బృ.3-9-26)వాక్యాలచే నివృత్తిచేసి(త్రైకాలికాత్యంతాభావనిశ్చయము గావించి) సద్వస్తువైన పరబ్రహ్మజ్ఞానాన్ని బోధించేవాడు. క్షేత్రక్షేత్రజ్ఞుల(జీవపరమాత్మల, ఆత్మానాత్మల, జడ-చేతనముల)యొక్క వివేచనముద్వారా బ్రహ్మాత్మైకత్వ బోధచేసేవాడు.

దానిని శ్రవణముచేసిన ఆ దంపతులు లింగస్వరూపమగు ఆత్మ, అంగస్వరూపమైన అనాత్మ దేహాదులయొక్క యథార్థమైన స్వరూపమును వివేచనముచేసి, తెలుసుకొని, స్వయముగా సంశయ విపరీత భావనారహిత స్వస్వరూపసాక్షాత్కారమును పొందినారు.

ఇటువంటి పుణ్యదంపతులయొక్క పుత్రరత్నములుగా ముగ్గురు కుమారులు జన్మించినారు. సిద్ధనాథుడు మూడవ సంతానము. "***శాలివాహన శకము 1758, దుర్ముఖనామ సంవత్సరము చైత్ర శుద్ధ నవమి***" శుభదినమున శ్రీసద్గురు సిద్ధారూఢస్వాముల వారు జననమొందినారు. శ్రీ సిద్ధనాథుని తల్లిదండ్రులు సద్గురువైన శ్రీ వీరభద్రస్వామియొక్క దివ్యమైన వాగమృతమును నిత్య నిరంతర ఆదరభావముతో శ్రవణముచేస్తూ ఉండగా, సిద్ధనాథుడు తల్లిఒడిలో కూర్చుండి శ్రీగురు ముఖారవిందముద్వారా వెలువడుచున్న వేదాంతరహస్యములను అత్యంత ప్రీతితో శ్రవణముచేస్తూ ఉండేవాడు. అతి చిన్నతనమునుండి సిద్ధనాథుడు క్రమముగా ప్రతినిత్యము శ్రద్ధ ఆసక్తులతో వేదాంతశ్రవణము చేయుచున్నందున మూడుసంవత్సరములవరకే ఆయనయందు వివేకాది సాధన చతుష్టయసంపత్తి జాగృతి కలిగి సంపూర్ణ అధికారము ప్రాప్తించినది. క్రమక్రమముగా వేదాంత శ్రవణము చేస్తూ అకస్మాత్తుగా ఒకరోజు జీవబ్రహ్మలయొక్క ఏకత్వ విచారమును విని తానుకూడా ఐక్యస్థితిని పొందాలని తన మనస్సుయందు రాత్రింబవళ్లు విచారించాడు. ఎప్పుడైతే సర్వాత్మ భావనను పొందాలని సిద్ధారూఢ స్వామియందు ఇచ్ఛ ఉదయించినదో, ఆ సమత్వభావన దృఢ-మగుటకై దయగలవాడై ప్రవర్తించసాగాడు. తోటి జీవులయందు, జంతుజాలమునందు, చెట్టు-చేమలయందు, జడవస్తువులయందు (చరాచర ప్రాణికోట్లయందు) కూడ సర్వత్ర సమత్వమును దర్శించసాగాడు.

**శ్లో॥విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।**

**శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥** (గీత.5-18)

జ్ఞానులు విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునియందును,గోవు,ఏనుగు,కుక్క మొదలగు వాటియందును, కుక్కమాంసమును వండుకొని తిను చండాలునియందును సమదృష్టినే గలిగి యుందురు.

**శ్లో॥విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికీమ్।**

**ప్రణమేద్దండవద్భూమావాశ్వచండాలగోఖరాన్॥** (శ్రీమద్భాగవతము 11-29-16)

ఒకవేళ తనయొక్క బన్ధుమిత్రాదులు తనను పరిహసించినను, వారిని లెక్కచేయక, "**నేను, నాది, నావారు, పరాయివారు**"అను భేదదృష్టిని, దేహదృష్టిని, లోక-లజ్జను వదలి కుక్కకు, చండాలునికి, గోవునకు మరియు గాడిదకుగూడ భూమిపై పరుండి సాష్టాంగ దండవత్ ప్రణామములాచరించవలెను.

స్వరూపముచే నిర్గుణ, నిరాకార పరబ్రహ్మమేయగు శ్రీ సిద్ధనాథుడు,"**సకల జీవులకు సుఖ మును చేకూర్చాలి**"-అను దృఢసంకల్పమును చేబూని(ధరించి), మాయాయోగముచే జీవభావము తో సగుణసాకారరూప దేహధారియై మానవరూపంలో అవతరించాడు. ఇక నాలుగు సంవత్స-రముల వయసులో తన దివ్యలీలలచే లోకమునకు అధ్యాత్మిక తత్త్వమును ఉపదేశించు ఉద్దేశ్యముతో, తోటి పిల్లలతో ఆటపాటలయందు ప్రవేశించినాడు.

**శ్లో॥చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః ।**

**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ॥** (శ్రీరామపూర్వతాపన్యుపనిషత్ 7)

**శ్లో॥జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥** (భాగ.10-14-55)

జగత్తుయొక్క హితమును గోరి సాక్షాత్పరబ్రహ్మమే తనయొక్క యోగమాయను ఆశ్రయించి దేహధారివలె కన్పట్టుచున్నాడు.

తోటి బాలురతో ఆటలు ఆడుకునే సమయమున ఒకానొక రోజున తోటి పిల్లలందరూ కలిసి శ్రీ సిద్ధనాథుని నువ్వులు పెట్టమని కోరినారు. వెంటనే సిద్ధనాథుడు పిల్లలను వెంటపెట్టుకొని తొం-దరగా తన ఇంటికి వచ్చాడు. వంటశాలలోకెళ్లి నలువైపులా చూసినాడు. తనయొక్క తల్లి అగు-పడుట లేదు. ఆ వంటశాలయందు ఒక ఉట్టిపైన నువ్వుల కుండనుగాంచి, స్పర్శచేయకుండగనే ఒక కట్టెతో పొడిచి, దాని అడుగుభాగమున రంధ్రము చేసినాడు. ఆ రంధ్రముగుండా ఏకధారగా నువ్వులు క్రింద పడడం ప్రారంభమయ్యాయి. అప్పుడు ఆ పిల్లలను పిలిచి నువ్వులు తీసుకొమ్మని ఆజ్ఞాపించాడు.

అప్పుడు పిల్లలందరూ తమతమ చొక్కాలను విడచి ఆ నువ్వులను మూటగట్టుకొని తమతమ ఇండ్లలోకి తీసుకెళ్ళుచుండగా ఇరుగుపొరుగు వారందరూ పరిగెత్తుకుంటూ సిద్ధనాథుని ఇంట్లోకి ప్రవే

శించినారు. ఆ నువ్వులకుండ చూడడానికేమో అతి చిన్నదిగా ఉంది. కాని, దానినుండి పడుతున్న నువ్వులరాశి అతిపెద్దదిగా ఉంది. బాలరూపుడగు సిద్ధనాథుని బాలలీలాప్రతాపమును పొగడసాగినారు. వేలకొలదికడవలు నింపినా, కించిన్మాత్రముగూడ ఆ నువ్వులరాశి తరుగకున్నది. ఇన్ని నువ్వులు ఎక్కడినుండి వచ్చినవి-అని ఆ వచ్చిన జనసమూహమంతా, సిద్ధనాథుడు సాక్షాత్ ఈశ్వరావతారమేనని,అతని అగాధమైన బాలలీలామహిమను ఆశ్చర్యచకితులై నలువైపుల పొగడసాగినారు. ఆ సమయమున సిద్ధనాథునియొక్క తల్లి ఇంటికి వచ్చి జరిగిన సంఘటనను కన్నులారా గాంచి ఆశ్చర్యచకితురాలై సిద్ధనాథుని ఈవిధంగా అడుగుతుంది. నాయనా! సిద్ధా! ఏమిరా ఈ వింత? ఏ విధంగా జరిగింది బిడ్డా!

అప్పుడు తన తల్లితో సిద్ధనాథుడు ఈ విధంగా చెపుతాడు. అమ్మా!నేను ఏ వింతయు చేయలేదమ్మా! ఇదంతా నీయొక్క గురుసేవయొక్క ఫలమేనమ్మా!దానికి వేరే ఉపమానము లేదు. నిశ్చయముగా నీ సద్గురుసేవ మహిమవల్లనే ఈ ఘటన జరిగిందని నాకు తోచుచున్నది-అని చిరునవ్వు నవ్వుతూ అంటాడు. అయినాగూడా ఓ తల్లీ! ఈలీలద్వారా ప్రకటమయిన ఒక తాత్పర్యరూపమైన గూఢరహస్యమును చెబుతాను విను. జ్ఞానిశరీరము జ్ఞానమనే నువ్వులచేత నిండిన ఒక తిల పాత్ర. జ్ఞానియొక్క శ్రీముఖమునుండి వెలువడు జ్ఞానోపదేశ వాక్యప్రవాహమే నువ్వులధారలు. కాని, యే జ్ఞానామృతధారలను ధరించినచో (గ్రహించినచో) జీవులకు విశిష్టమైన (విలక్షణమైన) పరితృప్తి (పరమశాన్తి=మోక్షసుఖము) లభించునో,అటువంటి జ్ఞానభరిత ఉపదేశరూప వాక్యామృత ధారలచే ఎన్ని అజ్ఞఘటములైనా పూర్తికాజాలవు(నిండజాలవు). అనగా, జ్ఞానియొక్క ముఖారవిందముద్వారా వెలువడు జ్ఞానామృతమును ఎంతమంది అజ్ఞానిజీవులు(పూర్వము చెప్పబడిన నాలుగు విధముల అధికారిజనులు)సేవించినను, ఆ బోధామృత(తిలల=నువ్వుల)రాశి తరుగదు. ఇట్లు, సిద్ధబాలుడు ఆ ఘటనయొక్క అధ్యాత్మిక లక్ష్యార్థమును స్పష్టముగా తెలిపెను.

కుమారునియొక్క వచనామృతమును విని నేను ధన్యురాలనైతినని తల్లియగు దేవమల్లమ్మ ఆనందముతో ఉప్పొంగిపోయి, సగుణరూపముగా ప్రకటమైన సాక్షాత్తు శివావతారమని సిద్ధనాథుని మహిమ మాకు ఇంతవరకు తెలియదాయెను—అని అనుకొని, సిద్ధనాథుని దగ్గరకు తీసుకొని ఆనందముతో తల నిమిరసాగింది. వెంటనే సిద్ధనాథుడు తల్లినుండి తప్పించుకొని పరుగెత్తుకుంటూ తోటి పిల్లలవద్దకు వెళ్ళి వారితో ఆడుకొనసాగెను.

ఈవిధంగా వారితో ఆడుతూఉండగా ఒకనాడు తల్లి, కొడుకును పిలుచుకొని ఈ విధంగా హెచ్చరించింది. సిద్ధా! నాయనా! ఇప్పుడు నీకు ఐదుసంవత్సరములు నిండినవి. ఇప్పటినుండి నీవు బడికివెళ్లి చదువు నేర్చుకో!అప్పుడు, సిద్ధనాథుడు తల్లియొక్క వచనములను విని,ఇదేమిటమ్మా! నాకు ఏదో కొత్తపని చెబుతున్నావు. నాకేమీ బోధపడటం లేదు.

**శ్లో।।జీవః శివః, శివో జీవః, స జీవః కేవలో శివః"**

**శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే।**

**శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః।।** (స్కందోపనిషత్.6 & 8),

**మరియు "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"**(తై.2-1-1)

అను శ్రుత్యుక్త ప్రకారముగా ఎవరు ధ్యానముచే హృదయమందు "**శివున్ని జీవునిగా, జీవున్ని శివరూపునిగా**" మరియు దేశకాలవస్తు పరిచ్ఛేదరహితమైన పరబ్రహ్మను సర్వత్ర దర్శిస్తారో, వారికి లోపల బయట అంతట సర్వత్ర విద్యాలయమే కానొస్తుంది.

"**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః**" (మహానా.9-5)

అంతఃకరణవృత్తి అధిష్ఠాన పరబ్రహ్మస్వరూపమును పొందిన మీదట ఆయనకు ఏ విద్య-గాని, విద్యాలయముగాని అవసరముండదు. మరియు, సర్వ నామరూప ప్రపంచమునందు "**అస్తి, భాతి, ప్రియ**"రూపముగా ఆ పరబ్రహ్మమును దర్శించి, నిరంతరము—నిత్య,స్వయంప్రకాశ,ఆనంద-స్వరూపమైన నాయందే రమించి ఉంటున్నాను. ఇక వేరే బడితో నాకు అవసరమేమిటి తల్లీ!

**శ్లో।।అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకమ్ ।**

**ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్ ।।** (సరస్వతీ రహస్యో.2-23 & 24)

అమ్మా! నీవు బడికి పొమ్మనుటకు ఇంకేమి కారణము? పొందవలసిన దాన్ని పొందినాంక నాకింకేమి ప్రాప్తవ్యము గలదు?

**శ్లో।।యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**

**ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ।।** (గీత.3-17)

నీవు పంపించే పాఠశాలలో లభించునది కేవలము లౌకికవిద్యయే కదా!దానివలన జీవుడు అజ్ఞానముచే తన నిజహితమును సహజముగా కోల్పోయి, భవసాగరమున మునకలువేస్తూ మోహముచే బంధింపబడుచున్నాడు.

**శ్లో।।అన్యవిద్యా పరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్ ।**

**బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం నృణామ్ ।।** (శుకరహస్యోపనిషత్.3-14)

ఇటువంటి వేదాంతవాక్యములను విని దేవమల్లమ్మ ఆశ్చర్యచకితురాలయ్యింది. సిద్ధనాథుని యొక్క ముఖ్య అభిప్రాయమును తెలుసుకొని, తమ గురుదేవుని సన్నిధిలో వేదాంత శ్రవణమునందు ప్రవృత్తము చేసింది.

సరే! అది అట్లుండగా, ఒకానొక రోజున బాలమూర్తియగు సిద్ధనాథుడు తమ ఇంటి గేదె (మహిషము)పైన కూర్చుండి, తోటిబాలురను పిలిచి"ఇదిగో, ఈ అద్భుతమైన ఏనుగును చూడండి" నేను ఏనుగుపైన కూర్చున్నాను. మీరందరూ బాజాభజంత్రీలు వాయించండి. మనమందరము కలిసి

ఊరేగింపు చేస్తాము రండి-అని తోటిపిల్లలను ఆజ్ఞాపించాడు. ఈ వార్త విని పిల్లలందరూ ఆనంద పరవశులై అనేక పాటలు పాడుతూ ఆటలాడుతూ(భోజనముచేసే పళ్ళెములను వాయిద్యాలుగా ఉపయోగించి) గొప్పధ్వని చేస్తూ, నవ్వుతూ ఎగురుతూ ఉత్సాహంగా నడుస్తున్నారు. కాని, సిద్ధ-నాథుడు కూర్చున్న బర్రె(గేదె) కదలడం లేదు, మెదలడం లేదు. ఎన్నిప్రయత్నాలు చేసినాగాని(గట్టిగా అరచినా, కొట్టినా)ఆ గేదె అక్కడనుండి కదలలేదు. అప్పుడు సిద్ధనాథుడు చాలా కోపమునకువచ్చి "**నీవు చచ్చిపో**" అని ఆ గేదెను శపించినాడు. ఆ శబ్దప్రయోగము చేయుట తోడనే, ఆ గేదె నిర్జీవ-మై భూమిపై పడిపోయింది. అది చూసి పిల్లలందరూ భయముచేత సిద్ధనాథుని తల్లిదగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్లి, సిద్ధనాథుడు కోపముతో మీ గేదెను చనిపొమ్మని శపించినాడు. అందుకని అది క్రిందపడి ప్రాణాలు కోల్పోయిందని చెప్పగా, గుండెలు అదిరి భయకంపితురాలయిన దేవమల్లమ్మ తత్క్షణమే ఏడుస్తూ పరుగుపరుగున సిద్ధనాథుని చెంతకు వచ్చి—

సిద్ధా! ఈబర్రెను ఎందుకు కొట్టిచంపినావు? అయ్యో!శివశివా!ఎంత ఘోరం జరిగింది —అని ఆర్తనాదముచేత అనేక విధములుగా విలపించసాగింది. అప్పుడు సిద్ధనాథునకు తల్లియొక్క దుఃఖమును చూసి చాలా జాలి (కరుణ) గలిగి, తల్లితో యిట్లనెను.

ఓ తల్లీ! ఎందుకు ఈ ప్రకారముగా విలపిస్తున్నావు?గేదె చనిపోయిందనే కదా! ఇంత మా-త్రమునకు ఇంతగా దుఃఖించుట తగదు—అని "**ఓం నమఃశివాయ**"అని సహజంగా తన అమృత హస్తములతో ఆ గేదెను స్పర్శించినాడు. వెంటనే ఆ గేదె యథావత్తుగా తన అవయవములను సవరించుకొని లేచి నిలబడింది. ఈ దృశ్యమును చూసిన అక్కడి జనమంతా అచ్చెరువొంది, ఇది చాలా అఘటిత ఘటనారూప కృత్యము (లీల) ఉన్నదని తెలుసుకున్నారు.

ఈ అద్భుతలీలను సమస్త పురజనులు వీక్షించి వారిలోవారు ఈవిధంగా అనుకుంటారు-ఈ సిద్ధనాథుడు సాక్షాత్తు ఈశ్వరుడో, విష్ణువో లేక ఒకానొక గొప్ప ఋషీశ్వరుడో అయిఉంటాడు. ఈయన మాయందు కరుణించి మమ్ములను ఉద్ధరించడానికి వచ్చినటువంటి అవతారమూర్తియని నిశ్చయించుకున్నారు. అప్పుడు సిద్ధమూర్తి వారిని ఉద్దేశించి ఈ విధంగా అన్నాడు.

ఎన్నివిధములుగా కదిలించడానికి ప్రయత్నించినా జడవస్తువులాగా పడిఉన్న ఆ గేదె కేవ-లము అహం మమాభిమానయుక్త "**అహంకారము**" (తమోగుణయుక్త జీవుడు).దానియొక్క తమో-గుణమును నాశనము చేయడానికి ఆత్మ దానిపై కూర్చొని ఉంది. ఆ అహంబుద్ధి (తమోగుణము) ఎన్ని ప్రకారముల సాధనలు, ప్రయత్నములు చేసినాగాని కించిన్మాత్రముకూడా జీవుడిని బ్రహ్మ మార్గమునందు ప్రవృత్తము కానివ్వకున్నది.

**శ్లో॥తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**

**ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత! ॥** (గీత.14-8)

ఓ భారతా! ఈ తమోగుణము ఆవరణశక్తిప్రధాన ప్రకృత్యంశమునుండి పుట్టినదని తెలియుము. ఆత్మానాత్మల వివేకమును హరించి సకలప్రాణులను మోహములో పడదోయును. భ్రాన్తి, ఆలస్యము =సోమరితనము, అతినిద్ర అనువానిచే ఆత్మను బంధించుచున్నదని తెలియుము. అది గనిన ఆత్మ, ఈ"అహం"లయావస్థను పొందుగాక(నశించుగాక)-అని సంకల్పము చేస్తాడు. వెంటనే అహంబుద్ధి విలయావస్థను పొందెను. అప్పుడు అనాది కాలమునుండి అహంకారమును పోషించుచున్న (ఈ జీవున్ని సంసారచక్రంలో త్రిప్పుచున్న) అజ్ఞానము (మూలావిద్య) పరుగెత్తుకుంటూ ఆత్మ చెంతకు వచ్చి, నాకు ఎన్నోజన్మల సంబంధముగల ఈ అహంకారమునకు (తమస్సుచే ఆవరింపబడిన జీవునకు) పునర్జీవనమును ప్రసాదింపుమని విలపిస్తూ వేడుకున్నది. ఇటువంటి కరుణాపూరిత, జ్ఞానభరిత వచనములను విని అహంకారమును (జీవుడిని), ఆత్మ పునర్జీవితుణ్ణి చేసెను. కాని, ఇప్పుడు పూర్వమువలె కాక, స్వస్వరూపస్థితిని (మోక్షమును) పొందడానికి భక్తియుక్తుడై సాధనలు చేస్తూ, ప్రశాంతముగా అధ్యాత్మిక జగత్తులో (బ్రహ్మమార్గమునందు) విహరించుచున్నాడు.

ఇటువంటి సద్విచారయుక్త అమృతతుల్య సంభాషణమును విని తల్లియగు దేవమల్లమ్మ మరియు పురవాసులందరూ–సిద్ధనాథుడు వయసులో చాలా చిన్నవాడైనను, జ్ఞానము మాత్రము ఎంతో మహత్తరమై ఉంది. తర్కించుటకు వీలుకాకుండా ఉంది అని అనుకున్నారు.

**శ్లో॥యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి ।**

**అన్యత్తృణమివ త్యాజ్యమప్యుక్తం పద్మజన్మనా ॥** (యోగవాసిష్ఠము.2-18-3)

యుక్తియుక్తమైయుండు వచనము పిల్లవాడు జెప్పినను బ్రహ్మవచనమువలె గ్రహించదగినది. యుక్తియుక్తముకాని వచనము బ్రహ్మదేవుడు జెప్పినను తృణమువలె త్యజించదగినది. ఏలయన, మహాత్ములు యుక్తియుక్తానుభవముతోను, లోకసమ్మతముగాను, సకలజీవులకు శ్రేయస్సు(హితము) చేకూరగల సద్వచనములే చెప్పుదురుగాని, విరుద్ధముగా జెప్పరు. విరుద్ధముగా కనుపించు వచనములు ఈశ్వరునికిగాని, మహర్షులకుగాని సమ్మతములు కావు.

సిద్ధనాథునియొక్క సుందరమైన రూపమును(మూర్తిని) గాంచి పురజనులు అందరూ, ఓ తల్లీ దేవమల్లమ్మా! నీవు ధన్యురాలివి. మీయొక్క సాంగత్యమువలన మేమందరము ధన్యులమైనాము. ఈయన ప్రత్యక్ష త్రిమూర్తిస్వరూపుడే-అని చెప్పి, నిశ్చయించుకున్నారు.

ఒకానొక రోజున సిద్ధనాథుడు తోటి పిల్లలందరినీ పిలిచి, ఒరే మిత్రులారా! మీరు అందరూ నాతోపాటు చెరువులోకి స్నానముచేయడానికి రావాలి-అని ఆజ్ఞాపించినాడు. అప్పుడు పిల్లలందరూ కూడి ఆనందముతో బయలుదేరి చెరువు వద్దకు వచ్చి, అందరూ కలిసి స్నానముచేయుటకు ఆ చెరువుయందు దిగినారు. ఒక పిల్లవాడు మాత్రము నీటిలో దిగడానికి భయపడి తటస్థుడై ఒడ్డున

నిలుచున్నాడు. అప్పుడు సిద్ధనాథుడు, ఆ పిల్లవాన్ని బలాత్కారంగా ఈడ్చుకొని వచ్చి, చాలా లోతైన నీటిలోనికి దింపినాడు. ఆ పిల్లవాడు అనేక విధములుగా హాహాకారముచేస్తూ,నీటిలో దిగుటకు భయపడి కేకలువేస్తూ ఏడుస్తూ ఉండగా చూసి ఇతర పిల్లలు సిద్ధనాథునితో, "సిద్ధా! ఆ పిల్లవాడు భయపడి ఏడుస్తున్నాడు. పాపము అతనిని వదులుము"అని అన్నాగాని, వారి మాటలు వినకుండా సిద్ధనాథుడు ఆ పిల్లవాన్ని వదలక నీటియొక్క లోతైన భాగానికి ఈడ్చుకువెళ్ళి, వాన్ని అక్కడే దిగ-ద్రొక్కి ముంచి, ఒక్కడే తీరమునకు చేరుకున్నాడు.

పిల్లలందరూ ఆశ్చర్యచకితులై ఆ దృశ్యమును చూసి, సిద్ధనాథున్ని చుట్టుచుట్టి-పాపం మేము ఎంత చెప్పినాకూడ వినకుండా ఆపిల్లవాడిని నీటిలోనికి ఈడ్చుకొనిపోయి అన్యాయముగా అనా-యాసంగా చంపితివి కదా సిద్ధా! అని అంటారు.

సిద్ధనాథుడు వారిని ఉద్దేశించి ఈ ప్రకారముగా అంటాడు-ఆ పిల్లవానియొక్క భయము, దుఃఖము సంపూర్ణముగా నివృత్తి అయింది. దేహభావము వదులుకున్నందున దేహసంబంధమైన సుఖదుఃఖములు కూడా మిగలకుండా నివృత్తి అయినవి. ఇకముందు ఆయనకు భయదుఃఖములు ఉండవు.

అప్పుడు, ఆ పిల్లల్లో ఒకడు ఆనీటిలో మునిగి పోయిన పిల్లవాని తల్లిదగ్గరకు పరిగెత్తుకుం-టూ వెళ్లి, సిద్ధనాథుడు నీయొక్క కుమారుణ్ణి బలాత్కారముగా చెరువులోని నీటి అట్టడుగుభాగానికి ఈడ్చుకొనిపోయి, వాడిని అక్కడే ముంచి చంపివేసినాడు-అని జరిగిన వృత్తాంతమును వివరించాడు.

ఒకే ఒక పుత్రుడుగల ఆ తల్లి తన కుమారునియొక్క మరణవార్తను విని గుండెలుబాదుకుం-టూ, విలపిస్తూ పరుగుపరుగున సిద్ధనాథుని వద్దకు వచ్చి, ఏమిటి సిద్ధా! ఇంత ఘోరమైన, నికృ-ష్టమైన, దుష్టమైన పనిచేసి నాకుమారుణ్ణి ఎందుకు చంపినావు-అని బోరుమని ఏడ్చింది.

అప్పుడు, సిద్ధనాథుడు ఆమెతో—అమ్మా! నేను ఏమి దుష్టకార్యము చేయలేదు. నీ కుమారుణ్ణి జలరూప పరమాత్మకు అర్పణ చేసినాను. అక్కడ నీ కుమారుడు ఏ సుఖదుఃఖ భయాదులు లేకుండా నిశ్చింతగా ఉన్నాడు. నీవు నీ కుమారునిగూర్చి ఏమి చింతింపవలదు-అని అన్నాడు.

ఆ పిల్లవాని తల్లి ఈ విధంగా అంటుంది—అయ్యా! సిద్ధనాథా! నీయొక్క వేదాంతరూపమైన వాక్కులను మానుకొనుము. నీవు నాయొక్క పుత్రుణ్ణి నీటిలో ముంచి నిశ్చయముగా చంపినావు. ఇది సత్యం. నీటిలో మునిగిచచ్చిన నాపుత్రరత్నమును నాకు ఇప్పుడే అప్పగించవలసిందని పలుకు తూ, ఆ తల్లి ఏకధాటిగా ఏడ్వసాగింది.

అప్పుడు, ఆ తల్లిని ఉద్దేశించి–అమ్మా!నీ కుమారుడు సురక్షితంగా ఉన్నాడు. చనిపోయాడని ఏడవకూడదు. నీటియందు ఆనందంగా ఉన్నాడు. నీవు నీ కుమారుణ్ణి కేకవేసి పిలువుము. ఆయన నీటినుండి లేచి తొందరగా తిరిగివస్తాడు.

ఈ మాటలు విన్న ఆ తల్లి, **దేవదత్తా!** నీవు తొందరగా నా వద్దకు రా నాయనా! నా గుండెలు తరుచుకు పోతున్నాయి–అని పిలిచింది. వెంటనే ఆ పిల్లవాడు లోతైన నీటినుండి లేచి తొందరగా ఈదుకుంటూ తీరానికి వచ్చి, పరిగెత్తుకుంటూ తల్లిని చేరుకుంటాడు. అప్పుడు ఆమె, కుమారుణ్ణి ఈవిధంగా అడిగింది. నాయనా! నీవు ఇంతదనుక ఎక్కడున్నావురా?

పిల్లవాడు జవాబిస్తూ–అమ్మా! నేను కేవలము (నిర్ధర్మకమైన) బ్రహ్మానందములో మునిగి ఉంటిని. ఇప్పుడు మళ్ళీ యీ దుఃఖరూప మాయామయ జగజ్జాలము నన్ను ఆవరించింది.

తల్లి అంటుంది–నీవు నిజంగా చనిపోయినావని అనుకున్నాము. నీవు మృత్యుముఖము నుండి తప్పించుకొని బ్రతికి బయటపడి వచ్చినందుకు మేము కృతకృత్యులమైనాము. లేనిచో, నేను నా ప్రాణాలను కోల్పోయేదాన్ని-అని అంటూ, పుత్రవ్యామోహముతో కుమారుని తలనిమిరి, ఆనందాశ్రువులు రాల్చింది. ఆ దృశ్యమును చూసి అందరూ ఆనందించారు. అప్పుడు సిద్ధనాథుడు అక్కడున్న వారందరినీ ఉద్దేశించి–ఇలా అంటాడు.

ఓ సజ్జనులారా! ఈ కార్యముయొక్క లక్ష్యార్థమును వినండి. ఈ బాలునివలె అజ్ఞానయుక్తమైన జీవుడు, అజ్ఞానతత్కార్యమగు దేహాద్యుపాధిని త్యజించుటకు సమ్మతించడు. ఉపాధి మరియు ఉపాధి ధర్మములను వదిలి బ్రహ్మమునందు మునకలు వేయుటకు అనగా తన స్వస్వరూపమును తెలుసుకొనుటకు భయమొందును. శరీరమును, అంతఃకరణమును నేను, నాదియని, ఇంద్రియ-ములను నావియని, వాటి ధర్మములను నావియని–అర్థాధ్యాసమును మరియు జ్ఞానాధ్యాసమును పొందుచున్నాడు. అందువల్ల, అతని దుఃఖమునకు యేమి కొరత?దానిని వదులుకుంటే జీవుడు తత్క్షణమే స్వస్వరూపాన్ని తెలుసుకొని,నిత్య,నిరావృత, నిరతిశయానందరూప బ్రాహ్మీస్థితిని పొంద-గలుగుతాడు. ఇట్టి స్థితిని పొందినాక ఇక జీవుని ఆశ్రయించుకుని ఉన్న భయదుఃఖములు ఉంటా-యా? ఉండవు. ఒకవేళ బయదుఃఖాలకు ఉనికి ఉన్నదంటే, అజ్ఞానరూప ఉపాధి–తద్ధర్మములు-న్నాయని తెలుసుకోవాలి.

**శ్లో॥అహం మమేతి యో భావో దేహాక్షాదావనాత్మని ।**

**అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా బ్రహ్మనిష్ఠయా ॥** (అధ్యాత్మోపనిషత్. 1)

అనాత్మలగు దేహము, అక్షములు=ఇంద్రియములు మొదలగు వాటియందు అహం=ఆత్మత్వము (నేను), మమ=ఆత్మీయత్వము (నాది) అను విపరీతభావన యేదిగలదో, అదియే **"అధ్యాస"** అనబడును. ఇది అధిష్ఠాన బ్రహ్మనిశ్చయముచే విద్వత్పురుషునిచేత నిరసింపదగినది.

అందువలన, అవ్యాజకరుణామూర్తియగు సద్గురుదేవుడు వచ్చి దేహేంద్రియములందు అహం మమాభిమానముగల అహంకారమును(జీవుడిని) బలాత్కారముగా లాక్కెళ్ళి దేహాభిమానమును వ-దిలించి, బ్రహ్మానందసాగరములో ముంచుతాడు. అనగా, **"నేతి నేతి"** వాక్యములు బోధించి, స్థూల దేహము నీవు కాదు, నీది కాదు. సూక్ష్మదేహము నీవు కాదు, నీది కాదు. కారణదేహము నీవు కాదు, నీది కాదు. వాటికంటె నీవు (ఘటమునకు భిన్నముగా ఘటద్రష్ట వలె)భిన్నముగా ఉన్నావు. వీటికి సంబంధించిన జాగ్రదాది అవస్థలకు నీవు సాక్షివై యున్నావు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ మరియు ఆనందమయ కోశములకు నీవు అతీతుడవు. అని యిట్లు అనాత్మ-లైన దేహాదులను బాధించి(మిథ్యాత్వనిశ్చయము చేయించి), ఆ బాధకు అవధిరూపముగానున్న అధి-ష్ఠాన బ్రహ్మము నీవై యున్నావని తెలియజేసి, ఆ బ్రహ్మానంద పదవిని ప్రసాదిస్తాడు.

**శ్లో॥నద్యాం కీటా ఇవావర్తాదావర్తాన్తరమాశు తే ।**
**వ్రజన్తో జన్మనో జన్మ లభన్తే నైవ నిర్వృతిమ్ ॥**
**శ్లో॥సత్కర్మ పరిపాకాత్తే కరుణానిధినోద్ధృతః ।**
**ప్రాప్యతీర తరుచ్ఛాయాం విశ్రామ్యన్తి యథా సుఖమ్ ॥** (వే.పం.1-30, 31)
**శ్లో॥యథా ముంజాదిషీకైవమాత్మా యుక్త్యాసముధృతః ।**
**శరీరత్రితయాద్ధీరైః పరంబ్రహ్మైవ జాయతే ॥** (వే.పంచదశి.1-42)
**శ్లో॥దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక! ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నిష్కృత్య సుఖీభవ ॥** (అష్టావక్రగీత.1-14)
**శ్లో॥దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని ।**
**యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః ॥** (వాక్యసుధా.30; సరస్వతీ రహ.31)

ఇటువంటి అద్భుతమైన, గుహ్యమైన అమృతవాక్కులను ప్రజలందరూ విని ఆశ్చర్యచకితులై, ఈ సిద్ధనాథుడు సాక్షాత్ మహాదేవుడేయని నిశ్చయించుకున్నారు. ఆయన నిజంగా సదాశివుడే కాకుంటే ఇటువంటి అద్భుత జ్ఞానపూరితమైన బోధ ఎట్లు ప్రకటము కాగలదు?ఈ ప్రకారముగా అనుకుంటూ సకలజనులు సిద్ధనాథుని పాదకమలములను ఆశ్రయించడానికి వస్తుంటే, సిద్ధనాథుడు నవ్వుకుంటూ అక్కడనుండి ఇంటివైపుకు పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

ఒకానొక రోజున సిద్ధనాథుడు తోటి బాలురతో కలిసి అనేక ఫలములతో యుక్తమైన ఒక తోటలోనికి ప్రవేశించి, ఒక జంబూవృక్షము (నేరేడుచెట్టు) వద్దకు చేరినాడు. ఉత్తమమైన ఫలములను స్వీకరించడానికి బాలురందరూ నలువైపులాపరుగెత్తి ఫలవృక్షములను ఆశ్రయించినారు. సిద్ధ-నాథుడు మాత్రము స్వస్థుడై ఎటూ వెళ్ళకుండా ఒక వృక్షము కింద కూర్చుని ఆ బాలురను చూసి ఈ విధంగా విచారము చేస్తున్నాడు.

మాయకు, తత్కార్యమునకు మోహితులై జీవులు అత్యంత విషయాసక్తులై (భోగలంపటులై) సర్వ కారణమగు ఈశ్వరుడనైన నన్ను మరచిపోయారు.

**శ్లో॥అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।** (గీత.౯-11)

ఇప్పుడు ఈ అజ్ఞజీవులకు ఈశ్వరునియొక్క సత్తా (అస్తిత్వమును) తెలియజేసి, నిశ్చలమైన వివేకమును జాగృతిజేసి,వీరికి ఒక గుణపాఠము నేర్పాలని సంకల్పించి,ఒక చమత్కారమును ప్రదర్శిస్తాడు. తనయొక్క అమృతహస్తముచేత ఒక ఫలమును తీసుకొని భూమిపైవేసి,సంకల్పమాత్రముచే అపారమైన గొప్ప ఫలరాశిని ప్రకటము చేసినాడు. ఆ రాశిని కనిపెట్టి అక్కడక్కడ ఫలములను స్వీకరిస్తున్న బాలురందరూ ఈ ఫలరాశి వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చి రాశిని చుట్టుముట్టినారు.

అప్పుడు బాలురు సిద్ధనాథుని అడుగుతారు. ఈ అద్భుతమైన పండ్లరాశి ఎట్లు ప్రకటమైనది? ఈశ్వరుని శక్తి తెలియకున్నదే! అని ఆ ఫలములను తీసికొని కడుపునిండా భుజించనారంభించారు. పక్వమైన పుష్కలపండ్లను మనసారా భుజించి మిగిలిన పండ్లను మూటకట్టుకొని ఇంటికి వెళ్ళడానికి సిద్ధమైనారు.

అప్పుడు, సిద్ధనాథుడు వారిని ఉద్దేశించి ఇట్లంటాడు. మీరు తృప్తిగా భుజించినారా?మీరు కడుపునిండా తృప్తిగా భుజించి, మిగిలినవి మూటకట్టుకొని తయారైనారు. కాని, కొంచెమైనను విచారము చేసినారా? ఎవరియొక్క ఉపకారముచే ఈ ఫలరాశి అనాయాసంగా లభించినది?

పిల్లలు సిద్ధనాథునితో అంటున్నారు. స్వాదిష్టమైన అమృతముతో సమానమైన ఫలములు కారణస్వరూపుడైన జగదీశ్వరుడు మాకోసము కృపచే ప్రసాదించాడు. కాని, మేము మాయొక్క మూర్ఖత్వముచే పరమేశ్వరుని మహిమను తెలియలేక పోయాము. ఈశ్వరుని గుర్తించకుండా, ఆయన ప్రసాదరూప ఈ ఫలములను స్వీకరించి మేము అపరాధము చేసినాము. కావున, ఈ ఫలములన్నింటిని ఇక్కడే పడవేసి ఇండ్లకు పోయెదము.

అప్పుడు, సిద్ధనాథుడు వారితో ఏమన్నాడో వినండి. ఇప్పుడు మీరు నా మాటలు విని ఈ ఫలములను పారవేయాలని నిశ్చయించుకుంటిరి. కాని, కేవలము ఫలములను పారవేసినంత మాత్రమున వాటిని దర్శించిన నేత్రముల ద్వారా చిత్తాకర్షణరూప విషయాసక్తి నివృత్తి కాదు. దేహాభిమానము దృఢముగా ఉన్నపుడు, కేవల నేత్రములు మూసుకున్నంతమాత్రాన చిత్తములోని విషయ వాసనలు[3] నివర్తించవు. చిత్తములోని వైషయికవాసనలు నష్టముకానిచో, ఈశ్వర

---

3 **శ్లో॥దృఢభావనయా త్యక్త పూర్వాపర విచారణాత్ । పదార్థస్య యదాదానం వాసనా సా ప్రకీర్తితా ॥** (ముక్తికోపనిషత్ ౨-57; యోగవాసిష్ఠము ఉప.ప్ర.౯1-౨౯) గత అనేక జన్మలలోని దృఢభావనచే దేహాదిక జడపదార్థములపట్ల “నేను,నాది”అను యే దృఢసంస్కారము అంతఃకరణమునందు స్థిరపడియున్నదో, ఆసంస్కారవశముచే పూర్వా-

ప్రాప్తికోసము చేయు సకలప్రయత్నములు(సాధనలు) విఫలమగును. అందువల్ల, అనన్య భక్తిరూప ధ్యానముచేగాని, విచారజనిత జ్ఞానముచేగాని అభిమానమును త్యజించవలసి ఉంటుంది. అన్య సాధనలగు తప,ఉపవాసములద్వారా దేహాభిమానము నివర్తించదు.ఈశ్వరధ్యానమువలన ఈశ్వ-రకృప కలుగుతుంది. ఈశ్వరానుగ్రహముచే పరమాత్మ మరియు జీవాత్మలయొక్క ఏకత్వమును ఉపదేశించు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు ప్రాప్తించును. అట్టి గురువుయొక్క కృపచే ఆత్మ జ్ఞానము ప్రాప్తమై హృదయమందు నిత్యము, నిరావృతము, నిర్విషయకమగు బ్రహ్మానందము ప్రక-టమగును. సకలచిత్తవృత్తులు ఉపశమించును. అట్లే, విషయాలయొక్క సంకల్పము, వాటిని అను-భవించాలనే ఆసక్తి మొదలగు దోషములు సమూలముగా నష్టమగును.

**శ్లో ॥ ఉప సమీపే యో వాసో జీవాత్మపరమాత్మనోః ।**
**ఉపవాసః స విజ్ఞేయో న తు కాయస్య శోషణమ్ ॥**
**శ్లో ॥ కాయశోషణమాత్రేణ కా తత్ర హ్యవివేకినామ్ ।**
**వల్మీకతాడనాదేవ మృతః కిం ను మహోరగః ॥** (వరాహోపనిషత్ ౨-౩౯ & 40)

ఉప=సమీపే=జీవాత్మపరమాత్మల (సమీపములో) అనగా, వాస్తవ స్వరూపమునందు (సచ్చి-దానంద పరబ్రహ్మమునందు) మనస్సును నిలుపుటయే ఉపవాసమనబడును. కాని, కేవల కఠిన తపస్సులచే శరీరమును శోషింపజేయుట ఉపవాసమనబడదు. వల్మీకమును(పుట్టను) కొట్టినంత మాత్రమున మహాసర్పము మరణిస్తుందా? చావదు గదా!

**శ్లో॥విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।**
**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥** (గీత.౨-౫౯)

కావున, ఓ మిత్రులారా! ఇప్పుడు మీరు నిస్సందేహముగా మీకు కావలసినన్ని పండ్లను తీసికొని ఇంటికి పదండి-అని సిద్ధనాథుడు పలుకగానే సంతోషముతో ఆ పండ్లను తీసుకొని ఇంటికి పయనమైనారు.

బాలురందరూ ఆనందంతో బయలుదేరి పోవుచుండగా సిద్ధనాథుడు వెనక మెల్లమెల్లగా నడుస్తున్నాడు. వారు వెళ్లేదారిలో ఎదురుగా ఒక సర్పము కనిపించింది. దాన్ని చూసి వారందరూ భయపడి నలువైపులా పలాయనమైనారు. కాని, సిద్ధనాథుడు మాత్రము ఆ సర్పము దగ్గర నిలబడి పిల్లలను రమ్మని పిలిచి, మీరు ఏమాత్రము భయపడకండి. ఇది మృతసర్పమున్నది. దీనివలన ఏమీ అపాయము లేదు. అందుకని మీరందరూ తొందరగా దగ్గరకు రండి–అని పిలిచాడు. అయినాగాని

---

పర గుణదోషములను విచారణజేయకయే మళ్ళీ పదార్థములను ఆదానము (గ్రహణము)చేయుట——**"వాసన"** యనబడును.

ఆ బాలురు భయముచే రావడం లేదు. అప్పడు సిద్ధనాథుడు ఆ మృతసర్పమును చేతితో పట్టుకొని వారికి చూపెట్టగా, బాలురందరూ మెల్లమెల్లగా దగ్గరకు వచ్చినారు. అప్పుడు వారికి ఈవిధంగా ఉపదేశిస్తాడు–దానిని చక్కగా సావధానచిత్తులై వినగలరు.

నిర్మలచిత్తమునందు(శుద్ధాంతఃకరణమునందు) అనుభవగోచరమగు, సమస్తదృశ్యప్రపంచ-మునకు అధిష్ఠానమగు ప్రత్యగభిన్న పరబ్రహ్మతత్త్వమును విచారించి తెలియజాలక, జీవుడు ఈ మాయా కార్యమైన కేవల నామరూప దృశ్యప్రపంచమునుచూసి భయపడి దుఃఖిస్తున్నాడు. ఎప్పుడై-తే శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడునగు శ్రీగురుదేవుని ముఖకమలమునుండి **"తత్త్వమసి"**(ఛాం.6-8-7) మహావాక్యోపదేశమును పొంది, ఏకాంతమున ఏకాగ్రచిత్తముతో మననాదులొనర్చునో, అప్పుడు అంతర్దృష్టి తెరువబడును. అనగా, "**అహంబ్రహ్మాస్మి**"(బృ.1-4-10) అను చరమవృత్త్యాత్మక అప్రతిబద్ధ దృఢాపరోక్షబ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము కలుగును. దానిచే ఇంతదనుక యే దృశ్యజగత్తు భాసించుచుం-డెనో, అది సమసిపోవును (త్రైకాలికాత్యంతాభావ నిశ్చయము కలుగును). ఆపైన సర్వత్ర తన స్వరూపసత్తయే గోచరించును.

**శ్లో॥దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్ ।**
**సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణ నిర్వృతిః ॥**
**శ్లో॥విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః ।**
**సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్ ॥**

(యో. వా.1-3-6 & 4-57-28) మరియు (వే.పం.4-64 & 65)

**శ్లో॥యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర పరం పదమ్ ।**
**తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్ ॥** (పైంగలో.4-22)

"**సర్వం ఖల్విదం బ్రహ్మ**"(ఛాం.3-14-1);"**బ్రహ్మైవేదగ్ం సర్వంసచ్చిదానందరూపమ్**"(నృసిం-హో. 7-3); "**ఆత్మైవేదం సర్వమ్**"(ఛాం.7-25-2);"**అభయం వై జనక ప్రాప్తోఽసి**"(బృ.4-2-4);"**న చ పునరావర్తతే**"(ఛాం.8-15-1) ఇత్యాది శ్రుతులు చెప్పినట్లుగా ద్వైతరూప దృశ్యభావము నశించి, జ్ఞాని పురుషుడు సర్వత్ర బ్రహ్మభిన్న తన స్వరూపమునే దర్శించును. అప్పుడు జననమరణరూప సంసార భయము అణుమాత్రముగూడా ఉండనేరదు.

ఇటువంటి అత్యద్భుతోపదేశమును వినుటతోడనే పిల్లలందరికీ ఆంతర్యమున విచారము పొడమినది(ఉదయించినది).

ఇక పిల్లలందరు కలిసి సిద్దనాథున్ని తన ఇంటివద్ద విడచి, ఆనందంగా తమతమ ఇండ్లకు చేరుకున్నారు.

ఇటువంటి సిద్ధనాథునియొక్క మహిమ అగాధమైనది. సద్గురుదేవునియొక్క మహిమను, గుణగణమును వర్ణించుటకు వేదముగూడ కుంఠితమైనది(మౌనము వహించినది). ఇటువంటి అగాధ చరిత్రను పఠించినను, భక్తియుక్తులై శ్రవణముచేసినను భవాబ్ధిసీమను చేరుకోగలరు. (భవసాగరమునుండి తరించగలరు).

**శ్లో॥అతీతః పన్థానం తవ చ మహిమా వాఙ్మనసయో-**

**రతద్వ్యావృత్త్యా యం చకితమభిధత్తే శ్రుతిరపి ।**

**స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః**

**పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః ॥** (శివమహిమ్నస్తోత్రము.౨)

పుష్పదంతాచార్యులంటున్నారు—హే హరా! నీయొక్క మహిమ(ఐశ్వర్యాదులు) మనోవా-క్కులకు అతీతము(అగోచరము). నీయొక్క నిర్గుణస్వరూపమునుగాని, అనంత ఐశ్వర్యాది గుణ-యుక్తమైన సగుణస్వరూపమునుగాని వర్ణించుటకు శ్రుతిమాతగూడ భయముతో మరియు విస్మయముతో **"నేతి నేతి"**(బృ.3-౯-౨౬)వాక్యములచే బ్రహ్మాభిన్న నిఖిల ప్రపంచమును నిషేధిస్తూ '**అతద్వ్యావృత్తి**' లక్షణముచే బోధించుచున్నది. లేదా శక్తివృత్తిచేత వర్ణించుటకు శక్యముగాక లక్షణావృత్తిచే బోధించుచున్నది. సగుణ-నిర్గుణ సదాశివుడు ఎవరియొక్క స్తుతికి విషయమగును? ఎందుకంటే, సగుణపరమాత్మ అనంత గుణములు గలవాడు. ఇక నిర్గుణస్వరూపమో నిర్ధర్మకము (వాచ్యతావచ్ఛేదక రహితము)గాన అవాఙ్మనస గోచరము. "**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ**"(తై.౨-4) పరమాత్మను విషయము చేయుటకు మనస్సుతో సహ వెళ్ళిన వాక్కు, పరమాత్మను విషయము చేయలేక వెనుదిరిగి వచ్చెను. ఇట్లున్ననూ, భక్తానుగ్రహార్థము ధరింపబడిన ఆధునిక సగుణసాకార స్వరూపమును స్తుతించుటకు పరవశమైన (తన్మయమైన) ఎవరి మనస్సు, వాణి ప్రవృత్తము కాదు? అవశ్యముగా ప్రవేశించును.

మంగళకరమైన సిద్ధనాథుని కథామృతముయొక్క శ్రవణముచే సకలపాపములు భస్మీ-భూతములగును. సిద్ధనాథుని దివ్యచరణారవిందములకు ప్రణమిల్లుచూ శ్రీశివదాసస్వామి మధుర-మైన ఈ రెండవ అధ్యాయమును ముగించుచున్నాడు.

ఓం శ్రీ సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు

॥ ఓం తత్సత్ ఓం ॥



Spurious serpent picture



రజ్జుసర్పసంగతి పుట. 215

భ్రాన్త్యా ప్రతీతః సంసారో వివేకాన్నతు కర్మభిః సహి రజ్జారగారోపో ఘంటాఘోషాన్నివర్తతే

అహం మమేతి యోభావో దేహాక్షాదావనాత్మని అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషాబ్రహ్మనిష్ఠయా



రజ్జుసర్పసంగతి. పుట. 216





ॐ **శ్రీ గణేశాయ నమః** ॐ **శ్రీ గురుభ్యోనమః** ॐ **శ్రీ సరస్వత్యై నమః**




**పద్యానువాదము:–**సిద్ధనాథా! నీవు దీనులను త్రివిధతాపములనుండి రక్షించే వాడవు. నిన్ను ఆశ్రయించిన భక్తులయొక్క జన్మమరణరూప సంసారభయమును నిరపేక్షికమైన, నిరవధికమైన ప్రేమతో హరింపజేస్తావు. నీవు సాక్షాత్ పరమేశ్వరుడవై యుండియు, దుస్సహమగు కష్టములను ఎదుర్కొంటూ సద్గురువు శోధనలో బయలుదేరి,"**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్**"(ముం.1-2-12) అధికారిపురుషుడు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము కొఱకు చేతిలో సమిధలు తీసుకుని శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడును అగు సద్గురువునే శరణు వెళ్ళాలి–అను గురుశిష్య సంప్రదాయమును మరియు సద్గురుశోధనామార్గమును (బ్రహ్మవిద్యాన్వేషణ మార్గమును)కేవలము నిమిత్తమాత్రుడవై లోకమునకు చూపెట్టినావు.

ఓ సద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము. నిన్ను స్మరించినంత మాత్రముననే సకల వ్యథలను(దుఃఖములను) నివృత్తిజేసి, చిత్తానందమును ప్రసాదించి, భవదుఃఖమునుండి తరింపజే-యుదువు. నీవు చేరదీసి నీ చరణసన్నిధిలో ఆశ్రయమిచ్చినచో, సంసారభయము ఎవరికుండును? నిష్కామచిత్తులై ఎవరైతే నిన్ను అనన్య ప్రేమతో భజిస్తారో,వారికి నీవు కల్పవృక్షమువై వారిని తరింపజేస్తావు. మూఢజనులు అనేక ఇబ్బందులను ఎదుర్కొని తీర్థయాత్రలుజేసి కాలమును వ్యర్థ-పుచ్చుదురు.కాని,ఎవరు ప్రశాంతముగా ఇంటియందే ఉన్నచోటనే కూర్చుండి ఏకాగ్రచిత్తముచే నిన్ను స్మరించుదురో, నీవు వారి హృదయమందే ప్రకటమై యథార్థమైన మోక్షపదవిని ప్రసాదించెదవు.

**శ్లో॥ఉత్తమా తత్త్వచింతైవ మధ్యమం శాస్త్రచింతనమ్ ।**
**అధమా మంత్రచింతా చ తీర్థభ్రాన్త్యధమాధమమ్ ॥** (మైత్రే.2-21)
**శ్లో॥ ఇదం తీర్థమిదం తీర్థం భ్రామ్యన్తి తామసా జనాః ।**
**ఆత్మతీర్థం న జానన్తి కథం మోక్షః శ్రుణు ప్రియే ॥** (గురుగీత)

నిజపదవిని పొందిన పిదప సకలచింతలు (చిత్తవృత్తులు) నివృత్తమై, బుద్ధియందు బ్రహ్మా-నందము ఆవిర్భవించును."**దుఃఖాలయమశాశ్వతమ్**"(గీత.8-15).దుఃఖయుక్తమైన ప్రపంచము సమూ-

లంగా ఉపశమించి, జీవన్ముక్తి లభించును. దయాసాగరుడవైన ఓ సద్గురునాథా! నీయొక్క దివ్య పాదకమలములను ఆశ్రయించిన జీవునికి సంసారభయముండదు. నిత్యమైన పదవిని, నిర్భయ స్థితిని ప్రసాదించి నన్ను ధన్యునిజేయుము.

**——:కథాప్రసంగము:——**

కులగురువైన శ్రీవీరభద్రస్వామి, సిద్ధనాథుని ఇంటిలో ప్రతిరోజు అమృతతుల్యమైన వేదాంతమును బోధించుచున్నపుడు, సిద్ధనాథుడు తల్లిఒడిలో కూర్చుండి ఏకాగ్రచిత్తుడై స్వామియొక్క దివ్యమైన బోధను శ్రవణము చేసేవాడు. ఒకానొకరోజున శ్రీవీరభద్రస్వామి దృఢవైరాగ్యము నిశ్చయమగుట కొఱకు "లయచింతన" ప్రకారమును చెప్పుట ప్రారంభించినాడు. మేరుపర్వతము మొదలుకొని సంపూర్ణ భూమండలము–స్వర్గాదిలోకాలు, నామరూపాత్మకమైన సకలజగత్తు, సృష్టిక్రమకు విపరీత క్రమలో పంచభూతాలు మహాప్రళయ కాలమందు నిశ్శేషముగా లయించును.

**విపర్యయేణ తు క్రమోఽత ఉపపత్తేః** (బ్ర.సూ.౨-3-14)

**శ్లో॥జగత్ప్రతిష్ఠా దేవర్షే! పృథివ్యప్సు ప్రలీయతే ।**
**తేజస్యాపః ప్రలీయన్తే తేజో వాయౌ ప్రలీయతే ॥**
**వాయుశ్చ లీయతే వ్యోమ్ని తచ్చావ్యక్తే ప్రలీయతే ।**
**అవ్యక్తం పురుషే బ్రహ్మన్! నిష్కలే సంప్రలీయతే ॥**

(శాన్తిపర్వము 339-29 నుండి 31; విష్ణుపురాణము 6-4-11 నుండి 35)

ఇటువంటి నష్టప్రాయమైన పంచమహాభూతములే ప్రళయమొందుచుండగా, ఇక వాటి కార్యమైన ఈ నశ్వరదేహమే నేనని భావించి, దేహమును శాశ్వతమనుకొని, ఇచ్చట నేను నిజముగా విశేషసుఖమును అనుభవించగలనని తలంచు యీ భ్రాన్తమనుష్యుని (జీవుని)యొక్క అస్తిత్వము గూర్చి ఏమని చెప్పేది? (కైముతిక న్యాయము)

**శ్లో॥అహన్యహని భూతాని గచ్ఛన్తీహ యమాలయమ్ ।**
**శేషాః స్థావరమిచ్ఛన్తి కిమాశ్చర్యమతః పరమ్ ॥** (మ.భా.వన.313-116)

**శ్లో॥అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః ।**
**నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః ॥** (చాణక్యనీతి)

ఈప్రకారము శ్రీవీరభద్రస్వామి బోధిస్తుండగా, సిద్ధనాథుడు వారి కులగురువును–"**ఆకాశమెట్లు ప్రలయమొందును?**" అని ప్రశ్నించినాడు. అప్పుడు గురుదేవుడు కోపగించి,ఈప్రశ్నకు సమాధానము నేను చెప్పను. నీవు ఒక యోగ్యమైన అనుభవజ్ఞుడగు అన్యగురువును ఆశ్రయించి, ఈ ప్రశ్నను ఆయనను అడిగి సమాధానమును పొందుము–అనెను.

కులగురువుయొక్క వచనములు విని, సిద్ధనాథుడు బ్రహ్మవేత్త అయిన సద్గురువును ప్రాప్తము చేసుకుని సకలసంశయములు నివృత్తిచేసుకొనవలెనని, సంశయనివృత్తి అయ్యేవరకు తాను విశ్ర మించనని దృఢనిశ్చయము చేసుకుంటాడు. మరునాడు వేకువనే లేచి ఎవరికీ చెప్పకుండా సద్గురు శోధనకై సిద్ధనాథుడు బయలుదేరి వెళుతుండగా, సోముడు, భీముడు అను ఇద్దరు మిత్రులు కలిసి, సిద్ధనాథుని చూసి, నీవు ఎక్కడికి వెళుతున్నావు సిద్ధా?అని అడిగారు.

సిద్ధనాథుడు వారితో అంటాడు—ఈ సకల చరాచరప్రపంచము పంచమహాభూతాలతో సహా నామరూపాలు లేకుండా ఏదో ఒకనాడు సమూలంగా నాశనమొందును. అందువల్ల ఇక్కడ ఉండడము దేనికి? నాశయుక్తమైన ప్రపంచమును చూస్తూ వృథాగా జీవితాన్ని ఎందుకు వ్యర్థము చేయడము? దేహము స్వస్థతగా ఉన్నప్పుడే తనయొక్క యథార్థ స్వరూపప్రాప్తిగూర్చి ప్రయత్నము చేయడము సర్వజీవులయొక్క కర్తవ్యముంది. అటువంటి నిజపదవిని పొందాలంటే తప్పకుండా సద్గురువును శరణుబొంది, వారి సాన్నిధ్యమునందుండి, సద్గురు బోధద్వారా సత్యవస్తువును దర్శించుట పరమకర్తవ్యము. లేనిచో సకలప్రయత్నములు వృథాకాగలవు. కాలము, దేహము వ్యర్థముగా నష్టమగును. అందుకని త్వరగా సద్గురు అన్వేషణలో వెళ్లుచున్నాను.

**శ్లో॥గురుభైషజ్యసిద్ధ్యర్థమపి గచ్ఛేద్రసాతలమ్ ।**

**యదాదిశేద్గురుః కిఞ్చిత్తత్కుర్యాదవిచారతః ॥** (శివోపనిషత్.౭౨)

అప్పుడు, సిద్ధనాథుని పలుకులు విని సోము భీములు ఈవిధంగా అంటారు. సిద్ధనాథా! సుకుమారమైన బాల్యావస్థయందు సద్గురుప్రాప్తిగురించి శోధనచేయరాదు. వృద్ధావస్థయందు ప్రయత్నముచేస్తే బాగుంటుంది.

సిద్దనాథుడు:—వృద్ధావస్థయందు సాధన చేయడానికి ఈశరీరము ఏమాత్రము సహకరించదు. "**కామాతురాణాం న భయం న లజ్జా**" జీవుడు యవ్వన కాలమందు కామక్రోధాదులచేత పీడింపబడి వివేకహీనుడై అంధుడిగా ప్రవర్తిస్తాడు. స్వరూపబోధను పూర్తిగా విస్మరించి అగాధమైన భవదుఃఖమును అనుభవిస్తాడు .

**బాలస్తావత్క్రీడాసక్త తరుణస్తావత్తరుణీసక్తః ।**

**వృద్ధస్తావచ్చింతాసక్త పరమే బ్రహ్మణి కోఽపి న రక్తః** ॥ భజ ॥

యవ్వనకాలమందు అనుభవించినటువంటి విషయ సంస్కారములు అంతకరణమునందుండి వృద్ధావస్తయందు స్మృతిరూపకముగా మిగిలి రాత్రింబవళ్లు జీవనాన్ని చింతాయుక్తంగా చేసి పీడిస్తుంటాయి. సద్విచారము చేయడానికి ఏమాత్రముకూడా అవకాశమునివ్వవు. మరియు మరణ భయముచేత భయగ్రస్తుడై ఉంటాడు. ఇటువంటి పరిస్థితిలో వేదాంతశ్రవణము జరిగేది అసంభవము. ఒకవేళ వేదాంత శ్రవణము చేసినాగాని అంతఃకరణము స్థిరముగ నిలువదు. విచారగ్రస్తమైన

జీవితాన్ని గడుపుతాడు. బాల్యావస్థయందు విషయసంబంధరహితమైన శుద్ధమైన అంతఃకరణ-ముంటుంది. కాబట్టి శ్రోత్రియుడును, బ్రహ్మనిష్టుడును అగు సద్గురువును శోధించి పొంది, ఆయన ద్వారా యథార్థమైన ఉపదేశాన్ని శ్రవణముచేసి జ్ఞానమును సంపాదించవలెను.

ఈవిధమైన సిద్ధబాలుని అమృతవాక్కులను విని సోము భీములుకూడా గురువుయొక్క ప్రాప్తి చేసుకోవాలని నిశ్చయించుకొని, శ్రీగురుసాన్నిధ్యమునకు వెళ్లి ఆయనకు శరణాగతులమై ఆయన యొక్క ఉపదేశముద్వారా యథార్థమైన ఆత్మజ్ఞానమును పొంది, పిమ్మట మనమన ఇళ్లకువచ్చి మన పనులను నెరవేర్చుకుందాము. కావున, మేముకూడా నీతో వస్తామని సిద్ధనాథున్ని వేడుకుంటారు.

సిద్ధనాథుడు వారి వచనములను స్వీకరించగా, ముగ్గురు కలిసి క్రమంగా నడుస్తూ నడుస్తూ ఒక గ్రామమును చేరుకున్నారు. చాలాదూరము నడచి నడచి అలసిపోయినందున సోము భీములు దారుణమైన ఆకలి దప్పికలచే ఆయాసపడినారు.

అప్పడు సోముభీములు సిద్ధనాథునితో–సిద్ధనాథా!మాకు చాలా ఆకలేస్తుంది.ఇప్పడు ఇక్కడ ఆహారమునిచ్చి మా ఆకలిబాధను ఎవరు తీర్చగలరు? అంటారు.

సిద్దనాథుడు:–మీరు ఆకలి గూర్చి చింతచేయుచుంటిరా? హృదయమందు పరమాత్మయొక్క ధ్యానము అఖండంగా చేసినట్లయితే సుఖామృతపానము చేయవచ్చును. దానివలన జీవుడు సమాధానము పొందగలడు. వాస్తవమైన తృప్తి అన్నపానాదులద్వారా కలుగదు. ఈరహస్యమును తెలియనందువలన జీవులు తాపత్రయపడతారు. ఏ పరమాత్మ కృపచేత ఈ శరీరము ప్రాప్తమైందో, ఆ పరమాత్మ చేతనే రక్షించబడుతుంది.

ఈవాక్యములు విన్న సోము భీములు-నీయొక్క శాస్త్రాభిప్రాయము మాకుకూడా తెలుసు. కాని, ఆకలిదప్పికలతో పంచప్రాణములు సతమతమవుతున్నాయి. కావున, ఇప్పడు అన్నమునకు మించిన సాధనమేదికూడా ఆకలి బాధను నివృత్తి చేయలేదు. ఈవిషయమై "**పరాశరస్మృతి**" లో చెప్పబడినట్లు అన్నముయొక్క ఆధారముచే ప్రాణములు తృప్తిగా ఉంటాయి, ప్రాణశక్తివలన మనశ్శాంతి కలుగుతుంది, మనశ్శాంతి వలన ధ్యానము కుదురుతుంది.

ఇటువంటి విచారము తెలిసినాంక మీరు అన్నముగూర్చి ఎందుకు దుఃఖిస్తారు–అని అంటాడు సిద్ధనాథుడు. సకలజగత్తును సృష్టించి పోషించి రక్షించు ఆ సర్వేశ్వరుని విస్మరించినందువలననే ఈ దుఃఖము కలుగుతుంది. క్షుత్పిపాసలు జీవునియొక్క స్వాభావిక ధర్మములు కావు. మనసు ఎప్పడు పంచప్రాణములతో సంబంధపడి ఉండునో,అప్పడు ఆ మనసుకు ఆకలిబాధ కలుగుతుంది. అందు-కే ఆ మనసును పంచప్రాణములనుండి విముఖముచేసి, పరమాత్మయందు నిలిపినట్లయితే ధ్యాన-ము కుదురుతుంది. ధ్యానమువలన ప్రాణములు నిరోధింపబడును.ఈ కారణముచే జఠరాగ్నియం-

దు క్షుత్పిపాసలబాధ ఉపశమిస్తుంది. క్షుత్పిపాసల ఉపశమనముద్వారా జీవుడు శాంతించును. ఇక దీనికి అన్య ఉపాయములు లేవు.

సిద్ధనాథునియొక్క వచనామృతములను విని సోము బీముల చిత్తము శాంతించింది.అప్పుడు ఆ ముగ్గురు ప్రయాణము సాగిస్తూ "**బసవరావులీ**" అనే గ్రామమును చేరుకున్నారు. బహుదూరము నుండి నడిచి వచ్చినందున మార్గాయాసముచే శ్రమనొందిన భీము సోములిద్దరు శివాలయమునందు ఒక మూలకు పోయి, అక్కడ విశ్రమిస్తారు. ఆ సమయమున సిద్ధనాథుడేమి చేస్తాడంటే — శివునికి ఎదురుగా ఉన్నటువంటి "**బసవన్న**"ను (నందిని)చూసి, దాని వీపుపైకి ఎక్కి కూర్చుంటాడు. ఎంతో సుందరమైన బసవన్నపై ఏడు సంవత్సరముల వయస్సుగల సిద్ధనాథుడు ఎంతో మనోహరంగా శోభాయమనముగా ప్రకాశించుచుండెను.

అదే సమయానికి దేవాలయ అర్చకుడు వచ్చి, బసవన్నపై ఆరూఢుడైయున్న సిద్ధనాథున్నిచూసి, కోపోద్రిక్తుడై, ఒరేయ్ బాలకా! ఎవడివిరా నీవు? నందిపైనుండి క్రిందకు దిగుతావా లేదా? నీయొక్క భయభక్తులు ఎక్కడుంచావురా? దేవుడనే భయభక్తులు లేకుండా మర్యాదను విస్మరించి, హద్దుమీరి ప్రవర్తిస్తున్నావు? అని గద్దించి అరచినాడు.

అప్పుడు సిద్ధబాలుడు వెంటనే—నాయొక్క భయభక్తులు పరమాత్మునియందు ఉంచాను. నీవు మాత్రము భయభక్తులను రాతిపైన పెట్టినావు.

పూజారి విచారగ్రస్తుడై ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోతాడు. ఆశ్చర్యచకితుడైన పూజారిని చూసి సిద్ధనాథుడు నవ్వుతాడు. అప్పుడా పూజారి కోపమునకు వచ్చి, సరే అయితే నీకు వెంటనే తప్పకుండా ప్రాయశ్చిత్తము చేపిస్తా! ఉండు, అంటూ గ్రామములోకి వెళ్లి కొంత మందిని వెంట బెట్టుకుని వస్తాడు.

ఆ పూజారివెంట వచ్చిన భక్తులు నందిపై ఆరూఢుడైన సిద్ధనాథుని చూసి కోపముతో నీవు బసవన్న పైనుండి క్రిందకు మర్యాదగా దిగుతావా లేక కాళ్లుచేతులు కట్టి క్రిందకులాగి ఎముకలు విరగ గొట్టమంటావా? అంటూ దగ్గరకు వచ్చినారు.

సిద్ధనాథుడు ముసిముసి నవ్వులు నవ్వుతూ ఆనందిపైన అలాగే కూర్చుని ఉంటాడు. అప్పుడు వచ్చిన భక్తులలో ఒకరు సిద్ధనాథునిపైకి ముష్టి ప్రహారమును ప్రయోగించుటకు ఉద్యుక్తుడై తన చేయిని చాచగా వెంటనే పైకప్పున ఉన్న ఒక ఇనుపమొల ఆయన చేతికి గుచ్చుకొని ధారావాహికముగా రక్తము కారుచుండెను. ఈ విచిత్రమును చూసి, వచ్చిన వారందరూ వెనుకకు జరిగి దూరముగానుండి, ఒరేయ్! పిల్లవాడా! నీవు ఉన్మత్తునివలె(పిచ్చివానివలె) కన్పట్టుచున్నావు. నందిపై నుండి దిగుతావా లేదా? అని బెదిరిస్తారు.

వారిని వీక్షించి హాస్యవదనుడై సిద్ధనాథుడు ఈ ప్రకారంగా అడుగుతాడు. వాహనము గొప్పదా? వాహనముపైన కూర్చున్నవాడు గొప్పవాడా చెప్పండి? ఈ విగ్రహాన్ని అభక్తజనులు పూజించినందున దీనియందున్న దైవత్వము నివృత్తమై శిలామాత్రముగా మిగిలిపోయింది. అందు-కనే, నేను దీనిపైన కూర్చుని ప్రాణప్రతిష్ఠ చేస్తున్నాను.

జ్ఞానయుక్తహృదయమునుండి ప్రకటమైన అమృతవచనములను విని, అందరూ ఆశ్చర్య-చకితులై తమలో తాము ఇలా అనుకుంటారు. ఈయన వచనములలో గంభీరమైన జ్ఞానప్రతాపము ప్రకాశిస్తుంది. సామాన్యవచనములు కావు. చూడడానికి బాలుడే అయినా ఈయన ఒక గొప్ప మహాపురుషుడయ్యే ఉంటాడు.

ఈప్రకారముగా అనుకుని, భక్తులందరూ సిద్ధనాథుని పాదకమలములకు వందనములాచ-రించి, ఆయనయొక్క ఆశీర్వాదములు పొందుతారు. అప్పుడు సిద్ధనాథుడు వారి నుద్దేశించి ఇట్ల-నెను. మహాత్మునియొక్కపూజ అతిపవిత్రము, శ్రేష్ఠము. మూర్తిపూజ నికృష్ఠము. మహాత్మునియొక్క స్వరూపము పరమాత్మయొక్క సగుణ సాకారరూపమని శ్రుతి స్మృతులు ఉద్ఘోషిస్తున్నాయి.

**శ్లో॥గురురేవ హరిః సాక్షాన్నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ।** (బ్రహ్మవిద్యోపనిషత్.31)

**శ్లో ॥జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।** (గీత.7-18)

తల్లియొక్క ముఖముద్వారా సేవించబడిన ఆహారమువలన గర్భస్థ శిశువుకు ఎట్లు తృప్తి కలుగునో, అదేవిధంగా మహాత్ములను పూజించినట్లయితే పరమాత్ముడు తృప్తిజెంది సంతోషిస్తాడు. పరమాత్మనుగూడ అర్చించి, సేవించిన మహత్పుణ్యము లభించును.

**శ్లో॥ వృక్షస్య మూలసేకేన శాఖా పుష్యన్తి వై యథా ।**

**శివస్య పూజయా తద్వత్ పుష్యత్యస్య వపుర్జగత్ ॥**(వాయవీయసంహితా- ఉత్తరభాగము 3-29)

ఇటువంటి అద్భుతమైన సంభాషణమును విని భక్తులందరూ ఆశ్చర్యచకితులై, ఈయన మహాత్ముడున్నాడు. ఈయనను పూజించినచో మన జన్మ ధన్యమగునని భావించి, వారు తమతమ ఇళ్లకు వెళ్ళి, భక్తులందరూ పూజాసామాగ్రితో పాటు నైవేద్యమునుకూడా తయారు చేసుకొని సిద్ధ-నాథుని వద్దకు త్వరత్వరగా వస్తారు.పురుషులు, స్త్రీలు, పిల్లలు, ఆబాలగోపాలురందరూకూడ అమి-తానందహృదయముతో నందిపై ఆరూఢుడైన సిద్ధనాథున్ని దర్శించి జయజయకారములు చేస్తారు. పళ్ళెరము (పాత్ర) లందు తెచ్చిన పదార్థములు, పూజాసామాగ్రులు, నైవేద్యములు శ్రీ సిద్ధనాథుని ఎదుట ఉంచి, స్వామియొక్క దర్శనముచేసుకొని అందరూ కృతార్థులమైతిమని భావించి వెళ్లి-పోయారు. అప్పుడు భీము సోములు పరుగెత్తుకుంటూ సిద్ధనాథుని దగ్గరకు వస్తారు. అప్పుడు సిద్ధ-నాథుడు వారిని ఉద్దేశించి హెచ్చరిస్తూ —

చూడండి! ఈశ్వరుడు మనకోసం మనమున్నచోటికే అన్నప్రసాదములను పంపించినాడు. ఈశ్వరునిపై విశ్వాసముంచిన చాలును. సరే, ఈశ్వర నామోచ్చారణ చేస్తూ మీయొక్క క్షుద్బాధను తీర్చుకొని శాంతచిత్తులు కండి.

ఆకలిబాధతో ఉన్న భీమ సోములు వెంటనే భుజించుట ప్రారంభించినారు. సిద్ధనాథుడు కూడా వారితోపాటు ప్రసాదరూపంగా కొద్దిగా సేవించినాడు. భోంచేసిన పిమ్మట భీమ సోములను ఉద్దేశిస్తూ సిద్ధనాథుడు ఇట్లనెను. మనము ఈ జనసమూహమునందు ఉన్నట్లయితే మన లక్ష్యము-ను పొందలేము—అని, భీము సోములకు స్వామి సైగచేస్తూ జనులయొక్క దృష్టిని మరిపిస్తూ ము-గ్గురు కలిసి అక్కడనుండి తొందరగా వెళ్ళిపోయినారు.

క్రమంగా వారు నడుస్తూ వెళ్లుచుండగా సూర్యాస్తసమయమైనది. ఆకాశము చీకట్లతో క్రమ్మింది. ఆ చీకటినిచూసి సోముడు భయపడి సిద్ధా! మమ్ములను చిమ్మనచీకట్లో సంకటయు-క్తమైన, కంటకయుక్తమైన, ఘోరమైన కారడవినుండి తీసుకెళ్ళుచున్నావు. మేము ఈ ఘోరమైన అడవియందు చిక్కుకొని కష్టాలపాలయితిమి గదా! దారి తెలియుట లేదు. మమ్ములను ఎక్కడికి తీసుకు వెళుతున్నావు? అని ఏడుస్తూ అడుగుతాడు.

అప్పుడు భీముడు దుఃఖించుచున్న సోముని ఓదార్చుతూ—నీవు ఏమీ భయపడవద్దు. ఈశ్వరుడు ఎల్లప్పుడూ మనకు అండగా ఉన్నాడు. ఆయనే మనందరిని రక్షిస్తాడు. ఆయనపై సర్వ భారాన్నిమోపి మన గమ్యాన్ని చేరుకోవాలి. ఆ ఈశ్వరుడే మనకు సఖ్యుడు (స్నేహితుడు), సర్వా-ధారము, దిక్కు—అని ధైర్యాన్ని చెప్పి ఊరడిస్తాడు.

భీమునియొక్క ఊరడింపు వాక్యములను విని సోముడు భయమును మానుకొని స్వస్థచిత్తుడై నడువనారంభిస్తాడు. భయకంపితుడై నడుస్తుండగా కాలుయందు ముళ్ళు గుచ్చుకొని తీవ్రమైన బాధ కలుగుటచే సోముడు నడవలేని స్థితిలో ఏడుస్తూ అక్కడే కూలబడిపోయి, ఈప్రకా రంగా అంటాడు—సిద్ధనాథా! మేము నిన్ను నమ్మి నీవెంట వచ్చినందుకు చాలా పొరపాటైనది. అయినా ఇప్పుడు చేయునదేమియు లేదు. ఒకవేళ మేము ఈస్థలమునుండి బతికి బయటపడినచో, ఇక– ముందు మేము మళ్లీ నీతో కలిసి ఈవిధంగా రాము-రాలేము.

సిద్ధనాథుడు భీముడు ఇద్దరు కలిసి సోముని రెండు చేతులను వారి భుజాలపై వేసుకొని, అరణ్యమధ్యమునుండి నెమ్మదిగా నడుస్తూండగా, ఆ కటికచీకటిలో అరణ్యంలోనున్న క్రూరమృగము-లయొక్క గర్జన దగ్గరలోనే వినిపిస్తుంటే, ఆ గర్జనను విని భీముడు సిద్ధనాథునితో ఇట్లంటాడు —

సిద్ధనాథా! నాకుకూడా భయము కలుగుచున్నది. ఒకవేళ మనము ఇప్పుడు బ్రతికి ఏదో ఒక గ్రామానికి చేరుకున్నట్లయితే, మేము నీయొక్క గురుశోధన మార్గములో రాలేము—అనుచూ ఏడ-వసాగెను.

వారియొక్క నిస్పృహస్థితిని గమనించి సిద్ధనాథుడు, వారినిగూర్చి ఇట్లంటున్నాడు. గుర్వన్వే-షణమార్గము చాలా దారుణంగా ఉంటుంది. ఈ మార్గమునందు దేహాభిమానము పనికిరాదు. ఈ దేహదుఃఖము అత్యల్పము. కాని, జన్మదుఃఖము మహాభయంకరము. మహా అనర్థముకూడా. అటువంటి ఘోరమైన భవదుఃఖము సద్గురుసాన్నిధ్యమును బడసి, ఆయన కృపద్వారా స్వస్వ-రూపమును తెలుసుకున్నపుడే నివృత్తికాగలదు. దేహసంబంధమైన దుఃఖములపట్ల ఔదాసీన్యము కలిగినప్పుడే సద్గురువునకు దాసుడు కాగలడు. దాస్యత్వము లేకుండా సద్గురువుయొక్క అనుగ్రహ-ము, ఆశీర్వాదము లభించదు. సద్గురువుయొక్క కృపాకటాక్షముచేతనే ఉపదేశము లభించును. ఆ ఉపదేశముద్వారా స్వరూపమును తెలుసుకొని భవదుఃఖమును నివృత్తి చేసుకోగలుగుతాము.

**శ్లో॥శ్రుత్యాచార్య ప్రసాదేన దృఢబోధో యదా భవేత్ ।**

**నిరస్తాశేషసంసార నిదానః పురుషస్తదా ॥** (వాక్యవృత్తిః 50)

సద్గురువుయొక్క కృపాయుక్తమైన ఉపదేశము లభించడముద్వారా సకల సంసారదుఃఖము-లు పలాయనమవుతాయి. సద్గురుఉపదేశముద్వారా దేహబుద్ధి సమూలంగా నష్టమై, బ్రహ్మాభిన్న-మైన ఆత్మయొక్క దృఢాపరోక్షజ్ఞానం కలుగుతుంది.తద్వారా జన్మమరణములయొక్క ఆట కట్టుబ-డుతుంది. సద్గురుదేవుడు ఆంతర్యంలో(హృదయములో)ఉండి,బాహ్యంలో ముముక్షుజనులకు భయ-దుఃఖములను చూపెట్టును. ఇట్లు పరీక్షించిన పిమ్మట, ఆయన కృపావృష్టిని కురిపించి, మనయొక్క సంసారభయమును నివృత్తిజేయును. అల్పమైన దుఃఖాలకు భయపడితే శాశ్వతమైన సుఖమును, సుఖమార్గమును దుర్లక్ష్యము చేసినట్లవుతుంది. ఇటువంటి భీరువుల (బయగ్రస్తుల) పట్ల గురుదేవుడు తన కరుణను చూపడు. "**నాయమాత్మా బలహీనేన లభ్యో నచ ప్రమాదాత్**"(ముం.3-2-4).

సిద్ధనాథుడు చెప్పిన పై వచనాలను సోము భీములు విని, ఈవిధంగా అంటారు—నీవు చెప్పింది యోగ్యమే. కాని, దేనిద్వారా శ్రీగురుదేవునిప్రాప్తి సులభమగునో, అటువంటి సాధనసంపత్తి— అధికారము (వివేకము,వైరాగ్యము,షట్సంపత్తి,ముముక్షుత్వము)మాయందు లేదు. మీలాంటి మహా పురుషులకే గురుప్రాప్తి సంభవము. మేము అయోగ్యులము. దౌర్భాగ్యులము. ఇక మాకు గ్రామాన్ని చేరుకొనే మార్గము చూపుము. ఈ అడవిలో ముందుకు నడవాలంటే భయమేస్తుంది.

అప్పుడు, సిద్ధనాథుడు కొంతదూరాన ఎడమవైపు ఒక జ్యోతిని (వెలుగును) చూపించి, గ్రామానికి మార్గము చూపిస్తాడు. ఆ జ్యోతిని చూసి ఆనందచిత్తులై ముగ్గురు చకచకా నడవనా-రంభించి, కాసేపట్లో – గ్రామాన్ని ప్రవేశించి ఒక దేవాలయంలో విశ్రమిస్తారు. వారు నడిచినడిచి అలసి పోయినందున తొందరగా నిద్రలో మునిగిపోయారు. ఆ దేవాలయము చాలా జీర్ణమై (శిథి-లమై) ఉంది. ఆ సమయములో వర్షము కురవనారంభించెను. ఆ వర్షమునకు దేవాలయము

యొక్క ఒకవైపు గోడ బాగా తడిసి దిబాలున కూలింది. ఆ చప్పుడు విని బీము సోములు కలవర-పడి మేల్కాంచినారు.అప్పుడు వారంటారు–అయ్యో! సిద్ధనాథున్ని నమ్మి అనుసరించినందుకు మాకు ఎంతటి దుఃస్థితి పట్టినది. మేము మరణిస్తామో లేక జీవిస్తామో తెలియని అయోమయ పరిస్థితి దాపురించింది.

వారి మాటలు విని సిద్ధనాథుడంటాడు—మనమిప్పుడు సద్గురు శోధనమార్గములో ఉన్నా-ము. దేహముగూర్చి విచారించవలదు. ఇంతవరకూ మీరు అడవిలోనుండి గ్రామానికి చేరే మార్గ-మును చూపుమంటిరి. ఎట్లో ఒకట్లు గ్రామాన్ని చేరుకున్నాము. ఆశ్రయము కూడా లభించింది. అయినాగాని మీయొక్క దుఃఖము నివృత్తి కాలేదుగదా! లోకముయొక్క స్వభావమిది. విషయాలు ప్రాప్తించే వరకు విషయాల చింత. విషయాలు ప్రాప్తమైన పిదప అవి నష్టమవుతాయేమోనని చింత. ఇతరులు దొంగిలిస్తారో అని చింత. వాటిని కాపాడుకోవడంలో చింత. ఎప్పుడూ చింతాగ్రస్తులయ్యే ఉంటారు. కాని, చింతాముక్తులు మాత్రము కారు. దుఃఖము పోదు.

**శ్లో॥చితా చిన్తా ద్వయోర్మధ్యే చిన్తా ఏవ గరీయసీ ।**

**చితా దహతి నిర్జీవం చిన్తా ప్రాణయుతం వపుః ॥** (సుభాషితము)

ఒక విషయము ప్రాప్తించిన తర్వాతకూడా మళ్లీ రెండవ విషయముగూర్చి మనసు సంకల్ప-ముచేయును. అందుకని, విషయసంకల్పము లేక మనోనిగ్రహము (శమము) ను కలిగి ఉండాలి.

**శ్లో॥మనోరథానాం న సమాప్తిరస్తి వర్షాయుతేనాప్యథవాపి లక్షైః ।**

**పూర్ణేషు పూర్ణేషు మనోరథానాముత్పత్తయ స్సన్తి పునర్నవానామ్ ॥** (వి.పు.4-2-116)

ఇంతలో వర్షము ఆగింది. అప్పుడు బీము సోములకు ఆకలిబాధ కలిగింది. ఇద్దరూ కలిసి భిక్షకై ఊరిలోకి వెళదామని నిశ్చయించుకున్నారు. సిద్ధనాథునికి నిద్రపట్టింది. వారిద్దరు కలిసి గ్రామం-లోకి బిక్ష నిమిత్తము ప్రవేశించి, ఒకానొక గృహస్థుని ఇంటిముందు భిక్షకోసమై అర్థించగా, ఆ గృహస్థుడు బయటకు వచ్చి వారిరువురిని చూసి, వీరు నిశ్చయముగా దొంగలే అనుకొని—

సరిగ్గా మొన్నటి రోజున నాయొక్క ఉత్తమమైనటువంటి ఎనుమును (గేదెను) దొంగిలిం-చింది వీరే. మళ్లీ ఈరోజు కూడా దొంగతనము చేయుటకు కపటవేషములు ధరించి సాధువులవలె వచ్చినారు—అని వారిని పట్టుకోవడానికి ప్రయత్నించగా!

అప్పుడు భీము సోములు ఆ గృహస్థునితో అయ్యా! మేము దొంగలము కాము. మేము ఇ-ప్పుడే ఇలా ఈ గ్రామానికి వచ్చినాము. మాకు ఆకలివేసి భిక్షకోసము వచ్చినాము, కరుణించి భిక్షను అనుగ్రహించండి—అని వేడుకుంటారు.

అట్టి వాక్కులను విన్న ఆ గృహస్థుడు కోపగ్రస్తుడై, ఇంక మీకు భిక్ష కావాలా? నాలుగు దెబ్బలు వాయించి కపాలభిక్ష పెడతాను, ఆగండి —అని ముందుకు రాగా!

ఆ గృహస్థుని చూసి, భీము సోములు భయపడి అక్కడనుండి పలాయనమై, అలా పరిగెత్తు-చుండగా దారిలో గస్తీవాడు కలసి వారిద్దరిని పట్టుకుని, మీరు ఈరాత్రి ఇట్లు తిరుగుతుంటే ఎవరైనా మిమ్మల్ని దొంగలంటారు. కాబట్టి, ఊరిలో ఇలా తిరగకూడదు. ఊరిబయట జీర్ణమైన దేవాలయ-ములో విశ్రమించి, పొద్దుపొడవకముందే ఈ గ్రామాన్ని వదిలి వెళ్లండి—అని హెచ్చరిస్తాడు.

ఇద్దరూ ఎంతో దుఃఖితులయ్యి ఏడ్చుకుంటూ దేవాలయము వద్దకు వచ్చినారు. ఆనంద-మూర్తియగు సిద్ధనాథుడు నిద్రనుండి లేచి, దుఃఖిస్తున్న వారిరువురిని చూసి ఈ విధంగా అంటా-డు—మీరు ఈశ్వరునిపై భారం వేయకుండా భిక్షగూర్చి గ్రామములోనికి వెళ్ళినారు. దాని ఫలమును అనుభవించినారు. నేను శివధ్యానమందు నిమగ్నమై ఉండగా ఇక్కడి దేవాలయము పూజారి వచ్చి, భగవంతునికి నైవేద్యము చూపించి, అట్టి ప్రసాదమును నా ముందుంచి పోయినాడు. అటువంటి అన్నమును మీరు చాలా ఆకలిగా ఉన్నారని మీకోసము అలాగే ఉంచాను. మీకు భిక్ష దొరకదని నాకు తెలుసు. ఈ మాటలు వినగానే స్వామీ! రక్షించు! రక్షించు! మేము దయాసాగరుడైన ఈశ్వ-రునిపై నమ్మకముంచక, ఈశ్వరుని మరచి వ్యర్థముగా ఎంతో దుఃఖమును అనుభవించినాము, మమ్ములను క్షమించు స్వామీ!క్షమించు—అని ఆ ఇద్దరు సిద్ధనాథున్ని వేడుకుంటారు.

అప్పుడు ముగ్గురూ కలిసి ఆనందంగా భోజనముచేసి, రాత్రంతా అక్కడనే విశ్రమించినారు. వేకువజాముననే లేచి భీము సోములు సిద్ధనాథునితో ఇలా అంటారు.

ఓ సిద్ధనాథా! మేము పాపులము. మాయందు మనోనిగ్రహరూప శమము లేదు. తితీక్ష లేదు. అందుకే మాకు గురుప్రాప్తి అవకాశము లేదు. మేము అభాగ్యులము. గురుశోధనమార్గము మాకు కష్టముగానున్నది. మా తల్లిదండ్రులు మమ్మును జ్ఞాపకము చేసికొని ఏడుస్తుంటారు కాబోలు. వారు మాకు అన్నపానాదులు సమయానికి ఇచ్చి ఎంతో ప్రేమతో చూసుకుంటారు—అని ఈ ప్రకార-ముగా వారి అభిప్రాయాన్ని సిద్ధనాథునికి విన్నవించుకుంటూ యేడవసాగారు.

అప్పుడు సిద్ధనాథుడు వారితో ఈ విధంగా అంటాడు—మీకు గురుప్రాప్తి అధికారము లేనం-దున అనేక దుఃఖములను అనుభవించవలసి వచ్చింది. ఈ మార్గము చాలా పవిత్రమైనది. దేహాభి-మానము గలవారికి చాలా దుర్లభమైనది. దేహాభిమానముచేతనే సాంసారిక తాపత్రయములు❋ సంభవిస్తాయి. వాటి నివారణార్థము గురుసాన్నిధ్యము తప్ప, వేరే మార్గము లేదు.

**విశేషము :—**

❋ తాపము అనగా దుఃఖము. ఈదుఃఖము స్వరూపముచే నేకమైనను ఔపాధికభేదముచే ననేకములుగా చెప్పబడుచున్నది. 1.ఆధ్యాత్మికదుఃఖములు, 2.ఆధిభౌతిక దుఃఖములు, 3.ఆధిదైవిక దుఃఖములు అని .

1.శరీరము, మనస్సు అను ఉపాధులచే (సాధనములచే) గలుగు దుఃఖములు ఆధ్యాత్మిక-ములనబడును. దేహము మరియు మనస్సు అజ్ఞానదశలో''**ఆత్మ**''యని అధ్యాసికముగా వ్యవహరింపబడుచున్నందున, వాటివల్లకలుగు దుఃఖములకు ఆధ్యాత్మికదుఃఖములు అంటారు. శరీరములోని వాత, పిత్త, కఫములు అను ధాతువైషమ్యమువలన జ్వరాతిసారాదులు స్థూలశరీరములో గలుగునవి '**వ్యాధులు**'అనబడుతాయి.

కామ, క్రోధ, లోభ, మోహ, భయ,ఈర్ష్య,విషాదాదులచేగాని, అభీష్టవిషయముయొక్క అప్రాప్తిచేగాని కలుగు మానసికదుఃఖములు '**ఆధులు**'అనబడుతాయి. ఈవ్యాధి, ఆధియను రెండు విధముల దుఃఖములను ఆధ్యాత్మిక దుఃఖములు అంటారు. బాహ్యదుఃఖసాధనములగు చోరవ్యాఘ్రాదుల అపేక్షచేత శరీరమనంబులు అను అంతరసాధనములచే కలుగుటచే నీ ఆధ్యాత్మిక దుఃఖములను ''**అభ్యన్తరదుఃఖముల**''ని గూడ అంటారు.

2.స్వసంఘాతము(శరీరాదుల)కంటె భిన్నములై, చక్షురాదిఇంద్రియములకు విషయములగు సర్ప, చోర, శత్రు, వృక్ష, వ్యాఘ్రాది ఉపాధులచేనుత్పన్నమగు దుఃఖములు ఆధిభౌతిక దుఃఖము-లనబడును. ఇతర ప్రాణులయొక్క ఇంద్రియవ్యాపారములచే(క్రియలచే)గలుగు దుఃఖములని యర్థ-ము. ఉదాహరణకు:—ఎవరైనా కఠోరముగా మాట్లాడిననూ, కోపముగా చూచిననూ, కొట్టిననూ దుఃఖము కలుగుతుంది. లేదా, పశుపక్ష్యాదులు పైబడి కరచుట, ఆఘాతము చేయుటవలన గలుగు దుఃఖములు ఇత్యాదులు ఆధిభౌతిక దుఃఖములనబడతాయి.

3.స్వసంఘాతముకంటె భిన్నములై,చక్షురాద్రీంద్రియములకు అగోచరములగు యక్ష,రాక్షస, వినాయక,గ్రహ,పిశాచాదుల ఆవేశమువల్లగలుగు దుఃఖములను ఆధిదైవికదుఃఖములని అంటారు. ఈయక్షరాక్షసాదులు సాక్షాత్తుగా దుఃఖకారణములు కారు. పంచభూతాత్మక విషయములలో ప్రకోపమును సృష్టించి, వాటిద్వారా దుఃఖమును కలుగజేస్తారు. ఉదా:—అతివృష్టిద్వారా భూమండలమును జలమయముచేసి,ఆ జలాభిమానిదేవత ప్రాణులకు దుఃఖమును కలుగజేయును. పిడుగులు పడి మనుష్యులు, జంతువులు మరణించుట, వడగండ్ల వర్షము కురిసి పంటలు పాడగుట ద్వారా జలాధిష్టానదేవత జీవులకు దుఃఖమును కలిగించును. భూకంపముద్వారా భూమి అధిష్టాన దేవత; పెనుతుఫానులు భయంకరమైన గాలులు వీచుటద్వారా వాయు అభిమానిదేవత; బడబానలము, దావానలము ఇత్యాదులచే అగ్న్యభిమానిదేవత ప్రాణులకు దుఃఖమును కలుగజేయుదురు. గ్రహ పిశాచాదులు శరీరములో ఆవహించి, శరీరముద్వారా ఆవహింపబడినవ్యక్తిని మరియు ఇతరులనుగూడ దుఃఖపెట్టును. ఈప్రకారముగా యథాయోగ్యము ఊహించనగును.ఆదిభౌతిక, ఆధిదైవిక దుఃఖములు బాహ్యమగు ఉపాధులచే (సాధనములచే) నుత్పన్నమగుటచే '**బాహ్యా దుఃఖములు**'గా పరిగణింపబడతాయి.

ఈ దుఃఖత్రయము ఒక్కొక్కటి పునః త్రివిధము. 1.అతీతము, 2.అనాగతము, 3.వర్తమానము. గతించిపోయిన దుఃఖమతీతము. రాబోవు దుఃఖమనాగతము మరియు యీ వర్తమాన శరీరము ద్వారా అనుభవింపబడు దుఃఖము వర్తమానము అనబడును. వీనిలో నతీతదుఃఖము పూర్వముననే గతించిపోయినందుచే దాని నివృత్తికొఱకు యత్నము చేయనక్కఱలేదు.“**ప్రారబ్ధం బోగతో నశ్యేత్**” అని చెప్పబడినట్లుగా వర్తమాన దుఃఖము అనుభవించకుండా నివృత్తికానందున, దాని నివృత్తి కొఱకుగూడ యత్నము చేయనక్కఱలేదు. అనాగత దుఃఖము మాత్రము భయహేతువుగాన, ఆ దుఃఖమురాకుండుటకు ప్రయత్నమవశ్యముగ జేయదగును. కావున, ఆధ్యాత్మికాది అనాగత దుఃఖత్రయ నివృత్తికొఱకే లోకమున అందఱూ ప్రయత్నము జేయుచుందురు. *అస్తు. ప్రసంగమును వదలి ప్రకృతము ననుసరించెదము.*

---

ఇప్పుడు మీరు మీయొక్క ఇళ్లకు వెళ్లి సుఖంగా ఉండండి. కాని, ఎల్లప్పుడూ ఈశ్వరభజన చేస్తూ ఉండండి. తద్వారా మీకు ఈశ్వరానుగ్రహముచే అధికారత్వము ప్రాప్తము కాగలదు.

ఇటువంటి కృపాపూర్వకమైన సిద్ధనాథుని మాటలు విని, భీము సోములు ఇద్దరు సిద్ధనాథుని చరణకమలములకు సాష్టాంగ నమస్కారములుచేసి, తమ స్వగ్రామమునకు తిరిగి వెళ్ళడానికి బయలుదేరగా, సిద్ధనాథుడు—మీ మనస్సు ఎల్లప్పుడూ గురుసేవయందే తత్పరమైఉండి, మీయొక్క యీప్సితార్థములు ఫలించుగాక! అని వారిని ఆశీర్వదిస్తాడు.

ఈప్రకారముగా భీము సోములను ఆశీర్వదించి తమ ఇళ్లకు పంపించి,తర్వాత సిద్ధనాథుడు కూడా అక్కడినుండి సద్గురుశోధనకై ముందుకు ప్రయాణము సాగిస్తాడు. ఓ శ్రోతలారా! ఇక ముందర అధ్యాయముయొక్క కథను సావధానముగా వినగలరు.

మంగళస్వరూపమైన శ్రీ సిద్ధారూఢ కథామృతమును కేవల శ్రవణము చేసినంత మాత్రమున సకలపాపములు భస్మమవుతాయి. శ్రీశివదాసుడు శ్రీ సిద్ధచరణకమలములకు మధురమైన ఈ మూడవ అధ్యాయమును సమర్పిస్తూ ఉపసంహరించుచున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు




नानाच्छिद्रघटोदरस्थितमहा दीपप्रभाभास्वरं,
ज्ञानं यस्य तु चक्षुरादिकरणद्वारा बहिः स्पन्दते।
जानामीति तमेवभान्तमनुभात्येतत्समस्तं जगत्,
तस्मै श्रीगुरुमूर्तये नम इदं श्रीदक्षिणामूर्तये।।
ब्रह्म
शब्द
गन्ध
(अत्तर)
(पलंग)
स्पर्श
साक्षी
मनरूप तैल
स्थूलशरीर
रस
रूप
हृदय रूपी पात्र
बुद्धीरूप बत्ती





**ఓం శ్రీ గణేశాయ నమః** **ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః** **ఓం శ్రీ సరస్వత్యై నమః**




**పద్యానువాదము**:–ఎవరియొక్క కృపచేత యథార్థమైన జ్ఞానము కలుగునో, అటువంటి సద్గురువును ఏప్రకారముగా పొందగలుగుతామో, మనోవాక్కాయములచే సద్గురుసేవ ఎలా చేసి-నట్లయితే జీవుని జన్మ ధన్యము కాగలదో, ఆ రహస్యమును ముముక్షులోకమునకు తెలియజేయు టకే సిద్ధదేవుడు సద్గురు ప్రాప్తిగూర్చి వెళుతున్నాడు.

ఎవరియొక్క దర్శనము కొఱకు దేవతలు సహితము అనేక కఠినమైన తపస్సులు చేస్తారో, ఎవరి చరణతీర్థమువలన ముల్లోకములు పావనమగునో,అట్టి కరుణామూర్తివైన ఓసిద్ధరాజా! నీకు నా హృదయపూర్వక వందనములు.హే సిద్ధనాథా!స్వయముగా పరిపూర్ణ నిత్యజ్ఞానస్వరూపుడవై యుండిగూడ,ఇతర జీవులకు ఆదర్శప్రాయమైన గురు-శిష్యసంప్రదాయ మార్గమును చూపడానికి, అజ్ఞజీవులపై అపారమైన కరుణగలిగి, దేశికోత్తముని అన్వేషణలో బయలుదేరి వెళ్ళుచున్నావు.

**——:కథాప్రసంగము:——**

ఇక, సిద్ధనాథుడు అక్కడక్కడ ఎదురుపడిన జనులను అడిగి సద్గురుజాడను తెలుసుకుంటూ ఒంటరిగా అనేక గ్రామములు, అనేక క్షేత్రములు దర్శిస్తూ, సాధు సత్పురుషుల దర్శనము చేసు-కుంటూ వెళ్ళుచున్నాడు. కాని, సద్గురువు తటస్థపడలేదు. హైదరాబాదు ప్రదేశమందున్న గోల్కొండ సమీపంలో ఉన్న "**తిమిరలంక**" అనే పేరుగల రహస్యమైన గుహలోకివెళ్లి ధ్యానముచేయడానికి కూర్చున్నాడు. ఆ గుహయందు చాలా రోజులు ఏకాంతముగా ధ్యానము చేసినందువలన చిత్తము ఏకాగ్రతను పొంది తత్ఫలితముగా గురుప్రాప్తి మార్గము నిశ్చయముగా స్ఫురించినది. పరమశివుని యొక్క అవతారమైన దక్షిణామూర్తి సంప్రదాయమునకు చెందిన ఆచార్యులు దక్షిణదేశమందు ఉంటారు. అచ్చట తప్పనిసరిగా గురుప్రాప్తి కాగలదని చిత్తములో స్ఫురించినది.

అప్పుడు, సిద్ధనాథుడు పరమపవిత్రమైన శ్రీశైలక్షేత్రము వెళ్లి, అక్కడ '**సూర్యసింహాసన మఠా-ధిపతి**' యైన స్వామిని దర్శించుకొని, ఆయనను చిత్తశుద్ధి మరియు జ్ఞానసాధనల విషయమై, అట్లే-జీవబ్రహ్మైక్యము గురించిగూడ విచారిస్తాడు(అడుగుతాడు).ఇద్దరిలో చాలాసేపు ఎంతో గంభీ-

రమైన సంవాదము జరిగింది. అప్పుడు ఆ సూర్యసింహాసన మఠాధిపతి తన మనస్సులో ఈవిధంగా అనుకుంటాడు. ఈపిల్లవాడు అనేకజన్మలనుండి యోగసాధనలను అభ్యసించినవాడై ఉండవచ్చు. అందుకే, పూర్వాభ్యాస ప్రభావముచే బాల్యావస్థలోనే జ్ఞానసాధనలందు ప్రవృత్తమైనాడు.

**శ్లో॥పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।** (గీత.6-44)

లేకపోతే, ఈయన దైవాంశసంభూతుడుగానైన అవతరించి ఉండవచ్చు–అని మనసునందు అనుకొని, తాను స్వయంగా సాదరముగా సత్కరించి పూజిస్తాడు. సిద్ధనాథుడు ఆపూజలు స్వీకరించి అక్కడనుండి బయలుదేరెను.

---

★ ఇక్కడ కించిద్విశేషము గలదు :–

**గురులక్షణములు:–**1.వేద-వేదాంగ పారంగతుడై(శ్రోత్రియుడై), 2.జీవబ్రహ్మైక్యానుభూతి పొందినవాడై (బ్రహ్మనిష్ఠుడై)ఉండాలి, 3.శిష్యులయొక్క బుద్ధియందు ఉదయించు పంచవిధ భేదభ్రాన్తులను నిరసించు(ఖండించు) సమర్థుడై యుండాలి. 4.సజాతీయ, విజాతీయ, స్వగతాది భేద రహితమైన (అద్వితీయమైన), అవిద్యాది మలరహితమైన బ్రహ్మమును శ్రోతాపురుషుని స్వరూపముతో (ఆత్మచేత) అభిన్నముగా దర్శింపజేయువాడై యుండాలి. 5.సర్వసంసారమును మిథ్యారూపముచే ఉపదేశించి, ఉపనిషదర్థమును స్పష్టముగా బోధించువాడై యుండాలి. అటువంటి జ్ఞానిగురువు మాత్రమే ముముక్షువులకు యథార్థమైన బోధచేయగలడు. ముముక్షువులు తరించగలరు. (శ్రీవిచార సాగరము-మూడవ తరంగములో)

**శ్లో॥పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః ।**

**వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥**

(యాజ్ఞవల్క్య స్మృతి 1-3; విష్ణు పురాణము 3-6-26; వాయు పురాణము 61-78; రఘువంశము 5-21)

1.పురాణములు, 2.న్యాయము, 3.మీమాంసము, 4.ధర్మశాస్త్రము; నాలుగు వేదములు; ఆరు వేదాంగములు. ఇవి చతుర్దశ(పదునాలుగు)విద్యాస్థానములని, మరియు ధర్మమునకుగూడ హేతువులుగా చెప్పబడినవి.

పురాణములు పదునెనిమిది. 1.బ్రహ్మ, 2.పద్మ, 3.విష్ణు, 4.శివ, 5.భాగవత, 6.నారదీయ, 7.మార్కండేయ, 8.అగ్ని, 9.భవిష్య, 10.బ్రహ్మవైవర్త, 11.లింగ, 12.వరాహ, 13.స్కంధ, 14.వామన, 15.కూర్మ, 16.మత్స్య, 17.గరుడ, 18.బ్రహ్మాండపురాణము.

న్యాయము రెండు. 1.గౌతమీయ న్యాయశాస్త్రము, 2.కాణాద ప్రోక్త వైశేషిక శాస్త్రము.

మీమాంస రెండు. 1.జైమినీయ పూర్వమీమాంసా శాస్త్రము, 2.వ్యాసప్రోక్త ఉత్తర మీమాంసా శాస్త్రము(బ్రహ్మసూత్రములు).

ధర్మశాస్త్రము:—సాంఖ్య, యోగ, భారత, మనుస్మృతి ఇత్యాదులు.

వేదాంగములు ఆరు. **శ్లో॥శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా ।**

**కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః ॥**

1.శిక్ష, 2.వ్యాకరణము, 3.ఛందస్సు, 4.నిరుక్తము, 5.జ్యోతిషము, 6.కల్పసూత్రములు.

వేదములు నాలుగు.1.ఋగ్వేదము,2.యజుర్వేదము,3.సామవేదము, 4.అథర్వణవేదము. ప్రకారాంతరముచే నాలుగు ఉపవేదములను కలిపి పదునెనిమిది విద్యాస్థానములుగా గూడ చెప్ప బడినవి.

ఉపవేదములు నాలుగు.1.ఆయుర్వేదము,2.ధనుర్వేదము,3.గాంధర్వవేదము,4.అర్థశాస్త్రము.

## పంచవిధ భేదబాధక యుక్తులు

పంచభేదములు : —**శ్లో॥మానాభావాదయుక్తేశ్చ న భిదేశ్వరజీవయోః ।**

**జీవానామచితాం చైవ నాత్మనో న పరస్పరమ్ ॥** (భేదధిక్కారము 4)

ద్వైతవాదుల కథనానుసారము—1.జీవేశ్వరభేదము, 2.జీవుల పరస్పర భేదము, 3.జీవ జడ భేదము, 4.ఈశజడ భేదము, 5.జడ జడ (జడ పరస్పర) భేదములు—ఏవి గలవో, వాటి విషయంలో యే ప్రమాణముగాని యుక్తులుగాని లేనందున, వేదవిరుద్ధములు గావున—వారి కథనము ఉన్మత్త ప్రలాపమే యగును.

పంచవిధ భేదబాధక యుక్తులు ఇట్లు గలవు: ——

1.జీవేశ్వరభేదము కల్పితము(ప్రతిజ్ఞా), అవిద్య మరియు మాయారూప ఉపాధికృతమున్నం-దువలన (హేతువు), యత్ర యత్ర ఔపాధికత్వం తత్ర మిథ్యాత్వమితి వ్యాప్తిః, యథా ఘటాకాశ మహా-కాశ భేదమువలె (ఉదాహరణము).

2.జీవుల పరస్పర భేదము కల్పితము, సాభాసాంతఃకరణరూప ఉపాధికృతమున్నందువలన, నానా ఘటాకాశ భేదమువలె.

3.జీవ జడ భేదము కల్పితము, సాభాసాంతఃకరణము మరియు నిరాభాస నామరూపమయ ఉపాధికృతమున్నందువలన, స్వప్నగత చరాచరములవలె.

4.ఈశ జడ భేదము కల్పితము, సాభాసమాయ మరియు నిరాభాస నామరూపమయ ఉపాధికృతమున్నందువలన, సాక్షి మరియు స్వప్నప్రపంచ భేదమువలె.

5.జడజడ భేదము కల్పితము, నామరూపమయ ఉపాధికృతమున్నందువలన, రజ్జువునందు కల్పిత సర్పదండాదులవలె.

ఈ ఐదు అనుమాన ప్రమాణములు పంచభేద ఖండనమునందు యుక్తులగును.*అస్తు.*

పై లక్షణములుగల గురుదేవుని ఆశ్రయించవలెనను అభిప్రాయముతో సిద్ధనాథుడు తిరుగుతూ తిరుగుతూ "**రాయచోటి**" స్థానమును దర్శించి "**వీరభద్ర నవనందుల**"ను దర్శించి దక్షిణ దిశవైపు వెళ్లుచుండెను. శరీరమునకు కలిగిన దుఃఖములచే ఏమాత్రము చింతింపక అన్నపానాదులను త్యజించి శరీరసంబంధ సకల వాసనలను వదిలేసి శుద్ధమైన చిత్తముగలిగి యుండెను.

సకల క్షేత్రములను దర్శిస్తూ దర్శిస్తూ, ఎవరిద్వారా మాయ సమూలముగా నష్టమై పరమాత్మయొక్క యథార్థానుభూతి కలుగునో, అటువంటి గురువును హృదయమునందు అఖండముగా ధ్యానిస్తూ – పరితపిస్తూ, ఎంతో తాపత్రయపడుతూ, ఓ పరమేశ్వరా! ఈ బాలునిపై నీ దయ ఎప్పుడు కలుగుతుంది. సద్గురుదేవుడు ఎక్కడున్నాడు. ఆ మహాపురుషుని జాడ తెలుపరాదా స్వామీ! ఆ సద్గురుదేవునియొక్క చరణకమలముల దర్శనభాగ్యమును ఎప్పుడు కలుగజేస్తావు? అని మిక్కుటముగా విలపిస్తూ, భూమిపై మూర్ఛితుడై పడిపోయెను. అప్పుడు తన హృదయమందు సద్గురు దర్శనము కలిగి, ఓ బాలుడా!నీవు ఏమాత్రము భయపడవద్దు. ధైర్యము వీడకుము–అని హెచ్చరించినట్లు అనిపించింది.

సిద్ధనాథుడు వెంటనే కళ్ళు తెరిచి చూసినాడు. కాని, ఇంతవరకు మందలించిన ఆప్తపురుషుడు కనిపించలేదు. అప్పుడు నిస్పృహుడై ధరణిపై పడిపోయి, సద్గురువును ఇట్లు వేడుకుంటాడు. ఓ గురుదేవా! ఓ దయామయా! ఏమిటీ పరీక్ష! ఇంత కఠినంగా ఎందుకు శిక్షిస్తున్నావు? నేను నీ బిడ్డనే గదా! నిన్నే అపేక్షించినవాడనై నీయొక్క దర్శనము కోసము విలపిస్తున్న నాకు ఆశాభంగము చేయకుము. తొందరగా రక్షింపుము. ఓ గురుదేవా! నీవు ఎక్కడ దాగుకొని ఉన్నావయ్యా! శీఘ్రముగా వచ్చి నీయొక్క చరణకమలముల దర్శనలాభము కలుగజేసి, మాయాభాసను నిర్మూలించి, నాకు బ్రహ్మమార్గమును దర్శింపజేయుము. నీయొక్క చరణాలయందే ఆశపెట్టుకొని, వ్యాకులచిత్తుడనై నీ సాన్నిధ్యము కోసమే రాత్రింబవళ్లు తిరుగుతున్నాను. అనేక దేశదేశములు తిరిగితిని. అయినా నీ జాడ తెలియుట లేదుగదా! నీ దర్శనభాగ్యము కలుగుటలేదే! నీవు తప్ప నాకు రక్షకులెవరునూ లేరు. అందుకే, నిన్ను శరణు బొందితిని. నీవు తప్ప ఇతరుల ఆశ్రయమును కోరను. ఒకవేళ నీవే ఉపేక్షించినచో, నాకు రక్షకులెవరు?

**శ్లో॥దుర్వార సంసారదవాగ్నితప్తం, దోధూయమానం దురదృష్టవాతైః ।**
**భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః, శరణ్యమన్యం యదహం నజానే ॥** (వి.చూ.38)

ఈ క్షణమందు నీవు కనిపించకున్నట్లయితే నిశ్చయముగా ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేను. నీయందే మనసును సంలగ్నముచేసి, ఇక్కడే ప్రాణాలను విడువడానికి సిద్ధంగా ఉన్నాను. ఇట్లు-ఆర్తనాదముచేత వేడుకుంటూ కళ్ళనుండి ఏకధారగా కన్నీరు కారుస్తూ, నేత్రములను మూసుకొని నిశ్చేష్టుడై ఉండిపోయినాడు.

అప్పుడు, ఆ సద్గురునాథునికి కృపకలిగి వృద్ధసాధురూపంలో ఎదురుగా ప్రత్యక్షమై, మూర్ఛితుడైన సిద్ధనాథున్ని తన హస్తములతో పైకిలేపి, ఓ బాలుడా నీవు ఎవరు? అని ప్రశ్నించగా–

సిద్ధనాథుడు సద్గురు దేవునితో–ఓ సద్గురురాజా! ఓ దీనబంధూ! నీ శరణజొచ్చితిని. నీయొక్క దర్శనముగూర్చి ఎంతో వెదికినాను. కాని, ఇంతదనుక దర్శనమీయకుంటివి. ఇప్పటికి ఈ దీనునిపై దయగలిగినదా స్వామీ! ఈక్షణమున నీయొక్క దర్శనము కలుగకుండిన నేను ప్రాణత్యాగము చేసేవాడిని, అని వేడుకుంటాడు.

సిద్ధనాథుని ఆవేదనను విన్న మీదట, ఆ సాధువుయొక్క హృదయము ద్రవించి ఇట్లనెను. నాయనా! నీయొక్క జన్మ ధన్యము. ఈ ధరణిలో నీవు సద్గురువును వశపరచుకుంటివి. నీకు తప్పకుండా సద్గురుకృప కలుగుతుంది.లోకంలో సకలజీవులు విషయోపభోగములను కోరుదురు. కాని, నీవు మాత్రము సద్గురుప్రాప్తిగూర్చి పరితపిస్తున్నావు. కాబట్టి నీకు అతితొందరలోనే నిశ్చయముగా సద్గురుప్రాప్తి కాగలదు. నీవు మల్లికార్జున క్షేత్రమునకు వెళ్ళి, అక్కడ "**గుడగుంటి అమరగుండ**" అను గ్రామమున "**కట్టే మఠము**"నకు అధికారియగు ఒక ముఖ్య స్వామివారుంటారు. ఆ స్వామివారి పేరు "**గజదండ మహాస్వామి**". ఆయన వేదవేదాంగపారంగతుడు, ప్రచండ జ్ఞానసంపన్నుడు, బ్రహ్మనిష్ఠుడు కూడ. విధిపూర్వకముగా కర్మకాండము, ఉపాసనా కాండము, జ్ఞాన కాండమును అధ్యయనము చేసినవాడు. వేదవేదాంగములను చక్కగా తెలిసికొని, వేదోక్త ఆచరణగలిగి, తనను ఆశ్రయించిన శిష్యవర్గమునుగూడ శాస్త్రోక్త ఆచరణలో పెట్టి, ఆచార్య పదవికి అన్వర్థమైన జ్ఞానిపురుషుడు.

**శ్లో॥ఆచినోతి హి శాస్త్రార్థానాచారే స్థాపయత్యపి ।**
**స్వయమాచరతే యస్మాత్తస్మాదాచార్య ఉచ్యతే ॥** (ద్వయోపనిషత్ 4)

గజదండ మహాస్వామియొక్క విద్య(పాండిత్యము) మరియు జ్ఞానము సర్వోత్కృష్టమని జనులు స్తుతిజేయుదురు. ఆయనకు భృత్యుడవై శరణుబొంది, శుశ్రూషలొనరించి,ఆయన కృపకు పాత్రుడవైనచో, నీవు తప్పకుండా ఆత్మజ్ఞానమును పొందగలవు. ఆ స్థానము ఇక్కడికి దగ్గరలోనే ఈ కొండలు దాటి వెళ్ళితే కనిపిస్తుంది–అని అంగుళీ నిర్దేశముద్వారా చూపించి, ఆ సాధువు అంతర్ధానమయ్యాడు.

ఇంతదనుక జరిగిన ఘటన సిద్ధనాథునికి ఒక స్వప్నమువలె తోచినది. ఇంతసేపు నాతో సంభాషించిన ఆ సాధువుసాక్షాత్తు సద్గురుదేవుడేయని, నేను మాయామోహమువలన యథార్థము తెలియనైతిని. ఆయనకు నమస్కారముకూడా చేయకపోతినేయని పశ్చాత్తాపముజెందెను. మరియు ఆస్వామి వచనములు శ్రీగురుదేవుని ఆజ్ఞగా శిరసావహించి, తప్పకుండా మల్లికార్జున క్షేత్రమునకు వెళ్లి గజదండస్వామిని దర్శించి, ఆయన శుశ్రూషలు చేయుటకు అనుజ్ఞ ఇమ్మని ప్రార్థించెదను, అని

నిశ్చయించుకొని–అదే రోజున గుడగుంటి గ్రామమునకు వెళ్లి, మల్లికార్జున క్షేత్రమును దర్శించి, దేవాలయముబయట సద్గురుస్వామియొక్కదర్శనముగూర్చి ఎదురుచూస్తూ దీనవదనుడై నిలుచుండెను.

దైవపూజ ముగిసిన పిమ్మట గజదండస్వామి బయటకు వచ్చెను. సిద్ధనాథుడు తన శరీరమును దండమువలె భూమిపైఉంచి సద్గురుస్వామికి సాష్టాంగ నమస్కారములు చేసి,వెంటనే లేచి నిలబడి, శుద్ధాంతఃకరణుడై(నిర్మలహృదయముచే)అంజలి ఘటించి, అత్యంత దీనభావముచే సద్గురుస్వామిని ఇట్లు ప్రార్థించెను.

**శ్లో॥బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**
**ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం,**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥** (శ్రీయోగవాసిష్ఠము-అంతిమ శ్లోకము)

ఓ సద్గురుదేవా! నీవు బ్రహ్మానంద స్వరూపుడవు, అందరికీ పరమసుఖమును చేకూర్చే కీర్తిగల వాడవు, నిర్ధర్మక స్వరూపుడవు, అఖండ జ్ఞానస్వరూపుడవు, ద్వంద్వములను దాటినవాడవు, ఆకాశమువలె సర్వత్ర వ్యాపించి సూక్ష్మముకంటె సూక్ష్మమై నిర్లేపుడవై ప్రపంచరహితుడవై, తత్త్వమస్యాది మహావాక్యములకులక్ష్యార్థమై, మాయామలరహితుడవై, ఏకమై, నిత్యమై, అచలమై, స్వయంప్రకాశస్వరూపుడవై, సత్యస్వరూపుడవై, అంతఃకరణమునకు సాక్షివై, సర్వాంతర్యామివై, మనోబుద్ధులకు అతీతమై, త్రిగుణాతీతుడవై యున్నావు.

ఇటువంటి స్వరూపుడవై యుండికూడా సకలజీవులను ఉద్ధరించుటకై సగుణసాకారముగా జ్ఞానప్రదాతవై అవతరించిన ఓ సద్గురుస్వామీ! నీకు సంపూర్ణముగా శరణు జొచ్చితిని.

**"స్యాత్పరమేశ్వరస్యాపి ఇచ్ఛావశాన్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్"** (బ్ర.సూ. భాష్యము 1-1-20) **శ్లో॥చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః ।**
**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ॥** (శ్రీరామపూర్వతాపన్యుపనిషత్ 7)
**శ్లో॥జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥** (భాగ.10-14-55)
**శ్లో॥మాయాహ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద!।** (మ.భా.శాన్తిపర్వము 339-45)

మాయచేత గ్రసింపబడినవాడనై అనేక సుఖదుఃఖములను అనుభవించితిని. అందుకే, ఆ మాయనుండి విముక్తుడను కావాలి–అను కోరికతో నిన్ను ఆశ్రయించితిని. ఒకవేళ నీవు నన్ను ఉద్ధరించనియెడల నేను జన్మమరణరూప సంసారంలో వృథాగా కొట్టుకొని పోగలను. దేనిచేత ఈ సంసారభ్రాన్తి సమూలంగా నివృత్తమై నేను ఉద్ధరించబడగలనో, అటువంటి ఉపాయమును తెలియ

జేయండి—అని సిద్ధనాథుడు వేడుకున్నాడు.

సిద్ధబాలుని ఆర్తనాదమును ఆలకించిన గజదండ సద్గురుదేవుని హృదయము ద్రవీభూతమయ్యెను. అయినాగాని, శ్రీ గజదండ సద్గురువు సిద్ధనాథుని భక్తి, విశ్వాసములను పరీక్షించదలచి, ఉపేక్షాబుద్ధిని ప్రదర్శిస్తూ, ఉదాసీనంగా "**జరుగు జరుగు**" అనంటూ గద్దించి వెళ్ళిపోయాడు.

దానిచే సిద్ధబాలుడు ఏమాత్రముగూడ ఖిన్నుడుగాక (దుఃఖమును జెందక), సద్గురు సేవచేయుటకు దృఢసంకల్పమునుబూని సద్గురుదేవుని మఠమునకు వెళ్ళి నిరభిమానవృత్తితో సద్గురుసేవలో సంలగ్నుడయ్యెను. ప్రతినిత్యము గుఱ్ఱపుశాలను ఊడ్చి, వాటి మలమూత్రములను స్వహస్తములతో తీసివేసి, స్వచ్ఛముగా కడిగి శుభ్రముచేసేవాడు. మఠముయొక్క పరిసరాలను స్వచ్ఛంగా ఉంచేవాడు. శ్రీగురుదేవునికి స్నానముకొఱకు నదినుండి నీళ్ళు మోసుకొచ్చేవాడు. వంటకు ఉపయోగపడు వంటచెఱకు తెచ్చేవాడు. వంటగదిలో ఖాళీచేయబడిన (అంట్లతో ఉన్న) పాత్రలను నదికి తీసికెళ్ళి శుభ్రపరచి తెచ్చేవాడు. గురుగృహములోని వస్త్రములను ఉతికి శుభ్రముచేసేవాడు. మరియు గురు సేకులయొక్క సేవకూడ అత్యంత ఆదరముచే చేసేవాడు.

గురువును చూడగానే లేచినిలబడి భూమిపై సాష్టాంగ ప్రణామములాచరించేవాడు. ఎదురుగా నిలబడి గురుదేవుని ముఖము చూసేవాడు కాదు. వినమ్రుడై ప్రక్కకు నిలిచేవాడు. ప్రతిదినము మధ్యాహ్నము గ్రామములోకి వెళ్ళి ఐదు ఇండ్లల్లో భిక్ష(మధుకరి) అడుగుకొనివచ్చి గురువుకు సమర్పించేవాడు. గురుదేవుడు ఆజ్ఞయిస్తేనే ఆ భిక్షను స్వీకరించేవాడు. మఠములో వండిన ప్రసాదమును (భోజనమును) సేవించేవాడు కాదు. తన దేహసుఖముగూర్చి ఎప్పుడూ ఆలోచించలేదు. అన్నవస్త్రాల చింత పూర్తిగా వదిలేసి, ఉదాసీనంగా ఉండేవాడు.ఎవరైనా ధర్మాత్ములు వస్త్రములను కట్టుకొమ్మని ఇచ్చినా, వాటిని స్వీకరించేవాడు కాదు. ఇట్టి నియమములను నిశ్చయముగా పాటించేవాడు.

నిత్యము శ్రీగజదండ సద్గురుదేవుని ముఖారవిందమునుండి ఏకాగ్రచిత్తముతో స్వస్థమనస్కుడై ఆదరపూర్వకముగా వేదాన్త శ్రవణము చేసేవాడు. ప్రతినిత్యము ఇట్టి ఆచరణ జరుగుచుండగా, ఒకనాడు ఒక వింత సంఘటన జరిగింది. ఏమిటంటే—

సుబ్బయ్యశాస్త్రి అను ఒక గొప్పపండితుడు, సకలశాస్త్రములలో అశేషతజ్ఞుడు(నిపుణుడు), ముఖ్యంగా వేదాన్త శాస్త్రజ్ఞుడు, శ్రీగజదండస్వామి సభలోనికి వచ్చెను. శ్రీ గజదండస్వామి శాస్త్రోక్త ప్రకారముగా సుబ్బయ్యశాస్త్రికి ఉన్నత ఆసనమునిచ్చి సగౌరవముగా కూర్చుండబెట్టెను. అనంతరము సుబ్బయ్యశాస్త్రి సభలో ఆసీనులైన భక్తులందరిని ఉద్దేశించి, "**ఉపనిషత్**" శబ్దమునకు యథాయోగ్యమైన అర్థమును చెప్పగలవారు ఈ ధరణిలో ఎవ్వరునూ లేరు. ఒకవేళ మీలో ఎవరైనా "**ఉపనిషత్**" శబ్దార్థమును స్పష్టముచేయు అధికారులు(సమర్థులు) ఉన్నట్లయితే చెప్పండి—అని సభలో ప్రకటించాడు. ఆ ప్రశ్నను విన్న సభికులందరు ఆశ్చర్యచకితులైనారు. కాని, శ్రీ గజదండస్వాములవారు లోలోన

నవ్వుకొని, ఇతడు విద్యాపాండిత్యముచే ఉన్మత్తుడైనాడు. ఈయన గర్వమును భంగపరచి, గుణపాఠము చెప్పాలనుకున్నాడు.

అప్పుడు,సభలో ఎవరుగూడ సమాధానము చెప్పలేకపోయినందున, సిద్ధనాథుడు సభనుండి లేచి, వినమ్రుడై సద్గురు సన్ముఖమున చేతులు జోడించి నిలబడి, ఇట్లు వేడుకొనెను. ఓ సద్గురు దేవా! మీరు నాకు సుబ్బయ్యశాస్త్రిగారి ప్రశ్నకు సమాధానమిచ్చుటకు ఆజ్ఞ ఇచ్చినట్లయితే, ఆయన ప్రశ్నకు నేను సమాధానము చెప్పి, అతనిని ఖండించగలను— ఇట్లు సిద్ధనాథుడు ప్రార్థించగా, శ్రీ గజదండ సద్గురుదేవుడు సమాధానము చెప్పుటకు ఆజ్ఞనొసంగెను.

అప్పుడు సిద్ధనాథుడు సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి, సుబ్బయ్యశాస్త్రి వద్దకువచ్చి **"ఉప-ని-షత్"**శబ్దార్థమును చెప్పనారంభించెను. 'ఉపనిషత్' శబ్దముచే సంపూర్ణంగా **బ్రహ్మాత్మైక్యము** చెప్పబడింది. అందుకే ఉపనిషత్తునకు **"బ్రహ్మావిద్య"** అనిగూడ అంటారు. ఉపనిషద్వాక్య విచారణ ద్వారా అంతఃకరణమునందు జీవబ్రహ్మైక్యజ్ఞానముదయిస్తుంది. ఈ కారణముచే ఉపనిషద్వాణి **"బ్రహ్మావిద్య"** అనబడుతుంది.

అప్పుడు సుబ్బయ్యశాస్త్రి ఉపనిషత్తునకు '**విద్య**' అను శబ్దప్రయోగము ఎందుకు చేయబడింది? అని ప్రశ్నిస్తాడు.

సిద్ధనాథుడు ప్రత్యుత్తరమిస్తూ, ఉపనిషత్ శబ్దమునకు వాస్తవ అర్థము "**బ్రహ్మావిద్య**"యే. ఎందుకంటే, 'ఉప' 'ని' పూర్వక షద్ళృధాతువునకు 1.విశరణ, 2.గతి, 3.అవసాదనము అను మూడర్థములు గలవు. "ఉపనిషత్" శబ్దమునకు వాచ్యార్థము వాక్యసముదాయాత్మక గ్రంథము. లక్ష్యార్థము '**బ్రహ్మావిద్య**'. పై ధాత్వర్థములు (విశరణగత్యవసాదనములు) కేవల గ్రంథముచే నిష్పన్నము కావు. మరేమనగా! గ్రంథాధ్యయనముద్వారా కలుగు బ్రహ్మాత్మైకత్వ **(అహంబ్రహ్మాస్మి)** జ్ఞానము **(విద్య)**చే ధాత్వర్థము నిష్పన్నమగును. కావున, ఉపనిషత్ శబ్దమునకు వాస్తవ అర్థము '**బ్రహ్మావిద్య**'యే.

**"య ఇమాం బ్రహ్మావిద్యాముపయన్త్యాత్మభావేన శ్రద్ధాభక్తిపురఃసరాః సన్తస్తేషాం గర్భ జన్మ జరా రోగాద్యనర్థపూగం 'నిశాతయతి' పరం వా బ్రహ్మ 'గమయతి' అవిద్యాదిసంసారకారణం చాత్యన్త'మవసాదయతి' వినాశయతీత్యుపనిషత్"**. (ముండకోపనిషత్ సంబన్ధభాష్యము)

ఏ ముముక్షు పురుషుడు ఈ ఉపనిషద్రూప బ్రహ్మావిద్యను పరమప్రేమకు విషయమగుట వలన శ్రద్ధాభక్తిపూర్వకముగా ఆశ్రయించునో, అతని–1.గర్భ జన్మ జరా రోగాది క్లేశ సమూహమును శిథిలముజేయును, మరియు 2.పరబ్రహ్మమును ప్రాప్తముజేయును, అట్లే 3.అవిద్యాదిసంసారకారణమును నాశనముజేయును. అందువల్లనే బ్రహ్మావిద్యకు **'ఉపనిషత్'** అందురు.

అయితే, **"లాంగలం జీవనమ్", "ఆయుర్వై ఘృతమ్"** కృషీవలుని జీవనము నాగలి, నెయ్యి

ఆయువు-అని ఎట్లు గౌణముగా వ్యవహారము జరుగునో, అట్లే వాక్యసముదాయాత్మక గ్రంథవిశే-షమునకే **"ఉపనిషత్"** అని గౌణముగా వ్యవహారము=శబ్దప్రయోగము జరుగును. ముముక్షుజను-లు శుద్ధచిత్తులై(అంతఃకరణశుద్ధి గలవారై), దమనము (ఇంద్రియనిగ్రహము) గలవారై, గురుశాస్త్ర-ములయందు అకుంఠిత విశ్వాసము(శ్రద్ధ) గలవారై, శ్రీ గురుదేవుని ముఖారవిందముద్వారా వేదా-న్తములను (ఉపనిషత్తులను) శ్రవణ మనన నిదిధ్యాసనములు చేసినచో, వారి అంతఃకరణము నందు ఆత్మజ్ఞానము ప్రకాశించును. దానిచే అజ్ఞానము సంపూర్ణముగా నష్టమై, త్రుటిలో భవ-బంధము విచ్ఛిన్నమగును. అందుకే, ఉపనిషత్తునకు '**విద్య**' అందురు. **"ఉపనిషదితి బ్రహ్మ విద్యా"**(తై.ఉ.సంబన్ధ భాష్యే) ఉపనిషత్ శబ్దార్థము (విశరణగత్యవసాదనములు) జ్ఞానముచే సిద్ధించు-చున్నందున, పర్యవసానంగా **"ఉపనిషత్" "జ్ఞానము"** మరియు '**విద్య**' శబ్దములకు అవిద్యను నాశనము చేయుటయను అవిరుద్ధ ఏకార్థసంబన్ధమున్నందున పర్యాయములగును.

సకల జీవులయొక్క వాస్తవస్వరూపము పరబ్రహ్మము. కనుక బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును పొందుటకు అందరికీ అధికారముకలదు."**వేదైశ్చసర్వైరహమేవ వేద్యః**"(గీత.15-15);"**తం త్వౌపనిషదం పురుషంపృచ్ఛామి**"(బృ.3-౯-26); "**సర్వేవేదాః యత్పదమామనన్తి**"(కఠ.౨-15); "**తత్త్వమసి**"(ఛాం.6-8-7) ఇత్యాది శ్రుతులు పరబ్రహ్మవస్తువు ఉపనిషత్తుల ద్వారానే పొందబడునని ఉద్ఘోషించుచున్నవి. కా-వున, ఉపనిషద్వాక్యార్థమును చక్కగా విచారించి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమును సంపాదించుకొనుటకు సర్వులు అధికారులే యనుటలో సందేహము లేదు.

**శ్లో॥మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥** (గీత.౯-32)

*ఇచ్చట కించిద్వివేకము గలదు. ఎవని యంతఃకరణము నిర్మలముగా నున్నదో, అనగా మల దోషము మరియు విక్షేపదోషము లేనిదైయున్నదో, మరియు వివేకము, వైరాగ్యము, షట్సం-పత్తి, ముముక్షుత్వము అను సాధనచతుష్టయ సంపత్తి కలిగియుండునో—అతడే బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును పొంది మోక్షధామమును చేరుటకు అధికారియగును.*

లనుండి వేదాన్త తత్త్వానుసంధానము చేసిన విద్యామూర్తి ఉన్నాడు—అని తెలిసికొని, ఇంత చిన్నవ-యసులోనే ఈయన ముఖములో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుచున్నది. ఇట్టి బ్రహ్మకళను ఇతడు పూర్వజ-న్మలనుండియే తీసికొని వచ్చాడు.లేనిచో, ఈ సుకుమార బాల్యావస్థయందు ఇంతటి విద్యాశక్తి దుర్లభము—అని తలంచి—సుబ్బయ్యశాస్త్రి, ఆనందభరితుడై సభనుండి నిష్క్రమించెను. తదుపరి సిద్ధనాథుడు నిరభిమానయుక్తుడై యథాస్థానమునకు (ఒక మూలకు) వెళ్లి కూర్చున్నాడు.

సిద్ధనాథునియొక్క శాస్త్రవ్యుత్పత్తి=శాస్త్రాదిజన్యపరిజ్ఞానమును, అత్యంత నిరభిమాన స్థితిని,

నిరంతర సేవాభావమును మరియు అనన్య గురుభక్తినిగాంచి సద్గురు శ్రీ గజదండస్వాములవారు మహదానందమునొందెను. ఆ దినమునుండి సద్గురు శ్రీ గజదండస్వాములవారు సిద్ధనాథుని తన సన్నిహిత శిష్యునిగా భావించి, తనచెంతనే కూర్చుండబెట్టుకునేవాడు. అత్యంతప్రేమభావముతో ఇద్దరు కలిసి పరస్పరము యథాయోగ్యముగా శాస్త్రవిచారణ చేసేవారు.

ఒకనాడు సిద్ధనాథుడు శ్రీ గురుదేవుని ఇట్లడిగెను. ఓ సద్గురు మహారాజా! ఆరు శాస్త్రముల యొక్క తాత్పర్యమును తెలిసికొని, స్వరూపనిశ్చయము గలిగిన మహాత్ముని చిహ్నములు ఎలా ఉంటాయో, నాయందు దయతలచి చెప్పండి స్వామీ?

సిద్ధనాథుని ప్రశ్నను విన్న సద్గురు శ్రీ గజదండస్వాములవారు ఆనందముతో ఇట్లనెను. ఓ శిష్యా! వివేకము, వైరాగ్యము, షట్సంపత్తి, ముముక్షుత్వము—అను సాధన చతుష్టయ సంపత్తి దృఢ-ముగా గలిగి, షట్శాస్త్రముల తాత్పర్యార్థమును నిశ్చయించుకొన్న మహాత్ముని చిహ్నములు చెబుతా-ను వినుము.

ఆ మహాత్ముడు సాధనకాలంలో సద్గురుసాన్నిధ్యములో వేదాన్తవాక్యములను గురుముఖ-ముగా శ్రవణము, మననము మరియు నిదిధ్యాసములు చేసి ఉంటాడు. కావున, అతనికి శ్రవణ-ముచే ప్రమాణగత సంశయము, మననముచే ప్రమేయగత సంశయము మరియు నిదిధ్యాసనముచే విపరీతభావనలు నివృత్తమై, తత్త్వంపదార్థ శోధనద్వారా బ్రహ్మాత్మైకత్వమును విషయముచేయు "**అహంబ్రహ్మాస్మి**"(బృ.1-4-10)అను చరమవృత్త్యాత్మక అప్రతిబద్ధదృఢఅపరోక్షజ్ఞానము ఉదయించును. దానిచే స్వరూప అజ్ఞానము నష్టమై బ్రహ్మాత్మభావము దృఢపడి జీవన్ముక్తుడగును.

సద్గురుదేవుని సమాధానమును విని సిద్ధనాథుడు మళ్లీ వినయభావముతో ఇట్లు ప్రశ్నించెను. ఓ సద్గురునాథా! "**అహం ఆత్మా**" లేక "**అహంబ్రహ్మాస్మి**" అను జ్ఞానము కలిగినప్పటికీ ద్వైతప్రతిభాస (ద్వైతప్రపంచముయొక్క ప్రతీతి) జ్ఞానికిగూడ అనుభవగోచరమగుచున్నది గదా!ఇట్లు ద్వైతము విద్యమానమైయుండగా ఐక్యజ్ఞానము ఎట్లు సంభవము?

అప్పుడు గురుదేవుడు ఇట్లు సమాధానము చెప్పెను. నాయనా! జీవునికి ఎంతవరకు దేహమునందు ఆత్మబుద్ధి ఉండునో, అంతవరకు ద్వైతప్రతిభాస కలిగియుండును. ఎప్పుడు దేహాభిమానము నష్టమై, స్వదేహమును ఇతరుల దేహమునువలె తనకంటె భిన్నముగా దర్శించునో, అప్పుడు ఐక్యజ్ఞానము సహజముగా కలుగును.

**శ్లో దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్**

**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే** (వరాహోప 2-15/16; ఉపదేశసా 4-5; వే.పం.7-20)

అజ్ఞానదశలో దేహమే ఆత్మయనెడు దృఢజ్ఞానమువలె, దృఢమైనబ్రహ్మజ్ఞానము-శరీరమే ఆత్మయనెడు జ్ఞానమును పోగొట్టునదై, ప్రత్యగాత్మయందే **"అహంబ్రహ్మాస్మి"** యని యెవనికి దృఢపడునో, వాడు ముక్తిని గోరకున్నను సంసారబంధము నుండి విముక్తుడగుచున్నాడు.

ఇచ్చట కించిద్విశేషము గలదు :——↓

**శ్లో॥శాస్త్రేణ నశ్యేత్పరమార్థ బుద్ధిః కార్యక్షమా నశ్యతి చాపరోక్షాత్ ।**

**ప్రారబ్ధనాశాత్ప్రతిభాస నాశో హ్యేవం (త్రిధా)క్రమాన్నశ్యతి చాత్మమాయా ॥**(వరాహోప ౭-౬౯)

పారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము—అను మూడు విధములుగా జగత్ప్రతీతి
యేది గలదో,అందులో

౧.వేదాన్తశాస్త్రముయొక్క అభ్యాసమువలన కార్యసహితమాయయందు పూర్వము అజ్ఞానకాలంలో యే పరమార్థ బుద్ధి(త్రైకాలిక అబాధ్యత్వ జ్ఞానము) ఉండెనో, అది నష్టమై (అనిర్వచనీయము)వ్యావహారికమున్నదను బుద్ధికలుగును.[అనగా,ఎట్లు నిద్రనుండి ఉత్థానమగుటకు పూర్వము (స్వప్న కాలంలో) స్వప్నద్రష్టకు ఘటాదిపదార్థములయందు అర్థక్రియాకారిత్వము (సఫలక్రియా జనకత్వము లేదా వ్యవహార సామర్థ్యము లేదా కార్యక్షమత) ప్రతీతియగునో, అట్లే అపరోక్షజ్ఞానము కలుగుటకు పూర్వము శాస్త్రాభ్యాసముచే (మిథ్య) అనిర్వచనీయముగా తెలియబడిన పదార్థముల యందు గూడ" మిథ్యాఘటముచే మిథ్యా జలముయొక్క ఆనయనరూప వ్యవహారము జరుగుచున్నది. మిథ్యా పుణ్యపాపములచే మిథ్యా స్వర్గనరకములు ప్రాప్తమగును"—అను ఈవిధమైన సఫలక్రియా జనకత్వము (అర్థక్రియాకారిత్వము=వ్యావహారికత్వము) ప్రతీతమగును]

౨.అనిర్వచనీయమున్నందున వ్యావహారికముగా తెలియబడిన మాయయొక్క కార్యక్షమత (అర్థక్రియాకారిత్వ)బుద్ధి యేది గలదో, అది అద్వైత తత్త్వముయొక్క అపరోక్షజ్ఞానముచే నష్టమగును. అప్పుడు, దర్పణములో కనుపించు ముఖప్రతిబింబము మిథ్యయని తెలిసిన మీదటను దర్పణసన్నిధి రూపఉపాధి ఉన్నంతవరకు **బాధితానువృత్తిచే** ప్రతిబింబముయొక్క ప్రతిభాస కలుగునట్లు కార్యసహితమాయయొక్క ***ప్రతిభాస***(ప్రాతిభాసికత్వము)దేహపాతపర్యన్తము జ్ఞానికిగూడకలుగుచుండును.

3.జీవన్ముక్తునికి **"అహం ఆత్మా", "అహంబ్రహ్మాస్మి"** (బృ.1-4-10)యను దృఢాపరోక్షజ్ఞానము కలిగిన తరువాతగూడ దేహాదిక ప్రపంచసహిత మాయయొక్క ప్రతిభాస యేదిగలదో, అది ప్రారబ్ధనాశముచే నష్టమగును. విదేహకైవల్యమునొందును.

ఈ క్రమముచే ఆత్మమాయ (అజ్ఞానము) మూడువిధములుగా నశించును.

సద్గురుదేవునియొక్క సమాధానమును విన్న సిద్ధనాథుడు మళ్ళీ ఇట్లు ప్రశ్నించెను. ఓ సద్గురు దేవా! ఈదృశ్యమాన సంపూర్ణప్రపంచము మాకు ప్రత్యక్షంగా అనుభవగోచరమైయుండగా, మిథ్యా-రూపమని నిశ్చయముగా ఎట్లు తెలుసుకునేది చెప్పండి.

శ్రీ గజదండస్వాములవారు ఉత్తరమిస్తూ, సిద్ధనాథుని శంకకు, వికల్పముచే ప్రతిప్రశ్న చేసాడు. నాయనా సిద్ధా!నీవు యీ నామరూపజగత్తును ప్రత్యక్షమనుచున్నావుగదా! ఈప్రత్యక్షము ఏమి ఇంద్రియ వ్యాప్తియా?(ఇంద్రియములకు ప్రత్యక్షమనుచుంటివా?)లేక వృత్తివ్యాప్తియా?(అంతఃకరణ వృత్తికి ప్రత్యక్షమా?) అథవా చైతన్యవ్యాప్తియా? (చేతనమునకు ప్రత్యక్షమనుచుంటివా?)—ఇట్లు మూడు వికల్పములుచేసి, ఇందులో ఏ ఒక్కటికూడ యుక్తియుక్తము కాదు—అని నిరాకరించు-చున్నాడు.

ఒకవేళ ఇంద్రియవ్యాప్తిచే ప్రపంచము ప్రత్యక్షమనెదవేమో, అది సంభవించదు. ఎందు-కంటే, ఆకాశాది పంచభూతాలు జడములు. అపంచీకృత వ్యష్టిభూతముల సత్త్వగుణ కార్యములు పంచజ్ఞానేన్ద్రియములు. అవియును జడములే. అట్టి జడమైన ఇంద్రియములు జడమైన భూతము-లనుగాని, భూతముల కార్యమగు ఘటపటాదులనుగాని ఎట్లు వ్యాపించగలవు? అనగా, జడమైన ఇంద్రియములచే జడమైన ప్రపంచము ఎట్లు ప్రత్యక్షమగును?

| పంచ భూతములు | సత్త్వగుణకార్యము | రజోగుణకార్యము | తమోగుణకార్యము |
|---|---|---|---|
| ఆకాశము | శ్రోత్రేంద్రియము | వాగింద్రియము | శబ్దవిషయము |
| వాయువు | త్వగింద్రియము | పాణీంద్రియము | స్పర్శవిషయము |
| తేజము(అగ్ని) | చక్షురింద్రియము | పాదేంద్రియము | రూపవిషయము |
| జలము | జిహ్వేంద్రియము | ఉపస్థేంద్రియము | రసవిషయము |
| పృథ్వి | ఘ్రాణేంద్రియము | గుదేంద్రియము | గంధవిషయము |
| సమష్టిపంచభూతములు | అంతఃకరణము | పంచప్రాణములు | శరీరము |

ఒకవేళ అంతఃకరణవృత్తిచే (వృత్తివ్యాప్తిచే) ఈ జగత్తు ప్రత్యక్షమనినచో, అదియును సంభ-వించదు. ఎందుకంటే, అదియును అపంచీకృత సమష్టి భూతముల సత్త్వగుణ కార్యము. గావున, జడమేయగును. జడమైనవృత్తిచే జడమైన ప్రపంచము ఎట్లు ప్రత్యక్షమగును? వృత్తివ్యాప్తిచే ప్రపంచముయొక్క జ్ఞానము కలుగుట అసంభవము. ఒకవేళ "**ఆవరణ భంగార్థా వృత్తిః**" అను అభి-యుక్తోక్తి ( పెద్దల వచనము) ప్రకారము వృత్తికి 'ఆవరణమును నష్టముచేయుట' అను ప్రయోజ-నము కలదనినచో, అట్లయినను,అంతఃకరణవృత్తి చక్షురింద్రియముద్వారా బయల్వెడలి ఘటదేశ

పర్యన్తము వెళ్లి ఘటమును వ్యాపించి ఘటవిషయక ఆవరణమును భంగముచేసి చరితార్థమగును. అంతవరకే వృత్తియొక్క ప్రయోజనము. వృత్తికి ఘటము తెలియబడదు.

జడమైన ఘటమును జడమైన వృత్తి వ్యాపించినచో, ఆ వృత్తికి ఘటజ్ఞానము కలుగదు. ఘటముపై వస్త్రమును కప్పినచో, ఆ వస్త్రమునకు ఘటజ్ఞానము కలుగుతుందా? ఘటము తెలియబడు-తుందా? ఎప్పటికిని తెలియబడదు. కావున, వృత్తివ్యాప్తిచే ప్రపంచముయొక్క ప్రత్యక్షము కాదు.

ఇక,చైతన్యవ్యాప్తిచే ప్రపంచము ప్రత్యక్షమగుననినచో,"**ఆత్మైవాధస్తాదాత్మోపరిష్టాదాత్మా పశ్చాదాత్మాపురస్తాదాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదగ్ం సర్వమ్**"(ఛాం.౭-౨౫-౨);"**మయా తతమి-దం సర్వం జగదవ్యక్తమూర్తినా**"(గీత ౯-4)ఆత్మయే క్రింద, మీద, వెనుక, ముందు, కుడివైపు, ఎడమవైపు, ఇక్కడ అక్కడ అని చెప్పనేల? సర్వత్ర, సర్వమూ ఆత్మయే ఉన్నది. ఇంద్రియములకును, మనస్సునకును గోచరముకాని నాచేత చరాచరాత్మకమగు ప్రపంచమంతయు వ్యాపింపబడి యున్నది–అని ఇత్యాది శ్రుతులు, స్మృతులు చెప్పినట్లుగా చైతన్యమే లోపల బయట అంతట అన్ని వస్తువులలో వ్యాపించి, సర్వస్వరూపమై యున్నది. విషయములందు (ఘటపటాది సకలవస్తువు-లందు) విషయచైతన్యముగాను, వృత్తియందు ప్రమాణచైతన్యముగాను, అంతఃకరణమునందు ప్రమాతృచైతన్యముగాను, ఇది అది యననేల? సర్వత్ర సహజముగా ఏకరసమై నిండి నిభిడీకృతమై చైతన్యము వ్యాపించియున్నది. జ్ఞాత,జ్ఞానము,జ్ఞేయము అంతయునూ ఏకమగు చేతనమే ఉన్నది. "**ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ**"(పైంగలోపనిషత్ 1-1 ; ఛాం.6-౨-1) "**అత్రాఽయం పురుషః స్వయం-జ్యోతిర్భవతి**" (బృ.4-3-౯,14) ఇచ్చట ఈ పురుషుడు (ఆత్మ) స్వయంప్రకాశస్వరూపుడు. నిత్యజ్ఞానస్వరూపుడు. అలాంటప్పుడు ఎవరు ఎవరికి ప్రత్యక్షమని చెప్పగలము. అందుకే,

**యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్** (బృ.4-5-15)

**శ్లో॥స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా ।**

**జ్ఞాతృజ్ఞానాంతరాభావాదజ్ఞేయో న త్వసత్తయా ॥** (వే.పం.3-13)

ఆత్మ నిత్యజ్ఞానస్వరూపమగుటచే స్వయంగా అనుభవరూపమున్నది.మరొకరికి (మరొక దానికి )అనుభావ్యము కాదు. అన్యుల అనుభవమునకు విషయము కాదు. ఎందుకంటే, ఆత్మకంటె అన్యమైన జ్ఞాత ఎవరును లేరు. అందుకే అజ్ఞేయమున్నది. ఆత్మయొక్క అజ్ఞేయత్వమునకు హేతువు దానియొక్క అసత్త్వము=అభావము కాదు. త్రైకాలిక అబాధ్యమగు సద్రూపమున్నది.

**శ్లో॥బాధం నిద్రాదయస్సర్వేఽనుభూయన్తే న చేతరః ।**

**తథాప్యేతేఽనుభూయన్తే యేన తం కో నివారయేత్ ॥** (వే.పం.3-12)

నిద్ర=నిద్రానందము.ఆనందమయము మొదలుకొని అన్నమయకోశపర్యంతము ఐదు కోశ-ములు మాత్రమే ఉపలబ్ధములగుచున్నవి. వీటికంటె అన్యపదార్థము ఉపలభ్ధమగుట (తెలియబడుట) లేదనినచో,అది యుక్తముగాదు. ఏలయనగా, ఎవరియొక్క బలముచే ఆనందమయాదులు ప్రతీత-ములగుచున్నవో, ఆ అనుభవమును ఎవరు నిరాకరించగలరు? "**య ఏవ నిరాకర్తా తస్యైవాత్మ-త్వాత్**" (బ్ర.సూ.భాష్యము1-1-4) ఎవరైతే నిరాకరించుచున్నారో అది వారి స్వరూపమయ్యే ఉండగా, తన్నుతాను ఎలా నిషేధించుకొనగలడు?కావున, నిద్రానందాదులకు సాక్షియై ప్రకాశించుచున్నం-దున, ఆత్మయొక్క అసత్త్వము నిషేధింపబడినది. అందువలన, ఆత్మయొక్క అభావమున్నందున అజ్ఞేయముకాదు. మరేమనగా, స్వయంగా విద్యమానమైయున్నందున తనకంటే భిన్నమైన జ్ఞాత, జ్ఞానముయొక్క అభావమున్నందున[4]అజ్ఞేయమున్నది(జ్ఞానమునకు విషయము కాదు).అనగా, ఆత్మ స్వయంప్రకాశస్వరూపమై ఉన్నది. ఒకవేళ ఈ నామరూపమయ జగత్తు చైతన్యమునందు అధ్యస్తమ-న్నచో, అధ్యస్తము (కల్పితము,మిథ్య,భ్రమరూపము) అగు దృశ్యమాన ప్రపంచము సత్యమెట్లగును.

సద్గురుదేవునియొక్క ఇటువంటి సప్రమాణ, సయుక్తిక, అనుభవసిద్ధమైన సమాధానమును విన్న సిద్ధనాథుడు అంటాడు—ఓసద్గురుదేవా! పైన చెప్పబడిన మూడు విధముల వ్యాప్తి సంభవించ-నిచో, సకలజీవులకు సాధారణంగా అనుభవగోచరమైన జగత్ప్రతీతి ఎట్లగుచున్నది?

ఈ ప్రశ్నకు శ్రీ గజదండస్వాములవారు ఉత్తరమిస్తూ—ప్రత్యక్షము ప్రత్యక్షముచే బాధింపబడు చున్నది, అని చెప్పెను. ఎట్లనగా, బాల్యావస్థ ప్రత్యక్షము. అట్లే యౌవనావస్థగూడ ప్రత్యక్షమున్నది. ప్రత్యక్షమగు యౌవనావస్థ ప్రాప్తముకాగా ప్రత్యక్షమగు బాల్యావస్థ సహజముగానే బాధింపబడును. మరియు వృద్ధావస్థ యౌవనావస్థను బాధించును. అదేవిధంగా ఉత్తర ప్రత్యక్షము కలుగుటతోడనే పూర్వప్రత్యక్షమునకు బాధ కలుగుచున్నది. అనగా, మిథ్యాత్వనిశ్చయము లేదా త్రైకాలిక అభావనిశ్చ యమగుచున్నది.ఉదా:—రజ్జుసర్ప దృష్టాన్తములో,భ్రమప్రత్యక్షమగు సర్పము - అధిష్ఠాన రజ్జుప్రత్యక్ష ము (రజ్జుసాక్షాత్కారము)చే బాధితమగుచున్నది. అట్లే, జగదధిష్ఠానమగు బ్రహ్మసాక్షాత్కారము

---

4 అజ్ఞేయము (జ్ఞానమునకు అవిషయము) మూడు ప్రకారములున్నది. 1.వంధ్యాసుతాదులవలె అసద్వస్తువు, 2.కదా చిద్వృత్తిసంబన్ధరహితము మరియు అజ్ఞానముచే సంబన్ధము గలది, ఉదా:–ఘటాది పదార్థములు, 3.స్వయంప్రకా శము(ఆత్మ). ఆత్మ అసత్పదార్థము కాదు. సర్వాధిష్ఠానమగుటవలన, అధిష్ఠాన అధ్యస్తములు సర్వదా సంబద్ధమై యుండును. కావున, కదాచిద్వృత్తిసంబన్ధరహితముకాదు. మరియు అసంగము, స్వయంప్రకాశముగాన సూర్యుని యందు అంధకారముయొక్క సంబన్ధములేనట్లు, అజ్ఞానసంబన్ధము గలది కాదు. అది సద్రూపమై, సర్వదావృత్తి మరియు అజ్ఞానముచే వాస్తవసంబన్ధరహితమున్నది. అందుకే అది స్వయంప్రకాశమున్నందువల్లనే అజ్ఞేయమున్నది. వేరు ప్రకారముచేత కాదు.

( ప్రత్యగభిన్నముగా=అపరోక్షముగా)ఎప్పుడు కలుగునో,తత్క్షణమే మిథ్యాప్రత్యయరూప నామరూపమయ దృశ్యప్రపంచముయొక్క ప్రత్యక్షము బాధింపబడుచున్నది.

అప్పుడు సిద్ధనాథుడు సద్గురుదేవునితో విషయాంతరమును చర్చింపగోరి ఇలా అంటున్నాడు. ఓసద్గురుదేవా! కర్మకాండానుసారము ఇంతదనుక లింగగ్రహణముచేసియున్నాను. ఇప్పుడు జ్ఞానకాండానుసారము జ్ఞానమును పొందినపిమ్మట లింగమును ధరించుట వ్యర్థమే గదా. అని యిట్లు చెప్పి, తాను ధరించియున్న లింగమును తీసి సద్గురుదేవుని చరణములయందు ఉంచెను (సమర్పించెను).

శ్రీ గజదండస్వాములవారు–సిద్ధా! నీవు చేస్తున్నది శాస్త్రవిరుద్ధము నాయనా! అన్నాడు.

దానికి సిద్ధనాథుడు ప్రత్యుత్తరమిస్తూ–చిన్మయదీక్షను పొందిన పిమ్మట ఆత్మతోసహా అనాత్మ యగు శరీరముగూడ చైతన్యరూపమే అగునని శాస్త్రము చెబుతుంది.

**శ్లో॥లింగమధ్యే జగత్సర్వం సర్వం లింగమయం జగత్ ।**

**లింగబాహ్యేత్పరం నాస్తి తస్మాల్లింగమహం సదా ॥**

లింగమునందే యీ నామరూపాత్మక సకల జగత్తు వ్యాపించి యున్నది. జగత్తంతా లింగస్వరూపమే. లింగమును విడిచి భిన్నంగా కొంచెముగూడ లేదు. కావున, నేను నిత్య లింగస్వరూపుడను. ఎవరు నిర్వాణభావమును (పరమానందరూప బ్రహ్మసుఖమును) పొందినారో,అటువంటి జీవన్ముక్తునికి జ్ఞానమును పొందుటకు శ్రవణ మనన నిదిధ్యాసములయొక్క అపేక్షగాని, కర్మలు చేయుటయందుగాని ఏమాత్రము కర్తవ్యము లేదు.

ఈవిషయమును శ్రీజగద్గురువు శంకరాచార్యులవారు భాష్యములో ఇట్లు తెలిపియున్నారు. **"పరమార్థవిజ్ఞానే ఫలాదర్శనే క్రియానుపపత్తేః । పరం హ్యేప్తకామం సంసారదోషవర్జితం బ్రహ్మాహమస్మీత్యాత్మత్వేన విజ్ఞానే, కృతేన కర్తవ్యేన వా ప్రయోజనమాత్మనోఽపశ్యతః ఫలాదర్శనే క్రియా నోపపద్యతే".**(ఐతరేయోపనిషత్-సంబన్ధభాష్యే)

యథార్థముగా బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము ప్రాప్తించిన మీదట కర్మ సమాప్తమగును.

**శ్లో॥జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।**

**నైవాస్తి కించిత్కర్తవ్యమస్తిచేన్న స తత్త్వవిత్ ॥** (జాబాలదర్శనోపనిషత్ 1-23)

**శ్లో॥యస్త్వాత్మరతిరేవస్యాదాత్మతృప్తశ్చ మానవః ।**

**ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥** (గీత.3-17)

ఆత్మజ్ఞాని బ్రహ్మచర్యాది ఆశ్రమములకుగాని, బ్రాహ్మణాది వర్ణములకుగాని, ఏ గోత్రమునకుగాని చెందనివాడుగా ఉంటాడు. జ్ఞానముచే స్వరూపాజ్ఞానము నష్టమైనందున నిరావరణ స్వరూపుడై ఉండును. ఏవిధమైన కర్తవ్యము లేదు.గావున అకర్మ (నిష్క్రియ) రూపుడునై యుండును.

శరీరమునందు అహంత్వ మమత్వ బుద్ధిలేనివాడై నిరభిమానవృత్తి గలిగియుండును. ఆత్మరూప ఆకాశమునందు అంతఃకరణము నిరంతరము విలీనమై యుండును. ఎవరికి ఫలాపేక్ష ఉండునో, అతనికి కర్మలయందధికారముండును. జ్ఞానికి మోక్షాకాంక్షసహితము నివృత్తమైనందున ఏవిధమైన ఫలాపేక్ష ఉండదు. కావున, ఎట్టి కర్తవ్యమునూ లేదు. కర్మాధికారికి 1.దేహాభిమానము ఉంటుంది. ౨.కర్మఫలాభిసంధి (ఫలాపేక్ష) ఉంటుంది. 3.కర్మత్యాగముచే ప్రత్యవాయ (పాప) భీతి లెస్సగా ఉంటుంది. ఈ మూడును జ్ఞానిపురుషునకు ఉండవు.

సిద్ధనాథునియొక్క ఇటువంటి ఆత్మానుభూతి సంభాషణమును విని సద్గురుదేవుడగు శ్రీగజదండస్వామి తనలో తాను "సిద్ధనాథునియొక్క వృత్తి సంపూర్ణంగా నిర్గుణపరబ్రహ్మచైతన్య-మునందు ఆరూఢమైనది" అని తెలిసికొని—ఇతనికి "**సిద్ధారూఢుడు**" అను పేరు అన్వర్థమై యథా-యోగ్యముగ శోభించునని తలంచి, సిద్ధనాథునితో ఇట్లనెను. సిద్ధనాథా! నీవు నాతో సమానమైన ఆరూఢస్థితిని పొందినావు. ఇకనుండి నీవు "**సిద్ధారూఢుడు**" అను బిరుదముచే (పేరుతో) పృథివి-యందు విలసిల్లుదువు గాక! నీకు కలిగిన ఏ జ్ఞానమున్నదో, అది శ్రీ మల్లికార్జున మహాస్వామి-యొక్క అనుగ్రహముచే నీ హృదయంలో ఎల్లప్పుడూ దేదీప్యముగా ప్రకాశింపబడుతూ స్థిరపడి ఉండుగాక! దానిని సకల ముముక్షులోకమునకు ఉపయోగపరిచి, వారిని ఉద్ధరించుదువు గాక! ఇట్లు శ్రీగజదండస్వాములవారు సిద్ధనాథుని ఆశీర్వదించి, మహదానందపరవశుడై సిద్ధనాథున్ని ఆలింగనము చేసికుంటాడు. ఆసమయంలో ఇద్దరు పరస్పరము ఆనందడోలికలలో ఓలలాడిరి. ఆనందభాష్పములు రాల్చిరి.

అటుపిమ్మట సిద్ధనాథుడు శ్రీగురుదేవునియొక్క దివ్యపాదారవిందములకు సాష్టాంగ ప్రణా-మములాచరించి, గద్గద కంఠముతో, పరవశమైన హృదయముతో ఇట్లనెను. ఓ సద్గురుదేవా! నన్ను కృతార్థున్ని జేసితివి.మీయొక్క కృపాకటాక్షముచే నా జీవభావము సమూలముగా నష్టమైనది. మీయొక్క దర్శనప్రాప్తి కొఱకు నేను యేయే దుఃఖములననుభవించితినో, అవన్నియు ఈనాటికి సార్థకమాయెను. మీ చరణసాన్నిధ్యము ప్రాప్తించుటతోడనే నాయొక్క అనేక జన్మల కర్మరాశి క్షణకాలంలో భస్మమైపోయింది. సిద్ధనాథుడు ఇట్లు చెప్పుచుండగనే ఇరువురి నేత్రములవెంట అశ్రు-పాతము రాదొడగెను. శ్రీ గజదండస్వాములవారు ప్రేమభరితహృదయముతో, దృఢమైన అనురా-గముతో సిద్ధనాథుని మళ్ళీ కౌగలించుకొనెను.

ఈ అధ్యాయములో సిద్ధనాథుడు సద్గురుదేవునియొక్క అపారమైన కృపచే అద్వితీయమగు ప్రత్యగభిన్న పరబ్రహ్మస్వరూపమును యథాతథముగ తెలిసికొని కృతార్థుడాయెను. ఏ ముముక్షు జనులు శ్రద్ధాభక్తిపురఃసరులై ఈ అధ్యాయమును శ్రవణము చేయుదురో, వారియొక్క ద్వైతభావము నిరసింపబడి నిస్సంశయముగా బ్రహ్మైకత్వ విజ్ఞానమును పొంది కృతార్థులగుదురు గాక!

మంగళకరమైన శ్రీసిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినచో సకలపాపములు భస్మీభూతములగును. శ్రీ శివదాసస్వామి మధురాతిమధురమైన ఈనాలుగవ అధ్యాయమును శ్రీసిద్ధనాథుని దివ్యచరణకమలములకు సమర్పిస్తూ ఉపసంహరించుచున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు





**ॐ శ్రీ గణేశాయ నమః ॐ శ్రీ సిద్ధారూఢాయనమః ॐ శ్రీ సరస్వత్యై నమః**




**పద్యానువాదము:—** ॐ శ్రీ సిద్ధయోగీంద్రులు ఎల్లప్పుడూ వేదాంత జ్ఞానమందు నిమగ్నులై, స్వస్వరూపమునందే విశ్రమిస్తూ, దీనజ్ఞానార్థిభక్తులను ఉద్ధరించడానికి తీర్థయాత్ర నిమిత్తమై బయలు దేరినాడు. ఏది సకలజీవులకు ప్రాణాధారమై ఉన్నదో, అదే అఖిల బ్రహ్మాండమంతట వ్యాపించిన "**చైతన్యము**". దానిని ఇంద్రియసమూహము (కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు) తెలుసుకో జాలవు. దానియొక్క స్ఫూర్తియే ఇంద్రియాలయందు ఇంద్రియజ్ఞానమై ఉంది.ఆ చైతన్యమే అంతకరణమునకు సాక్షియై ఉన్నది. సమాధియందు ప్రకాశస్వరూపమై వెలుగొందున్నది. సకల వృత్తులు నిశ్శేషముగా ఎక్కడ నివృత్తి అవుతున్నవో, అదే స్వస్వరూపము (ఆత్మ) అని చెప్పబడినది. చైతన్యము ఏకమే-యైనను జాగ్రదవస్థయందు జగద్రూపములో భాసిల్లుచున్నది. జగత్తును భాసించేదిగూడ (తెలుసు కొనేది)ఆ చైతన్యమే. తానుతానుగా ఉండి ప్రపంచరూపముగా కనిపించుచున్నది.అయినా ఈ నా-మరూప ప్రపంచము అజ్ఞానకల్పితము గావున, వాస్తవానికి ద్వైతములేదు. కల్పితము అధిష్ఠాన-ముకంటె భిన్నము కాదు, మరేమనగా అభిన్నమే. అందుకే అధిష్ఠానమగు అద్వితీయ బ్రహ్మమే అవశిష్టమై ఉండును. రజ్జువునందు భాసించు సర్పము రజ్జువుకంటె వేరుగా లేదుగదా!

***అధిష్ఠానావశేషో హి నాశః కల్పిత వస్తునః ।***

***భావస్యైవ హ్యభావత్వం నాశోఽభావస్య భావతః ॥*** (సూతసంహిత యజ్ఞవైభవఖండము ౨-౮)

ఓ సద్గురునాథా! నీవు కేవలం బ్రహ్మస్వరూపుడవు. నిర్మలమైన ఓ సద్గురుదేవా! భవసాగర-మునుండి ముముక్షుజనులను తరింపజేయుటకై నీవు సగుణరూపంలో అవతరించి ఈప్రపంచమం-దు సంచరిస్తున్నావు. గత నాల్గవ అధ్యాయముయొక్క కథానుసారము సద్గురువైన శ్రీగజదండ మహాస్వామి సిద్ధనాథునియొక్క ఆరూఢస్థితిని, అధికారమును గుర్తించి సిద్ధనాథునికి "**సిద్ధారూఢుడు**" అనే అన్వర్థబిరుదముచేనలంకృతుని చేసాడు.

శ్రీగజదండస్వామి—సిద్ధనాథుడు పొందిన యథార్థమైన జ్ఞానస్థితిని ముముక్షుజనులంద-రికీ బోధించు ఉద్దేశ్యముతో—తీర్థయాత్రలు చేయమని సిద్ధనాథుని ఆజ్ఞాపిస్తాడు.తీర్థములలో, పుణ్య-

క్షేత్రములలో కలిసినటువంటి సాధు, సజ్జనులద్వారా ఆత్మచర్చను (జీవపరమాత్మలయొక్క విచారము) యథార్థముగాచేస్తూ, వేదాంత[5]సిద్ధాంతము[6]ను తెలియపరచుమని ఆశీర్వదిస్తాడు.

సిద్ధనాథుడు సద్గురుదేవునియొక్క ఆశీర్వచనములను శిరసావహించి,**"మీయొక్క అభిప్రాయమును తప్పకుండా నెరవేరుస్తాన"**ని ఒప్పుకొని, స్వామియొక్క ఆజ్ఞను గైకొని తీర్థయాత్రలకు బయలుదేరి, కిష్కింధ (హంపి)కి వెళ్లి "**విరూపాక్షుని**" దర్శించి, హేమకూట పర్వతమెక్కి అచ్చట ఒక గుహను చూసినాడు.

"**కరస్థనాగలింగము**" అనే దేవస్థానమును దర్శించి, మనమున ఎంతో సంతసించి, అక్కడ సమాధిని శీలించుటకై ఏకాంత ప్రదేశమందు కూర్చుండెను. ఒక్కొక్క అంశమును క్రమక్రమంగా సాధిస్తూ సప్తాంగయోగమును సాధించి,మరొక్కసారి 'కరస్థనాగలింగము'ను దర్శించి, అక్కడనుండి "**పంపా**"క్షేత్రమునకు చేరుకొని,"**విరూపాక్షుని**"దర్శించి,వశిష్టమహాముని ఆశ్రమమును చూసి, అక్కడ ఆనందపరవశుడై మూడు రోజులుండెను.అక్కడనుండి "**గంధమాదన**" పర్వతమును దర్శించి, అక్కడున్న ఋష్యాశ్రమములకు వెళ్తూ, "**స్ఫటికశిల**"ను దర్శించాలనే దిదృక్షచేత అచ్చటకి వెళ్ళెను. ఈ స్థలము తపోభూమి అవునా? కాదా? అని పరీక్షించడానికి, తొమ్మిది రోజులు అన్నపానాదులను త్యజించి ధ్యానమందు నిమగ్నుడయ్యెను. అయినాగాని ఆయనకు ఆకలి దప్పికలు మొదలగు శరీరసంబంధ బాధలు ఏమియు కలగలేదు. మరియు, సంశయవిపరీతభావన, లయవిక్షేపాది సకలయోగ✵ విఘ్నములు ఏమియు లేకుండా, ధారవాహిక చిత్తవృత్తి ప్రవాహముచే "**బ్రహ్మాకార**"స్థితిని పొందెను.

---

**✵విశేషము:—**

**సమాధి విఘ్న విచారము:—**

అద్వైతావస్థానరూప నిర్వికల్ప సమాధియందు నాలుగు విఘ్నములు గలవు; వానిని తిరస్కరించుటకొఱకు-ఆ విఘ్నములను లక్షణసహితముగా చెప్పుచున్నాము—మొదటిది లయము, రెండవది విక్షేపము, మూడవది కషాయము, నాల్గవది రసాస్వాదము.

**శ్లో ఉపాయేన నిగృహ్ణీయాద్విక్షిప్తం కామభోగయోః**

---

5 వేదములయొక్క అన్త్యభాగము, అవసానభాగము, వేదశిరస్సులు వేదాన్తములు–ఉపనిషత్తులు. **"వేదాన్తోనామోపనిషత్ప్రమాణం తదుపకారీణి శారీరకసూత్రాదీని చ"**(వేదాన్తసారము) ఆత్మవిషయక ప్రమకు (యథార్థ జ్ఞానమునకు) కరణమగు (ప్రమాణమగు) ఉపనిషత్తులే "**వేదాన్త**" శబ్దముచే చెప్పబడుచున్నవి. అట్లే 'బ్రహ్మాసూత్రములు' మరియు 'శ్రీమద్భగవద్గీత' ఇత్యాదులు గ్రహించదగును.

6 వాది ప్రతివాదిచేతగాని, గురుశిష్యులచేతగాని ప్రామాణికత్వముగా నిర్ణయించబడిన (స్వీకరించబడిన) అర్థమును సిద్ధాన్తమందురు.

**సుప్రసన్నం లయే చైవ యథాకామో లయస్తథా**

**శ్లో దుఃఖం సర్వమనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్**

**అజం సర్వమనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి**

**శ్లో లయే సంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః**

**సకషాయం విజానీయాత్సమప్రాప్తం న చాలయేత్** (మాం.౩-౪౪)

**శ్లో నాస్వాదయేత్సుఖం తత్ర నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్**

**నిశ్చలం నిశ్చరచ్చిత్తమేకీ కుర్యాత్ప్రయత్నతః**

**శ్లో యదా నలీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః**

**అనిఙ్గనమనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తదా**

**—:లయవిఘ్న నిరూపణము:—**

ఆలస్యముచేత, లేక నిద్రచేత వృత్త్యభావము, లయమనఁబడును; ఆ లయము సుషుప్తితో సమానమగు అవస్థయగును; నిరావరణ బ్రహ్మానందముయొక్క భానము గానేరదు; అందువలన నిద్రాలస్యాది నిమిత్తమువలన వృత్తి తన యుపాదానమైన అంతఃకరణమందు లీనమైనట్టు కనబడి-నపుడు యోగి సావధానుడై నిద్రాదికము నిరోధించి, వృత్తిని మేలుకొల్పవలయును; ఈరీతిగా లయరూప విఘ్న విరోధియైన వృత్తియొక్కప్రవాహరూపమగు జాగరణ యేదిగలదో, దానిని గౌడపాదాచార్యులు ❋ చిత్తసంబోధనమని చెప్పిరి.

❋ శ్రీశంకరాచార్యులవారు శ్లోకద్వయముచే సమాధియొక్క అష్టవిధ విఘ్నములు తెలుపుచున్నారు.

**శ్లో॥సమాధౌ క్రియమాణేతు విఘ్నాన్యాయాంతి వై బలాత్ ।**

**అనుసంధాన రాహిత్య మాలస్యం భోగలాలసా ॥**

**భయం తమశ్చ విక్షేప స్తేజఃస్పందశ్చ శూన్యతా ।** (సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము ।

**ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః ॥** (౯౨౧ నుండి ౯౨౩)

**భావార్థము:—**1.అనుసంధానభంగము 2.ఆలస్యము 3.భోగేచ్ఛ, 4.భయము 5.నిద్ర 6.కల్పన 7.చిత్తచాంచల్యము 8.శూన్యత ఇవి అష్టవిధ విఘ్నములు.

డేగకు, లేక పిల్లికి భయపడి, చటకము(పిచ్చుక) లేక ఎలుక గృహమును ప్రవేశించినపుడు భయవ్యాకులమగుటవలన దానికి గృహములోపల స్థానము గనబడదు; కనుక పలుమాఱు బయట కువచ్చును, లోపలికి పోవును; ఈప్రకారముగ వర్తనముచేయుచు చేయుచు తుదకు వెలుపలికి వచ్చి, మరణమును పొందుచున్నది; అట్లు, అనాత్మపదార్థములను దుఃఖహేతువని ఎఱిగి, అద్వైతా-

నందమును విషయము చేయుటకొఱకు అంతఃకరణవృత్తి అంతర్ముఖమయినను, అచ్చట వృత్తివిషయమైన చైతన్యము అతిసూక్ష్మమగుటవలన కించిత్కాలము వృత్తికి నిలుకడ లేనియెడ, తత్కాలమందే చైతన్యస్వరూపానందముయొక్క లాభము కాదు; కనుక తొందరపడి, వృత్తి బహిర్ముఖమగును; ఈరీతిగా బహిర్ముఖమగునట్టి వృత్తిని **విక్షేప** మందురు.

తద్వృత్తిస్థిరతను పొందినగాని, స్వరూపానందముయొక్క లాభము కాదు; కాబట్టి అంతర్ముఖమైన వృత్తి ఎంతకాలము వఱకు బ్రహ్మాకారముకాదో, అంతకాలమువఱకు బాహ్యపదార్థములందు దోషభావనచేసి, యోగి వృత్తిని బహిర్ముఖముగానీయక అంతర్ముఖముగా స్థాపింపవలయును; ఈరీతిగా విక్షేపరూప విఘ్నముయొక్క విరోధియైన యోగియొక్క ప్రయత్నము ఏది గలదో,అది గౌడపాదాచార్యులచేత శమమని చెప్పబడినది.

**——:కషాయవిఘ్న నిరూపణము:——**

రాగాదిదోషమును కషాయమందురు.

**ఇచ్చట ఈ యాశంక గలదు**—రాగాదికము ద్వివిధము—మొదటిది బాహ్యము, రెండవది ఆంతరము.పుత్ర స్త్రీ ధనాదులగు ఎన్నివిషయములు వర్తమానములుగా నున్నవో,అవన్ని బాహ్యము, మఱియు భూత(జరిగిన)విషయముయొక్క, లేక భవిష్యద్విషయముయొక్క చింతనరూపమైన మనోరాజ్యము ఆంతరము; ఆ రెండు ప్రకారముల రాగాదికము సమాధియందు ప్రవృత్తుడైన యోగియందు సంభవింపదు?

ఏలయన:—చిత్తమునకు పంచభూమికలు గలవు. మొదటిది క్షేపభూమిక, రెండవది మూఢభూమిక, మూడవది విక్షేపభూమిక, నాల్గవది ఏకాగ్రభూమిక, ఐదవది నిరోధభూమిక. (1) 1.లోకవాసన7, ౨.దేహవాసన8, 3.శాస్త్రవాసన౯—ఇవి మొదలుకొని రజోగుణపరిణామమైన దృఢ

---

శ్లో ॥లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనమ్ ।

శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు ॥

శ్లో ॥లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయాపిచ ।

దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే ॥ (వి.చూ.271 & 272 ; అధ్యాత్మో 3 ; ముక్తికో. ౨-౨)

7 ఎప్పడును నన్ను నిందించకూడదు; సర్వులు స్తుతియేచేయవలెనను–ఈయాగ్రహముయొక్క దృఢసంస్కారము లోకవాసనయగును.

8 స్థూలదేహముయొక్క, లేక సూక్ష్మదేహముయొక్క రోగాదిరూపము, లేక పాపరూపమగు మలమేదిగలదో,దానిని ఔషధాదికముచేత లేక తీర్థాటనముచేత నిశ్శేషనివారణము చేయవలయును; మఱియు దీనియందు పుష్ట్యాదిరూపము, లేక పుణ్యరూపమగు గుణములు సంపాదనము చేయవలయునను–ఈ యాగ్రహముయొక్క దృఢసంస్కారము–దేహవాసనయగును.

అనాత్మ వాసనను "**క్షేప**" మందురు.

(2)నిద్రాలస్యాది తమోగుణ పరిణామమును "**మూఢ**"మందురు.

(3)ధ్యానమందు ప్రవృత్తమైనచిత్తముయొక్క కదాచిద్బాహ్యప్రవృత్తిని "**విక్షేప**"మందురు.

(4)అంతఃకరణముయొక్క అతీతపరిణామము, మఱియు వర్తమానపరిణామము ఈ రెండు సమానాకారమగుట ఏకాగ్రమందురు.ఈ యేకాగ్రముయొక్క లక్షణము యోగసూత్రమందు పతంజలి చెప్పియున్నాడు; దానియభిప్రాయము:—సమాధికాలములో యోగియొక్క యంతఃకరణమందు ఏకాగ్రతగలదు; ఆ యేకాగ్రత ప్రవృత్త్యభావరూపముగాదు; అయినను, అంతఃకరణముయొక్క ఎన్ని పరిణామములు సమాధికాలమందగునో, అవన్నియు బ్రహ్మమునే విషయముచేయును; అందువలన అంతఃకరణముయొక్క అతీతపరిణామము,మఱియు వర్తమానపరిణామము కేవల బ్రహ్మాకారమగుట వలన సమానాకారమగును; దానిని "**ఏకాగ్రత**" యందురు.

(5) పై చెప్పబడిన ఏకాగ్రతయొక్క వృద్ధిని "**నిరోధ**" మందురు.

ఈ ఐదుభూమికలు అంతఃకరణమునకు గలవు.[భూమికయనగా యవస్థ].

ఈపంచభూమికలతో గూడిన అంతఃకరణమునకు క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అనిపేర్లు. వీనిలో క్షిప్తమూఢాంతఃకరణములకు,సమాధియందధికారము లేదు; విక్షిప్తాంతఃకరణమునకు అధికారముగలదు; ఏకాగ్రము, నిరుద్ధము ఈరెండు అంతఃకరణములు సమాధి కాలమందుగలవు; ఈవిధముగా యోగగ్రంథమునందు చెప్పబడియున్నది.

**ప్రశ్న**:—రాగాదిదోష సహితాంతఃకరణము క్షిప్తముగానేయున్నది; దానికి యోగమందధికారము లేదు; కనుక రాగాదిదోషరూప కషాయము సమాధికి[10] విఘ్నమనుట సంభవింపదు.

---

9 సర్వశాస్త్రముయొక్క పాఠమును, లేక తదుక్తాచరణమును నేను చేయవలయునను–ఈ యాగ్రహముయొక్క దృఢసంస్కారము–శాస్త్రవాసనయగును.

10 ఏపురుషునకు రాజువద్దపోవుటకు అధికారము గలదో, వానిని ద్వారపాలకుడు అడ్డగించెను; ఇట్లు చెప్పుట సంభవించును; ఎవ్వరికి అచ్చట పోవుటకు అధికారమే లేదో, వానిని ద్వారపాలకుడు అడ్డగించెనని చెప్పుట సంభవింపదు; అట్లు క్షిప్తాంతఃకరణునకు సమాధియందు అధికారముండినపుడు వానికి రాగాదిరూప కషాయము సమాధివిఘ్నమని చెప్పనగును; ఎందువలన క్షిప్తాంతఃకరణునికి సమాధియం దధికారమేలేదో, అందువలన వానికి కషాయము సమాధివిఘ్నమని చెప్పుట సంభవించదు.

**దానికి సమాధానము:—**బాహ్యాంతరరూపమైన11 రాగాదికములు క్షిప్తాంతఃకరణమందే గలవు; ఆ యంతఃకరణమునకు సమాధియందధికారమేలేదు; అయినను, అనేక జన్మములందు పూర్వానుభూతములైన బాహ్యాంతరరాగద్వేషములయొక్క సూక్ష్మసంస్కారము విక్షిప్తాద్యంతఃకరణ-మందును సంభవించును; రాగద్వేషములకు పేరు కషాయముగాదు; మరేమనగా, రాగద్వేషాదుల యొక్క సంస్కారమునే **"కషాయ"**12మందురు; ఆ సంస్కారము ఎదివఱకు అంతఃకరణముం-డునో, అదివఱకు దూరముగానేరదు; సమాధికాలమందును అంతఃకరణముగలదు; కాబట్టి సంస్కారముగూడ ఉన్నది, అయితే, ఉద్భూతసంస్కారము సమాధికి విరోధిగా నున్నది; కాని, అనుద్భూతసంస్కారము విరోధిగాదు. [ప్రకటమును ఉద్భూతమందురు; అప్రకటమును అనుద్భూత-మందురు].

విక్షేపమునకును, కషాయమునకును ఈ భేదము గలదు.బాహ్యవిషయాకారవృత్తిని **విక్షేప** మందురు; యోగియొక్క ప్రయత్నమువలన వృత్తి యంతర్ముఖమైనను, రాగాదికముయొక్క ఉద్భూత సంస్కారమువలన అంతర్ముఖమైన వృత్తియును బ్రహ్మాకారముగాక, తటస్థమగును; దానిని **కషాయ** మందురు. విషయమందు దోషదర్శనసహితమైన యోగియొక్క ప్రయత్నమువలన **కషాయవిఘ్నము** యొక్క నివృత్తియగును.

**——: రసాస్వాదవిఘ్న నిరూపణము :——**

రసాస్వాదమున కిది యర్థము—యోగికి బ్రహ్మానందముయొక్క అనుభవమగుచున్నది, మఱియు విక్షేపరూపదుఃఖనివృత్తియొక్కయు అనుభవమగుచున్నది; లోకమునందు దుఃఖనివృత్తిని గూడ ఆనందమందురు; దానికి దృష్టాంతము:—భారవాహిపురుషుడు భారముదించుటవలన ఆనందానుభవము నొందుచున్నాడు; అచ్చట ఆనందమందు ఇంకొక హేతువు లేదు; భారజన్య దుఃఖముయొక్క నివృత్తివలననే వాడిట్లు ఎఱుగుచున్నాడు–"నా కానందమయినది" ఈప్రకారముగా

11 ఉద్యుక్తము,ఆశారూపము,వాసనారూపము అను భేదముచే రాగాదికము త్రివిధము——

(1) బాహ్యప్రవృత్తికి హేతువైన రాగాదికము ఏది గలదో,దానిని ఉద్యుక్తమందురు. దానినే బాహ్యమనియు అందురు.

(2)మనోరాజ్యరూపమైన రాగాదికము ఏది గలదో, దానిని ఆశారూపమందురు. దానినే ఆంతర మందురు.

(3) జన్మాంతరమందు అనుభూతమైన రాగాదికముయొక్క సంస్కారమేది కలదో; దానిని వాసనారూప మందురు.

వీనియందు వాసనారూపరాగాదికము ఉద్భూతానుద్భూత భేదముచే ద్వివిధముగా నున్నది;

12 దానిలో ఈదృష్టాంతము గలదు. రాజును చేరుటకొఱకు గృహమునుండివెడలిన ఒకానొకధనికుని రాజ ద్వారమందు ద్వారపాలకుడు అడ్డగించెను; అట్లు సర్వవిషయములనుండి ఉపరమించి, నిర్వికల్పసమాధి యొక్క యానందము కొఱకు అంతర్ముఖమయిన యోగియొక్క మనస్సు ఏదిగలదో, దానిని మధ్యమందు ఉద్భూత రాగాదుల సంస్కారరూప కషాయము అడ్డగించుచున్నది; కనుక అది సమాధికి విఘ్నము.

నివృత్తియును ఆనందరూపమని కనబడుచున్నది; అట్లు యోగికిసమాధియందు విక్షేపజన్యదుఃఖము యొక్క నివృత్తివలన ఏయానందమగుచున్నదో, ఆ యానందానుభవమును రసాస్వాదమందురు.

దుఃఖనివృత్తిజన్యమైన ఆనందానుభవమందే యోగి అలంబుద్ధి చేయునెడ, సకలోపాధిరహితమగు బ్రహ్మానందాకారవృత్తియొక్క అభావమువలన సమాధియందు వానికి బ్రహ్మానందము లభ్యముగాదు; కనుక ఉక్త రసాస్వాదము సమాధికి విఘ్నమని చెప్పబడినది.

వాంఛితార్థప్రాప్తి కలుగకయే, విరోధ్యర్థనివృత్తివలన ఆనందోత్పత్తియందు అన్యదృష్టాంతము చెప్పుచున్నాము:—పృథ్వియందు నిధిగలదు;ఆ నిధి విషధరసర్పముచేత రక్షితమయియున్నది;అచ్చట నిధిప్రాప్తికాకముందే, తద్విరోధి సర్పనివృత్తివలన ఆనందమగుచున్నది; అపుడు సర్పనివృత్తిజన్యానందమందు అలంబుద్ధి చేసినట్టయిన, ఉత్తరోద్యమ త్యాగముచే నిధిప్రాప్తియొక్క పరమానందము ప్రాప్తము గాదు .

అట్లు, అద్వైతబ్రహ్మరూపనిధి గలదు;దానిమీద దేహాద్యనాత్మ ప్రతీతిరూపవిక్షేపము ఏది గలదో, అది సర్పముగా నున్నది; ఆ సర్పనివృత్తిజన్యమైన అవాంతరానందరూప రసముయొక్క అనుభవరూపాస్వాదము ఏది గలదో, అది నిధిరూప బ్రహ్మప్రాప్తికి ప్రతిబంధక మగుటవలన దానిని విఘ్నమందురు.

లేక రసాస్వాదమునకు మఱియొక అర్థమిట్లున్నది—సవికల్పసమాధ్యనంతరము నిర్వికల్ప సమాధియగును; సవికల్ప సమాధియందు ఏ యానందము ప్రాప్తమగునో, ఆయానందము త్రిపుటీ రూపోపాధిసహితమగుటవలన సోపాధికమందురు; నిర్వికల్పసమాధియందు త్రిపుటీ ప్రతీతి కాదు గాన, దానియందుగలుగు ఆనందము నిరుపాధికము; సమాధినిశీలించు యోగి, ఆ సోపాధికానందమును విడువక, దానియందే రమమాణుడై యుండును; కనుక దానిని రసాస్వాద మందురు.

పూర్వము చెప్పబడిన విక్షేప నివృత్తిజన్యానందానుభవముగానీ, లేక సవికల్ప సమాధియొక్క ఆనందానుభవముగానీ—ఈ రెండుప్రకారములగు రసాస్వాదము నిర్వికల్ప సమాధియొక్క పరమానందానుభవమునకు విరోధియగుటవలన విఘ్నముగానున్నది; కనుక యోగి, ఆ ద్వివిధానంద మును విడువవలయును .

ఈరీతిగా నిర్వికల్పసమాధియందు లయ, విక్షేప, కషాయ మరియు రసాస్వాదమను నాలుగువిఘ్నములు గలవు; ఈ విఘ్నములు సమాధియొక్క ఆరంభమందు కలుగుచున్నవి; కాబట్టి సావధానముగా వీనిని పరిహరింపవలయును. (శ్రీవిచార సాగరము నుండి) అస్తు. ప్రకృతమనుసరామః.

---

ఇటువంటి సమాధిస్థితి(బ్రాహ్మీస్థితి)తపోభూమియొక్క లక్షణమని తెలుసుకొని, సత్యముగా ఇది తపోభూమియే ఉన్నదని నిశ్చయించుకొని,అక్కడనుండి తీర్థయాత్రలు ముందుకు కొనసాగిస్తూ "**పంపా**" సరోవరమునకు చేరుకొనెను. సిద్ధనాథుడు ఆ "**పంపా**"సరోవరమందు స్నానమాచరించి,

శ్రీరామచంద్రునకు సాష్టాంగ నమస్కారములు చేసినాడు. చక్రతీర్థము, వాలిబండారము దర్శిస్తూ "**చింతామణి**" ఆశ్రమమునకు చేరుకున్నాడు.

ఆ ఆశ్రమమునందు అనేక సత్పురుషులయొక్క సంబంధము కలిగింది. వారితో అనేక విధ-ములుగా ఆత్మవిషయక సంవాదములు(వాదోపవాదములు)చేస్తాడు. అందులో ఒకరు సిద్ధనాథుని— ఆత్మ అనగానేమి? అని ప్రశ్నిస్తాడు.

అందులో శాస్త్రసంస్కారహీనుడైన మరొకడు(దేహాత్మవాది)అందరికీ దేహమే "**నేను**" అనే భావన దృఢంగా ఉంది. కావున దేహమే ఆత్మ అని తెలుసుకో! అని ఆ కర్మిష్ఠి బ్రాహ్మణుడంటాడు.

అప్పుడు ఇంకొకరు అతన్ని ఈ విధంగా అడుగుతాడు. దేహమే ఆత్మ అంటివి. నీవు శరీర-మును తెలుసుకొని "**నేను**" అని అన్నావా?లేక శరీరమును తెలుసుకోకుండానే శరీరమును "నేను" అని అన్నావా? చెప్పుము. ఒకవేళ నీవు శరీరమును తెలుసుకొని "**నేను**" అన్నానని చెప్పినట్లయితే నీవు శరీరము కాదు. దానికన్న భిన్నంగా ఉన్నావు. లేక అజ్ఞప్తిరూపముగా శరీరము ఉన్నదని అన్నట్లయితే స్నాన, అన్నభోజనాది క్రియలు జరుగకూడదు.

ఇటువంటి ఎదురు ప్రశ్నలను విని ఆ కర్మఠుడు నిరుత్తరుడయ్యాడు. అప్పుడు మూడవవాడు ఈ విధంగా అంటాడు. ఆత్మ జ్ఞప్తిమాత్రముగా ఉంది. అందుకనే అజ్ఞప్తిరూప శరీరము తనకన్నా (ఆత్మకన్నా) నిశ్చయముగా భిన్నముగానే ఉంది.

అప్పుడు నాలుగవవాడు మూడవవానిని శంకచేస్తాడు. దేహముకంటె భిన్నమగు జ్ఞప్తిరూప ఆత్మకు గమనాగమనములున్నవా? లేవా? చెప్పండి. ఒకవేళ ఆత్మకు గమనాగమనములు లేవని చెప్పినట్లయితే మూడవస్థలయందు కలిగే సుఖదుఃఖములు ఆత్మకు ఎట్లు అనుభవము కాగలవు? దానికి గమనాగమనములు ఒప్పినట్లయితే ఆత్మ వాయువువలె జడము అని ఒప్పుకోవలసి వస్తుంది. ఎందుకనగా? వాయువునకు సుఖదుఃఖ జ్ఞానము లేదు. అందుకని, మనస్సు సుఖదుఃఖములను గమనాగమనములను తెలుసుకుంటుంది.కాబట్టి **మనస్సే** ఆత్మ అంటాడు.(మనాత్మవాది)ఎందుక-నగా! మనస్సునకు గమనాగమనములు గలవు. స్థూలదేహమందు "**నేను**" అనే అహంభావము ధృడంగా గలది. సుఖదుఃఖములను తెలుసుకుంటుంది. అందుకని, మనస్సే ఆత్మ అనుటకు యోగ్యము.

అప్పుడు బౌద్ధమతానుయాయి యోగాచారి శంక చేస్తాడు.బుద్ధిరూపకర్త లేకుండా జడమగు మనోరూప కరణమునకు ప్రేరకులెవరు. బుద్ధి సర్వకార్యములకు కర్త ఉన్నందున **బుద్ధియే** ఆత్మ అని ఒప్పుకోవలెను.

అప్పుడు భట్టాచార్యులయొక్క శిష్యులు లేచి బుద్ధి సుషుప్తియందు తనకు కారణమైన అజ్ఞా-

నము (అవిద్య) యందు లయిస్తుంది. అక్కడ స్వతస్సిద్ధమైన ఆత్మ ఆనందస్వరూపమై ఉంది. అందుకనే బుద్ధి ఆత్మ కాదు. అజ్ఞానవిశిష్ట **ఆనందమే** ఆత్మ అని అంటారు.

ఇది విని శూన్యవాది(మాధ్యమికుడు)ఈవిధంగా అంటాడు. నిద్రాసమయమందు (సుషుప్తి యందు) మాకు ఏదికూడా గోచరమగుట లేదు. కనిపించుట లేదు. అందుకనే ఆత్మ"నాస్తి" రూపము (శూన్యము) అని ఒప్పుకొనవలెను.

అప్పుడు సిద్ధనాథుడు ఆ శూన్యవాదిని అడుగుతాడు.నీవు సుషుప్తియందు ఏమి తెలియబడుట లేదని ఆత్మ"నాస్తి"రూపము అంటున్నావా? లేక ఏమి తెలియబడని దానిని తెలిసికొని ఆత్మ **"నాస్తి"** రూపము(శూన్యము) అంటున్నావా?చెప్పుము. ఒకవేళ నీవు ఏమీ లేదను దానిని తెలుసుకొని "**ఆత్మ నాస్తి**" అన్నట్లయితే అది అసంభవము. ఎందుకనగా శూన్యమును తెలుసుకొను వాడవు నీవు ఉన్నావు. కావుననే,శూన్యత్వము ప్రకటించడానికి వీలయింది. దానిచే, ఆత్మయొక్క అస్థిత్వము సిద్ధమైంది. అటువంటి అస్థిత్వరూప ఆత్మనే "**సచ్చిదానందఘన పరమాత్మ**"అని శ్రుతులు తెలుపుచున్నవి. ఆ శూన్యమును తెలుసుకోగల అస్థిత్వమే సహజముగా **బ్రహ్మమై** ఉంది. అదే పరబ్రహ్మము. అదే నీవు. అదే ఆత్మ. *(ఆత్మా హి నామ స్వరూపమ్).*

**దృష్టాంతము:—**చీకటిగది. ఏమి గోచరమగుట లేదు. ఒకాయన ఆగదియందు కూర్చున్నాడు. ఆయనగారి స్నేహితుడు వచ్చి "ఓ రామయ్యా!"అని పేరు పెట్టి ఆయనను పిలిచాడు. అప్పుడు ఆ చీకటిగదిలో కూర్చున్నవాడు"ఆ.....ఉన్నాను"అని బదులు పలికినాడు.కాని, ఆయన స్నేహితుడు ఏమిటీ?ఎక్కడున్నావు? కనిపించడం లేదే! అంటాడు. ఏమి ఆయనగారు కనిపించనంత మాత్రాన లేడా? ఉన్నాడు. అదేవిధంగా సుషుప్తియందు ఏమి గోచరము కానప్పటికిని ఆత్మయొక్క అస్తిత్వము ఉంది. శూన్యము అని చెప్పేది అసంభవము. ఆత్మేతరమేమియును లేదనుటయే "శూన్యము" అను శబ్దమునకర్థము. కాని, ఆ శూన్యమునకు సాక్షియగు ఆత్మలేదనుట కుదురదు.

**అన్యదృష్టాంతము:—**ఒక గొప్ప ధనవంతుడు ఆయనకు ఒక వాచ్మెన్(ద్వారపాలకుడు)ఉన్నాడు. ఒకానొక రోజున ఆ ధనవంతుడు తన కుటుంబసహితముగా పొరుగూరికి ప్రయాణమై పోయినాడు. ఆయనగారి స్నేహితుడు వచ్చి చూసేసరికి ఆ ఇంటికి తాళం వేసి ఉంది. ద్వారంవద్ద మాత్రము కాపలా వాడున్నాడు. అప్పుడు ఆయన అతనిని, ఏమండీ!ఈ ఇంటి యజమాని లేడా? అని అడుగుతాడు.అప్పుడు వాచ్మెన్, వేరే గ్రామానికి వెళ్లారండీ! అని ఉత్తరమిచ్చాడు. ఏమి? ఆ కాపలావాడు, ఆ ఇంటియజమానియొక్క అభావమును తెలుసుకొని సమాధానం చెప్పినాడా? లేక తెలియకనా? తెలుసుకొని సమాధానం చెప్పినాడు. అదేవిధంగా శూన్యమును ప్రకాశించే ఆత్మ శూన్యముకంటె భిన్నంగా ఉంది. అదే ఆత్మయొక్క అస్తిత్వమును తెలుపుటకు నిదర్శనము.

**కించిద్విశేషము:—**

| పుత్రాదులందు ఆత్మత్వ సాధకయుక్తులు, ప్రమాణములు | పుత్రాదులందు ఆత్మత్వ బాధకయుక్తులు, ప్రమాణములు |
|---|---|
| 1.పుత్రాత్మవాది:-ఆత్మా వై జాయతే పుత్రః- (కౌశీతకి ఉప.2-11 | 1.కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్- (కఠ.2-1-1) |
| 2.దేహాత్మవాది:-స వా ఏష పురుషోఽన్నరసమయః- "స్థూలోఽహం కృశోఽహమ్"(తై.2-1-1) | 2.అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్- (బృ.3-8-8) |
| 3.ఇంద్రియాత్మవాది:-తేహప్రాణాఃప్రజాపతింపితరమేత్యబ్రూయుః, "కాణోఽహం బధిరోఽహమ్"(ఛాం.5-1-7) | 3.అచక్షుః శ్రోత్రం తదపాణిపాదమ్- (ముం.1-1-6) |
| 4.ప్రాణ,మనాత్మవాదులు:-అన్యోఽన్తరాత్మాప్రాణమయః,అన్యోఽన్తరాత్మా మనోమయః-(తై.2-3-1) | 4.అప్రాణో హ్యమనాఃశుభ్రః-(ముం.2-1-2) |
| 5.బుద్ధ్యాత్మవాది:-అన్యోఽన్తరాత్మా విజ్ఞానమయః- "అహం కర్తా అహం భోక్తా" (తై.2-4-1) | 5.అనన్తశ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా (శ్వే.ఉప.1-9) |
| 6.ఆనందమయకోశాత్మవాది:-అన్యోఽన్తరాత్మా ఆనన్దమయః, ప్రజ్ఞానఘనః ఏవ ఆనన్దమయః-(తై.2-5-1) | 6.నచాస్తివేత్తా మమ చిత్సదాహమ్,చిన్మాత్రోఽహమ్ సదాశివః-(కైవల్యోపనిషత్ 21&18) |
| 7.శూన్యవాది:-అసదేవేదమగ్ర ఆసీత్(ఛాం.6-2-1) | 7.సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్(ఛాం.6-2-1) |

విచారింపదగిన జీవస్వరూపవిషయమున పలువురు పలురీతుల జెప్పు మతభేదములు చూప బడుచున్నవి.

శ్లో ॥ దేహం కేఽపి వదన్తి ఖానితుపరే ప్రాణాన్మనశ్చాపరే,
బుద్ధిం చ క్షణికాం స్థిరామథపరే కేచిచ్చితం నిస్సుఖామ్ ।
ఆత్మానం జడచిత్స్వభావమపరే చిద్వజ్జడంచేతరే,
సత్యజ్ఞాన సుఖాద్వితీయమపరే తత్రాస్య కో నిశ్చయః ॥(స్వారాజ్యసిద్ధిః-అధ్యారోప ప్రకరణము 12)

ప్రతిపదార్థము:–కే-అపి=(పామరులును చార్వాకులును)కొందఱు, దేహమ్=దేహమును,ఆత్మానమ్-వదన్తి=ఆత్మయని చెప్పుచున్నారు;పరేతు=(ఆచార్వాకులయందు) మఱికొందఱు, ఖాని=ఇంద్రియములను, ఆత్మానమ్ వదంతి=ఆత్మయని చెప్పుచున్నారు; అపరే- తు =మరికొందఱు; ప్రాణాన్=ప్రాణములను, ఆత్మానమ్-వదంతి=ఆత్మయని చెప్పుచున్నారు;అపరే=మఱికొందఱు, మనః-చ=మనస్సును, ఆత్మానమ్-వదంతి=ఆత్మయని చెప్పుచున్నారు;పరే=(బౌద్ధులయందొక తెగవారలు) వైనాశికులు, క్షణికామ్=(వృత్తిజ్ఞానరూపమయిన) క్షణికమయిన,బుద్ధిమ్ చ=బుద్ధిని,ఆత్మానమ్ వదంతి=ఆత్మయని చెప్పుచున్నారు;అథ-పరే=(భాస్కరాదులు)మఱికొందఱు; స్థిరామ్=(విజ్ఞానకోశరూపమయిన) స్థిరమయిన,బుద్ధిమ్=బుద్ధిని,ఆత్మానమ్-వదంతి=ఆత్మయనిచెప్పుచున్నారు; కేచిత్(సాంఖ్య పాతంజలాదులు)కొందఱు,నిస్సుఖామ్=సుఖ(దుఃఖాది) సంబంధములేని, చితమ్=చిన్మాత్రమును,

ఆత్మానమ్-వదంతి=ఆత్మయనిచెప్పుచున్నారు;అపరే(భాట్టమతానుయాయులు)మఱికొందఱు, జడచి-త్స్వభావమ్=జడస్వభావము చిత్స్వభావముగల, ఆత్మానమ్-వదంతి=ఆత్మను చెప్పుచున్నారు; ఇతరే=(ప్రాభాకరనైయాయికాదులు)మఱికొందఱు,చిద్వజ్జడమ్=జ్ఞానగుణముగల జడపదార్థమని,ఆత్మాన-మ్-వదంతి=ఆత్మను చెప్పుచున్నారు;అపరే=(వేదాంతులు)మఱికొందఱు సత్యజ్ఞానసుఖాద్వితీయమ్=రెండవ సాటిలేని సచ్చిదానందరూపమును, ఆత్మానమ్-వదంతి=ఆత్మయని చెప్పుచున్నారు; తత్ర=ఈచెప్పిన పక్షములలో,ఆస్య=(ఈయాత్మతత్త్వము)దెలియగోరునతనికి, కః-నిశ్చయః= ఏపక్షము నిశ్చయము కాగలదు? (విమర్శించుటకు ముందు ఏపక్షము నిశ్చయము కాజాలదని భావము).

తాత్పర్యము:- పామరులును,కొందఱు చార్వాకులును దేహము నాత్మయనుచున్నారు. చార్వాకులందు మఱికొందఱు ఇంద్రియములను ప్రాణములను మనస్సును ఆత్మస్వరూపమనుచున్నారు. వైనాశికులు క్షణికవిజ్ఞానమును, భాస్కరుడు మున్నగువారలు స్థిరవిజ్ఞానమును, ఆత్మస్వరూపమనుచున్నారు. సాంఖ్యులు,పాతంజలులును సుఖదుఃఖవిహీనమగు చైతన్యమునాత్మయనుచున్నారు. భట్టమతానుయాయులాత్మను జడరూపమనియు చిద్రూపమనియు జెప్పుచున్నారు.ప్రాభాకరనైయాయికాదులాత్మను జడమాత్ర స్వరూపమనియు, నద్దానికి జ్ఞానగుణము మనస్సంయోగము వలన బుట్టుననియు జెప్పుదురు. వేదాంతులు సచ్చిదానందరూపమనియు, అద్వితీయమనియు నాత్మను వెల్లడింతురు. ఇట్లుండ జిజ్ఞాసువులకు నిర్ణయజ్ఞానము కలుగుటకొఱకు విచారము సలుపవల యునని భావము.

విశేషము:–నేను గౌరవర్ణము గలవాడననియు, దీర్ఘకాయుడననియు లోకానుభవసిద్ధమగుట, పామరులును, చార్వాకులును దేహమే ఆత్మయని విశ్వసింతురు. నేను చూచితిననియు, వినియుంటిననియు, గ్రుడ్డివాడననియు, చెవిటిననియు దెలియుచున్నందున నింద్రియములనే ఆత్మయనియు, మఱికొందఱు చార్వాకులు విశ్వసింతురు. నిద్రించునపుడు ఇంద్రియములు లేకున్నను ప్రాణవ్యాపారములు సక్రమముగా సాగుచునేయుండుట ప్రాణమేయాత్మ యనియు, మఱికొందఱు చార్వాకులు విశ్వసింతురు. మూర్ఛాద్యవస్థలయందు ప్రాణవ్యాపారము సందిగ్ధము కాగా, జీవనమును సంశయ గ్రస్తమగుట ప్రాణము నాత్మయనువారల మతము దేహేంద్రియముల నాత్మయనువారల మతమునకన్న శ్రేష్ఠమనదగియుండును. ఎట్లయ్యును చార్వాకులు దేహమును, ఇంద్రియములను, ప్రాణములను ఆత్మస్వరూపమనుటచే తత్పోషణమే పరమార్థమనియు శరీరము భస్మముకాగా, మఱి లోకాంతరములు లేవనియు జెప్పుదురు. భస్మీభూతమగు దేహము మరలరానేరదు. కావున, ఋణమైనజేసి దేహపోషణము జేయవలయునందురు. ఇట్టి యుపదేశము పామరులకు సులభ గ్రాహ్యమయియుండుట తథ్యము. పామరుల చెవుల కింపుగ నిట్టిమాటలు మాటాడువారలు కనుకనే వీరికి చార్వాకులను పేరు తగియుండును. వీరిలో మఱికొందఱు ప్రాణవ్యాపారము

సక్రమముగ సాగుచున్నను మనస్సు సావధానము కాదేని సుఖము కాని మఱి యితరము కాని తెలియుటలేదు. కావున, మనస్సును ఆత్మ యనియు జెప్పుదురు:–

**"అన్యత్ర మనా అభూవంనాఽపశ్యమ్, అన్యత్ర మనా అభూవంనాఽశ్రౌషమ్"** (బృ.1-5-3)

మనస్సును మఱియొకచోట కలిగియుంటిని, చూడలేదు. మనస్సును మఱియొకచోట కలిగి యుంటిని వినలేదనియు జెప్పు శ్రుతిచోటయు, మనస్సునుండియే జ్ఞానము పుట్టుననుచు మనస్సును ఆత్మయను వారివాదమునకు సమ్మతి దెలుపగలదు. ఇట్టి చార్వాకుల మతము విశ్వసింపదగినది కాదు. సుషుప్త్యవస్థయందు మనస్సు సయితము లీనమాయెను. అయ్యును జీవనవ్యవహారము గో-చరించుచుండుటచేతను, జాగ్రదాద్యవస్థలందును మనస్సు చేతనముగాక జడమగుటచేతను ఆత్మ స్వరూపము కానేరదు, చిత్తచేత్యాకారమున బరిణమించు క్షణికవిజ్ఞానమే ఆత్మస్వరూపమని వైనాశి-కులు వెల్లడింతురు.

ఈవిజ్ఞానము సయితము క్షణికమగుటచే నిట్టి క్షణికవిజ్ఞానము జీవుడేని నిన్నమొన్నటి విష-యముల ప్రత్యభిజ్ఞను ఈనాడెట్లు పొందును? మఱియు జీవుడు క్షణికుడేని బంధమోక్షముల వ్యవ-స్థయు బొసగదు. జీవుడు క్షణికుడగుటచే బద్ధుడొకడైయుండును, మోక్షమునుబడయ ప్రయత్నము సలుపు కాలమున జీవుడు క్షణక్షణము మాఱుచుండుటచే ముక్తికొఱకు బ్రయత్నించు జీవునిరూప-మొక్కటి కానేరదు. ఇట్లుండ బ్రయత్నించునాతడొక్కడును, ముక్తిబొందునాతడు మఱియొక్కడునయి యుండును. ఒకని ముక్తికి మఱియొకడు బ్రయత్నింప నేరడు. కాగా, బంధమోక్షశాస్త్రమును వ్యర్థ-ము కాగలదు.

కావున, భాస్కరాచార్యులు మున్నగువారు స్థిరవిజ్ఞానము నాత్మ స్వరూపమందురు. ఇట్టి స్థిర విజ్ఞానము:–

**"విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపిచ"** (తై.2-5)

విజ్ఞానము యజ్ఞము జేయుచున్నదనియు,క్రియాకలాపము జేయుచున్నదనియు గనబడుటచే నాత్మకు కర్తృత్వాదులును బొసగునని వీరి యాశయము. కాని, కర్తృత్వము సుఖదుఃఖాదులును ఆత్మధర్మములన ఆత్మకు వికారము, దానిచే అనిత్యత్వము సంభవించును. మఱియు నిత్యుడుగాడే-ని జీవునకు ముక్తియు బొసగదు. మఱియు పై విజ్ఞానము సయిత మన్నమయాదులవలె నాత్మకు కోశమని యుపనిషత్తులు చెప్పుటచే కర్తృత్వాదులు గుణపరిణామములనియు నాత్మచిన్మాత్ర స్వరూపుడనియు అసంగోదాసీనుడనియు సాంఖ్యపాతంజలాదులు చెప్పుదురు.చిన్మాత్రుండగు నిట్టి యాత్మకు ప్రకృతిగుణములతోడ వివేకము లేనందున బంధమనియు, వివేకము గలుగ ముక్తి బొందుననియు వీరి యాశయము.

కర్తృత్వము ప్రకృతిగుణముల కేని భోక్తృత్వమాత్మ కేల సంభవించును?ఒకరు పనుల జేయ మఱియొకరు ఫలితము బొందుట యసమంజసము. కావున, జీవునకు కర్తృత్వమును సుఖదుఃఖా దులను సమకూర్పజాలు జడాంశమును, నిత్యత్వము గూర్పజాలు బోధాంశమును గలదని భాట్టు లందురు.

కాని, యాత్మకు రెండంశములుండు నేని ఘటాదులవలె నాశము సంభవమనివార్యము కాగలదు. కావున, ప్రాభాకర నైయాయికాదులు ఆత్మను కేవలజడరూపుడనియు నాతనికి మనస్సం-యోగమువలన జ్ఞానమను గుణముదయించునని జెప్పుదురు. భాట్టులమతమున జీవుడనిత్యుడగుట-చే మోక్షోపదేశశాస్త్రము నిష్ఫలమనుట తేటతెల్లము. ప్రాభాకరాదులమతమందును ముక్తజీవుడు మనస్సంయోగము లేనందున జ్ఞానగుణము సంభవింపక పాషాణతుల్యుడయియుండును. అట్టి మోక్షము నేయొక్కరు గోరరు. కావున, సచ్చిదానందస్వరూపమే ఆత్మయను వేదాంతులమతము సమంజస మైయుండుననియు, నిట్టి యాత్మతత్త్వము అనాత్మాధ్యాసముచే గప్పబడియున్నందున యథార్థము దెలియగోరు వారులు ఈతత్త్వమును మరలమరల వేదాంతపూర్వకముగ గుర్వనుగ్ర-హమును బడసి తెలియవలయుననియు భావము.

ఇపుడు జీవునియొక్క పరిమాణ స్వరూపమును దెలుపు ప్రమాణవిషయమునను గల పలు మతములు జూపబడుచున్నది.

శ్లో ॥ ఆహుః కేచిదణుం శరీరసదృశం కేచిద్విభుం తే పరే,

తేతం మానసగోచరం తదపరే నిత్యానుమేయం జగు: ।

అన్యేచిద్విషయం పరేతు పరమ స్వజ్యోతిరాభ్యంతరం

సత్యేవం శ్రుతియుక్తిభి ర్వివిదిషోర్యుక్తో విచారో ముహుః ।(స్వా.సి-అధ్యారోప ప్రకరణము 13)

ప్రతిపదార్థము:–కేచిత్=(పాశుపత,పాంచరాత్రాది ఆగమ మతానుయాయులు) కొందఱు, తమ్=ముందు జెప్పిన జీవాత్మను, అణుమ్ ఆహుః=పరమాణు పరిమాణము గలవానినిగ జెప్పు-చున్నారు;కేచిత్=(అర్హతమతానుయాయులు)కొందఱు,తమ్=ఆయాత్మను,శరీరసదృశమ్=దేహము-తోడతుల్యమగు పరిమాణముగలవానినిగ, ఆహుః=చెప్పుచున్నారు; పరే=(నైయాయికాదులు)మఱి-కొందఱు, విభుమ్=(సర్వవ్యాపకమగు) విభుపరిమాణము గలవానినిగ,ఆహుః=చెప్పుచున్నారు; తే= ముందుజెప్పిన వాదులు ముప్పురును, తమ్=అట్టియాత్మను, మానసగోచరమ్ మానసప్రత్యక్ష గోచ-రునిగ, జగుః=చెప్పిరి,తదపరే=వారికన్న భిన్నులగు (సాంఖ్యులు మొదలగు) మఱికొందఱు, తమ్= అట్టియాత్మను, నిత్యానుమేయమ్ (విషయప్రకాశము మొదలగువానిచే) ఎప్పుడు నూహింపదగిన వానినిగ, జగుః=చెప్పిరి; అన్యే=(వైనాశికులు)మఱికొందఱు,తమ్=ఆయాత్మను,చిద్విషయమ్=(వృత్తి) జ్ఞానగోచరునిగ,జగుః=చెప్పిరి;పరేతు=వేదాంతులు, ఆభ్యంతరమ్=పంచకోశములకును లోపలగల,

పరమస్వజ్యోతిః=సర్వోత్కృష్టమగు స్వప్రకాశరూపమని,తమ్=ఆయాత్మను,జగుః=చెప్పిరి;ఏవంసతి= ఇట్లుండ, వివిదిషోః=తెలియగోరునతనికి,శ్రుతియుక్తిభిః=వేదాంతములతోడను (వేదాంతార్థముల బొసగింపజాలు) యుక్తులతోడను, ముహుః=మాటిమాటికి తానే బ్రహ్మమని సాక్షాత్కారము కలుగుపర్యంతము), విచారః=విమర్శించుట, యుక్తః=తగియుండును.

తాత్పర్యము:–పాశుపతమతానుయాయులును పాంచరాత్రాద్యాగమ మతానుయాయులును జీవుని అణుస్వరూపుడని చెప్పుదురు. ఆర్హతులు(జైనులు)శరీరమునకుగల పరిమాణముతోడతుల్య-మగు పరిమాణము గలవాడనియు, నైయాయికులు సర్వవ్యాపకమగు విభుపరిమాణము గల వాడనియు, నాత్మను వెల్లడింతురు. పై వాదులు ముప్పురు నాయాత్మస్వరూపము మానసప్రత్యక్ష గోచరమందురు. కాని, సాంఖ్యులు మున్నగువారలు ఆత్మస్వరూప మెన్నడు ప్రత్యక్షము కాదనియు నిత్యానుమేయమనియు జెప్పుదురు. వైనాశికులాత్మను క్షణికవిజ్ఞానగోచరు డందురు; లేక ప్రాభాక-రులు సకలజ్ఞానములందు నాత్మయు, జ్ఞానమును, విషయమును ప్రకాశించుచుండుననియు,దీనినే త్రిపుటియనియు జెప్పుచు, ఆత్మను జ్ఞానాశ్రయముగను, విషయముగను–జ్ఞానమునందు కర్మగను భాస్యమని చెప్పుదురు. వేదాంతులాత్మను స్వప్రకాశమనియు, వేదాంత ప్రామాణ్య పురస్సరముగ వెల్లడింతురు. ఇవ్విధమున వాదులు వివాదగ్రస్తులయి యుండుట జిజ్ఞాసువు లీవిషయము మాటి మాటికి తత్త్వమఱయ(తెలియ) వలయునని భావము.

విశేషము:–ఆత్మ స్వరూపము విభువై సర్వవ్యాపక మేని సకలదేహములందు సకలజీవులెల్ల వేళల నిండియుందురు. కావున, ఆయా జీవుల కాయా భోగముల వ్యవస్థ లేకపోవును. శరీరమున కుగల పరిమాణమువలె మధ్యమపరిమాణుడన్నచో, సావయవుడగుటవలన నవయవ వినాశముచే జీవస్వరూపము నాశము బొందును. అట్లగుచో, మోక్షోపదేశశాస్త్రము నిష్ప్రయోజనము కాగలదు. కావున, జీవుడణుపరిమాణు డనవలయును. కాని వేఱండుమార్గము లేదని పాశుపతపాంచరాత్రా-ద్యాగమవాదుల యాశయము. జీవుడణుపరిమాణుడనినచో, నీ దేహమునందతడు యేదోనొక మూలనుండ సకలశరీరమున గల వేదనల దెలియ నేరడు. కావున, నార్హతమతానుయాయులు జీ-వుని దేహసమానపరిమాణు డందురు. దీపపుకాంతివలె జీవుడును సంకోచవికాసములు గలవాడ-గుట దేహము వృద్ధిబొంద వృద్ధియు, కార్శ్యముబొంద(చిక్కిపోయిన) కార్శ్యముబొందు నందురు. ఇట్లేని, జీవుడు సావయవస్వరూపుడగుట నిత్యుడు కానేరడనియు–దానిచే మోక్షోపదేశశాస్త్రము వ్యర్థమగుననియు దలచి నైయాయికులు జీవుని విభుస్వరూపు డందురు. ఇంతియకాక జీవుని గోచరింపజేయు ప్రమాణ విషయమునను వాదులు వివాదపడుచుందురు. పై వాదులందరు నా యాత్మను మానస ప్రత్యక్ష గోచరుడని చెప్పుదురు. సాంఖ్యమతము ఆత్మస్వరూపమెన్నడు బ్రత్యక్షము కాదనియు ఘటపటాదులు మనకు గనబడుటచే, వాటిని ప్రకాశించు యాత్మస్వరూప మొండు

కలదని యూహింపవలయు ననియు జెప్పుదురు. ఇట్లే వైనాశికులు క్షణికవిజ్ఞానమున జీవుడు గోచరించు నందురు. ప్రాభాకరులు జాతృజ్ఞానజ్ఞేయములను త్రిపుటియందుజ్ఞానము స్వప్రకాశ మనియు, జ్ఞాత జ్ఞానాశ్రయముగను, జ్ఞేయము జ్ఞానవిజ్ఞానవిషయముగను భాసించు నందురు. ఆత్మ జ్ఞానముల విషయమందు జ్ఞానమపరోపక్ష మనియు, జ్ఞేయవిషయమునమాత్రము అనుమేయ మనియు జెప్పుదురు. వేదాంతులు పంచకోశములకు నాంతరమగు స్వప్రకాశరూపమనియు పరమానందరూపమనియు నాత్మను వెల్లడింతురు. ఇట్టి యాత్మతత్త్వము అపరోక్షముగ దెలియు పర్యంతము జిజ్ఞాసువులు వేదాంతముల విమర్శ జేయవలయునని భావము. కావుననే, తొమ్మిది మాఋలు ఛాందోగ్యము సాక్షాత్కారము పుట్టు పర్యంతముపదేశము జేసెనని భావము.

అప్పుడు ప్రారబ్ధవాది ఈవిధంగా శంకచేస్తాడు. ప్రారబ్ధము ఆత్మజ్ఞానికికూడా విడువలేదు. వారివారి కర్మానుసారముగా సుఖదుఃఖములను అనుభవిస్తాడు కదా!అని అన్నాడు. అప్పుడు సిద్ధనాథుడు ఆయనను ఈ ప్రకారంగా వికల్పముచేసి అడుగుతాడు.

నీవు సుఖదుఃఖములు విషయాత్మకములు అంటావా?లేక మనోవృత్తిరూపము అంటావా? ఒకవేళ నీవు సుఖదుఃఖములు విషయాత్మకములు అంటే, అది అసంభవము. ఎందుకనగా? ఒకే విషయము ఒకరికి సుఖమునిస్తుంది. మరొకరికి దుఃఖమునిస్తుంది. మరియు అదే విషయము ఒకే వ్యక్తికి ఒకప్పుడు సుఖమునిస్తుంది. ఒకప్పుడు దుఃఖమునిస్తుంది. విషయము ఒకటే అయినప్పుడు కాలభేదముచేత వ్యక్తిభేదముచేత సుఖ దుఃఖ వ్యతిక్రమము ప్రతీతి కాకూడదు. ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఒక పురుషునికి ఏ విషయము ఆనందమును ఇచ్చిందో, అదే విషయం రోగగ్రస్తుడైనప్పుడు దుఃఖమునిస్తుంది. అనగా సుఖదుఃఖములు విషయముయందు లేవు. కావున, సుఖదుఃఖములు విషయాత్మకములు కావు.

---

**విశేషము:——**

విషయాలలోనే సుఖమున్నదను వాదిని ఇట్లు వికల్పముచేసి అడుగవలెను.

I.ఓయీ పూర్వపక్షీ! వైషయిక సుఖమును విషయధర్మమందువా?అది యుక్తముకాదు. ఏలయన? విషయసన్నిధానములో పూర్వక్షణములో కలిగిన సుఖము ఉత్తరక్షణములో కనుపించుటలేదు. సుఖాభివ్యఞ్జక ప్రారబ్ధము లేనిచో విషయప్రాప్తియే దుర్లభమగును. విషయసాన్నిధ్యమున్నంతవరకు ప్రారబ్ధముండును. కావున, ప్రథమక్షణములోవలెనే ద్వితీయాది క్షణాల్లోగూడ సుఖప్రతీతి కలుగవలెను. కాని, విషయము అన్నిక్షణాల్లో అందరికి సుఖమునిచ్చుట లేదు. ఒకవ్యక్తికి సుఖమునిచ్చిన విషయము మరొకరికి దుఃఖమునకు కారణమౌతుంది. ఒకేవ్యక్తికి ఒకకాలంలో సుఖమునిచ్చిన విషయము మరొక కాలంలో దుఃఖమునిస్తుంది. అందువల్ల సుఖము విషయధర్మము కాదు.

II.విషయసుఖము కరణ(ఇంద్రియ)ధర్మమందువా?అది సరిగాదు. విషయ వ్యవధానంలో గూడ సుఖానుభవము కలుగవలెను. కాని, కలుగుటలేదు.

III.లేక, కర్మధర్మమందువా?యుక్తముగాదు.సుఖము పుణ్యకర్మయొక్క కార్యమున్నందున కర్మధర్మముకాదు. కర్మానుష్ఠాన కాలంలోగూడ సుఖము భాసించవలెను. కాని, అట్లుగాక కర్మా-నుష్ఠాన సమాప్త్యుత్తరక్షణంలో అపూర్వము ఉత్పన్నమగును. ఆ అపూర్వము కాలాంతరములోగాని, జన్మాంతరములోగాని, దేశాంతరములోగాని సుఖాన్నిస్తుంది.

IV.విషయసుఖము భోక్తయొక్క ధర్మమందువా? ఇదియును యుక్తముగాదు.ఎందుకంటె? భోక్తకు ఎప్పుడును విక్షేపము కలుగకుండవలెను.

V.ఒకవేళ దేశధర్మమందువా?అదియును సరిగాదు.అన్నిదేశములందును సుఖము లభింప-గల్గుచో, స్వర్గలోకాపేక్షయే లేకుండవలయును. కాని,**"ఇంద్ర లోకే మహద్దుఃఖం ప్రాజాపత్యే మహ త్తరమ్"** అని సూతసంహిత వాక్యము.

VI.లేక, కాలధర్మమందువా? సంభవించదు. ఏలయన; శీతాకాలము మరియు వేసవికాలములలో ఎల్లవేళలందు సమానముగా సర్వత్ర సర్వులకు సుఖము ప్రాప్తించవలెను.

VII.వైషయికసుఖము అజ్ఞానధర్మమా? కాదు. ఎందుకంటె? వస్తువుయొక్క భోగ్యత్వ పరి జ్ఞానములేకుండా సుఖము కనుపించుటలేదు.

VIII.లేక,"విషయజ్ఞానము"యొక్క ధర్మమనెదవా? సరిపడదు. ఎందుకనగా? వస్తువు యొక్క రమ్యత్వజ్ఞానము కలిగినను విరక్తునికి సుఖము కలుగుట లేదు.

IX.అథవా, కరణవ్యాపార అభావస్వరూపము సుఖమందువా?అదియును యుక్తముగాదు. ఎందుకు? నిద్రలో సకలకరణముల అభావమున్నందున సుఖానుభవము కలుగకూడదు. మరియు కరణవ్యాపారయుక్త భోజనాదులందు సుఖప్రతీతి కాకూడదు.

X.ఒకవేళ, దుఃఖాభావస్వరూపమే సుఖమన్నచో, దుఃఖాభావయుక్త మృత్పిండమున సుఖ ప్రతీతి అగుపడుటలేదు. అహో! మృత్పిండము జడమున్నందున సుఖాభివ్యక్తి లేదు—అని యనెదవే-మో. అది యుక్తముగాదు. ఎందుకంటె? దుఃఖాభావవతిబుద్ధియొక్క అస్ఫూర్తిలో సుఖము కను-పించుట లేదు. అయినను, జడమతులగు నైయాయికాదులు మూర్ఖత్వముచే దుఃఖాభావమును సుఖమందురు. కాని, సుఖము భావరూపమున్నది. దానియందు అభావత్వము అనుపపన్నము. పశుతుల్యులగు ఈ మూర్ఖులకు సౌషుప్త నిర్విషయ సుఖానుభవము లేదేమో! అందుకే దుఃఖా-భావమును సుఖమంటున్నారు.

XI.ఇక, వైషయిక సుఖము ఆత్మధర్మమన్నచో,అది అయుక్తము. ఎందుకనగా?అగ్నికి దాహ కత్వము, ప్రకాశకత్వమువలె సుఖము ఆత్మయొక్క స్వరూపమున్నది.దాని ధర్మముగాదు.

**శ్లో॥అర్పకాన్తరరాహిత్యేఽప్యస్త్యేషాం తత్స్వభావతా ।**

**మాభూత్తథానుభావ్యత్వం బోధాత్మా తు న హీయతే ॥** (వే.పం.3-15)

బెల్లము,మిశ్రి(చక్కెర)మొదలగు పదార్థములకు మాధుర్యాదులను అర్పణముజేయు పదార్థాంతరములు లేకున్నను, వాటియందు మాధుర్యాదులు స్వాభావికములుగానుండును.అట్లే,ఆత్మానందము ఆత్మయొక్క స్వరూపముగాన అనుభావ్యముగాకున్నను అనుభవరూపమున్నదనుటలో సందేహము లేదు.“**రసో వై సః**”(తై.౨-౭);“**ఆనందో బ్రహ్మేతివ్యజానాత్**”(తై.3-6)ఇత్యాది శ్రుతి,యుక్తి మరియు అనుభవములచే ఆనందము(సుఖము) ఆత్మయొక్క స్వరూపమేయని సిద్ధమౌతుంది.

ఒకవేళ, సుఖము ఆత్మధర్మమనినయెడల ధర్మము నశించినచో ధర్మియగు ఆత్మనాశప్రసంగమేర్పడును. అస్తు, ప్రకృతమనసరామః.

---

ఒకవేళ నీవు సుఖదుఃఖములు మనోధర్మములు అంటే, ఆ సుఖదుఃఖములు మనసును బాధించకూడదు. ఏ విధంగా అగ్నియొక్క ధర్మమగు ఉష్ణత అగ్నిని దహింపజాలదు.

అప్పుడు ఆ వాది అంటాడు–మీరు చెప్పినట్లు, అగ్నియొక్కధర్మమగు ఉష్ణత అగ్నిని దహింపజాలకున్నను ఇతరమును దహించునట్లు, సుఖదుఃఖములు మనోధర్మములే అయినను ఆత్మను ఎందుకు బాధించవు? తప్పకుండా బాధించును? అప్పుడు వాదికి సిద్ధనాథుడు ఉత్తరమిస్తూ —

సుషుప్తి, సమాధియందు కేవలం ఆత్మ ప్రకాశిస్తుంది. అచ్చట మనస్సులేదు,మనోధర్మములగు సుఖదుఃఖములుగూడలేవు. కావున, అన్వయవ్యతిరేకముచే సుఖదుఃఖములు మనోధర్మములుగా నిశ్చయింపబడుచున్నవి.అనగా,ఎక్కడ మనస్సుంటుందో, అక్కడ సుఖదుఃఖములుంటున్నవి. మనస్సులేనిచో సుఖదుఃఖములు లేవు.

**శ్లో॥శోకహర్ష భయక్రోధ లోభమోహ స్పృహాదయః ।**

**అహంకారస్య దృశ్యన్తే జన్మమృత్యుశ్చ నాత్మనః ॥** (శ్రీమద్భాగవతము 11-28-15)

కావున, మనోధర్మములగు సుఖదుఃఖములు ఆత్మను అంటజాలవు.“**అశరీరం వావ సన్తం నప్రియాప్రియేస్పృశతః**”(ఛాం.8-12-1). అందుకే సుఖదుఃఖములు ఆత్మజ్ఞానిని బాధింపజాలవు.

అప్పుడు వాది ఇట్లు ఆక్షేపిస్తున్నాడు. సుఖదుఃఖములకు అపూర్వముద్వారా పుణ్యపాపకర్మలు కారణములు. ఒకవేళ సుఖదుఃఖములు జ్ఞానిని బాధింపనిచో.....

**శ్లో॥నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి ।**

**అవశ్యమేవ భోక్తవ్యం కృతకర్మ శుభాశుభమ్ ॥**

[బ్రహ్మవైవర్త పురాణము-౨ వ (ప్రకృతి) ఖండము, 37-17]

**శ్లో॥యథా ధేనుసహస్రేషు వత్సో గచ్ఛతి మాతరమ్ ।**

**తథా యచ్చ కృతంకర్మ కర్తారమను గచ్ఛతి ॥** (చాణక్య నీతి 13-14)

అను యీ శాస్త్రప్రమాణము వ్యర్థము కాగలదు.

అప్పుడు ఆ వాదితో సిద్ధనాథుడంటాడు. ఆ శాస్త్రవాక్యము మాకుగూడ అంగీకార్యమే. కాని, అది జ్ఞానశూన్యులగు పామరపురుషులు నిషిద్ధకర్మలయందు ప్రవృత్తము కాకూడదను అభిప్రాయ-ముతో చెప్పబడిన భయానకవాక్యము. కావున, అది అజ్ఞాని(విషయీ)పురుషులకు పాపమునుండి పరిరక్షించుటకు మాత్రమే చెప్పబడినది. అజ్ఞజనులకు పుణ్యకర్మగాని,పాపకర్మగాని, దాని ఫలమగు సుఖదుఃఖములనివ్వకుండా ఎన్ని కల్పములకైనను నశించదు. అవశ్యముగా అనుభవించియే తీరవలెను. జ్ఞానులకు మాత్రము వర్తించదు.

ఆత్మజ్ఞానులకు ఆ శాస్త్రము సర్వథా అప్రమాణికమేయగును.

**శ్లో॥యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున! ।**

**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥** (శ్రీమద్భగవద్గీత 4-37)

సిద్ధారూఢ యతీంద్రుల ముఖారవిందముద్వారా ఇటువంటి అద్భుతమైన ఆత్మవిషయక సం-వాదమును శ్రవణముచేసిన **"చింతామణి"** ఆశ్రమస్థ సాధు, సత్పురుషులందరు మహదానందభరిత చిత్తులై సిద్ధనాథుని **"హే సిద్ధారూఢా! త్వం ధన్యోఽసి ధన్యోఽసి, వయమపి ధన్యాః"** అని ఎంత-గానో ప్రశంసించిరి.

ఆ దినము ''చింతామణి''ఆశ్రమమందే విశ్రమించి, మరుసటిరోజున సిద్ధనాథుడు అక్కడి నుండి బయలుదేరి **"తిరుపతి"** క్షేత్రమునకు చేరుకొని శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించుకొని, మళ్ళీ అక్కడినుండి ముందుకు ప్రయాణము సాగించాడు. శరీరమునకు శీతవాతాదులచే అనేక సుఖదుః-ఖములు కలిగినను వాటివలన విక్షేపమును పొందక వివేకముతో సహించుకుంటూ ఎప్పుడూ బ్రా-హ్మీస్థితిలో ఉండేవాడు. శరీరముపై అల్పమైన వస్త్రము(కౌపీనము మాత్రము) ధరించి, కరతలము=(దోసిలి)తన రెండుచేతులే భిక్షపాత్రగా జేసికొని, ఎక్కడ చీకటిపడితే అక్కడ ఊరిలోగాని, వనము-లోగాని పృథివినే పడకగా జేసికొని శయనించేవాడు.

కొందరు జనులు సిద్ధనాథునిచూసి ఉన్మత్తుడనుకొని(పిచ్చివాడనుకొని) రాళ్ళతో కొట్టేవారు. మరికొందరు ఇతడు రోగపీడితుడై అశక్తుడైనాడని ఎవరుగూడ దగ్గరకు రానీయకుండిరి. ఇంకొం-దరు ఇతనికి కులగోత్రములు లేనివానిగా భావించి స్వామియొక్క సంసర్గము చేసేవారుకాదు. కొందరు ఉత్తమ సంస్కారముగల అధికారిపురుషులు ఈయన గొప్ప జ్ఞానివలె కన్పట్టుచున్నాడని అనుకునేవారు. స్వామివారి నిస్పృహ స్థితినిగాంచి యథార్థముగా ఈయన బ్రహ్మవేత్త ఉన్నాడని తలంచి, సిద్ధనాథునికి స్నాన,భోజన,శయనాది వ్యవస్థలు చేసేవారు.

సిద్ధనాథుడు''శివకాంచి''కి వెళ్ళి పరమశివుని దర్శించి, అక్కడనుండి **"విష్ణుకాంచి"**కి పోయి శ్రీవరదరాజస్వామిని దర్శించుకున్నాడు. త్రోవలో ఒకానొక బ్రాహ్మణుడు సిద్ధనాథుడు జడభరతుడు

వలె విశ్రమించింది చూచి ఈయన ఒకానొక పరిపూర్ణమైన బ్రహ్మవేత్త ఉన్నాడని అనుకుంటాడు. స్వామీజీయొక్క నిస్పృహస్థితి, ఉన్నతమైన చర్యలనుగాంచి సిద్ధనాథుని పూజించాలని, ఇటువంటి బ్రహ్మవేత్తయొక్క పూజ చేసినట్లయితే మహాగొప్ప ఫలము లభించగలదని భావించి, ఆయన చేతుల-ను పట్టుకొని తన ఇంటికి తీసుకెళ్ళి, స్వామీజీని ఉన్నతమైన ఆసనమందు కూర్చుండబెట్టి షోడశోప-చారపూజలను విధిపూర్వకముగా నిర్వహించి పూజించినాడు.

స్వామీజీని పూజించి సత్కరించిన తర్వాత ఆ బ్రాహ్మణుడు స్వామీజీ ఎదురుగా అంజలిబద్ధుడై నిలబడి ఈప్రకారముగా ప్రార్థిస్తాడు. బ్రహ్మవేత్తలైన మహాత్ములను పూజించి దర్శించినట్లయితే తత్కాలమే పూర్ణమైన ఫలము (దృష్ట ఫలము) లభిస్తుందని పెద్దలు అంటారు స్వామీ!

వినమ్రవదనుడై స్వామియొక్క ఆశీర్వాదముకొరకు నిరీక్షిస్తున్న ఆ బ్రాహ్మణుని, స్వామి ఈ విధంగా అడుగుతాడు. నీవు యథార్థముగా ఎవరవు ఉన్నావు చెప్పుము.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు అంటాడు. ఈ కనిపించే శరీరము ఏదైతేఉందో అదే నేనై ఉన్నాను.

సద్గురు సిద్ధనాథుడు ఆ బ్రాహ్మణుని ఉద్దేశించి మళ్ళీ ఈ విధంగా అంటాడు. ఈ కంటికి కని పించే స్థూలశరీరము పంచభూతాత్మకమై పంచీకృతపంచమహా భూతములయొక్క 25 తత్త్వము-లతో నిర్మితమైనది. ఇటువంటి దేహము ఒక్కొక్క భూతముయొక్క తత్త్వము ఆయా భూతములకు అర్పించినట్లయితే నీవు నిష్కలంకుడిగా, అసంగుడిగా మిగిలిపోతావు. మరి, ఇప్పుడు నీవు ఎవరు చెప్పు?

ఆ బ్రాహ్మణుడు అంటాడు. నేను పంచప్రాణములు మరియు బుద్ధితో సంయుక్తుడనై అనేక లోకములకు గమనాగమనముచేయగల ఏదైతే సూక్ష్మ శరీరము (లింగదేహము) ఉన్నదో; నిశ్చయముగా అదే నేనై ఉన్నాను.

అప్పుడు సిద్ధనాథుడు బ్రాహ్మణుని ఈ విధంగా ప్రశ్నిస్తాడు. ఎప్పుడైతే సుషుప్తి అవస్థయందు బుద్ధి, దానికి కారణమైన అవిద్యయందు విలయమును పొందుతుందో,అప్పుడు ఏలోకాలకు గమ-నాగమనములు జరుగవు. అప్పుడు నీవు ఎవరై ఉన్నావు? అప్పుడు బ్రాహ్మణుడు నాకు తెలుయదు అని అంటాడు.

స్వామి బ్రాహ్మణున్ని మళ్ళీ ఈ విధంగా అడుగుతాడు. నీవు నాకు ఏమి తెలియదు అను దానిని తెలుసుకొని అన్నావా? లేక తెలియక అన్నావా?నాకు తెలియ లేదు అనే అనుభవము ఏదై-తే ఉందో అదే నీవు ఉన్నావు. ఆ అనుభవసిద్ధ జ్ఞప్తి రూపమే నీవు ఉన్నావు.

ఇటువంటి జ్ఞానరూపమైన అనుభవము నేను అని నాకు నీ యొక్క దర్శన, స్పర్శన, సంభాషణద్వారా కలిగింది. మహాత్ములయొక్క దర్శనముద్వారా దృష్టఫలము లభించునని, ఆ బ్రాహ్మణుడు సిద్ధనాథుని చరణములకు మళ్లీ సాష్టాంగనమస్కారము సమర్పించుకుంటాడు.

శ్రీ సిద్ధారూఢస్వామి అక్కడ శ్రీ వరదరాజస్వామియొక్క దర్శనము తీసుకొని అక్కడనుండి బయలుదేరి సంచరిస్తూ"చిదంబర"క్షేత్రమునకువిచ్చేసి అక్కడ ఒక రహస్యమైన గుహను దర్శించి-నాడు. అక్కడనుండి బయలుదేరి వెళ్తుండగా దారిలో వరుణుడు వర్షంద్వారా సిద్ధనాథునికి స్నానము చేయించేవాడు.సూర్యకిరణములు ఆ జలమును తుడిచి దేహమును ఎండింపజేసేవి. ఇతర ప్రయత్నములు చేసేవాడు కాడు.

ఎవరైనా జనులు దయతలచి అన్నమువేస్తే దానితోనే సంతృప్తిచెందేవాడు. దేహరక్షణ నిమి-త్తము మాత్రమే భుజించేవాడు. దేహమునుగూర్చి ఏమాత్రము చింతజేయక తనను పూజించిన వారి యందు, సత్కరించిన వారియందు, నిందించిన వారియందు, తనను కొట్టిన వారియందుగూడా సమభావన కలిగి ఆత్మదృష్టితో చూస్తూ ప్రయాణము కొనసాగించినాడు.

కుంభకోణక్షేత్రమందు కుంభేశ్వరుని, తంజావూరునందు తంజేశ్వరుని దర్శించి, శ్రీరంగనా-థుని దర్శన నిమిత్తము శ్రీరంగక్షేత్రము వెళ్ళుతాడు. త్రోవలో ఒక కృషీవలుడు సిద్ధనాథుని ఈవిధం-గా పలుకరిస్తాడు. నీవు చూడడానికి శవములాగా బక్కగా చిక్కిపోయి ఉన్నావు. అయినాగాని నీవు వాయువేగమువలె పరిగెత్తుచున్నావు. అంతటి శక్తి నీలో ఎక్కడనుండి వచ్చింది?

సిద్ధనాథుడు అతనికి ప్రత్యుత్తరమిస్తూ:—ఎక్కువగా అన్నము భుజించిన మాత్రమున శరీర-మునకు శక్తి లభించదు. నిరంతరము మనోవృత్తి బ్రహ్మాకారముగా ఉన్నట్లయితే శక్తి వస్తుంది.

శ్రీరంగ దర్శనము గావించుకుని సిద్ధనాథుడు జంబుకేశ్వరమునకు వచ్చినాడు. తరువాత మీనాక్షిదేవి దర్శన నిమిత్తము మధురైకి చేరుకున్నాడు. మీనాక్షిదేవిని దర్శించుకొని దేవాలయం-లోకి ప్రవేశిస్తుండగా,అక్కడ ఒక పూజారి బ్రాహ్మణుడు సిద్ధనాథునికి అడ్డుపడి, నీవు చండాలుడవు ఉన్నావు. నీకు ఆలయ ప్రవేశమునకు అర్హత లేదు—అని నిరోధిస్తాడు.

అప్పుడు సిద్ధనాథుడు ఆ బ్రాహ్మణునితో ఈ ప్రకారంగా అంటాడు. నీలోని క్రోధబుద్ధి చండా-లము. దేవి దర్శనార్థము వచ్చిన భక్తులను పైసలు, కానుకలు, కట్నాలు అడుగుతావు. అటువంటి ఆశాబుద్ధి చండాలము. కానుకలు, కట్నాలు, ద్రవ్యము లభ్యము కానట్లయితే, నిరాశపడతావు. అదియును చండాలబుద్ధే. ఈ మూడు చండాల బుద్ధులుగల నీవు చండాలుడివే.

ఈ మాటలువిన్న బ్రాహ్మణుడు భయకంపితుడై విస్మయమొంది నిరుత్తరుడైనాడు. పిమ్మట, ఈ ప్రకారంగా అంటాడు. నేను నీవలన కర్మాచరణమును పూజావిధిని మర్చిపోయాను.

సిద్ధనాథుడు మళ్ళీ ఈవిధంగా అంటాడు. వేదోక్తమైన కర్మాచరణమును విస్మరించి కర్మభ్ర-ష్టుడు కావడముకూడా చండాలత్వమే. ఇది విని ఆ బ్రాహ్మణుడు భయముజెంది "త్రాహి త్రాహి" రక్షించు, నన్ను మన్నించు—అని బ్రతిమిలాడుతూ సిద్ధనాథుని వేడుకొని, స్వామియొక్క చరణ-ములకు వందనముచేసి తనయొక్క గృహమునకు వెళ్లిపోయినాడు. అవధూత సిద్ధనాథుడు

ఆలయంలో ప్రవేశించి మీనాక్షి దేవి పూజలను దర్శించి, తదనంతరము కావేరీనదీ తీరమునకు వెళ్లి అక్కడ ఆసనము వేసుకొని నిస్పృహస్థితిలో ఉండి నిర్వికల్ప సమాధియందు కూర్చుంటాడు.

ఒకానొక బ్రాహ్మణుడు దేవాలయంనుండి ఇంటికి వెళ్తుండగా, ఆసనము వేసుకొని కూర్చు-న్న సిద్ధనాథునిగాంచి, ఆయనయొక్క అవస్థనువీక్షించి, ఈయన ఒక గొప్ప అవధూత మహాపురు-షుడున్నాడని గ్రహించి,ఈ స్వామిని ఇంటికి తీసుకెళ్లి నైవేద్యము సమర్పించాలని నిశ్చయించుకొని, వినమ్రవదనుడై, సమాధియందున్న స్వామి వద్దకు ఏతెంచి, అవధూతస్వామిని ఈ ప్రకారముగా వేడుకుంటాడు. ఓ సాధువర్యా!ఈరోజు మీరు మా ఇంటికి విచ్చేసి మేము ఇచ్చే ఆతిథ్యమును స్వీకరించి, మా శక్తికొలది ఈయగల ప్రసాదమును (నైవేద్యమును) స్వీకరించగలరని అత్యాదర-ముతో వేడుకొనగా, సిద్ధనాథుడు ఆ బ్రాహ్మణుని ఉద్దేశించి ఈ ప్రకారముగా అంటాడు.

ఓయి బ్రాహ్మణుడా!మీరు భక్తిపూర్వకముగా ఇచ్చే ప్రసాదమును స్వీకరించగలను. కానీ ఆ నైవేద్యము ఏదో ఇక్కడికే తీసుకొనివచ్చి నాకు సమర్పించుకున్నట్లయితే అధికపుణ్యము దొరకగలదు. నేను మీ ఇంటికి వచ్చి భుజించినట్లయితే అల్పపుణ్యము నీకు లభించగలదు–అని అంటాడు.

స్వామియొక్క మధురమైన వచనములను విని ఆ బ్రాహ్మణుడు ఎంతో ఆనందమునొంది, శీఘ్రముగా ఇంటికెళ్లి నైవేద్యమును తీసుకొని వచ్చి స్వామికి సమర్పించుకుంటాడు. ఆ షడ్రసోపేత-మైన ప్రసాదమును స్వామి సేవించి, ఆ బ్రాహ్మణుని ఆశీర్వదించి ఇంటికి పంపుతాడు. తర్వాత అక్క-డనే స్వామి బ్రహ్మానంద స్థితిలో ఉండిపోతాడు.పిమ్మట,స్వామి అక్కడనుండి ప్రయాణము ముందు-కు కొనసాగిస్తూ, రామేశ్వరము చేరుకొని రామేశ్వరస్వామియొక్క దర్శనముగావించుకుని,అచట ఒక ఆశ్రమమందు యోగాభ్యాసము చేసే యోగీశ్వరుని ఉద్దేశించి ఈ ప్రకారముగా అడుగుతాడు.

నీవు యోగాభ్యాసములో ఏ అంగము సాధించి సిద్ధి పొందినావు?అప్పుడు ఆ యోగీశ్వరు-డంటాడు-నేను ఆసనాంగమును గెలిచాను. తద్వారా నాయొక్క శరీరము ఆరోగ్యముగా ఉంది అన్నాడు.సిద్ధనాథుడు సంతోషించి అక్కడనుండి ధనుష్కోటికి వెళ్లి ఒకానొకాయన అచ్చట సముద్ర-తీరమునందు స్నానము చేస్తుంటే ఆయనను సిద్ధనాథుడు ఈ విధంగా విచారిస్తాడు ఏమి? నీవు దేహము స్వచ్ఛంగా ఉందని స్నానము చేస్తున్నావా?లేక అస్వచ్ఛముగా ఉందని స్నానము చేస్తున్నా-వా? ఆ వ్యక్తి అంటాడు. దేహము అస్వచ్ఛముగా ఉందని స్నానము చేస్తున్నాను. అతనిని మళ్లీ సిద్ధ-నాథుడు ఈ విధంగా ప్రశ్నిస్తాడు. దేహము అస్వచ్ఛముగా ఉందని నీకెట్లు తెలుసు?ఆ వ్యక్తి ఉత్తర-మిస్తూ—ఈ శరీరమునకు జాతకర్మ దోషముంది. అందుకని ఇది అస్వచ్ఛముగా ఉందని స్నానము చేస్తున్నాను—అని అంటాడు. వీడు మూర్ఖుడు ఉన్నాడు—అనుకొని సిద్ధనాథుడు ముందుకు వెళ్లి, తిరునల్వేలికి వెళ్లి తిరుప్పావై(తిర్నల్)స్వామిని దర్శించుకుని అక్కడ ఒక ధ్యానస్థుడై ఉన్న భక్తునిచూ-సి ఆయనను ఇట్లడుగుతాడు.

నీవు చేసే ఈధ్యానము; (ధ్యేయమును) తెలిసి చేస్తున్నావా? లేక తెలియక చేస్తున్నావా? ఒకవేళ నీవు ధ్యేయమును తెలుసుకొని ధ్యానము చేస్తున్నానని అంటివా—అచ్చట ద్వైతము సిద్ధించ-దు. ధ్యాత, ధ్యేయము ఐక్యమై పోవును ధ్యాత లేడు. ధ్యేయము లేదు.ధ్యానము అసలే లేదు. ఒకవేళ తెలువక చేస్తున్నానని అంటావా–అది అసంభవము. "**ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే**" (సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము శ్లో.11) కావున, తెలువకనే చేస్తున్నానని అంటే, ధ్యానము నిరర్థకము కాగలదు. ధ్యేయమును తెలుసుకోకుండా ధ్యానము కుదరదు.

అప్పుడు ఆ ధ్యానస్థుడు ఈ ప్రకారముగా అంటాడు. అనుభవసిద్ధ అపరోక్షజ్ఞానము ఏదైతే అనుభూతముందో, దానికంటే భిన్నమైన శాస్త్రోక్తమైన పరోక్షజ్ఞానము ననుసరించే నేను ధ్యానము చేస్తున్నాను. దానికి కారణమేమనగా, శాస్త్రముయందు నాకున్న అత్యంత నిశ్చలమైన శ్రద్ధయే.

అది యెట్లనగా? అని సిద్ధనాథుడు మళ్ళీ అడుగుతాడు.

అప్పుడు ఆ ధ్యానస్థుడు సమాధానమిస్తూ—శాస్త్రసంస్కారహీనుడు, దేవతలయందు శ్రద్ధలే-నివాడు ధ్యానమునకు ప్రవృత్తుడు కాడు. ఉపాసకునికి శ్రద్ధ ముఖ్యము. అందుకనే నేను ధ్యానము (ఉపాసన) చేయుచున్నాను.

సిద్ధనాథుడు తనలోతాను ఈయన సాంప్రదాయిక భక్తుడని తెలుసుకొని **తోతాద్రి** క్షేత్రము-నకు వెళ్లి నారాయణమూర్తియొక్క దర్శనము తీసికొని ముందుకువెళ్ళి,**తిరుకారన్** దేవాలయములో శ్రీలక్ష్మీనారాయణుని దర్శించి అక్కడ తొమ్మిది రోజులు నివాసము చేస్తాడు. స్వామి వద్దకు అనేక మంది శాస్త్రజ్ఞులు వచ్చి శాస్త్రవిచారము చేసేవారు.

ఒకానొక శాస్త్రి స్వామివద్దకు వచ్చి, నీవు స్నానసంధ్యలు మొదలగు నిత్యకర్మలు ఎందుకు చేయడము లేదు?అని ప్రశ్నిస్తాడు.ఆయనకు సిద్ధనాథుడు ప్రత్యుత్తరమిస్తూ—కర్మసంబంధమైన క్రియ-లు చేసినట్లయితే వాటియొక్క సంస్కారము చిత్తమందుంటుంది.ఎప్పుడైతే, "స్థూలసూక్ష్మ వియోగ-రూప=మరణము" సంభవిస్తుందో, అప్పుడు సంస్కారసహిత మనస్సు ప్రాణవాయువును వాహన-ముగా చేసుకొని ఇహపర ఉభయలోకాలకు గమనాగమనము చేస్తుంది. "**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**" (బ్రహ్మబిందూపనిషత్ ౨)జీవుడు వేదోక్తమైన సత్కర్మలను విధిపూర్వకము-గా చేసినట్లయితే ఉత్తమలోకాలను పొంది, మరల ఆ పుణ్యక్షయము కాగానే మళ్లీ కర్మలను చేయడానికి ఈ మర్త్యలోకమునకు వస్తాడు. శాస్త్రనిషిద్ధ పాపకర్మలు చేసినట్లైతే నీచలోకాలను పొంది మళ్లీ మర్త్యలోకమునకే రావలసి ఉంది. కావున, "**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలో కం విశన్తి**" (గీత.౯-౨౧). ఈ విధంగా జననమరణరూప సంసారమున తగులుకుని అనేక జన్మలు ఎత్తడం మరణించడం మళ్ళీ జన్మించడం భోగములను అనుభవించుకుంటూ సంసార

చక్రంలో తిరుగుతూ జీవుడు అలసి, విసుగెత్తి విస్మయమొందుతాడు. వానికి విశ్రాంతి అనేది దొరకదు.

**శ్లో ॥ కుర్వతే కర్మభోగాయ కర్మ కర్తుం చ భుఞ్జతే ।**

**నద్యాం కీటా ఇవావర్తాదావర్తాన్తరమాశు తే ॥**

**వ్రజన్తో జన్మనోజన్మ లభన్తే నైవ నిర్వృతిమ్ ।** (వేదాన్త పఞ్చదశి 1-30)

**"పునరపిజననం పునరపి మరణం పునరపి జననీ జఠరేశయనం,**

**ఇహసంసారే బహువిస్తారే కృపయా పారే పాహిమురారే"** ॥భజగోవిందమ్ ॥

కాబట్టి కర్మత్యాగముచేతనే జీవుడు కర్మబంధమునుండి విడివడుతాడు.ఎంతదనుక జీవునికి కర్మలు చేయుటయందు విసుగురాదో, కర్మఫలాసక్తిని ఉపేక్షించడో, అంతదనుక శృతిమాత కర్మలను చేయమని చెప్తుంది. ఎప్పుడైతే వైరాగ్యరూప తీవ్రతర అగ్ని హృదయమందు ప్రకటమవుతుందో,అప్పుడు వైరాగ్యమును బోధించి నివృత్తి మార్గమును చూపుతుంది. వాస్తవానికి ముముక్షు దశయందే కర్మ, కర్మఫలాపేక్ష త్యాగము చేస్తాడు. ఇటువంటి సంవాదమును విని ఆ శాస్త్రి ఆనందించి దీనభావముతో సిద్ధనాథునికి వందన మాచరిస్తాడు.

ఈ విధముగా సిద్ధనాథుడు ఎచ్చటెచ్చట వెళ్లి నివాసము చేసినాడో, అచ్చటచ్చట జీవులు కర్మబంధమునుండి విముక్తులు కావడానికి వేదాంత మార్గమును ఉపదేశిస్తూ ఉండేవాడు. వేదాంత మార్గమొక్కటియే జీవుడు విషయాసక్తినొదులుకొని,దుఃఖరహితుడిగా, నిరామయుడుగా, నిర్భయస్థితిని పొందడానికి ఉత్తమమైన సాధన.

స్వస్తి శ్రీ సిద్ధరూఢ కథామృతమును శ్రవణముచేసిన, పఠించిన భక్తులయొక్క సకలపాపములు భస్మమైపోతాయి. శ్రీ సిద్ధారూఢచరణకమలములకు శ్రీశివదాసస్వామి ఈ ఐదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః




**పద్యానువాదము:—**ఎన్నో జన్మలనుండి వివేక వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తితో కూడి సాధనలు చేసినప్పటికైనా స్వరూపస్థితిని పొందలేదు. ఎప్పుడైతే సద్గురు ప్రసాదరూపముగా ఈ జన్మమును పొందినాడో, అప్పుడు సద్గురు కరుణాకటాక్షముద్వారా ఆత్మబోధను శ్రవణము చేసినందున సంపూర్ణ వివేకాది సాధనములు లభ్యమయ్యి ఈ జన్మయందే ఆత్మసాక్షాత్కారమును బడసి కృతకృత్యులౌతారు.

శ్రీ సిద్ధారూఢ యతీంద్రులవారు సకల ఉపనిషత్తుల అర్థమును కరతలామలకమువలె నెఱిగిన వాడై, ఎల్లప్పుడు బ్రహ్మతత్వముయందే నిమగ్నుడై స్వరూపస్థితియందే ఉండేవాడు. అద్వైత భావముచేత (దృష్టిచేత) సర్వప్రపంచమును వీక్షించేవాడు. అయినాగాని సిద్ధనాథుడు బ్రహ్మైక్య స్థితిలో ఉండికూడా ముముక్షువులకు అద్వైతభావమును ఉపదేశించేవాడు. ఏకత్వభావనను ఉపదేశించేవాడు. ఈ ప్రకారముగా సాధకులకు, ముముక్షువులకు ఉపదేశించడమే కాకుండా శరణార్థి (ఆర్త,అర్థార్థి) భక్తులను కూడా కరుణించి ఉద్ధరించేవాడు.

ఈ విధముగా సిద్ధనాథుడు **తిరుకారన్** నుండి తిరుగుప్రయాణముచేసి మళ్ళీ చింతామణి ఆశ్రమమునకు చేరుకొని, కొన్ని రోజులపాటు ఆశ్రమంలో ఉన్నాడు. ఆసమయంలో ఎందరో జిజ్ఞాసువులు స్వామివద్దకు నిత్యము వచ్చుండెడివారు. వారియొక్క శంకలను నిరసించి సమాధానము చెప్తూ ఉండేవాడు.ఇటువంటి ఈ వార్తను విన్న ఒకానొక శాస్త్రి, స్వామి వద్దకువచ్చి ఈ ప్రకారంగా ప్రశ్నిస్తాడు. "ముముక్షుత్వము" ధర్మమా? లేక గుణమా? దయచేసి చెప్పండి. అవధూతయగు సిద్ధనాథుడు ఆ శాస్త్రికి సమాధానము చెప్తూ—ముముక్షుత్వము ధర్మము కాదు. ఎందుకనగా, ఏది ధర్మముంటుందో, అది ధర్మిని ఆశ్రయించుకుని ధర్మితో పాటు ఎల్లప్పుడు ఉంటుంది. ఉదా:– అగ్ని యొక్క ధర్మము ఉష్ణత. కాని, ముముక్షుత్వము జీవునితో పాటు ఎల్లప్పుడూ ఉండేది కాదు. ఎప్పుడు జ్ఞానముదయిస్తుందో, అప్పుడు ముముక్షుత్వము తొలగిపోతుంది.ముముక్షుత్వము" గుణము కూడా కాదు. ఎందుకనగా, గుణము ఏది ఉంటుందో అది జన్మతః వస్తుంది. ఉదా:– పుష్పము పుట్టగానే దానితోపాటు గంధగుణము పుట్టును. కాని, ముముక్షుత్వము జీవుడు పుట్టిన తరువాత తన పూర్వ

పుణ్యము ఉదయించినప్పుడు సచ్ఛాస్త్రమునందు ప్రవృత్తుడై సద్గురువును ఆశ్రయించి మోక్షమును కోరి ముముక్షువవుతాడు. ఒకవేళ ముముక్షుత్వము గుణమయినట్లయితే జీవుడు అభ్యాసమునకు ప్రవృ-త్తుడు కాడు. అభ్యాసముచేసి తాను యథార్థమైన తన స్వరూపాన్ని పొందాలని ఎవరికి భావన ఉత్పన్నమవుతుందో, వారు ముముక్షువులు అని తెలుసుకొనవలెను. ఎంతదనుక అభ్యాసము చేయాలనే శుభేచ్ఛ కలిగియుండి, ఆ ఇచ్ఛద్వారా శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువును ఆశ్రయించి మహావాక్యశ్రవణముద్వారా యథార్థమైన జీవబ్రహ్మైక్య స్థితిని పొందడో, అంతదనుక ముముక్షు-త్వము ఉంటుంది. అటుతర్వాత ముముక్షు దశయొక్క అంత్యఫలము "**అహం బ్రహ్మాస్మి**"యను వృత్త్యాత్మకజ్ఞానము (అంతఃకరణ పరిణామము)హృదయమందు ఉదయించి,అపరోక్ష నిశ్చయము కలుగుతుంది. ఆ అపరోక్షజ్ఞానముద్వారా శరీరము మొదలుకొని అనాత్మపదార్థములయందు అ-హంతా, మమత్వబుద్ధి క్షీణించినవాడై బంధనివృత్తిని పొందుతాడు. ఆ బంధనివృత్తి అంటేనే జీవుని యథార్థమైన బ్రాహ్మీస్థితి. తన స్వరూపస్థితి. "**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి**"(ముం.3-2-9);"**తరతిశోక-మాత్మవిత్**" (ఛాం.7-1-3) అను శ్రుత్యనుసారము–జలబిందువు సముద్రంలో కలిసినట్లు–బ్రహ్మస్వరూ-పుడవుతాడు.

ఇట్టి శ్రుతి,యుక్త్యనుసారమగు యథార్థమైన సిద్ధనాథునియొక్క వచనములను విన్న ఆ శాస్త్రి యొక్క చిత్తమునకు సమాధానము కలిగి ఎంతోసంతోషించినాడు.శాస్త్రి,స్వామికి సాష్టాంగ దీర్ఘ-దండ నమస్కారములు చేసి తన ఇంటికి వెళ్లిపోయినాడు.

పిచ్చండయ్య అను పేరుగల శాస్త్రి, స్వామి వద్దకు వచ్చి ఈ ప్రకారంగా ప్రశ్న చేస్తాడు. స్వామీ! భూత భౌతిక పదార్థములకు పృథ్వి ఆధారము కదా! మరి ఆ భూమికి ఆధారము ఏమి ఉంది?

సద్గురుసిద్ధనాథుడు పిచ్చండయ్య శాస్త్రియొక్క ప్రశ్నకు సప్రమాణముగా సమాధానము చెప్పు-తున్నాడు. శ్రుతిః :–"**బ్రహ్మణోరవ్యక్తమ్, అవ్యక్తాన్మహత్, మహతోరహంకారః। అహంకారాత్పంచ తన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని,పంచమహాభూతేభ్యోఽఖిలం జగత్**"(త్రిశిఖిబ్రా-హ్మణోపనిషత్ 1-1);"**ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యఃపృథ్వీ**"(తై.౨-1-1) పృథివికి ఆధా-రము జలము. పరాశరస్మృతి ఈవిధంగా చెప్పింది."**తదాప్యం పృథ్వి**" జలమునకు ఆధారము అగ్ని. "**ఆగ్నేరాపః**" అని శ్రుతి వచనముంది. అగ్నికి ఆధారము వాయువు."**వాయోరగ్నిః**" శ్రుతి ప్రమా-ణముంది. వాయువునకు ఆధారము ఆకాశము."**ఆకాశాద్వాయుః**"అని వేదవాక్యము. కారణమేమ-నగా, వాయువు ఆకాశంయొక్క శ్వాసరూపమైనటువంటిదని జ్ఞాని మహాత్ములయొక్క వదంతి.ఆ ఆకాశమునకు అధిష్ఠానము "**అక్షరపరమాత్మ**"అని తెలుసుకో."**తస్మాద్వా ఏతస్మాదాత్మనః ఆకాశ సంభూతః**" పృథివ్యాది పంచమహాభూతములకు ఆధారము, అధిష్ఠానము బ్రహ్మమే ఉన్నది–అని ఈవిధంగా శ్రుతి ప్రమాణములు ఉన్నవి.

ఇట్టి యథార్థమైన వచనములను విన్న ఆ పిచ్చండయ్య శాస్త్రికి ఎంతో ఆనందము కలిగింది. తదనంతరము ఆశాస్త్రి తన ఇంటికివెళ్లి స్వామి కోసము ప్రసాదమును తీసుకొనివచ్చినాడు. సిద్ధారూఢస్వామి ఆ ప్రసాదమును స్వీకరిస్తాడు.

అప్పుడు మరియొక పురుషుడు వచ్చి సిద్ధనాథున్ని ఈ విధంగా ప్రశ్నిస్తాడు. మనస్సు ఎల్లప్పుడూ చంచలంగా ఉంటుంది. దానికి కారణమేమిటో సవిస్తరముగా చెప్పవలసింది. ఆప్రశ్నకు సిద్ధనాథుడు సమాధానము చెప్తూ:-

మనస్సు చంచలంగా ఉండడానికి కారణములు రెండు. ఒకటి వాయువు. రెండవది రజోగుణము. ఈ రెండు మనస్సును చంచలము చేస్తున్నాయి. వాయువుయొక్క సగభాగమును తీసుకొని మనస్సు ఉత్పన్నమైంది. కావున,వాయువుయొక్క స్వభావముచేత "**కారణగుణాః కార్యానువర్తన్తే**" అను నియమానుసారము మనస్సునకు చంచలత్వము వచ్చింది. ఇక సకల విషయాల యందు (శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములలో) తిరగడము, మనసు ఒక్క క్షణంకూడా నిలకడగా ఉండక పోవడానికి కారణము రజోగుణము. తద్వారా ఎన్నో సంకల్ప వికల్పములను కలుగుతాయి. కావున, మనస్సుయొక్క మొదటి దోషమైన చంచలత్వము నివృత్తి కావడానికి పతంజలి భగవాన్ యోగశాస్త్రంలో ప్రాణాయామ సాధనను చెప్పినాడు.

ఇక మనస్సుయొక్క రెండవ దోషమైన సంకల్ప వికల్పములు నివృత్తి కావడానికి ఉపాయము చెబుతున్నాడు. ఏమనస్సుకైతే దృగ్దృశ్యవివేకముయొక్క అభావమున్నదో, దానిని ఆత్మానాత్మ విచారమందు ఎల్లప్పుడు ఉంచాలి. దృగ్దృశ్య చింతన చేయించాలి. తద్వారా సంకల్ప వికల్పములు నశించును.ఈ దృగ్దృశ్య వివేకముదయించడానికి ఆత్మచింతన, సద్గురువుయొక్క బోధ ఎంతో అవసరముందని సిద్ధనాథుడు బోధించగా ఆ పురుషుడు ఎంతో ఆనందభరితుడై, దైవయోగమువలన నాకు సద్గురువుయొక్క దర్శనభాగ్యము ప్రాప్తమైనదని, యథార్థమైన సద్గురువు మీకంటే వేరు నాకెవరును లేరని, మీరు ఏదైతే దృగ్దృశ్య విచారము చేయాలని చెప్పినారో,ఆ దృగ్దృశ్య వివేకము గూర్చి యిప్పుడే చెప్పండి-అని వేడుకుంటాడు. "**త్వదన్యఃసంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే**" (గీ.6-39).

అప్పుడు సద్గురునాథుడు ఈ ప్రకారముగా సమాధానము చెబుతున్నాడు. కూటస్థునియొక్క ప్రతిబింబయుక్తముగా అంతఃకరణవృత్తి ఇంద్రియసమవేతమై ఘటాదివస్తువులను చూడగలదు.ఆ సమయమున ఆ స్థలమందు ఘటాదివస్తువులు దృశ్యములు కాగలవు. ఇంద్రియము దృక్కు కాగలదు. ఇంద్రియమునందు అంధత్వ,మందత్వ,పటుత్వ ధర్మములను మనస్సు తెలుసుకుంటుంది. కాబట్టి ఇచ్చట మనస్సు దృక్కని చెప్పబడినది. మనస్సుయందున్న సంకల్పవికల్పాది వికారములు, సంశయాది దోషములను-బుద్ధియందున్నటువంటి కూటస్థప్రతిబింబరూప చిదాభాసుడు తెలుసుకుంటాడు. కావున, చిదాభాసుడు దృక్కు అని చెప్పాలి. ఆ చిదాభాసుడు బుద్ధి అధీనమందున్నాడు. ఆ

బుద్ధి సుషుప్తి యందు అవిద్యలో విలీనమవుతుంది. కాబట్టి ఘటాదివిషయములను, ఇంద్రియములను, మనస్సును, బుద్ధుని,బుద్ధియందున్న కూటస్థ ప్రతిబింబమైన చిదాభాసుని అన్నిటిని ప్రకాశించేది కూటస్థుడే. వీటన్నిటియొక్క భావ అభావములను తెలుసుకునేది కూటస్థుడే(సాక్షియే).కావున, చిదాభాసునియొక్క పరమార్థరూప కూటస్థ చైతన్యము (కూటస్థాత్మ)దృక్కు అని సిద్ధించుచున్నది. దేని యొక్క సహాయము లేక తనంతట తానే స్వయంప్రకాశమానమై విరాజిల్లునటువంటి ఆ కూటస్థాత్మయే మనందరియొక్క నిజస్వరూపము. అదే బ్రహ్మము.దానికంటే వేరే ఇంకొక దృక్కు లేడు.

బాహ్యము అంతరము అను భేదము వృత్తియొక్క అపేక్ష చేతనే వ్యవహరింపబడుతున్నది కాని, వాస్తవముగా దృక్కు(కూటస్థుని)యందు ఏభేదమును లేదు. సకలప్రపంచమును దృగ్రూప ఆత్మ ఏకయత్నముచే తెలుసుకుంటుంది. మనస్సు, బుద్ధి, ఇంద్రియములయొక్క ఆపేక్షలేకయే కూటస్థాత్మ స్వయముగా ప్రకాశిస్తుంది.దానినే చిన్మాత్ర పరబ్రహ్మము అంటారు. అదే నీవు.స్వతస్సిద్ధమై ఎల్లప్పుడు ఉండేవాడివి. నీ కంటే భిన్నంగా దృక్కు మరొకటి లేదు. ఆ దృక్కు కన్న భిన్నంగా నీవు లేవు. అదే నీవు నీవే అది- "**తత్త్వమసి**" "**నాసిత్వం సంసారి**". ఇట్లు తెలుసుకుని ధన్యుడవు కమ్ము.

పై విషయమంతయు శ్రీ జగద్గురు శంకరాచార్యులవారిచే రచింపబడిన "**వాక్యసుధ**= దృగ్దృశ్యవివేకము" నుండి సంగ్రహింపబడినది.

**శ్లో ॥రూపం దృశ్యం లోచనం దృక్, తద్దృశ్యం ద్రష్టృమానసమ్ ।**
**దృశ్యాధీవృత్తయః సాక్షీ, దృగేవ నతు దృశ్యతే ॥**

**శ్లో ॥నీల పీత స్థూల సూక్ష్మ, హ్రస్వ దీర్ఘాది భేదతః ।**
**నానావిధాని రూపాణి పశ్యేల్లోచనమేకధా ॥**

**శ్లో ॥ఆన్ధ్యం మాన్ద్యం పటుత్వేషు నేత్రధర్మేషుచైకధా ।**
**సంకల్పయేన్మనః శ్రోత్రత్వగాదౌ యోజ్యతామిదమ్ ॥**

**శ్లో ॥కామసంకల్ప సందేహౌ శ్రద్ధాఽశ్రద్ధే ధృతీతరే ।**
**హ్రీర్ధీర్భీరిత్యేవమాదీన్ భాసయత్యేకధా చితిః ॥**

**శ్లో ॥నోదేతి నాస్తమేత్యేషా న వృద్ధిం యాతి న క్షయమ్ ।**
**స్వయం విభాత్యథాన్యాని భాసయేత్సాధనం వినా ॥**(వాక్యసుధా 1 నుండి 5)

అట్లే, వేదాన్త పఞ్చదశిలో గూడ శ్రీవిద్యారణ్యగురుదేవులు ఈ విధముగా సెలవిచ్చియున్నారు.

**శ్లో ॥కర్తారం చ క్రియాం తద్వద్వ్యావృత్తవిషయానపి ।**
**స్ఫోరయేదేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః ॥** (వే.పం.10-90)

**శ్లో ॥అహంకారం ధియం సాక్షీ విషయానపి భాసయేత్ ।**
**అహంకారాద్యభావేఽపి స్వయం భాత్యేవ పూర్వవత్ ॥**(వే.పం.10-12)

**శ్లో ॥స్వస్థాన సంస్థితో దీపః సర్వతో భాసయేద్యథా ।**

**స్థిరస్థాయీ తథా సాక్షీ బహిరన్తః ప్రకాశయేత్ ॥**

**శ్లో ॥బహిరన్తర్విభాగోఽయం దేహాపేక్షో న సాక్షిణి ।**

**విషయా బాహ్యదేశస్థా దేహస్యాన్తరహంకృతిః** ॥(వే.పం.10-15 &16)

https://sanskritdocuments.org/iast/vedanta/

మలయనాథుడనే ఆ బ్రాహ్మణుడు సిద్ధనాథునియొక్క సంభాషణమును విని, మీయొక్క యథార్థమైన వాక్యములను విని నేను ధన్యుడను, కృతకృత్యుడనైతిని. మరియు నాయొక్క పితరులు కూడా యదార్థముగా ధన్యులైనారు-అంటూ సద్గురువునకు సాష్టాంగదండప్రణామములు సమర్పించి వెళ్ళిపోతాడు.

ఐదవ రోజున రాంబట్టు అను పేరుగల బ్రాహ్మణుడు వచ్చి సిద్ధనాథునికి సాష్టాంగ నమ-స్కారములు సమర్పించి ఈ విధంగా ప్రశ్నిస్తాడు. ఈ ప్రపంచము ఎవరియొక్క ప్రకాశముచేత తెలియబడుతుంది-చెప్పండి స్వామీజీ.

అప్పుడు ఆ బ్రాహ్మణునికి ప్రత్యుత్తరమిస్తూ–సిద్ధనాథుడు దినమునందు సూర్యుడు, రాత్రి యందు చంద్రుడు, నక్షత్రములు మరియు దీపమువలన ఈ ప్రపంచము తెలియబడుతుంది.

రాంబట్టును స్వామి అడుగుతాడు. పై చెప్పిన సూర్య చంద్రాదులు దేనిద్వారా తెలియబడు-చున్నవి?

రాంబట్టు:–నేత్రము ద్వారా తెలియబడుచున్నవి.

సిద్ధనాథుడు:–ఆ నేత్రాలను మూసుకున్నాక దేని ద్వారా తెలియబడును?

రాంబట్టు సమాధానమిస్తూ-బుద్ధిద్వారా తెలియబడును. కాని, ఆబుద్ధి దేనివలన ప్రకాశింప బడుతుంది?

సిద్ధనాథుడు జవాబిస్తూ–ఆ బుద్ధి అహంకార యుక్త చిదాభాసుని వలన తెలియ బడుతుంది. బుద్ధి మరియు బుద్ధియందలి ప్రతిబింబరూప చిదాభాసుడు సమాధి అభ్యాసమువలన లయము పొందినాక ఒకే ఒక సచ్చిదానంద పరబ్రహ్మమైనటువంటి ఆత్మ స్వతస్సిద్ధముగా ఉండి ఇంద్రియ-ములను ఘటపటాదులను, మనస్సును, బుద్ధిని అన్నిటినీ ప్రకాశిస్తుంది. ఏ ఇతర పదార్థముల ప్రకాశముయొక్క అపేక్ష లేకయే స్వయంగా ప్రకాశించు, జ్ఞప్తిరూపమైన సచ్చిదానంద పరబ్రహ్మమే నీవు. అదే నీ యొక్క నిజస్వరూపము-అని తెలుసుకో.

ఏకశ్లోకి— **కిం జ్యోతిస్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికమ్,**

**స్యాదేవం రవి దీప దర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే ।**

**చక్షుస్తస్య నిమీలనాది సమయే కిం, ధీర్ధియో దర్శనే,**

**కిం తత్రాహమతో భవాన్ పరమకం, జ్యోతిస్తదస్మి ప్రభో! ॥**

అని సిద్ధనాథుడు బోధించగా,వింటూ వింటూనే రాంబట్టు తనయొక్క నిజస్థితిని పొందినా-డు. తర్వాత సిద్ధనాథునియొక్క పాదములకు నమస్కరించి నేను మీయొక్క కరుణాకటాక్షముచేత కృతార్థుడనైతినని అతి ఆనందముతో తనయొక్క స్వస్థానమునకు వెళ్లిపోయెను.

ఆరవరోజున సద్గురు సిద్ధనాథుని వద్దకు చిదంబర దీక్షితులు అను బ్రాహ్మణుడు వచ్చి "తత్వమసి"(ఛాం.6-8-7) మహావాక్యముయొక్క యథార్థమైన అర్థమేమిటో తెలియజేయగలరని మనవి చేసుకుంటాడు.

సిద్ధనాథుడు ఉత్తరమిస్తూ–నీవే ఆ పరబ్రహ్మమువు ఉన్నావు–అను అర్థమును "తత్వమసి" మహావాక్యము బోధిస్తుంది-అని అంటాడు.

దీక్షితులవారంటారు- "తత్వమసి" మహావాక్యముయొక్క యధార్థమైన అర్థము అది కాదు. నేను చెబుతాను విను—పుణ్యకర్మలుచేసిన వానియొక్క ఆత్మ దేవలోకానికి వెళ్లి దేవత్వమును పొంది శుద్ధమవుతుంది.కావున, "తత్వమసి"మహావాక్యము స్తుతిపరవాక్యమున్నదని అంటాడు.(పూర్వమీ-మాంసకుల అనుయాయులు).

అవధూత సిద్ధారూఢస్వామి ఈ ప్రకారంగా అంటాడు. మహావాక్యము జ్ఞానకాండముయొక్క అర్థమును తెలుపుతుంది. ఇది స్తుతిపర వాక్యము ఏరీతిచేతగూడ కాదు. దీనికి కారణము నేను చెబుతాను విను అని అంటాడు.

ఏ వస్తువు ద్రవ్యత్వాది అనగా, ద్రవ్యము, గుణము, కర్మ, సంబన్ధము, జాతి, వర్ణము, ఆశ్రమము ఇత్యాది ధర్మములు గలదై యుండునో,అది స్తుతికి యోగ్యమౌతుంది. కాని, ఆత్మ నిర్ధర్మకమై, నిరాలంబమై సామాన్య విశేషభావరహితమై (నిర్విశేషమై)పరిపూర్ణమై ఉంది.

**శ్లో ॥ షష్ఠీ గుణ క్రియా జాతి రూఢయ శ్శబ్దహేతవః ।**

**నాత్మన్యన్యతమో హ్యేషాం తేనాత్మా నాభిధీయతే ॥** (నైష్కర్మ్యసిద్ధిః 3-103)

శబ్దప్రవృత్తికి కారణములగు షష్ఠీ=సంబన్ధాదులేవియు ఆత్మయందు లేనందున ఆత్మ వాక్కునకు(స్తుతికి) విషయము కాదు.

ఆ ఆత్మ దేనియొక్క ఆపేక్షలేక స్వతస్సిద్ధమై, స్వయంప్రకాశమై అవాఙ్మానసగోచరమై ఉన్నది. కావున, దానిని స్తుతిచేయడం సంభవించదు. అటువంటి ఆత్మను మహావాక్యము లక్షణావృత్తిచేత తెలుపుతుంది.

**శ్లో ॥తత్త్వమస్యాది వాక్యేషు లక్షణా భాగలక్షణా ।**

**సోఽయమిత్యాది వాక్యస్థ పదయోరివ నాపరా ॥** (వాక్యవృత్తిః 48)

ఆ మహావాక్యము స్తుతిపరము కాదు. మరేమనగా, ముముక్షువులకు ఉపదేశపరవాక్యముంది.

**శ్లో ॥త్వద్యాత్రయా వ్యాపకతా హతా తే, స్తుత్యానయా వాక్పరతా హతా తే ।**

**ధ్యానేన చేతః పరతా హతా తే, క్షమస్వ దేవ త్వపరాధమేతత్ ॥** (శ్రీ మధుసూదన సరస్వతి)

ఒకవేళ, మహావాక్యము స్తుతిపరమని ఒప్పుకొని, కర్మనే ముఖ్య కర్తవ్యము అన్నట్లయితే జ్ఞానిమహాత్ముడు తన జీవితమంతా కర్మలయందే ఆసక్తుడై ఉండవలెను.కాని, ఈవిధంగా ఎక్కడ కూడా చెప్పబడలేదు, లోకప్రసిద్ధముగూడ లేదు. మహాత్ములు (జ్ఞానులు) కర్మలయందు ప్రవృత్తులు కారు.

అట్లయినచో, ఈ "తత్వమసి" మహావాక్యము ఉపాసనపరముగా చెప్పవచ్చును గదా–అని చిదంబర దీక్షితులవారంటారు.

సిద్ధనాథుడు దీక్షితులవారిని వికల్పించి అడుగుతాడు. నీవు చెప్పినటువంటి ఉపాసన,యేమి తనకన్నాభిన్నంగా ఉందని ఉపాసన చేయబడుతుందా? లేక ధ్యేయమే తాను (తన స్వరూపము)అని ఉపాసన చేయబడుతుందా? అని అడుగుతూ ఈ రెండు రకముల ఉపాసనలు ( ప్రతీకోపాసన, అహంగ్రహోపాసన) జ్ఞానమునకు అయోగ్యములే ఉన్నవని అంటాడు.

కారణమేమనగా (వస్తు తంత్రము జ్ఞానము,కర్తృ తంత్రము ధ్యానము) ధ్యానము ధ్యాతను ఆశ్రయించుకుని ఉండు మానసిక కర్మ. కావున, ఉపాసన జ్ఞానమునకు అయోగ్యము.ఏ శాస్త్రము కూడా కర్మ ద్వారా జ్ఞానము ప్రాప్తిస్తుందని చెప్పలేదు. జ్ఞానికి కర్మ ఉపాసనలు శ్రుతిచే నిషేధింపబడినవి.

**శ్రుతిః ॥"న కర్మణా న ప్రజయా,న ధనేన త్యాగేనైకే అమృతత్వమానుశుః"**(మ.నా.8-14)

**కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః ।** (బృ.4-4-22)

**శ్లో ॥యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**

**ఆత్మన్యేవ చ సన్తుష్టః తస్య కార్యం న విద్యతే ॥** (గీత. 3-17)

**శ్లో ॥నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**

**నచాస్య సర్వ భూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥** (గీత. 3-18)

**శ్లో ॥జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యశ్చ యోగినః ।**

**నైవాస్తి కిఞ్చిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్ ॥** (జాబాల దర్శనోపనిషత్ 1-23)

శాస్త్రోక్త కర్మద్వారా పుత్ర పౌత్రాది సంతతిగాని, రాజ్యవైభవముగాని, స్వర్గాదిలోకములు గాని ప్రాప్తము కావచ్చును. కాని, త్యాగము లేకుండా పరమసుఖము, అమృతత్వము ప్రాప్తము కాజాలదు. ఆత్మలోకమును ఇచ్ఛజేయు మాకు ఈ పుత్రాదులతో పనియేమి?

ఏ మనుష్యుడు తనలో తానే యానందించునో, తనలో తానే తృప్తిబొందునో, తనయందే సంతోషించునో, అతనికి చేయదగిన కార్యమెద్దియును లేదు. అట్టి ఆత్మారాముడు కృతకృత్యుడనబ-డును. ఆత్మానందభరితుడగు బ్రహ్మవేత్తకు ఈ లోకమున కర్మను చేయుటచేతగాని,చేయకుండుట-చేతగాని యెట్టి ప్రయోజనము లేదు. ఏ ప్రయోజనముకొఱకుగాని సమస్తభూతములలో ఆశ్రయింప-దగిన దేదియును లేదు. జ్ఞానామృతముచే పరితృప్తుడైనవానికి యే కొంచెముగూడ కర్తవ్యము లేదు. ఒకవేళ కర్తవ్యమున్నయెడల అతడు జ్ఞాని కాదు.

"**జ్ఞానాదేవతు కైవల్యం**"(లోపశ్రుతిః; సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము 170) "**నాన్యఃపంథా అయ నాయ విద్యతే**" (శ్వే.3-8)

**శ్లో ॥ కర్మణా బధ్యతే జన్తుః విద్యయా చ విముచ్యతే ।**

**తస్మాత్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శినః ॥**(సంన్యాసోప.2-98; మ.భా.శాన్తి ప.241-7)

**శ్లో॥ ప్రవృత్తి లక్షణం కర్మ జ్ఞానం సంన్యాసలక్షణమ్।**

**తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహబుద్ధిమాన్॥** (నారద పరివ్రాజకోపనిషత్.3-15 &16)

**శ్లో ॥ అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్ ।**

**విద్యాऽవిద్యాం నిహన్త్యేవ తేజస్తిమిరసంఘవత్ ॥** (ఆత్మబోధ 3)

జ్ఞానముచేతనే కైవల్య(మోక్ష)ప్రాప్తి కలుగుతుంది.మోక్షమునకు వేరే మార్గము లేదు. కర్మచే జీవులు బద్ధులగుదురు. జ్ఞానముచే ముక్తులగుదురు. కావున,తత్త్వదర్శులగు జ్ఞానులు కర్మవిముఖు-లగుదురు. కర్మ ప్రవృత్తిరూపమైతే,జ్ఞానము సంన్యాసముయొక్క ముఖ్యలక్షణమైయున్నది.కావున, బుద్ధిమంతుడగు పురుషుడు జ్ఞానమును లక్ష్యముగా పెట్టుకొని సంన్యాసాశ్రమములో ప్రవేశిం-పవలయును. బోధకంటె అన్యసాధనములన్నియు కర్మరూపములే. విరోధమలేనిదగుటచేత కర్మ అవిద్యను నివర్తింప(నశింప)జాలదు. వెలుతురు చీకటిసమూహమునువలె అవిద్యను విద్యయే నాశ-నము జేయును. ఈవిధముగా జ్ఞానికి శ్రుతిస్మృతులు కర్తవ్యమును(కర్మను) నిషేధించుచు, జ్ఞాన-ముచేతనే మోక్షము కలుగునని ఉద్ఘోషించుచున్నవి.

ఒకవేళ నీవు హఠముచేత మహావాక్యము కర్మపరమున్నదని అన్నట్లయితే, దానిచేత అవిద్య యొక్క నివృత్తి అణుమాత్రముకూడా కలుగనేరదు. ఇది నిశ్చయము. అందుకే "తత్త్వమసి" మహా-వాక్యము కర్మపరముకాదు. జ్ఞానపరమున్నదని సిద్ధనాథుడు బోధించగా చిదంబర దీక్షితులవారు చాలా సంతోషించి, స్వామికి నమస్కరించి తన గృహమునకు వెళ్లిపోయినాడు.

ఏడవ రోజున శ్రీ సిద్ధారూఢ యతీంద్రులవారు ప్రాతఃకాలమున సభామండపమునందు విరాజమానమైయున్న సమయమున తిర్కంభట్టు అనే పేరుగల బ్రాహ్మణుడు వచ్చి స్వామిని ఈ విధంగా ప్రశ్నిస్తాడు.

బ్రహ్మాత్మైకత్వము అనే ఈ వస్తువు ఏ లక్షణముద్వారా లక్షితమై ఉంది?

అప్పుడు అవధూత మహాత్ముడు సమాధానము చెప్తూ—సావధానముగా వినుము అంటాడు.

**శ్లో ॥యత్ప్రకాశం సుఖం నిత్యం, నామరూపాశ్రయో విభుః ।**

**మతేర్లక్ష్యమలక్ష్యంచామేయం శుద్ధం తదస్మ్యహమ్ ॥**

హిందుస్థానీ దోహా:–**జో సుఖ నిత్య ప్రకాశ విభు, నామరూప ఆధార్ ।**

**మతి న లఖై జిహి మతి లఖై, సో మై శుద్ధ అపార్ ॥**(విచారసాగరము)

ఏది సుఖస్వరూపమై, నిత్యమై, స్వయంప్రకాశమై, వ్యాపకమై మరియు నామరూప ప్రపంచమునకు ఏది ఆధారమై ఉందో, నేత్రాది ఇంద్రియములకు, మనోబుద్ధులకు ఏది అగోచరమై వాటినన్నిటిని ఏది ప్రకాశిస్తోందో(తెలుసుకుంటుందో)అదే శుద్ధమై, అపారమై మహావాక్యముయొక్క లక్ష్యార్థముద్వారా లక్షితమై ఉన్నది. ఆ వస్తువే (నేను)ఆత్మను.అట్టి ఆత్మయే పరబ్రహ్మము.

ఆ బ్రహ్మము ఒకవేళ కేవలము సుఖమాత్రమే అని చెప్పినట్లయితే విషయాది క్షణికసుఖములందు బ్రహ్మముయొక్క లక్షణమునకు అతివ్యాప్తిదోషము వస్తుంది కదా! అనవచ్చు. తన్నివారణార్థము "నిత్యము"అను పదమునుచేర్చి లక్షణముచేయబడినది. అయినాగాని ఆకాశము,దిశ, కాలము, మనస్సు మొదలగునవి నైయాయికులు నిత్యమని ఒప్పుకున్నందున బ్రహ్మలక్షణమునందు అతివ్యాప్తి దోషము ప్రాప్తమౌతుంది. కాబట్టి "ప్రకాశము"అని బ్రహ్మమునకు లక్షణము చేయబడినది. బ్రహ్మము ప్రకాశము అని చెప్పినట్లయితే సూర్యుడు,చంద్రుడు,నక్షత్రములు,అగ్ని,దీపము మొదలగునవి ప్రకాశములై ఉన్నవి. వాటియందు ప్రకాశధర్మముంది. కాబట్టి అతివ్యాప్తి అవుతుంది. ఆ దోషనివృత్త్యర్థము లక్షణములో "విభు" అను పదము నివేశింపబడినది. ఈ విధంగా అనేక లక్షణ దోషములను నివర్తింపగా "విభు" అను యధార్థ లక్షణముద్వారా బ్రహ్మము లక్షితమైనది.

ఈ ప్రకారమైన సంవాదమును విన్న తరువాత తిర్కంభట్టు స్వామిని మళ్లీ ప్రశ్న చేస్తాడు. బ్రహ్మమునకు "ఆనందము" అనునది గుణమా? చెప్పండి.

సిద్ధనాథుడు అంటాడు–ఆనందము బ్రహ్మమునకు గుణముకాదు.ఎందుకనగా, గుణము ఆగంతుకమై వచ్చిపోయేది(ఆగమాపాయి)ఉంటుంది.ఆత్మ నిత్యప్రేమస్వరూపమై,అవిచ్ఛిన్నమై,అవినాశియై ఉంటుంది. **"రసోవై సః"**(తై.2-7) **"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"**(తై.3-6).

తిర్కంభట్టు మళ్లీ శంక చేస్తాడు. బుద్ధిద్వారా బ్రహ్మము తెలియబడనట్లయితే, బ్రహ్మానందము తెలియకుండా బుద్ధియొక్క దుఃఖములు ఎట్లు నివృత్తి కాగలవు?

సిద్ధనాథుడు అంటాడు. నీవు అన్నది నిజమే. అసంస్కృత(అశుద్ధమైన)బుద్ధికి ఆత్మ(బ్రహ్మము) తెలియబడదు. వేదాంతశాస్త్ర శ్రవణముద్వారా సంస్కృతమైన(శుద్ధమైన)బుద్ధికి ఆత్మ(బ్రహ్మ)సాక్షాత్కారమగును. అశుద్ధబుద్ధి అంటేనే "**త్వం**" పదముయొక్క వాచ్యార్థమైన జీవుడు. విచారముద్వారా

ఆ బుద్ధి శుద్ధమైనప్పుడు, "**తత్**" పదముయొక్క వాచ్యార్థము ఈశ్వరుడు. "**త్వం**" పదముయొక్క వాచ్యార్థమైన జీవుడు. ఇద్దరియొక్క లక్ష్యార్థము(జీవచేతనము-ఈశ్వరచేతనము రెండును) బ్రహ్మ చేతనమే అని తెలుసు కున్నప్పుడు ఆవరణము (అజ్ఞానము) నివృత్తమగును. "**దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః**" (కఠ.1-3-12)

కేవలము శుద్ధ బుద్ధియందే అభేద నిశ్చయము–బ్రహ్మసాక్షాత్కారమగును. కాని, నీ ఆత్మకు కాదు. ఆత్మ ఎప్పుడూ స్వప్రకాశమై, నిత్యముక్తమై, స్వతస్సిద్ధమై ఉంటుంది. ఈ విధముగా "అహంబ్రహ్మాస్మి" అను వృత్తిరూపజ్ఞానము బుద్ధియందు ఎప్పుడు ఉదయించునో,అప్పుడు బుద్ధియొక్క సుఖదుఃఖ ద్వంద్వధర్మములు నివృత్తి కాగలవు. ఈ సంభాషణమును విన్న తిర్కంభట్టు చాలా ఆనందమును పొందినాడు.

ఎనిమిదవ రోజున అవధూత సిద్ధనాథస్వామి ఆలయమునందు విరాజమానమై ఉండగా అ-యాచిత నైవేద్యము లభించింది. దానిని స్వామి సేవించి జలమును తాగినాడు. తరువాత లౌకిక సంస్కారంగల గోవిందభట్టు అనే పేరుగల ఒక బ్రాహ్మణుడు సిద్ధయోగీంద్రులకు నమస్కరించి ఈ విధంగా అడుగుతాడు.

ఓ సిద్ధనాథా! జ్ఞానికిగూడా క్షుత్పిపాసలు దుఃఖమును కలుగజేస్తాయి. ప్రారబ్ధభోగము జ్ఞానికి కూడా దుఃఖమును కలిగిస్తుంది. బ్రహ్మాకారవృత్తి కలిగిన పిమ్మట "దుఃఖనివృత్తి సుఖప్రాప్తి" అను వచనము, నీయొక్క అనుభవముద్వారా అసంభవముగా తోచుచున్నది. ఎందుకనగా, నీ యొక్క చిక్కిన దేహమును చూస్తే నాకు శంక కలుగుచున్నది.

సిద్ధనాథుడు ఆ గోవిందభట్టును వికల్పము చేసి అడుగుతాడు. ఏమి? నీవు ఈ ప్రశ్న ఆత్మచైతన్యమును పురస్కరించుకుని అడుగుతున్నావా?లేక, నా దేహమును చూసే"జ్ఞాని" అనుకొని ప్రశ్నించుచున్నావా?

ఆత్మచేతనమును లక్షించి అడిగినట్లయితే, దానికి యత్కించిత్ దుఃఖము లేనే లేదు. కారణ మేమనగా, ఆత్మ జన్మమరణములు, సుఖదుఃఖములు, ఆకలిదప్పులు మరియు అన్నమయ, ప్రాణమ-య,మనోమయ,విజ్ఞానమయ,ఆనందమయ అను పంచకోశములకు మరియు స్థూలసూక్ష్మకారణ దేహములకు అతీతమై దేహధర్మములు లేనిదై ఉన్నది. ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క సాక్షాత్కార ము కలిగిన ఆత్మజ్ఞానికి ఎలాంటి దుఃఖములు, క్షుత్పిపాసలు బాధింపవు. కావున, నీయొక్క ప్రశ్న ఆత్మచైతన్యమును ఉద్దేశించి అడగడం అసంభవము. అసంగతముగూడ.

ఇక, దేహదృష్టితో అడిగినట్లైతే, దేహము ప్రారబ్ధాధీనమందున్నది. దేహధర్మములు చేతనమును ఏమాత్రముకూడా స్పృశింపజాలవు.

**శ్లో ||ఆరోపితం నాశ్రయదూషకం భవేత్, కదాపి మూఢైర్మతిదోష దూషితైః |**

**నార్కికరోత్థ్యూషరభూమిభాగం మరీచికా వారి మహాప్రవాహః ॥** (వి.చూ.౪౯౯)

**యత్ర యదధ్యాసః తత్కృతేన గుణేన దోషేణ వాఽణుమాత్రేణాపి స న సంబధ్యతే ।** (అధ్యాసభాష్యము)

**శ్లో ॥గుంజాపుంజాది దహ్యేత నాన్యారోపిత వహ్నినా ।**

**నాన్యారోపిత సంసారధర్మానేవమహం భజే ॥** (వే.పం. ౭-౨౫౯ & 14-46)

ఎండమావులలోని జలప్రవాహము ఉషరక్షేత్రమును తడుపజాలనట్లు, బుద్ధిదోషముగల మూఢులచే కల్పింపబడిన ఆరోపితవస్తువు అధిష్ఠానమును దూషింపజాలదు. అధ్యస్తములగు దేహ తద్ధర్మములచే ఆత్మ స్పృశింపబడదు. అనగా అనాత్మధర్మములగు సుఖదుఃఖములు ఆత్మను బాధింపజాలవు. ఏది దేనియందధ్యస్తమో, ఆ అధ్యస్తముయొక్క గుణదోషములు అధిష్ఠానమునకంటజాలవు. గురిగింజల కుప్పనుజూసి తెలివిలేని కోతులు మొదలగునవి దానియందు అగ్నిని ఆరోపించినంతమాత్రాన, ఆ గురిగింజలరాశి దహింపబడుతుందా! అట్లే, అజ్ఞానులచే జ్ఞానియందారోపింపబడిన సంసారధర్మములు అతనిని బాధింపవు. ఇది జ్ఞానియొక్క అనుభవము.

జ్ఞాని, దేహధర్మములను ముముక్షుదశలోనే త్యజించినాడు. ఇక జ్ఞానోత్తరకాలంలో అతనికి దుఃఖమెలా కలుగుతుంది?(కైముతిక న్యాయము).

అప్పుడు గోవిందభట్టు నమ్రభావముతో చేతులు జోడించి స్వామికి నమస్కరిస్తూ–నేను దేహాత్మ భావముగల లౌకికుడిని. నాకు వేదాంత లక్ష్యము తెలియదు. మీ దర్శన భాగ్యముచేత నేను కృతకృత్యుడనయ్యాను. నాకు విచారణ శక్తి లేదు. వివేకహీనుడనైన నన్ను క్షమించు స్వామీ–అని వేడుకుని అక్కడ నుంచి లేచి వెళ్లిపోయినాడు. మరియు—

తొమ్మిదవ రోజున ఒక కన్యక (అమ్మాయి) వచ్చి నమస్కరించి సిద్ధనాథున్ని ఈ విధంగా ప్రార్థించినది. ఓ స్వామీ! నేను దీనురాలను. అజ్ఞానిని. నేను ఏ సాధన చేసినట్లయితే ధన్యురాలను కాగలనో, అటువంటి సులభమార్గమును చూపండి—అని సిద్ధనాథుని చరణములకు ప్రణమిల్లినది.

సద్గురుదేవుడు ఆ అమ్మాయియొక్క అవస్థను తెలుసుకొని ఈ విధంగా ఉపదేశిస్తాడు. ప్రాతః కాలమున యథావిధిగా లేచి స్నానమాచరించి, విభూతిని శరీరమంతట ధరించి రుద్రాక్షమాలను చేత ధరించి, ఏకాగ్రచిత్తముచే అంగన్యాస కరన్యాసములు చేసి మానసపూజ చేసుకొని, ఎల్లప్పుడు శివపంచాక్షరిని "**ఓం నమశ్శివాయ**"జపించినట్లయితే నీవు నిశ్చయముగా ముక్తిని పొందుతావు.

## అథ శ్రీశివపంచాక్షరీ మంత్రానుష్ఠాన విధిః

ఫలమ్:—జ్ఞాన ప్రాప్తి, ఆయురారోగ్యం, సుఖశాంతులు గలుగును.

అనుష్ఠానము–81 రోజులలో 1,25,000 జపము చేయాలి. పురశ్చరణము ఐదు లక్షలు, హోమము దశాంశము.

యథావిధిగా సంకల్పపూర్వకంగా షోడశోపచారముచేగాని,పంచోపచారముచేగాని శివార్చన ముగించుకొన్న పిమ్మట,

**అథ వినియోగః:—**ఓం అస్య శ్రీసదాశివపంచాక్షరీమంత్రస్య వామదేవ ఋషిః, పంక్తిః ఛందః, సదాశివోదేవతా, మం బీజం, యం శక్తిః, వాం కీలకమ్,సదాశివకృపాప్రసాదోపలబ్ధిపూర్వకాఖిల పురుషార్థ సిద్ధయే జపే వినియోగః।

**అథ ఋష్యాదిన్యాసః:—**

ఓం అస్య శ్రీసదాశివపంచాక్షరీమంత్రస్య వామదేవ ఋషయే నమః—శిరసి,ఓం పంక్తిః ఛందసే నమః—ముఖే, ఓం శివాయ దేవతాయై నమః—హృదయే,ఓం మం బీజాయ నమః—గుహ్యే, ఓం యం శక్తయే నమః—పాదయోః,ఓం వాం కీలకాయ నమః—నాభౌ, ఓం సదాశివకృపాప్రసాదోపల-బ్ధిపూర్వకాఖిలపురుషార్థ సిద్ధయే జపే వినియోగాయ నమః—సర్వాంగే।

అథ కరన్యాసః: అథ హృదయాదిన్యాసః

| | | |
|---|---|---|
| **ఓం ఓం నమః** | **అంగుష్ఠాభ్యాం నమః** | **హృదయాయ నమః** |
| **ఓం నం నమః** | **తర్జనీభ్యాం నమః** | **శిరసే స్వాహా** |
| **ఓం మం నమః** | **మధ్యమాభ్యాం నమః** | **శిఖాయై వషట్** |
| **ఓం శిం నమః** | **అనామికాభ్యాం నమః** | **కవచాయ హుం** |
| **ఓం వాం నమః** | **కనిష్టికాభ్యాం నమః** | **నేత్రత్రయాయ వౌషట్** |
| **ఓం యం నమః** | **కరతలకరపృష్ఠాభ్యాం నమః** | **అస్త్రాయ ఫట్** |

ఓం భూర్భువః స్వరోమితి దిగ్బంధః

**అథ ధ్యానమ్:—**

**ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారుచంద్రావతంసం,**
**రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగవరాభీతిహస్తం ప్రసన్నమ్ ।**
**పద్మాసీనం సమంతాత్ స్తుతమమరగణైర్ వ్యాఘ్రకృత్తిం వసానం,**
**విశ్వాద్యం విశ్వవంద్యం నిఖిలభయహరం పంచవక్త్రం త్రినేత్రమ్ ॥**
**కైలాసపీఠాసనమధ్యసంస్థం భక్తైః సనందాదిభిరర్చ్యమానం,**
**భక్తార్తదావానలహాప్రమేయం ధ్యాయేదుమాలింగితవిశ్వభూషణమ్॥**

శివ యంత్రమునొకటి స్థాపించి పూజించవలెను.

పిమ్మట,108 మణులుగల రుద్రాక్షమాలను చేబూని, పుష్పాక్షతలచే మాలను పూజించి, కండ్లకు అద్దుకొని ఈ శ్లోకములు పఠించవలెను.

**శ్లో ॥మాం మాలే మహామాయే సర్వశక్తిస్వరూపిణీ ।**

**చతుర్వర్గస్త్వయిన్యస్తస్తస్మాన్మే సిద్ధిదా భవ ॥**

**శ్లో ॥(ఓం గం)అవిఘ్నం కురు మే మాలే గృహ్ణామి త్వం దక్షిణే కరే ।**

**జపకాలే తు సతతం ప్రసీద మమ సిద్ధయే ॥ ఓం హ్రీం సిద్ధ్యై నమః ॥**

తరువాత ఈక్రింది శివపంచాక్షరీ మంత్రమును జపించవలెను.

మంత్రము:— ***"ఓం నమః శివాయ"***

ఈ మంత్రమును సంకల్పానుసారముగా గాని, లేక యథాశక్తిగా గాని జపించవచ్చును.

జపాంతమున మళ్ళీ జపమాలను పూజించి, ఈ శ్లోకమును పఠించవలెను.

**శ్లో ॥ఓం త్వం మాలే సర్వదేవానాం ప్రీతిదా శుభదా భవ ।**

**శివం కురుష్వ మే భద్రే యశో వీర్యం చ సర్వదా ॥**

తరువాత ఈ క్రింది స్తోత్రములను(మీ అభీష్టానుసారము) పఠించవలెను.

## అథ అష్టమూర్తిశివాష్టకస్తోత్రమ్

త్వంభాభిరాభిరభిభూయ తమఃసమస్త మస్తం నయస్యభిమతాని నిశాచరాణామ్।
దేదీప్యసే దివమణే గగనే హితాయ, లోకత్రయస్య జగదీశ్వర తన్నమస్తే।।(సూర్యతత్త్వమ్) 1.
లోకేఽతివేలమతివేలమహామహోదధి, నిర్భాసికౌచగగనేఽఖిలలోకనేత్రః।
విద్రావితాఖిలతమాస్సుతమో హిమాంశో, పీయూషపూరపరిపూరిత తన్నమస్తే।।(చంద్రతత్త్వమ్) 2.
త్వం పావనే పథి సదాగతిరప్యుపాస్యః, కస్త్వాం వినా భువనజీవన జీవతీహ।
స్తబ్ధప్రభంజనవివర్ధితసర్వజంతో, సంతోషితాహికుల సర్వగ వై నమస్తే।।(పృథ్వీతత్త్వమ్) 3.
పానీయరూప పరమేశ జగత్పవిత్ర చిత్రాతిచిత్రసుచరిత్ర కరోషి నూనమ్।
విశ్వం పవిత్రమమలం కిల విశ్వనాథ! పానీయగాహనత ఏతదతో నతోఽస్మి।।(జలతత్త్వమ్) 4.
విశ్వమ్భరాత్మక బిభర్షి విభోఽత్ర విశ్వం, కో విశ్వనాథ!భవతోఽన్యతమస్తమోఽరిః।
సత్వం విశ్వనాథ!తమో మమచాహిభూష!స్తవ్యాత్పరఃపరస్పరంప్రణతస్తతస్త్వామ్।।(అగ్నితత్త్వమ్)5.
విశ్వైకపావక న తావక పావకైక శక్తే ఋతేఽమృతవతామృతదివ్యకార్యమ్।
ప్రాణిష్యదో జగదహోజగదాంతరాత్మన్!స్త్వంపావకః ప్రతిపదం శర్మదోనమస్తే।।(వాయుతత్త్వమ్)6.
ఆకాశరూప బహిరంతరుతావకాశదానాదవికస్వరమిహేశ్వర విశ్వమేతత్।
త్వత్తస్సదాసదయసంశ్వసితిస్వభావాత్ సంకోచమేతిభవతోఽస్మినతస్తతస్త్వామ్।।(ఆకాశతత్త్వమ్)7.
ఆత్మస్వరూప తవ రూపపరంపరాభి రాభిస్తతం హర చరాచరరూపమేతత్।
సర్వాంతరాత్మనిలయ ప్రతిరూపరూప,నిత్యంనతోఽస్మి పరమాత్మజనోఽష్టమూర్తే।।(ఆత్మతత్త్వమ్)8.
ఇత్యష్టమూర్తిభిరిమాభిరబంధబంధో, యుక్తః కరోషి ఖలు విశ్వజనీనమర్తే।
ఏతత్తతం సూక్తితం ప్రణతః ప్రణీత సర్వార్థసార్థపరమార్థ తతో నతోఽస్మి।।9.

**ఇత్యష్టమూర్తి శివాష్టకస్తోత్రం సమాప్తమ్**

అథ శ్రీమత్పద్మపాదాచార్యవిరచితో **మంత్రరాజప్రకాశః** (పంచాక్షరీ మంత్రార్థః)

త్యాగో హి నమసో వాచ్య ఆనంద ప్రకృతేస్తథా।
ఫలం ప్రత్యయవాచ్యం స్యాత్ త్యాజ్యం పత్రఫలాదికమ్॥1.
త్యజామీదమిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే।
అథవా నమసో వాచ్యః ప్రణామో దైన్య లబ్ధయే॥2.
దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధిః సర్వస్య వస్తునః।
నమామి దేవదేవేశం సకామోఽకామ ఏవ వా॥3.
నఞ నిషిధ్యతే భావవికృతిర్జగదాత్మనః।
మసనం దేవదేవేశ నేహ నానాస్తి శబ్దతః॥4.
అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోఽస్మి నిత్యశః।
ప్రణామో దేహగేహాదేరభిమానస్య నాశనమ్॥5.
శివో బ్రహ్మాదిరూపస్స్యాచ్ఛక్తిభిస్తిసృభిస్సహ।
అథవా తుర్యమేవ స్యాత్ నిర్గుణం బ్రహ్మతత్పరమ్॥6.
నమసో నమనే శక్తిర్నమనం ధ్యానమేవ చ।
జేఽన్తాత్తాదాత్మ్యసంబంధః కథ్యతే ప్రత్యగాత్మనోః॥7.
అహం శివః శివోఽహం చ మన్యే వేదాన్తనిష్ఠయా।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైః శాస్త్రైశ్చ సర్వశః।8.
అథవా దాస ఏవాహం అహం దాస ఇతీరణమ్।
ఇత్యేవ నమ ఇత్యుక్తం వేదైః శాస్త్రైశ్చ సర్వశః॥9.
అథ వేదమిదం సర్వం త్యజామి పరమాప్తయే।
అర్థం ధర్మం చ కామం చ వాంఛాంశ్చ జగదీశ్వరమ్॥10.
ఏతన్మంత్రార్థ తత్త్వజ్ఞైః వేదవేదాంతతత్పరైః।
నిర్ణీతం తత్త్వగర్భం యద్విజ్ఞేయం ముక్తిలబ్ధయే॥11.
అథవా ముక్తిలాభాయ ధ్యేయం తత్త్వం వివేకతః।
భిన్నం బుద్ధ్వా హృదా దేవం మంత్రేణేశం జగద్గురుమ్॥12.
నమేరచి నమః ప్రోక్తో జంతా స్యాజ్జగదీశ్వరే।
తస్మాద్దాసోఽహమిత్యేవం మత్వా మాం ప్రాపయాత్మని॥13.
అస్మిఞ్ఛేతే జగత్సర్వం తన్మయం శబ్దగామి యత్।

తద్వానాచ్ఛివ ఇత్యుక్తం కారణం బ్రహ్మ తత్పరాః।।14.
న మా యస్యాస్తి లక్ష్మీశ సోఽహం దేవో న సంశయః।
తస్మాన్మే ప్రాపయేహైవ లక్ష్మీం విద్యాం సనాతనీమ్।।15.
యస్మాదానందరూపస్త్వం దేవైర్వేదైర్నిగద్యసే।
తస్మాన్మే దేహి యోగీశ భద్రం జ్ఞానం సుభావనమ్।।16.
యస్మాత్త్వం నేతినేతీతి నఞర్థం మాసి వేదజమ్।
తస్మాన్నమోఽసి భద్రం మే యతో జాతో నమో నమః।।17.
శివం శివమథా ప్రాప్తః శివాయేతి నిగద్యసే।
శివాయ మే తథా ప్రాప్త్యా శివాయేతి నిగద్యసే।18.
శివాం యాతో మహాభద్ర నమోఽహం మాయయా ధృవం।
తతో నమాయ మహ్యం మః శివాయ కురు సర్వథా।।19.
శివమేతి యతో జ్ఞప్త్యా శివాయస్త్వం ప్రపఠ్యసే।
న తే మాయా యతో జ్ఞప్త్యా నమో వేదైః ప్రపఠ్యతే।।20.
నమోఽహం చ శివాయోఽహం నమో మహ్యం నమో నమః।
నమో నమాయ శుద్ధాయ మంగళాయ నమో నమః।।21.
నమో నమసనం శంభో నిరాకారాయ తే నమః।
నిర్గుణం నిష్క్రియం శాంతం ఇత్యాద్యాః శ్రుతయో జగుః।।22.
నమో బ్రహ్మ నిరాకారం శివాయ శివః సర్వదా।
అతోఽహం చ న మా భద్ర శివాయోఽహం న సంశయః।।23.
।।ఇతి శ్రీమత్పద్మపాదాచార్యవిరచితో **మంత్రరాజప్రకాశః** (పంచాక్షరీ మంత్రార్థః)।।
।।ఓమ్ శ్రీసదాశివపరబ్రహ్మార్పణమస్తు।।

ఇటువంటి సద్గురు బోధను విన్న ఆ అమ్మాయి చాలా సంతోషించి స్వామికి నమస్కరించి ఇంటికి వెళ్ళిపోయింది. సద్గురుదేవుడైన అవధూత సిద్ధనాథుడు చింతామణి ఆశ్రమమందు తొమ్మిది రోజులు సాధుసమ్మేళనము (సత్సంగము) చేసుకుంటూ అక్కడ ఉండెను.

అక్కడనుండి సిద్ధారూఢస్వామి తీర్థయాత్రలకు వెళ్లడానికి సంసిద్ధుడు కాగా అక్కడున్న భక్తు-లందరు మహావైభవముగా జయ జయ కారములు చేస్తూ ఆ గ్రామము దాటువరకు గ్రామస్థులందరు కలిసి స్వామిని సాగనంపినారు.

**ఛోటా నారాయణ** (చిన్న నారాయణ) స్వామిని దర్శించుకుని అక్కడ ఉన్నటువంటి సుంద-రమైన దేవస్థానములు దర్శిస్తూ, **మహాదేవ స్వామి** దర్శనము చేసుకుని ముందుకు సాగిపోతాడు.

**తస్కర మస్కర** అను స్థానమును దర్శించి **తిరువటారి** క్షేత్రమందు **శ్రీకృష్ణమూర్తిని** దర్శించి, పద్మ-నాభపురికి వచ్చి **అనంతశాయి** ని పూజిస్తాడు.అచ్చట పూజలు అయిన తర్వాత అక్కడి బ్రాహ్మణుల భోజనములు జరుగుతుండగా శ్రీ సిద్ధారూఢస్వామి వెళ్లి ఆభోజన పంక్తిలో కూర్చుంటాడు. అప్పుడు ఆ బ్రాహ్మణులు స్వామి వద్దకు వచ్చి ఈ విధంగా అంటారు.

అయ్యా! నీయొక్క శరీరమునందు శూద్ర చిహ్నములు కానొస్తున్నాయి. నీవు బ్రాహ్మణుడవు కావు. మా భోజన పంక్తిలో ఎందుకు కూర్చున్నావు? అప్పుడు సిద్ధనాథుడు వారితో అంటాడు. మీకు బ్రహ్మచిహ్నములు కానరావు. ఆ బ్రహ్మచిహ్నములు నాయందు ఉన్నవి.

బ్రాహ్మణులంటారు—ఒకవేళ నీవు బ్రాహ్మణుడవైతే, శిఖా-యజ్ఞోపవీతము లేదు కదా?

సిద్ధనాథుడు:– మీలాంటి కర్మఠులకు శ్రుత్యుక్తమైన చిహ్నములు కానరావు.శ్రుతి:—"**అశిఖా యజ్ఞోపవీత యతిర్యాదృచ్ఛికో భవేత్**"(మాండూక్య కారికా 2-37; నారదపరివ్రాజకోపనిషత్; ఆరుణికోప-నిషత్ ఇత్యాది) యతికి ఉండవలసినవి బాహ్యాచిన్నములు కావు. ఆయనకు ఆంతర్యంలో సంకల్ప వికల్ప రహితస్థితి ఉండి, ఇచ్ఛారహితమై ఉన్నందున బాహ్యాచిహ్నములు శిఖ, జందెము (యజ్ఞోప-వీతము) అవసరం లేదు. అని సిద్ధనాథుడు చెప్పగా, ఆ బ్రాహ్మణులు మళ్లీ ప్రశ్నిస్తారు. యతికి దండ కమండలములుండాలి కదా! మరి అవి నీకు లేవు కదా! అంటారు.

అప్పుడు వారితో సిద్ధయతీంద్రుడు ఈ విధంగా అంటాడు. జ్ఞానమే నాయొక్క దండము. నాయొక్క కౌపీనమే నాయందున్న ఏకత్వ దృష్టి. వైరాగ్యమనే భస్మమును ధరించినాను. తత్త్వ వివేచనమే నాయొక్క కమండలము.

**జ్ఞానదణ్డో ధృతో యేన ఏకదండీ స ఉచ్యతే ।**(నా.పరి.5-2)

**జ్ఞానయజ్ఞః స విజ్ఞేయః సర్వయజ్ఞోత్తమోత్తమః ।**

**జ్ఞానదణ్డా జ్ఞానశిఖా జ్ఞానయజ్ఞోపవీతినః ॥**

**శిఖాజ్ఞానమయీ యస్య ఉపవీతం చ తన్మయమ్ ।**

**బ్రాహ్మణ్యం సకలం తస్య ఇతి వేదానుశాసనమ్ ॥** (శాట్యాయనీయోపనిషత్ 16 & 17)

(ॐ)ఓంకారమును ఉచ్చరిస్తూ ఆత్మను బ్రహ్మరూప అగ్నియందు ఆహుతి చేయనగును, అనగా బ్రహ్మమునందు ఆత్మ విలీనము(ఏకము) చేయబడును.ఆ ఓంకారమే సకల శ్రేష్ఠమగుయజ్ఞ-ములలో ఉత్తమమైన జ్ఞానయజ్ఞమగును. వీరియొక్క జ్ఞానమే దణ్డము,శిఖ,యజ్ఞోపవీతము.ఎవరి యొక్క శిఖాయజ్ఞోపవీతములు జ్ఞానమయములో, వారికి సమస్త వస్తువులు బ్రహ్మరూపములే. ఇది వేదముయొక్కఆదేశము(అనుశాసనము).సద్గురుసిద్ధనాథునియొక్క ఈభాషణమును విని ఆ బ్రాహ్మ ణులు ఆశ్చర్యచకితులై,ఈ మహా- త్ముడు నిజంగా బ్రహ్మజ్ఞాని ఉన్నాడు.ఈ స్వామికి భోజనము తప్పకుండా ఇవ్వాలి—అని నిశ్చయిం- చుకుని స్వామికి భోజనము వడ్డించారు.

*"వైశ్వానరరూప అతిథికి తృప్తిగా భోజనము సమర్పించినట్లయితే ఆ గృహస్థుడైన దాతకు సకల సంపదలు ప్రాప్తమవుతాయి. ఆయనకు భోజనము సమర్పించక వెడలగొట్టినట్లయితే సకల సంపదలు నశించిపోతాయి".*

భోజనము ఆరగించి స్వామి అక్కడనుండి జనార్ధన స్వామి క్షేత్రమునకు వెళ్లి పర్వతాగ్ని ఆచమన ముద్రలు దర్శించి ముందుకు పయనమవుతాడు.జ్ఞానిమహాత్ములకు సకలజగత్తు తృణప్రా-యంగా ఉంటుంది. కావున ఉదాసీనంగా చూస్తూ చూస్తూ వెళ్ళిపోతున్నాడు. స్వామి, ఉడిపిక్షేత్రము నకు వెళ్లి **శ్రీకృష్ణనాథుని** దర్శనము చేసుకుని, తనలోతాను ఈ విధంగా అనుకుంటాడు. బ్రహ్మ స్వరూపుడైన క్షేత్రజ్ఞుడు అన్ని క్షేత్రములలో(దేహములలో) ఉన్నాడు. ఆ వ్యాపక పరబ్రహ్మమునకు యథార్థముగా సృష్టియొక్క స్థితి, లయము మరియు ఉత్పత్తుల జ్ఞానమున్నది. సర్వజగత్తును ఆకర్షించే వాడున్నాడు. అందుకనే ఆయనకు **కృష్ణుడు** అనే నామధేయము ఒసంగబడినది.

**శ్లో ||కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృత్తి వాచకః ।**

**విష్ణుస్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి శాశ్వతః ||**(మహాభా.ఉద్యోగ ప.70-5)

"కృష్" అను శబ్దము సత్తావాచకము."ణ" ఆనందవాచకము.ఈ రెండు భావములు శ్రీమహా విష్ణువులో ఉన్నందున అతడు ఎల్లప్పుడు "కృష్ణుడు" అని పిలువబడును.ఈ వ్యాసవచనానుసారము సచ్చిదానంద పరమాత్మయే కృష్ణుడనబడును.

**శ్లో ||కృషామి పృథివీం పార్థ! భూత్వా కార్ష్ణాయసో హలః ।**

**కృష్ణో వర్ణశ్చ మే యస్మాత్తస్మాత్ కృష్ణోఽహమర్జున ||**(మహాభా.శాన్తిప.342-79)

హే పార్థ! నేను కృష్ణవర్ణముగల నాగలినై భూమిని దున్నెదను మరియు నాయొక్క వర్ణము నలుపు. అందుకే, ఓ అర్జునా! నేను కృష్ణుడను.

కృష్ణుడే సత్య సనాతన పరబ్రహ్మము. **"కృష్ణో బ్రహ్మైవ శాశ్వతమ్"** (కృష్ణోపనిషత్ 12)

**కర్షత్యరీన్ మహాప్రభావశక్త్యా యద్వా కర్షతి ఆత్మసాత్ కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః- ఇతి కృష్ణః । కర్షతి పాపాన్ శరణాగతానామ్- ఇతి కృష్ణః ।**

తన ప్రభావశక్తిచే శత్రువులను ఆకర్షించును, భక్తులయొక్క మనస్సును ఆకర్షించి తనచే అభిన్నముగా అనగా ఆనందరూపముగా మార్చును. శరణాగతుల పాపములను ఆకర్షించును- కావున, **కృష్ణుడు** అనబడును.ఈ ప్రకారముగా స్వామి చింతించి, క్షణకాలము సమాధి యందుండి ఉత్థానమైన తర్వాత యాత్ర నిమిత్తమై ముందుకు సాగిపోతాడు.మంగళప్రదమైన సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంతనే సకలపాపములు భస్మమగును.శ్రీ శివదాసస్వామి శ్రీసిద్ధనాథుని చరణకమలములకు ఈ ఆరవ అధ్యాయమును సమర్పిస్తూ సమాప్తము చేయు చున్నాడు. ఓం శ్రీ సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు





ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏడవ అధ్యాయము

పద్యానువాదము:– శ్రీసిద్ధావధూతయొక్క లీలలు చాలా గంభీరము, విస్తారము. అటువంటి దివ్యలీలలను ఏ మానవులయితే శ్రవణము చేస్తారో, వారియొక్క చిత్తము పవిత్రమై మలరహిత- మవుతుంది. తద్వారా విక్షేపదోషము కూడా తొలగి అతితొందరగా తనయొక్క హృదయమందు సద్గురుదేవుడు ప్రకటమై అజ్ఞానాన్ని (ఆవరణమును) నివృత్తి చేసి యథార్థజ్ఞానమును ప్రసాదిస్తాడు.

శ్రీసిద్ధారూఢ సద్గురునాథా!నీయొక్క దివ్యమైన చరణారవిందములకు సాష్టాంగ నమస్కార- ములు చేస్తూ, నీయొక్క అవతారకథను యథార్థముగా ప్రకటము చేయడానికి ఆశీర్వదించుమని ప్రార్థిస్తున్నాను.నీవు దయాసాగరుడవు.నాయొక్క హృదయమందు ఎల్లప్పడుండి గ్రంథమును పూర్తి చేయడానికి స్ఫూర్తిని ప్రసాదించమని వేడుకుంటున్నాను.ఓ సిద్ధయోగీంద్రా!నీవు సద్గురువుగా అవ- తరించి అనేక లీలలను ఈ ప్రపంచమునకు చూపినావు. ప్రసంగమునసుసరించి ముముక్షువులకు యథార్థమైన జ్ఞానోపదేశము చేసినావు. అందుకనే ముముక్షువులు, భక్తులు నీయొక్క కృపవలన అతితొందరగా భవసాగరనుండి తరించబడినారు.

ఆరవ అధ్యాయమునందు శ్రీ సిద్ధారూఢస్వామి ఉడిపి క్షేత్రమునకు వెళ్లి శ్రీకృష్ణభగవానుని దర్శించి ఏకాంత ప్రదేశమునందు నిర్వికల్ప సమాధిని అనుభవిస్తాడు. క్షణకాలము సమాధియం- దుండి, మళ్ళీ సమాధినుండి ఉత్థానమైన తర్వాత అక్కడినుండి వెళ్ళడానికి సంసిద్ధుడౌతాడు. *(వాస్తవానికి సమాధిసుఖమును అనుభవించినాంక జ్ఞానికి యే కర్తవ్యముండదు. కాని, స్వామి తొందరగా ఉత్థానమునకు వచ్చినాడంటే, స్వామికి ఇంకా తిరగ వలసిన కర్మ భోగమున్నదని ద్యోతితమౌతుంది)* ఈ శరీరముయొక్క భోగము కర్మాధీనమున్నది. అందుకని ముందుకు వెళ్లడానికి సంసిద్ధుడౌవుతాడు. అనేక ధర్మక్షేత్రాలను దర్శిస్తూ స్వామి "**గోకర్ణ**" క్షేత్రమునకు వచ్చి కోటితీర్థ స్థలమును సందర్శించి, పవిత్రమైన **మహాబలేశ్వరము** ను దర్శించినాడు.

తన మనసులో "**గోకర్ణ**" క్షేత్రమునకు లక్ష్యార్థమును ఇట్లు విచారిస్తున్నాడు. 'గో' అనగా ఇంద్రియ సమూహము. పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు వీనియందు శ్రేష్టమైన ఇంద్రిము శ్రోత్రేంద్రియము. ఎందుకనగా–శ్రోత్రేంద్రియముద్వారా సద్గురుముఖకమలమునుండి

వెలువడు మహావాక్యమును శ్రవణముచేసి మనన నిదిధ్యాసనములద్వారా ముక్షువులు యథార్థమైన జ్ఞానమును పొంది ముక్తులై భవసాగరమును దాటుతారు.

ఈవిధంగా మనసులో చింతించుచూ దేవాలయమునుండి సిద్ధనాథుడు బయటకు వస్తుంటే ఒక జటాధారియైన సాధువు అగుపడతాడు. సిద్ధనాథుడు ఆ సాధువుయొక్క చేయి పట్టుకుని ఇద్దరు చేతులు చేతులు కలుపుకొని సముద్రము వైపుకు వెళ్తారు. అప్పుడు ఆ జటాధారి సిద్ధనాథునితో నాకు బాగా చలివేస్తుంది.ఈ చలిబాధను భరించలేకుండా ఉన్నాను–అంటాడు.

అప్పుడు సిద్ధనాథుడు ఏమి చేస్తాడంటే--ఒక చినిగిపోయిన చాప చింపును చూసి, దానిని ఆ జటాధారి మెడలో తగిలించి ఇదిగో నీకు శాలువ కప్పినాను–అని అంటాడు.సముద్రతీరంలో ఉన్న కౌచిప్పలను(ముత్యపుచిప్పలను) ప్రోగుచేసి మాలగా తయారుచేసి ఆ జటాధారి మెడలో వేస్తా-డు. ఒక దుకాణమునకు వెళ్లి కుంకుమ తీసుకొని వచ్చి ఆ జటాధారి నుదుట రుద్దినాడు. ఒక పగిలిపోయిన కుండపెంకు తెచ్చి ఆయన చేతికిచ్చి, రెండవ చేతికి ఒక చీపురుకట్టను ఇచ్చి నిజంగా ఇప్పుడు భైరవవేషమువలె కుదిరింది. ఇక ఒక డోలు ఉంటే బాగుండేది–అని సిద్ధనాథుడు అంటాడు. ఇంతలో డోలు వాయించేవాడు త్రోవలో నుండి పోతుండగా ఆయనను సిద్ధనాథుడు పిలిచేసరికి ఆయన వచ్చినాడు. ఆయనను డోలు వాయించమని స్వామి చెప్పినాడు.

ఈ విధంగా డోలు వాయించుకుంటూ ముగ్గురు కలిసి దుకాణాల ముందు ఆటలు ఆడుకుం-టూ వెళ్తుంటే డబ్బు చాలా ప్రోగు అయ్యింది. అదేవిధంగా ఆడుతూ శివాలయమునకు వెళ్ళినారు.ఆ ఆలయమందు ఒకానొక సంతు "**జ్ఞానేశ్వరి భగవద్గీత**" చదువుతూ అనేక సద్భక్తులైన శ్రోతలకు విని పిస్తున్నాడు. సంతు వద్దకు సిద్ధనాథుడు వెళ్లి నేనొక మాట చెబుతాను వినండి అంటాడు.

నీవు ప్రతిరోజు పురాణము చెబుతూనే ఉంటావు. ఈ ఒక్క రోజు నేను చెబుతాను, మీరు వినగలరు–అని అంటాడు స్వామి. భగవద్గీత పదిహేనవ అధ్యాయము మొదటి శ్లోకము:–**ఊర్ధ్వ మూలమధఃశాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్ । ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

వ్యా:–ఊర్ధ్వమూలము. అవ్యక్తమహదాదులకంటెను మిగులగొప్పదియు,అతిసూక్ష్మమును ప్రకాశమును, సర్వాశ్రయమును, సర్వవ్యాపకమును,సర్వకారణమునగుటచేత పరబ్రహ్మము ఊర్ధ్వ-మగును. సర్వోత్తమమగుటచేత పరబ్రహ్మమునకు ఊర్ధ్వమని నామమేర్పడినది. ఊర్ధ్వము-ఉత్కృష్ట తమమైన, ఏ పరబ్రహ్మము గలదో, మాయాశబలితమైన ఆ పరబ్రహ్మమే, మూలము=బీజముగ గలదియై,శ్రుతిప్రసిద్ధమైన సంసారవృక్షము ఊర్ధ్వమూల మనబడుచున్నది."**ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ ఏషోఽశ్వత్థస్సనాతన**"(కఠ.౨-3-1)అని,"**ఊర్ధ్వమూలమవాక్ శాఖంవృక్షం యోవేద సంప్రతి**" (తై.ఆరణ్యకము 1-11-5) అని శ్రుతులుకూడ చెప్పినవి. మఱ్ఱివిత్తనమెట్లు అవ్యక్తము, అతి సూక్ష్మము, అవిజ్ఞేయము, అపారశక్తి సంపన్నమునై యున్నదో,అట్లే జగద్బీజమైన అవ్యక్తమగు బ్రహ్మమున్ను

అతిసూక్ష్మము, అవిజ్ఞేయము, అపారశక్తి సంపన్నమునైయున్నది. ఇందువలననే సంసారవృక్షము అతివిస్తరము,అతివిచిత్రమునయి యున్నది.

మఱియు అధశ్శాఖము."**అవ్యక్తాన్మహతః మహతోఽహంకారోఽహంకారాత్పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని.**" (త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్) అనెడి శ్రుతినిబట్టి మహదాది వికారములన్నియు ప్రకృతికంటె క్రిందివేయగుటచేత "అధః" అని చెప్పబడుచున్నవి. అధః=అధశ్శబ్ద వాచ్యములైన మహదాదులు, శాఖలవలె–శాఖలుగ గల ఇది (సంసారము)అధశ్శాఖ మనబడును. దీనికి మహత్తత్త్వమే అంకురము. అహంకారమే స్కంధము. పంచతన్మాత్రలే శాఖలు. పంచమహా భూతములే ఉపశాఖలుగా నున్నవి అని యర్థము. దేనికి మహదాదులు శాఖలుగా నున్నవో, అట్టి అధశ్శాఖమైన, అశ్వత్థమును-(మాయాకార్యమగుటచేత, శ్వః=రేపటికైనను, న తిష్ఠతి=ఉండునది కాదు; కాన అశ్వత్థమనబడును. క్షణభంగురమూ, అనిత్యమూ అని యర్థము.) క్షణక్షణమునకు నశించునట్టి ఈ అశ్వతమును=సంసారవృక్షమును, అవ్యయమ్=నాశము లేనిదానినిగా=నిత్య-ముగా చెప్పుచున్నారు.

అభిరుచిని బుట్టించు వాక్యములచేత వియోహితులైన సకాములగు మీమాంసకులు ఈ జగుత్తునకంటే వ్యతిరిక్తమైన దేదియు ఎన్నడును ఉండనేరదు; కాన ఈ జగత్తే నిత్యమైనదనుచు-న్నారని యర్థము. ఛందస్సులు(వేదములు) సంసారవృక్షముయొక్క అనిత్యత్వమును, దుఃఖరూపత్వ-మును, వ్యామోహకత్వమును, అనర్థకారిత్వమును ఇత్యాది దోషసమూహమునున్ను "ధ్రువా ద్యౌః ధ్రువా పృథివీ." (స్వర్గలోకము, భూలోకముగూడ స్థిరమైనవి.) "దక్షిణావంతోఽమృతత్వం భజంతే, స్వర్గే లోకే న భయం కించనాస్తి; స్వర్గలోకా అమృతత్వం భజంతే! వీష వ: పుణ్యస్సుకృతోబ్రహ్మాలో-క:"=చక్కగా ననుష్ఠించిన పుణ్యములచేత ఇదిగో మీకు బ్రహ్మాలోకము లభించినది అను ఇట్టి మనోరంజకములైన వాక్యములచేత, ఛాదయంతి = కప్పిపుచ్చుచున్నవి, గాన ఛందస్సులనబడును. ఇట్టి, ఛందస్సులు-ఋగ్యజుస్సామాదులు. మాయామయమైన ఈ సంసారవృక్షమునకు పర్ణము (ఆకు)లనుబోలి పర్ణములుగా నుండుచున్నవి. పర్ణములంతటను ఉండి వృక్షదోషమును కప్పిపుచ్చి ఎట్లు నశింపకుండ రక్షించుచున్నవో అట్లే పురాణేతిహాసములతో బాటు కర్మోపాసనా యోగాగమ తంత్ర క్రియాపరములై యుండు అన్ని వేదములు కర్మలను, కర్మసాధనములను, కర్మఫలములను ప్రకాశింపజేయుటచేత అనిత్యత్వ దుఃఖరూపత్వాది దోషములను కప్పిపుచ్చుచున్నవై సంసార వృక్షమును వృద్ధినొందించుచున్నవని యర్థము.

ఈ చెప్పిన లక్షణములతో వేదములే ఆకులుగను, ధర్మాధర్మములే పుష్పములుగను, జనన మరణాదిదుఃఖమే ఫలముగను ఉన్న సంసారవృక్షమును మూలయుక్తముగా చక్కగా ఎవడైతే తెలిసి కొనుచున్నాడో ఆతడే వేదవేత్త. వేదార్థము నెఱిగిన వాడని యర్థము.

ఓయీ! తన గుణములచేత అనృతజడదుఃఖరూపమును, వ్యామోహకమునై జన్మాద్యనర్థ-మునకు హేతువుగా నున్న సంసారవృక్షము నెఱుగుటచేత విద్వాంసుడు వేదార్థవేత్త ఎట్లగును? అనిన, వినుము. ఏ విత్తనమునుండి ఏ వృక్షముత్పన్నమగునో అది తద్రసమే యగుచున్నది. చేదు రసముగల వేపవిత్తనమునుండి పుట్టిన వేపవృక్షము చేదుస్వరూపముగ గలది యగుచున్నది. మరొక విధమున నుండదు. ఈ న్యాయ మంతటను ప్రసిద్ధమైనదే.

ఇట్లే, చిదేకరసమైన బ్రహ్మమునుండి ఉత్పన్నమైన సంసారవృక్షము చిద్రసమే యగుచున్నది. అందువలన "**సర్వం ఖల్విదం బ్రహ్మ**"(ఛాం.3-14-1)ఇత్యాది శ్రుతులచేతను ''సంసారవృక్షము వేపవృక్షమువలె ఒక వృక్షమేయగుటవలన స్వకీయబీజరసమే స్వరూపముగ గలదియగును"అను మొద-లగు యుక్తులచేతను, వీనిచే కలిగిన స్వానుభవముచేతనున్ను ఈ సంసారవృక్షమును చిదేకరస-మైన కారణబ్రహ్మమునుగనే నిర్మలహృదయుడగు ఏ పండితుడు తెలిసికొనునో ఆతడు వేదార్థము నెఱిగినవాడే. "**సర్వే వేదా యత్పదమామనంతి**"(కఠ.౨-15) అనెడి న్యాయమునుబట్టి వేదార్థము బ్రహ్మమే కాన, వేదార్థము నెఱిగిన వాడు బ్రహ్మవిదుడే. "**కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి.**" (ముం.1-1-3) అనెడి న్యాయముచేత సర్వజ్ఞుడు నగుచున్నాడు. ఇట్టి సర్వజ్ఞుని కర్తవ్యముగూడ "**స సర్వవిద్భజతి మామ్.**"(గీత.15-19)అని చెప్పబడును. కావున, కారణజ్ఞానము-నుబట్టి కార్యమైన వృక్షమును కారణమాత్రముగనే ఎఱుగుటవలన విద్వాంసునకు వేదార్థవిత్త్వము సిద్ధించునని యర్థము. (శంకరానంది)

సిద్ధనాథుడు ఆ శ్లోకముపై పూర్వపక్షము ద్వారా అనేక వికల్పములు చేస్తూ సిద్ధాంత పక్ష-మును ప్రతిపాదించి, లక్ష్యార్థమును చెప్పి, వైరాగ్యపర బోధను యథార్థముగా బోధించి, అందరి భక్తులను మైమరపించినాడు.అక్కడున్న సద్భక్తులైన శ్రోతలు,బ్రాహ్మణులు యథార్థముగా స్వామియొ-క్క వచనములను శ్రవణంచేసి, సద్గురు సిద్ధనాథునియొక్క బ్రహ్మతేజస్సును చూసి ఆ భక్తులంతా ఈయన సాక్షాత్తు సత్పురుషుడున్నాడు. ఈపూట ఈ సద్గురుదేవుడు వక్తయగుట, మేము శ్రోతల-మగుట -మా అహోభాగ్యము అని అనుకుని ఎంతో సంతోషమును పొందినారు.

ప్రవచనము ముగిసిన తర్వాత మంగళహారతి చేస్తారు. మంగళహారతి అందరి భక్తులకు చూపించగా తలకొక్కంటికి యథోచితముగా రూకలను ఆ హారతియందు ఉంచుతారు. అందరూ హారతి తీసుకొనడం పూర్తి అయ్యేసరికి హారతి పళ్ళెమునందు నిన్న మొన్నటికంటే నాలుగురెట్లు అధికంగా ద్రవ్యము ప్రోగవుతుంది. దానినిచూసి ఆలయమందు ప్రతిరోజు పురాణము చెప్పే సంతు ఎంతో హర్షిస్తాడు(ఆనందము పొందుతాడు)కాని,ఆ ద్రవ్యమును జటాధారి తీసుకునేందుకు ప్రయ-త్నము చేయగా ఆ సంతు ఆ ద్రవ్యమును మొత్తము లాక్కోడానికి ప్రయత్నించాడు.

అప్పుడు జటాధారి అంటాడు–ఈరోజు మా గురువుగారు సిద్ధనాథుడు పురాణము చెప్పినాడు.అందుకనే ఇంత డబ్బు ప్రోగు అయింది. కావున, సగము సగము పంచుకుందాము.ఈ వచనములను ఆ సంతు ఒప్పుకుంటాడు.

అప్పుడు సిద్ధనాథుడు ఆ సంతును ఉద్దేశించి ఈ విధంగా అంటాడు. నీవు కేవలము ద్రవ్యము కోసమే తాపత్రయపడి పురాణము చెపుతున్నట్లుయితే, ఇదిగో తీసుకో అని జోలెనుండి ఏడు బంగారు నాణెములు (మొహరీలు) తీసి ఆ సంతుకీయగా, ఆసంతు తన మనమునందు చాలా బాధపడి పశ్చాత్తాప బుద్ధితో స్వామియొక్క చరణాలపై వ్రాలి తనయొక్క దైన్య స్థితిని చెప్పుకుంటూ వేడుకుంటాడు.

ఈ ఆశ్చర్యమును చూసి అక్కడున్న భక్తులందరూ ఈయన సత్పురుషుడున్నాడని అనుకుంటూ ఈయన దర్శన భాగ్యముచే పాపములన్ని నశించగలవు. జగత్తులోని భక్తులందరూ ధన్యులు కాగలరని సిద్ధనాథుని చరణములను దర్శించుకుంటారు.

జటాధారి సమేతముగా సిద్ధనాథుడు ఆడుతూ ఆడుతూ ముందుకు వెళ్ళుచుండగా ఒక బ్రాహ్మణుడు నైవేద్య ప్రసాదములను తీసికొని ఆలయంలోకి వెళ్ళుచుండగా,ఆయనను చూసి సిద్ధనాథుడు ఈ విధంగా అంటాడు. ఈ నైవేద్యమును నీవు ఎక్కడికి తీసుకెళ్ళుచున్నావు?

ఆ బ్రాహ్మణుడు అంటాడు. మహాబలేశ్వరస్వామికి అర్పించడానికి తీసుకెళ్తున్నాను-అంటాడు. ఆ మాటలు విన్న సిద్ధనాథుడు ఏమంటాడంటే–ఆ మహాబలేశ్వరుణ్ణి నేనే ఉన్నాను.మొదట ఆ నైవేద్యమును నాకు అర్పించి, పిమ్మట ఆ శిలారూప మహాబలేశ్వరునికి అర్పించుము–అని ఈ విధంగా అనగా, ఆ బ్రాహ్మణుడంటాడు–నీవు ఆశాబద్ధుడవగు జీవుడవు–నీకెవరు సమర్పిస్తారు?

ఈ మాటలు విన్న జటాధారి ఆ నైవేద్యమును లాగుకోవడానికి ప్రయత్నిస్తాడు.

ఈ సంఘటనను చూసి ఆ బ్రాహ్మణుడు భయపడి శంఖమును పూరించాడు.ఆ శంఖధ్వనిని విని అనేకమంది బ్రాహ్మణులు పరుగుపరుగున వచ్చి ఆ జటాధారిని కొట్టడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు సిద్ధనాథుడు వచ్చి వారిని ఈ విధంగా అంటాడు.

మీరు వెనుకముందు విచారించకుండా ఈయనను కొట్టడానికి ఉద్యమిస్తున్నారు. మీయొక్క గ్రామదేవత మహాబలేశ్వరుడు వ్యాపకుడున్నాడు. అంతట అన్ని ప్రాణులలో ఉన్నటువంటి ఆ మహాబలేశ్వరుడు ఈ జటాధారియందు లేడనుకుంటున్నారా?సాధుపురుషులకు నైవేద్యము పెట్టినట్లయితే ఆ పరమాత్మ సంతృప్తి పడతాడు. శిలావిగ్రహము ముందు పెట్టినట్లయితే తృప్తిపడడు. ఆకలితో ఉన్న ప్రాణులకు అన్నము ఒసంగినట్లయితే పరమాత్మ సంతసిస్తాడు. చైతన్యస్వరూపుడైన సాధువునకు నైవేద్యము అర్పించినట్లయితే ఆకలి తీరుతుంది. పరమాత్మ తృప్తిపడతాడు."**అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః**" । శ్రీమద్భగవద్గీతయందు (15-14) శ్రీకృష్ణపరమాత్మ ఈవిధంగా చెబు-

తాడు. సకలప్రాణుల హృదయమందు నేను వైశ్వానరరూపముగా ఉన్నాను. అందుకనే ఈ సాధు-వునకు నైవేద్యము సమర్పించినట్లుయితే ఆ పరమాత్మ తృప్తిపడతాడు–అని సిద్ధనాథుడు తెలుపగా, వారు సమాధానాన్ని పొంది శాంతచిత్తులై, ఆ నైవేద్యపదార్థములను ఆ జటాధారికి అర్పించి, అయ్యా! మేము అజ్ఞానులము. నీవలన మాకు ధన్యత్వము లభించింది అంటారు.

అటుతరువాత సిద్ధనాథుడు, జటాధారి, డోలు వాయించేవాడు-ఈ ముగ్గురు ప్రసాదమును ఆరగించి ఆనందమును పొందుతారు.అప్పుడు దయామయుడైన సిద్ధనాథుడు దొరికిన ద్రవ్యము-నంతయు ఆ డోలు వాయించిన వానికి ఇచ్చి పంపించినాడు. పిమ్మట, సిద్ధనాథుడు మరియు జటాధారి (ఇద్దరు) నాగ తీర్థమునకు వెళ్లి స్నానముచేసి ఆ క్షేత్రమందు నాలుగు రోజులు నివాసము చేస్తారు.ఆ నాగతీర్థమందు ప్రతిరోజు సాయంకాలము సిద్ధనాథునివద్దకు బ్రాహ్మణులు వచ్చి వేదాం-త విషయములో శంకలు చేస్తూ స్వామిద్వారా యథార్థమైన సమాధానమును పొంది ఆనంద చిత్తులై సిద్ధనాథునికి అత్యాదరముతో నమస్కారములు చేసి, కృతార్థులమనుకొని వెళ్ళిపోయేవారు. అక్కడినుండి స్వామి "**ఉళవి**" ప్రదేశమునకు వెళ్తాడు.

అక్కడ బసవన్నయొక్క సమాధి స్థలమును సందర్శించి అచటనుండి సిద్ధనాథుడు **హుబ్లీ** పట్టణము మీదుగా శ్రీక్షేత్రము పండలీపురమునకు కళ్యాణాది గ్రామములు దర్శిస్తూ, పండలీక్షేత్రము-నకు చేరుకొని **శ్రీవిఠల్** స్వామిని ఆనందచిత్తముతో దర్శించి, **నాసిక్** వైపుకు బయలుదేరి,నాసిక్ లో గోదావరి తీర్థము, పంచవటి మొదలగు తీర్థములను దర్శించుకుంటూ అనేక రహస్యమైన గుహలను దర్శిస్తూ, **కాలనారాయణ** స్వామిని దర్శిస్తాడు.

నాసిక్ **త్రయంబకేశ్వరు** ని దర్శించుకుని, శ్రీకృష్ణభగవానుని దర్శనార్థము ముందుగా ప్రయాణము సాగించి,"**ద్వారక**" క్షేత్రమునకు వెళ్లి దేవాలయంలోకి వెళ్లి **ఠాకుర్ జీ శ్రీకృష్ణపరమాత్మ** దర్శనము చేసుకుని ఆలయమునుండి బయటకు వస్తాడు.అక్కడ సిద్ధనాథుని ఒక వైష్ణవుడు కలుసు-కొని, స్వామిని ఈ విధంగా విచారిస్తాడు.నీవు మాయావాది(బ్రహ్మసత్యత్వజగన్మిథ్యత్వవాది)యగు మహాత్మునిలాగా కానొస్తున్నావు అని అంటాడు.

సిద్ధనాథుడు అవును,నిజమే–అని అంటాడు.

అప్పుడు ఆ వైష్ణవుడు సిద్ధనాథుని ఈ ప్రకారంగా ప్రశ్నిస్తాడు. ఈ జగత్తు వ్యావహారిక సత్తగలదా? లేక ప్రాతిభాసిక సత్తగలదా?చెప్పండి.

సిద్ధనాథుడు అంటాడు.ఈ జగత్తు స్వప్నమువలె ప్రాతిభాసిక సత్తగలది ఉంది అని అన్నాడు. మళ్ళీ ఆ వైష్ణవుడు ప్రశ్నిస్తాడు. స్వప్నమునకు అధిష్ఠానము ఎవరు ఉన్నారు చెప్పండి యతీంద్రా? ఒకవేళ స్వప్నమునకు అధిష్ఠానము బ్రహ్మము అని చెప్పినట్లయితే బ్రహ్మజ్ఞానికి స్వప్నము పడకూ-

డదు. ఎందుకనగా అధిష్ఠాన జ్ఞానము కలిగిన మీదట అధ్యస్తవస్తువు నివృత్తమగునను నియమము సుప్రసిద్ధము.

ఒకవేళ స్వప్నమునకు అధిష్ఠానము ఆత్మ అని అన్నట్లయితే త్వంపద శోధనద్వారా అధికారి పురుషునికి ఆత్మజ్ఞానము కలుగుతుంది. ఆత్మజ్ఞానమయిన తర్వాత స్వప్న ప్రతీతి కాకూడదు.

అప్పుడు సిద్ధావధూత సమాధానమిస్తూ:—జాగ్రదవస్థకు అధిష్ఠానచైతన్యము ఏదిగలదో, దానిని ఏ అజ్ఞానము ఆవరించినదో,ఆ అజ్ఞానమే కల్పితస్వప్నమునకు ఉపాదానకారణమున్నది. చైతన్యము అధిష్ఠానమైనాగాని నిద్రా దోషంతో కూడి యున్నందున స్వప్నాధ్యాసము ప్రతీతి అవుతుంది. అహమధ్యాస అనగా "నాకు స్వప్నము కలిగింది" అని-అనాత్మ ధర్మము ఆత్మయందు ఆరోపితమౌతుంది.

---

ఇక్కడ కించిద్విశేషము గలదు—

స్వాప్నిక పదార్థములకు అధిష్ఠానమెవరు? కొందరు స్వప్నమునకధిష్ఠానము అంతఃకరణావచ్ఛిన్న జీవచైతన్యమందురు.మరికొందరు మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యమందురు. ఈ రెంటిలో యేది శ్రేష్ఠము?రెండునూ సమీచీనములే(యోగ్యములే).

ప్రథమపక్షముయొక్క అభిప్రాయమిది-అంతఃకరణమునందు ప్రతిబింబిత చైతన్యమును జీవ చైతన్యమందురు. అదియే స్వాప్నిక పదార్థములకు అధిష్ఠానము. ఎట్లు జాగ్రదవస్థయందు శుక్తిరజత భ్రమస్థలములో, శుక్తిరూప అధిష్ఠానమునందు అవిద్యాపరిణామాత్మక రజతమును(వెండిని) జీవుడు కల్పించునో,అట్లే, స్వప్నమునందు జీవుడు తనయందే అవిద్యాపరిణామభూత స్వాప్నికపదార్థములను కల్పించును.ఏజీవుడు యేపదార్థములను కల్పించునో,ఆ జీవునికే ఆ పదార్థములయొక్క జ్ఞానము కలుగును. అన్యజీవులు ఆ పదార్థములను కల్పించనందున, వారికి వాటి జ్ఞానము కలుగదు. అందుకే స్వాప్నికపదార్థములు సర్వజీవసాధారణములు కావు. ఎట్లు యేపురుషునికి శుక్తియందు రజతభ్రాన్తి కలుగునో,అతనికే ఆ కల్పితరజతము భాసించును.అన్యులకు కాదు.కావున,శుక్తిరజతము అసాధారణమున్నది. అట్లే స్వప్నపదార్థములుగూడ అసాధారణములే. కావున,జీవుడే స్వప్నపదార్థములకు అధిష్ఠానము.

ద్వితీయపక్షముయొక్క అభిప్రాయమిదియగును—యద్యపి, శుద్ధబ్రహ్మము అధ్యాసమునకు అధిష్ఠానము కానేరదు. తథాపి, అనాద్యధ్యస్త మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యమే అశుద్ధమువలె అయ్యి స్వప్నపదార్థములకధిష్ఠానము కాగలదు. అజ్ఞానమున్నచో అసంభవమేమి గలదు.

ఇప్పుడు ద్వితీయపక్షమునందు దోషమును చూపెట్టి, ప్రథమపక్షమును సమర్థిస్తున్నాడు.

జాగ్రదవస్థయందు కలుగు జ్ఞానముచేత స్వప్నాధ్యాస నివర్తించును. ఇది సర్వలోక ప్రసిద్ధము. అధిష్ఠానవిశేషముయొక్క యథార్థజ్ఞానముచే అధ్యాస నివృత్తమగును. శుక్తిరజతాధ్యాసము

శుక్తిరూప అధిష్ఠానముయొక్క శుక్తిత్వరూపవిశేష యథార్థజ్ఞానముచేత నివర్తించును. అలాంటపుడు, స్వప్నాధ్యాసమునకు మూలాజ్ఞానావచ్ఛిన్నబ్రహ్మచైతన్యము అధిష్ఠానమని అంగీకరించినయెడల, నిద్ర నుండి మేల్కాంచిన మీదట బ్రహ్మరూప అధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానము కలిగినదని స్వీకరించ వలయును. అట్లైనచో, జీవునికి ప్రతిదినము యే స్వప్నభ్రమ కలుగుచున్నదో, అది కలుగకూడదు. కాని, ఎంతవరకు సంసారముండునో, అంతవరకు యీ బద్ధజీవునికి యథార్థజ్ఞానము కలుగుటకవ కాశమే లేదు.అందుకే,ప్రతినిత్యము జీవునికి ప్రతిరోజు యే స్వప్నాధ్యాస నివృత్తి అనుభవముగలదో, అది అనుపపన్నమగును. ఒకవేళ జాగ్రదవస్థయందు స్వప్నభ్రమనివృత్తియే యథార్థబ్రహ్మజ్ఞానమని ఒప్పినచో, సకలద్వైతముయొక్క నివృత్తికావలయును. ఎందుకనగా, జాగ్రదవస్థయందనుభూయ-మానమగు ద్వైతరూప దృశ్యజాతమంతయు అధ్యాసమూలకమే అయి ఉన్నది. కావున, జాగ్రత్తు యందు అనుభూయమానమగు యీ ద్వైతముయొక్క ఉపపత్తి(సిద్ధి)కొఱకు మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మముయొక్క యథార్థజ్ఞానము కలుగలేదనియే స్వీకరించవలసియుండును. మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మజ్ఞానము కలుగనందున ఎట్లు జాగ్రదవస్థయందు వ్యావహారిక ప్రపంచముయొక్క నివృత్తి కలుగుటలేదో, అట్లే స్వప్నప్రపంచముయొక్క నివృత్తి కాకూడదను ప్రసంగమేర్పడును. కాని, ప్రతి నిత్యము స్వప్నాధ్యాస నివృత్తి సర్వులకు అనుభవసిద్ధమున్నది. కావున, స్వప్నాధ్యాసకు అధిష్ఠానము మనోఽవచ్ఛిన్న జీవచైతన్యమే అని అవశ్యముగా స్వీకరించనగును. ఆ అధిష్ఠాన జీవునికి నిద్రనుండి మేల్కాంచిన ప్రథమక్షణమందే "అహమస్మి" (నేను ఉన్నాను) ఇత్యాకారక యథార్థజ్ఞానము కలుగు-చున్నది. దానిచే స్వప్నాధ్యాస నివర్తించుచున్నది. **"న తత్ర రథా న రథయోగా న పన్థానో భవన్త్యథ రథాన్ రథయోగాన్ పథః సృజతే........ స హి కర్తా"** (బృ.4-3-10) ఈ శ్రుతియందుగూడ **"స"** (అతడు) అను శబ్దముచేత ప్రకరణములో విచారింపబడుచున్న జీవుడనియే గ్రహించబడినది. స్వప్నములో జాగ్రత్తునకు సదృశమగు రథములు, అశ్వములు, మార్గములు లేవు. కాని, జీవుడు వాసనామయ పదార్థములను స్వప్నములో సృష్టించి, వాటికి కర్తయగుచున్నాడు.

శంక :—పై శ్రుతిచేత జీవునియందు కర్తృత్వమాత్ర ప్రతీతియగుచున్నది, అధిష్ఠానత్వ ప్రతీతి యగుట లేదు. అలాంటపుడు,మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యమే స్వప్నాధ్యాసకు అధిష్ఠానమనుట-లో శ్రుతివిరోధమేమియును లేదుగదా?

సమా:—మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యము (ఈశ్వరుడు) స్వప్నాధ్యాసమునకు అధిష్ఠాన మగుచో, తదజ్ఞానియగు జీవునియందు స్వాప్నిక పదార్థములకు కర్తృత్వము సంభవించదు. ఈశ్వరు డేయని చెప్పవలసియుండును.యద్యపి,జీవునికి అనుమానము మరియు శబ్దప్రమాణములచే ఈశ్వ-రునియొక్క పరోక్షజ్ఞానము కలుగును, ప్రత్యక్షముగాదు. అట్లే, భ్రమప్రత్యక్షమునందు అధిష్ఠానము యొక్క ప్రత్యక్షము అపేక్షితమైయున్నది. ఇట్టి దశలో ఒకవేళ మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యమగు

ఈశ్వరుడు స్వప్నమునకధిష్ఠానమైనచో,స్వప్నపదార్థములకు కర్తృత్వము ఈశ్వరునియందే చెప్పవలసి యుండును. అట్లగుచో, జీవుడే స్వాప్నిక పదార్థములకు కర్తయని చెప్పిన "స హి కర్తా" అను శ్రుతికి విరోధము తదవస్థమై(అట్లే) యుండును. జీవునికి స్వప్నాధిష్ఠానత్వము ఒప్పుకొనినయెడల తనకు తాను స్వయముగా ప్రత్యక్షముగాన, అతనియందు కర్తృత్వము సంభవించును. ఎట్లు శుక్తియందు రజతభ్రమ కాలములో అధిష్ఠానమగుశుక్తియొక్క ఇదంతా లేక చాకచిక్యరూపముచే సామాన్యజ్ఞాన-మున్నదో, భ్రమనివృత్తికాలములో శుక్తిత్వరూపముచే శుక్తియొక్క విశేషజ్ఞానము కలుగుచున్నదో, అట్లే, జీవునికి స్వప్నకాలములో తనయొక్క సామాన్యజ్ఞానమున్నది.జాగ్రత్కాలములో మనోఽవచ్ఛి-న్నత్వరూప తనయొక్క విశేషజ్ఞానము కలుగుచున్నది.

ఆకాశాది ప్రపంచము ఈశ్వరాధిష్ఠితమై, ఈశ్వరకర్తృకమై యున్నది. కావున, అది సర్వసా-ధారణమై (సర్వులకు ప్రత్యక్షమై)యున్నది. అందుకే,**"ఏ ఘటమును దేవదత్తుడు చూసినాడో, దానినే నేను చూచితిని"** అను ప్రత్యభిజ్ఞా జ్ఞానముగూడ ఉపపన్నమగుచున్నది. అట్లే, స్వాప్నికపదార్థములు ఒకవేళ ఈశ్వరాధిష్ఠితములు, ఈశ్వరకర్తృకములైనచో సకలజీవ సాధారణ్యములు కావలెను. కాని, అట్లు ప్రత్యభిజ్ఞా జ్ఞానమునకు విషయములగుట లేవు. దానికి విపరీతముగా **"యే గజమును నీవు స్వప్నములో చూసియుంటివో, దానిని నేను చూడలేదు. మరేమనగా వేరు పదార్థములను చూచి తిని"** అను ప్రతీతి కలుగుచున్నది. కావున, ప్రతీతిబలముచే స్వాప్నికపదార్థములకు జీవుడే అధిష్ఠా-నము మరియు కర్తయని అవశ్యముగా యంగీకరించవలసియున్నది.

ఇప్పుడు ద్వితీయపక్షముగూడశ్రేష్ఠమేయని శంకాసమాధానపూర్వకముగాప్రతిపాదిస్తున్నాడు.

శంక :—స్వప్నగజాదులు శుద్ధచైతన్యమునందధ్యస్తమన్నచో,స్వప్నమునుండి మేల్కొంచి జా-గ్రతలోకి వచ్చిన పిదప వాటికి అధిష్ఠానభూత శుద్ధచైతన్యముయొక్క జ్ఞానము ఇంకా కలుగనందున, అధిష్ఠానజ్ఞానముచేతనే అధ్యస్తముయొక్క నివృత్తి కలుగట ప్రసిద్ధముగాన, జాగ్రదవస్థలోగూడ స్వప్న-మునందు చూడబడిన గజాదుల అనువృత్తి కలుగవలయును?

సమా:—కార్యనాశము ద్వివిధము. ఒకటి–ఉపాదానకారణ నాశముతోపాటు కార్యము యొక్క నాశము. రెండవది–ఉపాదానకారణము విద్యమానమైయుండగా కార్యనాశము. కారణ సహిత కార్యనాశమునకు బాధమందురు. కారణవిద్యమానదశలో కార్యనాశమునకు నివృత్తియం-దురు. అధిష్ఠానతత్త్వసాక్షాత్కారము బాధమునకు హేతువగును.ఎందుకనగా,అధిష్ఠానజ్ఞానము కానిదే భ్రమకు ఉపాదానభూత అవిద్య నివర్తించదు. కాని,నివృత్తిరూప రెండవ కార్యనాశమేది గలదో, అది కారణమునకు విరోధి వృత్తి(జ్ఞానము) ఉదయించుటచేగాని, లేక దోషనివృత్తి వలన గాని కలుగును. కనుక, ప్రకృతమున స్వప్నగజాదుల ఉదాహరణమునందు అధిష్ఠానమగు బ్రహ్మ సాక్షాత్కారము కానందున, స్వప్నప్రపంచముయొక్క బాధము కాకున్నను, ముసల(రోకలి)ప్రహార-

ముచేత ఘటాదుల నివృత్తివలె, స్వప్నప్రత్యయము(జ్ఞానము)నకు విరోధియగు ప్రత్యయము(జాగ్రత్ జ్ఞానము)ఉదయించినందున మరియు స్వప్నప్రత్యయమును ఉత్పన్నముచేయు నిద్ర, అదృష్టాదిదోష-ములు నివర్తించినందున స్వప్నాధ్యాసరూప కార్యనాశము(నివృత్తి) కలుగును.

ఇట్లు జాగ్రదవస్థలో స్వప్నప్రపంచముయొక్క నివృత్తి ప్రకారమును విని ఆశ్చర్యమును పొంద-వలసిన పనిలేదు. ఎందుకంటే, స్వప్నములోగూడ విరోధివృత్తి ఉత్పన్నమగుటతోడనే పూర్వము చూడబడిన పదార్థప్రతీతి నివృత్తమగును. స్వప్నములో గజాకారప్రత్యయము కలిగిన పిమ్మట రెండ-వదగు అశ్వాకారవృత్తి ఉదయించుటతోడనే పూర్వపు గజాకార ప్రత్యయము నివృత్తమగును. ఇది సర్వవిదితము.

తాత్పర్యమేమనగా, విరోధిప్రత్యయము ఉదయించుట వలనగాని, లేక కార్యమునకు నిమిత్త ములగు దోషములు తొలగిపోయినగాని కార్యనాశము (లయరూపనివృత్తి) సంభవించును.ఏది లయమౌతుందో, అది తిరిగి ఉత్పత్తిఅయ్యే సంభవముంది.అట్లే, స్వప్నాధ్యాసరూప కార్యనివృత్తి విష-యములో తెలియదగును. కావున, స్వప్నాధ్యాసకు శుద్ధబ్రహ్మము అధిష్ఠానమని చెప్పిన పక్షము గూడ సమీచీనమేయగును.

కావున, బ్రహ్మజ్ఞానికి కూడా నిద్రాదోషముచే స్వప్నము కలుగుతుంది.

---

ఇటువంటి సద్గురు భాషణము విన్న ఆ వైష్ణవుడు చాలా ఆనందించి సిద్ధనాథస్వామిని తమ ఇంటికి తీసుకెళ్లి షడ్రసోపేతమైన భోజనమును అర్పించినాడు.అక్కడనుండి సిద్ధనాథుడు "**ఉజ్జయిని**" నగరమునకు ప్రయాణమై, అక్కడికి చేరుకొని అచ్చట **మహాకాళిని** దర్శించి, తనలోతాను ఈ విధంగా అనుకుంటాడు. మహాకాళి నాయొక్క శక్తిస్వరూపము, నాలోని ఏకాంశమే ఉన్నది.

**శ్లో ॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**

**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥** (గీత.10-41)

పిమ్మట—అచ్చటనుండి "**ఓంకారేశ్వర్**"కు వచ్చినాడు. ఇచ్చట సరోవరమందు కోటిలింగాలు యుగాంతరమున ఉద్భవించినాయని పామరజనుల నానుడి. మూఢజనులకు ఈశ్వరునిపై భక్తి, విశ్వాసము కలుగులాగున ఇక్కడ **"పక్షితీర్థం"** అనునది ఒకటుంది.ఈ తీర్థమందు ఒకపక్షి ప్రత్యక్షముగా వచ్చి సరోవరంలో నిత్యము స్నానమాచరించి వెళుతుంటే పామరజనులకు చాలా చమత్కారమనిపిస్తోంది. కొన్నిచోట్ల చమత్కారము చూయించనిదే మూఢజనులు పుణ్యతీర్థములు ఒప్పుకోరు. పరమాత్మయందు విశ్వాసము ఉంచరు. అందుకే మహాత్ములు లోకంలో కొన్ని ఇటు-వంటి చమత్కారయుక్తమైన పుణ్యస్థలాలను నిర్మించారు.ఈవిధంగా చమత్కారము చూపించడం వలన మూఢజనులకు నాస్తిక్యభావము నశించి, ఆస్తిక్యభావము ఏర్పడి తద్వారా ఈశ్వరునియందు విశ్వాసము ఏర్పడి, భక్తిభావము ఉత్పన్నమై ముక్తిమార్గమును అనుసరించెదరు.

ఇట్లు స్వామి ఓంకారేశ్వరుని స్పర్శించినాడు. అక్కడ తీర్థమందు స్నానమాచరించుకుంటూ జనులు ఆ సరోవరమందున్న చేపలకు ఆహారాదులను సమర్పిస్తూంటే సిద్ధనాథుడు వీక్షించి, తనలో తాను ఈ విధంగా అనుకుంటాడు.ఎక్కడ నివసించే ప్రాణులకు అక్కడనే అనాయాసంగా ఆహారమును ఈశ్వరుడు అందజేస్తున్నాడు. అన్నముకోసము ప్రయత్నము చేయడము వ్యర్థప్రయాస మాత్రమే అవుతుంది. అని చింతించుకుంటూ స్వామి అక్కడనే కూర్చున్నాడు.

ఇంతలో ఒకానొక భక్తుడు అనేక ఫలహార సామగ్రులు తీసుకుని అదే సమయానికి అక్కడికి వచ్చి సిద్ధనాథస్వామిని చూసి, ఈయన బ్రహ్మానంద సాగరంలో విహరించే మత్స్యము (బ్రహ్మజ్ఞాని) వలె ఉన్నాడు- అనుకుని, సిద్ధనాథుని సమీపమునకు వచ్చి, ఆ ఫలహార పదార్థములను స్వామి ముందు ఉంచినాడు.వాటిని సిద్ధనాథుడు సేవించి, తర్వాత ఆ సద్భక్తుని ఆశీర్వదించి పంపించి, స్వామి అక్కడనే విశ్రాంతి తీసుకుంటాడు. తదనంతరము తీర్థయాత్రలకు బయలుదేరినాడు.

**"మధురా"**నగరమునకు వెళ్ళుటకు సంసిద్ధుడై ప్రయాణము కొనసాగించి, మధురకు చేరుకొని, శ్రీకృష్ణ పరమాత్మ దర్శనము గావించుకుని, అక్కడ ఉన్నటువంటి దివ్యమైన మందిరములను దర్శించి, తర్వాత గోకుల బృందావనమునకు పోయి అచ్చట **రాసక్రీడ** స్థానమును దర్శించినాడు.

అక్కడనుండి స్వామి కాశ్మీరదేశము వెళ్ళుపోతాడు. అక్కడ ఒకానొక జ్యోతిష్కుడు స్వామిని శంకజేస్తూ, ఖగోళ శాస్త్రము గూర్చి అడుగగా,స్వామి మళ్లీ ఆ జ్యోతిష్కుని ప్రతిప్రశ్నలు ఈవిధంగా అడుగుతాడు."సుముహూర్తము"అని ప్రాప్తకాలమును అంటారా? లేక అప్రాప్తకాలమును అంటారా? అప్పుడు జ్యోతిష్కుడు అంటాడు. ప్రథమ పాదముయొక్క పంచమ ముహూర్తమున అన్ని శుభప్రదములే జరుగుతాయి. ఈ వచనములను విన్న సిద్ధఋషి కూడ ఒప్పుకుంటాడు.

అప్పుడు జ్యోతిష్కుడు సిద్ధనాథుని ఈప్రకారంగా ప్రశ్నిస్తాడు. ఏ కారణముచేత సూర్యగ్రహణము కలుగుతుంది చెప్పండి?

స్వామి సమాధానమిస్తూ:—సూర్యుడు ఏ రాశియందైతే వస్తాడో, ఆ నక్షత్రముది తొమ్మిదవ పాదము అవుతుంది. దానియందు ఎంతపాదము సూర్యునికి సంబంధించి ఉంటుందో, అంతభాగము (పాదము) సూర్యగ్రహణము యొక్క అంశము ఉంటుంది.

ఈ వాక్యములు విన్న జ్యోతిష్కుడు చాలా ఆనందించినాడు. తర్వాత సిద్ధనాథుడు **పంజాబు** దేశమునకు వచ్చినాడు.అచ్చట చరకముని సంప్రదాయ భక్తుడు ఒకాయన స్వామిని కలుసుకోవడం జరిగింది. ఆయనను సిద్ధయోగీంద్రుడు ఈ ప్రకారముగా ప్రశ్నిస్తాడు. వైద్యుడు రోగినిచూసి సాధ్య అసాధ్యములను గమనించి రోగముయొక్క గుణమును పరీక్షించి చికిత్సచేయాలి.రోగియొక్క ప్రాణాదులను 4 భాగములుచేసి,అందు రెండుభాగములు ఈశ్వర ధ్యానమునందు వినియోగించాలి. రెండు భాగములు ఈశ్వరునిపై విశ్వాసము పెట్టి ఔషధసేవనముయందు వినియోగించాలి.

ఈ వచనములను ఆ చరకసంప్రదాయ వైద్యుడు ఒప్పుకున్నాడు. అటుతరువాత సిద్ధనాథుడు **అమృత్సర్** కు వెళ్లి ఆస్థానము పుష్కరతీర్థముతో సమానమని అనుకొని, అక్కడ **గురునానక్** పీఠ-మును సందర్శిస్తాడు. అక్కడ ఒకానొక గురువు ప్రణవవోపాసనగూర్చి శాస్త్రమును ప్రతిపాది-స్తూండగా, స్వామి శ్రవణము చేసినాడు. ఇటువంటి ఓంకారధ్యానముగూర్చి భక్తులకు ఉపదేశిం-చినది శాస్త్రోక్తంగా ఉన్నదని స్వామి ఒప్పుకుంటాడు. పిమ్మట—

సిద్ధనాథుడు **కురుక్షేత్రమును** వీక్షించి, **హరిద్వార్** క్షేత్రమును నిర్భయముగా దర్శించి, అట-నుండి పయనమై **బద్రీనాథ్** క్షేత్రము చేరుకుంటాడు.**బద్రీనారాయణుని** సందర్శించి నారాయణాశ్ర-మము వెళ్లి, కేదారేశ్వర స్థానమును దర్శించి, అక్కడనుండి సిద్ధావధూత యోగీంద్ర యతీశ్వరుడు తనయొక్క తీర్థయాత్రలను తిరోగమనము చేయుటకు నిశ్చయించుకొని, అక్కడ స్వామి నిర్వికల్ప సమాధియందుండి కొండచిలువవలె భూమిపై పరుండి విశ్రాంతి తీసుకుంటాడు.

అంతలో శివానందుడు అను పేరుగల సన్యాసి భూమిపై విశ్రమించియున్న స్వామిని చూసి, ఈయన శవాసనము వేసి నిమగ్నుడై యోగాభ్యాసము చేస్తున్నాడు కాబోలు–అని అనుకుంటాడు. లేకపోయినచో ఈయన ఒకానొక బ్రహ్మనిష్ఠమహాత్ముడై ఉండి తనయొక్క (నిజస్థితి) సహజావస్థ యందు బ్రహ్మానందమును అనుభవిస్తున్నాడు కాబోలు–అని అనుకొని స్వామిని సమీపించి సిద్ధనా-థున్ని స్పర్శిస్తాడు.శివానందుడు స్వామిని స్పర్శించగానే సిద్ధనాథుడు కళ్ళు తెరిచి చూస్తాడు. అప్పుడు స్వామిని శివానందుడు ఇలా మందలిస్తాడు. నీవు ఏ ఆసనము వేసినావు?

స్వామి సమాధానమిస్తూ—ఈశరీరము తల్లి గర్భమునుండి వచ్చి, నేను అని అహంకరిస్తుం-ది. అందువల్లనే జీవుడనబడినాడు.అఖండమైన బ్రహ్మస్థితియందున్న ఈ శరీరమునకు ఏ ఆసనము అవసరము లేదు—అని అనగా, శివానందుడు స్వామిని ఈ విధంగా శంకచేస్తాడు.

బింబప్రతిబింబ వాదమునందు సంసర్గ భేదమున్నదా? లేక సంసర్గ అభేదమున్నదా?

స్వామి ప్రత్యుత్తరమిస్తూ—అది భేద అభేద తాదాత్మ్య అనిర్వచనీయ సిద్ధాంతమున్నది-అని అంటాడు. ఉపాధిదృష్ట్యా భేదము కానొవస్తుంది. యథార్థమునెఱింగినట్లయితే భేదము లేదు.

అప్పుడు ఆ సన్యాసి అది ఎలా సంభవిస్తుంది అని అడుగుతాడు.

దానికి అవధూత ప్రత్యుత్తరమిస్తూ—అద్దముయందు ముఖమును చూచినట్లయితే ముఖము ప్రతిబింబరూపముగా కానొస్తుంది. బింబరూపమైన ముఖము ఉత్తరాభిముఖంగా ఉంటే ప్రతిబింబ-ము దక్షిణాభిముఖంగా, కుడి ఎడమగా, ఎడమకుడిగా విపరీతంగా కానొస్తోంది. రెంటికి భేదము కానొచ్చినా, యథార్థముగా చూచినట్లయితే ఎలాంటి భేదము లేదు. ఉపాధిని తొలగించినట్లయితే ప్రతిబింబము బింబమైన ముఖముతో అభేదమును పొందుతుంది. లేక ప్రతిబింబమునకు హేతువైన

బింబరూపమైన తాను అక్కడనుండి దూరంగావెళ్లినాగాని భేదముకానరాదు.భేదాభేదములు యథార్థముగా నిర్ణయించడానికి వీలులేనందున భేదాభేద తాదాత్మ్య అనిర్వచనీయ సంబన్ధమున్నది.

ఇటువంటి సంభాషణద్వారా ఆ సన్యాసియగు శివానందస్వామి హృదయము ఆనందముతో ఉప్పొంగి పోయింది. వెంటనే ఆ సన్యాసి వద్దనున్న మధుకరి (భిక్షను) తీసి ఇద్దరు కలిసి భుజించినారు. అప్పుడు శివానంద సన్యాసి తన ఆశ్రమమునకు వెళ్ళిపోయెను.

అక్కడనుండి సిద్ధనాథుడు దండపాణి లింగ దర్శనార్థము వెళ్ళుటకు సిద్ధముకాగా, ఇంతలో ఒక జ్వరరోగపీడితుడైన బ్రాహ్మణుడు కనిపించినాడు.మూడు సంవత్సరాలుగా పీడింపబడుచున్న జ్వరరోగగ్రస్తుడైన బ్రాహ్మణుని చూచేసరికి స్వామికి దయకలిగి ఆరోగమును పరిహరింపచేస్తాడు. ఆ బ్రాహ్మణునికి "**ఓం నమశ్శివాయ**" అను పంచాక్షరీ మంత్రమును ఉపదేశిస్తాడు.

ఈ ప్రకారముగా సిద్ధనాథుడు జనులకుపకారము చేస్తూ ముక్తిమార్గము చూపిస్తూ, అక్కడక్కడ జిజ్ఞాసువులకు అనేక శంకలను నివృత్తిచేసి ధన్యులను చేసినాడు.లోకకల్యాణమునుగోరి స్వామి అవతరించి, దానిని సార్థకము చేయుటకు యాత్రల నిమిత్తము సిద్ధనాథయతీంద్రుడు అనేక ముముక్షువులను తరింప చేసినాడు.మంగళప్రదమైన, అమృతస్వరూపమైన శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినట్లైతే సకలపాపములు భస్మము కాగలవు. శ్రీశివదాసస్వామి ఈ ఏడవ అధ్యాయమును శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు సమర్పిస్తూ ముగించుచున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఎనిమిదవ అధ్యాయము

పద్యానువాదము:—అనేక శబ్దజాలమునకు,తర్కవితర్కములకు పరమాత్మ లభ్యముకాడు. స్వరూపముయందు లక్షణాయుక్త విచారణద్వారా ప్రాప్తము కాగలడు. అనేకమునందు ఏకత్వమును ఎవరు దర్శిస్తారో, వారు సమదర్శులు. నిత్యముక్తులు. పరమాత్మను దర్శించినవారవుతారు. ఇటు- వంటి లక్షణములుగల సిద్ధారూఢ సద్గురుస్వామికి హృత్పూర్వక వందనములు.

శ్రీసిద్ధారూఢ భగవంతుడు భక్తులపాలిట కల్పవృక్షము. కృపావంతుడు. అభక్తజనులయొక్క అజ్ఞానమును అరక్షణంలో నివృత్తిచేయగల సమర్థుడు. అజ్ఞానిజనులను భక్తిమార్గమునకు ప్రవృత్తు- లనుచేసి భేదవృత్తిని నివృత్తి చేసి, అభేద బుద్ధిని ప్రసాదించి సకల అనర్థములనుండి విముక్తులను జేస్తాడు.

గత ఏడవఅధ్యాయమునందు శ్రీ సిద్ధారూఢస్వామి జ్వరరోగపీడితుడైన బ్రాహ్మణునికి పంచాక్షరీ మంత్రదీక్షనిచ్చి రోగనివృత్తి చేస్తాడు. ఆర్తరక్షకుడగు అవధూతస్వామి కాశీలోని **కేదార్ ఘాట్** నందు కేదారేశ్వర లింగదర్శనము చేసుకొని "**జంగమవాడి**" మఠమునకు వెళ్లి అక్కడ నుండి **మణికర్ణికా ఘాట్‌ను** దర్శించి, కాశీవిశ్వేశ్వర ఆలయమునకు వెళ్ళి, **విశ్వేశ్వరుని** సందర్శించి, అక్కడనుండి **అన్నపూర్ణ** ఆలయమునకేగి దేవిని దర్శించి, తర్వాత "సురాభాండ"లింగ గృహమునకు వెళ్లి దర్శనము చేసుకుంటాడు. మరియు **బ్రహ్మఘాట్** కు వెళ్లి గంగానదియందు స్నానాది క్రియలు చేసి, అటనుండి దశాశ్వమేధ ఘాట్ కు వచ్చి దేవాలయమునందు కూర్చొని స్వామి తన మన- సులో ఈ విధంగా చింతించాడు. బ్రహ్మదేవుడు ఈ స్థానంలో పది అశ్వమేధయాగములు చేసి- యున్నాడు. అందుకని ఈ స్థానమునకు "**దశాశ్వమేధ ఘాట్**" అని పేరు వచ్చింది. ప్రజాపతి నాకన్న భిన్నంగా లేడు. సకల ప్రజోత్పత్తికి అధిష్ఠాన స్వరూపుణ్ణి నేనే ఉన్నాను–అని నిశ్చయించి, అన్యవృత్తుల శమనార్థము క్షణకాలము ఉదాసీనముగా కూర్చుంటాడు.

అదే సమయానికి మహాదేవశాస్త్రి అను పండితుడు తన యొక్క 56 మంది శిష్యులతోకూడి, సిద్ధనాథుడు కూర్చున్న స్థలమునకు వచ్చి తన శిష్యులకు ఈవిధంగా బోధ చేస్తున్నాడు.

ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ మరియు అభావములను సప్తపదార్థాలు ఉన్నాయి. అందు,

ద్రవ్యములు ౯:— పృథ్వి,జలము,అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిశలు, మనస్సు, ఆత్మ.

గుణములు:—రూపము మొదలుకొని ౨4 గుణములున్నాయి.రూప,రసము,గంధము,స్పర్ష ము,సంఖ్య,పరిమాణము,పృథక్త్వము,సంయోగము,విభాగము,పరత్వము,అపరత్వము,గురుత్వము, ద్రవత్వము,స్నేహము,శబ్దము,బుద్ధి,సుఖము,దుఃఖము,ఇచ్ఛ,ద్వేషము,ప్రయత్నము,ధర్మము,అధర్మము మరియు సంస్కారము.

కర్మ:–ఉత్క్షేపణము,అపక్షేపణము,ఆకుంచనము,ప్రసారణము మరియు గమనము—అను పంచవిధ కర్మలు ఉన్నాయి.

పర,అపర భేదముచే సామాన్యము రెండు విధములు.

విశేషము అనంతము.

సమవాయము ఏకము.

అభావములు4:—ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావము.

పృథ్వి గంధగుణము కలది. సుగంధ దుర్గంధములని–గంధము రెండు విధములు.

ద్రవ్యములలో నిత్యానిత్యములని రెండు విధములు. పరమాణురూపముగానున్నవి నిత్యములు. కార్యరూపముగానున్నవి అనిత్యములు.

అనిత్య ద్రవ్యములు:—శరీర,ఇంద్రియ,విషయ భేదముచే మూడు విధములు. శరీరమును ఆశ్రయించుకుని ఉన్న ఇంద్రియములు, శబ్ద,స్పర్శ,రూప,రస,గంధము మొదలగు పంచవిషయాలను క్రమంగా గ్రహిస్తాయి. ఈ విధంగా మహాదేవ శాస్త్రి తన శిష్యులకు బోధించుచుండగా, అదే సమ-యానికి జగన్నాథభట్టు అను పేరుగల మరొక పండితుడు తన ౭౨ మంది శిష్యులను వెంటబెట్టుకొని అక్కడికి వస్తాడు.

ఈయన గౌతమోక్త న్యాయ శాస్త్రమును ప్రతిపాదిస్తూ షోడశ పదార్థములు ఉన్నవని ప్రతి-పాదిస్తున్నాడు. 1.ప్రమాణ, ౨.ప్రమేయ, 3.దృష్టాంత, 4.సంశయ, 5.ప్రయోజన, 6.సిద్ధాంత, ౭.అవయవ, 8.తర్క, ౯.నిర్ణయ, 10.వాద, 11.జల్ప, 1౨.వితండ, 13.హేత్వాభాస, 14.ఛల, 15.జాతి, 16.నిగ్రహస్థానము--ఇవి 16 పదార్థములున్నవని ప్రతిపాదిస్తూ లక్షణములను నిశ్చితంగా బోధించుచుండగా—

మహాదేవశాస్త్రి అగ్నివలె మండిపడుతూ సప్తపదార్థములు మాత్రమే ఉన్నాయని గట్టిగా అరుస్తాడు.

కాదు కాదు 16 పదార్థములు ఉన్నాయని జగన్నాథభట్టు అంటాడు.

మహాదేవశాస్త్రి మళ్లీ, తత్వజ్ఞానమును పొందడానికి న్యాయశాస్త్రమునందు సప్తపదార్థములు చెప్పబడినవి అంటాడు.

ఇది అయోగ్యముందని 16 పదార్థములు చెప్పబడినవి అని జగన్నాథభట్టు అంటాడు.

పునః మహాదేవశాస్త్రి– నీవు చెప్పిన ఏవైతే 16 పదార్థాలున్నాయో, అవి నేను చెప్పిన సప్త పదార్థములలోనే అంతర్భూతములై ఉన్నవి–అని అంటాడు.

ఈ ప్రకారంగా ఇరువురి మధ్య వాదము ముదురుతుండగా అవధూత సిద్ధనాథస్వామి వారి-రువురిని గురించి తనమదిలో ఈ ప్రకారంగా అనుకుంటాడు.ఈ మూర్ఖులు అనిత్యమైన ద్రవ్యగుణా-దులగూర్చి ఇంత వాదులాడుకొనుచున్నారు. నిత్యమైన వస్తువుగూర్చి విచారమేలేదు. వీరికి గుణపా-ఠము చెప్పాలి–అని అనుకుని,వారిరువురి మనస్తత్త్వమును తెలుసుకొని,నిత్యవస్తువుయందు ప్రవృత్తి చేయదలచి,ఆ ఇద్దరిని ఉద్దేశించి ఈవిధంగా అంటాడు. ఓ బుద్ధిమంతులైన పండితులారా! వినండి.

మీరు ద్రవ్యగుణాదులగూర్చి విచారమగ్నులై వాదులాడుకుంటుంన్నారు.ద్రవ్యగుణాదులు అంటే మీ స్వరూపమా? లేక మీరు వాటికంటె భిన్నంగా ఉన్నారా? వాటితో తాదాత్మ్యమును పొంది తద్రూపులు కావడము అనుచితము.కారణమేమనగా,ద్రవ్యగుణాదులు జడములున్నవి.అట్టి జడముల కంటె మీరు భిన్నంగా ఉండి చైతన్యస్వరూపులై, బ్రహ్మచైతన్యముతో అభిన్నులైయున్నారు. మీరు బ్రహ్మ స్వరూపులు.లేనిచో,"ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ"(ఛాం.6-౽-1;అధ్యాత్మోప.63) నేహనానాఽస్తికించన" (బృ,4-4-19;కఠ.౽-1-11) అను శ్రుతులకు విరోధము కలుగగలదు.ఈ అభేదము జ్ఞానకాలమందు మాత్రమే సిద్ధిస్తుంది, అని మీరు అన్నట్లయితే, ఆత్మ మరియు బ్రహ్మలయొక్క స్వతస్సిద్ధత్వమునకు భంగము వాటిల్లగలదు. కావున, ఎల్లప్పుడూ స్వరూపముచే అభిన్నమయ్యే ఉంటుందని చెప్ప వలయును.ఈ అభేదజ్ఞానము నిరంతరము అసహాయపూర్ణమై (ఇతరముయొక్క అపేక్ష లేకయే) మోక్షమునకు సాధనమౌతుంది.

పండితులు ఈ ప్రకారంగా అంటున్నారు—కర్మ ఉపాసనల సహాయముచేత జ్ఞానము మోక్షమును ఇస్తుంది, నిరపేక్షికమెలా అవుతుంది?

అప్పుడు వారికి సిద్ధనాథుడు సమాధానమిస్తూ:—"జ్ఞానాదేవతు కైవల్యమ్" అను శృతి వచ-నమందు "**ఏవ**" అను పదముద్వారా కేవలము జ్ఞానముచేతనే అనగా, దేని సహాయము లేకనే మోక్షప్రాప్తి కలుగునని తెలుసుకొనవలెను.మరియు "**తు**" అను పదముద్వారా జడమైన సాధనము-లను వ్యావర్తము (వేరు)చేసి సిద్ధాంత పక్షానుసారముగా జ్ఞానముద్వారానే కైవల్యప్రాప్తి లభ్యమ-వుతుందని నిశ్చయముగా శ్రుతి బోధిస్తుంది.

సద్గురు సిద్ధనాథునియొక్క ఈ వచనములను విని మహాదేవశాస్త్రి మరియు జగన్నాథభట్టు ఇరువురు-నీవు యథార్థమైన,పరిపూర్ణమైన,బ్రహ్మనిష్ఠమహాత్ముడవున్నావు. ఆ విశ్వేశ్వరుని కృపచేత మాకు యథార్థమైన బోధ ప్రాప్తమయ్యింది.మీముందు మాయొక్క శబ్దజ్ఞానరూప తర్కము ఎందుకు కొఱగాదు, నిరర్థకము. మేము అనుభవాన్ని పొందలేదు. అని నిరభిమాన వృత్తితో వారి అభిప్రా-

యాన్ని వెలిబుచ్చుకుంటూ,చేతులు జోడించి స్వామిని వేడుకుంటారు. ఓ స్వామి! మీయొక్క వచనములు సత్యమైనవి, యథార్థమైనవి. మాకు సదుపదేశము చేయండి.

సిద్ధనాథస్వామి వారికి సమాధానము చెపుతూ–ఇది తారకఉపదేశాన్ని బోధించినటువంటి స్థలమున్నది. శాస్త్రములు తారకఉపదేశమును సంపూర్ణముగా ప్రకటము చేసినాయి.దాన్నే అనుభ-వమునందు అన్వయించుకొని తరించాలి. దానికన్నా భిన్నమైన పాండిత్యము చేయకూడదు. వేద-ములు అనాయాసంగా ఏ పరమాత్మ ముఖకమలము నుండి వెలువడినవో, ఆ పరశివుని అభిప్రాయము కూడా అభేదమునందే ఉన్నది.(అభేదద దర్శనం జ్ఞానమ్. మైత్రే.౭-౭).ఈ ప్రకారమైన వాక్కులను విని,వారు ఆనందమును పొంది, సిద్ధ నాథస్వామికి నమస్కరించి వారివారి శిష్యులతో సమేతముగా అక్కడి నుండి వెళ్ళిపోయినారు.

వారందరూ వెళ్లి పోయినాక వారితోపాటు పోయినట్లే పోయి అందులోనుండి ముగ్గురు శిష్యులు మాత్రము వారి నుండి తప్పించుకొని వెనుదిరిగి మళ్లీ సిద్ధయతీంద్రుని వద్దకు తొందరగా వచ్చినారు. వారు స్వామిని ఈ విధంగా అడుగుతారు.

ఓ స్వామీ! మీరు చెప్పినటువంటి బ్రహ్మోపదేశమువలన మాకు యథార్థనిశ్చయము కలుగు-టలేదు. ఎందుకనగా, అప్రత్యక్ష వస్తువుయొక్క శ్రవణముద్వారా అభావజ్ఞానమే కలుగుతుంది. ప్రత్య-క్షజ్ఞానము కలుగదు.పరమాత్మ భావరూపుడంటే ఘటపటాది వస్తువులవలె ప్రత్యక్షము కావలెను గదా! చిత్తమునందు సద్భావము కలుగుటలేదు.

ఇది విన్న సద్గురుదేవుడు వారిపై దయగలిగి, వారిని వికల్పించి అడుగుతాడు. అభావ-ము(లయము)ను ఏది పొందుతుంది? జ్ఞానమా?లేక మనస్సా?

జ్ఞానము ఎప్పుడుకూడా లయముకాదు. **“నహి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్”**(బృ.4-3-30) జ్ఞానము లయమవుతుంది అన్నట్లయితే శూన్యవాదము ప్రసక్తమగును. అయితే శూన్యమును తెలుసుకునేది జ్ఞానమే, కాబట్టి జ్ఞానముయొక్క అభావము (లయము) ఎన్నటికిని కాదు. మనోబుద్ధులకు లయము సంభవిస్తుంది.

అప్పుడు ముగ్గురు శిష్యులు సిద్ధనాథునితో ఈ ప్రకారంగా అంటారు. "ఒకానొక దరిద్రుడు నేను రాజును ఉన్నాను" అన్నట్లుంది మీయొక్క కథనము.

అప్పుడు సిద్ధయతివర్యుడు వారితో—పైత్యరోగగ్రస్తుడైన వానికి తాను ఏమి మాట్లాడుతు-న్నాడో తనకే తెలియనట్లు మీయొక్క శంక ఉంది అంటాడు.

అప్పుడు వారంటారు. మేము అజ్ఞానులము. మీయొక్క దశ(స్థితి,అవస్థ) వేరు. మా యొక్క దశ వేరుగా ఉన్నాయి.

అప్పుడు సిద్ధనాథస్వామి వారితో—ఆత్మయందు దశవిశేషములు ఏమీ ఉండవు.అది సామాన్య విశేషభావరహితము–నిర్విశేషము. ఏ విధంగా ఆకాశము అంధకారము చేతగాని, ప్రకాశముచేతగాని నిర్లిప్తమై ఉంటుందో అట్లే,ఆత్మ నిర్విశేషమై, నిర్మలమై,అసంగమై ఉంది.

స్వామియొక్క యథార్థమైన బోధను విని ఆశిష్యులు ఈ విధంగా అంటారు. విద్యాపాండిత్య మదముచేత ఆత్మానుభూతిని పొందలేకపోయాము.యథార్థమైన ఆత్మానుభూతి ఏ విధంగా కలుగ గలదు చెప్పండి స్వామీ!

విద్యాపాండిత్యముయొక్క అభిమానముచే విద్యాగర్వమును వస్తుంది. తద్వారా రాబోవు జన్మయందు బ్రహ్మరాక్షసులై పుట్టగలరు-అని సిద్ధనాథుడు వచింపగా—

ఆ శిష్యజనులు అత్యంత భయభీతులయ్యి స్వామితో ఈ విధంగా అంటారు. అయితే మేము ఇప్పడే న్యాయశాస్త్రము మొదలగు అధ్యయనములను విడిచి నీయొక్క పాదదాసులమై పడి ఉంటాము.శీఘ్రముగా మేము బ్రాహ్మీస్థితిని పొందునట్లుగా ఆశీర్వదించండి అని వేడుకొనగా—

సిద్ధయతీంద్రుడు మీకు శుద్ధమైన భావన ఉన్నట్లయితే ఈశ్వరునికృప లభ్యమగు గాక! అని ఆశీర్వదిస్తాడు.

ఆ శిష్యులు స్వామియొక్క ఆశీర్వాదమును పొంది అత్యంత హృదయానందభరితులై వారి వారి ఇండ్లకు వెళ్ళిపోయినారు. తరువాత సిద్ధనాథుడు అహల్యాఘాట్ కు వెళ్లి క్షణకాలము విశ్రాంతి తీసుకుని, నారదఘాట్ కు వెళ్లి, అచటనుండి ఛత్తీస్ ఘాట్ ను దర్శించి, పాండేశ్వర ఘాట్ ను చూసినాడు.అక్కడనుండి సిద్ధనాథుడు "మహా శ్మశాన ఘాట్"కు పోయి అచ్చట శివాలయంలోకి వెళ్లి మూర్తిని దర్శించి, అక్కడనుండి "యక్షరాజఘాట్" వద్దకు వెళ్లి క్షణకాలము అక్కడ విశ్రాంతి తీసుకొని, అచటనుండి స్వామి "నంగాఘాట్ "కు వచ్చినాడు. అచట ఒక నగ్నసన్యాసి సిద్ధనాథస్వామిని చూసి, స్వామియొక్క కౌపీనమును గాంచి, తన మనసులో—వస్త్రములు ధరించే వారందరికీ ఎల్లప్పుడూ చింత, దుఃఖము ఉంటుంది. సుఖం ఏమాత్రముండదు అని అనుకొని,

సిద్ధనాథునితో ఆ నగ్నసన్యాసి ఈ విధంగా అంటాడు. నీవు నిజముగా సాధువు అయి ఉండి ఈ వస్త్రమును (కౌపీనమును) వ్యర్థముగా ఎందుకు ధరించినావు?

అప్పుడు సిద్ధనాథుడు ఆయనను వికల్పముచేసి ఇలా అడుగుతాడు:—పరిధానమును (వస్త్రమును) వదిలి స్వేచ్ఛగా విహరించుచున్న ఓ సాధువర్యా!విషయేంద్రియముల సంయోగము ద్వారా సుఖదుఃఖములు కలుగుతాయా? లేదా?

అప్పుడు ఆ నగ్న సన్యాసి సిద్ధనాథునితో ఈ విధంగా అంటాడు. నేను చెప్పబోయే విషయమును కొంచెము జాగ్రత్తగా వినుము. అదేమనగా—ప్రారబ్ధముచే ప్రాప్త వ్యవహార కాలమందు సహనశీలత (తితీక్ష) ఉన్నందున సుఖదుఃఖములు ప్రతీతి కావు. (నివృత్తమగును).

సిద్ధనాథస్వామి అంటాడు—సహనశీలత(తితీక్ష) అనునది సాధనమైనది గదా!సాధనకాలమందే సుఖదుఃఖములను జయించి తితీక్షను కలిగియున్నాక, ఇక సాధ్యావస్థలో సుఖదుఃఖములు ఆయనకు ప్రతీతి అవుతాయా?(క్రైముతికన్యాయము).ఈ కారణముచేత వస్త్రముయొక్క గ్రహణ,త్యాగము సుఖదుఃఖములకు కారణము కాదు. అహంతా మమత్వ బుద్ధిచేత మనసు,ఇంద్రియముల ద్వారా విషయాలతో సంబంధమైనప్పుడు సుఖదుఃఖములు కలుగుతాయి. కేవల విషయములు సుఖదుఃఖములకు కారణములు కావు—అని సిద్ధనాథుడు చెప్పగా,ఆ నగ్నసన్యాసి తనలోతాను–సిద్ధనాథుడు పైకి చూడడానికి పిచ్చివాడిలాగా ఉన్నాడు. కాని, యథార్థముగా ఈయన పూర్ణజ్ఞాని ఉన్నాడు-అని అనుకుని,అక్కడనుండి వెళ్ళిపోతాడు.

అవధూత సిద్ధయోగీంద్రుడుకూడా అటనుండి బయలుదేరి వ్యాసకాశీ, రామనగరము చేరుకొని, అక్కడ ఒక చెరువు కట్టమీద కొంచెము సేపు విశ్రాంతి తీసుకుని,గిరిజాదేవి మందిరమునకు వెళ్లి దర్శనము తీసుకొని, మరికొంచెముసేపు సేద తీర్చుకుందామని కూర్చున్నాడు. అదే సమయానికి అక్కడికి ఆ ఆలయ 'దేవీపూజారి' వచ్చి సిద్ధనాథుని వీక్షించి, సిద్ధనాథునియొక్క పరిస్థితిని, ఆయనయొక్క చిక్కిపోయిన శరీరమునుగని, ఈయన కడుపు వీపుకు అంటుకుని ఉంది. చాలా రోజులనుండి పస్తుగా ఉన్నట్లు కానొస్తుంది–అని వైఖరీవాణిలో అనుకుంటున్నాడు.

ఈ మాటలు సిద్ధారూఢస్వామి విని, అవును, నిజము. పూర్వము వ్యాసభగవానుడు తన పదివేల మంది శిష్యులతోసహా మూడు రోజులు ఈస్థలమందు ఉపవాసమున్నాడు.అందుకు వ్యాసభగవానుడు కోపించి కాశీనగరమునకు శాపమిచ్చుటకు సిద్ధముకాగా, కాశీవిశ్వేశ్వరుడు ప్రత్యక్షమై స్వామీ! మీరు వృథాగా మీ తపశ్శక్తిని వినియోగించి శాపమిచ్చుటకంటె మీరే స్వయముగా ఇక్కడ నుండి దయచేసి ఉత్తరకాశీకి వెళ్ళినట్లయితే మీ తపఃఫలము వృథా కాదు. ఎలాంటి అనర్థము జరగదు-అని అనగా, వ్యాసభగవానుడు శాంతించి ఉత్తరకాశీకి వెళ్ళినాడు.అటువంటి వ్యాసభగవంతునికే ఈ స్థలమందు ఒకప్పుడు పస్తులుండక తప్పలేదు. అదేవిధంగా నాకుకూడా మూడు రోజులు ఉపవాసముండక తప్పలేదు.కావున నేనుకూడా ఇప్పుడు కాశీనుండి బయటకు వెళ్లాలి అని అనుకుంటున్నాను.అయినాగాని ఈ ప్రారబ్ధము నన్నేమి చేయలేదు-అని నిశ్చయించుకొని నిశ్శంకతో కూర్చొని ఉంటాడు సిద్ధనాథుడు.

స్వామియొక్క గంభీరమైన ముఖకమలమును చూసి ఆ పూజారి స్వామిని ఈ విధంగా ప్రశ్నిస్తాడు.ఓ అతిథిదేవా! నీవు ఎవరు?

అప్పుడు సిద్ధనాథుడంటాడు అంటాడు—నీవెవరవు? అని ఏదైతే ప్రశ్న చేసినావో, దానిని ఎవరు తెలుసుకుంటున్నారో,అదే నేనై ఉన్నాను. నిత్యమై, పరిపూర్ణమై ఉన్నాను.

ఇది విన్న ఆ పూజారికి ఏమీ తెలియబడక, సరే కాని, నీవు భోజనము చేసావా? అని అడుగుతాడు.

సిద్ధనాథుడు అంటాడు—భోజనము నాకు సమర్పించాలని ఇచ్ఛ గలిగి, ప్రేమతో నీవు నాకు భోజనమును సమర్పించినట్లయితే నేను స్వీకరించగలను, అని అనగా-ఆ పూజారి స్వామిని తమ ఇంటికి భోజన నిమిత్తము దయచేయమని కోరుతాడు.

అప్పుడు సిద్ధనాథుడంటాడు—మహాత్ములను, అతిథులను ఇంటికి తీసుకెళ్లి భోజనఫలహార ములను సమర్పించుకున్నట్లయితే అన్నదాతకు అల్పపుణ్యము లభ్యమగును. అతిథి కూర్చున్నచోటుకే తీసుకొచ్చి సమర్పించుకున్నట్లయితే అధికపుణ్యము లభ్యమగునని చెప్పగా–పూజారి విని, తన ఇం-టికి వెంటనే వెళ్లి షడ్రసోపేతమైన ఆహారమును తీసుకొని వచ్చి, ఇద్దరు కలిసి యథేచ్ఛగా భుజించి తృప్తి పొందినారు.

అక్కడనుండి పంచక్రోశ యాత్ర గురించి వెలుతూ మొదట కర్దమేశుని దర్శించినాడు. ఆ క్షేత్రమును జనకమహారాజు స్థాపించినాడు. అక్కడనుండి భీమచండిదేవియొక్క దర్శనము చేసుకుని, రెండవ స్థానమైన గంధర్వసేన లింగమును దర్శించి పశ్చిమేశుని గాంచినాడు. మూడవ స్థానమైన అయోధ్యాధిపతి రామషడాయతనమును సిద్ధనాథుడు దర్శించుకున్నాడు. నాలుగవ స్థానమునందు పాండవులయొక్క మూర్తులను దర్శించుకున్నాడు.ఐదవ తీర్థమైన కపిలధారాతీర్థమునందు స్నానము చేసి, అనేక లింగములను దర్శించి స్వర్గ ఫలప్రదములగు క్షేత్రములను దర్శించినాడు. "శివరాన" లింగ దర్శనము చేసుకొని అనేక సుందరమైన క్షేత్రములను దర్శించినాడు. బుద్ధి, స్వధా, స్వాహా, మహానిద్ర మొదలైన శక్తి గణములను చూసినాడు. ఇట్లు పంచక్రోశయాత్ర పూర్తిచేసికొని—

ఒకానొక స్థలమందు స్వామి ఏకాంతముగా కూర్చుంటాడు. అదే సమయానికి అక్కడనుండి ఒకానొక గృహస్థుడు సత్తు పిండిని తీసుకెళ్తూ స్వామిని చూసి,ఆయన తనయొక్క దోసిలినిండుగా సత్తుపిండిని స్వామియొక్క చేతులలో వేయగా దానిని స్వీకరించుటకు స్వామి ఉపక్రమించుచుండగా అంతలోనే దైవయోగముచేత ఒకాయన పెరుగు తీసుకొనిచ్చి, ఒక దొప్పయందు పెరుగునుంచి స్వామికీయగా సత్తుపిండిని పెరుగును మిశ్రణము చేసుకొని సిద్ధారూఢస్వామి సేవిస్తాడు.

తరువాత స్వామి ప్రయాగక్షేత్రమునకు వెళ్లి ఈప్రకారముగా తనలోతాను ఇలా అనుకుంటా-డు. క్షేత్రసంచారము చేయడానికి ఎవరికైతే శక్తిసామర్థ్యములులేవో, వారు కేవలము సర్వక్షేత్రముల యొక్క నామములను భక్తిపూర్వకముగా ఉచ్చరించినట్లయితే యాత్రాఫలము లభిస్తుంది.ఆ నామ-ములు పరమాత్మయొక్క వాచకములున్నందున పరమాత్మ స్వరూపాన్ని పొందుతారు.

ప్రయాగతీర్థమునకు వెళ్లి, అక్కడ జనులు కావడియందు రామేశ్వరమునుండి లింగములను తీసుకొనివచ్చి ప్రయాగయందు జలములో విడుస్తారు.ఈదృశ్యమును స్వామి వీక్షించి,ఇదంతా కర్మ

సిద్ధాంతాన్ని అనుసరించి ఈశ్వర ప్రీత్యర్థము చేస్తారు. తద్వారా ఈశ్వరకృప గలిగి వర్తమాన పాప దోషములు నివృత్తమై జ్ఞానమునకు అధికారులవుతారు.

తరువాత సిద్ధనాథుడు **కోట**యందు ప్రవేశించి సంగమనాథుని దర్శించి, అక్కడ అక్షయ వటవృక్షముయొక్క మూలమును దర్శించి,మొగల్ సరాయికి పోవడానికి సిద్ధమై, మొగల్ సరాయి గ్రామమును ప్రవేశించినంత మాత్రాన మేఘములు ఆకాశమునక్రమ్మి వర్షము కురియనారంభించె-ను. అప్పుడు స్వామి ఏమి చేస్తాడంటే—

ఒకానొక షావుకారి ఇంటికి వెళ్లి బయట వరండాపైన క్షణమాత్రము కూర్చుంటాడు. అప్పుడు కాపలా కాసేవాడు సిద్ధనాథుని వద్దకు వచ్చి, ఇక్కడ ఎందుకు కూర్చున్నావు? ఇది మందిరమను-కున్నావా? లేక మఠమనుకున్నావా? లేక ధర్మశాల అనుకున్నావా?

అప్పుడు అవధూత సిద్ధనాథస్వామి సమాధానమిస్తూ—ఇది వాస్తవముగా ముసాఫిర్ ఖానా ఉంది. అందుకనే ఇక్కడ కూర్చున్నాను. నీవు బుద్ధి లేని వాడవున్నావు.

ఈ మాటలు ఇంటియందున్న షావుకారు విని, బయటకు వచ్చి స్వామిని ఈ విధంగా అడుగుతాడు. ఇది ముసాఫిర్ ఖానా ఎట్లవుతుంది?

సిద్ధనాథుడు షావుకారిని ఇట్లు అడుగుతాడు. ఈ ఇంటిలో ఎవరు ఉంటారు? షావుకారు అంటాడు. "నేను". నీకంటే ముందు ఎవరు ఉండిరి? అని సిద్ధనాథుడు ప్రశ్నిస్తాడు. షావుకారు అంటాడు. "మా నాన్న". అంతకంటే ముందు ఎవరు ఉండిరి? అని స్వామి ప్రశ్నిస్తాడు. "మా తాత" అని షావుకారు సమాధానమిస్తాడు. ఆయన కంటే ముందు ఈ గృహంలో ఎవరుండిరి? అని స్వామి ప్రశ్నిస్తూ—అనేకమంది ఒకరి తర్వాత ఒకరు వచ్చి వెళ్ళినారు. ప్రతిఒక్కరి ఆయుష్కాలము ఒక దిన-ముతో సమానము ఒక్కొక్కరు ఒక్కొక్క దినముండి పోయినారు.అందువలన ఇది నిశ్చయము గా ముసాఫిర్ ఖానా ఉన్నదని తెలుసుకొమ్మని స్వామి షావుకారుతో అంటాడు. ఇటువంటి ఆశ్చ-ర్యకరమైన వాక్కులను విని షావుకారు విస్మయమొంది తనలోతాను—ఈయన నిజంగా గొప్ప మహాత్ముడున్నాడు.ఈయనద్వారా నేనుకృతకృత్యుడను కాగలనని మనసులో అనుకొని, ఆర్తనాద ముతో స్వామియొక్క చరణకమలములపైబడి సాష్టాంగనమస్కారములు సమర్పించుకుంటాడు.

తరువాత అత్యంత నమ్రభావముచేత షావుకారు సిద్ధారూఢస్వామియొక్క చేయిపట్టుకుని తన గృహములోకి తీసుకెళ్లి ఉన్నతాసనమిచ్చి కూర్చుండ పెట్టి, షోడశోపచార యుక్తముగా పూజ గావించి సహకుటుంబముగా స్వామికి నమస్కరించుకుంటారు. అదే సమయానికి షావుకారు తల్లి కడుపునొప్పితో బాధపడుచుండెను.మూడు నెలలనుండి అతిదారుణమైన ఉదరశూలతో బాధపడు-తున్న తన తల్లియొక్క కడుపునొప్పిని నివృత్తి చేయమని శ్రీ సద్గురు సిద్ధారూఢయతీంద్రుని షావుకారు ఎంతో ఆర్తముతో ప్రార్థిస్తాడు.

సిద్ధనాథుడు అంటాడు-ఏది మీ తల్లీ? నేను చూస్తాను. అప్పుడు షావుకారు తత్కాలమే తన తల్లి వద్దకు సిద్ధనాథున్ని తీసుకెళతాడు.స్వామి ఆమెను చూసి,ఈ ప్రకారంగా అంటాడు. ఈరోగము పూర్వజన్మ పాపదోషము (మలదోషము) వలన కలిగింది. ఇది శివధ్యానము మానసపూజద్వారా నివృత్తి అవుతుంది, లేక ఎవరైనా మహాత్ములయొక్క చరణతీర్థమును సేవించినట్లుయితే నివృత్తి అవుతుంది—అని రెండు మార్గములను చూపెట్టి,దేనినైనా ఒక దానిని మనస్ఫూర్తిగా ఆచరించి-నట్లయితే బాధ నివృత్తి అవుతుంది—అని అంటాడు.

ఈ మాటలు విన్న షావుకారు సంతోషించి, స్వామీ! మీకంటే వేరే మహాత్ములు ఉన్నారా? మీయొక్క పాదతీర్థమువలన బాధ తప్పకుండా నివృత్తి అవుతుంది-అని వెంటనే సద్గురుదేవుని చరణ కమలతీర్థమును తన తల్లియొక్క ముఖములో పోసినాడు. అదేక్షణమందు తల్లియొక్క కుక్షి (కడుపు) బాధ తగ్గింది. శాంతచిత్తయై ఆ వృద్ధురాలు లేచినిలబడి సద్గురుచరణాలకు నమస్కరించి మీయొక్క కృపవలన నాయొక్క బాధ నివృత్తి అయ్యింది. నేను మీ పాదకమల వరప్రసాదముచే ధన్యురాలనైతి-ని-అని అన్నది.

తర్వాత శ్రీసిద్ధారూఢస్వామికి ఉన్నతాసనమొసంగి పంచభక్ష్యయుక్తమైన భోజనమును సమ -ర్పిస్తారు. స్వామి భోజనమును సేవించి చేతులు కడుగుకున్నాడు.ఆ రాత్రి స్వామికి మెత్తనైన పా-న్పుపై పరుండడానికి ఏర్పాట్లు చేసినారు. స్వామి తనలోతాను ఈ విధంగా అనుకుంటాడు—ఏమిటి ఇదంతా? ఉన్నతమైన ఆసనము, మెత్తనిపాన్పు, పంచభక్షపరమాన్నము—ఈ ఉపాధులు నాకొద్దు. ఈ సుఖోపభోగముల(బానుగడి)అలజడి నాకొద్దు.రాళ్లపైన,కటికనేలపైన, నగ్నపాదాలతో తిరగడమే శ్రేష్ఠము.ఈభోగములన్ని వ్యర్థములు. సుఖదుఃఖములయందు సమభావముచేత ఉండడము ముఖ్యము.ఏవిధంగా దుఃఖములను త్యాగము చేస్తామో,అదేవిధంగా సుఖములనుకూడా త్యాగము చేయాలి. ఇక,ఇక్కడ ఉంటే బాగులేదని భావించి, సిద్ధనాథుడు ఎవరికీ చెప్పకుండా బ్రహ్మముహూ-ర్తమున లేచి షావుకారు ఇంటినుండి వెళ్లి గయాక్షేత్రమునకు వెళ్లి, ఒకానొక శివాలయంలో ఆనందంతో కూర్చుంటాడు.

శ్రీ సిద్ధారూఢస్వామియొక్క కథ విచిత్రమైనది, పవిత్రమైనది. ఇలాంటి కథను విన్నట్లయితే చెవులు పవిత్రమై,పాపరాశియంతయు నాశనమై అణుమాత్రముకూడా లేకుండాపోవును. ఇటువంటి ఈ పుణ్యచరిత్రను తప్పకుండా శ్రవణము చేయవలెను.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రమున పాపములు భస్మీభూ-తము కాగలవు. శ్రీ శివదాసుడు సద్గురుపాదపద్మములకు ఈ ఎనిమిదవ అధ్యాయమును సమర్పి-స్తూ ముగిస్తున్నాడు. ఓం శ్రీ సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ॐ శ్రీ గణేశాయ నమః ॐ శ్రీ గురుభ్యో నమః ॐ శ్రీ సరస్వత్యై నమః

# తొమ్మిదవ అధ్యాయము

పద్యానువాదము:—సాక్షాత్ పరమశివుడు సద్గురు సిద్ధారూఢ స్వరూపముగా అవతారమునకు వచ్చి జీవులయొక్క జననమరణరూప భవసాగరమును యథార్థమైన బోధద్వారా నివృత్తి చేస్తాడు. నిరుపమానమైన ఆత్మజ్ఞానాన్ని బోధించి యథార్థమైన సుఖాన్ని ప్రసాదిస్తాడు. సద్గురుదేవునియొక్క చరణకమలములను ఆశ్రయించినంత మాత్రముననే ఆయన కృపద్వారా భవసాగరనుండి తరింపబడతాము.

సద్గురునాథుడైన సిద్ధనాథ స్వామి సకల ప్రాణులయెడ కృపను ప్రసాదిస్తూ ఆర్తజీవుల(పీడిత జీవుల)యొక్క దుఃఖాన్ని నివృత్తిచేస్తూ ఇష్టఫలములను ప్రాప్తిచేస్తూ స్వేచ్ఛగా ముముక్షుజనులకు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తాడు.

ఇంతవరకు స్వామి ఆ షావుకారు గృహమందు ఉన్నటువంటి విషయసుఖములను త్యాగము చేసి ఎవరికి చెప్పకుండా అక్కడినుండి బ్రహ్మముహూర్తమున బయలుదేరి గయాక్షేత్రమునకు చేరుకొని ఒక సుందరమైన శివాలయములో కూర్చుంటాడు. అదే సమయానికి అచ్చట గాయకులు సంగీతమును గానము చేస్తుంటారు.గాయకులు భైరవీ రాగమును ఆలపించనారంభించగా సిద్ధనాథుడు వారినుద్దేశించి ఈవిధంగా అంటాడు.ఇది శివాలయం ఉన్నది. శివపూజలు జరిగేవేళ శంకరాభరణ రాగమును ఆలాపించాలిగాని, భైరవీ రాగమును ఆలాపించకూడదు.

ఈ విధంగా సద్గురు సిద్ధనాథుడు అనగానే, ఆ గాయకులు స్వామిని-ఎందుకు ఈ సమయమున శంకరాభరణ రాగమును గానము చేయాలి? అని ప్రశ్నిస్తారు.

అప్పుడు స్వామి వారినుద్దేశించి ఈ విధంగా అంటాడు. హృదయస్థానమునందు సర్పాకార కుండలినిశక్తి ఆచ్ఛాదనమై ఉంటుంది. శంకరాభరణరాగముచేత ఆ కుండలిని నాభిస్థానమును వీడి ఊర్ధ్వముఖముగా వెళ్లి బ్రహ్మరంధ్రమును పొంది పూర్ణఫలమును పొందుతుంది. సద్గురుదేవుని యొక్క సంభాషణమును విని గాయకులు వారిలోవారు ఈయన ఒకానొక గొప్ప బ్రహ్మవేత్త ఉన్నాడు—అనుకుని స్వామికి నమస్కరించి మళ్ళీ ఈ విధంగా నమ్రభావముచేత విచారిస్తారు.

ఓ మహాత్మా!రాగముయొక్క ఉత్పత్తిస్థానము ఎక్కడుంటుంది? దయచేసి తెలుపండి స్వామీ-

జీ-అని వేడుకోగా, స్వామి సంతుష్టచిత్తుడై రాగముయొక్క ఉత్పత్తిస్థానము తెలుపుతాను వినండి అంటూ—

శివునియొక్క సప్తముఖములనుండి సప్తస్వరములు ఉత్పత్తి అయినవి. వాటియొక్క స్థానములు క్రమముగా:—1.ఈశ్వర,2.సద్యోజాత,3.వామదేవ,4.అఘోర,5.తత్పురుష,6.ఈశాన్య మరియు 7.నిరంగ. సప్తస్థానములనుండి ఉత్పత్తి అయిన సప్తస్వరాలు క్రమముగా ఇవి— 1.షడ్జ, 2.వృషభ, 3.గాంధార, 4.మధ్యమ, 5.పంచమ, 6.దైవత మరియు నిషాదము–అని ప్రసిద్ధము. ఆ సప్తస్వరాలే ఈ జీవుని శరీరమందు కంఠము, శిరము, నాసిక, హృదయము, ముఖము, తాలువులు, పూర్వాంగము మొదలగు స్థానములనుండి క్రమంగా సప్తస్వరాలు వెలువడుతాయి.

ఇక వాటిని ఆలాపించే (ప్రకటన) సమయములను తెలుపుతాను వినండి. మధ్యాహ్నము, అపరాహ్నము, సాయంకాలము, పూర్వాపర రాత్రి, నిశావసాన సమయములందు ఈ స్వరాలను క్రమంగా గానము చేయాలి.ఈ సప్తస్వరాలను సప్తస్థానములనెఱింగి వాటిని క్రమ పద్ధతిలో సరియైన వేళలలో, ఏ రాగమును ఏ సమయమందు ఆలాపించాలో, అదే సమయంలో ఆలాపించి, ఎవరైతే గానము చేస్తారో, వారికి ఈశ్వరకృప కలిగి జ్ఞానము ప్రాప్తించును.ఈ సప్తస్వరములను లయబద్ధంగా ఈశ్వరప్రీత్యర్థము గానము చేయాలిగాని, నరులయొక్క ప్రీత్యర్థము గానము చేసినట్లయితే అవి వ్యర్థములు కాగలవు. ఈ భాషణమును విని గాయకులు తటస్థులై స్వామికి సాష్టాంగ నమస్కారములు చేసినారు.

సిద్ధనాథుడు సంతోషించి,అక్కడనుండి ప్రయాణమై **గయా** క్షేత్రమునకువెళ్ళి **విష్ణుపదము**ను దర్శించి, తదనంతరము **వైద్యనాథ** క్షేత్రమునకు వచ్చినాడు. అక్కడ అభిషేకము చేస్తున్న పూజారులను చూసి ఈ విధంగా తాను అనుకుంటాడు.

సూర్యడు నమస్కార ప్రియుడు. వాయుదేవుడు గంధ ప్రియుడు. గరక (గడ్డి) ప్రియుడు గణనాథుడు. అదేవిధంగా ఈశ్వరుడు అభిషేక ప్రియుడు. స్థూలజలముచేత స్థూల లింగముయొక్క అభిషేకము చేస్తారు.ఇవి సకామభక్తుల ప్రీత్యర్థము చెప్పబడినవి. కారణమేమనగా,లింగమును దర్శించినప్పుడు లింగముయందు శిలాబుద్ధి నివృత్తి అయ్యి, దైవబుద్ధి ఉత్పత్తి అవుతుంది. అదేవిధంగా జీవునియొక్క దేహబుద్ధి నివృత్తి అయ్యి ఆత్మబుద్ధి కలుగును. ఈ తత్త్వార్థనిర్ణయమును బోధించుట కొఱకే, శాస్త్రకారులు నియమములను ఉపదేశించారు-అని అనుకుని, సద్గురు సిద్ధనాథుడు అచట నుండి అరుణాచలమునకు వచ్చినాడు.

అరుణాచలేశ్వరుడు చిత్ప్రకాశుడు, ధ్యానప్రియుడు. అరుణాచలేశుడే నా ఆత్మస్వరూపుడు, స్వయంప్రకాశుడున్నాడని ఈవిధంగా నిశ్చయించుకొని, ధ్యానపూజచేయుట శ్రేష్ఠమని, నిధిధ్యాసన పూజయే ఉత్కృష్టమైనదని అని అనుకుంటాడు. పరమాత్మయొక్క స్మరణమాత్రముచేతనే మో-

క్షమ కలుగును. ఇది సకలశాస్త్రములయొక్క నిర్ణయమున్నదని అనుకొని, తనయొక్క నిజమైన ధ్యేయస్వరూపమునందు తత్పరుడై స్వామి ధ్యానమందు కూర్చున్నాడు. దీనినే స్మరణము అంటారు.

తదనంతరము అరుణాచలపర్వతము క్రిందికి వచ్చి, ఎక్కడ గంగానది నూరు పాయలై సముద్రము వైపు ప్రవహించునో, ఆ స్థానమును(గంగాసాగర్) దర్శించి పరమ శివునియొక్క జటాజూటమందున్నటువంటి భక్తిరసస్వరూపమైన గంగ, భగీరథునియొక్క ఘోరతపమువలన ముల్లోకములను తరింపచేయు నిమిత్తము దివినుండి భువికి దిగివచ్చింది.

ఈవిధంగా అనుకొని సిద్ధయతీంద్రులు కలకత్తా నగరమునకు వచ్చి అచ్చట మహాకాళీదేవి మందిరమును గాంచి, జగన్నాథపురి(పూరి)కి చేరుకున్నాడు.అచట నీలచక్రమును దర్శించి దైవ దర్శనము చేసుకొని, ఏడుకుండలను ఒకదానిపైన ఒకటి పెట్టి అన్నమును వండే దృశ్యమును చూసి, ఆ తర్వాత దేవునికి నైవేద్యం అర్పించిన పూజారి– వచ్చిన అతిథులకు, భక్తులకు ఆ నైవేద్యమును పంచుతుంటే, అక్కడే నిలబడి ఉన్న సిద్ధనాథునికి, పూజారి ప్రసాదమును ఇస్తాడు.ఈ స్థానమందు పరమాత్మ అన్నరూపముగా ఉన్నాడని అనుకున్నాడు.

అదే సమయానికి ఒక బ్రాహ్మణుడు వచ్చి రెండు భాండ్వలను కొని భోజనము తయారు చేస్తున్నాడు. ప్రసాదము తయారైన పిమ్మట సిద్ధనాథున్ని పిలిచి స్వామికికూడా యథేష్టముగా ప్రసాదమును సమర్పిస్తాడు. దానిని స్వామి అత్యాదరముతో సేవించి అక్కడనుండి ముందుకు వెళ్లి,సముద్రతీరమున కబీరుదాసు మందిరమునకు పోయి,ఎక్కడైతే అనేక సంతుమహాత్ములు ఉన్నారో,అక్కడికి వెళ్లి, ఆ సంతులు రామ నామము జపించడం గమనించి నామమహిమను వారికి చెప్పాలని వారిని పిలిచి, ఓ భక్తులారా వినండి అంటూ—

వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణమును రచించినాడు. దానిని ఈశ్వరుడు మూడు భాగములుచేసి ముల్లోకములకు (దేవతలు మానవులు రాక్షసులకు)పంచినాడు.అట్లు పంచగా రెండక్షరములు మిగిలినవి.ఆ మిగిలిన రెండక్షరములు "రామ" అను నామము.దానిని భావపూర్వకముగా ఎవరైతే ఉచ్చరిస్తారో వారికి భక్తి, ముక్తి మరియు సకల ఐశ్వర్యములు లభిస్తాయి. రామ రామ యని దినమునకు రెండుసార్లు స్మరించి దీర్ఘంగా ఉచ్చరించినట్లయితే నామశక్తియందు లాఘవము వస్తుంది. ఒకసారి 'రామ' అని భక్తిపూర్వకంగా ఉచ్చరించినట్లయితే వృత్తి తదాకారమై ఆత్మసాక్షాత్కారమును పొందుతుంది. వృత్తి ఏ మాత్రం కూడా చలించదు.మళ్లీ మళ్లీ అదే నామోచ్చారణ చేస్తూ పోయినట్లయితే మళ్లీ దేహభావముత్పన్నమగును. ఇలాంటి వచనములను అక్కడున్న సంతుమహాత్ములందరూ విని ఆనందభరితులై సిద్ధనాథ స్వామిని పూజిస్తారు.

సిద్ధనాథుడు అక్కడనుండి బయలుదేరి అడ్డుగా ఉన్న నదీప్రవాహమును గాంచి దానిని దాటడానికి నావికున్ని ఉద్దేశించి, నన్ను నదిని దాటించమని అడుగుతాడు.

అప్పుడా నావికుడు స్వామితో అంటాడు. నీవు భక్తిరూపనాణెములను ముందుగానే స్వీకరించి అజ్ఞజనులను భవనదినుండి నిశ్చయముగా తరింపజేస్తావు. లేనిచో వారిని భవనదినుండి (అజ్ఞానమునుండి)తరింపజేయవుగదా!అదేవిధముగా నాకుగూడా ఈనదిని దాటించుటకు ముందుగా నాణెములు యివ్వనిచో నీ ప్రార్థన వ్యర్థము.

అప్పుడు స్వామి అంటాడు—ఓచతురుడవైన నావికుడా! విను. ఏ భక్తులు అన్ని ఉపాధిరూప భారములను వదిలేసి నా వద్దకు వస్తారో, వారిని ఏ నాణెములను తీసుకోకుండా భవనదినుండి దాటిస్తాను. నీకు నేను వారినుండి తీసుకున్నట్లు కనిపించవచ్చు. కాని, నేను వారినుండి ఏమి కూడా అపేక్షింపక వారిని భవసాగరమునుండి తరింప చేస్తాను.అయితే నావద్ద ఒక కౌపీనముదప్ప మరేమి ఉపాధులు లేవు. దానిని కూడా త్యాగము చేస్తున్నాను. ఇక నన్ను ఈ ప్రవాహరూప నదినుండి దాటించు–అని సిద్ధనాథుడంటాడు.

అప్పుడు నావికుడు లజ్జితుడై,అయ్యా మహాత్మా! నీ నాణెములు నాకొద్దు. నీ కౌపీనము నాకొద్దు. అంటూ సంతోషముతో సిద్ధనాథున్ని నదినుండి దాటిస్తాడు. సిద్ధనాథున్ని దాటించిన తక్షణమే నావికునికి ఆరోజున నిన్నమొన్నటి కంటె నాలుగు రెట్లు ధనము లభించింది. ఇది నిశ్చయముగా ఆ మహాత్మునియొక్క కృపయే ఉన్నదని భావించి ఆ నావికుడు ఒక పెద్ద దోతి (కట్టుపంచ) తీసుకొని స్వామికి బహుమతిగా అర్పిస్తాడు. సిద్ధయతీంద్రుడు దానిలోనుండి ఎంత వస్త్రము కౌపీనమునకు సరిపడునో, అంత వస్త్రమును మాత్రమే స్వీకరించి మిగతా వస్త్రమును ఆ నావికునికి తిరిగి ఇస్తాడు. మహాత్ముడైన సిద్ధనాథునియొక్క విశేషమైన వైరాగ్యమును, త్యాగబుద్ధిని చూసి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

తర్వాత కటికదారిద్ర్యదేశమైన ఓండ్ర(ఒరిస్సా) దేశమును సిద్ధనాథుడు ప్రవేశించినాడు.ఆ దేశములో దారిద్ర్యముచే పీడింపబడి జనులు చిత్తచాంచల్యముతో బాధపడతారు. దానిచే బుద్ధి భ్రమించి ఎవరైనా కొత్తవారు వస్తే వారు దొంగలున్నారని వెంటబడి వారివద్ద ఉన్న వస్తువులు, ధనమును ఏవి ఉన్నాసరే-వాటిని లాగుకొని దోచుకుంటారు.

అందుకని, స్వామి ఆ గ్రామాల్లోకి వెళ్లకుండా అరణ్యమార్గమునుబట్టి ప్రయాణము సాగిస్తున్నాడు. ఆ అడవి మార్గంలో ఎవరైనా అన్నమును ఇచ్చినట్లయితే తినేవాడు. లేనిచో పస్తులుగా ఉండి పయనించేవాడు.ఇట్లు అన్నపానాదులు లేకుండా ఎన్నో రోజులు ప్రయాణము చేసినాడు. రాత్రులందు చల్లని గాలులు వీస్తున్నప్పుడు స్వామి వాటిని సహించుకుంటూ ప్రయాణము సాగిస్తుండగా—

మార్గమధ్యంలో ఒకానొక వైరాగి స్వామిని కలిసి స్వామితో ఈవిధంగా అంటాడు. ముందుగా వెళ్ళినట్లయితే ఛత్తీస్ గఢ్ ప్రాంతంలో కోతులబెడద బాగా ఉంటుంది. అందుకని నీయొక్క ప్రయాణము మళ్లించుకో అంటాడు.

అప్పుడు సిద్ధనాథుడు ఆ వైరాగితో ఇలా అంటాడు. అయ్యా! ఆ కోతులు బాధించేది ఈ శరీ-రమునే కదా. ఇది ఎన్నడైన ఒకనాడు నష్టమయ్యేదే కదా. దీని గురించి భయపడి లక్ష్యమును విడిచి మార్గమును మళ్ళించడము భావ్యము కాదు. నష్టప్రాయమైన తనువును ఎంత పదిలముగా పోషిం-చినాగాని, అది ఎల్లకాలము ఉండబోదు. దాని రక్షణకోసం ప్రయత్నించడం వ్యర్థము.ఈ అనిత్య-మైన శరీరమునందున్నటువంటి నిత్య స్వరూపమైన ఆత్మకైతే ఎన్నడును ఎటువంటి హాని లేదు. ఈ విధముగా యథార్థ స్వరూపమునందు దృఢనిశ్చయముగలిగియున్నట్లయితే సమస్త దుఃఖములు నివృత్తి కాగలవు.

అద్దము ఎదురుగా నిలబడితే కొందరికి భయము కలుగును. ఎందుకనగా, వెంట్రుకలు తెల్ల-బడినవి, పండ్లు రాలుచున్నవి, చర్మము ముడతలు పడుతున్నది, చూస్తుంటే మృత్యువు సమీపిస్తున్న-దని కలవరపడుతారు. అదేవిధంగా హృదయదర్పణమందు నాశవంతమైన శరీరమును చూస్తే భయమగును. ఆత్మ స్వరూపుడిగా చూస్తే నిర్భయము కలుగుతుంది. ఏ విధంగా భ్రమచేత త్రాడుపైన పామును చూస్తే భయమగునో, అదేవిధంగా భ్రాన్తిరూపదేహమును చూసిన్నట్లయితే భయము కలుగును. యథార్థమును తెలుసుకొని ప్రతిబింబరూప ఈ దేహము బింబరూపమైనటువంటి ఆత్మ-కన్న భిన్నముకాదని బింబస్వరూపమేనని తెలుసుకున్నట్లయితే నిర్భయస్థితి కలుగును.యథార్థమైన జ్ఞానము కలిగినచో వృత్తి అఖండ ఆత్మాకారమై (అంతర్ముఖమై) యమునిచేత కూడా భయము ఉండదు. ఇక ఈ మామూలు కోతులవలన భయము కలుగుతుందా?

సిద్ధనాథస్వామి అటనుండి ముందుకు నడుచుచుండగా నిజంగా కోతులు రానే వచ్చాయి. అవి చెట్లపైనుండి దుముకుతూ స్వామివద్దకు పరిగెత్తుకుంటూ లెక్కలేనన్ని కోతులు వచ్చాయి. సిద్ధ-నాథుని వద్ద ఏమి భక్ష్య(భోజ్య)పదార్థములు లేనందున ఆ కోతులు తిరిగి వెళ్ళిపోయాయి. సిద్ధ-నాథుడు ముందుకు ప్రయాణమై **సింహాచలము** చేరి నరసింహస్వామిని దర్శించినాడు.

స్వామి సరిగ్గా పూజాసమయమునకు దేవాలయములో చేరుకున్నాడు.అచట పూజారులు సుగంధసంప్రోక్ష్యమును చేస్తుండగా సిద్ధనాథస్వామి చూసి తనలోతాను ఈవిధంగా అనుకుంటాడు. సద్వాసనయుక్తమైన మనసుద్వారా భగవంతుడు ప్రత్యక్షముకాగలడు. అసద్వాసనయుక్తమైన మన-సునకు పరమాత్మ గోచరముకాడు.సుగంధసంప్రోక్ష్యము మొదలగు వివిధక్రియల(చిహ్నముల)ద్వారా పైవిధంగా స్మృతికి వచ్చింది. ఇట్లు చింతించుకుంటూ—

దేవాలయము బయటకు వచ్చి స్వామి గోముఖ తీర్థమనే స్థలములో ప్రశాంతంగా క్షణమా-త్రము కూర్చుని ఉండగా, సిద్ధనాథునికి బయటనుండి ఏదో ఒక కోలాహలము తన చెవిలో పడింది. ఎంతోమంది గుంపులు గుంపులుగా హడావిడిగా పరిగెత్తుకుంటూ పోవుచుండగా సిద్ధనాథస్వామి

ఒకాయనను పిలిచి, ఇంతమంది జనము ఎందుకు గుమిగూడినారు. ఏమి వింత జరిగింది? ఏమిటి విశేషము?అని అడుగగా, ఆయన ఈ విధంగా సమాధానమిస్తాడు.

ఒకానొక మార్వాడీ గృహస్థుడు బహుకాలమునుండి మహారోగముచేత (కుష్టువ్యాధిచే) పీడింపబడుచుండెను. ఆయన రోగమునకు తాళలేక దాని నివారణార్థము ఎన్నో ప్రయత్నములు (చికిత్సలు)చేసినాడు. అయినా ఆ రోగము నివృత్తికాలేదు. అందుకని ఆయన జీవితముపై విరక్తిగలిగి ఆత్మహత్యకు పూనుకుని, ఆ గుట్టపైకిఎక్కి అక్కడినుండి క్రిందకుదూకి మరణించాలని వెళ్తుండగా అక్కడున్నజనులు ఆయనను వారించి ఆపినారు.

అప్పుడు దయామయుడైన సిద్ధనాథుడు అంటాడు. ఒకసారి ఆ మార్వాడీని ఇక్కడికి తీసుకు-రండి. ఆయన భ్రాంతి రోగమును నివృత్తి చేస్తాను అంటాడు. వెంటనే ఆ మార్వాడిని కొందరు తీసు-కొనిరాగా ఆ మార్వాడితో స్వామి ఈ విధంగా అంటాడు.ఏమయ్యా! ఈ పవిత్రమైన పుణ్యస్థలమగు గోముఖతీర్థముయొక్క మహిమ నీకు తెలియదా?ఇందులో స్నానం చేసినంతమాత్రాన సకలదుఃఖ-ములు పోవును–అని ఆ మార్వాడి చేయిపట్టుకుని గోముఖ తీర్థమునకు తీసుకొనిపోయి, అచ్చట కూర్చుండబెట్టి స్వామి తాను చేతియందు కొంచెము జలమును తీసుకొని "**ఓం శ్రీ నారసింహాయ నమః**"అను మంత్రోచ్చారణచేస్తూ చేతియందున్న జలమును ఆ మార్వాడిపై సంప్రోక్షణము చేయగా, తక్షణమే అతనియొక్క రోగము నివృత్తమై శాంతిని పొందినాడు. ఆ మార్వాడికూడా అదే "**ఓం శ్రీ నారసింహాయ నమః**"అను మంత్రమును ఉచ్చారణ చేస్తూ సుఖమును పొందినాడు.రోగమంతయు పరిహారమయ్యింది.

ఆ మార్వాడి అంటాడు. సాధువేషంలో వచ్చిన ఓ నరసింహ స్వామీ! నేను ధన్యుడనైతిని. నీయొక్క కృప అపారము. నన్ను ఉద్ధరించుటకు ఈ మహాత్మునిరూపంలో వచ్చినావు–అని సిద్ధ-నాథుని చేయిపట్టుకుని తన ఇంటికితీసుకెళ్లి ఉన్నతమైన ఆసనమందు కూర్చుండబెట్టి అత్యాదరంతో ప్రేమపూర్వకంగా షోడశోపచార పూజలు గావించినాడు.

తదనంతరము ఆ మార్వాడి చేతులుజోడించి వినయముతో దీనవదనుడై, గద్గద కంఠంతో ఈ విధంగా అంటాడు. హే ప్రభో! నాయొక్క సర్వస్వము నీ చరణకమలములకు అర్పిస్తున్నాను. నా యొక్క గృహము, ధనము మరియు దేహము, మనసునుకూడా నీకే అర్పిస్తున్నాను–స్వీకరించి అను గ్రహించండి స్వామీ.ఈ ప్రపంచము, ఈ శరీరము నీచే ఒసంగబడినది. నీది నీకే అర్పిస్తున్నాను. నీయొక్క అఖండ నామమును చింతనచేయులాగున నన్ను ఆశీర్వదించుము స్వామీ. లేనిచో ఇప్పుడే నివృత్తి అయిన పాడు రోగము (కుష్టువ్యాధి) మళ్లీ నన్ను ఆవరించగలదు.

ఈ మాటలు విన్న సిద్ధనాథుడు అంటాడు. నీవు అర్పించిన ఈ భోగభాగ్యాలు నాకొద్దు. కాని, నేను చెప్పినట్లుచేయుము. నీవు నిర్భయముగా ఉండుము. నీయొక్క ఆస్తిని, ద్రవ్యమును రెండు

భాగములు చేయుము. ఒక భాగమును దరిద్రులకు, అభాగ్యులకు దానముచేసి, రెండవ భాగమును నీ యొక్క దారాపుత్రాదులకు ఇవ్వుము. ఇక మిగిలిన శరీర మనస్సులను నాకు అర్పించి ఎల్లప్పుడు సచ్చింతన చేస్తూ ఉండుము. సిద్ధయతీంద్రుని వచనములను ఆ మార్వాడి శిరసావహించి స్వామి చెప్పినట్లుగా మెదలుతాడు. తర్వాత సిద్ధనాథస్వామి అక్కడనుండి బయలుదేరి విజయనగర దుర్గమును సందర్శించినాడు-అచట,

ప్రతాపసింహుని పరుపును(గాదిని)చూసి,సముద్రతీరమున ఉన్న ఉద్యానవనమునందు ప్ర-శాంతంగా కూర్చొని ఉండగా, అంతలో అక్కడున్న సన్యాసులు స్వామివద్దకు వంటసామాగ్రులను తీసుకొని వచ్చి బోజనము తయారుచేసి అవధూత స్వామిని వారితోపాటు భోజనము చేయమని పిలుస్తారు. సద్గురునాథుడు వారితోపాటు భోజనమునకు కూర్చున్నాడు. భోజనము చేసుకుంటూ ఆ సన్యాసులు స్వామిని సవినయముగా ఇట్లు అడుగుతారు. ప్రాణమార్గముగుండా ఉదరంలోనికి ప్రవే-శించిన అన్నము శరీరములో ధాతురూపంలో ఎలా పరిణమిస్తుందో చెప్పండి స్వామీ?

అప్పుడు వారినిగూర్చి స్వామి ఇలా చెప్పినాడు. అన్నము ద్వారా సప్తధాతువులు ఉత్పన్నమ-వుతాయి–అని శ్రుతిప్రమాణము. **“అన్నమశితం త్రేధా విధీయతే। తస్య యః స్థవిష్ఠో ధాతుః తత్పురీషం భవతి,యో మధ్యమస్తన్మాంసం,యోఽణిష్ఠస్తన్మనః।”**(ఛాం.6-5-1) **"అన్నమయం హి సౌమ్య మనః"** (ఛాం.6-5-4) అన్నముయొక్క సూక్ష్మపరిణామమే మనస్సు.ఈ ప్రమాణాన్ని అను-సరించి–ఉదరంలోనికి ప్రవేశించిన అన్నము మూడుప్రకారములుగా విభజింపబడుతుంది. 1.అన్న-ముయొక్క స్థూలభాగము అధోముఖమై మలరూపముగా బయటకు వెళ్లిపోవును.దానిని స్థవిష్ఠము అంటారు. 2.అన్నముయొక్క మధ్యమపరిణామము మాంసముగా మారును. 3.అణిష్ఠమను సూక్ష్మ-భాగము మనస్సుగా పరిణతిజెందును.

త్రాగబడిన జలము మూడువిధములుగా విభజింపబడి స్థూలము మూత్రముగా,మధ్యమము రక్తముగా,సూక్ష్మము ప్రాణముగా మారును. అట్లే, తినబడిన ఘృతాదితేజము ఎముకలు,మజ్జ, వాణిరూపములో పరిణామమును పొందును.ఇట్లు,అన్నమయము మనస్సు, జలమయము ప్రాణము మరియు తేజోమయము వాక్కు–అని తెలియవలెను. ఈవిధముగా ఆహారము శాంతిని ప్రసాదించి సాధకులు ఆత్మోన్ముఖులై ఉద్ధరింపబడుటకు ఉపయోగపడుతుంది.ఈ రహస్యమునెఱిగి ముముక్షు-వులు అన్నమును సేవించినట్లయితే అన్నముద్వారా ఉద్ధరింపబడతారు.ఇది తెలియక అన్నమును ఎవరు భుజిస్తారో, వారు స్వయంగా భ్రష్టులవుతారు. పాత్రతనెఱుగక దానము చేయుటవలన అన్నదాతకూడా భ్రష్టుడవుతాడు. ఇరువురు భ్రష్టులవుతారు.

**శ్లో ॥అన్నదస్య మనుష్యస్య బలమోజో యశాంసి చ।**

**కీర్తిశ్చ వర్ధతే శశ్వత్ త్రిషులోకేషు పార్థివ ॥**(మహాభా.అనుశా.ప.౯౮-దానధర్మపర్వము)

హే రాజన్! పాత్రతనెఱిగి దానముచేసిన అన్నదాతకు బలము,ఓజస్సు,యశస్సు మరియు కీర్తి ఎల్లపుడు ముల్లోకములలో వర్ధిల్లుచుండును.

ఇట్టి సంభాషణమును విని ఆ బైరాగులందరూ చకితులైనారు. నామస్మరణ చేసుకుంటూ భోజనము తృప్తిగా భుజించి, తదనంతరము ఆత్మచర్చ చేస్తూ అందరూ ఒకచోట కూర్చుంటారు.

పిమ్మట, సిద్ధారూఢస్వామి అక్కడనుండి బయలుదేరి భద్రాచలమునకువెళ్లి, అక్కడ రామదాస స్వామి నిర్మించిన శ్రీరామ మందిరములను దర్శిస్తాడు. తర్వాత తనలోతాను–పరమాత్మ అనుగ్రహముచేత సత్పురుషులు ఈ ప్రకారముగా మహిమలు చూపుతారు–అని విచారించుకుంటూ గోదావరి తీరమునకు వచ్చి, భక్త రామదాసస్వామి నిర్మించినటువంటి ఒక వరండాపై స్వామి కూర్చుండగా, అక్కడకు ఐదుగురు బ్రాహ్మణులు వచ్చి సిద్ధనాథుని ఈ విధంగా విచారిస్తారు.

మీయొక్క దేశమేది?మీయొక్క కుల గోత్ర వర్ణ జాతి స్థితిగతులగూర్చి నిశ్శేషముగా చెప్పండి స్వామీ–అని అడుగగా, స్వామి వారితో ఇట్లు చెప్పసాగాడు.ఓ బ్రాహ్మణులారా!వినండి. నాది అపరిచ్ఛిన్నమైన, పరిపూర్ణమైన దేశము. సకలమునకు అధిష్ఠానము నాయొక్క స్థితి. నిర్గతి నాయొక్క గతి–అని సిద్ధనాథుడు చెప్పగా ఆ బ్రాహ్మణులు స్వామిని-ఆదెట్లు స్వామీ?అని ప్రశ్నించగా వారికి స్వామి సమాధానమిస్తూ–మీరు ఏకాగ్రచిత్తులై వినండి—దేశ,కాల,వస్తు పరిచ్ఛేదరహితమైన ఆత్మకు ఏ దేశమని చెప్పాలి? సర్వజగత్తుకు అధిష్టానమైన బ్రహ్మముయొక్క స్థితియేమని చెప్పాలి? ఈ నామ రూప ప్రపంచమునకు ఏది అధిష్టానమో అదే నాయొక్క స్థితి.మరియు సకల గమనాగమన క్రియలు యెట్లు ఆకాశమునందు లేవో,అదేవిధముగా పరిపూర్ణమైన బ్రహ్మమునకు గమనాగమన క్రియలు గాని, ఎటువంటి స్థితిగతులుగాని లేవు. అదే నాయొక్కస్థితి, గతి–నిర్గతి–అని జ్ఞానఘనుడైన స్వామి చెబుతాడు.

ఆ బ్రాహ్మణులు పరిశుద్ధమైన స్వభావముగలవారు గావున, అతిత్వరగా స్వామి చెప్పిన వాక్యములద్వారా వారి హృదయము శాంతించినది. అప్పుడు సిద్ధనాథుడు వారితో అంటాడు. మీయొక్క చిత్తము నిర్మలమైనది. శుద్ధబుద్ధిగలవారుగాన మీరు ఈ సిద్ధాంతమును గ్రహించగలిగారు.

తరువాత సిద్ధనాథుడు అక్కడనుండి ప్రయాణము ముందుకు సాగించి కర్ణాటక ప్రాంతంలో ప్రవేశించి, అనేక తీర్థములను చూస్తూ చూస్తూ బెజవాడకు13 (విజయవాడకు) చేరుకున్నాడు.స్వామి కృష్ణానదీ తీరమునందు ప్రశాంతముగా కూర్చొని ఉన్న సమయంలో అవధూత సిద్ధనాథునియొక్క అవస్థను ఒక భక్తురాలు గమనించి నమ్రభావముచేత చేతులు జోడించుకొని స్వామికి నమస్కరిస్తూ ఓస్వామీ! మిమ్మల్ని చూస్తుంటే మీరు మహాగొప్ప బ్రహ్మనిష్ఠ మహాత్మునివలె స్పష్టంగా తెలియబడు-

13 శ్రీ సిద్ధారూఢస్వామి జీవితకాలమునాటికి విజయవాడ కర్ణహాటక దేశములో ఉండెడిదని దెలియవలెను.

చున్నది. మీయొక్కముఖకమలమునందు బ్రహ్మతేజస్సు గోచరిస్తుంది. సౌమ్యమైన, శాంతస్వరూపమైన మీయొక్క అవస్థను చూస్తుంటే నిశ్చయముగా మీరు బ్రహ్మనిష్ఠలక్షణయుక్తమైన సత్పురుషులుగా కన్పట్టుచున్నారు.ఈ దీనురాలినైన నన్ను ఉద్ధరించండి స్వామీ! అని వేడుకుంది.

అప్పుడు సద్గురుదేవుడు ఇట్లనుచున్నాడు.ఓ అబలా! నీవు స్త్రీవి ఉన్నావు. మలవిక్షేప ఆవరణ దోషయుక్తమైన అశుద్ధయుక్తయై ఉన్నావు. నీవు బ్రహ్మోపదేశమునకు అనర్హురాలివి.అందుకని నీవు నామజపము చేయుము.ఈశ్వరునియొక్క దివ్యమైన నామాన్ని ఎల్లప్పుడు స్మరిస్తూ ఈశ్వరునియొక్క మూర్తిని హృదయమందు ధ్యానము(ప్రతీక ధ్యానము)చేస్తున్నట్లయితే క్రమంగా చిత్తము శుద్ధమై మల,విక్షేప,ఆవరణ దోషములు నివృత్తమై, ముస్ముందు జ్ఞానమునకు సాధనము కాగలదు. తద్వారా స్వరూప జ్ఞానము ప్రాప్తము కాగలదు.ఈ నామజప సాధన తప్ప నీకు అన్య ఉపాయము లేదు తల్లీ. ఎందరో ఈపవిత్రమైన ఈశ్వరనామోచ్చారణద్వారా తరించినట్లు చరిత్రలు చాటుచున్నవి. అనేక భక్తులు నామస్మరణ మాత్రముననే ధన్యులైనారు. అందుకనే నీవు నామ స్మరణకు అధికారివి ఉన్నావు.

ఇట్టి వచనములను సిద్ధనాథుని ముఖారవిందమునుండి విన్న ఆ భక్తురాలు ఎంతో ఆనంద పడి ఓ స్వామీ! మీయొక్క యధార్థమైన కృపచే నేను ధన్యురాలనైతిని-అని దీనవదనంతో తనయొక్క కృతజ్ఞతాభావమును వెలిబుచ్చుతూ, మీయొక్క ఆజ్ఞను శిరసావహించెదనని పలికెను. తర్వాత ఆ స్త్రీ (భక్తురాలు) సద్గురుదేవునియొక్క ఆజ్ఞను గైకొని స్వస్థానమునకు వెళ్ళిపోయెను. ఈ విజయవాడ (బెజవాడ)లో స్వామి మూడు సంవత్సరములు నివసించెను.

కృష్ణా నదీతీరమునకు మేకలు మేతమేయుటకు వస్తే వాటియొక్క పాలు పిండుకొని త్రాగి, అన్నము లేకుండానే జీవించినాడు. కొన్ని సమయాలలో మేకలు రాకపోతే అక్కడి మృదువైన మట్టిని తిని స్వామి కాలము గడిపినాడు.చలికి,వేడిమికి ఓర్చుకుని శాంతితో దుఃఖములను సహించినాడు. ద్వంద్వధర్మములను, అనేక శరీరసంబంధ యాతనలను ఓర్చుకొనినాడు. స్వామి తరచుగా మంగళగిరికి వెళుతూ స్వామియొక్క ప్రసాదమును స్వీకరించేవాడు.

ఒకనాడు సిద్ధనాథుడు మంగళగిరి ఆలయంలోని విగ్రహమునకు కిరీటమును ధరింపజేసి ఆ విగ్రహమునకు ఆశీర్వాదమిస్తాడు.ఈ చేష్టలనుచూసి పూజారి నివ్వెరపోయి, ఇది చాలా విచిత్రంగా ఉంది-అన్నాడు.

అప్పుడు సిద్ధనాథుడంటాడు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. సగుణరూప ఈ విగ్రహము నిర్గుణ పరబ్రహ్మముయందు ఒకానొక అంశము. సకల దేవతలుకూడా నిర్గుణపరబ్రహ్మముయొక్క ఏకాంశమైయున్నారు.

**శ్లో ॥అవతారాహ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధేర్ద్విజాః ।**

**ఏతే చాంశకళాః పుంసః "కృష్ణస్తు భగవాన్ స్వయమ్"** ॥(శ్రీమద్భాగవతము 1-3-26 & 28)

అగాధమగు సరోవరమునుండి ఎట్లు వేలకొలది స్రోతస్సులు వెలువడునో,అట్లే సత్త్వనిధి-యగు శ్రీహరియొక్క అసంఖ్య అవతారములు వెలువడును. ఈ అవతారములన్నియు భగవంతుని యొక్క అంశావతారములు, కళావతారములు కాని, శ్రీకృష్ణుడు స్వయముగా (సచ్చిదానంద నిర్గుణ నిరాకార పరబ్రహ్మము) భగవంతుడైన అవతారియగును.

ఈ సగుణబ్రహ్మముయొక్క మూలాధిష్ఠానమగు ఏ నిర్గుణపరబ్రహ్మమున్నదో, దానిని జ్ఞాని-మహాత్ములు తెలుసుకున్నారు.వారికి శరీరాభిమానము నిరసించింది. వారు పరిపూర్ణమైన పరబ్ర-హ్మమును తెలుసుకొని సచ్చిదానంద స్వరూపులై ఉండిపోయినారు.అందుకనే సకలదేవతలు జ్ఞాని మహాత్ములయొక్క ఆశీర్వచనములను ఆపేక్షిస్తారు. ఎందుకంటే, వారిద్వారానే దేవాలయములు స్థాపించబడుతాయి. మరియు జీర్ణోద్ధరణమవుతాయి. సకలవేదశాస్త్రములయొక్క, సకలదేవతల యొక్కయు అస్తిత్వము సత్పురుషుల అధీనమైయున్నది.జ్ఞానిమహాత్ములయొక్క చరణధూళిని భాగీ-రథి (గంగానది) సహితము కోరుకుంటుంది. సిద్ధనాథుడు ఈ విధంగా పలుకగానే ఆ దేవాలయ పూజారికి వివేకము జాగృతమైనది.

ఇటువంటి సద్గురునాథునియొక్క చరిత్ర అద్భుతము. సకలజీవులను ఉద్ధరించేనిమిత్తము సిద్ధనాథుడు తీర్థయాత్రా నిమిత్తమై సంచరిస్తున్నాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రమున సకల పాపములు భస్మీభూతము కాగలవు. శ్రీ సద్గురు చరణారవిందములకు శివదాసస్వామి ఈ తొమ్మిదవ అధ్యా-యమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదవ అధ్యాయము

**పద్యానువాదము:**—అనేక నామరూపములచే ప్రకటమైన,అనేక కర్తలతో భోక్తలతో కూడి యున్న, ప్రతినియత దేశకాలనిమిత్త క్రియాఫలములకు ఆశ్రయమగు ఈ జగత్తు సమ్యక్ దృష్టిగల మహాత్ములకు ఒకటిగానే గోచరిస్తుంది. ఆ ఏకమైనది నిర్వికారమై, నిత్యమై, సత్యమై ఎల్లప్పుడు ఉంటుంది. అట్టి పరిపూర్ణమైన, సుఖరూపమైన, సచ్చిదానంద స్వరూపమైన సమస్తజగత్తునకు అధి-ష్ఠానమగు ఓ సద్గురుదేవా! నీయొక్క చరణకమలములనాశ్రయించిన భక్తులు నీయొక్క కృపాకటా-క్షము వలన సుఖప్రదముగా ఉందురు గాక! అని ఆశీర్వదించుము స్వామీ.

ఓ భక్తవత్సలరూప సిద్ధనాథా! సకల ప్రాణులయందు దయగలవాడవై భక్తునిగాని, అభక్తుని గాని నీవు దయచేత తరింపజేస్తావు. జ్ఞానరూపమగు బోధచేత, సాగరరూపమైన సంసారమనే నదినుండి ఆవలితీరమునకు చేర్చెదవు. అందుకనే సకలజగత్తుకు ఆదిగురువుగా సిద్ధనాథునిరూపము గా ప్రకటమైనావు.

అటువంటి సద్గురువుయొక్క చరిత్ర శ్రవణము చేసినందున సకలదోషములు సమూలముగా నశిస్తాయి. అనన్యభావముచేత స్వామియొక్క నామమును భజించినట్లయితే సంసారమనే వార్త సమూలముగా నివృత్తమగును.

గత తొమ్మిదవ అధ్యాయమునందు సద్గురు సిద్ధనాథస్వామి "మంగళగిరి"కి వెళ్ళి అపూర్వ-మైన లీలను ప్రదర్శించాడు. ఇంకా అటువంటి లీలలను ఏకాగ్రచిత్తులై భక్తిపూర్వకంగా వినగలరు.

తదుపరి "మంగళగిరి" నుండి కిందకు దిగివచ్చే మార్గంలో ఒక గుహయందు సోమేశ్వరు-డనే పేరుగల బ్రాహ్మణుని స్వామి చూసినాడు.ఆ బ్రాహ్మణుడు కోళ్లు మొదలగు మూగపశువులను క్షుద్రదేవతలకు బలిఇచ్చి క్షుద్రసిద్ధులను అనేకము పొంది వింతలుచూపిస్తూ, ప్రజలను మోసగించే వాడు. అతడు వశీకరణాది క్షుద్ర విద్యలను చదువుకున్నాడు.ఇది చూసిన సిద్ధనాథునికి వానిపై జాలి గలిగి వానితో ఈ విధంగా అంటాడు. నీవు ఈ నికృష్టమైన వ్యాపారమును,నీచకర్మలను ఎందుకు చేస్తున్నావు అని మందలిస్తూ—నీవు బ్రాహ్మణకులమున జన్మించి అయోగ్యమైన, వ్యర్థమైన శాస్త్రాన్ని నేర్చుకుని స్వధర్మమును విస్మరించి పూర్తిగా నిన్ను నీవు వంచన చేసుకుంటున్నావు.కల్పవృక్షము

ముంగిటనుండగా దానిని పెరికి (ఉపేక్షించి) ముండ్లచెట్లను పెంచుకుంటున్నావు. నీవు కేవలము లోకనిందకు పాత్రుడవగుచున్నావు. కావున ఇది సర్వథా నిషేధ్యము–త్యాజ్యము. ఇటువంటి శాస్త్ర-ములు పఠించడమువలన పూర్వపుణ్యానుగుణముగా అల్పసిద్ధులు ప్రాప్తముకావచ్చును. అలా సిద్ధిం-చిన అల్పసిద్ధులద్వారా పుణ్యమునకు హేతువైన లోకహితమైన కర్మలు చేయాలిగాని, ఆ సిద్ధులను దుర్వినియోగపరచుకుంటూ జనమునకు హానిచేసి పాపమునకు హేతువైన కర్మలు చేయకూడదు. పుణ్యకర్మలు ఆచరించడమువలన గొప్పగొప్ప సిద్ధులు ప్రాప్తము కాగలవు. అది తెలుసుకోకుండా ఇటువంటి నీచకర్మలు చేయడము పాప హేతువు.

ఎవరు శ్రౌత(స్వర్గం, బ్రహ్మలోకాలను పొందాలని చేయు కామ్యకర్మలు) కర్మలు మరియు పితరులకు శాంతిని చేకూర్చే స్మార్తకర్మలు చేస్తారో, వారు ఉత్తమలోకాలకు వెళ్లి పుణ్యమున్నంతవ-రకు అచ్చట భోగములననుభవించి పుణ్యము క్షీణించిన పిమ్మట మళ్లీ మర్త్యలోకమునకే తిరిగివస్తా-రు. అట్టి వారికి కూడా పునర్జన్మ తప్పలేదు. ఇక నీచకర్మలుజేయు నీకు సద్గతి యెలా లభించును?

**తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవమేవాముత్ర పుణ్యచితోలోకః క్షీయతే ।** (ఛాం.8-1-6)

**తే తం భుంక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి ।** (గీత.౯-౨1)

**పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్ ॥**

పుణ్యకర్మలచేగూడ జన్మమరణదుఃఖము నివృత్తి అగుటలేదు. అట్లుండగా,ఈ దేహసంబంధ- మైన క్షుద్రకర్మలుచేస్తే దుఃఖయుక్తమైనటువంటి అవస్థ ప్రాప్తముకాక సుఖము ప్రాప్తమవుతుందా? క్షుద్రకర్మలు చేసినవారు నరకమునకు భాగస్థులౌవుతారు. ఇది నిశ్చయము. బ్రాహ్మణుడవయ్యి నీవు ఈ దుఃఖయుక్తమైన నీచకర్మలు చేయుటవలన నీవు తప్పకుండా నరకమునకు అర్హుడవు కాగలవు. అని సిద్ధనాథుడు హెచ్చరించాడు. ఆ సోమేశ్వరుడనే బ్రాహ్మణునికి వివేకము జాగృతిగలిగి, చేసిన పొరపాటుకు పశ్చాత్తాపపడి ఈ విధంగా సిద్ధనాథునితో అంటాడు.

ఓమహాత్మా!నేను మందబుద్ధిగలవాన్ని-మూఢమతిని.అవిచారమువలన సచ్ఛాస్త్రములయొ-క్క యథార్థ అనుభవమును తెలుసుకోలేక ఈ దుష్టకర్మములు చేసినాను. నాకు యే గురువు ఈ శాస్త్రాలను నేర్పించినాడో, ఆయన నాకు ఇటువంటి దుస్థితి ప్రాప్తమవుతుందని చెప్పలేదు.

అప్పుడు సిద్ధనాథుడు సోమేశ్వరునితో అంటాడు. నీవు సద్గురువును పరీక్షించడంలో తొందర పడ్డావు. ఏదిపొందితే ధన్యుడనవుతాను-అని విచారించక,నీవు తప్పుదారిన పోయినావు. సద్గురు-వును పరిశీలించకుండా శాస్త్రాభ్యాసము చేయుట పొరపాటు. నీకు ఇటువంటి దోషము వచ్చిం-దంటే ఆ తప్పు గురువునది కాదు-నీది. ఇటువంటి వచనములను విని అతడు సద్గురునాథుని పశ్చాత్తాపహృదయముతో—ఈ దోషపరిహారమునకు ఎలాంటి ప్రాయశ్చిత్తము చేయాలి–అని

అడుగగా, స్వామి "గాయత్రి" మంత్రజపం చేస్తే నీయొక్క దోషము పరిహారము కాగలదు- అని అంటాడు.

**"ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్"**

అను ఈగాయత్రీ మంత్రమును ఒకరోజుకు ఇరవై నాలుగువేల సార్లు జపము చేసినట్ల-యితే నిశ్చయముగా పాపదోషము నివృత్తమై చిత్తశుద్ధిగలిగి తొందరగా భవసాగరమునుండి తరించి స్వరూపానందమును పొందగలవు.

ఈ ప్రకారమైన సిద్ధనాథుని వచనములను విని ఆ బ్రాహ్మణుడు తన మంత్ర గ్రంథములను అన్నింటినీ త్యాగంచేసి స్వామికి వందనము సమర్పించుకొని స్వగృహమునకు వెళ్ళిపోయినాడు.

అక్కడనుండి సద్గురునాథుడు బయలుదేరి మార్గమధ్యమున అనేక గ్రామములు, నగరములు, పట్టణములు దర్శిస్తూ, కష్టములను సహిస్తూ "**ఆదవని**" అనే ఊరికి చేరుకున్నాడు.అచ్చట ఒక గట్టు-పైన "బాలేకోల్"అనే స్థానమువద్ద అనేక సాధువులతో కూడిఉన్న ఒక సంతు మండలిని చూసినాడు. ఆ స్థానంలో స్వామి మూడునెలలు నివసించినాడు. ప్రతిరోజు జిజ్ఞాసువుల శంకలు తీరుస్తూ బ్రహ్మవిద్యోపదేశము చేస్తూ అక్కడ నివాసము చేసినాడు.

అందులో ఒకానొక శిష్యుడు స్వామిని ఈ ప్రకారముగా ప్రశ్నిస్తాడు.“**నేను**”అనే ఈ దేహము ప్రత్యక్షజ్ఞానమునకు విషయమున్నది. దేహము తప్ప ఆత్మ అనేది ఏమున్నది? దేహమే ఆత్మ ఉన్నది.

ఈ ప్రశ్నను విని సిద్ధనాథుడు వానినిగూర్చి ఈప్రకారంగా సమాధానము చెపుతాడు. "**ఇదం శరీరం సప్తధాతుకమ్. కస్మాత్?అన్నాద్రసః,షడ్విధోరసో, రసాచ్ఛోణితం,శోణితాన్మాంసః,మాంసా-న్మేధో,మేధసఃస్నాయుః,స్నాయుభ్యోఽస్థీని, అస్థిభ్యో మజ్జా,మజ్జాతఃశుక్లమితి సప్తధాతుః**"(గర్భోపనిషత్ 2) అను శ్రుత్యనుసారము, సర్వార్థసాధకమగు ఈదేహము ధాతుమయమున్నది.ఆ ధాతువులు అన్న-ముయొక్క పరిణామము గనుక దీనిని అన్నమయమనిగూడ అందురు.

**శ్లో ||పంచాత్మకం పంచసు వర్తమానం**
**షడాశ్రయం షడ్గుణయోగయుక్తమ్ |**
**తం సప్తధాతుం త్రిమలం ద్వియోనిం**
**చతుర్విధాహారమయం శరీరమ్ ||** (గర్భోపనిషత్)

తాత్పర్యము:–పంచమహాభూతములు (ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి) వీటియొ-క్క పంచీకరణముద్వారా ఉత్పన్నమై వర్తించు శరీరము షడాశ్రయము=షడ్వికారములకు నిలయమై (జాయతే,అస్తి,వర్ధతే,పరిణమతే,అపక్షీయతే,వినశ్యతి), లేక–మధుర,ఆమ్ల,లవణ,కటు,కషాయ,తిక్త-ములను షడ్రసములకు నిలయమైనది. షడ్గుణము(కామ,క్రోధ,లోభ,మోహ,మద,మాత్సర్యము)లకు ఆశ్రయమైయున్నది.సప్తధాతువు(రక్తము,మాంసము,మేధస్సు,స్నాయువులు,ఎముకలు,మజ్జ,శుక్లము)

లతో యుక్తమైనది. త్రిమలము(మాయికమలము, కార్మకమలము,ఆణవమలము)లతో కూడి ఉన్నది. త్రిమలములు అనగా మల, విక్షేప, ఆవరణ దోషములు-వీటిని కూడా గ్రహించవచ్చును. ద్వియోని=యోని అనగా కారణము, ఈ శరీరము ప్రకటమగుటకు తల్లిదండ్రులే కారణము.మరియు నాలుగువిధముల ఆహారములు (భక్ష్య,భోజ్య,చోష్య,లేహ్యములు) భుజించునది ఉంది. ఈ విధము-గా ఉన్న అన్నమయ శరీరమందు ఒక్కొక్క తత్త్వమును చూస్తున్న చేతనరూప బ్రహ్మము అశరీరమై నిరంతరం సంఘాతమునకు భిన్నంగా ఉండి అన్నిటిని తెలుసుకుంటున్నది. దాని సత్తచేతనే శరీరము కదులుతున్నది. ఈ సంఘాతముచే ఉపలక్షితమగు చైతన్యమే బ్రహ్మచైతన్యము. అదే ఆత్మ అని ఇట్లు లక్షించవలయును.

ఈ విధముగా స్థూల సూక్ష్మ సంఘాతమునకు భిన్నంగా ఆత్మ ఉన్నది–అను విచారణ ఎలా చేయాలంటే—పృథ్వి జలము అగ్ని వాయువు ఆకాశము, ఇవి పంచభూతములు. వీటియొక్క పంచీ-కరణముద్వారా ఈ స్థూల శరీరము ఉత్పన్నమైనది దానికి భిన్నంగా ఉండి చూసేవాడు ప్రత్యగభిన్న-పరమాత్మ.

ఇక, పంచీకరణమంటే ఏమిటో స్వామి వివరిస్తున్నాడు. ఒక్కొక్క భూతము రెండు భాగ-ములుగా విభజింపబడినది. అందులో ఒక్కొక్క భాగము తమ తమ భూతములకు ఉంచి, మిగిలిన ఒక్కొక్క భాగమును పునః నాలుగు నాలుగు భాగాలుగా చేసి, వాటిని స్వస్వభూతములను విడిచి, ఇతరభూతములలో ఒక్కొక్క భాగము కలుపగా,ముఖ్యభూతముయొక్క సగభాగమైన ఒక అంశము మరియు ఇతర భూతములయొక్క ఒక్కొక్క అంశము అన్ని కలిసి 5 భాగములు అయినవి. ఈ విధంగా పంచభూతములు ఐదైదు భాగములుగా విభజింపబడి పరస్పరం మొత్తం కలిసి 25 భాగములు అయ్యి పంచీకరణము చేయబడినవి. ఈ విషయము విచార చంద్రోదయమునందు విస్తారంగా తెలుపబడినది. జిజ్ఞాసగలవారు అక్కడ చూడగలరు.

**శ్లో ॥ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః।**
**స్వస్వేతర ద్వితీయాంశైః యోజనాత్పఞ్చ పఞ్చ తే ॥**(వే.పం.1-27)(పైఙ్గలోపనిషత్ ఆధారముగా)

**స్థూలశరీరములోని ఇరువది ఐదు తత్త్వములు**

**పంచీకరణము**

| | **ఆకాశము** | **వాయువు** | **తేజము(అగ్ని)** | **జలము** | **పృథ్వి** |
|---|---|---|---|---|---|
| **ఆకాశము** | శోకము ½ | కామము ⅛ | క్రోధము ⅛ | మోహము ⅛ | భయము ⅛ |
| **వాయువు** | ప్రసారణము ⅛ | ధావనము ½ | వలనము ⅛ | చలనము ⅛ | ఆకుంచనము ⅛ |
| **తేజము(అగ్ని)** | నిద్ర ⅛ | తృషా(దప్పిక) ⅛ | క్షుధ ½ | కాంతి ⅛ | ఆలస్యము ⅛ |
| **జలము** | లాలాజలము ⅛ | స్వేదము ⅛ | మూత్రము ⅛ | శుక్రము ½ | శోణితము ⅛ |
| **పృథ్వి** | రోమములు ⅛ | చర్మము(త్వచ) ⅛ | నాడులు ⅛ | మాంసము ⅛ | అస్థులు ½ |

## సూక్ష్మ శరీరములోని పదిహేడు తత్త్వములు



| | | | | | |
|---|---|---|---|---|---|
| **అంతఃకరణము** | మనస్సు (చిత్తము కలిసి) | బుద్ధి(అహంకారము కలిసి) | | | |
| **పంచజ్ఞానేంద్రియములు** | శ్రోత్రేంద్రియము (చెవి) | త్వగింద్రియము (చర్మము) | నేత్రేంద్రియము (కన్ను) | జిహ్వేంద్రియము (నాలుక) | ఘ్రాణేంద్రియము (ముక్కు) |
| **పంచకర్మేంద్రియములు** | వాగింద్రియము (నోరు) | పాణీంద్రియము (చేతులు) | పాదేంద్రియము (కాళ్ళు) | గుహ్యేంద్రియము (మూత్రస్థానము) | గుదేంద్రియము (మలస్థానము) |
| **పంచప్రాణములు** | ప్రాణవాయువు హృదయస్థానము | అపానవాయువు గుదస్థానము | ఉదానవాయు కంఠస్థానము | సమానవాయువు నాభిస్థానము | వ్యానవాయువు సంధిస్థానము |

| | | | |
|---|---|---|---|
| **శరీరము** | స్థూల శరీరము | సూక్ష్మ శరీరము | కారణ శరీరము |
| **అవస్థ** | జాగ్రదవస్థ | స్వప్నావస్థ | సుషుప్త్యవస్థ |
| **అభిమాని జీవుడు** | విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు |
| **గుణము** | రజోగుణము | సత్త్వగుణము | తమోగుణము |
| **స్థానము** | నేత్రస్థానము | కంఠస్థానము | హృదయస్థానము |
| **వాచా** | వైఖరీ వాచా | మధ్యమ వాచా | పశ్యంతి వాచా |
| **భోగము** | స్థూల భోగము | సూక్ష్మ భోగము | ఆనంద భోగము |
| **శక్తి** | క్రియా శక్తి | జ్ఞాన శక్తి | ద్రవ్య శక్తి |

జాగ్రదవస్థలో పదునాలుగు త్రిపుటులచే జీవుడు వ్యవహారము చేయును.

### పదునాలుగు త్రిపుటులు

జ్ఞానేంద్రియముల త్రిపుటి

| ఇంద్రియము–అధ్యాత్మము | దేవత–అధిదైవము | విషయము–అధిభూతము |
|---|---|---|
| శ్రోత్రేంద్రియము | దిశలు | శబ్దము |
| త్వగింద్రియము | వాయువు | స్పర్శము |
| చక్షురింద్రియము | సూర్యుడు | రూపము |
| రసనేంద్రియము | వరుణుడు | రసము |
| ఘ్రాణేంద్రియము | అశ్వినీకుమారులు | గంధము |

కర్మేంద్రియముల త్రిపుటి

| | | |
|---|---|---|
| వాగింద్రియము | అగ్ని దేవత | వచన (క్రియ) |
| పాణీంద్రియము | ఇంద్రుడు | ఇచ్చుట, తీసికొనుట |
| పాదేంద్రియము | వామనుడు | పోవుట, వచ్చుట |

| | | |
|---|---|---|
| గుహ్యేంద్రియము | ప్రజాపతి | రతిభోగము |
| గుదేంద్రియము | యముడు | మలత్యాగము |

అంతఃకరణ త్రిపుటి

| | | |
|---|---|---|
| మనస్సు | చంద్రుడు | సంకల్ప వికల్పములు |
| బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| చిత్తము | వాసుదేవుడు | చింతనము |
| అహంకారము | రుద్రుడు | అభిమానము(అహంకరించుట) |

ఈ ప్రకారముగా పంచమహాభూతముల పంచీకరణము ద్వారా ఉత్పన్నమైన శరీరము జడముంది. ఇది జడము ఉన్నందున కదలడానికి వీలులేదు. నా సహాయం లేకుండా కదలదని పరమాత్మ గ్రహించి తాను కపాలమునందున్న బ్రహ్మరంధ్రముగుండా శరీరమునందు ప్రవేశించినాడు.

**"స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత" ।** (ఐతరేయ.3-12)

**స ఏవ మాయా పరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వమ్ ।**

**స్త్ర్యన్నపానాది విచిత్రభోగైః స ఏవ జాగ్రత్పరితృప్తిమేతి ॥**

**స్వప్నే స జీవ సుఖదుఃఖభోక్తా స్వమాయయా కల్పితజీవలోకే ।**

**సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూతః సుఖరూపమేతి ॥**

**పునశ్చ జన్మాన్తరకర్మయోగాత్స ఏవ జీవః స్వపితి ప్రబుద్ధః ।**

**పురత్రయే క్రీడతి యశ్చ జీవస్తతః సుజాతం సకలం విచిత్రమ్ ॥**

**జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।**

**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

**త్రిషుధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।**

**తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥**(కైవల్యోపనిషత్)

ఈ విధంగా ప్రవేశించిన పరమాత్మయే స్వమాయచే మోహితుడై స్థూలదేహమును అభిమానించి స్థూలభోగములు అనుభవించి సంసారి (జీవుడు)అయినాడు.జాగ్రదవస్థలో స్త్రీ అన్నపానాది వివిధ స్థూలభోగములను అనుభవించి,స్వప్నములో కల్పితసృష్టిని ఉత్పత్తిచేసుకుని అక్కడి సూక్ష్మభోగములను అనుభవించి, సుషుప్తియందు ప్రవేశించి అజ్ఞానావృతమైన నిజానందమును అనుభవించుచున్నాడు.మళ్ళీ మళ్ళీ ఎన్నిమార్లు ఈ అనుభవములు పొందుచుండినను విసుగులేక జన్మాంతర సంచిత కర్మఫలనియమానుసారముగా ఆ పరమాత్మయే జీవభావమును వదలలేక సుషుప్తినుండి జారి, స్వప్నములు పొందుచు, మరల జాగ్రదవస్థను చేరుకుంటున్నాడు.

మూడవస్థలయందు (జాగ్రత్, స్వప్న, సుషుప్తి) మూడు విధముల భోగములననుభవిస్తూ, మూడు శరీరములను, పంచకోశములను, వాటి ధర్మములను సాక్షిగా చూస్తున్న యే ఆత్మగలదో, అదియే చిన్మాత్రమగు పరబ్రహ్మము. ఇట్లు ఆ పరబ్రహ్మమే నేనని తెలిసికొని జీవుడు సర్వబంధ-ములనుండి విముక్తుడగుచున్నాడు. ఇట్టి అసంగ పరమాత్మకు స్థూలదేహగత సంబంధము ఎట్లు సంభవించును? సంభవించదు.

అప్పుడు శిష్యుడు సద్గురుదేవుని మళ్లీ శంక చేస్తాడు—ఓ సద్గురువరా! ఎప్పుడైతే ఈ శరీర-ము ఆత్మకు సంబంధించినది కాదో, సకలవ్యవహారములకు నిలయమైన ఈశరీరము దేనికి సం-బంధించినది?

స్వామి దానికి ఈ ప్రకారంగా సమాధానము చెప్పుచున్నాడు—శరీరముయందున్న కఠినత్వ-ము పృథ్వి భాగము, ద్రవభాగము జలముది, ఉష్ణత అగ్ని అంశము, చలన వ్యవహారము వాయు-వుది మరియు సుశిర(ఖాళీ) భాగము ఆకాశముది.

ఇట్లు దేహము మరియు దానికి భూతాలతోగల సంబంధాన్ని చూస్తున్న తాను (సాక్షి) దేహ-ముయొక్క అభావము కలవాడున్నాడు. అశరీరుడై(అసంగము, నిష్క్రియము, నిర్వికారము, నిర్ధర్మ-కము) సాక్షిగా తానుండి 'నేను' శరీరమును అని భావించుట అనర్థదాయకము (జననమరణరూప మహాదుఃఖమునకు కారణము) కాగలదు.

అప్పుడు శిష్యుడు చేతులు జోడించి నమస్కరిస్తూ ఓ సద్గురుదేవా! 25 తత్వములకంటే భిన్నంగా ఉన్న చేతనరూప ఆత్మను నేను అని మీయొక్క కృపచేత తెలుసుకొని కృతార్థుడన-య్యాను—అని కృతజ్ఞతలు తెలుపుతూ, సద్గురుదేవునకు సాష్టాంగ ప్రణామములు చేసి ఆనందా-శ్రువులు రాల్చాడు. ఆపైన సద్గురుదేవునియొక్క ఆశీర్వాదమును పొంది వెళ్ళిపోయాడు.

అక్కడనే ఉన్నటువంటి ఒకానొక కుష్టురోగి ప్రక్కనే కూర్చొని ఇంతదనుక స్వామి చెప్పినటు-వంటి తత్త్వమును యథాతథముగా విన్నాడు. తరువాత స్వామికి సాష్టాంగ నమస్కారములు చేసి ఈ ప్రకారంగా అంటాడు. ఓదయామయా! ఇంతవరకు మీరు పంచీకరణమును బోధించి ఆ శిష్యుని యొక్క మనోరోగమును నివృత్తి చేసినారు.నీవు నాకు ఈ స్థూలశరీరమునకు ఆవరించినటువంటి ఈ కుష్టువ్యాధిని నివారించి నన్ను ధన్యుణ్ణి చేయుము స్వామీ–అని ప్రార్థించినాడు.

సిద్ధనాథుడు ఆ కుష్టురోగియొక్క ఆర్తనాదమునాలకించి ఆ రోగనివృత్తికి పవిత్రమైన పంచా-క్షరీ మంత్రము "**ఓం నమశ్శివాయ**" ఉపదేశించి పాదోదకస్నానము చేయించగా అప్పుడు విచిత్రమైన ఘటన జరిగింది. అదేమనగా, పంచాక్షరీ మంత్రము మరియు పాదోదకముయొక్కమహాత్మ్యము వలన ఆ కుష్ఠురోగము తత్కాలమే సంపూర్ణముగా ఉపశమించి దివ్యమైన దేహమును పొంది-నాడు. ఇటువంటి చమత్కారమును చూసి సకల జనులు అనేక తండోపతండాలుగా వచ్చి స్వామి

యొక్క దర్శనము చేసుకుంటారు.జనులయొక్క గుంపును చూసి స్వామి తనలోతాను—నా యొక్క ఏకాంతమునకు భంగము వాటిల్లగలదని భావించి అక్కడినుండి వెళ్ళిపోతాడు. ప్రారబ్ధకర్మమనే వాయువు వీచడమువలన ఈ దేహమనే ఆకు అక్కడనుండి ఎగిరిపోయింది.అనేక గ్రామములు, పట్టణములు, నగరములు తిరుగుతూ తిరుగుతూ బీజాపూర్ కు వచ్చి సద్గురుదేవుడు అనేక లీలలను ప్రదర్శిస్తాడు.

'బాంగీ' అనే పేరుగల ఒక గృహస్థుని ఇంటిముందు స్వామి కూర్చుంటాడు. ఆ ఇంటి యజమాని బయటకు వచ్చి స్వామిని చూసి, ఈ విధంగా అనుకుంటాడు. ఈ మనుష్యుడు మా ఇంటియందు సేవచేయుటకు యోగ్యముగా ఉన్నాడని తలంచి, ఆ మూర్ఖుడు స్వామికి ఒక రొట్టె తీసుకొచ్చి ఇచ్చి, వాడు స్వామితో అంటాడు. ఈ రొట్టె తిని ఇక్కడ మా ఇంటిముందు ఉన్నటువంటి పెంటరాశిని మొత్తము తీసుకెళ్లి ఊరుబయట పారవేసి రాగలవు—అని అజ్ఞాపించగా, స్వామి పనికి పూను కుంటాడు. కొంత సమయమునకు పని పూర్తి అయిన తర్వాత స్వామి అక్కడనుండి వెళ్లి ఇంకొక గృహస్థుని ఇంటికి భిక్ష నిమిత్తము వెళ్ళినాడు.

ఆ గృహస్థుడు స్వామినిచూచి,ఈవ్యక్తి సేవచేయుటకు ఉత్తముడున్నాడని అనుకొని,నీకు రొట్టె కావాలా? అని అడుగుతాడు. స్వామి కావాలి అన్నట్లుగా తల ఊపాడు. ఆ గృహస్థుడు ఇంటి లోనికి వెళ్లి సగము రొట్టె తీసుకొచ్చి స్వామికి ఇచ్చి, ఈ ఇంటిముందుగల బురదను తీసివేసి శుభ్రముచేయమని అజ్ఞాపించి వెళ్లిపోయినాడు. స్వామి ఆ బురదను అంతా తీసివేసి శుభ్రముచేసి అక్కడనుండి ముందుకు వెళ్లి పోతాడు.

ఊరిబయట "తాస్ భావడీ"వద్ద సిద్ధఋషి విశ్రాంతిగా కూర్చుని ఉండగా, చీకటిపడిన పిదప అక్కడికి ఒకాయనవచ్చి స్వామిని ఈప్రకారముగా అడుగుతాడు.బాబా! భోజనము అయ్యిందా? అని అడుగుతాడు 'లేదు'అంటూ స్వామి తల ఊపినాడు.అప్పుడు ఆయన తన గృహమునకు తీసుకెళ్లి, పాచిన అన్నమును స్వామికి భుజంపచేసి, ఇక పద "జుమ్మామసీద్"కు పోదాము. అక్కడ ఆట (నాటకము)ఆడుతున్నారు—అని స్వామిని తీసుకెళ్ళి, సిద్ధనాథుని చేతికి దివిటీ(కాగడా)ఇచ్చి, కిరసనాయిలు మరొక చేతికిచ్చి, నాటకం పూర్తిఅయ్యేవరకు ఈకాగడాను వెలిగిస్తూ ఉండుము–అని ఆ మందమతి చెప్పగా, స్వామి ఒప్పుకొని ఆ దివిటీని ధరించినాడు.

స్వామి ఆ దివిటీని వెలిగిస్తూ ఇలా అనుకుంటాడు–నేను అందరికన్నా శ్రేష్ఠుడిని. ఎందుకనగా, నాయొక్క ఈ దివిటీ ప్రకాశముచేత ఈనాటకము ఆడబడుతున్నది. (వాచ్యార్థము). అదేవిధంగా సకల అనాత్మపదార్థములకన్న ఆత్మనైన నేను శ్రేష్ఠమై ఉన్నాను. నాయొక్క చేతన ప్రకాశముచేతనే ఈ సకల జగత్తుయొక్క ఆట నడుస్తున్నది (లక్ష్యార్థము).

ఇలా కొంతసేపు దివిటీని వెలిగిస్తూ ఉండగా స్వామికి నిద్రముంచుకొచ్చి చేతిలోని దివిటీ క్రిందపడింది. తక్షణమే ఆ మనుష్యుడు వచ్చి స్వామియొక్క తలపైన గట్టిగా ఒక దెబ్బకొట్టి,మళ్లీ ఈ సారి ఇలా చేయకూడదు-అని చెప్పి క్రింద జారిపడిన దివిటీని తిరిగి స్వామి చేతికిచ్చి జనంలోకి వెళ్ళిపోయాడు. అక్కడి ప్రేక్షకజనము స్వామిని చూసి ఈయన ఒక పిచ్చివాడు కాబోలు అని అనుకుంటారు.

సిద్ధనాథుడు అనుకుంటాడు, వాడు నన్ను కొట్టింది చాలా మేలు అయ్యింది. తమోగుణము నుండి నన్ను మేల్కొల్పినాడు.ఏవిధంగా ప్రత్యగాత్మకు నిద్రలేదో,అదేవిధంగా నన్ను నిద్రనుండి జాగృతి చేసినాడు. కపాలపూజచేసి ఈయన నాకు యోగ్యమైన బహుమానము ఇచ్చినాడు-అని సంతోషించి ఆనందఘన అవస్థలో ఓలలాడుతాడు సిద్ధనాథుడు.

ఆట సంపూర్తి అయినాక ప్రేక్షకజనమంతా తమతమ గృహములకు వెళ్ళిపోయినారు. ఈ స్థలము ప్రశాంతంగా ఉందని అనుకొని స్వామి అక్కడనే భూమిమీద విశ్రమించినాడు.ఈప్రకారముగా కొన్ని రోజులు ఎన్నో ఇబ్బందులను సహిస్తూ భిక్షకూడా దొరకని పరిస్థితుల్లో కాలం గడుపుతూ ఒకానొక సమయాన స్వామి ఒక నిర్ణయానికి వచ్చి, జనసంచారము లేనటువంటి స్థలమును అన్వేషించి"బిన్ చిప్"మస్జిద్ వెనుక నివాసముచేస్తూ సీతాఫలములనుభుజిస్తూ పృథ్విపై శయనించేవాడు. అన్నవస్త్రాలయొక్క చింతలేకుండా పరిపూర్ణమైన వైరాగ్యముద్వారా ఏకాగ్రచిత్తంతో స్వరూపమునందే లగ్నమై ప్రశాంతమును పొందినాడు.

స్వామియొక్క స్థితినిచూచి త్రిగుణాత్మక జనులు తమ తమ గుణములననుసరించి వర్ణనిష్ఠ భ్రాంతజనులు తమోగుణమునకు చెందినవారు స్వామి చండాల వర్ణమునకు చెందినవాడని అనుకుంటారు. రజోగుణమునకు చెందినవారు, ఈయన నిశ్చయముగా పిచ్చివాడు అని అనుకుంటారు. ఇక, సత్త్వగుణమునకు చెందిన కొందరు స్త్రీలు, అయ్యో పాపము! జనులయొక్క సాంగత్యము విడిచినా, వనములో తిరుగుతూ కాయకసవులు తినుచున్నా, అన్నవస్త్రాలను త్యాగముచేసినా–కర్మ పీడించేది మాత్రము విడువలేదు–"**కర్మణా గహనోగతి**"అని అనుకుంటారు. స్త్రీలయొక్క మాటల్లో **'ప్రారబ్ధకర్మ'** అనే శబ్దము స్వామికి వినిపించగానే, పూర్వము గడిచిన ఒకానొక సంఘటన జ్ఞప్తికి వస్తుంది.

శ్రీశైల క్షేత్రమునకు పూర్వదిశయందు"బద్వేలి"అనే ఒక గ్రామమున్నది.అచట ఒకానొక దేవాలయంలో స్వామి కూర్చుని ఉండగా,అక్కడికి ఒక గస్తీవాడువచ్చి స్వామిని మందలిస్తాడు.నీవు ఎవరు నిజంగా చెప్పుము? స్వామి ఆ లౌకిక శబ్దాన్ని విని మౌనంగా ఉండిపోయాడు. అప్పుడు ఆ గస్తీవాడు మళ్లీమళ్లీ స్వామిని మందలిస్తాడు. సిద్ధనాథుడు మౌనంగా ఉండిపోతాడు. ఇది చూసి అతడు కోపానికి వచ్చి—

మళ్లీమళ్లీ మందలించినాగాని నీవు మౌనంగా మారు మాటాడకుండా ఉంటావా? అని కోపంతో ఆ గస్తీవాడు స్వామిని ఒక తన్ను తన్ని, ఆ మహాత్ముని చేయిపట్టుకుని ఈడ్చుకుంటూ కచేరీ వద్దకు తీసుకొచ్చి కొత్వాల్ కు చెప్పగా వాడు చీకటిగదిలో వేయండి–అని అజ్ఞాపించగా స్వామిని చీకటిగదిలో త్రోసి బంధించినారు.మరుసటి రోజున ఆ కొత్వాల్ ఏదో పనిమీద గ్రామాంతరమునకు పోయి, ఆయన అక్కడే మూడురోజులు ఉండిపోయాడు. ఆ మూడురోజులు స్వామి ఆ అంధకారమైన గదిలోనే బంధింపబడి ఉన్నాడు. అన్నాహారములు స్వామికి ఇచ్చినవారు లేరు.ఆ కొత్వాల్ మూడు రోజులకు తిరిగి వచ్చినాక స్వామిని బయటకు తీసుకురండి అని ఆజ్ఞాపించగా, గస్తీవాడు స్వామిని బయిటకు తీసుకొస్తాడు.అప్పుడు ఆ కొత్వాల్ స్వామిని అడుగుతాడు.నీవుఎవరు?నీ ఆచూకీ ఏమిటి? తెలియజేయమని అడుగుతాడు.సిద్ధనాథుడు వానికి సమాధానము చెప్పలేదు. కొత్వాల్ దగ్గరకువచ్చి స్వామిని మందలించినాగాని స్వామి వారికి ప్రత్యుత్తరము ఇవ్వలేదు.దానిచే ఆ కొత్వాల్ అగ్నిహోత్రునివలె మండిపడి వీన్ని ఖండఖండాలుగా తోడుకలు తీయండి. వీన్ని చిత్రహింసలు పెట్టండి. అప్పుడుగాని వీడు సమాధానము చెప్పగలడని అజ్ఞాపించినాడు.

అప్పుడు ఇద్దరు గస్తీవారు స్వామిని కొట్టడము ప్రారంభించినారు. చిత్రహింసలు పెడుతున్నారు. స్వామి "**శివార్పణమస్తు**" అని అంటున్నాడు. అదే సమయానికి అక్కడికి ఒకానొక బ్రాహ్మణుడు వచ్చి స్వామియొక్క పరిస్థితిని చూసి సిద్ధనాథునియొక్క ప్రశాంతవదనమును తిలకించి ఈయన ఒక మహా సిద్ధపురుషుడున్నాడని గ్రహించి, అయ్యో! ఈ మహాత్ముని హింసించకండి. దయచేసి వదిలిపెట్టండి–అని వారిని వేడుకొని, స్వామిని విడిపించుకుని తన గృహమునకు తీసుకెళ్లి సిద్ధనాథునికి అభ్యంగస్నానము చేయించి ప్రేమచేత భోజనము చేయిస్తూ–స్వామియొక్క గాయములు, దెబ్బలు మానేవరకు పదిహేను రోజులు రక్షించినాడు.గ్రామములోని జనులు ప్రతినిత్యము ఆ బ్రాహ్మణుని ఇంటికి వచ్చి అత్యాదరముతో సిద్ధనాథుని దర్శనము చేసుకొని స్వామియొక్క ముఖకమలమునుండి వెలువడునటువంటి వేదాంత సంభాషణమును శ్రవణము చేస్తూ తృప్తిజెందేవారు.

పూర్వము గడిచినటువంటి ఈ సంఘటన బీజాపూర్ లోని స్త్రీల ముఖముద్వారా వెలువడిన "**ప్రారబ్ధకర్మ**" అనే శబ్దము వినగానే స్వామికి జ్ఞప్తికివచ్చి, ఇప్పటి పరిస్థితి పూర్వపు పరిస్థితికంటే చాలా ఉత్తమమైనదని అనుకుంటాడు.

**శ్లో ।।ప్రారబ్దమర్థం లభతే మనుష్యః, దైవోఽపి తం లంఘయితుం న శక్యః ।**

**తస్మాన్నశోచామి న విస్మయో మే యదస్మదీయం నహి తత్పరేషామ్ ।।**

మనుష్యునికి ప్రారబ్దములో యేది ప్రాంప్తిచనున్నదో అదియే లభించును. దానిని దైవముగూడ తప్పించుకోలేడు. కావున, నాభాగ్యంలో యేముందో అది నాకే దక్కుతుంది. ఇతరులకు చెందబోదు. కనుక, నేను శోకించుటయును లేదు, విస్మయమును పొందుటయును లేదు.

ఈప్రకారంగా చింతించుకుంటూ స్వామి నిర్వికల్ప సమాధిలో ప్రశాంతంగా ఉంటాడు. ముందర కథను తరువాత ప్రకటము చేస్తాను.శ్రోతలు సావధానచిత్తులై వినగలరని మనవి.సద్గురు సిద్ధనాథుని అతిగహనమైన చరిత్రను భక్తిపూర్వకంగా శ్రవణము చేసినట్లైతే సకల దోషములు హరించబడును. తత్క్షణమే హృదయము పవిత్రమై మనస్సు ఉత్సాహము నొందును.తద్వారా జ్ఞానము ప్రకటము కాగలదు.

మంగళకరమైనటువంటి శ్రీసిద్ధారూఢ కథామృత శ్రవణముద్వారా సకలపాపములు భస్మము కాగలవు.శ్రీసద్గురునాథునియొక్క దివ్యమైన చరణకమలములకు శ్రీశివదాసస్వామి ఈ పదియవ అధ్యాయమును సమర్పిస్తూ పూర్తి చేస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదకొండవ అధ్యాయము

**పద్యానువాదము:**—శ్రీసిద్ధారూఢ యతీంద్రస్వామి దేహాభిమానమును సంపూర్ణముగా త్యాగముచేసి దేహసంబంధ అనేక దుఃఖములను సహిస్తూ, వర్తమాన దేహమునందే విదేహస్థితిని, యథార్థజ్ఞానముయొక్క అవస్థననుభవిస్తూ, సద్గురుదేవుడు లోకులకు జ్ఞానోపదేశముచేస్తూ వెళ్ళు-చున్నాడు.

ఎవరియొక్క ఆచరణ ఇతరజీవులకు మార్గదర్శకమై ఉందో, దానిని అనుసరిస్తే భవబంధము నివృత్తి అవుతుందో, అటువంటి సిద్ధసద్గురు యతీంద్రుడు సకలజీవులకు జ్ఞానోపదేశముచేస్తూ, సుఖాన్ని ప్రసాదిస్తూ, జగత్తుయందు సంచరిస్తున్నాడు. దుష్టజనులచేత అనేక విధములుగా పీడితు-డైనాగాని, వారిపట్ల పరిపూర్ణమైన శాంతముతో వర్తించేవాడు. దేహమునకు రకరకములైన బాధలు కలిగినా వాటిని తితీక్షగలిగి ఓర్చుకునేవాడు. దేహమునకు కలిగిన దుఃఖము స్వామికి సుఖమయముగా తోచెడిది. శాంతస్వరూపమైన తనయొక్క అవస్థను ఇతరజీవులకు ఆదర్శప్రా-యమై ఉండునట్లు సద్గురునాథుడు అనేక సాధనరూప ఉపాయములను చూపిస్తూ, జీవులయొక్క అధికారమునుబట్టి, ఏయే జీవులకు ఏయే సాధన సులభమగునో,అటువంటి సాధనాలను చూపిస్తూ, సంసారరూప నదినుండి తరింపజేస్తున్నాడు.

గత అధ్యాయము ననుసరించి శ్రీ సద్గురు సిద్ధనాథస్వామి బీజాపూర్ గ్రామమునందున్నపుడు ఏకాంత ప్రదేశంలో అసంగస్వరూపుడై అందరికి ఆశ్చర్యకరమైన లీలలు ప్రకటన చేస్తాడు. కొన్నిదిన-ములు గడచిన తర్వాత "మొహర్రం" పండుగ వచ్చింది. కొందరు స్వామియొక్క వైభవమునుచూచి ఓర్వలేని వారు స్వామిని ఒక పెద్ద వెదురుబొంగుపై కూర్చుండబెట్టి, వారి భుజాలపైన ఎత్తుకొని దినమంతా ఇల్లిల్లు తిరుగుతూ ధనమును అడుగుకుని ప్రోగుజేసి సంతోషించేవారు. క్షణమాత్రము స్వామిని బొంగుపైనుండి పడవేసి తన్నేవారు. మళ్లీ బొంగుపై కూర్చుండబెట్టి భిక్షకోసము ఇల్లిల్లూ తిరుగుతూ ధనమును అడుక్కునేవారు. స్వామిని ఈ విధంగా హింసించడమువలన స్వామియొక్క మోకాళ్ళు పగిలి రక్తము కారుచుండెను. కాళ్లు చేతులు గాయపడి ఉబ్బినవి.

ఆ నిర్దయులైన దుష్టజనులు సాయంత్రము కాగానే స్వామిని ఎక్కడికక్కడే విడిచిపెట్టి వెళ్ళే-వారు. మళ్ళీ ఉదయమున స్వామివద్దకు వచ్చి, ఎప్పటిలాగే ధనార్జన కోసము పండుగ ముగిసేవర-కు హింసించేవారు. సిద్ధనాథుని పాదములు నడవడానికి వీలులేకుండా ఉండెను.స్వామి మెల్లమెల్ల-గా ఆయాసంతో నడుచుకుంటూ నడుచుకుంటూ ఒక మసీదులోకి వచ్చి,ఈ ప్రకారంగా అనుకుం-టాడు. ఈశ్వరుని కృపవలన ఈ పురజనులు నాకు చాలా మేలు (ఉపకారము) చేసినారు. కార-ణమేమనగా శరీరము కదులుతుంటే మనసు విక్షేపము పొందుతుంది. మనసుయొక్క ఏకాగ్రత ఖండితమవుతుంది. మనసు విక్షేపమును పొందితే నిర్వికల్పసమాధిస్థితి కలుగదు. ఇప్పుడు నాశ-రీరము కదలలేకుండా ఉంది. నాయొక్క స్వరూపస్థితికి ఏ ఆటంకము(ప్రతిబంధకము)ఉండదు–అని అనుకుంటాడు.

ఇట్లు, కొన్నిరోజులపాటు ఈశ్వరుడే అన్నపానాదులను ప్రాప్తముజేస్తాడు. ఆస్థానమునకు చిన్నపిల్లలు వచ్చి బంతి, పతంగి, బొంగరము మొదలగు ఆటలు ఆడుకునేవారు. వారితో సిద్ధనా-థుడు కూడా ఆడుతూ తాను ఆనందమును పొంది, పిల్లలనుగూడ సంతోషపెట్టే వాడు. సిద్ధావధూ-తయొక్క వార్తను విని "తులుజప్ప" అను నామధేయముగల ఒక భక్తుడు స్వామియొక్క అవస్థను గమనించి దర్శనము చేసుకుని నమస్కరించి స్వామికి ఎదురుగా నిలబడి కన్నుల నిండా స్వామి యొక్క ప్రేమమూర్తిని వినమ్రవదనుడై దర్శించి, ఎంతో సంతోషించి, ఈ మహాత్ముని సేవచేసుకున్న-ట్లైతే నేను తప్పకుండా ధన్యుణ్ణి అవుతాను–అని అనుకుంటాడు.

ఈ మహాత్ముని నేను నేరుగా మా ఇంటికి రమ్మంటే వస్తాడో లేదో- అని శంకించి, ఒక పిల్లవాడిని పిలిచి మీరు స్వామితో ఆడుతూఆడుతూ మెల్లమెల్లగా మా ఇంటికి తీసుకురండి.అట్లు తీసుకొస్తే మీకు పుట్నాలు, బెల్లము ఇస్తాను–అని చెప్పగా, ఆ పిల్లలు విని 15, 16 మంది పిల్లలు స్వామితో బంతులాట ఆడుకుంటూఆడుకుంటూ మెల్లగా "తులుజప్ప" ఇంటివద్దకు తీసుకొని వచ్చారు. అప్పుడు "తులుజప్ప" బయటకు వచ్చి సిద్ధనాథుని ప్రేమతో చేయిపట్టుకుని తమ ఇంటిలోనికి తీసుకెళ్ళి మంచముపైన కూర్చుండబెట్టినాడు.

తదనంతరము తులుజప్ప పిల్లలందరికీ పుట్నాలు బెల్లము ఇచ్చి పంపించి, తరువాత ఆ వాడలోని ఇరుగుపొరుగు భక్తులను తీసుకొని వస్తాడు. సిద్ధారూఢస్వామిని బయటకు తీసుకొచ్చి క్షౌరము చేయించి స్నానాదిక్రియలు గావించి, పంచభక్ష్య భోజనము సమర్పించి, మెత్తనైన పాన్పు-వేసి స్వామిని పడుకొనుటకు ఏర్పాటు చేస్తాడు.

ప్రతినిత్యము సద్భక్తులు వచ్చి స్వామిద్వారా వేదాంతశ్రవణము చేసేవారు. సిద్ధనాథుడు వారి యొక్క సమస్త శంకలను నివృత్తి చేసేవాడు. దినదినము స్వామియొక్క వేదాంత విచారరూప బోధ వలన స్వామి బ్రహ్మజ్ఞాని అని అందరికీ తెలిసింది. పట్టణములోని నలువైపులనుండి స్వామి దర్శనా-

నికి వచ్చేవారు.ఇట్లుండగా ఒకరోజున శ్రీ సద్గురు సిద్ధనాథస్వామి తులుజప్పను దగ్గరకు పిలుచుకొని, తులజప్పా! స్వేచ్ఛగా తిరుగాడుచుండు పక్షిని పట్టి పంజరంలో వేసి బంధించినట్లుగా, నీవు నన్ను నీ యొక్క గృహమందు బంధించినావు. నా మనసు ఇచ్చట రమించుటలేదు నాకు బాధగా ఉంది.నన్ను పూర్వమువలె ఆ మసీదులోనే విడిచి పెట్టవయ్యా–అని స్వామి చెప్పగా, అప్పుడు తులుజప్ప స్వామి యొక్క అవస్థను తెలుసుకొని, మళ్ళీ ఆ మసీదు వద్ద ఉంచి వస్తాడు. అక్కడకూడా యథాప్రకారము గా జనులువెళ్లి స్వామియొక్క దర్శనము చేసుకుంటున్నారు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారు, వకీలు, ఫౌజుదారు,కరణము,పట్వారి మొదలగు అనేక విధములైన భక్తులు స్వామి దర్శనమునకు వచ్చి, స్వామియొక్క అమృత వచనములను శ్రవణము చేస్తూ సుఖశాంతులను పొందేవారు.గతంలో సిద్ధనాథుని ఎవరైతే అనేక విధములుగా పీడించినారో (పేడ ఎత్తించినవాడు, బురదను శుభ్రము చేయించిన వాడు, కాగడా పట్టించినవాడు, బొంగుపై కూర్చుండబెట్టి ఎత్తేసినవారు) అందరుకూడా స్వామి దర్శనమునకు వచ్చి తమ తప్పులకు పశ్చాత్తాపపడి నమ్రభావంతో స్వామిని క్షమాభిక్షను కోరుతారు. గృహములందు రోగపీడితులై బాధపడుతున్నవారుకూడా సిద్ధచరణములను దర్శించి రోగపీడనుండి ముక్తినొంది ఆనందమును పొందేవారు.

ఒకానొక రోజున బీజాపూర్ పట్టణములోని 18 వర్ణముల జనులందరూ మా వర్ణము గొప్ప, మా మతము గొప్ప, మేము గొప్పవారము అని వాదులాడుకుంటూ,ఆ వివాదమును పరిష్కరించుకొనుటకు అందరుకలిసి స్వామివద్దకు వచ్చినారు.

అప్పుడు దానిని నివృత్తి చేయడానికి స్వామి శ్రేష్ఠమైన సలహా ఇస్తాడు. పరమాత్మ అనేకము లేడు. ఒక్కడే ఉన్నాడు. అందరి దేవుడు ఒక్కడే. ఆయనను పొందడానికి అనేకమార్గములున్నాయి. దానికి దృష్టాంతము—ఒకే గ్రామమును చేరుకోవడానికి అనేక త్రోవలుంటాయి. అదేవిధంగా పరమాత్మను పొందడానికి అనేక మతములు ఉన్నాయి. అన్ని మతాలయొక్క గమ్యము పరమాత్మయే. పరమాత్మయొక్క కృప అందరిపై సమానంగా ఉంటుంది. పరమాత్మయొక్క కరుణాకటాక్షమునకు అందరూ పాత్రులే. ఇటువంటి అమృతతుల్యమైన సద్గురు వచనములను విని అందరూ వారివారి మతాభిమానమును త్యజించి ఇకముందు మేము వాదులాడుకోమని వాగ్దానము చేసి స్వామియొక్క దర్శనము తీసుకొని తమతమ గృహములకు వెళ్ళిపోతారు.

కొన్ని రోజుల తర్వాత బీజాపూర్ పట్టణమును విడిచి వెళ్లడానికి సిద్ధనాథుడు సంసిద్ధుడు కాగా గ్రామస్తులందరూ స్వామి వద్దకు పరుగు పరుగున వచ్చి స్వామిని చుట్టుముట్టి తమ ఆవేదనను వెలిబుచ్చుకుంటారు. ఓ సద్గురుదేవా! నీవు ఇక్కడనుండి వెళ్ళిపోతే మమ్ములను కరుణించి కడతేర్చేవారెవరు? మీయొక్క దర్శనభాగ్యమువలన మేమందరము ధన్యులమైనాము.

సిద్ధయతీంద్రుడు వారి వచనములను విని, ఓ సద్భక్తులారా! సావధానముగా వినండి. ఇంత వరకు మీరు పొందినటువంటి జ్ఞానబీజములు భవిష్యత్తులో అంకురించి వృద్ధినొందుతాయి. హృద-యమనే తోటలో మీరు నాటిన జ్ఞానబీజములు సద్వర్తనద్వారా రక్షింపబడి భక్తియుక్తకర్మచేత పో-షింపబడును. ధ్యానముద్వారా ఫలించును. ఈ విధంగా ఎవరు రక్షించుకుంటారో, వారు ఆత్మస్వ-రూపులవుతారు. ఇటువంటి ఉత్తమమైన సాధనలు ఎవరైతే చేస్తారో, వారు భవిష్యత్తులో ఉత్తమ గతిని పొంది, సంసారవిపత్తునుండి రక్షింపబడి, బ్రహ్మప్రాప్తి కలిగి ముక్తులగుదురుగాక! అని స్వామి ఆశీర్వదించినాడు.

ఇప్పుడు అన్యస్థలములందున్నజీవులు ఈశరీరముయొక్క ఆగమనముగూర్చి ఎదురు చూ-స్తుంటారు. నాయొక్క బోధను వినిపించడానికి ఈ శరీరము వారి వద్దకు వెళ్లగలదు.ఇంతవరకు భక్తితో, ప్రేమతో, అత్యాదరముతో నన్ను ఏవిధముగా గౌరవించి సత్కరించినారో, ఇదే ప్రేమ, ఇదే శ్రద్ధ ఇటువంటి ఆదరణీయమైన బుద్ధుని రాబోవు సాధువులందరిపట్లజూపి, వారికి సేవలుచేసి, వారి ఆశీర్వాదమును పొందండి. తద్వారా మీకు తప్పకుండా శాశ్వతమైన సుఖశాంతులు లభించగలవు.

ఇటువంటి ప్రేమపూర్వకమైన స్వామియొక్క వచనామృతములను విని అందరూ నేత్రముల వెంట ప్రేమాశ్రువులను రాల్చారు. కంఠములు గద్గదితమై ఎవరికీ నోరాడకుండెను.దయాసాగరుడైన సద్గురు సిద్ధనాథుడు అందరికీ ఆశ్వాసనమిస్తూ నేను ఎల్లప్పుడూ మీకు అండగానే ఉంటూ ఇక్కడికి దగ్గరి గ్రామంలోనే ఉంటాను–అని అంటాడు.

ఈ విధంగా స్వామి అందరిని ఆశీర్వదించి, అక్కడనుండి దక్షిణదిశకు బయలుదేరుతాడు. భిక్షనుగూర్చి గ్రామములు తిరుగుతూ, వనాంతరములందు మార్గమధ్యములో పశువుల కాపరులతో ఆడుతూ ఆడుతూ సిద్ధనాథుడు జనసాంగత్యమును త్యజించి నిస్సంగుడై, ఆనందముతో ముందుకు వెళుతూ ఏకాంత ప్రదేశాలలో జీవన్ముక్త సుఖమును అనుభవిస్తూ ఉన్నాడు.

ఇట్లు, సిద్ధనాథుడు ప్రయాణము సాగిస్తూ సిద్ధాపురము అనే గ్రామమును చేరుకుంటాడు. అచ్చట ఒక విచిత్రమైన సంఘటనను చూస్తాడు. ఒకానొక జంగమయ్య హఠయోగముచేత చేతులు భూమిపైనుంచి, కాళ్లు పైకి నిలబెట్టి శిరసాసనమువేసి ఉన్నాడు. ఆయనను సిద్ధనాథుడు సమీపించి, నీవు ఈప్రకారముగా ఎందుకు చేస్తున్నావు? అని అడుగుతాడు. అప్పుడు ఆ జంగమయ్య సమాధా-నమిస్తూ—ఈ గ్రామస్తులందరూ కలసి 1000 మంది జంగమయ్యలకు అర్చన, భోజనాదులు ఏర్పా-టు చేస్తేనే నేను ఆసనమును క్రిందకు దించుతాను, లేనిచో ఇట్లే ఉంటాను–అంటాడు.

ఆ జంగమయ్య ఉపవాసముండగా ఊరిలో ఎవరుగూడ భోజనము చేయకూడదు. ఇది ఆ గ్రామప్రజల కట్టడి. లేనిచో, ఆయనను అవమాన పరిచినట్లవుతుంది. సాక్షాత్ పరమశివుడు జంగమ రూపంలో వస్తాడు–అను నమ్మకము గ్రామప్రజలకుంది. కాని,వెయ్యి మందికి అర్చన, భోజన

సదుపాయాలు చేయాలంటే-శక్తికి మించిన పని అవుతుంది–అని గ్రామస్తులంటారు. ఇవ్వకపోతే ఆయన ఆసనమునుండి దిగడు. ఆయన దిగకుంటే గ్రామస్తులు పస్తులుండే కాలము దాపురించింది. కావున, ఈ క్లిష్టమైన పరిస్థితిని గమనించి సిద్ధనాథస్వామికి జాలి కలిగి–ఆ గ్రామస్తులతో ఇలా అంటాడు. మీరు ఆ జంగమయ్యకు వెయ్యి మందికి అర్చన, భోజనసదుపాయాలు కల్పిస్తామని మాట ఇవ్వండి. ఆయనను సంతృప్తిపరిచే బాధ్యత నేను వహిస్తాను–అని అనగా—గ్రామస్తులందరూ ఆనందించి, ఆ జంగమయ్యకు వచనమిస్తారు.

ఇట్టి వచనములు విని ఆ జంగమయ్య తనయొక్క హఠయోగమును విడిచి, ఆసనమును దించి కూర్చుంటాడు. అప్పుడు సిద్ధనాథుడు ఆయన వద్దకు వెళ్లి ఇలా అడుగుతాడు. ఈ జగత్తునిండా జంగమములు సంపూర్ణముగా వ్యాపించియుండగా,అర్చన భోజనాలు ఏ జంగములకు చేయాలి? మాయొక్క జంగమజనులు అనేకమంది ఉన్నారు. వారందరికి అర్చనచేయించి,భోజనవ్యవస్థ చేయ మని అంటివి.ఆ జంగములు షడూర్మిసహితముగా ఉన్నారా? లేక షడూర్మిరహితముగా ఉన్నారా? (షడూర్ములనగా ఇచ్చట అరిషడ్వర్గములు అని గ్రహించాలి).ఇట్లు వికల్పముజేసి—ఒకవేళ మీ ఆ జంగములు షడూర్మియుక్తంగా ఉన్నారని అంటివా–వారు జంగములు కాదు. కామక్రోధాదులను జయించనిదే జంగములని చెప్పుటకు ఆస్కారంలేదు. వారు అర్చనకు అయోగ్యులు. ఇక షడూర్మి రహితమైన వారు అంటివా-వారు నిత్యతృప్తులు. భోజనము ఎవరికి వడ్డిస్తావు. అర్చనాదులు నిష్ప్ర-యోజనము కాగలవు.

ఇటువంటి శాస్త్రోక్తమైన భాషణమును విని ఆ జంగమయ్య నిరుత్తరుడైనాడు.తరువాత సిద్ధ-నాథుడు ఆ జంగమయ్యను ఏకాంతమునకు కొనిపోయి ఈ దాంబిక వర్తనమును వదలుము.ఒక-వేళ ఈ జనులకు నీయొక్క వ్యవహారముగూర్చి తెలిసిందా–నీవు నిశ్చయముగా అవమానము పా-లవుతావు–అని చెపుతాడు. ఇటువంటి పలుకులను విని ఆ జంగమయ్య ఆశ్చర్యచకితుడైనాడు.

ఇక భక్తజనులను ఉద్దేశించి సిద్ధరూఢస్వామి అంటాడు. మీరు ఈ జంగమయ్యకు కొన్ని పాలు, చక్కెర తీసుకొచ్చి ఇవ్వండి. జగత్తునిండా పరిపూర్ణముగా ఉన్న జంగము–ఈ జంగమును తృప్తి పరచుటద్వారా పరిపూర్ణమై తృప్తిపడతాడు. మరియు వేల లక్షల జంగములకు భోజనము ఒసంగి తృప్తిపరచినంత ఫలము లభించగలదు–అని చెప్తాడు.

ఈ ప్రకారముగా ఆ జంగమయ్యను మరియు పురజనులను అందరిని సంతోషపెట్టి, శ్రీ సద్గురునాథుడు అక్కడనుండి బయలుదేరి "యాదవాడ" అను గ్రామమునకు చేరుకుని, ఒకానొక గృహమునకు భిక్షగూర్చి స్వామి వెళ్ళగా, ఆ గృహస్థురాలు ఒక రొట్టె, కొంచెము కూరగాయ వేసి స్వామికి ఇచ్చింది. సిద్ధనాథుడు ఆ రొట్టెను స్వీకరించి ఇలా అంటాడు. రొట్టె పెద్దదిగా ఉంది, కూరగాయ కొంచెముగా ఉంది-అంటాడు. అప్పుడు ఆ గృహస్థురాలు కూరగాయను రొట్టె అంతటా

రుద్ధి స్వామి చేతికి ఇచ్చింది. స్వామి ఆ రొట్టెను నాలుగు మడతలుగా మలచి ఏది కూరగాయ?అని ఆమెను అడుగుతాడు. స్వామియొక్క మాటలు వినగానే ఆ స్త్రీకి నవ్వు వచ్చింది. ఆమె ఇలా అనుకుంది. ఈయన నిజంగా పిచ్చివాడిలా ఉన్నాడు. కాని, ఉన్మత్తచర్యలుచూపిస్తూ సామాన్య మనుష్యునివలె తిరుగుతున్నటువంటి బ్రహ్మవేత్త కాబోలు అనుకుంది. ఆ రొట్టెను స్వామి అట్లే చేతిలో పట్టుకొని అలాగే వెళ్తుండగా, ఒక గృహస్థుని ఇంటిలో పురాణ కాలక్షేపము జరుగుతుండగా, స్వామి అక్కడ ఆగి నిలబడ్డాడు. ఆ ఇంటి యజమాని "అల్లమ్మయ్య". ఆయనే స్వయంగా పౌరాణికుడు. స్వామి ఆ గృహమున ప్రవేశించినాడు. ఆ అల్లమ్మయ్య స్వామియొక్క ఉన్మత్త అవస్థను చూసి శ్రోత-లతో ఇలా అంటాడు. ఆయన పిచ్చివాడిలా ఉన్నాడు. ఆయనను లోనికి రానీయకండి, బయటకు పంపించండి అంటాడు. అప్పుడు ఇద్దరు శ్రోతలు వచ్చి స్వామిని బయటకు పొమ్మని వారించినారు. కాని, స్వామి కదలక మెదలక అక్కడే ఉన్నాడు.పురాణము యథాప్రకారముగా ప్రారంభించబడినది. అచ్చట ఆనాడు చెన్నబసవపురాణము చెప్పబడుతుంది. ఈశ్వరునియొక్క 25 లీలలతో అంధకాసు-రారిత్వ లీల చెప్పబడుతుంది. ప్రస్తుతవిషయము ఉపమాలంకారమును అన్వయముచేస్తూ ఇలా చెప్పబడుతున్నది. గజము వంటి మామిడిచెట్టు ఉంది. దానిక్రింద శంకరుడు తపస్సు చేస్తున్నాడు. ఆ వృక్షముపైన మధు, మిత్ర అను రెండు పక్షులు ఒకదానితో ఒకటి "విద్యుల్లత" అను శబ్దముగూర్చి పరస్పరము చర్చించుకుంటున్నాయి–అని పౌరాణికుడు చెప్తున్నాడు. ఆ "విద్యుల్లత"అను శబ్దమును విని సిద్ధయోగి పౌరాణికుడిని ఇలా అడుగుతాడు.

ఏమి?"విద్యుల్లత" అను శబ్దముది గజముతో సంబంధమున్నదా? లేక చెట్టుతో సంబంధ-మున్నదా? అసలు "విద్యుల్లత" అను శబ్దమునకు అర్థమేమి? గజమునకు చెట్టుకు ఏమిటి సంబం-ధము? గజము చలనముగలది. చెట్టు చలనములేని స్థావరము. ఈ శబ్దముయొక్క లక్ష్యార్థమేమి-టి? అని అడుగగా,

అప్పుడు ఆ పౌరాణికుడు నివ్వెరబోయినాడు.ఏమిటో ఈయన చూచుటకు వెఱ్ఱివానిలా ఉన్నాడు. కాని,"విద్యుల్లత" శబ్దముయొక్క లక్ష్యార్థము అడుగుతున్నాడు. అంటే, ఈయన సామాన్య మానవుడు కాదు. గొప్ప మహాత్ముడై ఉంటాడు-అని గ్రహించి, స్వామితో ఇలా అంటాడు. స్వామీ! దీని అర్థమేమిటో నాకు బోధపడటం లేదు. అదేదో దయచేసి మీరే చెప్పండి-అని విన్నవించు కుంటాడు.

శ్రీ సద్గురుదేవుడు "విద్యుల్లత" అనే శబ్దమునకు సంబంధము ఎక్కడ కుదుర్చాలో చెప్తున్నాడు. పిపీలికాది గజపర్యంతము చరప్రాణులు. వాటియొక్క బుద్ధివృత్తి అనే దర్పణమందు(ఉపాధియందు) కూటస్థాత్మయొక్క ప్రతిబింబము(చిదాభాసు)నకు"విద్యుల్లత"అను ఉపమానశబ్దముయొక్క సంబంధ-ము కుదురుతుంది."విద్యుల్లత"అనగా మెరుపు అని అర్థము. ఏ విధంగా మెరుపు మేఘమునుండి

ఉత్పన్నమై ఒక్క క్షణమందు అన్ని వస్తువులను ప్రకాశింప (తెలియ)చేసి తిరిగి ఆ మేఘములోనే విలీనమవుతుందో,అదే విధముగా కూటస్థాత్మయొక్క సన్నిధానమున ఉన్న కల్పిత బుద్ధియందు కూటస్థునియొక్క ప్రతిబింబము (చిదాభాసుడు) భాసమానమై ఒకే క్షణముయందు అన్ని త్రిపుటులద్వారా వ్యవహారము జరిపి, అదే క్షణంలోనే తనయొక్క స్వరూపము(కూటస్థుని)యందే విలీనమవుతాడు.ఈ కారణముచేత ఉపమేయస్థానీయ చిదాభాసునకు మరియు ఉపమానస్థానీయ "విద్యుల్లత" శబ్దమునకు అర్థవ్యవస్థ కుదురుచున్నది. ఈ విధముగా సిద్ధయతీంద్రుడు సమాధానము చెప్పి, చేతిలోని రొట్టెను అల్లమ్మయ్య ఎదురుగా ఉన్న పురాణముపై ఉంచుతాడు.

అల్లమ్మయ్య ఆ రొట్టెను మహాప్రసాదముగా భావించి,దానిని తీసుకొని ధన్యోహం ధన్యోహం అంటూ స్వామికి వందనము సమర్పించుకుంటాడు. అప్పుడు ఆ అల్లమ్మయ్య పౌరాణికుడు కాశీకి వెళ్లడానికి నిశ్చయించుకుని, స్వామియొక్క ఆజ్ఞను కోరుతాడు.

అప్పుడు సద్గురుదేవుడు ఇలా అంటాడు.కాశీకి వెళ్ళినవాడు ఎవడుకూడా ఇంతవరకు తిరిగి ఇంటికి చేరుకోలేదు. కాశీకి నీవు ఎందుకు వెళ్తావు, మానుకో-అంటాడు. అప్పుడు పౌరాణికుడు అంటాడు- లేదు స్వామీ, నేను నిశ్చయముగా కాశీకి వెళ్లాలి, ఆజ్ఞ ఇవ్వండి అని అంటాడు. అయితే సరే వెళ్ళు అంటాడు సద్గురునాథుడు.

**శ్లో ॥ కాశ్యాం తు మరణాన్ముక్తిః స్మరణాదరుణాచలే ।**

**శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే ॥**

అను సూక్తి ప్రకారము నీకు అక్కడ మోక్షము లభించుగాక!అని స్వామి ఆశీర్వదిస్తాడు.అదే ప్రకారముగా నిర్మలచిత్తముగలవాడై అల్లమ్మయ్య కాశీకి వెళ్ళినాడు. కాకతాళీయన్యాయమువలె అక్కడనే మరణిస్తాడు.

ఇక సిద్ధయతీంద్రుడు ఆ గ్రామమును విడిచి వేరే గ్రామమునకు వెళ్ళుటకు సంసిద్ధుడై ఊరిబయట "ఖిల్లా"వద్దకు వచ్చేసరికి సూర్యుడు అస్తమించాడు. మసక మసక చీకటి అయ్యింది. మెల్లమెల్లగా కారుచీకట్లు క్రమ్మినవి. సరిగ్గా అదే సమయానికి ఆ ఊరి ఫౌజుదారు ఇద్దరు సిపాయిలను వెంటబెట్టుకుని స్వామికి ఎదురయ్యాడు. ఆ ఫౌజుదారు స్వామినిచూసి ఎవరు నీవు?అని అడిగినాడు. స్వామి ప్రత్యుత్తరమీయక ఊరుకున్నాడు. అందుకు ఆ ఫౌజుదారు వీడు నిజంగా దొంగ ఉన్నట్లు ఉన్నాడు. వీన్ని కొట్టండి అని సిపాయిలను ఆజ్ఞాపించగా వారు స్వామిని యథేచ్ఛగా కొట్టి, ఊరు బయట విడిచిపెట్టి వెళ్ళిపోయినారు. ఈ వార్త అల్లమ్మయ్య పౌరాణికునికి తెలిసి స్వామిని వెతుకుతూ వెతుకుతూ వచ్చినాడు. అప్పుడు స్వామి ఒక పాడుబడిన (జీర్ణమైన) దేవాలయములో ఉన్నాడు.

స్వామియొక్క దుర్భర అవస్థనుచూసి పౌరాణికుడు స్వామిని మళ్లీ మా ఇంటికి పోదాము రండి-అని వేడుకుంటాడు.కాని,స్వామి అందుకు అంగీకరించలేదు.అప్పుడు అల్లమ్మయ్య తమ యింటి

నుండి ప్రసాదమును తెప్పించి స్వామికి సమర్పిస్తాడు.కన్నులనుండి అశ్రుధారలు పడుతుండగా పౌ-రాణికుడు స్వామితో ఇలా అంటాడు. ఓ సద్గురుదేవా! ఏమిటి నీ ప్రారబ్ధము. నీయొక్క పరిస్థితిని చూస్తుంటే నేను భరించలేకుండా ఉన్నాను.

ప్రారబ్ధ శబ్దమును వినగానే స్వామికి గతంలో గడిచిన ఒక సంఘటన గుర్తుకు వచ్చి స్వామి అంటాడు. ఆ పూర్వపు సంఘటన కంటే ఇప్పటి పరిస్థితి చాలా నయంగా ఉంది. అంటూ పూర్వపు సంఘటనను ఈప్రకారముగా అల్లమ్మయ్యతో చెబుతున్నాడు."బళ్ళారి"అనే గ్రామంలో నేను మార్గము గుండా వెళ్తుండగా త్రోవలో ద్వారపాలకుడు నిలబడి నన్ను చూసి ఇలా ప్రశ్నించాడు.

బాబాజీ! నీవు ఎవరవున్నావు? అందుకు నేను సమాధానము చెప్పలేదు. అప్పుడు ఆ ద్వార పాలకుడు కోపించి అంటాడు. నిన్నటి రోజున రాత్రి ఈఊరి షావుకారి ఇంట్లో దోపిడి అయ్యింది. ఆ దొంగతనము చేసింది నీవే ఉన్నావు. దొంగతనం చేసింది పోను, ఇంకా ఆ ఇల్లును పర్యవేక్షించ-డానికి వచ్చావా?ఇలా అంటూ–నన్ను బలాత్కారంగా ముందుకు నెట్టివేసినాడు. అప్పుడు నేను ఒక పెద్ద బండరాయిపై పడ్డాను. గాయపడి శరీరమంతా రక్తమయమైపోయింది.

ఈవిధంగా సిద్ధనాథుడు అల్లమ్మయ్య పౌరాణికునితో గత సంఘటన చెప్పుకుంటూ ఫౌజుదారు కొట్టిన దెబ్బలపై చేయిని నిమిరినాడు.ఇంకా స్వామి ఇలా అంటాడు.అప్పటి గాయము కంటె ఇప్పటి పరిస్థితి చాలా మేలుగా ఉంది. నాకు దుఃఖము ఏమాత్రముగూడా లేదు. అసంగ పురుషులు ఎల్లప్పడూ సుఖంగా ఉంటారు. అసంగస్థితియందు యే సుఖముంటుందో, అది జనసాంగత్యము వలన దొరకదు.

**శ్లో ॥నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగాదశేషా ప్రభవన్తిదోషాః ।**(విష్ణుపు. 4-2-124)

అల్లమ్మయ్య పౌరాణికుడు ఆ రాత్రి స్వామితోనే గడిపినాడు. మరునాడు ఉదయముననే స్వామి వేరే గ్రామమునకు వెళ్లడానికి సంసిద్ధుడుకాగా, అల్లమ్మయ్య స్వామికి నమస్కరించి అక్కడనుండి తన ఇంటికి తిరిగి వచ్చినాడు.

ముందర అధ్యాయము చాలా రసవత్తరమైనది.శ్రోతలు అత్యాదరణీయముగా భక్తితో,శ్రద్ధ-తో స్వామియొక్క కథామృతమును శ్రవణము చేసినచో మోక్షప్రాప్తికి సాధనము కాగలదు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును ప్రేమతో శ్రవణము చేసినట్లయిన పాపములు భస్మము కాగలవు. సద్గురు సిద్ధారూఢస్వామి చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ పదకొండవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ॐ శ్రీ గణేశాయ నమః ॐ శ్రీ గురుభ్యోనమః ॐ శ్రీ సరస్వత్యై నమః

# పండ్రెండవ అధ్యాయము

పద్యానువాదము:—భక్తులపాలిట వరప్రసాదమువై, పరమప్రియుడవై, సచ్చిద్ఘనానందస్వ-రూపుడవై, భక్తులయొక్క చిత్తమందు ఎల్లప్పుడూ నివసించు దీనబంధువై, దీనులయొక్క దుఃఖము-ను నివృత్తిచేయగల సమర్థుడవై, నిత్యానంద నిజస్వరూపుడవై, సకలజీవులకు శాసకుడవగు (నియంతవగు) ఓ సిద్ధనాథ సద్గురుదేవా ! మాకు మోక్షమార్గమును చూపించుము.

శ్రీ సిద్ధారూఢసద్గురునాథా! భక్తుల పాలిట కృపావంత! నీకు శరణుజొచ్చిన వారిని విడువ-కుండా సంసారసాగరమునుండి తప్పకుండా తరింపజేసినావు. నీవు స్వయంగా అనేక దుఃఖముల-ను సహించి భక్తులయొక్క దుఃఖములను హరించెదవు. వారికి మోక్షమార్గమును దర్శింపజేసి సం-సార విపత్తునుండి ఉద్ధరించెదవు.

లోకోద్ధరణయే ముఖ్యకార్యముగాగల సద్గురునాథుడు, ఈ లోకమున సంచరిస్తూ సకల జీవులను సహజంగా ఉద్ధరిస్తూ ఎన్నో ఆశ్చర్యములను చూపినాడు. సిద్ధావధూత యతీంద్రులు దేహసంబంధ అనేక కష్టములను సహిస్తూ యాత్రానిమిత్తమై బయలుదేరినాడు. శరీరము రోగగ్రస్థ-మైనపుడు ఉపవాసముద్వారా రోగనివృత్తి చేసుకునేవాడు. ఇక మనస్సు క్లేశమునొందినపుడు (జనులు హింసించినపుడు) దుఃఖముగూర్చి చింతజేయక, అక్కడనుండి దానిని మళ్ళించి ఆత్మో-న్ముఖము చేసి జీవబ్రహ్మైక్య స్థితియందే నిలిపేవాడు.

ఇట్టి పారమార్థిక సాధనాలద్వారా దేహదుఃఖమును, మనోక్లేశమును నివారించుకుంటూ ఎల్లప్పుడూ బ్రాహ్మీస్థితియందే అవలీలగావర్తించేవాడు. ప్రారబ్ధభోగమునకనుసరించి లభ్యమైన ఆహా-రమును సేవించి క్షుద్బాధతీర్చుకునేవాడు. ప్రత్యేకంగా ఆహారముకోసము ప్రయత్నముచేసేవాడు కాదు. ఈ నిశ్చయముద్వారా సత్యమును తెలుసుకొని ఆసక్తిరహితుడై ఎల్లప్పుడూ స్వతంత్రుడుగా, ప్రశాంతముగా స్వరూపస్థితియందే ఉండేవాడు.

ఇట్టి అవస్థలో సద్గురుదేవుడు అనేక ప్రదేశములను సంచరిస్తూ "గోకావి" అను ప్రదేశములో నదీతీరమునకు వచ్చి, ఆవలితీరమునుచేరుటకు ఒక నావికుని విచారించగా అతడంటాడు.నావ తీరముపైన ఉంది. దానిని నదిలోకి దించాలి. కావున, ఆ నావను లాగుము అంటాడు. సిద్ధనా-థుడు ఎత్తైన ప్రదేశమందున్న నావయొక్క త్రాటినిపట్టి అనాయాసంగా లాగి నీటిలో దించాడు. ఇది

చూసిన నావికుడు ఎంతోమంది లాగిన కదలని నావను ఒక్కడే అనాయాసంగా లాగాడు.ఈయన ఒక గొప్ప సిద్ధపురుషుడున్నాడని అనుకొని, స్వామిని నావలోఎక్కించుకొని ఆవలితీరమున దించు-తాడు.

సద్గురునాథుడు నడుస్తూ నడుస్తూ అక్కడనుండి **"హుబ్లీ"** పట్టణమునకు చేరుకున్నాడు. *"నెత్తిమీద గొప్ప బరువును క్రిందికి దించినట్లయితే ఎంత హాయిగా ప్రశాంతంగా ఉంటుందో"* ఆ విధంగా హుబ్లీ పట్టణమునకు రాగానే స్వామికి అనిపించింది.*[సిద్ధనాథుడు ఇక్కడ ముమ్ముందు ఆశ్రయ-(ము)ము ఏర్పాటు చేసుకొనుటకు అనుకూల స్థలముగా భావించినాడు]* అక్కడనుండి స్వామి "తోవరీవాపీసు" అనే గ్రామమునకు చేరుకున్నాడు.

ఆ గ్రామములో అంతటా అపరిశుభ్రంగా ఉన్నందున క్రిమికీటకాదులు కరుస్తున్నందున స్వామి అనుకుంటాడు–ఎల్లప్పుడు చిత్తము జాగరూకతగా ఉండడానికి ఈ స్థలము అనుకూలంగా ఉంది–అనుకుని స్వామి అక్కడ కొద్దిరోజులు నివాసము చేసినాడు. ఇలా ఉంటుండగా,

కొందరు పిల్లలు స్వామిని చూసి "మదిలేటప్ప" అనే పేరుగల షావుకారి వద్దకు వెళ్లి స్వామి గురించి చెప్పినారు. అప్పుడు అతడు స్వామివద్దకు వచ్చి దర్శించుకున్నాడు. అత్యంత దయ మరియు భక్తియుక్తుడై స్వామియొక్క చేయి పట్టుకుని తనయింటికి తీసుకెళ్లి స్నానాదిక్రియలు చేయించి, పరి-శుభ్రమైన వస్త్రములను ధరింపజేసినాడు. స్వామికి పంచపక్వాన భోజనము సమర్పించి మెత్తనైన పరుపును ఏర్పాటుచేసి విశ్రమింప చేసినాడు. ఈ విధంగా ఏర్పాటు గావించి షావుకారు వెళ్ళిపో-యాడు. ఆ షావుకారు వెళ్ళిపోగానే స్వామి అక్కడనుండి వెనుదిరిగి ఆ స్థానమును విడిచి మళ్లీ ఆ పిల్లలు ఆడుకునే స్థలమునకు (బావి వద్దకు) వచ్చినాడు. వస్త్రములను విడిచివేసినాడు.

సిద్ధనాథుడు ఇంటిలో లేనిది చూసి ఆ షావుకారు స్వామిని వెతుకుతూ వెతుకుతూ బావివద్ద కు వచ్చేసరికి ప్రశాంతంగా ఉన్న స్వామిని చూసి ఈప్రకారంగా అనుకుంటాడు. ఈ మహాత్ముడు ఎంతటి విరక్తుడు, విషయభోగములను అనాయాసంగా లభించినను వాటిని త్యజించి నిరభిమా-నియై ఏకాంతమునుగోరి ప్రశాంతచిత్తుడై ఉన్నాడు. ఈయన వైరాగ్యయుక్తమైన జ్ఞానసంపన్న పురుషుడున్నాడు–అని అనుకున్నాడు.

ఈవార్తను విని గురులింగయ్య శాస్త్రి తన శిష్యులను వెంటబెట్టుకుని స్వామివద్దకు వచ్చి, తనకు కలిగినటువంటి శాస్త్రీయ శంకలను స్వామిని అడుగుతాడు. ఇతర శాస్త్రజ్ఞులు (పండితులు) గూడా స్వామివద్దకు వచ్చి, వారివారి ప్రశ్నలకు సమాధానమును పొంది తృప్తిజెంది ఆనందించారు.

ఒకానొక రోజున "బసవన్న" అనే ఒక భక్తుడు స్వామినిచేరి ఇట్లు ప్రార్థిస్తాడు. సద్గురుదేవా! భక్తులందరూ మీయొక్క ముఖకమలమునుండి వేదాంత శాస్త్రము **"యోగవాసిష్ఠము"**ను శ్రవణము చేయాలని తాపత్రయపడుతున్నారు. కనుక, భక్తుల కోరికమేరకు మీరు దయచేసి మా ఇంటికివచ్చి

ప్రతినిత్యము "**యోగవాసిష్ఠ మహారామాయణము**"ను బోధించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. అప్పుడు స్వామి అనుకుంటాడు–ఈ శరీరము పరోపకారార్థము వచ్చింది. ప్రారబ్ధశేషమును అజ్ఞాని జీవులను ఉద్ధరించుటకుపయోగించాలి–అని నిర్ణయించుకొని, ప్రతినిత్యము ఆ "బసవన్న" భక్తుని ఇంటికి పోయి సాయంత్రము 6 గంటలనుండి 10 గంటల వరకు యోగవాసిష్టము బోధించి వచ్చెడివాడు.

ఒక రోజున గురులింగయ్య శాస్త్రి వచ్చి స్వామిని ఈవిధంగా ప్రశ్నిస్తాడు.ఆత్మ దేహముయందే దేహిరూపముగా ఉన్నదని మీరు చెప్పుచున్నారు. కాని,మాకు ప్రత్యక్షముగా ఘటపటాదులు గోచరించినట్లు కనిపించుటలేదు. సమాధానము చెప్పండి స్వామీ! అని ప్రశ్నించగా—

స్వామి ఆయనకు ప్రత్యుత్తరమిస్తూ—త్వగింద్రియముచేత వాయువు, శీతోష్ణములు తెలియబడుతాయి, అవి నేత్రేంద్రియముద్వారా తెలియబడవు. ఒక ఇంద్రియమునకు (ప్రమాణమునకు) గోచరించునది మరొక ఇంద్రియమునకు గోచరముకాదు. అదేవిధంగా జ్ఞానులకు **"ఆత్మ"** (నా స్వరూపము) సంఘాతమునకు సాక్షియై ఉన్నదని నిశ్చయముగా అనుభవగోచరమగుచున్నది. అజ్ఞానులకు తెలియబడదు. దానికి నేనేమి చేయాలి? అంటాడు.

వాస్తవముగా "**జ్ఞానము**" అని దేనిని అనాలి–విను. మొదట ఆత్మానాత్మ వివేచన చేస్తూ "**అహంబ్రహ్మాస్మి**" అను అంతఃకరణ పరిణామాత్మక జ్ఞానవృత్తి కలుగునంతవరకు సాధన చేయాలి. ఇట్లు, నిత్య నిరంతర ఆదరణీయముగా శ్రవణ,మనన,నిదిధ్యాసనములు చేస్తే–అప్పుడు బ్రహ్మాకారవృత్తి ఉదయించి, "ఆవరణభంగార్థా వృత్తిః"అని చెప్పబడినట్లుగా– పూర్వము ఉండబడిన అజ్ఞానమును, తత్కార్యమగు అనాత్మదేహాదులందలి ఆత్మత్వబుద్ధిని నష్టముచేసి, అటుపిమ్మట"కతకరేణువులు (చిల్లగింజలు) నీటిలోని మురికినంతటిని లేకుండాజేసి అవిగూడా అడుగంటిపోయినట్లు" ఆ బ్రహ్మాకారవృత్తి కూడా లేకుండా పోతుంది. అప్పుడు, చమురు ఒడిసిన పిమ్మట దీపము ఆరిపోయి, ఆ దీపప్రకాశము సామాన్యప్రకాశముచే అభేదమును పొందినట్లు, చిదాభాసునికి(జీవునికి) ఉపాధియగు **'వృత్తి'** నష్టమగుటతోడనే చిదాభాసచైతన్యము సామాన్యచైతన్యము(బ్రహ్మచైతన్యము)తో అభేదమునొందును. ఇట్లు, ఉభయచైతన్య అభేదమునకే **'జ్ఞానము'** అంటారు. "అభేద దర్శనం జ్ఞానమ్". ఈ ప్రకారముగా ప్రత్యగభిన్నపరబ్రహ్మము వృత్తివ్యాప్తికి విషయమగును(తెలియబడును) కాని, ఇంద్రియములకు ఘటపటాదులవలె (ఫలవ్యాప్తికి) విషయము కాదు.

**శ్లో ॥ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితమ్ ।**
**బ్రహ్మణ్యజ్ఞాన నాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా ॥**
**స్వయం స్ఫురణరూపత్వాన్నాభాస ఉపయుజ్యతే ।** (వే.పం.౭-౯౦ & ౯౨)

మరియు ప్రత్యగభిన్నపరబ్రహ్మము శబ్దముయొక్క శక్తివృత్తిచేత కాకుండా, లక్షణావృత్తిచే తెలియబడును. కావున, శబ్దజ్ఞానాన్ని పట్టుకొని నీవు ఎంత ప్రయత్నించినా ఎన్ని శంకలు చేసినా ఆత్మ అనుభవమునకు వచ్చేదికాదు. శబ్దజ్ఞానానికి విషయములు ఘటపటాదులు. కాని, ఆత్మ కాదు. శబ్దజ్ఞానమును పట్టుకుంటే శంకలు దారుణముగా ఉత్పన్నమై చిత్తవిక్షేపమునకు కారణమవుతాయే కాని, సమాధానం మాత్రము దొరకదు. "**సంశయాత్మా వినశ్యతి**".

**శ్లో॥ శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్ ।**

**అతః ప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః ॥** (వి.చూ.62)

ఆచార్యోపదేశముద్వారా ఉపనిషద్రూపశాస్త్రమునుండియే ఆత్మతత్త్వమును తెలిసికొనవలసి యుండును. శాస్త్రకోలాహలమును ఆశ్రయించరాదు. శాస్త్రవాసనగూడ జ్ఞానమునకు ప్రతిబంధకమే యగును.

**శ్లో॥ లోకవాసనయా జన్తో శాస్త్రవాసనయాపి చ ।**

**దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే ॥** (ముక్తికోపనిషత్ 2-2 ; వి.చూ.272)

అప్పుడు "గురులింగయ్యశాస్త్రి" అంటాడు. స్వామీ! మీరు బోధించినది యథార్థమైనది, ఇది ముమ్మాటికి నిజము, సత్యము గురుదేవా! అని ఒప్పుకొని, స్వామికి నమస్కరించి ఆశీర్వాదమును పొంది తన ఇంటికి వెళ్లిపోయినాడు.

సిద్ధనాథుడు తనలోతాను ఇలా అనుకుంటాడు. ఈస్థానమందు జనులయొక్క రాకడ పోకడలు అధికమవుతున్నాయి. ఈ జనసాంగత్యము నాయొక్క మనస్సునకు విక్షేపము కలగజేస్తోంది-అని తలంచి, "డుమ్మేరి" వైపుకు బయలుదేరి వెళ్ళిపోయాడు.

అచ్చట ఒక కట్టపై స్వామి కూర్చొని ఉండగా, పశువుల కాపరి పిల్లలు ఆడుతూ ఆడుతూ స్వామికి చెట్లపైగల పండ్లను తస్కరించి తెచ్చి ఇచ్చేవారు. అప్పుడప్పుడు వినోదము కోసము గోవుల పేడ తెచ్చి స్వామి చేతిలో పెట్టేవారు. ఇట్లు ఆనందముగా కాలము గడుపుతుండగా ఒకరోజున పిల్లలతో సిద్ధనాథస్వామి ఆడుకుంటుండగా ఎప్పటివలె పిల్లలు ప్రక్కన ఉన్న తోటలో ఒక పనసపండు తెచ్చి స్వామికి ఇస్తారు. అదే సమయానికి తోటమాలి పరుగుపరుగున వచ్చి ఈ పనసపండును ఎందుకు తెచ్చారు? ఎవరు తెచ్చారు?అని స్వామిని నిలదీసి అడిగినాడు.

స్వామి అంటాడు. మేము అందరముకలిసి దానిని తినడానికి తెచ్చినాము. అందుకు ఆ తోట యజమాని కోపించి సిద్ధనాథుని రెండు దెబ్బలు కొట్టినాడు. సిద్ధనాథుడు ఆ పనసపండును దూరముగా విసిరివేసినాడు. ఆఫలమును పిల్లలు తీసుకొని పారిపోయినారు. యజమాని కూడా స్వామిని విడిచి ఆ పిల్లల వెంటబడి పరిగెత్తాడు.

వాడు వెళ్లిపోయిన తర్వాత సిద్ధనాథుడు ఈవిధంగా అనుకుంటాడు. శమంతకమణిని దొంగిలించాడని శ్రీ కృష్ణపరమాత్మకు లేనిపోని అకృతనిందలు వచ్చినవి. అట్లే, నేను ఫలమును దొంగిలించకున్నా నాకు ఈ పరిస్థితి ఏర్పడింది. దొంగిలించబడిన మణిని తెచ్చుటకు ఆ వైకుంఠ వాసియగు శ్రీ కృష్ణపరమాత్మ వెదుకుతూపోగా మణితోపాటు జాంబవతి లభించినది. మణిని తెచ్చి-నాక సత్యభామ–ఈ ఇద్దరు పత్నులు ప్రాప్తమైనారు.దొంగతనము మూలంగా భగవంతునికి ఇద్దరు భార్యలు లభించినారు. ఒకప్పుడు భగవంతునికే నిందలుతప్పలేదు, ఇక మాదేమి విశేషము. దొంగ-తనము వలన భగవంతునికి ఇద్దరు భార్యలు సంక్రమించి, లేని సంసారపీడ దాపురించింది. కాని, మాకు ఆ భార్యలు దొరకలేదు, సంసారపీడ రాలేదు. భగవంతుని కన్నా మాకే మేలు జరిగింది.

కర్మఫలాసక్తియుక్తంగా ఉంటే కర్మపాశముచేత కట్టబడతారు. ఫలాసక్తిరహితంగా ఉంటే కర్మపాశమునుండి విముక్తిని పొందుతారు—అనుకుంటూ స్వామి, చిద్ఘనానందస్వామి సమాధి వ-ద్దకు వెళ్లి స్వరూపస్థితిలో ఉంటాడు. (ఫలాసక్తి బంధము.కర్మఫలత్యాగము మోక్షము).

**ద్వే పదే బన్ధమోక్షాయ నిర్మమేతి మమేతి చ ।**

**మమేతి బధ్యతే జన్తుర్నిర్మమేతి విముచ్యతే ॥** (మహోపనిషత్ 4-72 & పైంగలోపనిషత్ 4-26)

**ఆశయా బధ్యతే లోకః కర్మణా పరిబధ్యతే ।**

**ఆయుక్షీణం న జానన్తి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥** (జీవప్రబోధ శ్లోకము)

**ఆశాయాః యే దాసా దాసాస్తే సర్వలోకస్య । ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః ।**

(స్కందపు.2 వైష్ణవఖం.వేంకటాచలమాహాత్మ్యము అధ్యా.20-18)

స్వామి ఆ సమాధివద్ద ఉండగా అనేకమంది లింగాయతులు మరియు ఇతరభక్తులుకూడా స్వామివద్దకు వచ్చి పూజించి ఆశీర్వాదమును పొంది,నమస్కరించి పోవుచుండెడివారు. దినదినము భక్తులు వస్తూ పోతూ ఉంటే స్వామియొక్క ఖ్యాతి నలువైపులా వ్యాపించింది.

ఒకానొక లింగాయతుడు స్వామియొక్క వైభవమునుచూసి అసూయ,ఈర్ష్యకలిగి ఒకనాటి రాత్రి స్వామివద్దకు వచ్చి,స్వామితో ఇట్లంటాడు. నీమెడలో లింగములేదు. నీవు లింగాయతుడవు కాదు. నీవు శూద్రుడవు. లింగాయతులతో పూజలు చేయించుకుంటున్నావు. ఇది చాలా ద్రోహము. నీకు తగిన శిక్ష విధిస్తాను చూడు అంటూ—ఆ దుష్టుడు కట్టపైన కూర్చున్న స్వామిని పైకిలేపి ఒక్క-సారిగా క్రిందకు పడవేసాడు. స్వామి ఒక బండరాయి మీద పడ్డాడు.ఆ దుర్మార్గుడు మళ్లీ కొట్టడానికి ప్రయత్నముచేయగా దూరమునుండి స్వామివద్దకు భక్తులు వస్తున్నట్లుగా ధ్వని వినిపించింది. వాడు ఆ శబ్దమును విని భక్తులు వస్తే స్వామియొక్క ఈ అవస్థను చూసి నా పూజ చేస్తారు-అని అనుకుని భయపడి అక్కడనుండి పలాయనమవుతాడు.

సిద్ధనాథుని శరీరమంతా రక్తమయమైనది. మోకాలు చిప్పలు పగిలినవి. స్వామి చేతితో ఆ రక్తమును తుడుచుకుంటాడు. స్వస్థచిత్తుడై ప్రశాంతంగా కూర్చుంటాడు. ఏ విధంగా పరశరీరమునకు గాయములు తగిలితే ఇతరులకు బాధ కలుగదో,అదేవిధంగా తన శరీరమునకు గాయములు తగిలినా తాను దుఃఖసంబంధము లేకుండా, తన చిత్తమును బ్రహ్మానందమందే విలీనముచేసి స్వరూపానందమును అనుభవించుచున్నాడు.

రెండవ రోజున "హన్నెర్డు"(అనగా పంద్రెండు మఠములకు అధికారి) వచ్చి స్వామియొక్క శరీరము పైనున్న గాయములను చూసి ఇదేమిటి స్వామీ? అని అడిగాడు. సిద్ధనాథుడు సమాధానమిస్తూ:—ప్రారబ్ధకర్మ భోగమునిచ్చి తొందరగా క్షయమవుతుంది. తద్వారా విదేహకైవల్యము ప్రాప్తము కావడానికి నాకు సహాయము చేసింది.

ఇది విని ఆ మఠాధిపతి స్వామీ! ఏదో ద్రోహము జరిగింది—అని తెలుసుకొని, తాను బాధపడ్డాడు. అప్పుడు స్వామిని తన మఠములోకి తీసుకొనిపోయి, గాయములుమాని ఆరోగ్యము కుదుట పడువరకు అనేక ఉపచారములు చేస్తూ ఆ మఠములోనే ఉంచుకున్నాడు. తర్వాత సిద్ధారూఢస్వామి ఆరోగ్యము కుదుటపడినాక మరల ఆ సమాధివద్దకే వచ్చి యథాప్రకారముగా పిల్లలతో దినమంతా ఆడుకుంటూ, రాత్రి సమయమునందు సమాధి స్థితిలో ఉండేవాడు.

ఈ ప్రకారముగా దినదినము భక్తులయొక్క ఆగమనమెక్కువవుతుంటే మూర్ఖులకు సహనముగాక స్వామిని మొత్తమే లేకుండా చేయాలని ప్రాణాంతక కుట్రపన్నినారు. ఒకసారి ఆ మూర్ఖులు అందరూ కలసి స్వామిని బంధించి ఒక పాడుబడిన గోతిలో పడవేశారు. అందులో రాళ్ళు రప్పలు ముండ్లు మొదలగునవి స్వామికి గుచ్చుకున్నాయి. అయినాగాని స్వామియొక్క చిత్తము ప్రశాంతంగా ఉండెను. శరీరమునకు ఎంతబాధ కలిగితే చిత్తమును అంత ప్రశాంతంగా ఉంచుకున్నాడు.

స్వామి ఇంకా చనిపోలేదని ఆ మూర్ఖులు హృదయములో కపటము పూని, ఒకసారి వారు స్వామిని ఒక పాడుబడిన గృహములో ఒంటరిగా అర్ధరాత్రిపూట తీసుకొనిపోయి అందులో బంధించారు. దానియందు కొండదోమలు, నలిమెలు, నల్లులు మొదలగునవి స్వామిని బాధింపసాగినవి. అయినాగాని స్వామి సహించుకుంటూ స్వస్థచిత్తుడై మూడుదినములు ఆగృహమందే ఉన్నాడు. తదనంతరము సాక్షాత్ ఈశ్వరుడు ప్రత్యక్షమై ఈ విధంగా అంటాడు.

లే నాయనా లే! పరమ ప్రియుడవైన నాయొక్క భక్తుడా లెమ్ము. నిన్ను ఈ సంకటమునుండి విడిపించడానికి నేను వచ్చాను—అని స్వామియొక్క దేహమంతటా ఈశ్వరుడు చేతులతో నిమిరినాడు.శరీరమునకు కలిగినటువంటి బాధలు తగ్గినవి.గాయములు మానినవి. తాళము దానంతట అదే ఈశ్వరుని మహిమవలన పగిలి క్రిందపడింది. ద్వారము తెరుచుకుంది. స్వామి బయటకువచ్చి ఎప్పటివలె ఉన్నాడు. తన శరీరమునకు ఎన్ని సంకటములు వచ్చినాగాని, వాటి నివారణార్థము తాను

ఈశ్వరుని ఎప్పుడు ప్రార్థించలేదు. తనను రక్షించమని వేడుకోలేదు. అయినాగాని ఈశ్వరుడు తన యొక్క భక్తుని ఆపదలను చూసి భరించలేక తాను స్వయంగా వచ్చి కాపాడినాడు.

మతాభిమానులయిన లింగాయత మూర్ఖులు స్వామిని ఎన్ని ఉపాయములు పన్ని శిక్షించినా గాని మరణించడం లేదని మరొక పన్నాగము పన్ని, అందరు కలిసి గ్రామములోని చావడివద్ద ఒక గొప్ప బహిరంగసభ ఏర్పాటుచేసి ప్రజలనుద్దేశించి, ఇతడు శూద్రుడున్నాడు.ఈయనకు ఎవరుకూడా పూజలు, నమస్కారములు చేయకూడదు. అట్లు చేసిన వారికి తగిన శిక్ష విధించబడును—అని ప్రజలందరిని మరీ హెచ్చరించి చాటి చెప్పినారు.

అయినాగాని ముముక్షుజనులు వారి మాటలను లెక్కచేయక స్వామివద్దకు యథాప్రకారంగా వచ్చి నమస్కరించి దర్శించుకుని స్వామియొక్క ఆశీర్వాదములు పొంది వెళ్ళేడివారు. అది చూసిన ఒక లింగాయతుడు "హందరయ్య" అను పేరుగల దుర్మార్గుడు సహించలేక—ఒకనాడు రాత్రి సమ-యమున నిద్రించుచున్న స్వామిని లేపి, వానియొక్క పాదరక్షలు స్వామి శిరస్సుపై పెట్టి ఈ పాద-రక్షలను క్రిందపడకుండా కదలకుండా నిలబడగలవు. లేనిచో నీకు తగిన శాస్తి చేస్తాను. నీవు మరణించు వరకు కొడతాను—అని ఆజ్ఞాపించినాడు. స్వామి సరేనని ప్రశాంతంగా నిలబడ్డాడు. ఒక గంటసేపటికి స్వామికి కాళ్లు మంటలు మండినట్లు బాధగలిగి కొంచెం కదిలినాడు. వెంటనే శిరస్సు-పైగల పాదరక్షలు క్రిందపడినవి."హందరయ్య"కోపమునకు వచ్చి తన దగ్గరనే ఉన్నటువంటి కల్లు లొట్టిని చూపిస్తూ కట్టెతో తన ఇష్టము వచ్చినట్లు కొట్టి, ఒకవేళ నీవు ఆరూఢ పురుషునివైతే నీకు సమదర్శనమున్నట్లయితే, ఈ కల్లు (మద్యము) త్రాగుము—అప్పుడు నీవు భేదరహిత ఆరూఢ పురుషునివని అనుకుంటాను. లేకుంటే నీవు ఆరూఢ పురుషునివి కావు. నీవు శూద్రుడవు—అని అంటూ, వాడు తన ఇష్టం వచ్చినట్లు వేధిస్తూ, కొట్టుతూ, కాళ్ళతో తన్నుతూ, రాత్రంతా ఈ విధంగా వ్యవహరించాడు.

ఇంతలో ప్రభాతసమయమైనది.అప్పుడు సిద్ధనాథుడు హందరయ్యతో ఈప్రకారంగా అంటా-డు. ఇప్పుడు నాయొక్క భక్తులు వచ్చే వేళ అయింది.వారు వచ్చేవరకు నీవు ఇక్కడే ఉంటే,ఈ నా పరిస్థితినిగాంచి నిన్ను యథేచ్ఛగా సత్కరిస్తారు. ఇంతదనుక నిర్విఘ్నంగా నీయొక్క సత్కారము జరిగింది. నీయొక్క వ్యవహారము కొనసాగింది. ఇప్పుడు భజన సమయమైనది. ఇక్కడనుండి తప్పుకో. నీవు నాకు ఇంతవరకు చేసిన ఉపచారమును వారు చూస్తే నిన్ను తీవ్రంగా కొట్టెదరు. అది చూసి నాకు సహనము కాదు.

ఇటువంటి శాంతస్వరూపమైన పలుకులను విని ఆ హందరయ్య అక్కడనుండి పలాయనమై-నాడు. అప్పుడు భక్తులందరూ వచ్చి సద్గురువుయొక్క దుర్భర పరిస్థితిని కండ్లనిండాగాంచి కల్లోలిత హృదయులై, ఎంతో దుఃఖముతో స్వామిని ఇలా అడుగుతారు. స్వామీ! ఏమిటీ అపచారము, ఏమిటీ

అన్యాయము? ఈ దుస్థితి ఎలా జరిగింది? నిన్ను ఇంత పని చేసిన ఆ దుర్మార్గులు ఎవరు? చెప్పండి స్వామీ, వారిని మేము వెంటనే శిక్షిస్తాము. నీయొక్క పరిస్థితిని చూస్తుంటే రాత్రి ఎవరో దుష్టులు వచ్చి కొట్టినట్లుగా ఉంది. వారు ఎవరో చెప్పండి స్వామీ!వారికి తగిన చికిత్స చేస్తాము– అని ఆ భక్తులు విలపిస్తూ అడుగుతారు.

వారియొక్క ఆవేశమును గ్రహించి, స్వామి హాస్యవదనుడై ఇలా అంటాడు. ఏది జరగవలసి ఉండెనో, అది జరిగిపోయింది. దానికి మీరు వ్యథ చెందనవసరము లేదు. ప్రారబ్ధకర్మానుసారము సుఖదుఃఖములు ప్రాప్తమవుతాయి. ప్రారబ్ధకర్మ ఫలమునిచ్చే నివృత్తమవుతుంది.దానిని నివారించ-డానికి ప్రయత్నిస్తే, అది సంచితకర్మలలో గణనమై, మళ్లీ ముందు జన్మకు కారణము కాగలదు. కాబట్టి, ప్రారబ్ధమును తప్పించుకో కూడదు. తప్పకుండా అనుభవించాల్సిందే. తద్వారా ప్రారబ్ధము సమూలంగా క్షీణించి మోక్షమునకు ప్రతిబంధకము కానేరదు.

**శ్లో॥ అవశ్యం భావిభావానాం ప్రతీకారో భవేద్యది ।**

**తదా దుఃఖైర్న లిప్యేరన్నలరామయుధిష్ఠిరాః ॥** (వే.పం.7-156)

**శ్లో॥ యదభావి న తద్భావి భావిచేన్న తదన్యథా ।**

**ఇతి చిన్తావిషఘ్నోఽయం బోధో భ్రమ నివర్తకః ॥** (వే.పం.7-168)

జరుగక తప్పనిదగు ప్రారబ్ధమునకు ప్రతీకారముండినచో నలుడు,శ్రీరామచంద్రుడు మరి-యు ధర్మరాజు కష్టములపాలు గాకుండెడివారు.కానిది కానేకాదు. కానున్నచో అది కాక పోనేపో-దు—అను బోధ భ్రమను పోగొట్టును, దుఃఖమను విషమును హరించును.

మోక్షేచ్ఛగల అధికారిపురుషుడు ఇతరులయొక్క దూషణలకు, నిందలకు, వందనములకు వికారమును పొందక అంతఃకరణమును శాంతముగా సమదృష్టిగలిగి ఉంచుకోవాలి. కష్టసుఖము-లను సహించాలి. ఇటువంటి ప్రేమపూర్వకమైన వచనములను విని భక్తజనులంతా సద్గదితులై, అ-శ్రుపూరిత నేత్రములతో,ఈ మహానుభావుడు సాక్షాత్తు పరమాత్మ ఉన్నాడనుకొని, చాలాసేపు స్వామివద్ద కూర్చొని దుఃఖసంతప్తచిత్తులై, సద్గురువునకు నమస్కరించి వారివారి ఇండ్లకు వెళ్లి పోయినారు.

సిద్ధనాథునికి ఎవరో ఒకరు ఒక దోతిని ఇచ్చి ఉండెను. దానిని ఒక పాపిష్టివాడు అపహ-రించుకొని పోయినాడు. కాని, వానిని స్వామి వారించలేదు. ఏదేని వస్తువు ప్రాప్తమైనపుడు ఆయనకు హర్షము కలుగలేదు. ఆ వస్తువు నష్టమైతే ఖేదము పొందలేదు. "**నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా**" (గీత. 2-57)

ఒకానొకప్పుడు సిద్ధారూఢస్వామి "హెగ్గేరి చునేగచ్చి"కట్టపైన కూర్చొని ఉండగా, ఒక లింగా-యతుడు నెత్తిపైన అన్నము తట్ట పెట్టుకొని, చేతిలో అగ్నియుక్తమైన పిడుకను పట్టుకొని పోవుచు,

స్వామిని చూసి, *"జనులకు ఈయనపట్ల-ఒక సాధువని పిచ్చిపట్టింది"* – అనుకొని, స్వామియొక్క మౌనస్థితిని గాంచి స్వామిని పరీక్షించడానికి, వాడు తన చేతిలోని నిప్పుతోయుక్తమైన పిడుకను స్వామియొక్క శిరస్సుపైన పెట్టినాడు. పిడుక మండుచునేయున్నది. స్వామి స్వస్థచిత్తుడై ప్రశాంతముగా కూర్చున్నాడు సద్గురునాథుడు తనలో తాను ఇలా చింతిస్తున్నాడు. నాయొక్క చిన్నతనమున నా తలపైన ఒక సర్పము ఎక్కియుండెను. అప్పుడు నేను ఇలా అనుకున్నాను."ఈసర్పము ఈశ్వరుని యొక్క మస్తకముపైన భూషణముగా ఉండవలసింది. నాయొక్క శిరముపైన ఎక్కింది. నా శిరమును శోభింప జేస్తుంది". అదేవిధంగా ప్రస్తుతము ఈశ్వరునియొక్క మూడవకన్ను అగు జ్ఞాననేత్రమును నాయొక్క శిరముపైన ఉంచాడు—అని అనుకుంటున్నాడు. కాని, ఆ పిడకను మాత్రము తొలగించే ప్రయత్నముచేయక ప్రశాంతంగా కూర్చున్నాడు.

అప్పుడు ఒక పురుషుడు త్రోవన పోవుచుండగా, సిద్ధనాథునియొక్క స్థితినిచూసి తొందరగా వచ్చి తలపైనున్న పిడకను కట్టెతో తొలగించి,ఆ లింగాయతుని ఇలా తిట్టినాడు–మహాత్ములను ఎవరైతే పరిహసించి, హింసించుదురో వారికోసం బ్రహ్మదేవుడు వైతరణీ నదిని నిర్మించినాడు. మహాత్ములను శిక్షించినవారు నరక యాతనలను అనుభవిస్తూ ఆ దారుణమైన నదియందు కొన్ని కల్పములవరకు ఉందురు గాక!

"భీమప్ప ఉజ్జన్నవర్" అను భక్తుడు పుత్రసంతానమును కోరి అనేక సత్కర్మలు చేసినాడు. అయినాగాని ఆయనకు సంతానప్రాప్తి కలుగలేదు. ఇక చివరకు సద్గురుదేవుడైన సిద్ధనాథున్ని ఆశ్రయించి, ఆయనపై విశ్వాసముంచి, స్వామికి సేవలు అందించుచున్నాడు. చాలాకాలము వరకు అనన్యభక్తితో స్వామికి సేవచేసి, ఒకనాడు ఆ భక్తుడు స్వామికి పుత్రసంతానము ప్రసాదించమని దీనవదనుడై ప్రార్థిస్తాడు.

ఇది విని సద్గురునాథుడు ఆయనతో ఇలా అంటాడు. అయ్యా! నీకు పుత్రుడు కావాలి గదా! ఎటువంటి పుత్రుడు కావాలి? జ్ఞాన పుత్రుడు కలిగినట్లయితే ఆయనవలన రెండు వంశములు (తండ్రి వంశము, తల్లి వంశము ఏడు పిడీలపర్యంతము) ఉద్ధరింపబడి పునీతులవుతారు. ఇటువంటి జ్ఞాన పుత్రుడు కావాలా? లేక కర్మరచిత పుత్రుడు జన్మించినచో సంసార తాపము (దుఃఖము) వృద్ధి అవుతుంది. కావున, ఈ కర్మరచితపుత్రుడు కావాలా? అని అడుగుతాడు.

అప్పుడు భీమప్ప సద్గురుసేవాజనిత శుద్ధాంతఃకరణము కలవాడు—కాబట్టి,నాకు జ్ఞానపుత్రుడే కావాలి స్వామీ- అని అంటాడు.

అప్పుడు స్వామి ఆయనతో అంటాడు అట్లైనచో నన్నే నీ పుత్రునిగా భావించుకొని ఉంచుకో—

తద్వారా నీకు కర్మరచిత పుత్రుని వలన లభించునటువంటి సంసారతాపము కలుగదు. అక్షయ ఫలమే దొరుకుతుంది. ఈ వచనములను విని భీమప్ప సంతోషించి సిద్ధారూఢస్వామిని తన కుమారునిగా భావించుకొని తన ఇంటియందే ఉంచుకుంటాడు.

ఇట్లు, సిద్ధారూఢస్వామి భీమప్ప యింటిలో ఉంటూ అనేక లీలలను ప్రకటము జేస్తూ తనను ఆశ్రయించిన భక్తులను మరియు ఆ దంపతులను ఉద్ధరించి ఆనందమును కలుగజేస్తాడు.

లింగాయతులందరూ భీమప్పను నిందించినారు. నీవొక శూద్రునితో సంబంధము పెట్టుకుని, వానిని నీ పుత్రునిగా స్వీకరించినావు. కావున,నిన్ను కులమునుండి బహిష్కరిస్తున్నామని, కులబహిష్కారము చేసినారు. అయినాగాని భీమప్ప వారికి భయపడక శాంతచిత్తుడై, స్వామిని ఇంట్లోనే ఉంచుకున్నాడు.

ఇక, ముందర అధ్యాయము అనేక లీలలచేత అద్భుతంగా ఉంటుంది. ఎవరైతే భక్తియుక్తముగా శ్రవణము చేస్తారో,వారియొక్క సకలదుఃఖములు నివృత్తమై, అపారమైన సుఖము లభించును. మంగళప్రదమైన, శుభప్రదమైన శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినట్లైతే సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి శ్రీ సిద్ధారూఢ చరణారవిందములకు ఈ పంద్రెండవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదమూడవ అధ్యాయము

**పద్యానువాదము:—**భవజలధినుండి నన్ను తరింపజేయగల, అగణితసుఖప్రదాతవగు, దీనులకు తల్లివంటి ఓ సద్గురు సిద్ధనాథా! నీవు నాకు తోడుగా ఉండి సహకరించగలవు. నీయొక్క అభయహస్తమహిమచే సకలజీవులు భవసాగరమునుండి శీఘ్రముగా తరించుదురు.అందుకని ఓ సద్గురు మావులీ(తల్లీ)!నీయొక్క చరణకమలములను వదలక ఎల్లప్పుడు ఆశ్రయిస్తాను. కావున నన్ను ఉద్ధరింపుము స్వామీ!

జయము జయము సిద్ధారూఢ భగవంతా!నీవు సకల అనాథలను రక్షించి,ముముక్షువులను మోక్షమార్గమునందు ప్రవేశింపచేయు మహాత్ముడవు. నీయొక్క కీర్తి ముల్లోకములందు వ్యాపించి-నది. సకలజీవులయొక్క కళ్యాణముగూర్చి నీయొక్క కథామృతమును ప్రకటము చేయించుకున్నావు. ఏ భక్తులైతే భక్తిశ్రద్ధలతో వింటారో, చదువుతారో వారియొక్క సకలపాపములు నివృత్తమై నిత్య-ముక్తులవుతారు.

గత అధ్యాయమునందు భీమప్ప సిద్ధనాథుని తన పుత్రునిగా భావిస్తూ తన ఇంటియందు ఉంచుకున్నాడు. సిద్ధనాథుడు భీమప్ప ఇంటియందు ఉంటూ ఆహ్లాదకరమైన ఎన్నో లీలలు చూపించి నాడు. **హుబ్లీ** పట్టణమందు గౌరీదేవి రథోత్సవముగూర్చి సన్నాహము జరుగుతుందని కార్యక్రమము గూర్చి ఏర్పాట్లు ముమ్మరంగా సాగుతున్నాయి. ఇంతలో ఊరిలోనే భక్తులమధ్య మనస్పర్ధలు ఏర్పడి వివాదము చెలరేగింది. *(సిద్ధ యతీంద్రునికి భక్తులు, శిష్యులు అనేకమైనారు. ఆ భక్తులు గౌరీదేవికి బదులుగా సిద్ధనాథుని రథముపై కూర్చుండబెట్టి ఊరేగించెదమన్నారు. ఇతరులు సమ్మతించలేదు. ఇదీ వివాదము).*

వివాదము రథోత్సవమునకు ప్రతిబంధకమైనది. ఆ తరువాత కొంతసేపటికి ఇరుపక్షాల వారు ఐకమత్యమునొంది, స్వామి"డుమ్మేరి"కట్టమీద కూర్చుని ఉండగా స్వామివద్దకువచ్చి నమస్క-రించి, ఈప్రకారముగా విన్నవించుకున్నారు. ఓ ప్రభో! మాయందు కరుణించి మాయొక్క వినతిని వినండి. మేము తొమ్మిది కలశములుగల రథమును చేసినాము. దానిపై ఏ దేవిని కూర్చుండబెట్టి ఊరేగించాలి? నీవు మహాసత్పురుషుడవున్నావు. నీకంటే అన్యమైన దేవతావిశేషము లేదు.రథముపై

కూర్చొనుటకు మీరే యోగ్యులు. దానిపై మీరు అధిరోహించి మాయొక్క వివాదమును దూరం చేయండి స్వామీ!—అని, ఇరుపక్షాల వారు సిద్ధనాథుని తొందరగా వచ్చి రథముపైన కూర్చోమని వేడుకొని, వారి సమ్మతమును వెలిబుచ్చినారు. ఓ సద్గురుదేవా! నీవు ఈ రథమును, రథోత్సవ-మును నడిపించమని ప్రార్థిస్తూ—మాకు అందరకు ఆనందమును చేకూర్చమని, మాయొక్క నేత్ర-ములను ఆనందభాష్పాలతో నింపుమని అర్థిస్తారు.

వారియొక్క మాటలు విని స్వామి తనలో తాను ఈ విధంగా చింతిస్తున్నాడు. ఒకనాడు ఈ శరీరము అనేక యాతనలు అనుభవించింది. ఇప్పుడు ఈ శరీరమునకు ఊరేగించే సమయమొ-చ్చింది. ప్రారబ్ధమెంత విచిత్రమైనది. అనుకుంటూ స్వామి లేచి బయలుదేరినాడు. స్వామిని భక్తు-లందరూ రథమువద్దకు తీసుకొచ్చి, వస్త్రాభరణములతోనలంకరించి, స్వామికి జయ జయకారములు పలుకుతూ రథములో కూర్చుండబెట్టినారు.

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహారాజ్ కీ జై .........

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహారాజ్ కీ జై .........

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహారాజ్ కీ జై .........

సిద్ధనాథస్వామి అందరిని ఉద్దేశిస్తూ **"కళ్యాణమస్తు"**అని అందరిని ఆశీర్వదించినాడు.అందరి హృదయములు ఆనందముతో ఉప్పొంగి పోతున్నాయి సిద్ధనాథుడు రథమునందు కూర్చొని ఉండ-గా భక్తులు దర్శించి సంతోషిస్తారు.

సిద్ధమూర్తిని తన కుమారునిగా భావించుకున్న భీమప్పయొక్క ఆనందమునకు హద్దులు లేవు. నదీప్రవాహములాగా సంతోషము పొంగిపొర్లుతుంది. భీమప్ప తనవద్ద ఉన్నటువంటి బంగా-రమును అమ్మి ఉత్సవమునకు ఖర్చుచేస్తున్నాడు.భీమప్ప నమ్రభాషణముతో భక్తులందరినీ తన ఇంటికి భోజనమునకు రమ్మని ఆహ్వానిస్తూ, రథోత్సవములో పాల్గొన్న భక్తులందరూ ఊరేగింపు ముగిసిన పిమ్మట మా యింటికివచ్చి భోజనముచేసి పొమ్మని విన్నవించుకున్నాడు. భోజనసదు-పాయాలు కల్పించి, అన్ని ఏర్పాట్లు చేసినాడు. సిద్ధనాథుడు భీమప్పకు మరియు అందరి భక్తులకు ఆశీర్వాదమిచ్చి తృప్తినొసంగుతాడు.

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి రథముపైన కూర్చుని తనలో తాను ఈ విధంగా చింతించుచు-న్నాడు. 72 నాడులచే యుక్తమైన శరీరరూప రథముపై "ఆత్మ" అనే స్వామి కూర్చున్నాడు.

**ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవతు ।**

**బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

**ఇంద్రియాణి హయానాహుః విషయాంస్తేషు గోచరాన్ ।**

**ఆత్మేన్ద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥** ( కఠ.1-3-3 )

మనస్సును వశమొనర్చుకొన్నవిద్వాంసులు—పంచజ్ఞానేంద్రియములను, పంచకర్మేంద్రియ-ములను గుఱ్ఱములనియందురు. ఇంద్రియార్థములగు శబ్దస్పర్శరూపరసగంధములను (పంచవిష-యములను) మార్గములందురు. మరియు మనస్సుద్వారా ఇంద్రియములతోగూడి పనిచేయు జీవాత్మను భోక్తయని చెప్పుదురు.

సకల జ్ఞానేంద్రియ,కర్మేంద్రియములకు స్ఫురణశక్తినిస్తూ, జాగ్రదాద్యవస్థలకు సాక్షియై,సుషు-ప్త్యవస్థయందు ఆనందఘనుడై(ప్రజ్ఞానఘనుడై)సకలప్రపంచమునెవరు ప్రకాశిస్తున్నారో, అటువంటి బ్రహ్మస్వరూపుడను నేనే ఉన్నాను.

**శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥** ( కైవల్యోపనిషత్ )

రథోత్సవము ముగిసిన పిమ్మట స్వామి, రథమునుండి దిగి యథాపూర్వముగా "డుమ్మేరి" కట్టమీదికి వెళ్లికూర్చుంటాడు. తదనంతరము ప్రతిరోజు అనేకమంది భక్తజనులు తండోపతండము-లుగా స్వామివద్దకు వచ్చి ఎంతో ద్రవ్యమును ఖర్చుచేస్తూ స్వామియొక్క సమారాధన గావించి, దర్శించి, ఆశీర్వాదమును పొందేవారు. ఏస్థానమందైతే స్వామి నివసించియున్నాడో, అచ్చటకు వచ్చిన భక్తుల కోసము భీమప్ప భోజన ఏర్పాట్లుచేసి, వారిని తృప్తిపరిచేవాడు.

"కారడగి మల్లప్పన్న" మరియు "శిరగుప్పి హొంబన్న" అను భక్తులు సిద్ధనాథునియందు భక్తి శ్రద్ధలు గలవారై, అచట రెండు ధర్మశాలలు నిర్మించినారు. ఈ విధముగా మనోహరమైన అరణ్యప్ర-దేశమందు "సిద్ధాశ్రమము"ను ఏర్పాటుచేసి నీటి సౌకర్యార్థము కొఱకు ఒక బావినిగూడ త్రవ్వించి-నారు. అదే సమయానికి ఆ సంవత్సరము సకాలమునకు వర్షములు పడక క్షామము ఏర్పడినది. ఆకలిచే పీడితులైన భక్తులందరికీ భోజన ఏర్పాటుచేసి వారిని ఆదుకున్నారు. ఇట్టి కార్యక్రమము స్వామికి ఎంతో ఆనందమును కలిగించింది. అన్నదానశిభిరాన్ని ఎవరైతే ఏర్పాటు చేసినారో, వారు విశేషముగా అన్న పూర్ణాదేవి కృపకుపాత్రులై దేహావసానమున ముక్తిని బొందుదురు గాక! అని స్వామి వారిని ఆశీర్వదించినాడు.

కార్తీక శుద్ధ పూర్ణిమ రోజున "హొంబన్న"అనే భక్తుడు బీదసాదలకు అన్నదానముచేసి సం-తోషపరచినాడు. స్వామికి ఎంతో సంతోషం కలిగింది. గ్రామంలోని షావుకారులందరూ కలసి ప్రతి సంవత్సరము ఇలాగే చేయాలని నిర్ణయించుకున్నారు. ఆ పున్నమి రోజున భక్తులకు అన్నసంతర్పణ గావించడమేకాకుండా స్వామికి మండపపూజచేయుటకు ఏర్పాటుగావించి,స్వామికి పాదపూజ, అర్చనలు గావించి, సత్కరించి, రథోత్సవము గావించి, స్వామిని ఊరేగించాలని నిర్ణయించినారు.

ఇట్లు కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట, ఈ విధంగా మహా వైభవముగా జరుగుచున్న ఉత్సవమును శివునియొక్క పవిత్ర పర్వదినమగు శివరాత్రి రోజున జరుపుకుంటే బాగుంటుందని

అభిప్రాయపడి, ఆ గ్రామభక్తులు మరియు షావుకారులు "శివరాత్రి" పండుగరోజున జరపుటకు నిర్ణయించినారు.అప్పటినుండి ప్రతిసంవత్సరము మహాశివరాత్రి పండుగ రోజున ఘనంగా మహా వైభవముగా ఉత్సవము జరుపబడుతుంది. ఉత్సవమును వీక్షించడానికి భక్తజనులు తండోపతండాలుగా వస్తారు. ఇచ్చట ఏడురోజులు సప్తాహము బ్రహ్మాండంగా జరుపబడుతుంది. అర్చనలు, ఆరాధనలు, పంచాక్షరి మంత్రోచ్చారణ(శివనామస్మరణతో)అఖండంగా చేయబడుతుంది.

**ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ ............**

సప్తాహము జరిగినన్ని రోజులు ప్రతినిత్యము బ్రహ్మముహూర్తముననే స్వామియొక్క పూజా మండపమును అలంకరించేవారు.స్వామి స్వయంగా వేదాంతశాస్త్రమును ఆ మండపంలో కూర్చుండి బోధించేవాడు. అట్టి అమృతస్వరూపమైనబోధను భక్తులు పానముచేసేవారు. శాస్త్రము, భజనలు ముగిసిన పిమ్మట సకల వర్ణముల భక్తులకుకూడా అన్నదానము చేయించి అనాథలను తృప్తిపరిచేవారు. రాత్రిపూట కీర్తనలు,భజనలు విశేషంగా జరుపబడుచుండెడివి. కీర్తనకారులు ఎక్కువగా జ్ఞానమునే ప్రతిపాదించేవారు. కొందరు భక్తిని బోధించేవారు. ఈప్రకారముగా ఏడురోజుల సప్తాహము మహావైభవముగా జరుపబడుతుంది. చివరిరోజున సిద్ధనాథస్వామిని రథముపై కూర్చుండ బెట్టి ఊరేగించేవారు. ఈ మహావైభవము కన్నులపండుగగా సకలజనులకు ఆనందమును చేకూర్చుతుంది. అపూర్వమైన ఆ శుభదినమున సర్వజనులు పరిపూర్ణమైన ఆనందమునొందేవారు. ఎవరియొక్క పుణ్యము అగణితముగా ఉంటుందో, వారికి ఈ మహోత్సవమును దర్శించే భాగ్యము కలుగుతుంది. సద్గురుదేవుని దర్శనముద్వారా వారు ఈ జన్మమునందే జీవన్ముక్తులు కాగలరు.

జ్ఞానప్రదాతయగు సిద్ధనాథుడు శిష్యులయొక్క మనస్తాపరూప త్రివిధ దుఃఖములను, అజ్ఞానమును నివారించి, భవసాగరమును తరింపజేసేవాడు. ముముక్షువులను పరిపాలించేవాడు.నది ఎక్కడో పుట్టి ఎంతో ఆతురతతో ప్రవహిస్తూ సముద్రమును వెతుకుతూవెతుకుతూ ఎక్కడైతే పూర్ణమైన విశ్రాంతి లభించగలదో, అట్టి సముద్రమును చేరుకుంటుంది. అదేవిధంగా ముముక్షుజనులు సద్గురుదేవునియొక్క జాడతెలుసుకుంటూ వెతుకుతూవెతుకుతూ సద్గురుసన్నిధానమునుచేరి,సద్గురుచరణ కమలములనాశ్రయించి పరిపూర్ణమైన శాంతిని పొంది తరించేవారు.

ఇట్లు, సచ్చిదానందస్వరూపమైన సద్గురు సిద్ధనాథస్వామి సిద్ధాశ్రమమందు విరాజమానమై యుండగా ఒకానొక సమయమున ఒక సంఘటన ఇట్లు గడించినది.

ఒకానొక బాలుడు దుఃఖరూపమైన సంసార దావానలముచే సంతప్తుడై, నాకు కలిగిన ఈ జన్మమరణరూప మహాదుఃఖమును ఎవరు నివృత్తి చేయగలరు? సద్గురుదేవుడు తప్ప ఎవరు నివారించలేరు—అనియిట్లు విచారించి, శుభేచ్ఛతో ఆ బాలుడు సద్గురుదేవుని అన్వేషణలో బయలు- దేరి

అనేక దేశములు తిరుగుతూ తిరుగుతూ సిద్ధారూఢస్వామియొక్క కీర్తిని, వైభవమును తెలుసుకొని సిద్ధాశ్రమము చేరుకున్నాడు.

ఆ బాలుడు సద్గురు సిద్ధారూఢస్వామిని దర్శించగానే దూరంనుండి దైన్యభావముచేత సాష్టాంగ నమస్కారములుచేసి సద్గురువును సమీపించి అష్టవిధముల స్తుతిచేసినాడు. ఓ సద్గురు దేవా! దీనబంధూ!ఈదీనునిపై దయతలచి నాయొక్క మనస్తాపరూప దుఃఖమును నివృత్తిచేయుము. ఓ పరశివమూర్తీ! అందుకు నీవే సమర్థుడవు. ఈ ప్రకారముగా స్తుతిస్తూ ఆ బాలుడు అంజలిబద్ధుడై స్వామి సమీపమున నిలబడినాడు. స్వామి,ఆ బాలునిచూసి ఆయనయొక్క యథార్థమైన అధికార-మును పరీక్షింపగోరి ఉదాసీనుడై కూర్చున్నాడు.

అప్పుడు ఆ బాలుడు తనలో తాను ఈవిధంగా అనుకుంటాడు. నాయందు వివేకము,వైరా-గ్యము, షట్సంపత్తి మరియు ముముక్షుత్వమను అధికారత్వము లేదనుకొని స్వామి ఉదాసీనంగా ఉన్నాడు కాబోలు.ఏవిధంగా రూపజ్ఞానము చేసుకొనుటకు నేత్రమే సాధనమున్నదో, అట్లే గురుకృప కలగాలంటే "గురుసేవ"యే ముఖ్యసాధనమని తలంచి, దేహాభిమానరహితుడై ఆ బాలుడు గురుసేవ యందు పాల్గొన్నాడు.ఆ బాలునికి దృఢమైన విశ్వాసము, అధికారత్వమున్నదా లేదా అని పరీక్షించు-టకు స్వామి అతనికి అప్పుడప్పుడు అన్నముకూడా పెట్టకుండేవాడు.అయినాగూడా ఆ బాలుడు పూర్ణ సద్భావముచేత గురుసేవాతత్పరుడై,స్థిరచిత్తుడై ఉన్నాడు. ఆ శిష్యునియొక్క సంపూర్ణ నిరభిమాన స్థితి, సేవాభావమును గ్రహించి, స్వామి ఆ బాలునికి **"కబీరు"** అని పేరు పెట్టినాడు.

ఒకానొక సమయమున కబీరును స్వామి తన సమీపమునకు పిలుచుకొని కూర్చుండుమని ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు ఆ కబీర్ తొందరగా వచ్చి స్వామికి సాష్టాంగ నమస్కారములు సమర్పించి లేచి నిలబడినాడు. చేతులు జోడించి స్వామి ఏమి ఆజ్ఞాపిస్తాడో అని ఉత్సుకతతో స్వామి వైపు చూడ సాగాడు.అతనిని పరీక్షించడానికి దయాఘనుడైన స్వామి, కబీరుతో ఇలా అంటాడు.

జ్ఞానసాధ్యమగు మోక్షమునకు వివేకమను ఒక సాధనముంటే సరిపోవునుగదా! ఇతర సాధనలెందుకు?

అప్పుడు కబీర్ జవాబిస్తూ:–వైరాగ్యము లేని వివేకము నిర్జల ఉషరభూమిలో నాటిన అరటి మొక్కలవలె నిష్ఫలమగును.

**శ్లో ॥ చిత్రామృతం నామృతమేవ విద్ధి, చిత్రానలం నానలమేవ విద్ధి ।**

**చిత్రాఙ్గనా నూనమనఙ్గనేతి వాచావివేకస్త్వవివేక ఏవ ॥** (శ్రీయోగవాసిష్ఠము స్థితిప్ర. 18-69)

ఓ శ్రీరామా!చిత్రములో లిఖించబడిన అమృతమునుగాని, జలమునుగాని, అగ్నినిగాని, ఆభ-రణములనుగాని—అనమృతముగాను,అజలముగాను,అనగ్నిగాను అనాభరణములుగాను తెలియు-ము. మరియు చిత్రములో లిఖించబడిన స్త్రీ-స్త్రీకాదు. అట్లే, వాక్కులచే ప్రదర్శింపబడు వైరాగ్యము-

లేని వివేకము వివేకమే కాదు.

అప్పుడు స్వామి అంటాడు. అయితే వివేక వైరాగ్యములు రెండు ఉంటే సరిపోతుంది కదా! మరి ఇంకా ముందర సాధనలెందుకు? లేకుంటే సరిపోతుంది కదా!

అప్పుడు శిష్యుడంటాడు. శమదమాదులు లేని వివేకవైరాగ్యాదులు విధవస్త్రీ ధరించిన ఆభ-రణములవలె శోభించవు. ఇంద్రియనిగ్రహము(దమము)ద్వారా మనోజయము(శమము) కలుగు-తుంది. శమదమాదులు ఉంటేనే వైరాగ్యము స్థిరపడును. వైరాగ్యముంటేనే సజల సరసభూమిలో నాటిన అరటిమొక్కలవలె వివేకము సఫలమగును.. (వివేకమనగా=అవినాశి ఆత్మ, తద్భిన్నమైనది అనాత్మ=ఈ దేహాదిక ప్రపంచము). కావున,శమమునకు దమము, వైరాగ్యమునకు శమము, వివే-కమునకు వైరాగ్యము ఈ ప్రకారముగా ఒకదానికొకటి పరస్పర పూరకములున్నవి. అందుకే అన్ని సాధనలు అవసరమున్నవి–అని కబీర్ అంటాడు.

*(వివేకాది సాధనములు పరస్పర పూరకములు—ఒకదానికి మరొకటి సహాయకములున్నవను విషయము లో శ్రీవిచారసాగరము మొదటి తరంగములో టిప్పణములు గన(దగును)*

ఇట్టి వచనములను విన్న తర్వాత-ఈ బాలునివద్ద కేవలము ప్రగల్భములు మాత్రమే ఉన్నవా లేక ఆచరణకూడా ఉన్నదా? అని పరీక్షించుటకు సిద్ధారూఢస్వామి కబీరును ఇంకా పరీక్షింపగోరి, కబీరుతో ఇలా అంటాడు.

ఓ శిష్యా! నీవు సుజ్ఞానమణివి ఉన్నావు. ఇటువంటి సాధనలను అవలంబించినచో, ఇవి ఆమరణ పర్యంతము చేయాల్సిఉంటుంది.అతికష్టముతో కూడుకొనిఉంటాయి.ఈసాధనలయందు జన్మ వృథా అవుతుంది. నీకు సుఖము కావాలి కదా! నీ జీవితము సుఖమయముగా ఆనందంగా గడుచుటకు సులువైన ఉపాయము చెబుతాను విను. నీవు ఆ వివేకాది సాధనలను విడువము–అని నచకేతునికి యమధర్మరాజు ప్రలోభపెట్టినట్లుగా శిష్యుని ప్రలోభపెడుతాడు.

నీవు నాకు ప్రియమైన శిష్యుడవు. కావున, నీకు ఈ సులభమైన ఉపాయము చెప్తున్నాను విను. అదేమనగా, నీకు వశీకరణాది మంత్రసిద్ధులనుగూర్చి ఉపదేశిస్తాను. వాటి ద్వారా నీజీవనము గడువగలదు. ఈ సిద్ధులను నీవు అభ్యసించినట్లయితే, నీకు శాంతి లభిస్తుంది. జీవనవృత్తి అనా-యాసంగా నిశ్చయముగా గడుస్తుంది–అని స్వామి చెప్పగా కబీర్ విని స్వామితో ఇలా అంటాడు.

ఓ గురుదేవా! వశ్యాకర్షణాది సిద్దులు ఈ లోకమునందు అల్పసుఖములను మాత్రమిచ్చి నరకయాతనకు నిమిత్తములే కాగలవు.అందుకని వాటిని నేను మనస్ఫూర్తిగా త్యాగము చేస్తున్నాను.

అప్పుడు, సద్గురుదేవుడు మళ్లీ కబీరుతో ఇలా అంటాడు. ఇహలోక సుఖము నీకు త్యాజ్యమై-నట్లైతే పరలోకసుఖముగూర్చి ప్రతీక ధ్యానము, ఉపాసన, యోగము మొదలగు ఉత్తమలోకప్రాప్తి, ఉత్తమఫలప్రాప్తిగూర్చి, వాటిసాధనలగూర్చి బోధిస్తాను. వాటిని గ్రహించుము అని అంటాడు.

కబీర్ స్వామితో ఇలా అంటాడు. ఓ సద్గురుదేవా! **"తద్యథేహ కర్మచితోలోకః క్షీయతే, ఏవ-మేవాముత్ర పుణ్యలోకః అపి క్షీయతే"**(ఛాం. 8-1-6) **"క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి"** (గీత. 9-21) ఇట్లు శ్రుతిస్మృతులలో బోధింపబడింది. జప, తప, ధ్యాన,యోగములద్వారా ఏ పుణ్యమైతే లభిస్తుం-దో, అట్టి పుణ్యముద్వారా ఉత్తమలోకప్రాప్తి కలుగును. పుణ్యక్షయముకాగానే మళ్లీ అక్కడనుండి పతనమై మర్త్యలోకప్రాప్తి సంభవించును.కావున,నాకు ఈ ఉపాయములు అనవసరములు స్వామీ!

అప్పుడు స్వామి అంటాడు.శిష్యా! ఇదేమిటి? ఇహలోకమందు అన్ని విషయాలను పొంది, వాటిద్వారా సుఖమును పొందడానికే సకల జీవులు ప్రయత్నిస్తున్నారు. అటువంటి సుఖమును నీవు తృణీకరిస్తున్నావు. అని గురుదేవుడు అనగా—

కబీరు మళ్ళీ ఇలా అంటాడు.సంతానము, ధనము, రాజ్యము, తత్సంబంధమైన భోగవిలాస-ములను త్యాగముచేయనిదే అమృతత్వము (మోక్షము)ను పొందలేరు. "**న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానుషుః**"(మహానారాయణోపనిషత్) అని శ్రుతి చెబుతున్నది. కావున, అవి అన్ని నాకు త్యాజ్యములు స్వామీ.

అప్పుడు,సిద్ధనాథుడు అనుకుంటాడు. ఈయన ఉత్తమమైన జ్ఞానాధికారి. ఈయన బయట లోపల కర్మలను నిశ్చయముగా త్యాగము చేసి నావద్దకు వచ్చినాడని తెలుసుకొని, స్వామి కబీరును ఈ విధంగా అడుగుతాడు.కబీరా!నీకు ఏమి కావాలని నన్ను ఆశ్రయించినావు? నీ మనోరథమే-మిటి? నిశ్చయముగా చెప్పుము.

అప్పుడు కబీరు–గురుదేవా! అనాథుడనైన నన్నాదరించి నాయందు కలిగినటువంటి సంశ-యములను నివృత్తిచేసి నిస్సంశయజ్ఞానమును ప్రసాదించుము–అని సవినయముగా వేడుకుంటూ–

ఓ సద్గురుదేవా!ఈశ,కేన,కఠ,ప్రశ్న,ముండక,మాండూక్య,తైత్తిరీయ,ఐతరేయ,శ్వేతాశ్వతర, చాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులు మొదలగునవి కర్మ పరమున్నవా? లేక జ్ఞానపరము-న్నవా? వాటి తాత్పర్యమును యథార్థముగా బోధించగలరని మనవి చేస్తున్నాను.

అప్పుడు, సద్గురుదేవుడు శిష్యునియొక్క ప్రశ్నను యథార్థముగా ఆలకించి,ఈశాది ఉపని-షత్తులు కేవలము జ్ఞానపరమున్నవి. కర్మపరములుకావు–అని చెప్పి, వాటి అభిప్రాయమును యు-క్తులచేత బోధించినాడు. అప్పుడు కబీరు హృదయము ఆనందపూరితమై, నేను ధన్యుడనయ్యాను స్వామీ. అనేకజన్మల పుణ్యకర్మలఫలముగా జ్ఞానధనులైన మీరు నాకు లభించినారు. యథార్థమైన జ్ఞానమును మీయొక్క దివ్యమైన ముఖారవిందమునుండి బోధించినారు.ధన్యోస్మి స్వామీ ధన్యోస్మి–అని అంటాడు.

గురుదక్షిణరూపముగా సద్గురువుయొక్క కీర్తిని వర్ణించి, నలువైపులా వ్యాపింపజేస్తానని

వాగ్దానముచేస్తూ, ఇటువంటి సేవా కార్యమును చేపట్టడానికి ఆజ్ఞను కోరుతాడు. సద్గురునాథుడు ఆనందమును పొంది శిష్యుని తలపైన నిమురుతూ శిష్యుని అభిప్రాయాన్ని తెలుసుకుని ప్రేమాశ్రువు-లచేత ప్రఫుల్లితహృదయుడై—నీయొక్క మనోసంకల్పము దిగ్విజయమగుగాక! అని ఆశీర్వదిస్తాడు.

సద్గురునాథుడు విశేషంగా ప్రేమించే ఆ కబీర్,స్వామియొక్క ఆజ్ఞమేరకు స్వామిచరిత్ర "కన్నడ" భాషలో ఈ పూర్వార్ధ భాగమును రచించినాడు.అదే చరిత్రను ఆధారంగా చేసుకొని ఈ మరాఠీ భాషలో వ్రాస్తున్నానని శ్రీ శివదాసస్వామి అంటున్నాడు. వ్రాసేది, వ్రాయించేది ఆ సద్గురు దేవుడే. నేను పామరుడను–ఆయన చరణదాసుడను మాత్రమే.

ఇక్కడికి శ్రీ సిద్ధారూఢస్వామియొక్క చరిత్ర పూర్వార్ధము సంపూర్ణము. ఇది సంపూర్ణ జ్ఞాన పరమున్నది. దీనిని భక్తియుక్తముగా ఏముముక్షువు శ్రవణముచేస్తాడో,అతనికి తప్పకుండా జ్ఞానము కలుగుతుంది. ఇది సద్గురు దేవునియొక్క ఆశీర్వాదము. వరము.

సిద్ధారూఢస్వామి అనేక దేశములు యాత్రానిమిత్తముగా సంచరిస్తూ,ఎంతోమంది ముము-క్షువులకు మోక్షమార్గమును ప్రసాదిస్తూ, ప్రస్తుతము హుబ్లీ పట్టణమునందు నివసించి అనేక భక్తులను ఉద్ధరిస్తున్నాడు.ఇక్కడినుండి ఇక ఉత్తరార్ధగ్రంథము ప్రారంభించబడుతుంది. శ్రోతలు సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. దీనియందు సద్గురుదేవునియొక్క మహిమ విశేషముగా, విస్తారముగా వర్ణింపబడును.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము కేవలము శ్రవణ మాత్రముననే సకల పాపములు భస్మము కాగలవు. ఈ పదమూడవ అధ్యాయమును శ్రీ శివదాసస్వామి, శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిం-దములకు సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదునాలుగవ అధ్యాయము

**పద్యానువాదము:—**తామరరేకులవంటి కన్నులుగలవాడా,మెత్తనైన హృదయముకలవాడా, దయామయా, పుణ్యప్రదమైన ఆత్మవిద్యను పవిత్రమైన మీయొక్క కంఠముద్వారా గానము చేయగలవాడా, నీవు పదునాలుగు భువనములకు సూత్రధారివి, దీనులకు మిత్రుడవు, సకల జనులు మరియు దేవతలుసహితము నిన్ను స్తుతిచేయతగినవాడవు, సర్వులకు వంద్యుడవు,ఉత్తమోత్తమమైన స్తుతికి (నిర్గుణనిరాకార పరబ్రహ్మ మంగళమునకు)సుపాత్రుడవు, దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమైన వ్యాపకస్వరూపుడవు, మనసునందు అజ్ఞానరూప చీకటిని నివృత్తిచేయుటకు సూర్యునివంటి జ్ఞాన స్వరూపుడవు, త్రివిధతాపములను నివృత్తిచేయగల సచ్చరిత్రుడవైన ఓ సద్గురు సిద్ధనాథా! నీకు సాష్టాంగ వందనములు.

ముముక్షుజనులయొక్క పుణ్యము ఎప్పుడు ఫలోన్ముఖమౌతుందో,అప్పుడు నీయొక్క సగుణరూపమైన దివ్యశరీరము లీలామాత్రముగా ప్రకటమై భువిలో వ్యవహరిస్తుంది.మీయొక్క సంబంధము క్షణకాలము ప్రాప్తించినాగాని భవబంధము తప్పకుండా నివృత్తమై హృదయమందు ఆనందము అభివ్యక్తమగును. నిన్ను వర్ణించడానికి నాయొక్క అల్పమతి కుంటుపడుతుంది. ముల్లోకములందు కూడా నీతో సమానమైన సద్గురువు లేడు (దుర్లభము). **"న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః"** (గీత. 11-43). **"న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (శ్వే.6-8 ).

తీర్థయాత్రలు, సత్కర్మలు చేయుటద్వారా వాటి ఫలము కాలాంతరమునగాని, జన్మాంతరమునగాని లభిస్తుంది. కాని, నీయొక్క దర్శనమైన తత్క్షణమే దృష్ట ఫలము, అదృష్ట ఫలము రెండును లభ్యము కాగలవు. నీవు నిర్గుణనిరాకారస్వరూపుడవై యుండికూడా భక్తులయొక్క ఉద్ధరణకోసము సగుణరూపమును ధరించి దేహదారివై, నీయొక్క పావనమైన చరిత్రను ప్రకటము చేసినావు. భక్తులకు ఎప్పుడు అనర్థరూపమైన కష్టము కలుగుతుందో, అప్పుడు నీవు వారియొక్క బాధలను నివృత్తి చేయడానికి దేహధారివై అవతరిస్తావు.

**శ్లో ॥ జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ।** (భాగవతము 10-14-55)

**శ్లో ॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**

**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥** (గీత 4-8)

భక్తులయొక్క ఆపదలను నివృత్తిచేసి వారిని రక్షిస్తావు.కావున,నిన్ను ఆర్తరక్షకుడనిభావించి, ఆశ్రయించి, నిన్నే అనుసరిస్తూండడంవల్ల భక్తులయొక్క అంతఃకరణము శుద్ధమై, వారికి జ్ఞానము-నకు హేతువైన అధికారి లక్షణాలు ప్రాప్తము కాగలవు. సజ్జనులను హింసించే దుర్జనులనుగూడా తరింపచేయడానికి వారిపై కరుణగలిగి తరుణోపాయమును వెదకి "సద్గురు మావూలి" వారినిగూడ ఉద్ధరించినావు. ఇటువంటి దయాస్వరూపుడవైన ఓ "సద్గురు మావూలి" (తల్లిలాంటి గురుదేవా) భక్తులపై ఎల్లప్పుడూ నీయొక్క అపారకరుణను ఉంచగలవు. భక్తులపైన సద్గురుదేవుని కరుణ ఎలా ఉంటుందో, వారిని ఎలా ఉద్ధరించావో,అటువంటి నీ కథను నీవే చెప్తున్నావు.

సముద్రతీరమున "కుముఠ" అనే గ్రామముయందు "హరిహర" మరియు "సరస్వతి" అను బ్రాహ్మణ దంపతులిద్దరు నివసిస్తున్నారు. వారు దారిద్ర్యావస్థతో బాధపడుతూ సంసారము సాగిస్తు-న్నారు. భార్యాభర్తలు ఇరువురు అన్యోన్యంగా ఎల్లప్పుడు కృష్ణభజన చేస్తుండేవారు. ప్రతిరోజు నియ-మముచే కృష్ణనామ స్మరణచేస్తూ, కృష్ణుని భజిస్తూండగా పుణ్యముపండి ఈశ్వరకృపగలిగి అంతఃక-రణమున పవిత్రమైన దృఢవైరాగ్యము ఉదయించి, వారికి ఈ సంసారము దుఃఖరూపమని తోచి-నది. దుఃఖాలయమగు ఈ సంసారమునుండి ఎప్పుడు విడుదల కాగలమా–అని పరితపిస్తూ దానికి ఉపాయమును జూపుమని శ్రీహరిని వేడుకుంటారు.

ఎప్పుడైతే వారి హృదయము ద్రవించి సాంసారికతాపత్రయములచే విసుగెత్తి ఈ భవబంధ-మునుండి విముక్తినికోరి పశ్చాత్తాపమును చెందినారో, అప్పుడు ఆప్తులద్వారా ఈ విధంగా విన్నారు. **"హుబ్లీ"** పట్టణమందు సద్గురుదేవుడైన శ్రీ సిద్ధారూఢయతీంద్రుడున్నాడు. ఆయన సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడై ఉండి, సగుణరూపమును ధరించి, భక్తులను సంసార సాగరమునుండి తరింపజేయు-టకు అవతరించినాడు.

ఇట్లు విన్నదేతడవుగా హృదయానందభరితులై వెంటనే వారి పనులను విడిచిపెట్టి, హుటా హుటిగా "హుబ్లీ" పట్టణమునకు పయన మైనారు. సంసారభ్రాంతిని సమూలముగా త్యజించినారు. ఇట్లు, ఆ దంపతులు "హుబ్లీ"కి చేరుకొని, త్రోవలో కలిసిన జనులను సిద్ధారూఢస్వామి గూర్చి అడు-గుతూ అడుగుతూ ఆత్మారాముడు, భక్తకల్పద్రుముడు అయిన సిద్ధారూఢస్వామి ఉన్న సిద్ధాశ్రమ-మున స్వామి సన్నిధానమునకు చేరుకున్నారు. హరిహర, సరస్వతులిరువురు,దేదీప్యమానమై శో-భించుచున్న సిద్ధనాథున్ని ఆశ్రమంలో దర్శించి అంతులేని ఆనందమును పొందినారు. సద్గురు-దేవునియొక్క సగుణరూపమును దర్శించినంత మాత్రముననే త్రివిధతాపములు నివృత్తమై జన్మజ-న్మాంతర పాపములు భస్మమైపోగలవు. తేజోవంతమైన స్వామియొక్క ముఖకమలమును దర్శించి, వినమ్రులై, నిర్మలచిత్తముతో, ప్రేమాశ్రువులతో స్వామి చరణకమలములకు నమస్కరించారు.

ద్రవించిన హృదయముతో దర్శించుకున్న ఆ భక్తులపై సద్గురుదేవునికి దయగలిగి వారిని ఈ ప్రకారముగా మందలిస్తాడు. ఓ సజ్జనులారా! మీరు ఎక్కడనుండి, ఏ నిమిత్తమై వచ్చినారు. మీకు ఏమి కావాలి? అని అడుగగా, వారు–స్వామీ!మీయొక్క దర్శనభాగ్యము కోసం పరిగెత్తుకుంటూ వచ్చాము-అని సమాధానము చెప్పినారు.

ఓ సద్గురునాథా! మేము సంసార తాపత్రయాలను భరించలేక మీయొక్క కృపామృతము ద్వారా తప్పకుండా భవసాగరమునుండి తరించగలమనే నిశ్చయముతో మీయొక్క చరణకమల-ములను ఆశ్రయించినాము. నీవు తప్ప మమ్ములను భవసాగరమునుండి తప్పించగల సామర్థ్యము గలవారు మరొకరు లేరు. అందుకే మీ పాదపద్మములను ఆశ్రయించినాము. కావున, ఓ దయా-మయా! మమ్ములను దుఃఖరూపమైన ఈ సంసార సాగరమునుండి తరింపజేయుము. నీవు తప్ప మాకు వేరే తరుణోపాయము లేదు.

ఆ భక్తులయొక్క ఆర్తనాదమును విని కృపాసముద్రుడైన సద్గురుదేవుని హృదయము ద్రవించి, వారిని ఆశ్వాసిస్తూ–భయపడకుము, భయపడకుము–అని ధైర్యము చెప్పినాడు. ఇటువంటి సద్గురు దేవునియొక్క అభయ వాక్కులను విని, ఆ దంపతులు అమితానందభరితులైనారు.

ఆరోజునుండి ప్రతినిత్యము సద్గురుదేవునియొక్క ఆజ్ఞచేత దేహాభిమానమును త్యజించి సద్గురుసేవయందు సంలగ్నులైనారు. ప్రతిరోజు స్వామియొక్క ముఖకమలమునుండి వేదాంత శ్రవ-ణమును శ్రద్ధాభక్తులతో ఆలకిస్తూ, సకల సంశయములు నివృత్తి చేసుకొని స్వస్థచిత్తులైనారు. దేహ నిర్వహణకోసము భిక్షాటనచేస్తూ కాలము గడుపసాగినారు.ఆ దంపతులకు స్వామిపైగల అనురా-గయుక్తమైన దృఢభక్తినిచూసి, అక్కడున్న భక్తులందరికి ఆశ్చర్యము కలిగి, మీయొక్క సుకృతము ఫలించి సద్గురుసాన్నిధ్యమునుజేరి మీరు ధన్యులైనారని ఆ దంపతులను పొగిడేవారు. ఈప్రకారము ఒక సంవత్సరము గడిచిన తర్వాత ఆ దంపతులకు, ఏదో ఒక అనివార్యమైన కార్యనిమిత్తముగా వారి గ్రామము "కుముఠ" కు వెళ్ళవలసి వచ్చింది.

గురుదేవుని విడిచి వెళ్ళవలసి వచ్చినందుకు వారి హృదయము ద్రవించి, స్వామియొక్క వియోగమును భరించలేక విరహబాధతో ఎంతో తాపత్రయముగలిగి, ఏకధారగా ఏడుస్తూ స్వామీ! మమ్ములను తొందరగా మళ్లీ నీ సన్నిధానమునకు రప్పించుకొమ్మని వేడుకుంటారు.

వారిని స్వామి ఈవిధంగా ఆశీర్వదిస్తాడు. మీరు ఎన్నడు ఏమాత్రముగూడా చింతచేయవ-లసిన పనిలేదు. మీరు ఎల్లప్పుడూ సద్గురు స్మరణచేస్తూ వెళ్ళండి. మార్గంలో మీకు ఎలాంటి ఆపదలు గాని,భయముగాని ఉండబోదు.నేను ఎల్లప్పుడూ మీకు అండగా ఉంటాను. ఇటువంటి నిశ్చయము గలిగి, పవిత్రమైన సద్గురునామోచ్చారణచేస్తూ వెళ్ళండి. అహర్నిశలు సద్గురునామజపము చేస్తూ వెళ్ళినట్లయితే, మీకు నిర్భయస్థితి కలిగి శుభముచేకూరుగాక!

అప్పుడు సద్గురుదేవునియొక్క ఆశీర్వాదరూప వచనామృతములను విని, ఆ దంపతులు సద్గురుచరణాలకు నమస్కరించి ఆనందముతో తమ గ్రామమునకు బయలుదేరినారు. ఈశ్వర-నామోచ్చారణచేస్తూ సద్గురు కథామృతమును స్మరించుకుంటూ, దివ్యచరిత్రను వర్ణించుకుంటూ త్రోవను సాగిస్తూ, ప్రయాణం చేస్తున్నారు.

ఈ విధముగా కొంతదూరము వెళ్ళినాక మార్గమధ్యమున గొప్పదట్టమైన, భయంకరమైన ఒక అడవియందు ఆ దంపతులు ప్రవేశించారు. త్రోవకు ఇరువైపుల గొప్పగొప్ప వృక్షములు ఒకదాని కొమ్మలు మరొకదానియందు చొచ్చుకుని పోయి మార్గమును అంధకారముగా చేసినవి. సూర్యుని కిరణాలు భూమిపై పడుటలేదు. దినము రాత్రివలె తోస్తున్నది. అటువంటి భయంకరమైన అరణ్య-ములో జంతువుల అరుపులు, సింహగర్జనలు, ఏనుగుల ఘీంకారములు, పక్షులకూతలు మొదల-గునవి వినిపించుచున్నవి. కాని, వారు నిర్భయులై భజనయందు రమించి బాట నడుస్తున్నారు.

ఇట్లు త్రోవనడుస్తుండగా ఒకానొక చోట సరస్వతి భర్త "హరిహర" ఏదో నిమిత్తముచేత వెనుకనే ఉండిపోయినాడు. సరస్వతి అది గమనించక సద్గురునామస్మరణ, భజనయందు లీనమై తన దేహముయొక్క ధ్యాసకూడా లేకుండా ముందుకు ఎంతోదూరము వెళ్ళిపోయింది.

ఇంతలో మార్గమునకు ప్రక్కన ఉన్న చెట్లగుంపులో నుండి, ఒకానొక భయంకరమైన పెద్ద-పులి బాటకు అడ్డముగావచ్చి సరస్వతికి కొంతదూరంలో నిలబడి గర్జించుచున్నది. కనులు మూసు-కొని సద్గురుభజనయందు తల్లీనమైన ఆ సరస్వతికి పెద్దపులియొక్క గర్జన వినబడగానే, ఒక్కసారిగా కళ్ళుతెరిచి తటస్థమై నిలబడిపోయింది. ఎదురుగా పెద్దపులి నిలబడింది. దశదిశలా వ్యాపించున-ట్లుగా భయంకరముగా పెద్దపులి గర్జించింది. ఆ భయంకర శబ్దమును విని సరస్వతి కంపించింది. అప్పుడు ఆమెకు సద్గురువుయొక్క వచనము స్మృతికి వచ్చినది. వ్యాఘ్రము ఒక్క గంతువేసి ఆమె సమీపమునకు వచ్చింది. ఆ పెద్దపులి మరింత దగ్గరకు వచ్చేసరికి ఆమె ఇంకా భయకంపితురాలై చేతులు పైకెత్తి ఓ సద్గురు దేవా! ఓ దయామయా! ఈ క్షణములో నీవు తప్ప నాకు అన్యథా శరణం లేదు. తొందరగా వచ్చి నన్ను ఈ భయంకరమైన ఆపదనుండి రక్షించుము—అని సద్గురువును ఆర్తనాదముతో వేడుకుంది.

వెంటనే ఆమె ఆర్తనాదమును విని సద్గురుదేవుడు ఆమె వెనుకనే ప్రత్యక్షమై,ఆమె భుజం తట్టి భయపడకుము, భయపడకుము–అని ఆశ్వాసించాడు. రెండవ హస్తమును పైకెత్తి పెద్దపులిని హెచ్చ-రిస్తూ "ఆగుము" అని గట్టిగా అంటాడు. దివ్యపురుషుడైన సద్గురుదేవుని చూసి పెద్దపులి భూమిపై మూర్ఛిల్లి పడిపోయింది.

అదే సమయానికి సరస్వతి భర్తయగు "హరిహర" అక్కడికి వచ్చి, ఆ దృశ్యమును కన్నులారా చూసి, ఓసద్గురుదేవా! మమ్ములను సంకటమునుండి రక్షించడానికి వచ్చావా–అంటూ వేడుకుం-

టాడు. సరస్వతి మూర్ఛిల్లి పడిఉండెను. ఆమెను స్వామి తనచేతితో నిమిరినాడు. అప్పుడు సరస్వతి నిద్రనుండి లేచినట్లు లేచింది. కనులు తెరిచి స్వామిని చూసింది. దంపతులిద్దరూ స్వామిని అనేక విధములుగా స్తుతిస్తూ వేడుకుంటారు. ఆనందాశ్రువులచేత ఇలా అంటారు.

స్వామీ! నిన్ను విడిచి ఇంతదూరము వచ్చిన మమ్ములను ఈ సంకటమునుండి ఇంత తొందరగా వచ్చి కాపాడినావు. నిన్ను స్మరించినంత మాత్రముననే ఒక్క క్షణములో ఎలా వచ్చావు? ఇటువంటి దయాస్వరూపుడవైన ఓగురుదేవా! మా ఈ దేహమును మీకు నివాళిగా అర్పిస్తున్నాము. స్వీకరించండి స్వామీ.

ఆ భక్తులయొక్క సమర్పణ వచనములను విని సద్గురుదేవుడు ఆనందపడి ఇలా అంటాడు. నేను ఎల్లప్పుడూ మీ అండగా ఉంటాను–అని మాట ఇచ్చినాను. అదే వచనానుసారముగా మీ చెంత ఉండి మిమ్ములను కాపాడినాను. ఎక్కడైతే నాభక్తులు నన్ను స్మరిస్తుంటారో, వారియొక్క చింతలు, సంకటములు నివృత్తి చేయుటకు నేను వారి వెన్నంటి ఉంటాను.

**శ్లో ॥ అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**

**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥** (గీత ౯-౨౨)

**శ్లో ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**

**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥** (గీత 18-66)

మీరు ఏమాత్రము భయపడకండి–అని ధైర్యము చెప్పి, స్వామి దగ్గరలో పడిఉన్న వ్యాఘ్రము వైపుచూసి దాని వద్దకు వెళ్ళినాడు. ఈ దృశ్యాన్ని చూసి ఆ దంపతులు ఇంకా భయపడి సద్గురు దేవుని వెనుకవైపున నిలబడి ఉన్నారు. స్వామి ఆ వ్యాఘ్రము వీపుపైన కృపాదృష్టితో, ఆప్యాయతతో, ప్రేమతో, గారాబంగా మెల్లగా తట్టినాడు. వెంటనే ఆ వ్యాఘ్రము పెంపుడుకుక్కవలె లేచి, స్వామి పాదాలపై వ్రాలి, తోక విసురుకుంటూ నమస్కరించింది. ఆ దృశ్యమును చూసిన ఆ దంపతులకు ఎంతో ఆశ్చర్యము కలిగింది. భయమును వీడి వారు ముందుకు వచ్చినారు.

అప్పుడు సిద్ధనాథుడు ఆ వ్యాఘ్రము చెవిలో ఏదో గుసగుసగా చెప్పినాడు. అది విని ఆ వ్యాఘ్రము లేచి గర్జించుకుంటూ అరణ్యములోకి వెళ్లిపోయింది. అప్పుడు సిద్ధనాథుడు ఆ దంపతుల-కు నిర్భయము కలుగజేసి, ఆశ్వాసముచేకూర్చి, వారిపై కరుణతో"ఏమి భయపడవద్దు"అని చెప్పి, వారితో కొంత దూరము నడిచి అక్కడికక్కడే అదృశ్యమయ్యాడు.

ఆ దంపతులు సంతోషముతో నడుస్తూ సద్గురుదేవుని పదేపదే హృదయమందు స్మరిస్తూ వారి గ్రామము "కుముఠ"కు చేరుకున్నారు. వారు ఏ కార్యనిమిత్తముగా ఆ గ్రామానికి వచ్చినారో, ఆ కార్యమును శీఘ్రముగా సఫలము చేసుకొని మళ్ళీ తిరిగి "హుబ్లీ" కి వస్తుండగా, ఎక్కడైతే పెద్దపులి అగుపించిందో, అదే చోటుకు వారు తిరిగి రాగానే మళ్ళీ ఆ వ్యాఘ్రము బాటకు అడ్డముగా వచ్చింది.

వ్యాఘ్రము మునుపటిదే–కాని,మునుపటి ఉగ్రలక్షణాలు కనిపించుటలేదు. వారినిచూసి వారికి ఎదురుగా క్రిందపడి నమస్కరించింది. ఈదృశ్యాన్ని చూసి ఆదంపతులు సంశయచిత్తులై తటస్థంగా నిలబడి పోయినారు. ఆ వ్యాఘ్రము దీనభావంతో వారిముందు నిలబడింది. అదిచూసి "హరిహర"తన భార్యతో ఇలా అంటాడు. దీనికైతే మునుపటి లక్షణాలు మాత్రము లేవు. అయినా క్రూరజంతువు. చెప్పలేము–ఏమైనాగాని ఆ సద్గురుదేవుని తలుచుకుందాము. ఆయనే రక్షించుగాక!

ఇట్లు భయకంపితులైన దంపతులకు ఆ వ్యాఘ్రము సాష్టాంగ నమస్కారములు చేసి, వారితో కొంతదూరము నడిచి తిరిగి వనంలోకి వెళ్లిపోతూ, వారిని మళ్లీ మళ్లీ తిరిగి చూస్తూ, దీనభావముతో అరణ్యములోకి వెళ్ళిపోయింది. అప్పుడు ఆ దంపతులు నిర్భయులై ఆశ్చర్యకరమైన ఈ దృశ్యమును పదే పదే చింతించుకుంటూ —

సద్గురుదేవుని మహిమను వర్ణించుటకు శక్యముకాదు.ఆ సద్గురుదేవుని దయవలన క్షేమంగా ప్రయాణము సాగింది–అనుకుంటూ "హుబ్లీ" పట్టణమునకు వచ్చి, సిద్ధాశ్రమమునందు ప్రవేశించారు. దంపతులిద్దరూ స్వామి చరణకమలములకు సాష్టాంగ నమస్కారములు సమర్పించి, స్వామీ! మేము మీయొక్క కృపవలన క్షేమంగా మీ చరణసాన్నిధ్యమును చేరుకోగలిగాము. ఓ భక్తసఖా! మేము ధన్యులమైనామని–అంటూ స్వామిని ఇలా అడుగుతారు. స్వామీ! నీవు ఎల్లప్పుడు ఇక్కడే ఉంటావు. మరి, ఆ వ్యాఘ్రము మాకు ఎదురైనప్పుడు నీవు అక్కడ ప్రత్యక్షమై మమ్ములను రక్షించినావు. అసలు నీవు ఎక్కడుంటావు?

అప్పుడు గురుదేవుడు, ఏమైంది బిడ్డా!అని వారిని అడుగుతాడు.అప్పుడు "హరిహర"జరిగిన విషయమంతా సమగ్రంగా విన్నవించుకుంటాడు. అక్కడ ఉన్నటువంటి భక్తులు ఈ విషయమును విని ఆశ్చర్యచకితులైనారు.

ఇదంతా విన్నతర్వాత వారితో సద్గురుదేవుడంటాడు. మీరు గురుభావయుక్తముగా ఉన్నారు. అందుకనే,ఆ సద్గురుదేవుడే ఎల్లప్పుడూ జాగరూకతతో సర్వవ్యాపియై ఉంటాడు–కావున, ఏక్షణమందు తన భక్తుడు తనను స్మరిస్తాడో, అదే క్షణమున అక్కడనే ప్రత్యక్షమై భక్తులయొక్క సంకటములను నివృత్తి చేస్తాడు.

ఇటువంటి అద్భుతమైన సద్గురు చరిత్రను విని భక్తులందరూ సంతోషపరవశులై జయ జయ కారములు చేస్తూ, సద్గురువు చరిత్ర ఆశ్చర్యకరమైనదని నిర్ణయించుకున్నారు. సద్గురు మహిమ అపారమైనది. ఆయన కీర్తి చరాచరప్రపంచమంతా వ్యాపించింది–అని అనుకుంటారు.ఈప్రకారముగా ఆదంపతులు సద్గురు సన్నిధానమున నివసిస్తూ పునీతులైనారు.సద్గురువుయొక్క చరిత్ర ముల్లోకములలో పావనమైనది. అవతార స్వరూపములయొక్క పవిత్రాచరణ ఆదర్శనీయము. వారియొక్క సగుణ నిర్గుణ చరిత్ర పవిత్రమైనది. 1. సగుణ చరిత్ర శ్రవణమువలన పాపనివృత్తి కలిగి మనస్సు

యందు ఏకాగ్రత చేకూరుతుంది. ౨.లక్ష్యార్థముద్వారా ముముక్షువులకు నిర్గుణపరబ్రహ్మముయొక్క సాక్షాత్కారముగలిగి శాంతి లభిస్తుంది.

అందుకని ఇంతవరకు చెప్పబడిన కథయొక్క లక్ష్యార్థము చెప్పబడుతుంది. శ్రోతలు సావధానచిత్తులై శ్రవణము చేసినట్లయితే చిత్తము నిర్మలమై హృదయమందు జ్ఞానజ్యోతి ప్రకటము కాగలదు.

తీవ్రమైన'వైరాగ్యము' మరియు నిర్మలమైన'శాంతి' వీరిద్దరు దంపతులు.సద్గురువుయొక్క ఆజ్ఞానుసారముగా భవారణ్యముగుండా పయనిస్తున్నారు. భవారణ్యమునందు సుఖముగా పయనిస్తుండగా, క్రోధమనే వ్యాఘ్రముయొక్క సంబంధమైనది. శాంతి అనే భార్యను మ్రింగడానికి ప్రయత్నించింది. ఆ శాంతి వెంటనే సద్గురునాథున్ని స్మరించింది. వెంటనే సద్గురుదేవుడు హృదయమందు ప్రకటమై క్రోధమనే వ్యాఘ్రమును శాంతింపజేసినాడు. అప్పుడు శాంతి వైరాగ్యములు అనే దంపతులు రక్షింపబడి ఆత్మసుఖము అనే వారి గమ్యస్థానమును చేరుకున్నారు.ఆత్మానుభవమును ఎప్పుడైతే యథార్థముగా పొందినారో,ఆతర్వాత భవారణ్యమందు తిరిగినాగాని, క్రోధరూప వ్యాఘ్రము ప్రత్యక్షమైనాగాని అంతరంగమందు శాంతమును వీడక విహరిస్తారు. విఘ్నములు దరికి జేరవు.

సద్గురునాథుడు దేవాదిదేవుడున్నాడు. సకల బ్రహ్మాండములు తనయందే ఉన్నవి. తాను ఈశ్వరునికిగూడ నియామకుడున్నాడు. త్రిమూర్తులుగూడా సద్గురుదేవునియొక్క సత్తచేతనే వ్యవహరిస్తున్నారు. సద్గురుదేవుడు అనాది అపూర్వ స్వరూపుడున్నాడు.

**భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః ।**

**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥** (కఠ. ౨-3-3)

ईश्वर सर्वांसी बंधांत टाकी। तो सद्गुरु दयार्णव येऊनि या लोकीं। मुक्त करी एकाएकी। जे शरण शेखीं येती तया॥ (14-77). शेखीं = शेवटीं।

***"ఈశ్వరుడు సకలజీవులకు జన్మనిచ్చి, బంధమునందు పడవేస్తున్నాడు. దయాసాగరుడైన సద్గురుదేవుడు సగుణరూపముగానవతరించి, ఎవరైతే తనను శరణుబొందుతారో, వారిని ఒక్కొక్కరిని భవసాగరమునుండి తరింపజేస్తాడు".*** ఇటువంటి సద్గురుదేవుని చరిత్రను వర్ణించుటకు వేయిశిరస్సుల ఆదిశేషునికిగూడా శక్యముకాదు. ఇక మందమతినగు నేను ఏమని వర్ణించగలను?

**అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే**

**సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీ ।**

**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం**

**తదపి తవ గుణానామీశ పారం న యాతి ॥** (పుష్పదంతాచార్యః)

ఓశ్రోతలారా!ఇప్పుడు మీరు సావధానచిత్తులై ముందర అధ్యాయమును శ్రవణము చేయగలరు. తద్వారా మోహము నివృత్తమై జ్ఞానము ప్రకటము కాగలదు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినచో సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి సద్గురుచరణములకు ఈ పదునాలుగవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదునైదవ అధ్యాయము

పద్యానువాదము:—ఓ సద్గురు సిద్ధనాథా! నీయొక్క పాదపద్మములను అభిలషించి నిన్ను ఆశ్రయించినాను. నీవు తప్ప నన్ను భవసాగరమునుండి తరింపజేసే సామర్థ్యముగల పురుషులు మరొకరు లేరు. శరణార్థులను కృపాదృష్టితో రక్షిస్తావని నిన్ను ఆశ్రయించినాను. నీ పాదాలచెంత నా శిరస్సునుంచినాను. నా హృదయమందు వసించి నాకు జ్ఞానమును ప్రసాదించుము స్వామీ!

అనాద్యనంతస్వరూపుడవైన ఓ సద్గురునాథా! నీవు అందరిని ఆజ్ఞాపించే శాసనకర్తవు. ముముక్షువుల నిమిత్తముగా సగుణరూపముగా ప్రకటమైన అవతారస్వరూపుడవు. అటువంటి నీకు జయము జయము. రకరకములైన వ్యవహారరూప సంసారము రాగద్వేషదంతయుక్తమై సారహీ-నమై ఉంది. అటువంటి నిస్సార సంసారమును ఒక్క బుక్కలో అనగా ఒక్క క్షణంలో భక్షించగలవు, అనగా నివృత్తి చేయగలవు. అందుకనే నీ చరణములను ఆశ్రయించినాను.

**సవిలాస మహామోహ గ్రాహగ్రాసైక కర్మణే నమః ।**

మనసు సంస్కారబలముచేత సహజంగా విషయాలవైపు వెళ్లి రాగద్వేషరూప నదిలో జీవుని త్రోసి వేస్తుంది. దయాస్వరూపుడైన సద్గురుదేవుడు అది తెలుసుకుని త్వరగా వచ్చి ఆ నదినుండి బయటకుతీసి ముక్తున్ని చేస్తాడు. నది మధ్యభాగమున సుడిగుండంలో గిరగిరా తిరుగుచున్న కీట-కము తప్పకుండా నాశనమును పొందును. అటువంటి సంకటములో ఉన్నదానిని రక్షించడానికి నీవే సమర్థుడవు.అటువంటి నదిమధ్యన సుడిగుండంలో గిరగిరా తిరుగుతూ మరణావస్థలో ఉన్న కీటకమువద్దకు నీవు స్వయంగా ఈదుకుంటూ వెళ్లి, దానిని నెమ్మదిగా ఒడ్డుకుచేర్చి, వృక్ష ఛాయయందు ఉంచడానికి నీవే సమర్థుడవు. ఓ సద్గురుమావూలీ! భక్తుల నిమిత్తముగా "హుబ్లీ" పట్టణమందుండి శరణాగత భక్తులను అనేక సంకటములనుండి రక్షించినావు. అట్టి అనిమిత్త బంధువు, శరణాగతరక్షకుడవగు ఓ సద్గురుదేవా! నీకు సహస్ర కోటి ప్రణామములు.

**నద్యాం కీటా ఇవావర్తాదావర్తాంతరమాశు తే ।**

**వ్రజన్తో జన్మనో జన్మ లభన్తే నైవ నిర్వృతిమ్ ॥**

**సత్కర్మ పరిపాకాత్తే కరుణానిధినోద్ధృతాః ।**

**ప్రాప్యతీరతరుచ్ఛాయాం విశ్రామ్యన్తి యథాసుఖమ్ ॥**

**ఉపదేశమవాప్యైవమాచార్యాత్తత్త్వదర్శినః ।**

**పఞ్చకోశవివేకేన లభన్తే నిర్వృతిం పరామ్ ॥** (వే.పం. 1-30 నుండి 32)

ఓ శ్రోతలారా! రసయుక్తమైన ఈ సద్గురుదివ్యచరిత్రను శ్రవణము చేసినట్లయితే పాపరాశి అంతయు భస్మమై,హృదయమందు ఆనందము కలిగి చిజ్జడగ్రంథి విచ్ఛిన్నము కాగలదు.శ్రీసద్గురు సిద్ధారూఢస్వామియొక్క చరణాంబుజములు భక్తులయొక్క సంసారరూప కార్యములగు నిత్యాభియుక్తములను (యోగక్షేమములను) సఫలముచేసి, మనోసంకల్పములను నెరవేరుస్తాయి.

"రూపకృష్ణుడు" అనే పేరుగల భక్తుడు చతురబుద్ధి గలవాడు.అతనికి సద్గురుపాదాలపై దృఢమైన శ్రద్ధ ఉండేది. ఆయన భార్య "భాగ్యవతి" గూడా సద్గురుసేవయందు నిత్యము రమించి ఉండేది. ఆ దంపతులకు గర్భము పండలేదు. సంతానప్రాప్తిగూర్చి గురుచరణములను ఆశ్రయించి ఆర్తనాదముచేత పుత్రప్రాప్తిగూర్చి కోరుకుంటారు.

స్వామితో, భాగ్యవతి దీనురాలై ఇలా వేడుకుంది. సంతానములేని స్త్రీని సమాజము గొడ్రాలని పేరు పెడుతుంది. సుతులు లేనిచో గతులు లేవు"**అపుత్రస్య గతిర్నాస్తి**"అని పూర్వమీమాంస చెప్తుంది. అందుకని ఓ సద్గురుదేవా! మాకు సంతానమును ప్రసాదించుము.

ఆమె మాటలను విని సిద్ధారూఢస్వామి నవ్వుకొని ఈప్రకారంగా ఆమెతో అంటాడు. సంసారము సుఖరూపమని ఎవరు అంగీకరిస్తారో, వారికి ధన,పుత్ర,దారా,గృహారామక్షేత్రాదులు సుఖమనిపిస్తాయి. ఒక్క పుత్రుడు లేనంత మాత్రాన, సకలసంపదలుండగా నీకు దుఃఖమెందుకు కలుగుతుంది? పుత్రునివలన సుఖమును అనుభవించకుండా, పుత్రునివలన సుఖమున్నదని నీకు ఎలా తెలుసు? పుత్రుణ్ణి పొందవలెనన్న కోరికగల నీకు పుత్రుడు లేనిచో ఆనందము ఎలా కలుగుతుంది? అందుకని నీకు ఇప్పుడు బహుసంతానమును ప్రసాదించాలి.ఎందుకనగా! సంతానవాసనచేత నీకు మళ్ళీ పునర్జన్మ వస్తుంది.ఈశ్వరుడైతే నీకు సంతాన భాగ్యమును ప్రసాదించలేదు.ఈశ్వరుడు ప్రసాదించిన ధన,కనక,వస్తు,వాహన,గృహారామక్షేత్రాదులతో నీకు తృప్తి కలుగుటలేదు. దుఃఖమే ప్రతీతి అవుతుంది. అందుగురించి ఈశ్వరునికి నియామకుడైన సద్గురుదేవుడు నీ మనోసంకల్పమును తప్పకుండా నెరవేర్చుతాడు–అని సద్గురు దేవుడు ఆశీర్వదిస్తాడు.

అమ్మా!భాగ్యవతీ! నీవు ఏ సంతానముయొక్క అపేక్షచేత దుఃఖమును పొందుచున్నావో, అట్టి కోరిక నెరవేరుతుంది. నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్లి ఎల్లప్పుడూ హృదయమందు సద్గురుదేవుని స్మరించుచున్నట్లయితే నీయొక్క మనోవాంఛ పూర్తికాగలదు.భాగ్యవతికి ప్రసాదరూపముగా స్వామి విభూతినిచ్చి ఆశీర్వదించినాడు. భాగ్యవతి ఆ ప్రసాదమును స్వీకరించి ఆనందంతో ఇంటికి వెళ్ళి

పోయింది. సద్గురువుయొక్క వచనములు తప్పకుండా సఫలమవుతాయనే విశ్వాసంతో సద్గురు పాదాలను ఎల్లప్పుడూ మరువకుండా స్మరిస్తూ సద్గురు భజనయందే ఆమె రమించుచుండెను.

ఎవరైతే సద్గురుదేవుని విస్మరిస్తారో, వారి ఇంటియందు అనేక దుఃఖములు ప్రసక్తమగును. ఎవరి హృదయంలో అఖండంగా సద్గురువుయొక్క నామస్మరణ జరుగునో, అటువంటి భక్తులకు సద్గురు కృపద్వారా పరమశాంతి చేకూరును.సాంసారిక సౌఖ్యములయందాసక్తిగలవారు స్వామిని సాంసారిక (వైషయిక)సుఖములనే కోరుకుంటారు. అటువంటి భక్తులకు స్వామి నామస్మరణ ఉపదేశించేవాడు. ఆ భక్తులు విషయప్రాప్తిగూర్చి రాత్రింబవళ్లు నామస్మరణయందే రమించేవారు. అట్టి చింతనద్వారా (నామస్మరణద్వారా) పాపదోషము నివృత్తమై, అంతఃకరణము శుద్ధమై, విషయాలను సహజంగా విస్మరిస్తారు.

ఆ భాగ్యవతి అనతికాలంలోనే గర్భమును ధరించి సకాలమునకు పుత్ర రత్నమునకు కన్నది. కాలధర్మము ననుసరించి తొమ్మిదిమంది పుత్రులు కలిగినారు. సంతానము ఎక్కువగా ఉన్నందున వ్యావహారిక జీవనము అతికష్టముగా గడుచుచున్నది. ఎంతో దుఃఖము కలుగుచున్నది. ఆ తాపమునకు భరించలేక, భాగ్యవతి స్వామివద్దకు వెళ్లి–స్వామీ! ఓ గురుదేవా! అధిక సంతాన మూలముగా నాకు చాలా దుఃఖము కలుగుచున్నది. ఇక ఈ సంతానము చాలు. ఇకముందు నాకు సంతానము కలుగకుండునట్లు ఆశీర్వదించండి. జీవనము దుర్భరమవుతుంది. సంతానమును పోషించుట ఎంతో కష్టమవుతుంది. చాలు స్వామీ చాలు. ఈ సంతానము మాకు చాలు–అని ఆర్తనాదముతో వేడుకోగా, సద్గురు సిద్ధారూఢస్వామి, అటులనే నీ అభీష్టము నెరవేరుగాక! అని ఆశీర్వదిస్తాడు. అప్పటినుండి వారికి ఇక ముందర సంతానము కలుగలేదు. గర్భధారణ ఆగిపోయింది. కొద్ది రోజులు గడిచినాక "రూప కృష్ణ"కు ఉద్యోగనిమిత్తముగా **మద్రాస్** కు వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు రూపకృష్ణ మరియు భాగ్యవతి ఇద్దరూ స్వామికి వీడ్కోలు చెప్పి,ఆశీర్వాదమును పొందడానికి మఠమునకు వచ్చినారు.

సద్గురుచరణాలను దర్శించుకుని, వారి విన్నపమును నివేదించుకొని, స్వామియొక్క సాన్నిధ్యమునుండి దూరమవుతున్నందున, అశ్రుపూరిత నయనాలతో వారు ఎంతో విలపించినారు. గద్గదకంఠముతో ఈ విధంగా అంటున్నారు. స్వామీ! మాకు ఉద్యోగనిమిత్తము మద్రాస్ కు పోవలసి వచ్చింది. కాని, మాహృదయము ద్రవించిపోతుంది. మేము మిమ్ములను విడిచివెళ్లలేము.ఈ సద్గురు వియోగము భరించలేము.

అప్పుడు సద్గురుదేవుడు వారిపై దయతలచి వారిని ఓదార్చి,మీరు ఎల్లప్పుడూ పవిత్రమైన సద్గురు భజన మరియు పరమాత్ముని నామస్మరణ చేసినట్లయితే, నేను ఎల్లప్పుడూ మీ వెన్నంటి ఉంటాను. అని ఆశ్వాసము, ఆశీర్వాదమునిచ్చి మద్రాస్ కు వెళ్ళడానికి ఆజ్ఞను ఒసంగుతాడు.

ఆ దంపతులు ఎంతో ఆనందమునొంది, వారు కుటుంబసహితంగా మద్రాస్ కు వెళ్ళిపో-యినారు. అచ్చట కొన్నాళ్లు గడచిన పిమ్మట, మద్రాసు పట్టణమందు ప్లేగువ్యాధి సోకింది. అనేక-ముగా జనులు మరణించుచున్నారు. అదే సమయానికి భాగ్యవతియొక్క ఒకానొక ఐదేళ్ల బాలుడు జ్వరపీడితుడైనాడు. ఆ సమయంలో రూపుకృష్ణ ఇంట్లో లేడు. గ్రామాంతరము వెళ్ళినాడు.

ఆరోజు రాత్రి సుమారు 12 గంటలు అయింది. భాగ్యవతి బాలునిచెంత కూర్చుంది. క్రమ-ముగా క్షణక్షణము జ్వరము తీవ్రంగా పెరుగుచున్నది. బాలుడు అపాయకరమైన స్థితిలో ఉన్నాడు. ప్రాణోత్క్రమణము జరుగుతుందా–అన్నట్లుగా ఉంది.ఇంట్లో పెద్దమనుషులు ఎవరూలేరు. భాగ్యవతి అజ్ఞానావస్థలో ఉన్న పిల్లలతో ఆ రాత్రి ఇంట్లో ఉంది. పిల్లవాడు జ్వరతాపముచేత మూలుగుతు-న్నాడు. అర్ధరాత్రి వేళ ఇంట్లో ఎవరు పురుషులు లేనందున భాగ్యవతి గుండె అదిరింది. ధైర్యం కోల్పోయింది. ఆమెకు సహకరించేవారు ఎవరు లేకుండిరి. బాలుడు మరణావస్థకు చేరుకుంటు-న్నాడు. మరణచిహ్నములు గోచరించుచున్నవి. అప్పుడు భాగ్యవతికి దిక్కుతోచలేదు. చేయునది లేక, ఆర్తనాదముతో సద్గురుదేవుని స్మరిస్తూ గొంతెత్తి విలపిస్తూ పిలువనారంభించింది. ఓ సద్గురుదేవా! నా కుమారుని ప్రాణాలు క్షణాల మీద అనంత వాయువుల్లో కలిసేటట్టు ఉన్నాయి. ఓ స్వామీ! నీవు తొందరగా వచ్చి నా బాలుని రక్షించుము. ఓ సద్గురునాథా! ప్రస్తుత క్లిష్ట పరిస్థితుల్లో నీవు తప్ప నా బాలుని రక్షించు ప్రాణదాత మరొకరు లేరు. పరిస్థితి విషమించిపోయింది. ఔషధోపచారములు నిష్ఫలములైనవి. ఇప్పుడు నీయొక్క నామస్మరణయే మాకు సంజీవని. నా బాలుని కాపాడే భారము నీదే స్వామీ. శీఘ్రముగా వచ్చి కాపాడు తండ్రీ–అని గుండెలు బాదుకుంటూ వేడుకుంది.

ఇట్లు భాగ్యవతి ఆర్తనాదముతో రోధిస్తూ కుమారుని తన ఒడిలో ఎత్తుకొని నిలబడి ద్వారం వైపు చూసింది. అప్పుడు ద్వారమునకుగల తెరను తోసివేసుకుంటూ దివ్యస్వరూపుడైన సద్గురుదే-వుడు సిద్ధనాథస్వామి ప్రత్యక్షమైనాడు. శిరసున ఎరుపురంగుగల వస్త్రమును చుట్టుకుని, తెల్లని ధో-తిని కట్టుకొని, లలాటమున తెల్లని విభూతిని ధరించి, తేజోవంతమైన దివ్యరూపముచేత కరుణా-దృష్టితో సద్గురుదేవుడు ప్రకటమైనాడు. పాదములకు పాదరక్షలు లేకుండా స్వామి లోనికి ప్రవేశిం-చినాడు.స్వామియొక్క దివ్యరూపమునుగాంచి భాగ్యవతి ఆశ్చర్యపోయింది.అప్పుడు సద్గురునాథుడు భాగ్యవతి సమీపమునకు వచ్చి, అమ్మా! నన్ను ఎందుకు పిలిచావు–అని అడుగుతాడు. అప్పుడు భాగ్యవతి చేతివ్రేలితో పిల్లవానిని చూపించింది.

అప్పుడు సద్గురు సిద్ధనాథుడు తనయొక్క అమృత హస్తముతో పిల్లవాని శరీరమును స్పృశిం-చినాడు. వెంటనే ఆ పిల్లవాడు ఏడుస్తూ, స్మృతికివచ్చి లేచినాడు. భాగ్యవతికి ఎంతో ఆనందము కలిగింది. ఆ బాలుని ఎత్తుకొని భాగ్యవతి సద్గురుచరణాలకు శిరసువంచి నమస్కరించింది. సద్గురు దర్శనము చేసుకొని ఎప్పుడైతే లేచి చూసిందో, సద్గురువు అదృశ్యమైనాడు. భాగ్యవతి ప్రేమపూర్వ-

కంగా గద్గదకంఠముతో బిగ్గరగా ఏడుస్తూ స్వామీ! స్వామీ! అంటూ అక్కడ ఇక్కడ సద్గురుదేవుని గూర్చి వెదికింది. హృదయం ద్రవించి ఎంతో విలపించింది.

భాగ్యవతి ఇలా అనుకుంటుంది. నేను స్వామికి ఎలాంటి ఉపచారము చేయకపోతినే, నమస్కారమయినా సరిగా చేయకపోతినే, పూజాప్రసాదములు సమర్పించుకోలేకపోతినిగదా! ఎంత అన్యాయము చేసెగదా, అయ్యో! ఎంత దుర్భర పరిస్థితి తటస్థించెను? అని భాగ్యవతి ఎంతో విలపించింది. ఇంతలో గ్రామాంతరమునుండి తన భర్త రూపకృష్ణ ఇంటికి వచ్చినాడు. ఇంట్లో జరిగిన వృత్తాంతమంతా తెలుసుకున్నాడు.ఇద్దరి హృదయాలు ప్రేమతో ఉప్పొంగిపోయినవి.క్షేమంగా రక్షింపబడిన బాలుని చూసి ఎంతో ఆనందపడినారు. అప్పుడు రూపకృష్ణ అంటాడు–ప్రస్తుతం సద్గురు దర్శనము అత్యవసరము. మనము తొందరగా సద్గురు సాన్నిధ్యమునకు వెళ్లాలి, పద అంటూ—

మరుసటి దినమున వేకువనే లేచి పిల్లలందరితో సహా కుటుంబ సభ్యులందరూ కలసి "**హుబ్లీ**" కి వచ్చి, సిద్ధాశ్రమమందు సద్గురు సిద్ధనాథస్వామిని దర్శించుకున్నారు. రూపకృష్ణ మరియు భాగ్యవతి సద్గురుచరణాలకు సాష్టాంగ నమస్కారములు చేసి, తమ గృహములో(మద్రాసులో) జరిగిన అద్భుతలీలను చెబుతారు. ఓ ప్రభూ! నీ యొక్క కీర్తిని వర్ణించడానికి శక్యము కాదు. మేము మా సర్వస్వాన్ని నీకు అర్పించినా నీ ఋణము మేము తీర్చుకోలేము.

స్వామి వారిని ఆశీర్వదిస్తూ, ఎవరైతే సద్గురువుపైన నిశ్చయాత్మక శ్రద్ధ కలిగి ఉంటారో, వారిని సద్గురుదేవుడు తప్పకుండా రక్షిస్తాడు. సాక్షాత్తు శ్రీ కృష్ణపరమాత్మ శ్రీమద్ భగవద్గీతయందు గూడా ఈ ప్రకారముగా భక్తులకు హామీ ఇచ్చినాడు.

**శ్లో ॥ అనన్యాశ్చింతయన్తో మాం యేజనాః పర్యుపాసతే ।**

**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥** (గీత ౯-౨౨)

సద్గురుదేవునియొక్క వచనామృతమును విని భక్తులందరూ ఆనందపరవశులైనారు. గురుదేవుడు మా పాలిట "చింతామణి". ఈప్సితార్థములను ఇచ్చుటకై మాకొఱకు "**హుబ్లీ**" లో వెలసినాడు–అని అనుకుంటారు.

ఇంతవరకు చెప్పబడిన కథకు స్వామి ఇప్పుడు గుహ్యామైన లక్ష్యార్థమును చెపుతున్నాడు. విషయాభిముఖులైన పురుషులు ప్రవృత్తిమార్గమును అవలంబించి దుఃఖమిశ్రితమైన విషయాలను–స్త్రీ,పుత్ర,ధన,గృహాదులను కోరుకుంటారు. ప్రాప్తమైన విషయాలను పూర్తిగా అనుభవించిన పిదప దుఃఖమును పొంది,దానిని తట్టుకోలేక సద్గురుచరణాలను ఆశ్రయించి,ఈ సంసార దుఃఖమునుండి మమ్ములను రక్షించుమని స్వామిని వేడుకుంటారు. దయాసాగరుడైన సద్గురుదేవుని వైషయిక

దుఃఖములనుండి విముక్తులను చేయమని వారు అనన్య భావముచేత భజిస్తారు. అనన్యభక్తిద్వారా అంతకరణము పవిత్రమవుతుంది. మరియు సద్గురువును అనన్యభావముచేత పరిపూర్ణ విశ్వాసము చేత భజించినట్లయితే, జ్ఞానపుత్రుడు ఉదయించి రక్షింపబడతాడు.

అనన్యభావముచేత భజించినందున జ్ఞానపుత్రుడు జన్మించాడు. కాని, దృఢ అపరోక్ష బ్రహ్మ జ్ఞానము కలుగక, అనేక శాస్త్రాలను శ్రవణముచేసి పఠించినందున సంశయము అనే గ్రంథి (ప్లేగు) రోగము ఆవరిస్తుంది. ఈ రోగము దినదినము పెరిగి ప్రాణాంతకంగా మారుతుంది.

**శ్లో ॥అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**

**నాఽయం లోకోఽస్తి నా పరో న సుఖం సంశయాత్మనః ॥** (గీత 4-40)

సంశయరూప రోగగ్రస్తుడైన జ్ఞానపుత్రుడుగల సాధకుడు (ముముక్షువు)ఎప్పుడైతే సద్గురువును దృఢముగా నమ్మికొని ఆశ్రయించునో, సద్గురుదేవుడు ప్రసన్నుడై ఆత్మబోధను దృఢముగాచేసి, సంశయరూప రోగమును నివృత్తి చేస్తాడు. ఎప్పుడు బ్రహ్మజ్ఞానము (జీవబ్రహ్మల అభేద నిశ్చయము) నిస్సంశయముగా దృఢపడుతుందో, అప్పుడు ఆ(జ్ఞానపుత్రుడుగల)జ్ఞానికి సర్వావస్థలయందు ఆనం- దమే ఆనందముంటుంది.

శ్లో ॥దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్ ।

ఈప్రకారముగా సద్గురుదేవుడు ముముక్షుజనులను రక్షిస్తాడు.బ్రహ్మానందపూర్ణుడైన సద్గురు దేవుడు చేతనప్రాణుల హృదయమందు సచ్చిదానంద స్వరూపుడై, ఘటపటాది జడవస్తువులయందు అస్తి భాతి ప్రియ స్వరూపుడై వ్యాపకుడై వెలసినాడు. అట్టి సద్గురుదేవుడు తానే స్వయముగా ఈ గ్రంథమును వ్రాస్తున్నాడు. వ్రాయించుకునే వాడు తానే ఉన్నాడు. సద్గురుదేవుడు శ్రోత,వక్త తానేయై, ముందర అధ్యాయమునందు విచిత్రమైన కథను చెబుతాడు. శ్రోతలు సావధానచిత్తులై వినగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము శ్రవణమాత్రముననే సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి ఈ పదునైదవ అధ్యాయమును శ్రీ సద్గురు చరణారవిందములకు అర్పిస్తూ ఇంతటితో ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదహారవ అధ్యాయము

పద్యానువాదము:—ఋషిమునులచే వంద్యుడవగు ఓ సిద్ధరాయా! నా హృదయకమలమునందు నివసించి నాకు ఎల్లవేళల సహాయముగా వెన్నంటి ఉండుము. నీయొక్క శుద్ధమైన సగుణస్వరూపాన్ని వర్ణించడానికి నాకు సద్బుద్ధిని ప్రసాదించుము. అభయపదవిని ప్రాప్తముచేసే ఓ సద్గురు సిద్ధరూఢస్వామీ! నీకు జయము జయము. నీ దివ్యమైన పాదారవిందములకు సాష్టాంగ దండవత్ ప్రణామములు.

ఓంకార స్వరూపుడవైన ఓసద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము. నేను అతిదీనభావముచేత నీయొక్క దివ్యపాదారవిందములను ఆశ్రయించినాను. మనోహరమైన నీ దివ్యస్వరూపాన్ని ఎల్లప్పుడూ నా అంతరంగమందు దర్శించుకొనునట్లుగా అనుగ్రహింపుము. నీయొక్క కృపకలిగిన మీదట ముల్లోకములందు పొందదగినది నీకన్న అన్యమైనదిగాని,శ్రేష్టమైనదిగాని ఏమియు లేదు. సకల బ్రహ్మాండములను నిర్మాణముచేయుసామర్థ్యముగల అవిద్య(మాయ)ను అరక్షణములో నివృత్తి చేయగల సమర్థుడవున్నావు. నీయొక్క నామమహిమ నిరుపమానమైనది. ఎవరైతే నీయొక్క నామమును అఖండముగా జపిస్తారో, అట్టివారు బ్రహ్మదేవునిచేత పూజింపబడతారు. అటువంటి సద్గురువు యొక్క భక్తుని ఎదురుగా ఈశ్వరీయ విభూతులు (అణిమాది సిద్ధులు)వచ్చి"దాసోహం"అని చేతులు జోడించుకొని నిలబడి, సకల ఐశ్వర్యములను తెచ్చిపెడతాయి. సకల ఐశ్వర్యములు తన ముందుంచినాగాని ఆ సద్గురుదేవుని భక్తుడు వాటిని ఉపేక్షిస్తాడు. కారణమేమనగా, ఆయన క్షుద్రమైన వైషయికభోగాలకు అతీతమైనవాడు. ఈశ్వరునికంటే శ్రేష్టమైన స్థానాన్ని పొందడానికి సంసిద్ధుడై ఉంటాడు. కాబట్టి, సద్గురుదేవుని కృపను శీఘ్రముగా పొందడానికి ఆ సద్గురు నామాన్ని అనన్యగతిగా ఆశ్రయించుకుని ఉంటాడు. సద్గురుకృపచేత ఈశ్వరునికే అధిష్టానమైన నిర్గుణ, నిరాకార, నిర్వికారమైన పరబ్రహ్మమును పొంది, జీవబ్రహ్మలయొక్క నిశ్చయముగలిగి భవ బంధమునుండి ముక్తుడై పరమసుఖమును పొందుతాడు. అట్టి సద్గురుదేవుని భక్తుడు నామరూప ప్రపంచమందు సద్గురుదేవుని సత్తనే దర్శిస్తూఉంటాడు.శుభాశుభములు(పుణ్యపాపములు)ఆయనకు ఒకటిగా గోచరిస్తాయి. ఎల్లప్పుడు తన హృదయమందు స్వస్వరూపాన్ని దర్శిస్తూ స్వమహిమలో

నిమగ్నుడై ఉంటాడు. పరాపరభేదము ఆయనకు ఉండదు. శ్రేష్ఠము,నికృష్ఠము, మానాపమానములు అను భావన ఆయనయందు ఉండదు. విధినిషేధ జాలమునుండి విముక్తుడైనాడు.ఎవరు సద్గురు దేవుని నామస్మరణయందు ఎల్లప్పుడూ రమించి ఉంటారో, అటువంటి భక్తునియొక్క మహిమ అత్యద్భుతము. వేయిపడగల ఆదిశేషుడుగూడా సద్గురుదేవుని మహిమను వర్ణించలేడు.

సచ్చిదానందస్వరూపుడైన సద్గురుదేవుడు ముముక్షువుల హితమునుగోరి నిరభిమానముగా బోధరూపసేవచేసి ఎల్లప్పుడూ స్వస్వరూపస్థితియందు ప్రశాంతముగా ఉంటాడు. ఎవరియొక్క కథా శ్రవణ, మనన, నిదిధ్యాసముద్వారా జ్ఞానము గలిగి మోక్షము ప్రాప్తించునో, అటువంటి సిద్ధారూఢ కథామృతమును శ్రోతలు సావధానముగా ఆలకించగలరు.

సిద్ధాశ్రమమునకు ప్రతిరోజు అనేకమంది స్త్రీ పురుషులు భోజనపదార్థములను తీసుకొొచ్చి సద్గురు సిద్ధనాథునికి అర్పించి, తదనంతరము దానిని అందరూ కలిసి ప్రసాదముగా భావించి సేవించేవారు. ఒకరోజున అనేకమందిభక్తులు భోజనానంతరము భజనచేసుకుంటూ కూర్చున్నారు. స్వామి విశ్రాంతి కోసము వెళ్ళిపోతాడు. స్వామి పోయిన తర్వాత భక్తులందరూ కలిసి ఒక చెరువు కట్టవద్దకు వెళ్లి, ఒక పచ్చనివృక్షము కింద చల్లగాలిని అనుభవిస్తూ విశ్రమిస్తున్నారు. అప్పుడు ఆ భక్తులయొక్క కొందరు పిల్లలు ఆడుతూ ఆడుతూ నలువైపులా చూసుకుంటూ చెరువు దగ్గరకు వెళ్తారు. అక్కడ వారు ఒక సర్పమును చూసినారు. ఆ సర్పము నాలుగు బారల పొడుగుగలదై ఉంది. అది ఎండకు తాళలేక విశ్రాంతి కోసము నీటి సమీపంలో పడుకుంది. దానిని చూసి ఒక బాలుడు సరదాగా ఒక రాయిని తీసుకొని కొట్టినాడు. ఆ దెబ్బతో సర్పము కోపోద్రిక్తయై బుసలు కొడుతూ పడగవిప్పి లేచి నిటారుగా నిలబడి, వెంటనే బాలుని వద్దకు వచ్చి ఆపాదమస్తక పర్యం-తము చుట్టుకుంది.బాలుని అవయవములనన్నిటిని గట్టిగా చుట్టుకుని, కోపంతో వానిని కరిచింది. దానిని విడిపించుకొనుటకు బాలుడు ఎంతోప్రయత్నము చేసినాడు. కాని, నిష్ఫలమయ్యెను.బాలుని సర్వాంగములను బిగ్గరగా చుట్టి, కరచుచుండగా, బాలుడు భీతిల్లి దీర్ఘస్వరముతో ఏడవసాగినాడు. ఆ బాలుని భయంకర పరిస్థితినిచూసి మిగతా పిల్లలు భయపడి పలాయనమై, పరిగెత్తుకుంటూ వచ్చి సర్పద్రష్టయైన పిల్లవాని తల్లిదండ్రులకు ఆ విషయాన్ని తెలియజేశారు. అప్పుడు తల్లిదండ్రులు పరిగెత్తుకుంటూ వచ్చి బాలుని అవస్థనుచూసి అనేకరకములుగా కేకలువేస్తూ ఏడవసాగారు.

ఆ బాలుని తల్లి అనేక విధములుగా ఏడుస్తూ అయ్యో! నా కొడుకు సర్పముచేత వాతబడి-నాడు. ఇప్పుడు నా బ్రతుకు ఏమి కావాలి? వాడు లేనిదే నేను జీవించలేను. నా కాళ్లు వణుకు-చున్నవి. సర్పమునుచూసి నా చిత్తమందు భయమేస్తుంది. కొడుకా! ఆ సర్పమును దూరముగా పడవేయుము—అంటూ దూరముగానుండియే బోరున ఏడుస్తుంది. కుమారుని దగ్గరకుమాత్రము పోవుటలేదు.

ఇంతలో ఆమె భర్తకూడా వచ్చి, ఆ సర్పదష్టయగు కుమారునిచూసి భయపడి నిశ్చేష్టుడై వెనక్కి జరిగి నిలబడ్డాడు. తల్లి దీర్ఘస్వరముతో గొంతెత్తి అరుస్తుంది. తండ్రి బాలుని దగ్గరకు పోవు-టకు భయపడుచున్నాడు. ఇతర జనులందరూ గుమిగూడి అయ్యో పాపము! అంటూ వారి సాను-భూతిని మాత్రమే వెలిబుచ్చుతున్నారు. కాని, రక్షించుటకు మాత్రము ఎవరు ముందుకు రావటము లేదు. బాలుడు సర్పమునుండి తప్పించుకొనుటకు అటునిటు పొరలి ఎంత ప్రయత్నించినా వ్యర్థమే అయ్యింది.

అప్పుడు ఆ బాలుని తండ్రి తన భార్యతో ఇలా అంటాడు. ఏ ప్రయత్నంచేసినా వ్యర్థమే. మన బిడ్డడు మనకు దక్కడు. వాడు చనిపోయినట్లే. వాడు సర్పము కరుస్తుందని తెలిసి కూడా దానిని కొట్టి ఆపదలో చుట్టుకున్నాడు. వాని కర్మ వాడు అనుభవిస్తున్నాడు. దానికి నీవెందుకు ఏడుస్తు-న్నావు? అని అంటాడు.

తల్లి, తండ్రి, ఇతర జనులు ఎన్నో శంకలుచేస్తూ దూరంగానే నిలబడి ఉన్నారు. కాని, వానిని రక్షించుటకు ప్రయత్నము మాత్రము చేయుటలేదు. ఇంతలో ఒకానొకడు సద్గురుదేవుని దగ్గరకు వెళ్లి విషయాన్ని విన్నవించాడు. అప్పుడు దయాసాగరుడైన సిద్ధనాథుడు వెంటనే హడావిడిగా పరుగు పరుగున ఎక్కడైతే జనులు ఆక్రందన చేస్తూ, గుమిగూడినారో, అక్కడకు చేరుకున్నాడు.

సర్పమునుండి బాలుని విడిపించడానికి కొందరు కట్టెతెచ్చి ఏదో ప్రయత్నము చేయబోతు-న్నారు. కాని, ఎవరికి దానిని చంపే శక్తిగాని, ధైర్యముగాని చాలకుండెను. అప్పుడు సద్గురు సిద్ధ-నాథుడు ఆ మందిని త్రోసుకుంటూ చక్కగా ఆ బాలుని వద్దకు వచ్చి, సర్పమును పడగవద్ద ఒక చేతితో పట్టుకొని, మరొకచేతితో బాలుని పట్టుకొని సర్పమును విడిపించి దూరముగా విసిరి వేసినాడు. అది నిశ్చేష్టమై పడిపోయింది.

అబ్బో! చూసారా! లోకముయొక్క రీతి. తల్లిదండ్రులయొక్క ప్రేమ తమ సంతానముపై ఎంతో అద్భుతంగాఉంటుంది. కాని,సంకటమునుండి రక్షించలేకపోయారు. సద్గురుదేవుడే నిజమైన తల్లి, తండ్రి, ఆపద్బాంధవుడు.

**శ్రుతి:–నవాఽరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి ।**

**ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ॥** (బృ. ౨-4-5)

**శ్లో ॥ విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్పిండః పిండాత్తథేంద్రియమ్ ।**

**ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా పరప్రియః ॥** (వే.పంచదశి.1౨-60)

లోకులు నావారు నావారు అని ఎంతగా ప్రేమించినా సంకటము తటస్థమైనప్పుడు ఎవరిని ఎవరు రక్షింపజాలరు. ఒక సద్గురుదేవుడు తప్ప ఆపత్సమయమందు రక్షించు నిజమైన ఆపద్బాం-ధవుడు, మరొకడు లేడు. జనుల దుఃఖమును దూరముచేయుటకే సద్గురుదేవుడు అవతరించినాడు.

అందుకనే సద్గురుదేవునియొక్క దివ్యపాదారవిందములను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండాలి. అట్టివారికి జన్మమరణాది దుఃఖములు దూరముగా పారిపోగలవు. సద్గురుదేవుడు పరిపూర్ణ దయాహృదయుడు. ఆయన ఎవరి గుణదోషములను చూచెడివాడుకాడు. ఈ విధముగా సద్గురు సిద్ధనాథుడు సర్పముచేత వాతబడి, సర్పముయొక్క కాట్లతో శరీరమంత గాయపడిన పిల్లవాణ్ణిచూసి, ఆ బాలుని శరీరముపై సద్గురుదేవుడు తన అమృతహస్తముతో స్పృశించినాడు. వెంటనే ఆ బాలుడు యథావత్తుగా స్వస్థతను పొందినాడు.

స్వామి ఆ బాలుని చేయి పట్టుకొని మఠములోకి తీసు కెళ్లి విభూతిని ధరింపచేసి, నీకు ఇక సర్పముయొక్క భయములేదు. నిర్భయముగాఉండుము–అని ఆశీర్వదిస్తాడు. ఇట్టి 'సద్గురుమావూలి' అనాథజీవులను విపత్తులనుండి పరిరక్షిస్తూ, అభయ వాక్కులద్వారా ధైర్యమును చేకూర్చి, **"అభయ దాత"**యను బిరుదునొందినాడు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు లక్ష్యార్థరూపమైన సారాంశమును యథాయోగ్యముగా గ్రహించవలసింది.అజ్ఞానావస్థయందు జీవుడు తనయొక్క హితాహితమును తెలియక శబ్దాదివిషయాలయందు ప్రవేశిస్తాడు. విషయారణ్య భూములయందు ఆడుతూ, అనుభవిస్తూ మనస్సనే రాతిని విసరి మోహమనే సర్పమును కొడతాడు. అప్పుడు ఆ మోహరూప సర్పము అజ్ఞజీవున్ని క్రోధోద్రిక్తయై జన్మమరణరూప కాటు వేస్తుంది. మోహరూపసర్పముయొక్క విషముచేత సంతప్తుడై అనేక యాతనలను అనుభవించి మృత్యుముఖమున పడతాడు. అజ్ఞజీవునికి రక్షణగూర్చి ఏఉపాయము దొరకదు. అప్పుడు సద్గురుదేవుడు పరిగెత్తుకుంటూ వచ్చి, మోహరూప సర్పబాధనుండి జీవుని విడుదల జేస్తాడు.

**విషం విషయవైషమ్యం న విషం విషముచ్యతే ।**
**జన్మాంతరఘ్నా విషయా ఏకదేహహరం విషమ్ ॥** (యో.వా.1-29-13); (మహోప.3-54)
**శబ్దాదిభిః పఞ్చభిరేవ పఞ్చ పఞ్చత్వమాపుః స్వగుణైర్నిబద్ధాః**
**కురఙ్గ మాతఙ్గ పతఙ్గ మీన భృఙ్గా నరః పఞ్చభిరఞ్చితః కిమ్ ॥** (వివేకచూడామణిః 78)

మోహమనే సర్పము విషరూప పంచవిషయాలు అనే కాట్లువేయుటద్వారా పాపమనే విషరూప దుష్టసంస్కారములు పెరిగిపోయినవి. వాటిని సమూలముగా నివృత్తి చేయడానికి, నిర్విషయ స్వరూపుడైన సద్గురుదేవుడు బోధరూప తన అమృతహస్తముచే జీవుని స్పర్శించి,మననరూప విభూతిద్వారా తరింపజేస్తాడు. పాపసంస్కారబీజములను సమూలముగా నివృత్తి చేస్తాడు. సద్గురువుయొక్క కృపావిశేషముచేత దీనులైన ఆర్తులు తప్పకుండా రక్షింపబడతారు. ఎవరైతే సంసారదుఃఖముచే బాధపడుతున్నారో, వారిని సద్గురుదేవుడు తప్పకుండా రక్షిస్తాడు.

ఓ సద్గురు సిద్ధనాథా! నీకు సాష్టాంగ ప్రణామములు. ఎల్లప్పుడు నాపైన నీయొక్క ప్రగాఢ-మైన ప్రేమను ఉంచుము. దీనుడనైన నన్ను దుస్తరసంసారమునుండి తరింపజేయగల సమర్థుడవు నీవేయని,నీయొక్క పాదపద్మములను అనన్యభావముచేనాశ్రయించితిని.నాబుద్ధి సాంసారిక వాస-నలచే దూషితమున్నందున నేను సంసారములో బద్ధుడనై, దుఃఖితుడనై నాయొక్క ప్రార్థన నీకు వినబుచ్చుచున్నాను. కావున, నా ప్రార్థననాలకించుము.

అయినాగాని,నీవు అపారకృపాసముద్రుడవని నాయొక్క బుద్ధి నిశ్చయముచేసింది. ఆల-స్యమైనా సరే ఎందుకు కాదు, నీయొక్క కృప నాయందు కలుగుననే నిశ్చయముచేత నేను ధైర్యంగా ఉన్నాను. నీయొక్క కృప ఎప్పుడు కలుగునో, అదే క్షణమందు నా భవబంధము నివృత్తమగును. అటువంటి సుదినము ఎప్పుడు వస్తుందా..... అని నిరీక్షిస్తున్నాను.

ఓ శ్రోతలారా! ఇప్పుడు మీరు సావధాన చిత్తులై ముందర అధ్యాయమునందు సద్గురుదేవుని ప్రేమరస యుక్తమైన చరిత్రను వినగలరు. తద్వారా అజ్ఞానరూప చీకటి దూరమగును.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము మంగళప్రదమైనది. సుఖశాంతులను చేకూర్చునది. అటువంటి పవిత్రమైన చరిత్రను వినినంతనే సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణములకు శ్రీ శివదాసస్వామి ఈ పదహారవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదిహేడవ అధ్యాయము

పద్యానువాదము:—మూడు కాలములయందు బాధింపబడని, తమస్సునకు పరమైన పదవి యందు వసించువాడవు, సామాన్యవిశేషభావరహిత స్వప్రకాశముచే సకలజగత్తును ప్రకాశింపజేయగలవాడవు.(తెలుసుకునేవాడవు).శ్రేష్ఠమైన సుఖస్వరూపుడవు.నిత్యజ్ఞానసంపన్నుడవు.నీయొక్క నిజస్వరూపమును బోధించేవాడవు. గుణవిశేషరహితుడవై మాయామలరహిత నిత్యశుద్ధుడవైన పరమేశ్వరుడవు. ఐనను భక్త,అభక్తజనులయొక్క భవపాశమును నివృత్తిచేయుట కొఱకై మాయా యోగముచే నరులలో ఉత్తముడగు గురురూపమున అవతరించిన ఓ సిద్ధనాథా! నీకు సాష్టాంగ దండవత్ ప్రణామములు.

కరుణాస్వరూపుడవైన ఓ సద్గురునాథా! నీకు నమస్కారములు. నిన్ను ఆశ్రయించనివారి జన్మ వ్యర్థము. అందుకని, అట్టి అజ్ఞానిజనులను తరింపచేయుటకు నీవు స్వయంగా అనేక ఉపాయములను పన్నినావు. ఉత్సవరూపమైన అనేక ఉపాయములను కల్పించి, మనోహరమైన వస్తు సంపత్తిని ఏర్పరచి, వాటిని దర్శింపగోరి వచ్చిన అజ్ఞాని జనులను, ఏదో నిమిత్తముగా ఎలాగో వచ్చారు గదా అని వారిపై దయతలచి వారిని ఉద్ధరిస్తావు. నీయొక్క దర్శన, స్పర్శనభాగ్యము కలిగిన మరుక్షణమే జన్మాంతరములయొక్క పాపరాశి నష్టమవుతుంది. నీయొక్క సేవాభాగ్యముద్వారా విషయసంస్కారములు లజ్జచేత,భయముజెంది నివృత్తమవుతాయి. నీయొక్క చింతనద్వారా కామ, క్రోధములు బయలువెడలును. అంతఃకరణము ఎప్పుడు సద్గురుసాన్నిధ్యమందు వసించునో, అప్పుడు లోభమోహములు గంతువేసి పలాయనమవుతాయి.

సద్గురుదేవునియొక్క కృపవలన కామక్రోధములు, లోభమోహములు పలాయనము చిత్తగించినప్పుడు–ఇక మదమత్సరముల మాటేమిటి? ఎంతవరకు జీవులు సద్గురు(సాన్నిధ్యమునకు) మఠమునకు వెళ్లరో, అంతవరకు అరిషడ్వర్గములు అంతఃకరణమనే ఇల్లును ఆశ్రయించుకుని ఉంటాయి. ఎప్పుడు సద్గురు మఠమునకు వెళ్లి సద్గురు సాన్నిధ్యమును బడయుదురో, అప్పుడు షడ్రిపులు సమూలంగా నష్టమవుతాయి.ఈప్రకారముగా సద్గురుపదసాన్నిధ్యమును బడసిన పిమ్మట సద్గురు బోధామృతపానము చేయుటవలన భక్తులకు ఆనందమనే తెప్పలు ఉప్పొంగివస్తాయి.

భక్తులు వాటియందు స్నానము చేసి, ఇక ఇంటిదిక్కు ధ్యాసలేనివారై పరమానందమును అనుభవించెదరు.

నిర్విషయ సంస్కారము వృద్ధియగుకొలది సంసారము దుఃఖరూపముగా తోస్తుంది. ఒకసారి నిర్విషయసుఖము (పరమసుఖమును) అనుభవించాడంటే, ఇక సంసారములో ప్రవృత్తులు కావడానికి వెనుకాడుతారు. సంసారములో ప్రవేశించి నశ్వరభోగాలను అనుభవించుటకు మనసు ఒప్పుకొనదు. భక్తునియొక్క హృదయమునందు సంపూర్ణ వైరాగ్యముండుట వలన ఆయనకు ఈ నశ్వరదుఃఖరూప సంసారమందు హేయవృత్తి ఉదయిస్తుంది. సద్గురువునకు శరణుజొచ్చిన వారికి శాశ్వతమైన నిత్యమైన సుఖము లభించును. సద్గురుదేవునియొక్క కృపవలన సకల దుఃఖములు, జన్మమరణరూప మహాదుఃఖముతోసహా నివృత్తి కాగలవు. ఇటువంటి దయాస్వరూపుడవైన ఓ సద్గురునాథా! భక్తులను ఉద్ధరించు నిమిత్తమై, లీలాస్వరూప వ్యవహారములు అనేకములు కల్పిస్తావు. వారియొక్క గుణదోషములు గమనించకుండా దయార్ద్ర హృదయముతో వారిని ఉద్ధరిస్తావు.

ఇప్పుడు, రసవత్తరమైన,లీలాయుక్తమైన కథను స్వామి వివరిస్తున్నాడు. శివరాత్రి పండుగ నిమిత్తముగా అనేక దూరప్రాంతములనుండి భక్తులు ఉత్సవవైభవమును దర్శించడానికి వచ్చారు. శ్రీ సిద్ధాశ్రమ మఠమునకు ఎదురుగానున్న కొలను వద్ద ఒక మామిడిచెట్టు కింద కట్టపై (అరుగుమీద) నీడకు నలుగురు జంగమయ్యలు కూర్చొని,వారిలోవారు పరస్పరము ఈ విధముగా సంభాషణము చేయుచున్నారు.

ఒక్కొక్కరి వక్షస్థలముపైన స్వచ్ఛమైన వెండితో తయారుజేయబడిన లింగము ధరించబడి ఉంది. నుదుటన విభూతినిధరించి ఎంతోశోభాయమానముగా కనుపించుచుండిరి.వారిలో ఒకడు ఈ ప్రకారముగా అంటున్నాడు. ఈస్వామిని 'ఆరూఢుడు'అని అంటారు. కాని, వాస్తవానికి ఈయన మూఢుడున్నాడు. అంతేగాక, జడబుద్ధిగలవాడున్నాడు. ఇటువంటి వానిని చూసి ఎందుకింత వైభవముగా ఉత్సవము చేస్తున్నారు.

రెండవవాడు అంటాడు–ఈయన మెడలో లింగములేదు. కావున, ఈయన నిశ్చయముగా శూద్రుడున్నాడు. ఇటువంటి వానికి ఈ వివేకహీన మూర్ఖజనులు పలిపలివిధముల దండాలు పెట్టడము, పూజించడము–ఇదంతా పిచ్చి చేష్టలుగాక మరేమిటి?లింగయుక్తమైన జంగము శ్రేష్ఠుడు, పూజింపదగినవాడు మరియు గురువు అని శాస్త్రము చెప్తుంది. కాని, ఈయనకు లింగము లేదు. శ్రేష్ఠకులజుడు కాడు. కావున, ఈ భ్రష్టుడైన వానిని ఈ మూర్ఖజనులు పూజించి, బ్రష్టులై కష్టాల పాలవుతున్నారు–పాపము!

మూడవవాడంటాడు–మొన్న నలుగురు మహమ్మదీయులు వచ్చి ఈయనను కాళ్లు చేతులు కట్టి బాగా కొట్టి అనేక విధములుగా హింసించినారు. ఎంత హింసించినాగాని వారిని ఏమాత్రము

వారించలేదు. ఎందుకనగా ఈయనకు బుద్ధిలేదు. ఆ మహమ్మదీయులు ఇంతగా హింసించినారు అనే లజ్జగూడా లేకుండా,ఎలాంటి సంకోచము లేకుండా రథముపై ఆరూఢుడౌవుతున్నాడు.ఈయన ఎంత నిర్లజ్జగా ఉన్నాడు–మీరే చెప్పండి మిత్రులారా! మరియు,

నాలుగవవాడంటాడు–నాలుగు నెలల క్రితము నేనొక వినోదము కోసము, ఒకనాటి రాత్రిపూట సిద్ధారుడస్వామి చిద్ఘనానంద సమాధివద్ద కూర్చుని ఉన్నప్పుడు, నేను వెనుకనుండివెళ్లి, ఆయన కట్టమీద కూర్చొని ఉండగా, రెండుచేతులు గట్టిగాపట్టుకొని నా శిరస్సుపై వరకు లేపి ఒక్క-సారిగా భూమిపైన విసిరి కొట్టినాను. తాను–ఏ విధంగా కప్ప నాలుగు కాళ్లు చాచుకొని భూమిని కరుచుకొని చనిపోయినట్లుగా భూమిపై బోర్లగింతల పుడుతుందో, అట్లు పడిపోయినాడు. ఈ శిక్ష ఈశూద్రునికి ఇంకా సరిపోదా? సరిపోయింది–అది ఈయనకు సిగ్గు అనిపించడము లేదా? అనుకొని ఫకఫకా నవ్వినాడు.

అప్పుడు మొదటి వాడంటాడు. అయ్యయ్యో! నీవు ఎంత ఘోరకృత్యము చేసినావు. ఆయనకు ఎలాంటి అపాయముచేయకుండా బోధించి సన్మార్గమునకు తేవలసిఉండెను. నీవు ఆ మహారాజు-నకు అటువంటి దుర్మార్గమైన కృత్యము చేయడము వల్లనే, నీకు ఆయన ఉసురు దగిలి, నీ భార్య, నీ కుమారుడు చనిపోయినారు. నీవు ఆ పాపము ద్వారా దిక్కులేని పిశాచములాగా తిరుగుతున్నావు. సమాజంలో నిందలపాలయ్యావు.

ఆ నాలుగవ దుష్టుడు ఇలా అంటాడు. ఒరేయ్! ఏమిత్రా నీవు బాగా నీతులు చెప్తున్నావు. చచ్చేవాళ్లు ఎలాగూ సహజంగానే చనిపోతారు.నేను ఆ పిచ్చివాన్ని కొట్టడమేమిటి? వాని ఉసురు తగిలి నా భార్య బిడ్డలు చావడమేమిటి? నేను వానికి ఇచ్చిన శిక్ష యోగ్యమే ఉంది. నేను చేసిందే నాకు సమాధానము–అని అంటాడు.

అప్పుడు రెండవవాడంటాడు. ఒరేయ్! ఇక మన సంభాషణ చాలు. రండి. ఇప్పుడు ఆ సిద్ధారూఢస్వామి శిరస్సుపైన సువర్ణకిరీటమును ధరింపజేసి, సింహాసనముపైన గూర్చుండబెట్టి పూజిస్తారు. ఆ వైభవము ఎలా ఉంటుందో చూద్దాం పదండి–అని మఠమువైపు బయలుదేరినారు.

త్రోవలో మఠాధికారియైన "పటుదప్ప" తన సహచరులతో ఈ దుష్టులకు కలిసినాడు. అప్పుడు అతని సహచరులలో ఒకడు ఆ దుర్మార్గులను చూసి, ఒరేయ్ రుద్రయ్య! నీమెడలో లింగ-ము లేదేమిటిరా? అని అడుగగా, మిగతా ముగ్గురుగూడా వారివారి మెడలలో తడిమి చూసుకు-న్నారు. కాని, వారి వక్షస్థలములలో లింగములు లేవు. వారు ఆశ్చర్యచకితులైనారు. వారు నలుగురు వారివారి మెడలలో ఎంత వెతికినా లింగములు కనిపించలేదు. వారు విస్మయమునొంది, ఏమిటీ ఆశ్చర్యము? అని దిగ్భ్రాంతి చెందినారు. లింగముల గూర్చి వెదుకుతూ త్రోవలో అటు ఇటు చూస్తూ వారు ఇంతవరకు కూర్చున్నటువంటి కట్టవద్దకు వచ్చి, ఆ మామిడి చెట్టు క్రింద అంతటా శోధించి-

నారు. కాని, లింగములు చిక్కలేదు. ఇప్పుడే మెడలో ఉన్నట్లుండి లింగములు మాయమైనవి–అని ఖిన్నమనస్కులై మళ్లీ పటుదప్ప వద్దకు దీనవదనులై వచ్చినారు.

అప్పుడు 'పటుదప్ప' వారితో అంటాడు. మీరు మీ లింగములను కోల్పోయినందున మీరు ప్రాణత్యాగము చేయవలసి వస్తుంది. ఇది లింగాయతుల నియమముంది–అని చెప్పగా వారు ఇంకా భయకంపితులయ్యారు. అప్పుడు రుద్రయ్య అంటాడు. ఇప్పుడు మేము నలుగురము కలిసి మాట్లాడు-కున్నప్పుడు మా వక్షస్థలములందు లింగములు ఉండెను. ఇప్పుడే కనపడకుండా అయినవి. ఇదేమి విచిత్రమో తెలియడము లేదు–అంటాడు.

అప్పుడు 'పటుదప్ప' వారితో అంటాడు. మీరు ఏదో సాధునింద (సద్గురునింద) చేసినట్లు ఉన్నారు. అందుకే మీకు ఈ దుస్థితి కలిగింది. రుద్రయ్య వెంటనే గడగడ వణుకుతూ అయ్యా!పటు-దప్ప! నువ్వు సరిగ్గా గమనించినావు. మేము నిజంగానే గురునింద చేసినాము. మీకు ఆ వ్యర్థమైన ముచ్చట్లు ఏమి చెప్పాలి–అని అంటాడు.

'పటుదప్ప'వారితో ఇలా అంటాడు. మీరు చేసిన అపరాధమును ఒప్పుకొని, సాధునింద మహాపాపమని ప్రాయశ్చిత్తము పొందుటకు, సద్గురుదేవుని శరణపొందండి. లేకుంటే మీకు ఇంకా దుస్థితి ఏర్పడుతుంది. అప్పుడు రుద్రయ్య పశ్చాత్తాపముతో వారు చేసిన సద్గురునిందను పటుదప్పతో చెప్పినాడు. మిగతా ముగ్గురు సిగ్గుతో తలవంచుకొని నిలబడినారు.

పటుదప్ప వారితో అంటాడు. మీరు గురునింద చేయడమువల్ల మీకు ఈ దుర్గతి పట్టింది. ఇప్పుడు పశ్చాత్తాప చిత్తులై సద్గురు దేవునికి శరణు పొందండి అట్లయినచో మీయొక్క పాపము నివృత్తమగును. లేనిచో దుఃఖము తప్పదు. మీయొక్క కళ్యాణం(మేలు)కలగాలంటే మీరు తప్పని-సరిగా క్షమాపణ చెప్పుకొని తీరవలసిందే, లేనిచో ఎన్నో విపత్తులు అనుభవించవలసి ఉంటుంది. అని పటుదప్ప చెప్పగా భయపడి, వారు పటుదప్ప మఠమునకుపోవుచుండగా ఆయనవెనుక క్షమా-పణ చెప్పుకొనుటకు మఠమునకు నడవసాగినారు. పటుదప్పను వెంబడించి ముగ్గురు దుర్మార్గులు పోవుచుండిరి. కాని, నాలుగవ దుష్టుడు అహంకారయుక్తుడై వారితో వెళ్ళలేదు. అక్కడే ఉండిపోయి నాడు. వారు మఠమువద్దకు వెళ్ళి, భవ్యమైన మఠమును చూసి, మండపమందు ఆశ్చర్యకరమైన దృశ్యములు చూసి చకితులైనారు.

దేదీప్యమానమైన సింహాసనమందు తేజస్వరూపుడైన సిద్ధనాథుడు సుఖాసీనుడై కూర్చు-న్నాడు. శిరస్సుపైన సువర్ణకిరీటము, కంఠంలో వైజయంతిమాల, దివ్యమైనమేనుపై పీతాంబరము-ను ధరించి ఉన్నాడు. ఆపైన పుష్పహారములు శోభాయమానమై సువాసనలను వెదజల్లుచుండెను. ఈవిధంగా వైభవోపేతముగా అలంకరింపబడిన స్వామియొక్క ముఖారవిందము ఉదయకాలమం-దలి భానునివలె ప్రకాశించుచుండెను. సద్గురుదేవునియొక్క దర్శన మాత్రముచేతనే శాంతవదనుడై

భక్తులందరకు సుఖశాంతులనొసంగుచుండెను. ఏవిధముగా సూర్యకిరణములు భూమండలమంతా ప్రసరిస్తాయో, అదేవిధంగా భక్త అభక్తజనులపై స్వామియొక్క శాంతికిరణములు ప్రసరించి జనుల యొక్క సకలమనోవృత్తులను ఉపశమింపచేసి శాంతిని కలగజేస్తున్నాయి. సద్గురుదేవుని ఆశ్రయించిన భక్తుని అంతఃకరణమునందు దుష్టవృత్తులకు స్థానముండదు. అవి అడవులవెంట పరుగెత్తుతాయి. అప్పుడు అంతఃకరణము ప్రశాంతమై నిర్మలమై ఏకాగ్రతను పొందుతుంది.

పటుదప్ప వెంబడివెళ్లిన ఆముగ్గురు అయ్యలు,స్వామి సాన్నిధ్యమునకువెళ్లి,దివ్యమైన మంగళ స్వరూపాన్ని దర్శించినంతమాత్రముననే వారియొక్క అంతఃకరణమునందలి దుష్టవృత్తులు సమూలంగా నష్టమై చిత్తము ఏకాగ్రతను పొందినది. కనురెప్పలు కొట్టకుండా స్వామి పాదాలను దర్శిస్తూ నిశ్చేష్టులై నిలబడిపోయారు. అంధకారయుక్తమైన ప్రదేశములో హఠాత్తుగా ఏర్పడిన మెరుపువలన చీకటి యెట్లు తిరస్కృతమై అక్కడున్నటువంటి వస్తుసామగ్రులు స్పష్టంగా కనబడతాయో, అదేవిధంగా అజ్ఞానయుక్తమైన వారి అంతఃకరణమునందలి దుష్టవృత్తులు సమూలంగా నష్టమై సద్గురుదేవుని దర్శనభాగ్యముచేత జ్ఞానజ్యోతి ప్రకటమై స్వరూపానందమును అనుభవించినారు. అవిద్య నష్టమైనది. సద్గురుదేవుని దర్శనభాగ్యముచేత మదమత్సరములు పలాయనము చిత్తగించినవి. వారి మనస్సు సద్గురు పాదారవిందములయందు లగ్నమైనది. మళ్ళీ పూర్వస్థితి స్మృతికి రాలేదు. అనగా, మళ్ళీ వెనక్కి తిరిగి పోవాలని అనిపించలేదు. సద్గురు సాన్నిధ్యముననే ఉండిపోవాలని అనిపించింది. వారి చిత్తము ఎంతో పరితాపమును చెందినది. స్వామివద్దకు మేము క్షమాభిక్ష కోరడానికి ఏ ముఖము పెట్టుకొని పోవాలి? స్వామిని ఎన్నో దుర్భాషలాడినాము. స్వామి మమ్ములను క్షమిస్తా- డా? అని సంకోచించుచుండగా, అప్పుడు పటుదప్ప వారిని తీసుకొని మెల్లగా స్వామి వెనుక భాగమున నిలబెట్టినాడు.

సద్గురు సిద్ధనాథస్వామి వారిని చూసి, దయా హృదయుడు కాబట్టి, వారిని ఆదరించి కూర్చుండమని ఆజ్ఞాపించినాడు. పటుదప్ప స్వామికి నమస్కరించి కూర్చున్నాడు. ఇక ఆ ముగ్గురు జంగమయ్యలు స్వామియొక్క చరణకమలములపై సాష్టాంగ దండవత్ ప్రణామములు చేస్తూ జడములాగా పడినారు. పటుదప్ప స్వామితో ఈ ప్రకారంగా అంటాడు. స్వామీ!వీరు మన భక్తులే. వీరు నిన్ను ఇంతకుముందు ఎన్నో దుర్భాషలాడినారు. దానికి తగిన ఫలితమును పొంది,పశ్చాత్తాపచిత్తులై నిన్ను శరణుబొందినారు. వారిని క్షమించుము స్వామీ. అని వారి అపరాధమును విన్నవించి వేడుకుంటాడు.

అప్పుడు సద్గురుదేవుడంటాడు. వారు ఎప్పుడు నీతో వారి అపరాధమును తెలుపుతూ పశ్చాత్తాపమును పొందినారో, అప్పుడే నేను వారిని క్షమించాను. ఇప్పుడు వారికి మనశ్శుద్ధి కలిగింది–అంటూ......

సద్గురునాథుడు తన చేతులను మెల్లగా వెనుకకు పోనిచ్చి నాలుగు వెండిలింగములను తీసినాడు. దారములతో సహా ఉన్నటువంటి ఆ లింగములను చూసి వారు ఆశ్చర్యచకితులైనారు. సిద్ధనాథుడు అంటాడు–చూడండి, ఈ లింగములు మీవేనా? మంచిగా చూడండి. ఇవి ఒక పిల్ల-వానికి త్రోవలో దొరికినవని, నాకు ఇచ్చి పోయినాడు–అన్నాడు. ఆ ముగ్గురు అయ్యలు స్వామీ! ఈ లింగములు మావే ఉన్నవి. అంటూ స్వామికి నమస్కరించి ఆ లింగములను తీసుకొని యథావత్తుగా మెడలో ధరించి, ఎంతో ఆనందమును పొందినారు.

ముగ్గురు మూడు లింగములను వారి కంఠములందు ధరించగా, ఒక లింగము మిగిలింది. ఈ లింగము ఆ నాలుగవవానిదై ఉంటుంది. కాబట్టి, వానిని మేము ఇప్పుడే తొందరగా తీసుకొని వస్తాము,అంటూ వెళ్ళిపోయినారు.ఇక్కడ బయటనేఉన్నటువంటి నాలుగవ అయ్యను ఈముగ్గురు అయ్యలు సమీపించి ఒరేయ్! స్వామి దయాసాగరుడు. మమ్ములను క్షమించాడు. నువ్వుగూడా వెళ్ళి స్వామిని క్షమాపణ కోరుము–అని చెప్పగా వాడు స్వామివద్దకు ఏ ముఖం పెట్టుకొని పోవాలి? అని లజ్జితుడై ఊరకుండెను.

అప్పుడు వీడి సంగతి చిన్నలకు పెద్దలకు అందరికీ తెలిసింది. వారు "స్వామిని ఈవిధంగా దూషిస్తాడా" అని తలకొక రాయితో వాడిని కొట్టనారంభించారు. ఈ ముగ్గురు జంగమయ్యలు కూడా వీడు ఎంతచెప్పినా వినడములేదని వానిని కొట్టారు. అప్పుడు ఆ నాలుగవ అయ్యకు కోప-మువచ్చి మళ్ళీ ఈముగ్గురిలో ఒకడిని కొట్టినాడు. ఇట్లు వాడు కొట్టగా, వీరందరూ కలిసి ఆ నాలు-గవ అయ్యను చితకబాదినారు. స్పృహదప్పి భూమిపై పడిపోయినాడు. అయినా వానిని విడువక కొందరు తన్నినారు. పిల్లలు రాళ్లతో బాగా కొట్టినారు. వాడి సగముప్రాణము వెళ్లిపోయి, కొన ఊపిరితో ఉన్నాడు.

ఇంతలో పటుదప్ప వాడిని వెతుకుతూ వెతుకుతూ అక్కడున్న జనసమూహమును చూసి అక్కడకు వచ్చినాడు. పటుదప్ప వారిని–ఏమి జరిగింది? అని అడుగుతాడు. అప్పుడక్కడున్న జనము జరిగిన విషయమంతా చెప్పినారు. వారు చెప్పినదంతా విని పటుదప్ప హృదయము ద్రవించి అయ్యో! నేను ఎంత చెప్పినా వినక ఈ దుర్గతిని తెచ్చుకున్నాడంటూ వాడిని మెల్లగా లేపి నిలబెట్టినాడు.

అప్పుడు ఆ అయ్య గర్వము దిగిపోయింది. అభిమానరహితుడై వానియపరాధమును ఒప్పుకొని పరితాపముజెంది ఏడుస్తూ పటుదప్పయొక్క కాళ్ళమీద పడినాడు. పటుదప్పతో వాడు ఈ విధంగా అంటాడు—నేను నా జీవితంలో ఎన్నో క్షమించరాని అపరాధములు చేసినాను. సద్గురు దేవుని ఎంతగానో నిందించినాను. నా పాపము పండింది. ఈచివరి క్షణాల్లోనైనా నేను నా అప-రాధమును మన్నించమని సద్గురుదేవుని చరణాలను ఆశ్రయించి క్షమాపణవేడుకుంటాను. దయా-

సాగరుడైన ఆ సద్గురుదేవుని సన్నిధానమునకు నన్ను దయచేసి తీసుకెళ్లండయ్యా-అని మొరపెట్టుకుంటాడు.

పటుదప్ప వాడి దీన పరిస్థితిని చూసి, వీడి పొగరు అణిగింది–అని కనుకరించి, వానిని సద్గురుదేవునివద్దకు తీసుకెళ్లడానికి నిశ్చయించుకొని, ఇద్దరు కలిసి వాని చేతులను వీరి భుజాలపై వేసుకొని, వాడిని మెల్లమెల్లగా ఎక్కడైతే సిద్ధనాథుడు మండపమునందు కూర్చుని ఉన్నాడో, అక్కడికి తీసుకెళ్లినారు. వాడు వినమ్రుడై స్వామి చరణాలపైబడి నన్ను క్షమించమని పరిపరివిధముల వేడుకున్నాడు.

పటుదప్ప ఆ అయ్యయొక్క కథావృత్తాంతమునంతా వివరించి స్వామికి చెప్పినాడు. ఈ జంగమయ్య నాలుగునెలల క్రితము నిన్ను హింసించి,ఎన్నో దుర్భాషలాడినాడు. ఆ పాపము తగిలి వాని భార్యాబిడ్డలు చనిపోయినారు. మళ్లీ ఈరోజు కూడా నిన్ను ఎన్నో దుర్భాషలాడినాడు. దానికి తగిన ఫలితమును అనుభవించినాడు. జరిగిన దానికి పశ్చాత్తాపముజెంది చేసిన అపరాధములను ఒప్పుకొని, ఇప్పుడు నిన్ను శరణుజొచ్చినాడు. అని ఈ విధంగా పటుదప్ప ఆ జంగమయ్య వృత్తాంతమును స్వామికి తెలుపగా, స్వామియొక్క హృదయము ద్రవించి, స్వామి ఆ అయ్య చేయిపట్టుకొని వానిని తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని—

సద్గురుదేవుడు ఇలా అంటాడు. పటుదప్పా! ఈయన ఉత్తమపాత్రుడు, యథాయోగ్యుడున్నాడు. ఈయనపై తప్పకుండా దయచూపవలసిందే. ఈయనయొక్క రోగమును నివారించి, యోగక్షేమములు నేను స్వయంగా చూసుకొని ఆనందమును ప్రసాదిస్తాను.రోగము ఏవిధంగా స్థూలదేహమును పీడిస్తుందో, అదే విధంగా దుఃఖము లింగదేహమును పీడిస్తుంది. (ఆయాసము, పీడ, స్థూలదేహమునకు కలిగినా లేక ఆదిభౌతికతాపము మనసుకు కలిగినా దుఃఖము లింగదేహమునకే కలుగుతుంది). రోగిపై లోకము జాలి చూపుతుంది. కాని, సాధువునకు దుష్టునిపై దయ కలుగుతుంది.

అందువలన ఆ జంగమయ్యపై స్వామికి అత్యధిక దయగలిగి, ఈయనను అన్ని విధముల రక్షించాలనుకుని, వానియొక్క శారీరికబాధను మరియు చిత్తరోగమును సమూలంగా నివృత్తిచేసి ఆరోగ్యమును ప్రసాదించినాడు. అప్పుడు ఆ అయ్య "తాను చేసిన అపరాధమును మరిచి తనకు స్వామి ఎంతో దయతలచి తన యొక్క స్థూల సూక్ష్మదేహముల రోగమును పోగొట్టినాడు" అని అనుకొని తనలో తాను లజ్జితుడై, స్వామిని ఈ విధంగా స్తుతి చేయుచుండెను. ఓ సద్గురుసిద్ధనాథా! దయామూర్తివైన నీకు జయము జయము.నీయొక్క దర్శనభాగ్యముచేత నాచిత్తమందు ఆనందము ఉదయించి, మనస్సు శాంతించింది. కృపాసాగరుడైన నీవు నన్ను దయతలచి చేరదీయకున్న, నేను నరకయాతనకు వెళ్లేవాణ్ణి. దీనుడనైన నన్ను కాపాడినావు. నన్ను నీయొక్క భక్తులలో ఒకనిగా

చేర్చుకొని, నీ దాసుడనైన నన్ను ఈ భవసాగరమునుండి తరింపచేసి, ఈ దీనార్తిని రక్షించి, మీ యొక్క కృపాదృష్టిని కురిపించి ఆశీర్వదించుము స్వామీ! అని పరిపరివిధముల వేడుకుంటాడు.

అప్పుడు సిద్ధనాథస్వామి తాను స్వయంగా అయ్యయొక్క లింగమును వాని కంఠమునందు ధరింపజేసి ఆశీర్వదించినాడు. ఆ జంగమయ్య తన మనస్సుయందు ఎంతో శాంతమును పొందినాడు.

**శ్లో ॥ అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్ ।**

**సాధురేవ స మన్తవ్య సమ్యగ్వ్యవసితో హి సః ॥** (గీత ౯-30)

శ్రీమద్భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ ఇలా బోధిస్తాడు. ఓ అర్జున! ఎంతటి దురాచారుడైనాగాని, నన్ను అనన్యభావముచేత భజించినట్లయితే ఆయన సాధువులలోనే పరిగణింపబడతాడు. ఇట్టి భగవద్వచనములను శ్రీ సద్గురుదేవుడు సార్థకము చేసినాడు. సద్గురు చరణాలను ఆశ్రయించిన వారికి కఠినత్వమంటూ (అసాధ్యమంటూ)ఏమీ ఉండదు. కఠినమైనటువంటి శిలలుకూడా ఉద్ధరించబడతాయి. అనగా ఎంతటి కఠినహృదయముగల దుర్మార్గులైనాగాని సద్గురుచరణాలను ఆశ్రయించినట్లయితే తప్పకుండా ఉద్ధరించబడతాడు.

ఓ శ్రోతలారా! ముముక్షువులకు ఉపయుక్తమైన, గుహ్యమైన ఈ కథయొక్క వేదాంతపర లక్ష్యార్థమును ఇప్పుడు వినగలరు. మనసు, బుద్ధి, చిత్తము మరియు అహంకారము (అంతఃకరణ చతుష్టయము) ఈ నలుగురు చతురులైన అయ్యలు–అని తెలుసుకొనవలెను. సంకల్ప వికల్పములు, నిశ్చయము, చింతన, నేను నాది అనే అహంవృత్తులు–ఇవి క్రమముగా మనసు, బుద్ధి, చిత్తము, అహంకారముల ధర్మములు, నలుగురి అయ్యలయెదపై వారి ఆచారవ్యవహారములను తెలియజేయు లింగములు–అని తెలుసుకోవాలి.ఈ నాలుగు స్వస్వరూపసాక్షిచైతన్యమును నిత్యము నిందిస్తాయి. సచ్చిదానందస్వరూప బ్రహ్మము తానై ఉండి, అనిత్యమగు దేహాదులు తానని భ్రమించడమే నిందించుట. వాటియందు అహంకారము మహాదుర్మార్గుడు. అపఘాతకుడు.సాక్షిని విస్మరింప చేస్తుంది. అహమధ్యాస,మమాధ్యాస,ఇదమధ్యాస అను మూడు విధములైన అధ్యాసలలో మొదటిది అహమధ్యాస నివృత్తమైనచో మిగిలినవి సహజంగా నివృత్తి కాగలవు. దయాపూర్ణుడైన ప్రత్యగాత్మ అహంకారమునుగూడా క్షమించి దాన్ని ఉద్ధరించుటకు సముచితమైన సమయమును సమకూర్చుతాడు. ఈ నాలుగు ఆత్మను నిరాకరిస్తూ దేహమే నేనని అనిత్య ప్రపంచమందు సత్యత్వ బుద్ధిని కలుగజేస్తాయి. (ఇదే కఠినమైన నింద)

**అన్యథా సంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే ।**

**కిం తేన న కృతం పాపం చౌరేణాత్మాపహారిణా ॥** (మ.భా.ఆదిప.74-27; ఉద్యోగప.42-37)

మాయయొక్క కార్యమైన అంతఃకరణము సాక్షిని(బ్రహ్మమును) ఆశ్రయించుకుని బ్రహ్మమునే తెలియకుండా చేస్తుంది.(స్వాశ్రయ,స్వవిషయము అవిద్య). అవివేకముచే వాస్తవాన్ని మరచిన ఈ వృత్తులు కుంఠితమవుతాయి. ఆత్మదేవుని పోగొట్టుకుంటాయి. అప్పుడు ఈవృత్తి 'వివేకము' అనే పటుదప్పను కలుసుకుంటుంది. ఆ వివేకము మనసు, బుద్ధి మరియు చిత్తము అను ఈ ముగ్గురికి ప్రత్యగాత్మతో సంబంధము కుదురుస్తుంది. అప్పుడు ఆ ముగ్గురు వారి స్వధర్మమును తెలుసుకొని ఆత్మయొక్క సన్నిధానములో శాంతిని పొంది ధన్య- మవుతాయి. అందువలన వివేకము ఉదయించి, తమ స్వరూపమును యథార్థముగా తెలుసుకొని ఉద్ధరింపబడతాయి. అదే నిజమైన స్వధర్మము. ఆత్మ పరాయణులై ఉంటాయి. ఆత్మోన్ముఖమై ఎల్లప్పుడు ఆత్మవిచారంయందే రమించి ఉంటాయి.

నాలుగవదైన అహంకారము బహిర్ముఖమై ఉంటుంది. స్థూలశరీరమును అభిమానించి సూక్ష్మశరీరమందు క్రోధమును ఉత్పన్నము చేస్తుంది. స్థూలదేహమే నేను అని దృఢనిశ్చయము చేసికొని ఉంటుంది. అహంకారము బహిర్ముఖమై, ఆత్మవిముఖమై ఆత్మదేవుని పొందడానికి సిగ్గు పడింది. అప్పుడు ఆత్మాకారమైన వృత్తులు మనసు, బుద్ధి, చిత్తము–అహంకారమును ఆత్మోన్ముఖము కావడానికి ఎంతో బుజ్జగిస్తాయి. కాని, అహంకారము ఆ మూడు వృత్తులను ధిక్కరిస్తుంది. అప్పుడు ఆ ముగ్గురు అహంకారమును చాలా వేధిస్తాయి. వాటి దాడికి తాళలేక అహంకారము నీరసించి దీనముగా నిరభిమానియై ఆత్మను పరోక్షరీతిగా ఒప్పుకుంటుంది. ఆత్మయొక్క పరోక్షజ్ఞానము కలుగుతుంది.

అప్పుడు వివేకము(పటుదప్ప) ఉదయించి పశ్చాత్తాపముతో దీనముగా ఉన్న అహంకార- మును నెమ్మదిగా ఆత్మయొక్క సన్నిధానమునకు కొనిపోతుంది. ఆత్మదేవునికి అహంకారంపై జాలిగలిగి చేరదీసుకొని, ప్రసన్నవదనుడై అహంకారమును తన దగ్గరగా కూర్చుండబెట్టుకొని దాని యొక్క దుఃఖమును, రోగమును నివారించి అపారమైన సుఖమును ప్రసాదిస్తాడు. అభిమాన యుక్తమైన అహంకారము తనయొక్క యథార్థమైన ధర్మమును తెలుసుకొన్నది. సకలభ్రమలు నాశనమైనవి. తనయొక్క శ్రమ అంతా సఫలమైనది. అప్పుడు అహంకారము ఆత్మారాముని స్తుతిచేయ సాగింది. అందువలన మిగతా ముగ్గురి కంటె అహంకారముపై సద్గురుదేవుడైన ఆత్మకు మిక్కిలి ప్రేమ కలిగి విశేషకృపనుచూపి బ్రహ్మమును పొందుటకు సహకరించినాడు. కావున, అంతఃకరణకృప కలిగితేనే సాధన నిర్విఘ్నముగా జరిగి దృఢమైన ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. సద్గురుదేవుడు సగుణబ్రహ్మముగా కానొస్తున్నా, అంతరంగమందు ఎవరైతే విచారించి బ్రహ్మమును దర్శిస్తారో, వారికి సద్గురుదేవుడు నిర్గుణరూపముగా దర్శింపబడతాడు. అనన్యభావంతో ఏ

అహంకారమైతే సద్గురు దేవునికి శరణు పొందినదో, వారికే తనయొక్క యథార్థమైన నిర్వికారమైన స్వరూపాన్ని దర్శింపజేస్తాడు. వారియొక్క అవిద్యను సమూలముగా నష్టము చేస్తాడు.

అవిద్య నివృత్తి అంటేనే సంసార నివృత్తి. తద్వారా సకల మనోవృత్తులు ఉపశమించి నిరామయ బ్రహ్మమునందు విశ్రమిస్తారు. **"అవిద్యాస్తమయో మోక్షః సా చ బంధ ఉదాహృతః"**

ఇప్పుడు ఓ శ్రోతలారా! అద్భుతమైన కథ ద్వారా ముందర అధ్యాయమును ప్రకటము చేస్తాము. కేవల శ్రవణ మాత్రముననే హృదయగ్రంథి విచ్ఛిన్నమై ఆనందమును పొందుతారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము శ్రవణమాత్రముచే సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ పదిహేడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణార విందార్పణమస్తు

  

ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యో నమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పదునెనిమిదవ అధ్యాయము

పద్యానువాదము:—అభినవ సుఖధాముడవైన, నిర్వికారుడవైన ఓ సద్గురుదేవా! నీకు ఒక నామమంటూ లేదు. నా మనస్సుయందు నిరంతరము నీ పాదాలపై ప్రేమ కలిగి ఉండునట్లు ఆశీర్వదింపుము. అతీతస్వరూప పరబ్రహ్మావు, నిర్మలాత్ముడవు. నీయొక్క ఆశీర్వాదములను కోరి, నిన్ను ఆశ్రయించిన నన్ను ఆప్తకాముడవై రక్షించి నీదరికి చేర్చుకొనుము.

ఓ సద్గురు సిద్ధనాథ!నీవు అనాది,అనంత,అవినాశిస్వరూపుడవు.నీవు స్వానందమహిమలో ఉండి స్వసత్తచేత ఈ మాయికజగత్తును నిమిత్తమాత్రుడిగా నడిపిస్తూ ఉన్నావు. ఈ జగత్తును లీలామాత్రముగా ఆడిస్తూ ఉంటే, మేము సంసారసాగరములో మునకలు వేస్తూ ఏడుస్తున్నాము. మాయోపాధిగల ఈశ్వరుడవై, ఈసృష్టికి ఉత్పత్తి స్థితి లయములకు కారణము నీవే ఉన్నావు.అజ్ఞానులమైన మేము నీయొక్క స్వరూపాన్ని తెలుసుకోలేక, సంసారమందలి అల్పభోగాలను అనుభవిస్తూ, దుఃఖములకు లోనవుతున్నాము. అనేక జన్మలలో(84 లక్షల యోనులలో) తిరుగుతూ అంత్యమున, ఈ మానవ జన్మమును పొంది, ఏమి చేయాలో, ఏమి పొందాలో తెలియక అయోమయ స్థితిలో ఉన్నాము. నీయొక్క చరణాలను ఆశ్రయించక ఈ సంసారదుఃఖ నివృత్తి కోసము అనేక ఉపాయములనుచేసి విసుగెత్తి, అలసిపోయి భ్రష్టులమైనాము. ఓసిద్ధరాయా!నీయొక్క కృపచేతనే అనేక ప్రాణులు సంసారమునుండి తరించి ఉద్ధరింపబడినారు. నీయొక్క సాంగత్యము తప్ప ఉద్ధరింపబడుటకు వేఱొండు ఉపాయములేదు.నాయొక్క ప్రారబ్దకర్మ ఎలాఉందో నాకు తెలియదు. నీవే ముఖ్యమని నిన్ను ఆశ్రయించినాను. అందుకని నాయొక్క సంసారరూప భారమును దించి, నన్ను ఈ భవసింధువునుండి దాటించుము. స్వానందమును ప్రసాదించుము. నీవు సర్వజ్ఞుడవు, దయాసాగరుడవు. కావున, నిన్ను నా అంతరంగమందు దృఢముగా ఆశ్రయించినాను. ఇంక నాకు ఏమి భయం లేదు. నన్ను నీట ముంచినా పాల ముంచినా-నీదే భారము స్వామీ. నేను చేయు ప్రతి కార్యమును నీకు సమర్పించి, నా స్వహితమునుగూర్చి నిన్నే ఆశ్రయించినాను. నీవు దయతలచి

నన్ను రక్షింపము. నీవు అనాథరక్షకుడవు. శరణాగతభక్తులను అనివార్యమైన సంకటములనుండి కాపాడినావని నీ కీర్తిని విని, నిన్ను ఆశ్రయించినాను. కావున, నన్ను రక్షింపుము స్వామీ!

ఓ శ్రోతాసజ్జనులారా! వినండి. సద్గురువుయొక్క అత్యద్భుతమైన చరిత్ర రసయుక్తమైనది. స్వామియొక్క కృపాకటాక్షమువలన పశ్వాదులుగూడా తరించాయి. ఇక మానవులు తరించడము ఒక గొప్ప విశేషము కాదు. పూర్వార్ధ చరిత్రయందు సంతానహీనుడైన భీమప్పయొక్క అభీష్టాను-సారము వారియొక్క పుత్రకొరతను తీర్చడానికి, రాత్రియందు వారి ఇంటిలో పరుండి, ఉదయమున మఠమునకు వచ్చెడివాడు.

భీమప్ప, సిద్ధప్పను దత్తత తీసుకున్నాక భీమప్పకు ఒక పుత్రుడు కలిగినాడు. ఆ పుత్రుని పేరు గురప్ప. ఆ గురప్పను సిద్ధప్ప తన పుత్రునిగా భావించుకొని ప్రతినిత్యము తన ఒడిలో కూర్చుండ-బెట్టుకొని ఆడించేవాడు. గురప్పయొక్క బాల్యమునందే తన తల్లి పరమపదవిని పొందింది. కావున, సిద్ధనాథుడే ఆ గురప్పకు తల్లిగా, తండ్రిగా ఉండి, ఎంతో ప్రేమతో పోషించినాడు. ఆ గురప్ప ఎంతో గారాబంగా సిద్ధనాథుని అంగములపై ఎక్కి ఆడుకునేవాడు. గురప్ప సిద్ధప్పను ఎంత బాధించినా గాని, కాళ్లతో తన్నినాగాని వానిని వారించక వాత్సల్యభావముతో, ప్రేమతో సహించేవాడు.

ఒకసారి భక్తులందరూ సిద్ధనాథుని వద్దకు వచ్చి, స్వామీ! మీ గురప్ప నిన్ను ఎంతో పీడి-స్తున్నాడు. అయినాగాని, నీవు వాత్సల్యభావముతో సహిస్తున్నావు. ఈ పిల్లవాణ్ణి మన ఆశ్రమంలోని ఏ స్త్రీమాతకైనా ఒప్పగించినట్లయితే ఆమె పోషిస్తుంది కదా! అని అంటారు.

అప్పుడు స్వామి అంటాడు. ఆ.....ఏముందిలే! అది పిల్లవాని సహజస్వభావమే.పూర్వజన్మ-లో ఈ పిల్లవాడు పెద్దపులిగా ఉన్నప్పుడు, నేను ఈయనను పీడించినాను. ఇప్పుడు దానికి బదులుగా నన్ను పీడిస్తున్నాడు. అందుకని ఓ భక్తులారా! మనము ఇతరులను పీడించినట్లయితే వారు మళ్ళీ ఏదో రూపముగా మనల్ని బాధిస్తారు. అందుకని ఎవరిని దుఃఖపెట్టకుండా నడుచుకోవాలి. ఒకరికి సుఖమును చేకూర్చే స్థోమత లేనప్పటికైన, ఎవరికి మాత్రము దుఃఖ పెట్టకూడదు. పీడించకూడదు. ఇతరులను పీడించినట్లయితే తాను పీడింపబడతాడు.ఒకరిని దుఃఖ పెట్టినట్లయితే దాని ఫలము తప్పకుండా అనుభవించవలసి ఉంటుంది. ఎన్నడూ తప్పేది కాదు. ఇది ఈశ్వర నియతి ఉంది. ఆత్మజ్ఞానమయ్యే పర్యంతము ఈ కర్మ భోగము అనుభవించి తీరాల్సిందే.

ఈ ప్రకారంగా స్వామి పలుకగా, అప్పుడు ఆ భక్తులు అంటారు. స్వామీ! ఈ గురప్ప ఏమిటి? గత జన్మలో పెద్దపులిగా ఉండడమేమిటి? దానిపై కూర్చుని నీవు ఆడుకోవడమేమిటి? ఈ కథ చాలా విచిత్రంగా ఉంది. దానిని సవిస్తరముగా వినాలని కుతూహలము కలుగుతున్నది. కావున, దయచేసి ఆ కథను వినిపించండి. నీయొక్క చరిత్ర పరమపావనమైనది. దయచేసి చెప్పినట్లయితే మేము శ్రవణము చేసి ధన్యులము కాగలము–అని వేడుకుంటారు.

అప్పుడు వారి విన్నపమును ఆలకించి, సద్గురునాథుడంటాడు. ఈ మఠమునకు ఎదురుగా త్రోవలో, ఒక పిల్లవాడు ఆడుకుంటున్నాడు. వాడిని తీసుకురండి–అని చెప్పగా స్వామియొక్క ఆజ్ఞ-మేరకు భక్తులు వాడిని తీసుకొచ్చి స్వామివారి దివ్యచరణాలను దర్శనము చేయించినారు. సిద్ధనా-థుడు ఆ పిల్లవాణ్ణి రెండు చేతులతో లేపి తన పక్కన కూర్చుండ బెట్టుకొని, ఒక అరటి పండును ఆ పిల్లవానికి ఇచ్చి ఈ పండును ఇక్కడే కూర్చుని భుజించమని చెప్పగా, వాడు ఆ పండును ఆరగిస్తాడు. ఆ బాలుడు అరటిపండును భుజించిన వెంటనే ఆ బాలుడి ముఖముపై ఒక దివ్యతేజస్సు ప్రకటమైనది. అది చూసి ఆ భక్తులు ఆశ్చర్యపోయినారు.

అప్పుడు సిద్ధనాథుడు భక్తులను ఉద్దేశించి అంటాడు. మీరు ఇంతవరకు నన్ను అడిగిన ప్రశ్నను ఈ పిల్లవాణ్ణి అడగండి. దానికి సరియైన సమాధానము చెప్పగలడు. అప్పుడు భక్తులు ఆ బాలుని ఈ విధంగా అడుగుతారు. ఒరేయ్ బాబూ! పూర్వము సద్గురుదేవుడు పెద్దపులితో ఆటలాడుకున్నాడట, ఆ కథ ఏమిటో నీకు తెలిసినట్లయితే సవిస్తరముగా తెలుపుము.

అప్పుడు ఆ బాలుడు భక్తులయొక్క ప్రశ్నను పురస్కరించుకొని, స్వామియొక్క పూర్వచరిత్రను చెప్పనారంభించినాడు. సరిగ్గా 30 సంవత్సరాల క్రితము సద్గురుదేవుడు తీర్థయాత్రలను నిమిత్తముగా చేసుకొని భూమిపై సంచరిస్తూ, కావేరీ నదీతీరప్రాంతమునకు చేరుకున్నాడు. దట్టమైన అడవి యందు నదీతీరంలో ఇసుక తెన్నెలపై పశువులకాపరులగు గొల్లపిల్లలు మేకలను, గొర్రెలను మేతకువదిలి ఆటలాడుకొనుచుండగా, స్వామి వారిని చూసినాడు.సిద్ధనాథుడు వారివద్దకు పోయి నిలబడగా, ఆ పిల్లలు స్వామినిగూడా మాతో ఆడుకోమని తెలుపగా, స్వామి వారితో కలిసి ఆడ-సాగినాడు. ఈ విధముగా ఆటలాడిన కొంతసేపటికి వారికి ఆకలేసింది. ఆ గొల్లపిల్లలందరూ వారి వారి సద్దిమూటలను విప్పుకొని కూర్చొని సిద్ధనాథునికూడా వారితో భోజనము చేయమని వారితో కూర్చుండ పెట్టుకున్నారు. అందరూ ఆనందంగా భుజించనారంభించినారు.

మేకలు సుఖముగా మేతమేయుచుండగా ఒక్కసారిగా (అకస్మాత్తుగా) బెదిరి మే...మే... అంటూ అరుస్తూ నలుదిశలకు పరిగెత్తి పోయినాయి. అది చూసిన గొల్లపిల్లలు భయపడినారు. భోజనములను అక్కడికక్కడే విడిచిపెట్టి గొల్లపిల్లలు మేకల కోసము వెతుకుతూ వెళ్ళినారు. కారణ-మేమిటో ఎవరికి అర్థం కాలేదు. గొర్రెలు మేకలు అన్ని పలాయనమైనవి. సిద్ధనాథుడుకూడా వారితో లేచినిలబడి కారణమును తెలుసుకున్నాడు. సమీపములో ఉన్నటువంటి ఒక దట్టమైన చెట్లపొదలో ఒక పెద్దపులి మేకలకోసము పొంచి ఉంది. సిద్దనాథుడు ఆ పొదవద్దకు మెల్లగా పోయి, అందు-లోని పెద్దపులిని సమీపించి, దానివెనుకనుండి వీపుపై ఒక్క చరుపు చరిచినాడు. ఆ దెబ్బతో పెద్దపులి ఒక్కసారిగా జడిసి (భయపడి) ఎగిరి గంతువేసింది. దానితోపాటు సిద్ధనాథుడు కూడా పరుగెత్తి

దాని చెవులను బిగ్గరగా పట్టుకొని, దానిని కదలనీయకుండా గట్టిగా పట్టుకొని నిలబెట్టగా, అది శక్తిహీనమై నిలబడింది.

అప్పుడు సిద్ధనాథుడు దానివీపుపైఎక్కి కూర్చున్నాడు. గొల్లపిల్లలను పిలుస్తూ–మీరు భయపడి పరుగెత్తకండి. అక్కడే ఉండండి–అని వారిని పిలువగా,వారు అక్కడే నిలబడి వెనక్కిచూసేసరికి, స్వామి, వ్యాఘ్రముపై సుఖముగా కూర్చుని ఉన్నాడు. అపూర్వమైన ఈ దృశ్యమును చూసి పిల్లలందరూ చకితులై, భయపడి దగ్గరికి రావడము లేదు.గొల్లలు స్వామినిచూసి హృదయమందు భయపడుచుండిరి. అప్పుడు సిద్ధనాథుడు ఆ పెద్దపులిని ముందుకు నడుపుటకు ప్రేరేపించి, స్వయంగా వారివద్దకే పోవుచున్నాడు. అదిచూసిన పిల్లలు ఇంకా భయపడి పరుగెత్తనారంభించినారు. అప్పుడు స్వామి వారిని పిలుస్తూ–ఓపిల్లలారా!మనమందరము కలిసి ఆడుకొనుటకు ఒక సాధు జంతువును తీసుకొస్తున్నాను. దీనివలన మీకు ఏమి హాని లేదు. మీరు భయపడకండి–అని ఆశ్వాసిస్తాడు.

ఆ మాటలు విన్న గొల్లపిల్లలు అంటారు. అయ్యా! నీవు మహాసిద్ధపురుషునిలాగా ఉన్నావు. ఆ వ్యాఘ్రము నిన్ను ఏమీ చేయదు కావచ్చు. కాని, మావద్ద అటువంటి సిద్ధులు ఏమీ లేవు. అది మమ్ములను ఏమైనా చేయగలదు.అది జన్మతః హింసాత్మక క్రూరమృగము, మాకు దానిపై విశ్వాసము లేదు. పైగా మాకు లోన భయమేస్తుంది. మమ్ములను ఇంకెక్కడికి రమ్మంటావు–అని గోల చేసారు.

అప్పుడు సిద్ధనాథుడు ఇక వీరు నమ్ముటలేదని, తాను స్వయంగా ఒక పిల్లవాణ్ణి బలవంతంగా పట్టుకొని, ఆ వ్యాఘ్రముపై కూర్చుండబెట్టినాడు. అందరూ ఆ దృశ్యమును చూస్తున్నారు. ఆ పిల్లవాణ్ణి పెద్దపులి ఏమీ చేయలేదు. స్వస్థతగా ఉండిపోయింది. మెడలు క్రిందకు వ్రాల్చి నిలబడింది. ఆ గొల్లపిల్లలందరూ కొంతసేపు చూసినారు. తర్వాత ధైర్యము తెచ్చుకొని మెల్లమెల్లగా ఆ వ్యాఘ్రము దగ్గరకు వచ్చి, ఒకడు మెల్లగా చేయితోని ఆ పెద్దపులిని స్పృశించినాడు. అది ఏమీ అనలేదు. ఒకడు చెవిపట్టి లాగాడు. ఒకడు తోకపట్టి లాగాడు. అయినాగాని ఆ పెద్దపులి కదలక మెదలక పెంపుడు కుక్కలాగా తోక విసురుతూ నిలబడింది. అప్పుడు అందరూ భయమును వీడి విశ్వసించి దానితో ఆడుకొనసాగారు.

ప్రతిరోజు గొల్లపిల్లను గొర్రెలను, మేకలను తోలుకొని ఆ కావేరి నదీతీరమునకు ఏ సమయానికి వచ్చేవారో, సరిగ్గా అదే సమయానికి ఆ దట్టమైన అడవిలోనుండి ఆ వ్యాఘ్రముగూడ వచ్చి ఆ గొల్లపిల్లలు, సిద్ధనాథునితో కలిసి ఆడుకునేది. వారు ఇంటికి పోగానే, అది కూడా అడవిలోకి వెళ్లిపోయేది. సిద్ధనాథుడు ఆ వ్యాఘ్రముపైనెక్కి ఆ పిల్లలతో రకరకాలుగా ఆడేవాడు. సిద్ధనాథుడు ఆ వ్యాఘ్రమును బహు ప్రేమతో, చనువుగా తన ఒడిలో ఉంచుకొని దానిని నిమిరేవాడు.

ఈ విధముగా కొంతకాలము గడిచిన పిమ్మట, ఒక షికారి (బోయవాడు) ఈ విషయమును తెలుసుకొని, దానిని చంపుటకు తన మనసులో ఈ విధంగా చింతిస్తున్నాడు. ఆ పెద్దపులి అనాయాసముగా దొరుకుతుంది.దానిని చంపినట్లైతే సర్కారువారు నాకు బహుమానమిస్తారు.దాని చర్మము తీసి అమ్ముకున్నట్లైతే ధనముగూడా లభిస్తుంది–అని ఆ పెద్దపులిని చంపుటకు నిశ్చయించుకొని, ఒకనాడు తుపాకీలో తూటాలు చేర్చి పెద్దపులియొక్క రాకకు ఎదురుచూస్తూ త్రోవప్రక్కన ఒక గుబురు పొదలో దాగియున్నాడు.

కొద్ది సమయంలోనే గొల్లపిల్లలు మేకలను, గొర్రెలను తోలుకొని వచ్చినారు. వారితోపాటు సిద్ధనాథుడుకూడా వచ్చినాడు. మేకలను మేతకు వదిలి వారందరూ కలిసి ఆ ఇసుక తెన్నెలపైన ఆట ప్రారంభించినారు. సద్గురుదేవుడు పిల్లలతో కలిసి ఆడుతున్నాడు. సరిగ్గా అదే సమయానికి వారు ఆడుకోవడము గమనించి అడవిలోనుండి పెద్దపులి గర్జించుకుంటూ నిర్భయంగా సిద్ధనాథుని వైపు ఆడుకొనుటకు వచ్చుచుండెను.

పొదలో పెద్దపులికోసము దాచుకొని ఉన్న షికారి తుపాకి బారు నింపుకొని తయారుగా ఉన్నాడు. ఎప్పుడైతే వ్యాఘ్రము అడవినుండి బయటకువెళ్లి త్రోవనుండి సిద్ధనాథునివైపు వస్తుందో, వేటగాని ఎదురుగా రాగానే, వెంటనే తుపాకీని సంధించి పేల్చినాడు. ఆ వ్యాఘ్రముయొక్క మెడయందు గోలి దూసుకుపోయింది. ఆ దెబ్బతో పెద్దపులి ఒక్కసారిగా ఎగిరి గంతువేసి సరిగ్గా ఆ షికారిపైన దూకి, వానిని గట్టిగా పట్టి తన గోళ్ళతో వాని పొట్టను చీల్చింది. ఇటు పెద్దపులి,అటు వేటగాడు–ఇద్దరూ నిశ్చేష్టులై శవములాగా ఇరువైపులా పడిపోయినారు.ఆ తుపాకిచప్పుడు,పెద్దపులి గర్జనను విని, సిద్ధనాథుడు మరియు గొల్లపిల్లలు అందరూ వారిరువురివద్దకు పరిగెత్తుకుంటూ వచ్చారు. సిద్ధనాథుడు పెద్దపులి సమీపమునకువచ్చి, ఆ ఘోరమైన దృశ్యాన్ని చూస్తాడు. అప్పుడు గాయపడిన పెద్దపులి ప్రాణోత్క్రమణ సమయంలోనైనా, ఎంతో ఆయాసముతో ఉన్నాగాని, నెమ్మదిగా బలవంతముగా తనయొక్క శిరస్సును లేపి స్వామియొక్క దివ్యచరణకమలములపై వ్రాల్చి, రెండు కన్నులనుండి అశ్రుధారలు కారుతుండగా సిద్ధానాథుని ముఖకమలమువైపు చూడసాగింది.

సిద్ధనాథుడు ఆ వ్యాఘ్రముయొక్క మస్తకమును మెల్లగా లేపి తన ఒడిలో ఉంచుకొని, తన యొక్క అమృతహస్తముతో పెద్దపులియొక్క శిరస్సు నిమురుతూ దుఃఖపూరిత హృదయముతో, గద్గదకంఠముతో ఇలా అంటాడు. ఓ మిత్రమా! ఇప్పుడు నీకు ఈ జన్మ పూర్తి అవుతుంది. మళ్లీ నీవు తొందరలోనే మానవునిగా జన్మిస్తావు. అప్పుడు నీవు జన్మతః నాసన్నిధానమందు నాతో ఆడుకుంటావు. మన ప్రేమ నిర్విఘ్నముగా కొనసాగగలదు. నీవు ఏమి భయపడవద్దు, శాంతించుము.

సిద్ధనాథుడు ఈ మాటలు పలుకుతూ తల నిమురుతూ ఉండగా, వ్యాఘ్రము తన శిరస్సును స్వామి యొక్క దివ్యపాదాలపై వ్రాల్చి ప్రాణమును వదులుతుంది. వ్యాఘ్రముయొక్క మరియు

స్వామియొక్క ప్రేమ సంబంధమును గాంచిన పిల్లలందరూ దుఃఖాక్రాంతులై నేత్రాలవెంట కన్నీరు రాల్చినారు. స్వామి సాక్షాత్ శివస్వరూపుడని గ్రహించినారు.

ఇటువైపు వేటగాడు మూర్ఛిల్లి పడిపోయినాడు. నోరాడటము లేదు. శరీరమంతా రక్త-మయమైంది. సిద్ధనాథుడు వాని వద్దకు వెళ్లి, వాని పొట్టను తన రుమారులుతో బిగ్గరగా బిగించి చుట్టి కట్టినాడు. స్వామి పిల్లలతో అంటాడు–మీరు వెళ్లి గ్రామస్థులను తీసుకురండి. వెంటనే పిల్లలు స్వామియొక్క ఆజ్ఞమేరకు గ్రామములోకి వెళ్లి గ్రామప్రజలకు ఈ వార్తను తెలిపి వారిని తీసుకొచ్చారు. అప్పుడు సిద్ధనాథుడు ఆ గ్రామప్రజలనుద్దేశించి ఇలా అంటాడు. అయ్యా! ఈవేటగాన్ని మీరు గ్రామ- మునకు తీసుకెళ్లి తగిన చికిత్స చేయించండి. ఈయన సరిగ్గా ఆరు నెలలకు ఈ గాయములతో బాధపడుతూ నిశ్చయముగా మరణిస్తాడు. అంతవరకు ఈయనను రక్షిస్తూ ఉండండి–అని చెప్పగా ఆ గ్రామప్రజలు ఆశ్చర్యచకితులై స్వామియొక్క ఆజ్ఞను పాటించినారు.

ఇక అక్కడనుండి సిద్ధనాథుడు తీర్థాటనకోసము ఆ స్థలాన్ని విడిచి ముందుకు వెళ్లిపోతాడు. ఇట్లు, స్వామియొక్క మరియు పెద్దపులియొక్క కథ ముగిసింది. ఓ సద్భక్తులారా! విన్నారా! స్వామియొక్క స్పర్శమాత్రముచేత వ్యాఘ్రము మనుష్య జన్మమును పొందింది.

ఆ పెద్దపులి ఈ జన్మలో గురప్పగా జన్మించినాడు. ప్రతిదినము సిద్దనాథునిపై కూర్చుండి ఆడుకుంటున్నాడు.ఇది నిశ్చయముగా సత్యమని తెలుసుకోండి. ఈప్రకారముగా ఆ బాలుడు స్వామి యొక్క చరిత్రను చెప్పి అలాగే మౌనముగా ఉదాసీనుడై కూర్చున్నాడు. అప్పుడు ఆ భక్తులు బాలుని ఈ ప్రకారముగా అడుగుతారు. నీకు గతంలో జరిగిన ఈ వృత్తాంతమంతా ఎలా తెలిసింది యథా-ర్థముగా చెప్పుము–అని అడుగగా, ఆ బాలుడు అంటాడు. ఓ సద్భక్తులారా సావధానముగా వినండి. ఈ వృత్తాంతమంతా నాకెట్లు తెలిసిందంటే, సద్గురు సిద్ధనాథునియొక్క కృపచేత జరిగిపోయిన సద్గురుదేవుని చరిత్ర అంతా నాకు కన్నుల ఎదురుగా ప్రత్యక్షంగా కానొచ్చింది. అదంతా సవిస్తార-ముగా మీకు చెప్పితిని-అని మౌనమువహించి కూర్చున్నాడు.

అప్పుడు సిద్ధనాథుడు ఆ బాలునికి మరొక అరటిపండును ఇచ్చినాడు. దానిని తినగానే అంతా మరిచిపోయి యథావిధిగా దారిలోకెళ్ళి ఆడుతున్నాడు. ఇటువంటి దివ్యమైన సద్గురుచరిత్రను శ్రవణముచేసి మేము ధన్యులమైనామని గురుదేవునికి నమస్కరించి, భక్తులందరూ వారి వారి ఇండ్లకు వెళ్ళిపోయినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును తెలిపెదము. సావధానచిత్తులై వినండి. ఈ లక్ష్యార్థరూప విచారముద్వారా శ్రేష్ఠమైన వస్తువగు పరమాత్మ లభ్యమగును. దానిని సద్గురువు యథార్థముగా బోధిస్తున్నాడు, వినండి.

మేకలు అనగా విషయాకారవృత్తులు. గొల్లపిల్లలు అనే అజ్ఞజీవులు. విషయాకారవృత్తులనే మేకలను త్యజించి నిశ్చింతగా ఉండి సంసారరూప అరణ్యములో ఆడుతున్నారు. కావుననే, వారికి వివేకము (సిద్దనాథుడు) ప్రాప్తించింది. క్రోధాది వ్యాఘ్రస్వరూప భయానకవృత్తులు ఉత్పన్నమైనప్పుడు జీవులు దుఃఖిస్తారు. ఎప్పుడైతే వివేకరూప సద్గుణ సంపత్తి సంబంధమై క్రోధము అణచివేయబడి, ఉపశమిస్తుందో, అప్పుడు క్రోధభీతి నివృత్తమగును.

ఒకానొక సమయమున క్రోధరూప వ్యాఘ్రము అజ్ఞజీవులచే సంబంధమైనప్పుడు సకల సాత్వికవృత్తులు పలాయనమవుతాయి. అప్పుడు గురురూప వివేకము (సిద్ధనాథుడు) వెళ్లి తొందరగా క్రోధమును జయించును. వివేకమును తన అధీనములో ఉంచుకుంటుంది. ఎప్పుడైతే క్రోధము వివే-కముచేత జయించబడుతుందో, ఆ దినమునుండే క్రోధము శాంతించి, జీవుడు శాంతముగా, సుఖముగా ఉంటాడు. మరియు ఇతరులనుకూడా శాంతంగా ఉంచుటకు ఉపయోగపడతాడు. ఇతరులుకూడా సంతోషమును పొందుతారు. కొంతకాలమునకు వైరాగ్యము అనే వేటగాడు వచ్చి, క్రోధరూప వ్యాఘ్రమును చంపుతాడు.

క్రోధ వైరాగ్య యుద్ధమునందు వైరాగ్యము తీవ్రముగా గాయపడుతుంది. గాయపడిన వైరాగ్యమును వివేకము (సిద్ధ నాథుడు) రక్షించి ఆశీర్వదిస్తాడు. వివేకకాలమందు జీవుడు సమాధాన స్థితిలో ఉంటాడు. వివేకముయొక్క ఆశీర్వాదమువలన క్రోధము పునర్జన్మనొంది, ద్వైతనిరాకరణగా మారుతుంది. అందుకనే సద్గురువు(వివేకము)చేత ద్వైతనిరాకరణ లాలింపబడి, పెంచబడి క్షేమంగా రక్షింపబడుతుంది. ఈ లక్ష్యార్థ మననముద్వారా ద్వైతభావము నిరసనమై, ఈశ్వరుడు, జీవుడు వేరువేరు అనే భావన దూరమవుతుంది. ద్వైతభావ నిరసనద్వారా సద్గురుకృపచేత ఆత్మజ్ఞానము ఉదయిస్తుంది. ముందర అధ్యాయము రసయుక్తమై అమృతము కంటె విశేషమైనదిగా ఉంది. దానివలన వైరిరూప షడ్గుణములు (అరిషడ్వర్గములు) సహజముగా నాశనమును పొందుతాయి.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము శ్రవణ మాత్రముచేత సకల పాపములు సమూలముగా నశించును. శ్రీశివదాసస్వామి ఈ పదునెనిమిదవ అధ్యాయమును శ్రీ సద్గురు చరణకమలములకు అర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# పంతొమ్మిదవ అధ్యాయము

పద్యానువాదము:—ఓ సద్గురు సిద్ధారూఢస్వామీ! నీవు ఎల్లప్పుడూ నాయొక్క హృదయమందు వసించి, నీయొక్క యథార్థస్వరూపమును తెలుసుకొనుటకు అనుగ్రహింపుము. నా అంతరంగమందు ఎల్లప్పుడూ నిన్ను ప్రేమించుటకు ఆశీర్వదింపుము. ఏనకేన ప్రకారముచేత నా చిత్తమున దృఢవైరాగ్యముదయించి, నీ పాదపద్మములందు శ్రద్ధ, భక్తి దృఢపడునట్లు ఆశీర్వదింపుము.

ఓం–శ్రీ సద్గురుస్వామీ! నీకు సాష్టాంగ నమస్కారము. నీవు సకల భూతములయొక్క హృదయాలలో వసించి ఉన్నటువంటి అంతర్యామిస్వరూపడవు. సకలదేవతలయొక్క నామములకు అధిష్టానము. "సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి". నీవు ఎల్లప్పుడూ అనేక లీలలు చేస్తూ ఉంటావు. నీయొక్క కృపద్వారా సంసారభ్రాంతి వెంటనే నివృత్తమగును. సచ్చిదానందస్వరూపము హృదయమందు అనుభవగోచరమగును. నీయొక్క కృపావిశేషముద్వారా భక్తులందరూ ఉద్ధరింపబడతారు. అజ్ఞజనుల హృదయమందున్న విపరీతజ్ఞానము మీయొక్కకృపచేత శీఘ్రముగా నివర్తించును. అనంతజన్మల నిష్కామపుణ్యరాశి ఉన్నందున మీయొక్క సంబంధము లభించింది. శరణార్థులను కృపాదృష్టి ప్రసాదముచే తక్షణమే తరింపజేస్తావు. భవసాగరమునుండి తరించుటకు శాస్త్రమునందు అనేక ఉపాయములు బోధించబడినవి. వాటిని చదివినంత మాత్రాన శాస్త్రముయొక్క గూఢాభిప్రాయము మాకు తెలియుట లేదు. నీవు సకల శాస్త్రములయొక్క అభిప్రాయమును ఎఱిగిన వాడవు. కావున, నిన్ను శరణు పొందినప్పుడే, నీయొక్క కృప కలిగినప్పుడే, నీ ముఖకమలము నుండి మేము శాస్త్ర శ్రవణము చేసినప్పుడే వాటియొక్క తాత్పర్యమును తెలుసుకొని ధన్యులము కాగలము. జీవులకు కర్మలయందు స్వాభావిక ప్రవృత్తి ఉంటుంది. మళ్లీ కర్మల గూర్చి బోధించినచో ఏమి విశేషముంటుంది. నీ ద్వారానే నివృత్తిపర బోధ లభ్యమవుతుంది. నిన్ను విడిచి ఏ శాస్త్రమును ఆశ్రయించినా, అవి బహిరంగ బోధ చేసేవే ఉన్నవి. నీ ద్వారానే వేదాంత మార్గము లభిస్తుంది. కేవలము నీయొక్క సేవ నిష్కామముగా చేసినట్లైన, బంధమునకు కారణమైన "అహం మమ" బుద్ధి నష్టమై నీయందు భక్తిరూప ప్రేమ ప్రకటమవుతుంది. భక్తిపూర్వకముగా సద్గురు నామాన్ని చింతన చేయుటద్వారా వివేకము ఉదయించి, దానిచేత వైరాగ్యముత్పన్నమై, సకల వైషయిక సంకల్పములు భస్మమై, నిరంతర ఆత్మచింతనద్వారా వాసనాక్షయము కలిగి, నిశ్చలమైన స్వస్వరూపము గోచరి-

స్తుంది. నిష్కామగురుసేవద్వారా క్రమముగా భక్తి, వివేకము, వైరాగ్యము, విషయ సంకల్ప నివృత్తి, వాసనాక్షయము, స్వరూప ప్రాప్తి కలుగును.

స్వరూపసాక్షాత్కారమునకు కేవలము సద్గురుబోధయే కారణమగును. గురుకృప యథార్థ-ముగా కలుగనిదే సకల సాధనములు వ్యర్థములగును. సద్గురుదేవుని ఎవరు శరణుబొందుదురో, వారియందు సద్గురువుయొక్క దయ పరిపూర్ణంగా కలిగి వారు మృత్యువాతనుండి రక్షింపబడతారు. మృత్యువు తలపై నిశ్చయముగా కాలు పెట్టగలరు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు సద్గురువుయొక్క పుణ్యచరిత్ర సావధానచిత్తులై శ్రవణము చేయ-గలరు. ఒకానొక సమయమున సిద్ధనాథస్వామి మఠముయందున్నపుడు జరిగిన విషయము చెబు-తాను. బెనకప్ప అను పేరుగల ఒకానొక భక్తుడు మఠముయొక్క గోడలపై చిత్రవిచిత్రమైన చిత్రము-లను గీస్తూ, తనయొక్క ఒకానొక మిత్రునితోకలసి సేవారూపముగా కార్యములను చేయుచు-న్నాడు. బెనకప్ప తన మిత్రునితో ఇలా అంటాడు. ముందర శివరాత్రి పర్వదినము వరకు ఈ గోడలపై అపూర్వమైన చిత్రములను గీసి జనులందరూ ఆశ్చర్యచకితులగునట్లు మనోహరముగా తీర్చిదిద్దగలను. అని అంటూ ఉండగా, శ్రీ సద్గురు సిద్ధనాథుడు వారి వెనుకనే నిలబడి వారి వార్తాలాపమును సంపూర్ణంగా విని—

వారి ముందుకు వచ్చి, ఆ....అయిందా మీ సంభాషణము–అంటూ, అయ్యా బెనకప్పా! నీవు చిత్రవిచిత్రమైన వర్ణములచేత చిత్రములు గీస్తానంటున్నావు. కాని, ఈశ్వరుడు ఆ సమయమువరకు ఈ ప్రాంతమును చిత్రవిచిత్రముగా చేయదలచినాడు. నీవు ఊహించిన దానికి విలక్షణపరిస్థితులు ఏర్పడగలవు. నగరములన్ని అరణ్యములుగా మారి, నగరవాసులంతా అరణ్యములో నివసిస్తారు. అరణ్యములో నివసించు క్రూరమృగములు, పశువులు వచ్చి నగరములందు నిశ్చయముగా నివసి-స్తాయి. వీధులు భయంకరంగా గోచరిస్తాయి. పీనుగలు త్రోవలో పడి ఉంటాయి. వాటిపై గ్రద్దలు వ్రాలి సుఖముగా భోజనము చేస్తుంటాయి. ఈవిధముగా పలికి, స్వామి మౌనముగా ఉండిపోయి-నాడు. బెనకప్ప మరియు తన మిత్రునికి ఈ వచనములు విన్నతోడనే భయమేసింది. ఎంత విచారించినా స్వామివారియొక్క అభిప్రాయము వారికి తెలియలేదు.

ఆ రోజునుండి సరిగ్గా ఆరునెలల తర్వాత ముంబాపురంలో గ్రంథిరోగము వ్యాపించి క్రమ-ముగా కొన్ని రోజుల వరకు **హుబ్లీ** పట్టణమునకు చేరుకుంది. ఆ వ్యాధి సోకుటవలన అనేకమంది జనులు మరణిస్తున్నారు. మరణించిన వారిని చూసి మిగిలిన వారు భీతిచే గృహములను విడిచి అరణ్యమునందు ప్రవేశిస్తున్నారు. ఎవరి ఇంటియందు ఈ రోగము ప్రవేశించి, ఒకరికి వ్యాధి సోకి మరణించగానే, మిగిలిన కుటుంబసభ్యులంతా అభినివేశముతో ఆ శవమును, గృహమును విడిచి హుటాహుటిగా అరణ్యములో ప్రవేశించి,అచ్చట గుడిసెలు నిర్మించుకొని నివసించుచుండిరి.రోగు-

లను రక్షించి వారికి ఉపచారము చేసేవారు లేక వారు వ్యాధిబాధతో రోడ్డుమీదికి వచ్చి దిక్కులేని వారివలె ఆయాసంతో మరణించేవారు. వారి శవములను తీసి స్మశానమునకు చేర్చేవారు ఎవరు కూడా లేకుండిరి. ఆ పీనుగలపై గ్రద్దలు వ్రాలి వాటిని భక్షించేవి.

సద్గురుదేవునియొక్క భవిష్యవాణి ఆరునెలల వరకు యథార్థముగా నిరూపించబడినది. ఇక ముందు జరుగనున్న కథలో సద్గురుమహిమను సావధానముగా వినగలరు. బెనకప్పకూడా ఈ గ్రంథి రోగమునకు గురియైనాడు. ఈ వ్యాధితో బాధపడుతున్న వారిని సర్కారు నౌకరులు చూసి, పై అధికారికి తెలిపినారు. ఉన్నతాధికారులు వారి సిబ్బందితో రోగ పీడితులైన వారి ఇండ్లకు వచ్చి శవములను, రోగగ్రస్తులను ఊరిబయటకు తీసుకెళ్లేవారు. అటువంటి సమయములో చేయునదిలేక, బెనకప్ప భార్య తన భర్త రోగముచేవాతపడగానే భయపడి, సద్గురుదేవుని చరణములకు శరణు బొంది, స్వామీ! మమ్ములను ఈ విపత్తునుండి రక్షించండి–అని దీనురాలై ఆర్తనాదముతో వేడుకున్నది.

సద్గురుదేవుడు ఆమె మొరనువిని, అమ్మా! ఇప్పుడు చేసేది ఏమీ లేదు. కేవలము సద్గురువు యొక్క లేక ఈశ్వరునియొక్క నామస్మరణమే శరణ్యము. ఏమీ భయపడనక్కర్లేదు. నామస్మరణ చేసినట్లయితే రోగనివృత్తి కాగలదు. ఏ సర్కారు నౌకరులు మీ భర్తను గ్రామము బయటకు ఈడ్చు-కొనితీసికు పోరు. నిర్భయంగా ఉండండి–అని ఆశీర్వదిస్తాడు. అదే ప్రకారముగా స్వామియొక్క వచనములపై విశ్వాసము పెట్టి నామస్మరణ చేయుచుండగా, కొద్ది రోజులలోనే బెనకప్ప వ్యాధి నుండి కోలుకున్నాడు. ఆయనను గ్రామము బయటకు ఈడ్చుకొని పోవుటకు ఎవరుకూడా రాలేదు.

తర్వాత బెనకప్ప భార్యకూడా గ్రంథిరోగమునకు గురియైనది.ఈవార్త విని ఉన్నతాధికారులు బెనకప్ప గృహంలో ప్రవేశించినారు. కాని, ఆమె వారికి ఎదురుగా రోగముతో బాధపడుతూ పడు-కున్నాగాని, ఆమె వారికి అగుపించలేదు. ఇంటిలో రోగులు లేరని వ్రాసుకుని తిరిగి వెళ్లిపోయారు. సద్గురుదేవుడు ఈ విధముగా వారిని ఆదుకున్నాడు. సద్గురు ప్రసాదరూప విభూతిని శరీరమునకు ధరించినందున ఆ విభూతియే వారిని రక్షించింది.

ఇప్పుడు మరొక కథను వినండి. పాత హుబ్లీ పట్టణమందు జీవప్ప అని పేరుగల భక్తుడు ఒక డుండేవాడు. ఆయనయొక్క జీవికావృత్తి బట్టలు నేయడము (సాలీడు మాత్రం కాదు). ఆయన దారిద్రవస్థలో ఉండి భార్య పుత్రులతో సంసారము గడుపుచుండేవాడు. అంతటి కటిక దారిద్ర్యావస్థ యందుకూడా తాను తన కుటుంబసహితముగా స్వామియొక్క మఠమునకువచ్చి భజనచేసి, స్వామి యొక్క ప్రవచనమును విని,మంగళము చేసేవరకు ఉండి, హారతి తీసుకొని తమ ఇంటికి వెళ్లేవాడు. ఇలా ప్రతిరోజు వస్తూ ఉండేవాడు.

గ్రంథిరోగము జీవప్పనుగూడ ఆవరించింది. జీవప్ప–తనకు మరణము ఎలాగూ తప్పదని భావించి, నా భార్యాపుత్రులైనా క్షేమంగా ఉండాలను ఉద్దేశంతో వారిని సద్గురు ఆశ్రమంలోకి వెళ్లి స్వామిని ఆశ్రయించండి అని చెప్పి పంపించినాడు. అప్పుడు జీవప్ప భార్యాపిల్లలు స్వామిని ఆశ్రయించి వారియొక్క ఘోరమైన ఆపదను విన్నవించుకున్నారు. నా భర్తను రక్షించుమని స్వామిని, జీవప్ప భార్య ప్రార్థించినది. స్వామియొక్క చరణములపై వ్రాలి, స్వామీ! నీవు తప్ప మమ్ములను రక్షించేవారు అన్యులెవరునూ లేరు. నీయొక్క కృప మా పైనుంచి తొందరగా రక్షించు స్వామీ! అని గోడుగోడున ఏడ్చింది. ఆమెయొక్క దీనవాణిని విని, సిద్ధనాథుడు ఆమెపై దయాదృష్టినిసారించి తన అమృతహస్తముచేత విభూతినిచ్చి,దీనిని ధరించి అఖండముగా నామస్మరణ చేయండి–అని చెప్పినాడు. ఈప్రకారముగా స్వామి వచనాలపై విశ్వాసముంచి నామస్మరణ చేయగా, జీవప్ప రోగము నుండి రక్షింపబడినాడు. కాని, ఆ రోగబలముచేత అంధత్వమును పొందినాడు. భార్యాభర్తలిద్దరూ ఎంతో దిగులజెంది బాధపడినారు. అయ్యో! మేము ఇదివరకే దరిద్రులము. కష్టము చేయనిదే కడుపు నిండదు. ఇప్పుడు మా యజమాని అంధుడైతే మా జీవనము ఎలా గడిచేది? మేమందరము ఆయనపైనే ఆధారపడి బతుకుతున్నాము కదా, అని జీవప్ప భార్య ఎంతో దుఃఖించింది. ఇలా చింతిస్తూ జీవప్పను తీసుకొని స్వామి వద్దకు వచ్చి, వారియొక్క బాధను నివేదించుకుంది.

అగాధజలసముద్ర సుడిగుండములో చిక్కుకొని ప్రాణసంకటంలో ఉన్న జీవినితీసి,ఒక పరిచ్ఛిన్నమైన బావిలో పడవేసినట్లు, గ్రంథిరోగముచే పీడింపబడిన వాళ్ళని రక్షించి, క్షుద్బాధకు గురిచేసినట్లయినది. ఇట్టి సంకటమునుండి రక్షించు సామర్థ్యము నీకు తప్ప మరెవరికి లేదు. ఈ విపత్తునుండి మమ్ములను కాపాడి, దారిద్రమును దూరముచేస్తావని నిన్ను ఆశ్రయించినాము–అని వేడుకుంది.

దీనదయాళువైన సద్గురుదేవుడు ఆర్తనాదముతో ప్రార్థించిన భక్తులను, శరణార్థులను ఛాయారూప కృపచేత ఆదుకున్నాడు. జీవప్పను స్వామి దగ్గరకు పిలుచుకొని ఆయన రెండు కళ్ళను తన అమృత హస్తముచేత స్పర్శించి తనయొక్క వస్త్రమును రెండు కళ్ళకు కట్టి, ఈ కట్టును మీరు ఇంటికి వెళ్ళినాక విడువండి అని చెప్పినాడు.

వారు సద్గురుదేవునికి నమస్కరించి వారి ఇంటికి వెళ్లినాక స్వామి చెప్పినట్లుగా జీవప్ప భార్య ఆ కట్టును విడిచింది. అప్పుడు ఒక అద్భుతమైన లీల జరిగినది. రోగము ఆవరించక ముందు నేత్రములు ఎంత స్పష్టంగా అగుపడుచుండెనో, అదేవిధంగా ఇప్పుడు నేత్రములు అగుపడుచుండెను. వారు చాలా సంతోషాన్ని పొంది, సద్గురుదేవుని స్తుతి చేసినారు. అప్పుడు వారు అనుకుంటారు— ఏ సద్గురుకృపచేత ఈ గ్రంథిరోగము నివృత్తమై నేత్రములు స్పష్టంగా అగుపడుచున్నవో, ఆ సద్గురు

సేవయే మా జీవిత లక్ష్యము. సర్వస్వాన్ని త్యాగముచేసి సద్గురుదేవునిపై భారముమోపి, సద్గురు ఆశ్రమంలోనే ఉండిపోవాలని, ఆయన సేవలోనే ఈ జీవితము గడపాలని నిశ్చయించుకున్నారు.

దీనదయాలువైన సద్గురునాథుడు భక్తులయొక్క కళ్యాణమును గోరి, వారి సంకటములను నివారించి, వారి పురోభివృద్ధికి తోడ్పడి, భవభయమునుండి రక్షించుతాడు. ఓ శ్రోతలారా ఇప్పుడు ఈ కథలయొక్క లక్ష్యార్థమును సావధానంగా వినండి. ఈ లక్ష్యార్థ చింతనద్వారా సాధకులయొక్క హృదయము నిర్విషయయుక్తమై ఆత్మజ్ఞాన సంపన్నులై సమాధాన వృత్తి కలిగి ఉండగలరు.

అజ్ఞాన జీవుడు బెనకప్ప (చిజ్జడగ్రంథి)గ్రంథిరోగముతో బాధపడుతుండగా, ఆయన భార్య బుద్ధి భయపడి సద్గురుదేవుని ఆశ్రయించింది. ఆ బుద్ధిరూప భార్య సద్గురుదేవునితో ఇలా అంటుంది. ఎవరైతే హృద్గ్రంథిరోగముచే పీడింపబడతారో, వారు సత్సంగదూరులై త్రివిధ దుఃఖములతో బాధింపబడుతూ జననమరణరూప సంసారమందు త్రోసివేయబడతారు. ఈ విధముగా బుద్ధి నిశ్చయించుకొని సద్గురు సన్నిధిలోకి చేరి స్వామిని ఆశ్రయించింది.

అప్పుడు సద్గురుదేవుడు బుద్ధినిచేరదీసి అభయమొసంగి,అఖండనామస్మరణద్వారా హృద్గ్రంథిరోగనివృత్తి కాగలదని చెప్పినాడు. అటువంటి వారు సత్సంగమునుండి వెలివేయబడరు. అఖండ నామస్మరణముద్వారా అంతఃకరణము పరిశుద్ధమై, నిర్మలబుద్ధియందు వివేకముదయించి, సత్సంగము చేస్తూ, తద్వారా జీవన్ముక్తు లవుతారు.

**సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।**

**నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః ॥** (భజగోవిందమ్)

ఇంకొక కథయొక్క లక్ష్యార్థము:–అజ్ఞజీవుడు భవరోగ గ్రస్తుడై సద్గురుదేవుని ఆశ్రయించి, యథార్థమైన, నిర్మలమైన జ్ఞానచక్షువును పొందుతాడు. ఈ ప్రకారముగా సద్గురుదేవుని ఆశ్రయించి, జ్ఞాననేత్రమును పొందిన జీవుడు ప్రశాంత, శబ్దాతీత, నిష్క్రియ, అజన్మ, అజేయ మరియు గుణాతీత అవస్థను పొంది నామరూప ప్రపంచముయందు క్రీడిస్తుంటాడు.

ఆ అద్వయస్థితిని పొందినాక, దేనిని చూస్తాడో, దేనిని స్పర్శిస్తాడో, వాటియందు సర్వత్ర సగుణరూప పరబ్రహ్మమును దర్శించి, తనయొక్క సస్వరూపములోనే రమిస్తూ ఉంటాడు. తానే దేవుడు,తానే భక్తుడు.తనయొక్క భవరోగమును తానే సాధనచతుష్టయసంపత్తిని సంపాదించుకొని, తనను తానే ఉద్ధరించుకుంటాడు(రక్షించుకుంటాడు).తనయొక్క దయ తనమీదనే చూపుతాడు. ఈ భవసాగరమునుండి తనకు తానుగానే తరిస్తాడు.

**శ్లో ॥ ఉద్ధరేదాత్మనాత్మానమాత్మానమవసాదయేత్ ।**

**ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవరిపురాత్మనః ॥** (గీత 6-5)

సద్గురువుదేవుడు అచింత్యమైన కృపచేత నన్ను ఆజ్ఞాపించి, ఈ గ్రంథ రచనయొక్క ప్రజ్ఞను ప్రసాదించినాడు. కావుననే, ఈ సద్గురుచరిత్ర రచన కొనసాగుచున్నది. ఆ సద్గురుదేవుడే ఈ గ్రంథ-మును రచించేవాడు. ఊరకనే నన్ను (ఉపాధిరూపముగా) నిమిత్తమాత్రముగా జేసుకొని గ్రంథరచన గావిస్తున్నాడు. సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు అయిన ఆ సద్గురుదేవుడు తన సంకల్పముచేత ఏమైనా చేయగలడు (సాధించగలడు).

ఓ శ్రోతలారా! ఇక రసాలమైన ముందర అధ్యాయమందలి కథను వినండి. ఎవరు సావ-ధానచిత్తులై శ్రవణము చేస్తారో, వారియొక్క దారుణమైన త్రివిధతాపములు నివృత్తమై సమా-ధానవృత్తిని పొంది తరించగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతముయొక్క కేవల శ్రవణమాత్రముచేత సకలపాపములు భస్మమవుతాయి. శ్రీ శివదాసస్వామి ఈ పందొమ్మిదవ అధ్యాయమును శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువదియవ అధ్యాయము

పద్యానువాదము:—ఓసద్గురుదేవా!నీవు భక్తులయొక్క ఈప్సితార్థములనిచ్చే కామదేనువు వంటివాడవు. ఎంతటి దుష్టులైనాగాని వారిపై దయచూపి వారి కోర్కెలను తీర్చునటువంటి కల్ప-తరువు వంటివాడవు. తద్వారా వారికి నీయందు భక్తి వృద్ధినొంది, నిన్ను ఆశ్రయించినందున వారి యొక్క సంసారభయమును నివృత్తిజేసి ఉద్ధరిస్తావు.

ఓ సద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము. స్వస్వరూపముయొక్క రహస్యము తెలియని మూర్ఖులమైన మేము నిన్ను ఆశ్రయించినాము. మేము త్రిగుణాత్మక మాయారూప వలలో చిక్కుకు-న్నాము. పంచభూతాలతో నిర్మితమైన ఈ దేహాదిక ప్రపంచముతో తాదాత్మ్యమునొంది "అహం మమత్వ"రూప మోహజాలములో చిక్కుకొని అనేక దుఃఖములచే తపింపబడుతున్న మమ్ము నీవే రక్షించువాడవు.

స్వస్వరూపాన్ని విస్మరించి, అనేకత్వమును దర్శించి, త్రిగుణాలకు ఆహుతి అయ్యి, అనేక సకామకర్మలు చేస్తూ ఉన్నందున, దుఃఖరూపమైన జననమరణరూప సంసారము వృద్ధినొందినది. సంసారముయందు అనేక కర్మలచే యుక్తమైన జాల(వల) లెక్క లేకుండా విస్తరించింది. దానియందు జీవుడనే మృగము తాను అల్లుకున్న కర్మరూపవలలో భ్రమచేత తిరుగుతూ అనేక దుర్భర అవస్థలను పొందుతూ ఉంటే—

స్వయంగా తాను కర్మపాశమును మెడలో వేసుకుని నా ముఖమునకు ఎదురుగా వస్తున్నాడు. ఎక్కడికి తప్పించుకొని పోగలడు. తప్పకుండా నాకే ఆహుతి కాగలడని మృత్యువనే షికారి (వేటగాడు)ఎప్పుడూ నిరీక్షిస్తూ ఉన్నాడు. అటువంటి కాలుని హస్తగతమై జన్మమరణరూప సంసారచక్రములో ఈ అజ్ఞాన జీవుడు మళ్ళీమళ్ళీ తిరుగుతున్నాడు. మృత్యువుయొక్క హస్తగతుడై-నాక మళ్ళీ జన్మమరణరూప దారుణమైన చక్రమునుండి విడుదల కాలేడు. వానికి ఒక్క క్షణము గూడా విశ్రాంతి లేకుండా ఆ సంసారచక్రమునందు తిరుగుతాడు.

పుణ్యపాపకర్మలు బంధమునకు హేతువులగును. వాటి ఫలమును తప్పకుండా అనుభవించి తీరాల్సిందే. కర్మరూప పాశము బంధమునకు కారణమగును. ఇట్టి భవభంధరూప పాశమునుండి విముక్తి ఎట్లు దొరుకునో, సంసారమునుండి ఎట్లు తరించునో, అక్షయరూప ఆనందము ఎట్లు

కలుగునో,దానికి ఉపాయము కేవలము సత్సంగము.సంతుమహాత్ములను ఆశ్రయించి క్షణకాలము సత్సంగముచేసినాగాని హృదయమందు సత్సంస్కారము దృఢమయ్యి,అక్షయరూప ఆనందము అను-భవమునకు వస్తుంది. తద్వారా ధన్యుడవుతాడు.ఇతర ఏ ఉపాయములచేగూడ ధన్యుడు కాలేడు.

సత్సంగము దృఢమగుకొలది వైరాగ్యము వృద్ధినొంది విషయేచ్ఛ సమూలముగా నష్టమై శ్రవణము నిర్విఘ్నముగా జరుగుతుంది. తద్వారా వేదాంతశాస్త్రమునందు మనసు రమించును. శ్రవణముద్వారా మనస్సు ఏకాగ్రతను పొంది మననము జరుగును. మననముద్వారా ఆస్తిక్యబుద్ధి ఏర్పడి నిదిధ్యాసనముద్వారా జీవబ్రహ్మైక్యజ్ఞానము కలుగుతుంది. సద్గురుకృపద్వారా ఎప్పుడు ఐక్య జ్ఞానము ప్రాప్తమగునో,అప్పుడు సంసారరూప బంధము(పాశము) ఖండింపబడుతుంది. అటువంటి జీవబ్రహ్మైక్యజ్ఞానము సద్గురువును ఆశ్రయించనిదే, ఆయనను శరణుబొందనిదే కలుగదు. అందుకని, సద్గురువును శరణుబొంది, ఆయనద్వారా యథార్థమైన జ్ఞానమును పొందినట్లయితే భవభయము నివృత్తమగును.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఏకాగ్రముతో సావధానులై సద్గురు చరిత్రను శ్రవణము చేసినట్లయితే స్వాత్మజ్ఞానము కలిగి భవబంధము సహజముగా నివృత్తి కాగలదు. శ్రీ సిద్ధారూఢస్వామి **హుబ్లీ** పట్టణమందు నివసిస్తూ, వేదాంత సిద్ధాంతమును ప్రకటముచేస్తూ, అత్యాదరముతో భక్తజనులకు జ్ఞానోపదేశముచేసి, వారిని భవసాగరమునుండి తరింపజేయుచున్నాడు.

ఒకానొక సమయమున భక్తజనులందరూ కలిసి అనేక సద్భక్తులకు మహాప్రసాదరూప భోజ-నములు పెట్టడానికి నిర్ణయించుకుని, "సాతప్ప" అనుభక్తుని ముఖ్యునిగా ఎన్నుకొని, సద్గురుదేవుని వద్దకు వెళ్లి, స్వామితో వారి అభిప్రాయమును ఇట్లు నివేదించుకుంటారు.

ఓ సిద్ధనాథస్వామీ! ఇక్కడికి సమీపములో ఉన్న "మావనూరు" గ్రామములో సమారాధన కార్యక్రమము చేయడానికి నిశ్చయించుకున్నాము. దయచేసి అనుమతించండి–అని విన్నవించుకు-న్నారు. సద్గురుదేవుడు "తథాస్తు" అని ఒప్పుకున్నాడు. భక్తులందరూ స్వామిని పల్లకిలో కూర్చుండ బెట్టుకొని భజనఘోషలు వినువీధుల్లో మారుమ్రోగుచుండగా బయలుదేరి పోతుంటే ముల్లోక-ములుకూడా ఈ వైభవమును చూసి ఆనందభరితమైనవి.

క్రమంగా 'మావనూరు' గ్రామమునకు చేరుకొని మంగళప్రదమైన ఒక వేదికను ఏర్పాటుచేసి స్వామిని ఉన్నతమైన ఆసనమునందు కూర్చుండబెట్టినారు. భక్తులు తొందరగా పూజాసామగ్రులు తీసుకొచ్చి షోడశోపచారయుక్తముగా స్వామిని అత్యాదరముతో పూజించినారు. 'సాతప్ప' వంటలు తయారుచేయడానికి పాకశాలయందు ప్రవేశించినాడు. వేలమందికి భోజనము ఏర్పాట్లుచేయుట కొరకు (బిరంజి) బిర్యానీ అన్నమును తయారుచేయుటకు 'సాతప్ప' వెన్నను కడాయిలో వేసి కరిగి-స్తున్నాడు. వెన్న కరిగి నెయ్యిగా మారింది. సలసలా మసలుచున్నది. అప్పుడు ఆ నేయిని బిర్యానీ

అన్నము చేయుటకు అన్నపాత్ర వద్దకు తీసుకొని పోవుటకు, 'సాతప్ప' వస్త్రముయొక్క సహాయముతో రెండు చేతులతో మసులుతున్న నేయి కడాయిని పట్టుకొని పోవుచున్నాడు.

ఇట్లు నేయికడాయిని తీసుకొని వస్తుండగా, ఒకచేయి ఒక్కసారిగా జారిపోయి కడాయి బోర్లపడింది. నెయ్యి మొత్తము భూమిపై నలువైపులా వెదజల్లబడి, పైకి చిల్లి 'సాతప్ప'పై పడింది. సాతప్పయొక్క శరీరమంతా చిల్లి సర్వాంగములలో బొబ్బలు లేచినవి. దేహము మొత్తము కాగు-తున్న నేయితో కమిలిపోయింది. 'సాతప్ప' ప్రసరించిన నేయిలోనే భూమిపై పడిపోయి, ఓ సద్గురు సిద్ధారూఢస్వామీ! రక్షించుము–అని బిగ్గరగా కేకవేసి బాధను భరించలేక స్పృహతప్పి, మూర్ఛితుడై పడిపోయినాడు. భక్తులందరూ నలువైపులకు పరిగెత్తి ఔషధములు తెచ్చి సాతప్పకు అనేక విధము-లుగా ఉపచారములు చేసినారు.

అప్పుడు ఆ దుర్ఘటనయొక్క సమాచారము స్వామికి తెలిసి తొందరగా పరిగెత్తుకుంటూ భక్తశిరోమణియైన 'సాతప్ప'వద్దకు చేరుకున్నాడు. సాతప్పయొక్క భార్యాబిడ్డలు ఈ దృశ్యమునుచూసి భీతిచే ధైర్యముకోల్పోయి, హాహాకారము చేస్తూ భూమిపై పడిపోయినారు. స్వామి వారిని ఓదార్చు తూ—మీరు ఏమీ భయపడకండి.'సాతప్ప'పరోపకారార్థము శుభకార్యమునందు సంలగ్నుడై శ్రమ-పడినాడు. భక్తులను రక్షించుటకు సద్గురుదేవుడున్నాడు. ఏమి బాధపడవద్దు. 'సాతప్ప'కు ఏమీ కాదు–అని వారిని ఊరడిస్తూ—సిద్ధనాథస్వామి 'సాతప్ప'యొక్క శరీరముపై తనయొక్క అమృత హస్తముచే స్పృశించి, ఈనెయ్యి ఇంత చల్లగాఉంది."లే సాతప్ప! లే" అంటూ సాతప్పను లేపుతాడు. వెంటనే సాతప్ప నిద్రనుండి లేచినట్లుగా లేచినాడు. జనులందరూ ఆశ్చర్యచకితులైనారు. బొబ్బలు మాయమైనవి.

శ్రీ సద్గురు సిద్ధరూఢస్వామి మహరాజ్ కీ జై....

శ్రీ సద్గురు సిద్ధరూఢస్వామి మహరాజ్ కీ జై....

శ్రీ సద్గురు సిద్ధరూఢస్వామి మహరాజ్ కీ జై....

అంటూ భక్తులు జయజయకారములు చేసినారు.

‘సాతప్ప’లేచికూర్చుని తన శరీరమంతా నేయితో తడిసి ఉన్నదిచూసి, ఇదేమిటి?నా శరీ-రమంతా నెయ్యితో తడిసిఉంది, అని—నేను స్నానముచేసి వస్తాను, అని వెళ్ళిపోయాడు. తర్వాత భక్తులు సాతప్పతో జరిగిన విషయమును తెలుపగా, సాతప్ప ఎంతో సంతోషించి స్వామిని ఇట్లు స్తుతించాడు.

ఓ సద్గురుదేవా!నీవు మాకు అండగా ఉంటే, ఆ కాలుడుగూడా మమ్ములను అంటలేడు.నీవు కాలునికి కాలుడవు. నీవుండగా మాకు ఎలాంటి భయము లేదు. నీవు సాక్షాత్ లీలావతారము ధరించిన ఈశ్వరుడవు. అంటూ ప్రేమపూర్వకముగా ఆర్తనాదముతో స్వామిని వేడుకొని,సద్గురు

చరణకమలములకు నమస్కరించినాడు. శరీరమంతా బొబ్బలు మాని మునుపటివలె స్వస్థతనొందినాడు. భక్తుల కొఱకుచేస్తున్న శుభకార్యమునందు ఎన్నివిఘ్నములు వచ్చినాగాని, సద్గురుదేవుని కృపద్వారా సకలవిఘ్నములు తొలగిపోతాయి. సకలజనుల హృదయములు ఆనందముతో ఉప్పంగిపోయినవి. అందరూ సద్గురుదేవుని ప్రేమతో పూజించినారు.

తరువాత భోజన కార్యక్రమము ప్రారంభమైనది. సద్గురు సిద్ధనాథుడు స్వయంగా భోజనము వడ్డిస్తున్నాడు. రొట్టెలు ముక్కలుచేసి, ఎట్లు తల్లి తన బిడ్డకు ప్రేమతో, ఆప్యాయతతో తినిపిస్తుందో, అట్లు స్వామి భక్తులకు తినిపిస్తున్నాడు. భోజనాలు జరుగుచున్నప్పుడు సద్గురుమావూలి తాను స్వయంగా తిరుగుతూ ఎవరికి ఏమి తక్కువ పడకుండాచూస్తూ వడ్డిస్తున్నాడు. సద్గురుదేవుడు ప్రేమహృదయముతో, అనురాగముతో, ఆప్యాయతతో వడ్డించడము చూసి, భక్తులందరికి భోజనము చేసినదానికంటె అధికముగా ఆనందము, తృప్తి కలిగింది.ఈవిధముగా భక్తులందరూ తృప్తిగా భుజించిన పిమ్మట, స్వామి కూర్చొని భోజనము చేసినాడు. భక్తులయొక్క ఈ సార్వజనిక శుభకార్యమును నిర్విఘ్నముగా పూర్తిచేసి భక్తులయొక్క ఆనందమే తన ఆనందముగా, వారి సుఖమే తన సుఖముగా భావించినాడు. ఏ ప్రకారముగా బాలునికి తల్లి బొజ్జనిండా తినిపించగా, ఆ పిల్లవాడు తృప్తిగా,సంతోషముతో ఉండుటచూసి, తల్లి సంతోషాన్ని పొందుతుందో, మరియు ఏ ప్రకారముగా ప్రజల సౌఖ్యమే తన సౌఖ్యమని రాజు ఎట్లు తన మనసులో ఆనందపడతాడో, అదేవిధంగా భక్తులకు తల్లి, తండ్రి, గురువు, దైవము అన్ని తానే అయిన సద్గురు సిద్ధనాథస్వామి భక్తులయొక్క తాపత్రయమును తొలగించి నిష్పాపులనుచేసి అందరికి ఆనందమును పంచి ఇచ్చేవాడు.

ఈవిధముగా శుభకార్యము ముగిసినపిమ్మట భక్తులందరూ సద్గురుదేవుని పల్లకిలో కూర్చుండబెట్టుకొని, అడుగడుగునా భజనఘోషలు, స్వామియొక్క నామఘోషలుచేస్తూ "**హుబ్లీ**" మఠమునకు(సిద్దాశ్రమమునకు)చేరుకొని పల్లకిలోనుండి స్వామినిదించి సద్గురుదేవునికి జయజయ కారములుచేసి, గ్రామభక్తులందరూ స్వామిని విశ్రమింపజేసి, తమతమ ఇండ్లకు వెళ్ళిపోయినారు.

ఇటువంటి ''మావూలి'' స్వరూపుడవైన ఓ సద్గురు సిద్ధనాథా! భక్తులపై నీయొక్క ప్రేమామృతమును కురిపించి ముల్లోకములను ఆనంద సాగరములో ముంచివేసినావు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు పూర్వోక్త కథయొక్క లక్ష్యార్థమును సావధానముగా వినండి. "సాతప్ప"అనే జీవుడు స్త్రీ, పుత్ర, పరివారము మొదలగు వారియందు మోహమును పెంచుకొని, వారికి మొహరూప నేయిని పంచుటలో రమించియున్నాడు. మోహముచే ఆవరింపబడిన జీవుడు అనేక దుఃఖములకు, వ్యథలకు గురియై, జననమరణరూప సంసారములోని బాధలకు తాళలేక, దానినుండి విముక్తిని పొందాలని తాపత్రయపడి సద్గురుదేవుని ఆశ్రయించినాడు.

అప్పుడు సద్గురుదేవునికి కృపగలిగి తనయొక్క అమృతతుల్యమైన బోధరూప హస్తముచేత భక్తునియొక్క తల(బుద్ధిని)నిమిరి (శుద్ధపరచి) జాగృతుని చేసి(మేల్కొలిపి)ఆత్మతత్త్వమును బోధించి, (ఇచ్ఛ) కోరికలనే బొబ్బలను మాన్పి, మోహమును సమూలముగా నివృత్తి చేసినాడు.

బ్రహ్మానంద స్వరూపుడవైన ఓసద్గురునాథా!నీయొక్క అమృతహస్తమును నా శిరముపైనుంచి ఈ భవదుఃఖము నివృత్తమగు మార్గమునుచూపి నన్ను ఆశీర్వదించుము.

ఒక్క నిమిషములోనే సకలదోషములు భస్మమైపోవునటువంటి రసయుక్తమైన సద్గురు చరిత్రను ముందర అధ్యాయమునందు సావధానముగా వినగలరు.

స్వస్తి శ్రీసిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రముననే సకలపాపములు భస్మమైపోవును. శ్రీశివదాసస్వామి శ్రీసద్గురుసిద్ధారూఢ చరణకమలములకు ఈ ఇరువదియవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది ఒకటవ అధ్యాయము

పద్యానువాదము:—ఓ సద్గురు సిద్ధనాథా! నీవు భక్తులకు నిత్యానిత్య వివేకమును బోధిస్తూ, యథార్థమైన బ్రహ్మవిద్యోపదేశముద్వారా అవిద్యను దూరముచేస్తూ, అందరి హృదయ-ములలో జ్ఞానస్వరూపముతో విద్యమానమై ప్రకాశిస్తున్నావు. నీ పాదపద్మములను ఆశ్రయించి-నందున భక్తులకు దృఢవైరాగ్యమును ప్రాప్తముజేసి జన్మజన్మాంతరప్రాప్త దుఃఖస్వరూపమైన భవ-బంధమును నివృత్తి చేయుదువు. నీతో సమానులైనవారు సమర్థులెవరును లేరు.

ఓ సద్గురుదేవా! నీయొక్క స్వరూపము వేదశాస్త్ర ప్రమాణములకు అతీతమైనది.అదే చిత్స్వ-రూపము. అది జగత్తంతా అణువణువునందు వ్యాపించియుండిగూడా జగత్తు (శరీరము)యొక్క పుణ్యపాపములనంటక నిర్లేపమై ఉంది.

శబ్దసముదాయరూప వేదశాస్త్రములు మరియు గురువునూ మిథ్యయే ఉన్నవి.ఈ జగత్తం-తా "**వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్**"(ఛాం.6-1-4) నిర్వికారమైనచేతన స్వరూపము సర్వకాల సర్వావస్థలయందున్నది. కావున, అదే సత్యము. సకలనామరూప వస్తుప్ర-పంచమునందు అస్తి, భాతి, ప్రియరూపముచేతను, సకలభూతముల హృదయాలలో విరాజమాన-మై సచ్చిదానంద స్వరూపముచేతను వ్యాపకమై బ్రహ్మము ప్రకాశిస్తుంది. అదే గురుస్వరూపము.

ఎంతవరకు శుద్ధబ్రహ్మముయొక్క యథార్థజ్ఞానము కలుగదో, అంతవరకు ఈజగత్తు సత్య-ముగానే గోచరిస్తుంది. యథార్థజ్ఞానముచేతనే ద్వైతభావము సమూలంగా నిరసింపబడును. బ్రహ్మ జ్ఞానముయొక్క అగాధమైన మహిమను బ్రహ్మదేవుడు మొదలుకొని ఆదిశేషునివరకు ఎవరుగూడ వర్ణింపజాలరు. ఇక అజ్ఞజీవుల మాటేమిటి? అజ్ఞానయుక్తమైన జీవుడు గురుకృప లేనిచో వర్ణింప-జాలడు. గురుకృప తప్పనిసరిగా అవసరము. మోక్షము బ్రహ్మజ్ఞానము ద్వారానే కలుగును. ద్వైత-భావన సమూలంగా నివృత్తమై అద్వైతానందము ప్రాప్తమగును. బ్రహ్మజ్ఞానము ద్వారా జీవుని యొక్క జన్మమరణరూప రాకపోకలు నివృత్తమై నిరాకారమైన తన స్వరూపమందే రమించి ఉంటాడు. **"జ్ఞానాదేవ తు కైవల్యమ్"** **"తరతి శోకమాత్మవిత్"** (ఛాం.7-1-3)

అవివేకకృత దేహయోగము(సంబంధము)చేత ఈ స్థూలశరీరమే నేను, దీనికి సంబంధించిన వారు నా వారు, జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు–అని, మనసు నామరూప ప్రపంచమును విడిచి

నిర్గుణనిరాకారమైన అవస్థను పొందడానికి అంగీకరించదు.అయినాగాని దృఢాభ్యాస బలముచేత, సద్గురు నామస్మరణమును నిత్య నిరంతర ఆదరణీయముగా సద్గురుయొక్క రూప-గుణములను ధ్యానిస్తూ మననము చేసినచో ద్వైతభావన నిరసించి స్వస్వరూప స్థితియందు మనసు లగ్నము కాగలదు.

**శ్లో ||అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్ |**

**అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ||** (గీత 6-35)

అద్వైతభావమును పొందడమే సద్గురుస్వరూపాన్ని యథార్థముగా దర్శించినట్లు. సద్గురువు యొక్క నామచింతనద్వారా స్వతస్సిద్ధమైన తనస్వరూపము ప్రకటమై"సోహం"అనగా"ఆ పరమాత్మ-నే నేను" అను అద్వైతభావమును పొందుతాడు. ఇటువంటి అభ్యాసము (సోహం) ఎల్లప్పుడూ చేయుటచే సకలనామరూప ప్రపంచమంతా అస్తి,భాతి,ప్రియరూప బ్రహ్మచేతనముగా గోచరిస్తుంది. అజ్ఞాన కాలమందు దేహమే నేను అనే అహంభావన ఎంత దృఢముగా ఉంటుందో, జ్ఞానోదయమైన తరువాత "నేనే బ్రహ్మమును" అను దృఢనిశ్చయము కలుగును. అదే దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానం యొక్క అవధి.

**శ్లో || దేహాత్మజ్ఞానవజ్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్ |**

**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ||** (వే.పం.7-20); (వరాహోపనిషత్ 2-15)

"సోహమ్"భావము సంశయరహిత దృఢ నిశ్చయమైనచో, స్థూల, సూక్ష్మ, కారణ శరీర-ములకు నేను భిన్నంగా ఉన్నానని, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షిగా ఉన్నానని, పంచ-కోశములకు అతీతముగా ఉన్నానని, ఇవియన్ని నాచే తెలియపడే దృశ్యములని, నేను వాటిని తెలు-సుకునే సాక్షిస్వరూపుడిని–అని అనుభవమునకు వస్తుంది. అప్పుడు తాను తన నిజస్వరూపమందే స్థితమై ఉంటాడు. అప్పుడు నేను నిత్యస్వరూపుడిని జగద్రూప ప్రపంచమును ఇంద్రియములద్వారా దర్శిస్తూ ఉన్నాగాని, ఈ ప్రపంచము నాయొక్క స్వరూపమే అని అనుభవమునకు వస్తుంది. రజ్జువుపై కానొచ్చే సర్పము రజ్జుస్వరూపమయ్యే ఉంటుంది. అట్లే నాయందు ప్రతీతమైన ఈ నామ రూప ప్రపంచము నాయొక్క స్వరూపమే ఉంది. జగత్తనునది నాకంటె భిన్నంగా లేదు. కేవలము మిథ్యా (కల్పితము) ఉన్నది.

**శ్లో || స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం యథా |**

**తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః ||** (మాం.కా.వైతథ్య.31)

విచారించినచో అసలు జగత్తు లేనే లేదు. దానికి అస్తిత్వమే లేదు. కేవలము ప్రతీతి మాత్ర-ముగా ఆకాశమునందు కనిపించు గంధర్వనగరమువలె ఉంది. చిత్తమును స్వరూపమునందు లగ్న-ముచేసి అంతర్ముఖవృత్తిచేత ఇంద్రియములన్నిటిని నిరోధించి, తననుతాను చూసినట్లయితే తన

స్వరూపముకన్న అన్యమైనదేమియును గోచరించదు. ఎట్లు తనదేహము తనకన్న భిన్నముగా ప్రతీతి అగునో, అట్లే సకలజగత్తు స్త్రీ,పుత్ర,ధనాది సర్వ వ్యవహారములు తన స్వరూపముగానే కానొచ్చును. అటు పిమ్మట మనస్సు నిర్గుణ, నిరాకార స్వరూపాన్ని పొంది, సుఖస్వరూపమైన తురియాతీత స్థితిగలిగి కేవలము శుద్ధబ్రహ్మరూపమై జ్ఞానస్వరూపముగా(జ్ఞప్తిరూపముగా) మిగిలి ఉంటాడు. అచ్చట సూక్ష్మఅహంకారముగూడాఉండదు. అనగా,"**అహంబ్రహ్మాస్మి**"అను ఈవృత్తిగూడా లేకుండా, బ్రహ్మస్వరూపుడిగా ఉండిపోతాడు. దానికి భిన్నమైన సత్త మిగులదు. ఇటువంటి స్థితియొక్క అను-భవమే 'జ్ఞానము' అని శాస్త్రము చెబుతుంది. ఈ అనుభవంచేత అపూర్వమైన ఆనందము శాంతి హృదయమందు ప్రకటమగును. ఆ అవస్థయొక్క అనుభవమును పొందడానికి సద్గురువును ఆశ్ర-యించి ఆయనయొక్క కృపకు పాత్రుడైనచో తప్పకుండా నిరతిశయానందరూప బ్రాహ్మీస్థితిని అనుభవిస్తాడు.

ఓ సద్భక్తులారా! మధురమైన పుణ్యచరిత్రను మననము చేయుటద్వారా అతిశీఘ్రముగా, సహజముగా స్వరూపసాక్షాత్కారము కలుగుతుంది. పుణ్యప్రదమైన '**హుబ్లీ**' పట్టణమందు 'రమా-నాథుడు' మరియు 'కృష్ణాబాయి' అను బ్రాహ్మణ దంపతులుండేవారు. వారియొక్క కుమారుని ఉపనయన సంస్కారముగూర్చి సన్నాహాలు జరుగుతున్నాయి. అప్పుడు కృష్ణాబాయి తన భర్తతో ఇలా విన్నవించుకుంటుంది.

ఏమండీ! ఒక చిన్న విజ్ఞప్తి. మన కుమారుని ఉపనయన కార్యక్రమమునకు ముందు శ్రీ సిద్ధారూఢస్వామిని మన ఇంటికి ఆహ్వానించి, ఆయనకు షోడశోపచార పూజలు గావించి ఉచిత-మైన దక్షిణలు సమర్పించుకొని, తదనంతరము మన కుమారుని ఉపనయనము చేద్దాము. ఎందు-కనగా, ప్రస్తుతము కలిగిన సంతానముకంటె పూర్వము మనకు ఇద్దరు పుత్రులు కలిగి మరణించి-నారు. అప్పుడు నాకు చాలా దుఃఖము కలిగి చింతిస్తూ నాకు సంతానము ఏ విధంగా రక్షింపబడుతుంది-అని ఇరుగుపొరుగు వారిని విచారించగా—

ఒకానొక గురుభక్తుడు నాకు ఈ విధంగా సలహా ఇచ్చినాడు. నీవు శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామిని ఆశ్రయించి, ఆయనను సంతాన రక్షణగూర్చి ప్రార్థించుము. తప్పకుండా ఆయన కృపవలన మీయొక్క సంతానము దక్కుతుంది–అన్నాడు. ఇటువంటి సద్గురువుయొక్క కీర్తిని విని ఇప్పుడు ఏ కుమారునియొక్క ఉపనయనము చేయుచున్నామో, ఆ కుమారుడు గర్భంలో ఉన్నప్పుడు నేను సద్గురుయొక్క ఆశ్రమమునకు వెళ్లి స్వామిని సమీపించి నా గర్భరక్షణగూర్చి ప్రార్థించినాను. ఆ సద్గురుదేవుని అనుగ్రహమువల్లనే ఈపుత్రుడు మనకు దక్కినాడు.ఆయన ఆశీర్వాదమువలన రక్షిం-పబడిన మన కుమారుని ఉపనయనమునకు ముందు ఆ సద్గురుదేవుని మన ఇంటికి ఆహ్వానించి, యథాశక్తిగా పూజించి తృప్తిపరచినచో, స్వామియొక్క ఆశీర్వాదము, కృప మనపై కలిగి శుభము

చేకూరును. షోడశోపచారయుక్తముగా పూజలు గావించి, తగిన దక్షిణలొసంగి అత్యాదరముతో నైవేద్యము సమర్పించుకున్నట్లయితే మన కుమారుని కళ్యాణము (మంచి) జరుగును. కావున, ఈ నా విన్నపమును ఆలకించి సద్గురుదేవుని మన గృహమునకు తీసుకురండి–అని వేడుకుంది.

ఇట్టి విజ్ఞప్తిని విన్న ఆ రమానాథుడు ఆగ్రహముతో, ఏమే? నీవు పూజించడానికి వ్రతములు ఆచరించడానికి మన ఇంట్లో దేవుడు లేడా? మనము బ్రాహ్మణులమై ఉండి, ఆ శూద్రుని మన ఇంటికి తీసుకొస్తే మన కులస్తులైన బ్రాహ్మణులంతా నవ్వుతారు.ఈ నీ మూర్ఖత్వమును విడిచి నేను చెప్పినట్లు చెయ్యి. మన ఇంట్లోగల శ్రీకృష్ణుని విగ్రహమునకు పూజలు చేయుము–అంటాడు.

భర్తయొక్కఆగ్రహమును గమనించిన కృష్ణాబాయి ఎంతోదుఃఖిస్తూ ఏకాంతములో కూర్చు-ని సద్గురువుగూర్చి విలపించసాగింది. ఓ సద్గురుదేవా! నేను మనస్ఫూర్తిగా నీయొక్క పూజలు చే-ద్దామంటే నా భర్త అంగీకరించడము లేదు. అందుకు నీవు ఏమాత్రము కోపగించక మమ్ములను రక్షించుము స్వామీ! అని వేడుకుంది.

ఆ భక్తురాలుయొక్క ఆర్తనాదమును విన్న సద్గురుదేవునికి జాలిగలిగి, ఆమె ఎదుట ప్రత్యక్షమై అమ్మా! నీవు ఏమి వ్యథ చెందకుము. నీవేమీ తొందరపడకుము. నీయొక్క మనోఽభీష్టము తప్ప-కుండా నెరవేరుతుంది–అని సద్గురుదేవుడు ఆశ్వాసమిచ్చినాడు. ఆమె ఎంతో సంతోషముతో పర-వశించినది. ఇంతలో అక్కడ కుమారునియొక్క ఉపనయన సమారంభము ప్రారంభమైంది.

కార్యక్రమ ప్రారంభమున తమ ఇష్టదైవమైన శ్రీకృష్ణుని పూజగావించుటకు రమానాథుడు పూజా సామగ్రులను తీసుకొని పూజాగదిలో ప్రవేశించినాడు. అప్పుడు ఒక విచిత్రమైన ఘటన జరి-గింది. పూజామందిరంలో ఉన్న శ్రీకృష్ణమూర్తికి బదులుగా శ్రీ సిద్ధారూఢస్వామి మూర్తి కనిపించింది. అది చూసిన రమానాథునికి ఆశ్చర్యము కలిగింది. అప్పుడు తనలోతాను–నా భార్యయగు కృష్ణా-బాయి తనయొక్క మనోఽభీష్టమును నెరవేర్చుకొనుటకు శ్రీకృష్ణమూర్తిని తొలగించి శ్రీ సిద్ధారూఢ మూర్తిని స్థాపించింది–అని అనుకొని, తన భార్యను కోపంతో కేకవేసి పిలిచాడు. అప్పుడు కృష్ణా-బాయి పరుగు పరుగున రాగా, ఆమెనుద్దేశించి రమానాథుడు ఇలా అంటాడు. ఏమే భ్రష్టురాలా! కృష్ణునిమూర్తిని తీసివేసి సిద్ధారూఢ మూర్తిని స్థాపించావు?

అప్పుడు కృష్ణాబాయిగూడా ఆశ్చర్యచతురాలై, యథార్థంగా నేను స్వామియొక్క మూర్తిని పెట్టలేదండీ–అంది. ఇది సద్గురువుయొక్క మహిమనే అని గ్రహించింది. రమానాథునికి ఇంకా కోపమువచ్చి, ఆ మూర్తిని తొలగించి విఠల్ నాథుని మూర్తిని పెట్టినాడు. అయినాగాని సిద్ధనాథుని మూర్తియే కనిపించుచుండెను. దానినిగూడా తీసివేసి గణేశుని విగ్రహమును పెట్టినాడు. దాని యందుగూడా సిద్ధనాథుని మూర్తియే కనపడుచుండెను.

ఇదంతా దర్శించిన రమానాథుడు విస్మయమొంది భ్రమలో పడ్డాడు. ఆశ్చర్యచకితుడై ఇది-యేమో ఈశ్వరీయమాయ ఉంది. సిద్ధనాథుడు సాక్షాత్ ఈశ్వరునియొక్క అవతారము. ఇది నిశ్చ-యము-అనుకొని, అప్పుడు తన భార్యతో ఇలా అంటాడు. నేను నిన్ను వ్యర్థముగా కోపించినాను. పొరపాటు జరిగింది. నన్ను క్షమించుము. నీవు సద్గురుదేవుని యథార్థస్వరూపమును, మహిమను తెలుసుకున్నావు. సిద్ధనాథుడు సాక్షాత్ ఈశ్వరుడు. ఇందులో సంశయములేదు. నీవుచాలా ధన్యు-రాలవు–అని పలికి, స్వామిపై విశ్వాసము, భక్తి పెంచుకున్నాడు. ఇంకా ఇలా అంటాడు. నేను ఇప్పుడే సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురు దేవుని మన ఇంటికి తీసుకొచ్చి నీయొక్క అభీష్టానుసారము స్వామికి పూజలు గావించి, కానుకలు సమర్పించుకుంటాను.

ఈ ప్రకారంగా పలికి తన ఇష్టమిత్రులను తమ ఇంటికి తీసుకొచ్చి సద్గురు మూర్తిని చూపిం-చినాడు.వారికిగూడా సిద్ధమూర్తి కనిపించింది. వారు ఇలా అంటారు.అహో! సద్గురుదేవునిది ఏమి మహిమ! తానే స్వయంగా ఈశ్వరుడు ఉన్నాడు. మనము సిద్ధనాథుని మహిమను ఎఱుగక ఆయ-నను ఉపేక్షించినాము. అయ్యో! ఎంత అపచారము చేసితిమి-అని చాలా పశ్చాత్తాపపడినారు.

ఇప్పుడు రమానాథుడు పశ్చాత్తాపబుద్ధిగలిగి ఇలా అంటాడు. వెంటనే నేను సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని పాదపద్మములను ఆశ్రయించి, నన్ను క్షమించమని వేడుకుంటాను. ఆయనను ప్రేమతో పూజించి ఈ లోకములో జన్మించినందుకు నా జన్మను ధన్యము చేసుకుంటాను–అని పలుకుతూ, తొందరగా సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని ప్రార్థించి, స్వామిని తమ ఇంటికి తీసుకుని వస్తాడు.

ఇక్కడ ఇంటిలో కృష్ణాబాయి సద్గురుదేవుడు ఎప్పుడు వస్తాడా అని ఉన్నతమైన ఆసనమును సిద్ధముచేసి ప్రేమపూరితనేత్రములతో స్వామియొక్క ఆగమనముకోసము ఎదురుచూస్తోంది.ఎప్పు-డైతే రమానాథుడు సద్గురుదేవుని తోడ్కొనివచ్చాడో, అప్పుడు దివ్యమైన ఆసనముపై స్వామిని కూర్చుండబెట్టి కృష్ణాబాయి తన శిరమును సద్గురుదేవుని పాదపద్మములపై వ్రాల్చి ప్రేమాశ్రువులతో, మొదట స్వామియొక్క చరణకమలములను కడిగింది.

ఓ దీనదయాలా! సద్గురు సిద్ధనాథా! అనాథలమైన మమ్ములను రక్షించావు. నీయొక్క అగాధమైన మహిమను తెలుసుకోలేకపోయాము. మమ్ములను క్షమించండి స్వామీ! అని దీనముగా వేడుకుంది. అప్పుడు పూజాసామగ్రులన్నీ తీసుకొచ్చి వేదోక్తరీతిగా సద్గురుదేవుని పాదపూజ గావిం-చినారు. రమానాథుడు తన బంధుమిత్రులందరిని పిలిచి స్వామికి నైవేద్యమును సమర్పించి, ఉత్తర పూజగూడా గావించి, స్వామియొక్క ఆశీర్వాదమును పొందినారు.తదనంతరము స్వామికి రమా-నాథుడు దక్షిణతాంబూలాదులు,ఒక పంచ మొదలగునవి సమర్పించి,దివ్యముగాఅలంకరింపబడిన ఒక ఎడ్లబండియందు స్వామిని కూర్చుండబెట్టుకొని సిద్ధాశ్రమమునకు చేర్చినాడు.

ఇక్కడికి ఈ కథ ముగిసింది. ఇప్పుడు లక్ష్యార్థమును తెలిపెదము సావధానచిత్తులై వినగ-లరు. కర్మఠుడైన రమానాథుడనే జీవుడు. ఆయనకు సద్బుద్ధి (కృష్ణాబాయి) అనే భార్య. సద్గురుకృప గలుగనందువలన రెండు పర్యాయములు తమ సంతానము కర్మరోగముచేత మరణిస్తారు. ఎప్పుడైతే సద్గురువునకు బుద్ధి (కృష్ణాబాయి) శరణుబొందినదో, అప్పుడు సద్గురుదేవుని కృపవలన మూడవ సంతానము జ్ఞానపుత్రుడు జన్మించి, రక్షింపబడినాడు. కర్మరోగము సమూలముగా నష్టమయ్యింది. అందుగురించి సద్గురుదేవుని శరణుబొందమని సద్బుద్ధి అయిన భార్య(కృష్ణాబాయి) కర్మఠజీవుని వేడుతుంది. ఈ సద్బుద్ధియొక్క విన్నపమును విన్న కర్మఠజీవుడు (ప్రవృత్తి పరజీవుడు)కోపించినాడు. సద్గురువు మనకంటె విజాతీయుడున్నాడు. ఎట్లనగా, అసత్,జడ,దుఃఖరూప జాతి మనది. సత్, చిత్,ఆనందస్వరూపము సద్గురుదేవునిది. అటువంటి ఆయనను మన ఇంటికి (హృదయమునకు) తీసుకొచ్చినట్లయితే మన ధర్మములు–దేహము నేను, దీనికి సంబంధించినవారు నావారు–అను దేహము,దేహ ధర్మములు సమూలంగా నష్టమవుతాయి. ఎందుకంటే, ప్రవృత్తిమార్గము మనది. నివృత్తిమార్గము సద్గురుదేవునిది. అందుకని, సద్గురుదేవుని తమఇంటికి తీసుకురావడానికి కర్మఠ జీవుడు నిరాకరిస్తాడు. కాబట్టి, జ్ఞానపుత్రుడు ఉదయించాలంటే జీవుడు సద్గురుదేవుని తప్పకుండా ఆశ్రయించాలి.

తిరస్కారబుద్ధిచేత ఎల్లప్పుడు గురుస్వరూపాన్ని స్మరిస్తూ ఉండడమువల్ల వృత్తి తదాకా-రమయ్యి, గురుస్వరూపాన్ని పొందుతాడు. సద్గురుదేవునిపై ప్రేమ ఉదయించి, అది క్రమక్రమముగా వృద్ధిచెంది, జీవుడు గురుస్వరూపాన్ని పొందుతాడు. వృత్తి గురుచరణములయందు స్థిరపడుతుంది. క్రోధముచేతగాని, ద్వేషముచేతగాని ఎల్లప్పుడు చింతన చేసినట్లయితే వృత్తి తదాకారాన్ని పొంది, తద్వారా ప్రేమ ఉత్పన్నమై జీవుడు ధన్యుడుకాగలడు. ఉదాహరణకు:–హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు మరియు కంసుడు వీరంతా భగవంతునిపై క్రోధబుద్ధిచేత, ద్వేషబుద్ధిచేత భగవంతుని నిరంతరము స్మరిస్తూ ఉండడమువల్ల వారు భగవంతుని దయవలన భగవత్సాయుజ్యమును పొందినారు.

**శ్లో ॥ కర్పూరమనలే యద్వత్ సైంధవం సలిలే యథా ।**

**తథా సంధీయమానం చ మనస్తత్త్వే విలీయతే ॥** (శాండిల్యోపనిషత్ 1-7-21)

ఈ విధముగా నిరంతరము తిరస్కారబుద్ధిచేత చింతన చేస్తుంటే, వృత్తి తదాకారాన్ని పొంది గురుచరణములయందు ప్రేమ ఉదయించి, దేహాది అనాత్మ ప్రపంచమునుండి వృత్తి వెనక్కి మరలి తిరోధానమై, సద్గురువును హృదయమందు స్మరిస్తూ వృత్తి తద్రూపమైపోయి, ఇంకా మిగలదు. ఈ విధంగా హృదయమందు అచంచలమైన ప్రేమగలిగి గురుపాదముల నాశ్రయించి బయట, లోన అంతటా గురుస్వరూపమే దర్శింపబడి, పరమానందము లభిస్తుంది.

సద్గురుదేవుని కృపద్వారా చంచలమగు చిత్తము ప్రశాంతమునొంది, అంతఃకరణశుద్ధిగలిగి, దృఢమైన అపరోక్షబ్రహ్మజ్ఞానముదయించి, సద్గురుదేవునికి భక్తి అనే దక్షిణ, ప్రేమ అనే శాలువ (రుమాలు లేక వస్త్రమును) సమర్పించుకుంటాడు. ఈ ప్రకారముగా సద్గురువును పూజించినందున దృఢమైన బ్రహ్మజ్ఞానముస్థిరపడి,ద్వైతభావము నిరసించి,అద్వైతభావన ప్రకటమవుతుంది.సద్గురువు యొక్క తత్త్వచింతనద్వారా లేక చరిత్రశ్రవణముద్వారా మనస్సుతత్క్షణమే తదాకారమై(బ్రహ్మాకారమై) సర్వత్ర బ్రహ్మమునే దర్శిస్తాడు.

ఓ శ్రోతలారా! మధురమైనటువంటి మరియు ముల్లోకములు ఆనందముతో ఉప్పొంగి పోవునటువంటి సద్గురుచరిత్రను ముందరఅధ్యాయమున అత్యాదరముతో శ్రవణము చేయగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రమున సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ సిద్ధనాథుని చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ఇరువది ఒకటవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది రెండవ అధ్యాయము

పద్యానువాదము:—నిర్గుణ నిరాకార నిర్విశేష స్వరూపడవైయుండిగూడా జీవులనుద్ధరించుటకు సగుణయుక్తమైన మానవ శరీరమును ధరించినావు. అయినాగాని, త్రిగుణములను నీ అధీనంలో ఉంచుకొని నియమిత గుణములచేత ప్రకటమై, మా హృదయమందున్నటువంటి అజ్ఞానమనే తమస్సును(చీకటిని) నివృత్తి చేసే సూర్యునివంటి ఓ పరమేశ్వరా! నిర్లిప్తుడవైయుండి గుణాభాసరూపముగా ప్రకటమైన ఓ నిర్మలాత్మా! జగదీశా! ఓ సిద్ధరాజా! నీకు జయము జయము.

సద్గురుదేవునియొక్క వచనామృతములయందు విశ్వాసముంచి శ్రద్ధతో శ్రవణము చేసినట్లయితే తత్క్షణమే ముక్తి ప్రాప్తించగలదు. దీనియందు సంశయము గలవాడిని ఎవరుకూడా తరింపజేయలేరు.**"సంశయాత్మా వినశ్యతి"**(గీత.4-40).కావున,పాపకర్మలను సమూలంగాత్యజించి,శాస్త్రోక్తపుణ్యకర్మలను ఆశ్రయించాలి. నిత్యము నియమముగా ఈశ్వరభజన చేస్తుండాలి. సహజంగా సత్సంగమందు ప్రేమగలిగియుండాలి. త్రికరణశుద్ధిగా దయాబుద్ధిగలిగియుండాలి. హృదయపూర్వకముగా ప్రేమతో దయానిధియగు సద్గురుదేవుని ఎల్లప్పుడు పూజిస్తూ ఉండాలి. ఇతరులయొక్క దోషములనుగూర్చి మాట్లాడరాదు. ప్రమాణశూన్యముగా మహాత్ముల అనుభవమునకు విరుద్ధముగా, స్వేచ్ఛగా వ్యవహరించకూడదు. ఇతరులయొక్క నేరములు లెక్కించకూడదు. కామాదులను జయించాలి. సంసారకర్మలగూర్చి అనురాగబుద్ధి కలిగియుండకూడదు. ఉదాసీనముగా ఉండాలి. వాటిలో ఎక్కువగా ఆసక్తి ఉంచినట్లయితే, అవి సంకటములందు పడవేసి దుఃఖమునకు కారణము కాగలవు.సద్గురుపాదములను విడువరాదు.ధనప్రాప్తి కలిగినాగాని ధనమదమును రానివ్వగూడదు. దేనియొక్క విచారణచేత మాయ నివృత్తమగునో, దానినే నిత్య నిరంతరము చింతనచేస్తూ ఉండాలి. లౌకికుల ఎదుట మాట్లాడినప్పుడు మరిచిగూడా వారితో వేదాంతము చెప్పకూడదు.

**శ్లో ॥ నాపృష్టః కస్యచిద్ బ్రూయాత్ నచాన్యాయేన పృచ్ఛతః ।**

**జానన్నపి చ మేధావీ జడవల్లోకమాచరేత్ ॥** (సంన్యాసోపనిషత్ 2-102)

హృదయమందు ఐక్యభావముగలిగి వ్యవహరించాలి. దేశకాల స్థితిని అనుసరించి వేదోక్త ప్రకారము ఆచరణ కలిగియుండాలి. ఈశ్వరభక్తిని(స్వరూప అనుసంధానమును) విడిచి అన్యచింతన

చేయకూడదు. నేనెవరిని? పరమాత్మ ఎవరు? ఈ ప్రపంచమునకు కారణమేమి? అను దృఢజిజ్ఞాసగలిగి, జ్ఞానము కలుగు వరకు నిరంతరము విచారము చేస్తూ ఉండాలి.

**శ్లో ॥ కోహం కథమిదం జాతం కోవై కర్తాస్య విద్యతే ।**

**ఉపాదానం కిమస్తీహ విచారస్సోయమీదృశః ॥** (అపరోక్షానుభూతి 12)

ఈ వ్యావహారిక సంసారము స్వప్నమువలె మిథ్యా ఉన్నదనే నిశ్చయజ్ఞానమును పొందాలి. ఉమారమణుడైన పరమేశ్వరుని అనన్య భక్తిచేత భజించనట్లయితే ఆయన కృపద్వారా ఆసురీ వృత్తులగు కామ క్రోధాదులు సమూలముగా నష్టమై, అక్షయసుఖము లభిస్తుంది. అందుకనే ఈశ్వ-రుని ఆశ్రయించాలి. ఈ ప్రకారంగా యథార్థబోధ (జ్ఞానము) అంతరంగమందు ఎవరైతే ధరించి ఉంటారో, వారు సంసారమందు వర్తించినప్పటికినీ, భవబంధముక్తులవుతారు. సద్గురు కృపద్వారా సంసార సాగరమును దాటి (తరించి) ముక్తిని పొందగలరు.

ఇప్పుడు ఓ శ్రోతలారా! అమృతముకన్న మధురమైన సిద్ధనాథుని కథామృతమును సావ-ధానచిత్తులై శ్రవణము చేయగలరు. అమృతమును సేవించినచో మోక్షము దొరకదు. కాని, సద్గురు దేవుని కథామృతసేవనద్వారా సర్వులుముక్తులు కాగలరు.సిద్ధనాథస్వామి ఒకానొక సమయములో సిద్ధాశ్రమమునందు విశ్రమించి ఉండగా, శివరాత్రి మహోత్సవము సమీపించింది. కావున, దూర దూర గ్రామాలు, పల్లెలలో ఉన్నటువంటి భక్తులందరూ **హుబ్లీ** పట్టణము చేరి ఏకత్రితమైనారు. ఇట్లు భక్తులందరూ కూడా ఉత్సవముగూర్చి విచారించి, ఎప్పటికీ శివరాత్రి మహోత్సవము హుబ్లీలోనే జరుపబడుతుంది. ఈసారి మనము మన గ్రామంలో ఏర్పాటు చేస్తాము. సద్గురు చరణ కమలములు మన గ్రామములో మోపినట్లయితే మన గ్రామము, మనందరమూ ధన్యులము కాగలము. అని విచారించి అందరు భక్తులు కలిసి "మురికిబావి" అనే గ్రామములో ఉత్సవము జరుపుటకు నిర్ణయించుకొని సద్గురు దేవునికి విన్నవించుకుంటారు.

ఓ సద్గురుదేవా!ఈసారి శివరాత్రి ఉత్సవమును"మురికిబావి"అనే గ్రామములో జరుపుటకు నిశ్చయించుకున్నాము. మీరు అనుమతించి, ఆజ్ఞాపించినట్లయితే మీయొక్క పూజ జరుపుటకు మండప ఏర్పాట్లు, వైభవమైన ఆసన ఏర్పాట్లు చేస్తాము–అని వేడుకుంటారు.

అప్పుడు సద్గురుదేవుడంటాడు. నేను **హుబ్లీ** విడిచి ఎక్కడకు రాను. ఇక్కడికి నాయొక్క దర్శనార్థము ఎల్లప్పుడూ వచ్చే భక్తులు, నేను ఇక్కడ లేకుంటే నిరాశ పడతారు. మీరు అక్కడ ఉత్సవము ప్రారంభించి, నిత్యము భజన, మహాత్ముల ప్రవచనము, వేదాంత శ్రవణము మరియు అన్నదానము చేస్తూ ఉండండి. అక్కడ నేను ఉన్నట్లే భావించండి–అని ఆశీర్వదిస్తాడు.

ఇటువంటి సద్గురు వచనములను విని, భక్తులు ఆనందపరవశులై సద్గురుదేవునియొక్క చిత్రమును తీసుకెళ్లి, "మురికి బావి"యందు భవ్యమైన మండపమును నిర్మించి, సద్గురుదేవుని చిత్ర-

మును నిత్యము పూజించుటకు మండపములోనే ఉన్నతాసనముపై ఉంచి, సద్గురుదేవుడు ప్రత్య-క్షంగా ఉపస్థితుడై ఉన్నట్లుగా భావించుకొని, అచ్చట స్థాపించినారు. స్వామికి నిత్యము షోడశోప-చారపూజలు నియమముగా చేయుటకొరకు ఆ చిత్రంతో పాటు శ్రీ సిద్ధారూఢ స్వామియొక్క సన్నిహిత శిష్యుడైన రామయ్యస్వామిని గూడా 'మురికి బావి' కి తీసుకొచ్చినారు.

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి స్వయముగా మన పూజలు అందుకొనుటకు 'మురికి బావి'కి వస్తున్నాడు. ఉత్సవము సమాప్తివరకు ఉంటాడు–అని దేశదేశములకు కరపత్రములను పంపించి-నారు. సద్గురుదేవుడు 'హుబ్లీ'ని విడిచి ఎచ్చటకు వెళ్లనివాడు 'మురికి బావి'కి ఎలా వస్తాడు-చూద్దాము.స్వామిని దర్శించుకొని ధన్యులమవుదాము-అని తండోపతండములుగా భక్తులు ఉత్స-వమునకు వేలసంఖ్యలో విచ్చేసినారు. అసంఖ్యాకములుగా జనము ఉత్సవములో పాల్గొన్నారు. భోజనోపచారములు చేయుటకు సామగ్రులు తయారు చేయుచున్నారు. అందరికి ఏ లోటు లేకుండా భోజనప్రబంధము చేయుచున్నారు.విశాలమైన మైదానప్రదేశంలో భవ్యమైనమండపమును ఏర్పాటు చేసి, దివ్యమైన సింహాసనమును అలంకరించి, దానిపై సద్గురుదేవుని చిత్రపటమునుంచి, ఏడు రోజులు ఉదయము సాయంత్రము స్వామికి షోడశోపచారయుక్తమైన పూజలుగావిస్తూ, రాత్రింబ-వళ్లు భజనలు, కీర్తనలు మరియు ప్రవచనములద్వారా మహావైభవముగా ఉత్సవము జరిపినారు. మహాత్ములద్వారా వేదాంతచర్చలు, సాధుసత్పురుషులద్వారా ఉపన్యాసములు గావిస్తూ ఉంటే దేశదేశాలనుండి భక్త అభక్తజనులు వచ్చి ఆ ఉత్సవమును భూకైలాసముగా మార్చినారు. వచ్చిన వేలాది భక్తులకు మధ్యాహ్నము మరియు రాత్రి ఎవరికి ఏ లోటు లేకుండా భవ్యముగా భోజన వ్యవస్థ ఏర్పాటుచేసినారు. అందరిని తృప్తిపరిచినారు. ఏడురోజులు సంధ్యాసమయమున అలంకార యుక్తమైన దీపాలతో సద్గురు చిత్రపటమును అలంకరించి షోడశోపచారయుక్తమైన పూజలు గావించేవారు. అనేక భూషణములతో అలంకరించేవారు. తర్వాత సద్గురు దేవునికి అసంఖ్యాకమైన భక్తులు జయజయకారములు చేస్తూ, సద్గురు నామఘోషలయొక్క గర్జనలుగావిస్తూ, సద్గురుదేవునికి హారతి ఇస్తూ, ఆనందములో మునిగిపోయేవారు.

సద్గురుదేవుని దర్శనార్థము విచ్చేసిన భక్తులు స్వామి దర్శనాభిలాషులై ప్రతిరోజు నిరీక్షి-స్తున్నారు. కాని, సద్గురుదేవుని దర్శనమగుటలేదు. స్వామి రావడము లేదు. ఈ రోజు రాకున్నా మరుసటి రోజైనా రాకపోతాడా? అని స్వామి రాకకోసము ఎదురుచూస్తూ ఏడు రోజులు అక్కడే పట్టుదలతో స్వామిని దర్శనము చేసుకున్న తరువాతనే మనము మన గమ్యస్థానాలకు పోదామని, తీవ్రమైన ఆసక్తితో ఉత్సవ సమారాధనలో నిమగ్నులైనారు. చివరివరకు స్వామి రాకపోయేసరికి, సద్గురుదర్శనము కాకపోయేసరికి,భక్తులు నిరాశచెందినారు.పత్రికలలో అబద్ధము వ్రాసినారు–అని అనుకోసాగారు.

అలా నిఃస్పృహులైన వారిని ఉద్దేశించి-కొందరు ఏమీ నిరాశపడకండి. స్వామి ఈ చివరి రోజు తప్పకుండా వస్తాడు. దర్శనమిస్తాడు-అని ధైర్యము చెప్పగా, చివరి రోజువరకు స్వామి రాక కోసము ఉండిపోయినారు. ఈవిధముగా నిత్యము పూజలు క్రమముగా, నియమముగా గావిస్తూ ఉన్నారు. ఏడవ రోజు వచ్చింది. ఈరోజు తప్పకుండా సద్గురుదేవుడు దర్శనమిస్తాడని నిన్న మొన్నటి కంటె అధికసంఖ్యలో భక్తులు వస్తున్నారు. సంధ్యాకాలము వరకు అసంఖ్యాకమైన భక్తులు ప్రోగై-నారు. భక్తులలో కోలాహలము చెలరేగింది. సద్గురుదేవుని దర్శనము కాలేదు. రామయ్యస్వామి సంధ్యాసమయమున స్వామియొక్క పూజచేయుటకు సంసిద్ధుడైనాడు.తెరవేసి స్వామియొక్క చిత్ర-పటమును అలంకరించినాడు. భక్తులంతా చింతతో ఉన్నారు. స్వామి రాలేదు. రామయ్యస్వామి పూజచేయుటకు తెరవెనుక ప్రవేశించి స్వామికి షోడశోపచారపూజలు గావించి, స్వామిని ఇలా ప్రార్థిస్తున్నాడు. జయ జయ సద్గురుదేవా! ఈ అసంఖ్యాకమైన భక్తజనులను చూసావా? నీయొక్క దర్శనార్థము అనేకమంది భక్తజనులు వేంచేసి ఉన్నారు. ఏడు రోజులనుండి ఎదురుచూస్తున్నారు. ఈ క్షణాన నీవు ప్రకటమై దర్శనమీయకున్నచో, మా పరువు ప్రతిష్ఠలు మంటగలుస్తాయి. ఈ చివరి రోజున తప్పకుండా వస్తావని అధిక సంఖ్యలో భక్తులు వచ్చారు. నీవు రానట్లయితే నీ భక్తులమైన మేము నవ్వుల పాలవుతాము. ఇది నీకు తెలుసు. నేను స్వహితమును గురించి నిన్ను ఏమి అర్థించుటలేదు. సకామ భక్తులకుకూడా నీవు ఈప్సితార్థములను ఇస్తావు. అట్లయినప్పుడు నేను పర-హితముగూర్చి నిస్వార్థముగా భక్తులకోసము నిన్ను వేడుకుంటున్నాను. నీవు మాయందు దయ-తలచి తప్పకుండా వచ్చి దర్శనమీయ గలవు. నీయొక్క దర్శనము ఒకవేళ కలిగినట్లయితే భక్తులు ఎంతో ఆనందమును పొందగలరు.నీయందు భక్తివృద్ధిపొందగలదు.నీయొక్క కీర్తి వ్యాపించగలదు. అని రామయ్యస్వామి తన నిష్కామ అభిప్రాయాన్ని వెలిబుచ్చుకున్నాడు. అవతారస్వరూపుడవైన ఓ సిద్ధనాథా! ఈ అజ్ఞజనులను ఉద్ధరించి నీయందు భక్తి విశ్వాసములు వృద్ధినొందింపచేసి, నీ కీర్తి వ్యాపింపచేసి, ఈ లోకమును పవిత్రము చేయుము. ఈనిమిత్తముగానే ఈఉత్సవము జరుపబడు-తుంది. నీయొక్క దర్శనార్థము అనేక భక్తులు వేంచేసియున్నారు. మా అందరికీ దర్శనభాగ్యము కలిగించినట్లయితే ఈఉత్సవము సార్థకము కాగలదు.నా ప్రార్థనను మన్నించి నీవు దర్శనమీయ-కున్నచో ఈ భక్తుని వచనములు అసత్యములు కాగలవు. భక్తుల వచనాలపై ఎవరికి నమ్మకము ఉండదు. మా పరువు నష్టమైపోగలదు. భక్తుల క్షేమమే నీ క్షేమము. భక్తులయొక్క సౌఖ్యమే నీ సౌఖ్యము. భక్తులయొక్క ఆనందమే నీ ఆనందము. కావున మాకు కలిగే ఈ అప్రతిష్ఠ నీకే కలుగుతుంది. మరియు—

**శ్లో ।। అహం భక్త పరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ ।**

**సాధుభిర్గ్రస్త హృదయో భక్తైర్భక్తజనప్రియః ।।** (శ్రీ మద్భాగవతము ౯-4-63)

ఈ భగవద్వచనానుసారము మాయొక్క అపకీర్తి నీదే అవుతుంది. ఈ వేలాది భక్తజనులు నీయొక్క దర్శనార్థము వారి గృహములను త్యజించి, వారి దారాపుత్రాధులను విస్మరించి, ధనమును పరిత్యజించి నీవే ముఖ్యముగా భావించి, నిన్నే ఆశ్రయించినారు. అటువంటి భక్తులను నిరాకరించడము నీకు భావ్యమా? వారికి దుఃఖము కలిగించడము నీకు శ్రేయమా?వారిని నిరాశపరచడము నీకు తగునా? ఈ ప్రకారముగా రామయ్య స్వామి భక్తుల కోసము పరహితమును కోరి దీనవదనుడై ఆర్తనాదముతో సద్గురుదేవుని హృదయపూర్వకముగా ప్రార్థించినాడు.

ఎప్పుడైతే ఈ విధముగా ప్రార్థించి,తెరను తొలగించి బయటకు వచ్చినాడో,అప్పుడు భక్తులలో జయజయ ఘోషలు వినిపించసాగాయి.సద్గురుదేవుడు మండపమందు ప్రత్యక్షమైనాడు.సకల భూషణాలతో మండితమై,ముఖకమలము తేజోవంతమై,కనులు మిరుమిట్లు కొలుపులాగున మండపమందు ప్రకాశిస్తున్నాడు. స్వామియొక్క తేజోస్వరూపాన్ని దర్శించిన భక్తులందరూ అద్భుతమైన ఆనందమును పొందినారు. స్వామియొక్క క్షణకాల దర్శనమువలన పున్నమినాటి సముద్రపు అలలవలె, వర్షాకాలములోని మేఘములవలె గర్జనలు వినబడుచుండెను. అందరిలో ఉత్సాహము ఉప్పొంగుచుండెను. ఆ దృశ్యము వర్ణింప శక్యముకాకున్నది. సద్గురుదేవుడు ఎప్పుడైతే దర్శనమిచ్చినాడో, భక్తులు ప్రమోదమును పొంది నాట్యము చేస్తున్నారు. భక్తులు ఇలా అనుకొనుచున్నారు—

మేము ధన్యులము. మా జన్మధన్యము. సద్గురు సిద్ధనాథుడు పరిపూర్ణ వ్యాపకరూపుడైన పరబ్రహ్మమై ఉన్నాడు. తాను వ్యాపక స్వరూపుడని నిరూపించుకున్నాడు. దేవునిగూర్చి అక్కడ ఇక్కడ ఎందుకు వెళ్లాలి?సద్గురుదేవుడు సర్వత్ర వ్యాపించిఉన్నాడు.ఆయన దర్శనము ప్రత్యక్షఅనుభూతము. ఇది తెలియక మేము వ్యర్థముగా మరుభూమిలోని నీటి కోసము లేడి పరుగులుతీసినట్లు దశదిశలు పరుగిడుతుంటాము. అంతటా సద్గురుదేవుడు వ్యాపించి ఉండగా ఎక్కడికి వెళ్ళనక్కరలేదు.

**శ్లో ॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి ।**

**తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి ॥** (గీత 6-30)

సద్గురుదర్శనముద్వారా అందరూ అమితానందమును పొందినారు. భక్తుల హృదయాలలో సద్గురుదేవుని మంగళమూర్తి ప్రతిష్ఠితమైనది. అప్పుడు సద్గురుదేవుడు అక్కడికక్కడే అదృశ్యమైనాడు. ఉత్సవము సమాప్తమైనది.

ఇట్లు భక్తాభిమానియై వారి కోరిక మన్నించి, లోకోపకారార్థము అవతరిస్తూ, భక్తరక్షకుడనే బిరుదును దృఢపరుచుకున్నాడు. ఈ సద్గురుచరిత్ర పరమ పవిత్రమైనది. శ్రోతలు అత్యాదరముతో శ్రవణముచేసి, సద్గురు కృపకు పాత్రులై దుస్తరమైన భవసాగరమునుండి తరింపబడుదురు.

ఇంతవరకు శ్రోతలు మనోహరమైన సద్గురు కథామృతమును అత్యంత ఆదరంతో శ్రవణము

చేసినారు. ఇప్పుడు ఈకథయొక్క లక్ష్యార్థరూప ఆధ్యాత్మిక జ్ఞానమును ప్రకటము చేస్తాము. సాధకులు ఎల్లప్పుడు పరమాత్మయొక్క అపరోక్షానుభూతిని పొందుటకు తీవ్రతర ఇచ్ఛగలవారైఉంటారు. అందుకే సద్గురుదేవుని భావయుక్తముగా ప్రార్థిస్తుంటారు. సద్గురుదేవుడు వారి మనోఽభీష్టమును నెరవేరుస్తాడు. వారిని వెన్నంటే ఉంటాడు. సద్గురువుయొక్క వ్యాపకస్వరూపాన్ని దర్శించడమే బ్రహ్మ సాక్షాత్కారము. ఐక్యజ్ఞానము కలిగి ఉండడమే సద్గురుదేవుని పూజ. అదే అపరోక్ష జ్ఞానము. సద్గురువే నిర్గుణ నిరాకార పరబ్రహ్మము. భక్తులయొక్క ఆర్తనాదములు విని వారి ఆపదలను నివృత్తి చేయుటకొఱకు ఆ నిర్గుణపరబ్రహ్మమే సగుణరూపముగా అవతరిస్తాడు. ఏ విధముగా నీరు మంచు గడ్డలు ఒకటే అయి ఉండునో, అదేవిధంగా నిర్గుణ సగుణ బ్రహ్మము ఒకటే. సద్గురువును తొందరగా దర్శించుకోవాలని, జ్ఞానముకలగాలని అనుకుంటారు.ఘటపటాదులను దర్శించినట్లు సద్గురుదేవుని దర్శించినవాడు జ్ఞానికాదు. ద్వైతభావన అజ్ఞానమే. ఐక్యభావము పొందకుండా ఆత్మజ్ఞానము ఎప్పుడుకూడా పొందలేడు. ఆత్మజ్ఞానము పొందకుండా భవబంధము నివృత్తి కాదు. వాడు ముక్తుడు కాడు. సర్వభూతములయందు, గురుదేవునియందు సచ్చిదానందస్వరూపమును, సర్వఘటపటాదుల యందు అస్తి, భాతి, ప్రియరూప చైతన్య పరబ్రహ్మమును దర్శించి ఐక్యభావమును పొందిన వాడే యథార్థమైన జ్ఞాని.

ఓ శ్రోతలారా! ఇప్పుడు రసవత్తరమైన సద్గురుచరిత్రను ముందర అధ్యాయమునందు సావధానంగా వినగలరు. సద్గురు కృపద్వారా కలియుగ పాపదోషము తానంతట తానే దహింపబడుతుంది.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రమున సకల పాపములు నివృత్తి (భస్మము) కాగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీశివదాసస్వామి ఈ ఇరువది రెండవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది మూడవ అధ్యాయము

పద్యానువాదము:—గురుస్వరూపుడైన (వ్యాపక పరబ్రహ్మస్వరూపుడైన) సద్గురుసిద్ధనాథుని యొక్క దివ్యమైన చరణకమలములయొక్కమహిమ వర్ణనాతీతము.అటువంటి దివ్యపాదములను జీవుడు స్మరించినట్లయితే పవిత్రుడవుతాడు. సద్గురువుయొక్క కృపచేత బుద్ధియందున్న సకలదోషములు నివృత్తమై, వివేకముదయించి ద్వైతభావము నివృత్తమై, సద్గురుపదకమలములయందు ఎల్లప్పుడూ హృదయములో శ్రద్ధాభక్తులు దృఢమై భవదుఃఖముయొక్క భీతి సమూలంగా నివృత్తమవుతుంది.

శ్రీ సిద్ధారూఢ సద్గురునాథా! నీవు దయాసాగరుడవు. భవసాగరమునుండి తరింపజేయుటకు నీవు నౌకా రూపముగా ఉన్నావు. కావున, దీనుడనైన నేను నీ పాదపద్మముల నాశ్రయించి నమస్కరించుచున్నాను. కృపానిధివైన నీవు మాయొక్క జీవరూప ఉపాధిని (అవిద్యను) నివృత్తిచేసి బ్రహ్మాకార వృత్తిని కలుగజేసి, భవసముద్రమును దాటింపజేయుము. నీవు త్రికాల అభాధ్యస్వరూపుడవు(సద్రూపుడవు). సకలజగత్తును ప్రకాశించేవాడవు(చిద్రూపుడవు). నీవు పుణ్యపాపములకు అతీతుడవైనను, భక్తజనులను ఉద్ధరించుటకు పుణ్యపాప మిశ్రితరూపమగు మనుష్య శరీరమును ధారణ చేసినావు.

వైష్ణవీమాయ చాలా అగాధమైనది. జీవులను సంసార చక్రమునకు ఆహుతి చేస్తుంది. ఈ జన్మమరణరూప సంసారమునకు కారణము ఈ భేదజ్ఞానమే. ఎట్లనగా, ఈ మానవ శరీరమునకు కారణము ధర్మాధర్మరూప పుణ్యపాపములు. వాటికి కారణము రాగద్వేషాలు. వాటికి కారణము అనుకూల ప్రతికూలజ్ఞానము. దానికి కారణము భేదజ్ఞానము. దీనికి కారణము స్వరూప అజ్ఞానము (అఘటన ఘటనా పటీయసి మాయ).

**ఆత్మనః కిం నిమిత్తం దుఃఖమ్? శరీరపరిగ్రహనిమిత్తమ్। శరీరపరిగ్రహః కేన భవతి? కర్మణా। కర్మ కేన భవతీతి చేత్? రాగాదిభ్యః। రాగాదయః కస్మాత్ భవన్తీతి చేత్? అనుకూల ప్రతికూల జ్ఞానాత్। అనుకూల ప్రతికూల జ్ఞానమపి కేన భవతి? భేదజ్ఞానాత్। భేదజ్ఞానం కేన భవతి? అభిమానాత్। అభిమానః కస్మాత్ భవతి?అవివేకాత్। అవివేకః కస్మాత్ భవతి? అజ్ఞానాత్। అజ్ఞానం కేన భవతీతి చేత్? న కేనాపి। అజ్ఞానం నామ అనాది సదసద్భ్యామనిర్వచనీయం,**

**త్రిగుణాత్మకం, జ్ఞానవిరోధి, భావరూపం, యత్కిఞ్చిదితి వదన్తి, అహమజ్ఞః ఇత్యాద్యనుభవాత్ ॥** (శ్రీ శంకరాచార్యులవారి ఆత్మానాత్మవివేకము చూడుము)

ఇటువంటి అచింత్య శక్తిగల మాయనుండి విడుదల పొందడానికి నీవు తప్ప అన్యులు ఉద్ధరింపచేయలేరు. మాయయొక్క స్వరూపము, జీవుని స్వరూపము మరియు బ్రహ్మ స్వరూపమును నీవు యథార్థముగా ఎఱింగి ఉన్నావు. కావున, నీవే సమర్థుడవు. శాస్త్రపండితులు కేవలము వేదముయొక్క శబ్దార్థమునే తెలుసుకున్నారు. కాని, యథార్థమైన లక్ష్యార్థరూప వేదాంత సిద్ధాంతమును నీవే ఎఱింగినావు.

వేదములో కర్మ, ఉపాసన మరియు జ్ఞానము ప్రతిపాదింపబడింది. వీనిని శాస్త్రీయ పాండిత్యముగలవారు చదివినప్పుడు వారికి కర్మ, ఉపాసన మరియు జ్ఞానము ఒకదానికొకటి విరోధముగా ప్రతీతి అగుచున్నవి. ఐక్యజ్ఞానము కలుగదు. వాటియొక్క లక్ష్యార్థమును కేవలము ఒక సద్గురువే యెఱిగియున్నాడు. అందువలన, జీవుడు సద్గురుసన్నిధిలో శాస్త్రాభ్యాసము (బ్రహ్మవిద్యను) అభ్యసించాలి. శాస్త్రాల భేదము యథార్థముగా తెలియును.

సద్గురుదేవుడు శ్రోతయొక్క అధికారమును గ్రహించి జ్ఞాన బోధచేస్తాడు. ఒకవేళ శాస్త్రా-భ్యాసమునకు యోగ్యమైన అంతఃకరణము (అధికారిత్వము) లేనియెడల నిష్కామకర్మ, ఉపాసనల యందు ప్రవృత్తున్ని చేస్తాడు. అదిగూడా చేయలేని వారికి సకామకర్మ చేయమని చెప్తాడు. శ్రోత యొక్క అధికారత్వము, దోషములు సద్గురువునకే తెలుసు. అందుగురించి సద్గురుదేవుడు ఏ విధమైన బోధచేస్తాడో, ఎలా ఆజ్ఞాపిస్తాడో–శ్రోత ఆయనయందు పరమ విశ్వాసముంచి తదనుసా-రముగా ఆచరించాలి. అట్లు సద్గురుదేవునియందు భక్తి విశ్వాసములు కలిగి శాస్త్రముయొక్క ఆజ్ఞానుసారము మహాత్ముల అనుభవముననుసరించి ఆచరించినవాడు త్రిభువనములలో ధన్యుడు.

**శ్లో ॥ ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।**

**ధన్యాచ వసుధా దేవి యత్ర స్యాద్గురు భక్తతా ॥** (గురుగీత)

ఈ ప్రకారంగా సద్గురుదేవునియొక్క స్తుతిజేసి, ఇప్పుడు కథయొక్క మహిమను వర్ణిస్తాడు. ఒకానొక సమయమున **హుబ్లీ** పట్టణమునకు ఇద్దరు బ్రాహ్మణ సంతులు పండలీపురమునుండి వచ్చినారు. వారిద్దరు దక్షిణ కన్నడ ప్రాంతమునుండి బయలుదేరి పండలీపురంలో ఆషాడ ఏకాదశి ఉత్సవమును సందర్శించి, తిరిగి తమ ప్రాంతమునకు వస్తూండగా మధ్యలో హుబ్లీకి చేరినారు. వారు బ్రాహ్మణ వర్ణమునకు చెందినవారు. కావున, సజాతీయుడైన బ్రాహ్మణుడు 'రామరాయుడు' అనువాడు వారిని చేరదీసి ఆతిథ్యమిచ్చినాడు.

రామరాయుడు ఇలా అంటాడు. నాపుణ్యము కొద్దీ మాఇంటికి సంతుమహాత్ములు వచ్చి-నారు. మరుసటి రోజున వారికి భోజన సదుపాయములు సమకూర్చి ధన్యుడనౌతాను. అట్లే, మా

కులస్థులైన బ్రాహ్మణులను, బంధువులను పిలిచి అన్నసంతర్పణ గావిస్తాను–అని సంకల్పము చేసుకున్నాడు. సంత్ శిరోమణియైన శ్రీ సిద్ధారూఢ సద్గురుదేవుని గూడా పిలిచి ఆదరణీయంగా తగిన సత్కారముచేసి షోడశోపచారయుక్తముగాపూజించి స్వామిని పంపిస్తాను–అని అనుకొని సంతుమహాత్ములను విచారించదలచినాడు. ఎందుకంటే, వారిని విచారించకుండా సద్గురుదేవుని పిలిస్తే వారికి ఏమైనా అభ్యంతరమేమో–అందుకని వారితో ఇలా అంటాడు. అయ్యా మహాత్ములారా! మా గ్రామములో శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన శ్రీ సిద్ధారూఢ సద్గురుదేవుడున్నాడు. ఆయనను రేపు ఉదయము ప్రభోజనమునకు పిలుస్తాను. మీకు సమ్మతమేనా?

రామరాయుని వచనములను విన్న ఆ బ్రాహ్మణ సంతులు పకపక నవ్వి, సిద్ధారూఢస్వామి గురించి మాకు బాగా తెలుసు. ఆయన బ్రహ్మనిష్ఠుడు కాడు. కులశ్రేష్ఠుడు కాడు (శూద్రుడు).మరియు నియమనిష్టలు లేనివాడు.ఆయనతో మేము పంక్తిభోజనముచేయము. ఆశూద్రునితో కలిసి బ్రాహ్మ-ణులు ఎలా భోంచేయగలరు. ఇలా నీవు చేసినట్లయితే మమ్ములను అనాదరించినట్లవుతుంది. ఇది మాత్రము మాకు నచ్చడము లేదు. మన జాతికే కళంకము. అని ఈవిధముగా నీచభావముతో స్వామిని తిరస్కరించినారు. రామరాయుడు ఖిన్నుడై చింతలోపడి ఎంతో బాధపడ్డాడు. ఆ రాత్రి సమయమున ఎంతో చింతిస్తూ ఇలా అనుకుంటాడు. నా ఇష్టదైవమైన శ్రీ సద్గురుదేవుని విడిచి, ఆయనను ఉపేక్షించి సమారాధన ఏల చేయవలెను? చేయలేను.

రామరాయుడు స్వామిని మనసులో స్మరించి, ఇట్లు ప్రార్థిస్తాడు. ఓ సద్గురు సిద్ధనాథా! ఓ దీనదయాళో! నిన్ను మా గృహమునకు ఈ సమారాధన నిమిత్తముగా పిలవాలని ఎంతో ఉత్కట-మైన ఇచ్ఛ నా మనసులో ఉంది. నేను ఇప్పుడు ధర్మసంకటములో పడ్డాను. నన్ను రక్షింపుము. నిన్ను మా గృహమునకు తీసుకొచ్చి ఉన్నతమైన పూజాస్థలమునందు కూర్చుండబెట్టి వైభవ యుక్తముగా పూజించి కార్యక్రమము చేయాలనుకున్నాను. కాని, ఈ అభక్త జనులు ప్రతిబంధకము కలుగజేస్తున్నారు. నీవు వారిని క్షమించి వారికి నీయందు భక్తి కలుగునట్లుగా అనుగ్రహించుము స్వామీ! ఈ మూఢులు కులాభిమానులై నీయొక్క వాస్తవ స్వరూపమును తెలుసుకోలేక నిన్ను నిందించినారు. ఏ విధముగానైనా వారిపై కరుణజూపి వారికి నీయందు భక్తి కుదురునట్లు చేయుము.

ఈవిధముగా ప్రార్థిస్తూ సద్గురుదేవుని వేడుకుంటూ, స్వామిని స్మరిస్తూ భారమైన హృద-యముతో నిద్రించినాడు.ఇట్లు నిద్రించగా స్వప్నమందు సద్గురుసిద్ధారూఢస్వామి ప్రసన్న వదనముతో ప్రత్యక్షమై, రామరాయా!లే,తొందరగా లే!వెంటనే పూజచేయము–అని పలికినాడు.రామరాయుడు వెంటనే(స్వప్నమునందే)లేచి ఉన్నతమైన ఆసనమును నిర్మించి సద్గురుదేవుని దానిపై కూర్చుండబెట్టి షోడశోపచారయుక్తముగా పూజించినాడు. ఈ విధముగా రామరాయుని మనోసంకల్పమును

స్వామి నెరవేర్చినాడు. పూజానంతరము సద్గురుదేవుడు రామరాయుని ఆశీర్వదించి ఆయన చేతిలో ఒక నారికేళమునుంచి రామరాయా! ఈ ప్రసాదరూప నారికేళమును స్వీకరించుము. నీయొక్క మనోసంకల్పము నెరవేరుతుంది. నీయొక్క కార్యక్రమము ఉదయమున నిర్విఘ్నముగా కొనసాగు-తుంది. నీవేమీ దిగులు చెందకుము. ఈ విధముగా పలికి సద్గురుదేవుడు అదృశ్యమైనాడు. రామరాయుడు వెంటనే మేలుకొని చూసేసరికి సద్గురుదేవుడు లేడు. కాని, తన ప్రక్కన ప్రసాదరూప నారికేలమును (టెంకాయను) గాంచినాడు.

రామరాయుడు ఎంతో ఆనందమును పొంది, ఈరోజు నేను సద్గురుదేవుని దర్శించి స్వామి యొక్క ప్రసాదరూప టెంకాయను స్వీకరించి ధన్యుడనైనాను. స్వప్నములో సద్గురుదేవుడు ప్రసాదిం-చిన కొబ్బరికాయ వాస్తవముగా ప్రాప్తమైనది.ఇది స్వప్నము కాదు.నిశ్చయముగా యథార్థమున్నది. సద్గురుదేవుని కృప యథార్థముగా నాపై కలిగింది. అని అత్యంత హర్షమును పొందినాడు. సిద్ధనాథుడు ప్రసన్నుడై నన్ను ఆశీర్వదించినాడు. నాయొక్క మనోసంకల్పము ఈరోజు సత్యముగా నెరవేరుతుంది. ఇందులో ఏమాత్రముగూడ సంశయము లేదు–అని అనుకొని—

రామరాయుడు ప్రాతః కాలమునందే తొందరగా లేచి భక్తుల కోసము పంచపక్వాన్న భోజనములు తయారుచేస్తూ, పదేపదే సద్గురుదేవుని స్మరిస్తూ, ఎప్పుడు మధ్యాహ్నకాలము వస్తుం-దా, సద్గురుదేవుడు ఎప్పుడువస్తాడా—అని ఎదురు చూస్తున్నాడు.మధ్యాహ్న కాలమువరకు బ్రాహ్మ-ణులు బంధువులు అందరు రామరాయుని ఇంటికి విచ్చేసినారు. పండరీపురమునుండి వచ్చిన ఇద్దరు సంతులకు పూజ చేసినాడు. ఇక భోజనకార్యక్రమము ప్రారంభమైనది. బ్రాహ్మణులను, బంధువులను ఒక పంక్తిలో కూర్చుండబెట్టి భోజనమును వడ్డిస్తున్నారు. మరొకవైపు ఆ ఇద్దరు సంతులను కూ-ర్చుండబెట్టి రెండు పల్లెలములను వారి ముందుంచి పంచపక్వాన్న భోజనమును వడ్డించినారు. వారు భోజనమును బ్రహ్మార్పణము గావించినారు.

**శ్లో ॥ బ్రహ్మా ర్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రాహ్మణా హుతమ్ ।**

**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥** (గీత. 4-24)

**ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ।ఓం ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ।**

బోలా పుండలీక వరదా హరి విఠల్, శ్రీ జ్ఞానదేవ్ తుకారాం మహారాజుకీ జై, పండరినాథ్ మహారాజ్ కీ జై...........

ఈ ప్రకారము అందరూ భోజనమునందు నిమగ్నులైనారు.అప్పుడు రామరాయుడు చింత-లో పడినాడు. ఎందుకనగా, సద్గురుదేవుడు తప్పకుండా వస్తానని స్వప్నములో మాట ఇచ్చినాడు. కాని, ఇంకా రాలేదు. నాకు ఇచ్చిన మాట మరిచినాడు కాబోలు. అప్పుడు ఒక విచిత్రమైన ఘటన

జరిగింది. అది చూసిన రామరాయుడు అమితానందమును పొందినాడు. ఇద్దరు బ్రాహ్మణ సంతుల మధ్య శ్రీ సద్గురుసిద్ధనాథుడు కూర్చుని నెమ్మదిగా భోజనము చేస్తున్నాడు. రామరాయుడు ఆశ్చర్య చకితుడైనాడు. ఈ దృశ్యమును రామరాయుడు చూసినాడు. కాని, ఆ బ్రాహ్మణ సంతులు స్వామిని గమనించక వారి భోజనముయందు వారు నిమగ్నులైనారు. స్వామిని చూడనే లేదు. రామరాయుని ఆనందమునకు అంతులేదు. ఇంతలో ఒకానొకడు ఆ సంతులతో అంటాడు. ఏమండీ! మీ ఇద్దరి మధ్యలో ఎవరో కూర్చుని భుజించుచున్నారు. అది మీరు గమనించడమే లేదు. అని అనగా వారు తిరిగి, వారి మధ్యలో చేరి భుజిస్తున్న స్వామిని చూసి ఎవరు వీరు? అని ఇతరులను అడుగుతారు. ఇంతలో వారు అనుమానించి బహుశః సిద్దారూఢస్వామి అయ్యే ఉంటాడు కాబోలు. అని విచారములో పడి, రామరాయుని పిలిచి, ఏమయ్యా! మేము మొదలే చెప్పినాము కదా! ఆయనను పిలవకూడదు అని. మళ్లీ ఎవరు తీసుకొచ్చారు, అని అంటారు. అప్పుడు రామారాయుడు–లేదండీ! నేను పిలువనే లేదు. ఇదంతా సద్గురుదేవుని లీల. అంతా స్వామియొక్క మహిమనే ఉంది. అనగా ఆ బ్రాహ్మణ సంతులు పశ్చాత్తాపముతో అయ్యో!మేము మందమతులము బుద్ధిహీనులమై సద్గురు దేవునియొక్క మహిమను ఎఱుగక నిష్ఠూరముగా నిందించినాము.ఈయన సాక్షాత్తు ఈశ్వరుడున్నాడు. సందేహం లేదు. ఇప్పటికైనా మేమే ధన్యులము. ఎందుకనగా, మాకు సద్గురుదేవునితో కలిసి పంక్తిభోజనము చేసే భాగ్యము కలిగింది. ఇంతలో ఒకడు సంశయించి సిద్ధరూఢస్వామి ఇక్కడ కూర్చుని భోజనము చేస్తున్నాడు. సిద్ధాశ్రమములో ఉన్నాడా? లేడా? చూద్దాము–అని వెళ్లి చూసినాడు. సద్గురుదేవుడు అక్కడగూడా ప్రత్యక్షంగా ఉన్నాడు. అది చూసి ఆశ్చర్యపడినాడు. ఇచ్చట బ్రాహ్మణ సంతులకు సద్గురుదేవుడు లీలారూప చమత్కారమును చూపి అంతర్ధానమైనాడు. ఇంతలో అందరియొక్క భోజనము సమాప్తి అయింది. అప్పుడు ఆ ఇద్దరు సంతులు అందరిని ఉద్దేశించి ఇలా అంటారు.

అయ్యా ఓ సద్భక్తులారా! ఈ రామరాయుని వలన మాకు అనాయాసముగా సద్గురుదేవుని దర్శనము కలిగింది. మేము ధన్యులమైనాము. రామరాయుని భక్తి చాలా అమోఘమైనది-అని మెచ్చుకున్నారు. ఇప్పుడు మాది తప్పు జరిగింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. సద్గురుదేవుని తీసుకొచ్చి ఆయనకు విధిపూర్వకముగా పూజించండి. మేము కూడా స్వామి చరణములకు వందనము సమర్పించుకొని ఆయనకు క్షమాపణ చెప్పుకుంటాము. ఆయన పాదధూళి మా శిరమున ధరించి ధన్యులమవుతాము–అని చెప్పగా, రామరాయుడు సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని దర్శించి స్వామీ! నీవు సాక్షాత్ ఈశ్వరుని అవతారమై ఉన్నావు–అని జరిగిన వృత్తాంతమంతా సద్గురుదేవునికి విన్నవించుకోగా–స్వామి నవ్వి, నీయొక్క శుద్ధమైన భావనయే సద్గురుదేవుని యొక్క దర్శనమునకు కారణమైనది. శుద్ధభావన, నిర్మలమైన భక్తి వలననే అలా ఘటించినది. సద్గురు

కృపకు కారణమైనది. అటువంటి నిష్కపట, నిర్మలమైన శుద్ధభక్తికంటె ఈశ్వరుడు అన్యముగా లేడు.అందరూ ఎల్లప్పుడూ భక్తిని అనుసరించాలి. సద్గురుదేవుని భావపూర్వకముగా ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉండాలి. తద్వారా సద్గురుదేవుని కృపగలిగి ధన్యులు కాగలరు. సద్గురుదేవుని ఈ వచనములను విన్నతర్వాత రామరాయుడు సద్గురుదేవుని తమ గృహమునకు తీసుకొచ్చి అందరూ ఆనందపూర్వకముగా సద్గురుదేవునికి షోడశోపచారయుక్తముగా పూజించి సద్గురుదేవుని సిద్ధా-శ్రమమునకు సాదరముగా పంపించినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధాన చిత్తులై వినగలరు. ప్రత్యగాత్మస్వరూపుడైన సద్గురుదేవుడు. ఆయన భక్తుడు జీవుడనే (రామరాయుడు)నిత్యము ప్రత్య-గాత్మస్వరూపమైన సద్గురుదేవుని స్మరిస్తూ ఉంటాడు. కథయందలి ఇద్దరు బ్రాహ్మణులు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు అని తెలుసుకోవాలి. అవి అభిమానమును పొంది ప్రత్యగాత్మను దర్శింపకుండా ప్రతిబంధకములవుతాయి. విషయవృత్తులనే బ్రాహ్మణులు పంచవిషయాలనే భోజనమునే అను-భవిస్తుంటాయి. జీవుడు ప్రత్యగాత్మను దర్శింపగోరి కృతకృత్యుడు కావాలనుకుంటే విజాతీయస్వరూప ఇంద్రియములు నిర్విషయానందమును తిరస్కరించి, జీవున్ని విషయసుఖములలో ముంచి భ్రష్టున్ని చేస్తాయి. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వాటి వృత్తులు ప్రత్యగాత్మ దర్శనముద్వారా మా ఆట కట్టుబడుతుంది, మేము నష్టమైపోతామేమో అనుభీతిచేత జీవునికి ప్రత్యగాత్మ దర్శనమునకు ప్రతిభంధకములవుతాయి. సద్గురుదేవుని తమ గృహమునకు తీసుకొచ్చుటకు రామరాయుడు ధర్మ సంకటములో పడి సద్గురుదేవుని దర్శనమునకు ఎలా పరితపించాడో, ఆయనకు స్వప్నమందు స్వామి ప్రత్యక్షమై నారికేళమును ప్రసాదరూపముగా ఇచ్చినట్లు, ఇక్కడ జీవుడు ప్రత్యగాత్మను దర్శించాలని పరితపిస్తున్నప్పుడు, ప్రత్యగాత్మస్వరూప పరమాత్మ జీవుని హృదయమందు వివేకరూప టెంకాయ ప్రసాదమును ఉదయింపజేస్తాడు. ప్రత్యగాత్మస్వరూపుడైన సద్గురుదేవుని నిరాకరించిన బ్రాహ్మణ సంతుల మధ్య సద్గురుదేవుడు వచ్చి కూర్చొని ఎలా ప్రకటమైనాడో, అదే విధముగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియ విషయవృత్తుల మధ్యన ఉన్నటువంటి వివేకరూప ప్రసాదమును పొందిన జీవుడు ప్రత్యగాత్మను దర్శించి ఆనందమును పొందుతాడు. జీవుడు వివేక బలముచేత సద్గురురూప ప్రత్యగాత్మను దర్శిస్తాడు. కాని, విషయభోగాలను అనుభవిస్తున్న ఇంద్రియవృత్తులు దర్శించలేరు. శమదమాదులద్వారా ఇంద్రియములు ఉపరామమును పొందినప్పుడే ప్రత్యగాత్మను చూడగలుగు-తాయి. వాస్తవానికి ఆనందము విషయ సంబంధముద్వారా కలుగదు. విషయ త్యాగము వలననే లభిస్తుంది. ఉపరామమును పొందిన వృత్తియే ప్రత్యగాత్మను దర్శించగలుగుతుంది. ఒక్కసారి ప్రత్యగాత్మ దర్శనమైనదా, ఇక వృత్తి నిరాకారమై ప్రత్యగాత్మ స్వరూపములోనే తద్రూపమైపోతుంది. ఎప్పుడైతే సకలవృత్తులు ఉపశమించునో, అప్పుడు నిరాకారమై ఆత్మయందే రమించి పోతాయి.

అజ్ఞాన కాలమందు దేహాదిక ప్రపంచముయందు రమించినాయి. వివేకముదయించి జ్ఞానప్రాప్తి కలిగిన తర్వాత ప్రత్యగాత్మయందు తద్రూపమైపోతాయి. సద్గురురూప పరమాత్మను పిలుచుటకు జీవుని పంపిస్తాయి.వివేకాది జ్ఞానసాధనలు ప్రాప్తమైన పిదప జీవుడు గురుదేవుని వెతుకుకుంటూ వెళ్తాడు. సద్గురు దర్శనముచేత జీవుడు చిత్తమునందు ఎంతో ఆనందపడతాడు. అనాత్మవర్గములో విహరించే వృత్తులు భక్తిమార్గములో ప్రవేశింపబడతాయి. పరమార్థచింతనకు అనుకూలమవు-తాయి. సద్గురుదేవుని కృపవలన జీవుడు ప్రత్యగాత్మను దర్శించి తాను ఆనందమును పొంది ఇతరులను కూడా ధన్యులను చేస్తాడు. ఈ ప్రకారముగా లక్ష్యార్థరూప చింతనద్వారా ఆనందమనే ప్రసాదమును పొంది వ్యవహారకాలమందుగూడా స్వరూపానందమునే పొందుతాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణము ద్వారా సకల పాపములు భస్మమైపోతాయి. శ్రీ సిద్ధారూఢ చరణారవిందములకు ఈ ఇరువది మూడవ అధ్యాయమును శ్రీశివదాసస్వామి సమ-ర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది నాలుగవ అధ్యాయము

పద్యానువాదము:—జీవుడు అజ్ఞానరూప అంధకారము చేత జననమరణరూప భవసాగ-రములో మునకలు కొడుతున్నాడు. ఈశ్వరస్వరూపుడవైన ఓ సద్గురుదేవా!ఎవరైతే నీ పాదపద్మ-ములను ఆశ్రయించినారో, వారికి జ్ఞాన ప్రసాదమును అందించి అజ్ఞానాంధకారమును నివృత్తిచేసి భవసాగరమునుండి నిశ్చయముగా తరింపజేస్తావు.

సచ్చిదానంద స్వరూపడవగు ఓ సద్గురునాథా! నీవు సృష్టి స్థితి లయ కారకుడవు. అనంత కోటిబ్రహ్మాండ నాయకుడవు. పరమానంద స్వరూపుడవు. అలౌకిక స్వరూపముచేత పరిపూర్ణుడవై ఉన్నావు. లేనిది ఉన్నట్లుగా ప్రకటము చేస్తావు, లేనిదానిని లేనట్టుగాగూడా చేయగలవు. ఇట్టి గంభీరమైన నీ స్వరూపము బ్రహ్మాదులకు కూడా అగోచరము. మహాకాశములో సూర్యుడు ఎలా ప్రకాశిస్తాడో, అలాగున చిదాకాశమును ప్రకాశించే నీకంటె అన్యమైన ప్రకాశకుడుగాని, మీతో సమానమైనది గాని ఏది లేదు. సమస్త ఆనందమునకు నీవు పెన్నిధివై ఆనందస్వరూపడవై ఉన్నావు. అవినాశి, సర్వవ్యాపక స్వరూపుడవు. విలాసనిమిత్తముగా లీలామానుషుడవై సగుణరూపముగా ప్రకటమైనావు. అద్వితీయ స్వరూపుడవైన నీవు, దేశ కాల వస్తు పరిచ్ఛేదరహిత వ్యాపక స్వరూపడవై ఉన్నావు. నీకు విరుద్ధమైనది గాని, నీకు సమానమైనదిగాని ఏమీ లేదు. నీవు అప్రమేయుడవు. నీవు స్వరూపతః నిర్గుణనిరాకారపరబ్రహ్మవై ఉన్నావు. నామరూపరహితుడవై ఉన్నావు. మిథ్యామాయను స్వీకరించి నీవు సగుణరూపమును ధరించి అవతరించావు.వాస్తవంగా నీయొక్క అస్తిత్వముతప్ప మరొకటి లేదు. ఈ నామరూప ప్రపంచము నీయందు ఆరోపితమై ఉన్నది. అయినాగాని విచారించి చూసినట్లయితే అస్తి భాతి ప్రియరూపముగా అంతటా నీయొక్క అస్తిత్వమే ఉంది. నామరూపములు మిథ్యయై ఉన్నవి.**"వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"** (ఛాం.6-1-4) అందు-కనే నువ్వొక్కడివే సత్యము. రెండవది మిథ్యా **"ఏకం సద్విప్రా బహుధా వదన్తి"** (ఋ.1-164-46).

ఇటువంటి సద్గురుస్వరూపాన్ని ఎవరైతే తెలుసుకున్నారో, వారే నిజమైన సంతుమహాత్ములు. వారు వారి అంతఃకరణమును మరియు సర్వస్వమును నీకే అర్పిస్తారు. నీయొక్క భక్తులైనారు. సంసారసంబంధ కామనలను కోరుకున్న వారికి నీవు వాటిని ప్రసాదిస్తావు. అవి ప్రాప్తమైనాక వాటిని అనుభవించి విసుగుజెందిన వారికి నిష్కామ మార్గమును చూపి వారిని ఉద్ధరిస్తావు. నీవు

దయాసాగరుడవు. ఇటువంటి సద్గురుదేవునికి పాదాభివందనములు సమర్పిస్తూ శ్రీ శివదాస స్వామి ఇప్పుడు కథను వివరిస్తున్నాడు.

ఓ శ్రోతలారా ఇప్పుడు మీరు సావధానచిత్తులై మనోహరమైన కథాప్రసంగమును శ్రవణము చేయగలరు. ఒకానొక బసవన్న అను పేరుగల గృహస్థుడు ఉండేవాడు.ఆయన ధర్మపత్ని గురవ్వ. వారికి ఇద్దరు పుత్రులు మరియు ఇద్దరు పుత్రికలు ఉండిరి. పాపము! వారు అతి దారిద్ర్యావస్థలో ఉండిరి. ఏదో కొద్దిపాటి జీవికావృత్తి ఉండెను. దానితో వారు జీవితము గడుపుకునేవారు. కాని, వారి దురదృష్టమేమో, పాపము! ఆ జీవికావృత్తిగూడా పోయింది. జీవనోపాధి మరొకటి దొరక లేదు. అత్యంత దుఃఖముతో కూడుకున్న కఠినమైన కరువు ఏర్పడింది. ఇంట్లోని కొద్దిపాటి ధన-ముతో మరియు ఇంటిలోని (బాసండ్లు) సర్వవస్తువులు విక్రయించగా వచ్చినటువంటి ధనముతో మూడు రోజులు గడిచినవి. నాలుగవ రోజున ఇంట్లో మనుషులు తప్ప మరొక వస్తువు లేదు. ఊరి-లోకి వెళ్లి ఎవరిని అడిగినా పిడికెడు ధాన్యముగూడా దొరకలేదు. ఊరంతా తిరిగి తిరిగి ఇంటికి వచ్చిన బసవన్ననుచూసి పిల్లలు, మానాన్న మాకు తినుటకు ఆహారమేమైనా తీసుకొచ్చాడని పరు-గెత్తుకుంటూ బసవన్నకు ఎదురుగా వచ్చి, నాన్న! మాకు ఆకలేస్తుంది. మాకోసమేమైనా తెచ్చావా? తొందరగా ఇవ్వు. మేము ఆకలితో అలమటిస్తున్నాము. ఉపవాసంతో బాధపడుతున్నాము. అని పిల్లలు అంటారు. ఆ మాటలు విన్న బసవన్న గురవ్వలకు దుఃఖము ఆగలేదు. కన్నులవెంట జలజల కన్నీరు కార్చారు. ఇటువంటి దుర్దశ వచ్చినప్పటికైనా భిక్ష అడుగుటకు బసవన్న మనసు ఒప్పు-కోవడము లేదు. ఎందుకనగా పరువు ప్రతిష్టలతో బతికినవారు గనుక. పూర్వకృత పాపము మనకు ఈ రూపముగా దాపురించింది. మన ప్రారబ్ధమును మనము అనుభవించక తప్పదు. "ప్రారబ్ధం భోగతో నశ్యేద్" అందువలన ఎవరికిని దుఃఖపెట్టగూడదని దంపతులు అనుకుంటారు.

రెండు రోజులైంది. ఇంట్లో ఒక ధాన్యము గింజ లేదు. నోట్లో మెతుకు లేదు. కఠిన ఉపవా-సమున్నారు. రెండవ రోజు రాత్రియందు ఒక దుఃఖ విశేషం ప్రాప్తమైంది. ఒక పిల్లవాడు, ఒక బాలిక పస్తులతో బాధపడుతూ ఆకలితో అలమటిస్తూ అన్నము... అన్నము... అంటూ మరణించారు. తల్లి శోకసముద్రములో మునిగిపోయింది. చనిపోయిన ఆ ఇద్దరు పిల్లలను తీసుకొని బసవన్న అంత్య క్రియలు చేయడానికి వెళ్లిపోయాడు. మిగతా ఇద్దరు పిల్లలు నిద్రించి ఉండగా గురవ్వ ఇంటినుండి బయటకు వెళ్ళింది. మనస్సు అత్యంత చంచలమైనది. చిత్తము భ్రమించింది. ఈ కటిక దారిద్ర్యా-వస్థను అనుభవించుట కంటె ఆత్మహత్య మేలు అని నిశ్చయించుకొని ఒక భావి వద్దకు వెళ్ళింది. పిల్లలయొక్క అంత్యక్రియలు చేసి బసవన్న ఇంటికి తిరిగి వచ్చేసరికి ఇంట్లో తన భార్య లేదు. పిల్లలు నిద్రిస్తున్నారు. వారిని లేపి మీ అమ్మ ఎక్కడికి వెళ్ళింది–అని అడిగాడు. సమాధానము రాలేదు. పిల్లలు ఏడవసాగినారు. బసవన్న పిల్లలను వెంబడించుకొని అక్కడ ఇక్కడ చూస్తూ వెతుకుతూ

వెళ్తున్నాడు. దూరంనుండి అలాచూడగా ఒక బావివద్ద బిళ్ళదూలము (నీళ్లుతోడే మోట)ఎక్కి బావి-లో దూకుటకు గురవ్వ సిద్ధమైనది. తత్క్షణమే ఒకసారి అక్కడికక్కడే ఒక సాధువు ప్రకటమై ఆత్మహత్య చేసుకోబోతున్న గురవ్వను ఆపి క్రిందకు దించి, కాపాడినాడు. గురవ్వ బోరున ఏడుస్తూ అతిగా దుఃఖిస్తూ మూర్ఛితురాలైంది. బసవన్న దగ్గరకు వచ్చి చూసేసరికి మృతప్రాయురాలై భూమిపై పడి ఉంది. ఆ సాధువు కృపాదృష్టితో గురవ్వను ఒక చూపు చూసేసరికి, ఆమె యథావిధిగా లేచింది. ఆమెకు చనిపోయిన పిల్లలు గుర్తుకువచ్చి మళ్లీ ఏడవసాగింది. సాధువుతో ఆ గురవ్వ ఇలా అంటుంది. అయ్యా మహాత్మా! నన్ను ఎందుకు కాపాడినావు? ఇద్దరు పిల్లలు ఆకలితో అలమటిస్తూ "అన్నమో రామచంద్రా" యనుచు మరణించారు.ఇద్దరు పిల్లలు పస్తులతో బాధపడుతూ చనిపో-వుటకు సిద్ధముగా ఉన్నారు. వారిని పోషించలేని నేను బ్రతికి ఉండి ఏమి ఫలము. అందుకని నేను ఆత్మహత్య చేసుకొనుటకు సిద్ధమైనాను.

ఈ ప్రకారముగా తన ఆవేదనను ప్రకటించగా సాధువుయొక్క హృదయము ద్రవించి తన అమృతహస్తముయొక్క వ్రేలుతో గురవ్వయొక్క లలాటమును స్పృశించినాడు. అంతే, తత్క్షణమే ఆ దంపతులయొక్క దారిద్ర్యరేఖలు మారిపోయినవి.

**శ్లో ॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి ।**

**లలాటలిఖితారేఖాం పరిమార్ష్టుం న శక్యతే ॥** (నీతిశాస్త్రము)

సద్గురుదేవుడు కరుణిస్తే ఈప్రమాణముగూడా బాధింపబడుతిందని ఆ సద్గురుదేవుడే ధృవ-పరిచినాడు. గురవ్వ సర్వదుఃఖములను మరచిపోయింది.

బసవన్న తన చేతితో గురవ్వను పైకిలేపి మెల్లమెల్లగా ఇంటికి తీసుకొచ్చాడు. ప్రాణరక్షణ చేసి ఉపకారము చేకూర్చిన ఆ సాధుమహాత్మునిగూడా బసవన్న, ఇంటికి తీసుకొచ్చాడు. పిల్లలతో సహా అందరు ఇంటికి వచ్చారు. సాధుమహాత్మునికి ఆసనమిచ్చి కూర్చుండబెట్టినారు. అందరూ స్వామికి నమస్కరించినారు. కాని, స్వామిని పూజించుటకు ఇంట్లో సామాగ్రులేవి లేవు. అప్పుడు బసవన్న సాధువుతో ఇలా అంటాడు. మహాత్మా! మా పూర్వపుణ్యము కొద్ది నీవు సమయానికి వచ్చి కాపా-డినావు. కాని, ఈ సమయాన మేము చాలా దౌర్భాగ్యులమున్నాము. మిమ్ములను పూజించుటకు ఏ సామగ్రులు మా ఇంట్లో లేవు. నీకు నైవేద్యము సమర్పించుటకు అన్నము లేదు. అయినాగాని, నీవు మాయందు దయదలచి ప్రాణరక్షణజేసి మా గృహమునకు వచ్చి మాకు దర్శనమిచ్చావు. నీయొక్క హృదయము విశాలమైనది. నీయొక్క కృప అపారమైనది. అని అంటూ తనయొక్క వృత్తాంతమును విన్నవించుకున్నాడు. అప్పుడు ఆ సాధుమహాత్ముడు అంటాడు. బసవన్న! నాకు ఆకలేస్తుంది. నాకు ఇప్పుడు ఏమైనా ఆహారముంటే ఇవ్వుము. అని అనుటతోడనే బసవన్న హృదయము విషాదముతో నిండిపోయి కన్నులవెంట అశ్రువులు పటపటరాల్చాడు. తనయొక్క దీనస్థితిని వివరించాడు.అప్పుడు

సాధుమహాత్ముడు బసవన్నతో అంటాడు. బసవన్న మీరు చనిపోయిన పిల్లలగూర్చిగాని, జరిగిపో-యిన దారిద్ర్యావస్థనుగూర్చిగాని విచారించకండి. ఇప్పుడు నాకు ఆకలవుతుంది. మీపెట్టెలో ఏమైనా పైసలు ఉంటే తీసుకొని పోయి ఏమైనా ధాన్యము కొని తెచ్చి నాకు భోజనము తయారుచేసి వడ్డించండి–అని అంటాడు. ఇంట్లో చిల్లిగవ్వగూడా లేదని బసవన్నకు తెలుసు. అయినా మహాత్ముని వచనములపై విశ్వాసముంచి పెట్టెవద్దకు పోయి దానిని తెరిచిచూచినాడు. అందులో ఒక పైసా ఉంది. దానిని తీసుకొచ్చి సాధువుకిస్తాడు. అప్పుడు సాధువు అంటాడు. నీవు ఈ పైసా తీసుకొని బజారుకు వెళ్లి, వలసిన తినుబండారములను (భత్తెమును) భోజన సామాగ్రులు తీసుకొని రమ్ము.

బసవన్న అంటాడు. అయ్యా! ఈ ఒక్క పైసతో సరిపోయేంత భోజన సామగ్రులు రావు (లభించవు). నాలుగు కిలోల బియ్యముకూడా లభించవు. ఇక మిగతా సామగ్రులు ఎలా దొరుకు-తాయి అనంటూ—చూచుటకు మీరు మహాత్మునిలా ఉన్నారు. సరే మీవచనాలపై విశ్వాసముం-చి నేను వెళుతున్నాను, అని బసవన్న భోజన సామగ్రులు తెచ్చుటకు వెళ్లిపోయినాడు. ఆ పైసను దోతి కొంగుకు బిగ్గరగా ముడివేసుకొని బజారులోకి వెళ్లిపోయినాడు. బసవన్న దుకాణము (కొట్టు) వద్దకు వెళ్లి ఆ ముడివిప్పి చూసేసరికి ఎన్నో సువర్ణ నాణెములు అయినవి. బసవన్న ఆశ్చర్యచకితుడై ఎంతో సంతోషించినాడు. ఆ బంగారు నాణెములను ఆ దుకాణపు యజమానికిచ్చి, వలసిన భోజన సామగ్రులన్నీ తీసుకొని తన దోతిని పరిచి, దానియందు మూట కట్టుకున్నాడు. అన్ని సామగ్రులు తీసుకోగాకూడా, ఇంకా బంగారు నాణెములు మిగిలినవి. ఆ భోజన సామగ్రులు, మిగిలిన నాణె-ములు తీసుకొని ఇంటికివచ్చి సాధుమహాత్ముని ముందుంచుతాడు. ఆ భోజనసామగ్రులన్ని సాధువు గురవ్వను పిలిచి తొందరగా భోజనము తయారుచేయమని ఇచ్చినాడు. ఆ సామగ్రులు తీసుకొని గురవ్వ వంటగదిలోకి వెళ్లి భోజనము తయారుచేసింది. అప్పుడు గురవ్వ సాధువుతో స్వామీ! భోజనము తయారైంది. ఇక మీరు మొదలు ఆరగించండి అంటుంది. అప్పుడు సాధువంటాడు. మొదలు పిల్లలకు వడ్డించుము. గురవ్వ స్వామి ఆజ్ఞప్రకారము పిల్లలకు మొదలు పడ్డించింది. తద-నంతరము బసవన్న, గురవ్వ మరియు సాధువు ముగ్గురు భోజనము చేసినారు. అందరు భోజనము చేసిన పిమ్మట సాధువు బయటకు వెళ్ళుటకు సిద్ధముకాగా, బసవన్న గురవ్వ మరియు వారి పిల్లలు అందరూ స్వామియొక్క దర్శనము తీసుకున్నారు. ఆశీర్వాదమును కోరినారు.

అప్పుడు వారికి "శుభమగు గాక" అని ఆశీర్వదించి సిద్ధాశ్రమము వైపుకు వెళ్ళిపోయినాడు. బసవన్న గురవ్వలకు స్వామియొక్క వియోగము భరించలేక కన్నీరు రాల్చారు. స్వామిపై హృదయ పూర్వకమైన ప్రేమ ఉదయించింది. ఇంటి వెలుపలివరకు స్వామిని సాగనంపారు. సాధుమహాత్ముడు సిద్ధాశ్రమమునకు వెళ్లిపోయినాడు. ఆ దంపతులు ఇంట్లోకి మరలి వచ్చినాక వారికి ఇలా ఆలోచన వచ్చింది. ఈసాధువు ఎవరో కాదు, నిశ్చయముగా సిద్ధారూఢస్వామియే ఉన్నాడు.ఇందులో సంశ-

యము లేదు–అని బసవన్న చెప్పగా,అప్పుడు గురవ్వ అంటుంది–మనము ఎప్పుడుగూడా సిద్ధనాథుని వద్దకు వెళ్లలేదు, ఆయన దర్శనము తీసుకోలేదు. మనకు ఆయనయొక్క స్మృతిగూడా కలగలేదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మనము వెంటనే సద్గురుదేవునివద్దకు వెళ్లి స్వామిని దర్శించుకొని వస్తాము పద—అని పిల్లలతో సహా అందరూ కలిసి అదే క్షణమున బయలుదేరి సిద్ధాశ్రమమునకు వెళ్లి సిద్ధమూర్తుని దర్శించి ఆశ్చర్యపోయి, ఈయన నిశ్చయముగా మన ఇంటికి వచ్చిన ఆ సాధుమూర్తియే ఉన్నాడు. ఆ సద్గురుదేవుడే మనలను కాపాడినాడు–అని అనుకొని స్వామి వద్దకువెళ్లి సాష్టాంగ నమస్కారములు చేసినారు. అప్పుడు సద్గురుదేవుడు వారిని దగ్గరకు పిలుచుకొని, మీవద్ద ఇంకా పదిరూపాయలు ఉన్నాయి. వాటితో మీరు ఏదైనా వ్యాపారము చేసుకుంటూ జీవితము గడుపుకోండి–అని ఆజ్ఞాపించినాడు. సద్గురుదేవునియొక్క ఆజ్ఞ మేరకు బసవన్న తన వద్దనున్న పదిరూపాయలతో వ్యాపారము ప్రారంభించినాడు.సద్గురుదేవుని కృపవలన వ్యాపారము వృద్ధినొంది, అతిశీఘ్రముగా అనేకలాభములు గడించి ధనికుడైనాడు.ప్రతినిత్యము నియమము తప్పకుండా స్వామిని విస్మరించకుండా బసవన్న సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని సందర్శించుకుని వచ్చేవాడు. ప్రసంగము ననుసరించి స్వామిని తమ గృహమునకు అప్పుడప్పుడు తీసుకొచ్చి యథోచితముగా సత్కరించి,పూజించి స్వామియొక్క ఆశీర్వాదమునుపొంది మళ్లీ ఆశ్రమమునకు సాదరముగా పంపిస్తూ ఉండేవాడు. ఈ ధనము, సంపత్తి, ఐశ్వర్యము అంతా ఆ సద్గురు కృపవలననే కలిగిందని భావించేవాడు. సద్గురుదేవుడు ఆయనయొక్క భక్తిచేయని కాలములోగూడా మమ్ములను రక్షించి,భక్త రక్షకుడనే బిరుదును సార్థకము చేసుకున్నాడు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధానముగా వినండి. బసవన్న అనే జీవుడు ఆయనయొక్క సహధర్మచారిణి గురవ్వ అనే బుద్ధి, అను ఇద్దరు దంపతులు. వారికి వివేకము వైరాగ్యము శమాదిషట్కసంపత్తి మరియు ముముక్షత్వము అనే నలుగురు సంతానము కలిగిరి. ఎప్పుడైతే ఈ నాలుగు జ్ఞానసాధనలు జీవునికి ప్రాప్తము అవుతాయో, అప్పుడు సంసార సంబంధ విషయాలనుండి విముఖుడవుతాడు.కాని,శ్రవణరూప వర్షము శ్రోత్రసంబంధము లేనందువలన, జీవుడు దరిద్రుడై కఠినమైన క్షామమునకు గురి అవుతాడు.అనేక దుఃఖములను అనుభవిస్తూ ఉంటాడు. ఆత్మాకార వృత్తిరూప అన్నము (ఆనందము, సుఖము, శాంతి) కరువైపోతుంది. ఎప్పుడైతే ఆత్మసుఖము కరువైతుందో, అప్పుడు (శమము దమము) శాంతి క్షీణిస్తుంది. ఇంద్రియ నిగ్రహము కోల్పోతుంది. బుద్ధి భ్రష్టమై ప్రాణత్యాగమునకు పాల్పడుతుంది. సంసారరూప కూపములో దూకుటకు సిద్ధపడుతుంది.

**సంసార కూపమున దిక్కుదోచకయుండి, విలపించుటేలకో మనసా ।**

**గురుపాదముల బట్టి తత్త్వంబు తెలుసుకొని, తప్పించుకోవోయి మనసా ॥**

ఎప్పుడైతే బుద్ధియందు తీవ్రతరమైన వైరాగ్యముదయిస్తుందో అప్పుడు జ్ఞానము ఉదయించుటకు ఆలస్యము పట్టదు. "**వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే**"

అటువంటి సమయమున జ్ఞానమనే సాధువు ప్రకటమై బుద్ధిని సంసార కూపములో పడ-కుండా కాపాడుతాడు. అప్పుడు వెంటనే జీవుడు సద్గురుదేవుని ఆశ్రయిస్తాడు. వివేకము వైరాగ్య-ముతోసహా జీవుడు సద్గురుదేవుని ఆశ్రయించినాడు. ఎప్పుడైతే జ్ఞానరూప సాధుమూర్తి బుద్ధిని స్పర్శించినాడో, బుద్ధి సకల దుఃఖములను విస్మరించింది. అప్పుడు జ్ఞానసాధువును తమ ఇంటికి (హృదయములోకి) తీసుకొచ్చినారు. ఆ జ్ఞానసాధువునకు భక్తి అనే ఆకలేసింది. ఆ భక్తిరూప ఆకలి తీరాలంటే, భక్తి దృఢము కావాలంటే ఐక్యభావము (సమత్వభావము) అనే ఒక పైసా ఉంటే చాలు. ఐక్యభావము ఉంటే భక్తి దృఢమవుతుంది. ఆ భక్తి జీవునియందు ఉన్నట్లయితే ఇక ఆయనకు అన్ని సంపత్తులు ఉన్నట్లే. జ్ఞానియగువాడు ఆరూఢపతితుడైతే కావచ్చు. కాని, భక్తుడు ఎన్నడూ భ్రష్టుడు కాదు."**నమే భక్తః ప్రణశ్యతి**". కావున, ఐక్యభావము అనే పైసాతో భక్తి అనే ఆకలి తీర్చుకొని, వివేక వైరాగ్యయుక్తమైన బుద్ధితోకూడియున్న జీవుడు, సద్గురుదేవుడు ఏ బ్రహ్మాసుఖమును అనుభవిం-చాడో, ఆ సుఖమును అనుభవించి ఆత్మానందమును పొందినాడు. ఐక్యభావనయే దీనికి సాధనమున్నది.

**శ్లో ॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ॥**

ఇవి నవవిధ భక్తులు. వీటికి కారణము పదియవదైన'**ఐక్యభావము**'.(ఇవి పదిరూపాయలు) భక్తిని కలిగియుండి జీవుడు ఎప్పుడైతే వ్యవహారము చేస్తాడో, ఆయనకు పుష్కలమైన జ్ఞానధనము ప్రాప్తమై, బ్రహ్మానంద వైభవమును అనుభవిస్తాడు. జీవుడు ఆత్మాకారవృత్తినిపొంది బ్రహ్మాసుఖమునే అనుభవిస్తూ, బ్రహ్మములోనే రమిస్తూ బ్రహ్మాస్వరూపుడే అవుతాడు. భక్తి లోపించినందువలననే జీవుడు అనేక దుఃఖములకు గురియై, భవసాగరములో మునకలు వేస్తాడు. కావున, ప్రతి జీవునికి **భక్తి** అత్యవసరము. **ఐక్యభావము** తప్పనిసరిగా కలిగియుండాలి. జీవుడు భవసాగరమునుండి తరించాలంటే ముముక్షుధర్మములు కలిగియుండి నిత్య నిరంతర ఆదరణీయముగా సద్విచారము చేయాలి. అప్పుడే ఆయన ఆత్మజ్ఞానమునొంది శీఘ్రముగా ముక్తుడౌతాడు. భవదుఃఖమునుండి అజ్ఞాన జీవులు బయటపడే నిమిత్తముగా సద్గురుదేవుడు అనేక లీలలను ప్రకటము చేస్తూ అవిద్యను రూపుమాపుతాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రముచేత సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి ఈ ఇరువది నాలుగవ అధ్యాయమును శ్రీ సద్గురుసిద్ధారూఢస్వామి దివ్యచరణ-కమలములకు అర్పిస్తూ ముగిస్తున్నాడు. ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ॐ శ్రీ గణేశాయ నమః ॐ శ్రీ గురుభ్యో నమః ॐశ్రీ సరస్వత్యై నమః

# ఇరువది ఐదవ అధ్యాయము

పద్యానువాదము:—శ్రీ సద్గురు సిద్ధనాథుడు జీవబ్రహ్మాల ఏకత్వ నిశ్చయము చేయుటకు విచారయోగ్యమైన సద్బుద్ధిని అనగా వివేకయుక్తమైన శుద్ధబుద్ధిని ప్రసాదిస్తాడు. నిర్మలమైనటువంటి మనసును ఇస్తాడు. శుద్ధమైన చిదాకాశమునందే ఆత్మ ప్రకాశిస్తుంది.

**శ్లో ॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**

**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥** (గీత 10-10)

అటువంటి ఆత్మయందు సకల నామరూప జగత్తు బాధరూపనివృత్తిని పొందుతుంది. ఆత్మ జ్ఞానమును పొందినవాడు చిద్రూపముయందే రమించి ఐక్యభావమును పొందుతాడు.

ఓ సద్గురు సిద్ధరాయా! నీ పాదపద్మములయందు నా శిరస్సునుంచి నమస్కరిస్తున్నాను. నీయొక్క దివ్యమైన చరిత్ర కథను ఈ గ్రంథరూపముగా వ్రాయుటకు సద్బుద్ధిని ప్రసాదించుము. నీ యొక్క సేవయే నాకు అత్యంతప్రీతి. నీయొక్క సేవాభాగ్యమువలన వాంఛలు నెరవేరుతాయి. నీ యొక్క సేవ తప్ప అన్యకర్మలు నాకు ఇష్టము లేదు. ఆ అన్యమైన కర్మలు నన్ను సంసారకూపములో పడదోస్తాయి. కావున, నీయొక్క సేవయే నాకు ముఖ్యము. సద్గురుదేవునికి ఎవరైతే శరణుబొం-దుతారో, వారియొక్క సకలవిపత్తులు దూరమై దేహమున్నంతవరకు ఇహలోక సౌఖ్యములను అనుభవిస్తూ దేహాంతమున అక్షయపదవిని పొందుతారు. ఒకసారి సద్గురుచరణాలను పట్టుకుంటే చాలు,ఇక తాను గురుభక్తుడే అవుతాడు.ఆయనకు సద్గురుచరణములే గతి.అన్యములు తుచ్ఛము-లు. పూర్వసుకృతానుసారముగా నాకు ఈ సద్గురువు లభించాడని భావించుకొని సమస్తము సద్గురువేయని సద్గురుదేవునిపై భారముమోపి నిశ్చింతగా ఉంటాడు. ఆ శుద్ధభావనయే ఆయనను ధన్యుణ్ణి చేస్తుంది. ఒకవేళ శిష్యునికి ఏవైనా విఘ్నములు కలిగి గురుసాన్నిధ్యమునుండి విముఖుడై-నచో, సద్గురుదేవుడు కరుణించి ఆయనను విడువక తన వైపుకు వచ్చే విధముగా ఉపాయాలు పన్ని గురుసాన్నిధ్యమును ప్రాప్తముచేసి ధన్యుణ్ణి చేస్తాడు. వృథాగా భ్రష్టున్ని కానీయడు.

**నహి కళ్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ।** (గీత 6-40)

గత ఇరువది నాలుగవ అధ్యాయమునందు చెప్పబడిన బసవన్న అనే భక్తుడు, సద్గురుదేవుని కృపవలన శ్రీమంతుడైనాడు. అయినాగాని, అన్ని వ్యవహారాలు విడిచి కూడా నిత్యము సద్గురుదేవుని

ఆశ్రమమునకు వెళ్లి స్వామిని దర్శించుకొని వచ్చేవాడు. ఎల్లప్పుడూ సద్గురు స్మరణమే చేస్తూ ఉండేవాడు. సద్గురు కృపకు పాత్రుడైనాడు.

ధనము వృద్ధియగుకొలది వ్యవహారము అధికమైనది. వ్యాపారము విస్తృతమైనది. సద్గురు దేవుని దర్శించుకొనుటకు సమయము దొరుకుటలేదు. మెల్లమెల్లగా సద్గురువును విస్మరించినాడు. వ్యవహారములో మునిగిపోయినాడు. బసవన్నను లోకులు ఆదరించసాగినారు.ఎందుకనగా,"ధనం మూలమిదం జగత్", "డబ్బుకు లోకం దాసోహమ్". బసవన్న పూర్వము అనుభవించిన దుఃఖములు మరిచినాడు. భూమి, బంగారము, ధనము(డబ్బు) మరియు గృహ, వస్తు, వాహనాలు సమృద్ధిగా చేకూరినవి. అప్పుడు ఒకనాడు ఏమి జరిగిందో వినండి.

బసవన్న అశ్వములతో కూడిన రథముయందు కూర్చుని మార్గముగుండా హుందాగా పోతున్నాడు. ఒక ముసలమ్మ మార్గములో నిలుచుని ఉండెను. బసవన్న వ్యాపారములో చిత్తము లగ్నముచేసి ముందుకు చూడకుండా వేగముగా రథమును నడుపుతుండగా, అకస్మాత్తుగా త్రోవలో నిలుచున్న ముసలమ్మకు రథము తగిలి, ఆమె రథచక్రము క్రిందపడింది.జనులందరూ గుమిగూడినారు. ఆ ముసలమ్మపై పడిఉన్న రథమును పైకిలేపి నిలబెట్టినారు. రథచక్రము క్రిందపడిన ముసలమ్మయొక్క ఎముకలు పిండిపిండి అయినవి. భయంకరముగా గాయములు తగిలి అసువులు కోల్పోయింది. వెంటనే సర్కారు సిపాయిలు వచ్చి బసవన్నను ఈడ్చుకొని తీసుకుపోయి, కోర్టులో హాజరు పరిచినారు. కోర్టువారు బసవన్నను హంతకుడిగా తీర్మానముచేసి సంవత్సరముపాటు కఠిన కారాగారశిక్ష అనుభవించవలసినదిగా ఆజ్ఞాపించినారు. బసవన్న అత్యంత దుఃఖమును పొందినాడు. కాని, వృత్తి వెనుకకు మరల లేదు. ధనమదములోనే మునిగినాడు.

ఇంటియందు గురవ్వ మరియు పిల్లలు ఎంతో దుఃఖితులైనారు. అయినాగాని, వారి చిత్తము ధనమదముయందే రమించినది. సద్గురుదేవునియొక్క స్మరణయే వారి చిత్తమందు కలుగలేదు. ఈ ప్రకారంగా కొన్ని రోజులు గడిచిన తర్వాత ఇంట్లో యజమాని లేనిది గమనించి కొందరు చోరులు గోడను కూలగొట్టి ఇంట్లో జొరబడి వారియొక్క (ధనము) ద్రవ్యమంతా దోచుకొని విలువైన వస్త్రములను దొంగిలించి పోతూపోతూ ఇంటికి నిప్పంటించి వెళ్ళిపోయినారు. గాఢనిద్రలో ఉన్న గురవ్వ మరియు పిల్లలు మేల్కొని హాహాకారముచేస్తూ భయక్రాంతులైనారు. ఏదో విధంగా ఆ ఇంటినుండి బయటపడినారు. ఇరుగుపొరుగు జనమంతాచేరి మంటలను చల్లార్చుటకు ఉపాయములు చేసినప్పటికీని మంటలు చల్లారలేదు. ఇల్లు సంపూర్ణముగా భస్మమై భూమిపై కుప్పగా కూలింది. గురవ్వ దుఃఖమునకు హద్దులు లేవు. ఆమె తన పిల్లలతో పరుల ఇళ్లల్లో తలదాచుకునే సమయము ప్రాప్తమైనది. వ్యాపారమునకు సంబంధించిన ఖాతా పుస్తకములు ఏమి మిగలకుండా అన్ని భస్మమైపోయినవి. గురవ్వ మరియు పిల్లలు శోకసముద్రములో మునిగిపోయినారు.

అప్పుడు గురవ్వకు ఈ దుఃఖము మరియు ఈ క్లిష్ట పరిస్థితిని గమనించి పూర్వస్థితి జ్ఞప్తికి వచ్చింది. పూర్వము కష్టాలలో ఉన్నప్పుడు గురవ్వ ఆత్మహత్య చేసుకోబోతుండగా సద్గురుదేవుడు వచ్చి రక్షించి,వారికి ఐశ్వర్యమును ప్రసాదించిన–విషయమంతా జ్ఞప్తికి వచ్చింది.ఆ సమయములో సద్గురుదేవుడు వారి దారిద్ర్యమును నివృత్తి చేసి కరుణించి వారికి ఉపకారము చేసినాడు. ఆయన యొక్క కృప ద్వారానే మాకు ఈ శ్రీమంతము (ఐశ్వర్యము) ప్రాప్తమయ్యింది–అని గుర్తుకు తెచ్చు-కుంది. అప్పుడు గురవ్వ ఈ ప్రకారము చింతిస్తుంది.ఓ సిద్ధనాథా! నీయొక్క మహోపకారము వలన సంప్రాప్తించిన ధనముచేత మాకు మదము వచ్చి, నిన్ను విస్మరించినందువల్లనే ఈ విపత్తు మాకు సంభవించినది. ధనమదముచేత నిన్ను విస్మరించినందుకు అంతర్యామిస్వరూపడవైన నీకు క్షోభము కలిగింది. అందుకే మాకు ఈ దుర్దశ ప్రాప్తమైనది. ఇప్పుడు ఏమి చేయాలి? గతములో మమ్ములను రక్షించినటువంటి ఆ సద్గురువే మాకు ఇప్పుడు శరణ్యము. ఆయన తప్ప మమ్ములను కాపాడు వేరు మహాత్ములు లేరు. తప్పకుండా ఆయనయొక్క చరణకమలములనే ఆశ్రయించాలి. "అన్యథా శరణం నాస్తి"–అని విలపిస్తూ ఇంకా ఇలా విచారిస్తుంది.

లోకులు మమ్ములను హేళన చేయగలరు. ఎందుకంటే ఐశ్వర్యమున్నంతవరకు ఒక్కనాడైనా సద్గురుదేవుని వద్దకు వెళ్లలేదు. ఇప్పుడు ఉన్నదంతా ఊడ్చుకుపోయేసరికి సిగ్గు విడిచి మళ్లీ ధనప్రాప్తి కోసము సద్గురుదేవునివద్దకు వెళుతున్నారని లోకులు నవ్వుకోగలరు. కావున, ఇప్పుడు సద్గురు దేవుని ఏ ధనసంపత్తులుగాని, వస్తు వాహనాలుగాని కోరము. వాటివలన దుఃఖమే ప్రాప్తవుతుం-దని అనుభవమైనది. పైగా ఆ ధనమదముద్వారా సద్గురు విస్మరణము కలుగును. సంపత్తియొక్క సుఖము ఏ పాటిదో మాకు తెలిసింది. సద్గురుచరణములను విస్మరింపజేసి దుఃఖమును తెచ్చి పెడుతుంది. సద్గురుచరణకమలములయందు అక్షయ సుఖమున్నది. ఆయనయొక్క రెండు చరణ కమలములే మాకు శరణ్యము. ఇప్పుడు అభిమానమును విడిచి సద్గురుదేవునికి శరణుజొచ్చి, అనన్య భక్తితో స్వామిని భజించి ఈ జన్మ సార్ధకము చేసుకోవాలి–ఈ ప్రకారముగా గురవ్వ చింతించి, తనయొక్క ఇద్దరు పిల్లలతోసహా సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని పాదపద్మములను స్పర్శించి దీనముగా నమస్కారములు చేసినారు. రెండు చేతులతో వినయముగా దండము పెడుతూ, గురవ్వ సద్గురువుతో ఇలా తనయొక్కదుస్థితిని విన్నవించుకుంటుంది. ఓ దీననాథా! నీయొక్క అపారమైన కృపను మాపై చూపావు. కాని, మేమే ఉన్మతులమై నిన్ను విస్మరించినాము. ఈ ఆపత్తులను కొని తెచ్చుకున్నాము.ధనమదముచేత నిన్ను విస్మరించినాము. కావున,ఇప్పుడు మాయొక్క అభిమాన-మును వదిలి నిన్ను శరణుబొందినాము. మాకు ఇప్పుడు ధనసంపత్తి అక్కరలేదు. కావున, ఓ సద్గురునాథా! నీవు మాయందు దయతలచి మాకు యథాస్థితిని ప్రసాదించుము. మాకు ధనము వద్దు. దానివలన మా నిజమైన ధనమును (నిన్ను) విస్మరించినాము. పూర్వము మాయొక్క విప-

త్తులను చూసి నీవు దయతలచి మాకు సంపత్తిని ప్రసాదించినావు. మేము దానియందు ఉన్మత్తులమై నిన్ను మరచినాము. కావున ఓ సద్గురుదేవా! ఇప్పుడు మాకు ఆ సంపత్తి వద్దు. మాకు పూర్వస్థితిని ప్రసాదించి నీయందు ఎల్లప్పుడూ అనన్య భక్తి కలిగియుండునట్లు మమ్ములను ఆశీర్వదించమని కోరుకుంటున్నాము. మీయొక్క సాన్నిధ్యమునందు లభించు ఆనందమునకు మించిన సుఖము లేదు. ఇప్పుడు మాసర్వస్వము వదులుకొని నిన్ను ఆశ్రయించినాము. మాకు నీవే రక్షకుడవు.ఓ సద్గురు నాథా! దీనదయాళా! మాయొక్క అపరాధమును క్షమించి మా హృదయమునందు ఎల్లప్పుడూ నీయొక్క అఖండచింతన జరుగునట్లుగా అనుగ్రహించి ఆశీర్వదించుము—అనియిట్లు గురవ్వ సద్గురు దేవుని దీనముగా వేడుకుంటుంది.

ఈ ప్రకారముగా దీనవదనురాలై పశ్చాత్తాప హృదయముతో ఆర్తనాదముతో గురవ్వ తన శిరమును సద్గురు చరణకమలములపై వ్రాల్చి తనయొక్క బాధలను విన్నవించుకున్నది. అనుతాప చిత్తముతో దుఃఖిస్తూ వేడుకుంటున్న గురవ్వను చూసి సద్గురుదేవుని హృదయము ద్రవించి,ఆమెయొక్క అప-రాధమును మన్నించి వారిని కాపాడుటకు సంసిద్ధుడైనాడు. అప్పుడు స్వామి గురవ్వతో ఇలా అంటాడు.

అమ్మా! భయపడకుము. భయపడకుము. నీయొక్క కష్టములు సత్వరముగా తొలగిపో-వును. నీవు ఎల్లప్పుడూ సద్గురుచింతన చేస్తూ ఉండుము. నీయొక్క భర్త తొందరగా కారాగృహ-మునుండి విడుదలై వస్తాడు—అని ఆశీర్వదిస్తాడు. సద్గురుదేవునియొక్క చల్లని అమృతప్రాయమైన వాక్కులు గురవ్వకు ధైర్యమును కలిగించాయి. ఇక నేను కృతకృత్యురాలనైనానని అనుకొని ఆమె తన శిరమును సద్గురు పాదకమలములయందుంచి—

ఓ దయాసాగరుడవైన సద్గురుదేవా! నీవు మా అపరాధములను మన్నించి, మాపై దయ జూపినావు. మేము ధన్యులమైనాము—అని గురవ్వ తమ స్వస్థానమునకు వెళ్ళిపోయింది. ఇక్కడ కారాగృహములో బసవన్న శిక్షను అనుభవిస్తున్నాడు. ఎప్పుడైతే గురవ్వ సద్గురుదేవుని దర్శనము చేసుకుని ఆయన ఆశీర్వాదమును పొందినదో, అక్కడ కారాగృహములో బసవన్న హృదయములో ప్రేరణగలిగి సద్గురుదేవుడు స్మృతికి వచ్చినాడు. అప్పుడు బసవన్న ఆర్తనాదముతో ఓ సద్గురు సిద్ధనాథా! మాయొక్క అపరాధములు క్షమించి మమ్ములను కాపాడుము—అని వేడుకుంటూ, ఓ సద్గురుదేవా! ధనమదముచేత మేము నిన్ను విస్మరించినాము.అందువల్లనే మాకు ఈ ఇక్కట్లు చేకూరినవి. మాయొక్క నేరములను మన్నించి మమ్ములను రక్షించుము స్వామీ! ఇకముందు జీవితాంతమువరకు ఎన్నడూ నిన్ను మరువబోము. మాకు ధనము, ఐశ్వర్యములు వలదు. కేవ-లము నీ పాదపద్మములయందు అనన్యభక్తి కలిగి ఉండులాగున అనుగ్రహింపుము. మాకు ఎల్ల-ప్పుడూ దుఃఖమే ఉండులాగున ఆశీర్వదింపుము తద్వారా మేము ఎల్లప్పుడూ నీయొక్క స్మరణ,

చింతనచేయుటకు వీలవుతుంది. ధనము కలుగుటవలన దుఃఖమే ప్రాప్తించును. అది మాకు అనుభవమునకు వచ్చింది.

**శ్లో ॥ విపదః సన్తు నః శశ్వత్తత్రతత్ర జగద్గురో ।**

**భవతః దర్శనం మే స్యాదపునర్భవదర్శనమ్ ॥** (శ్రీమద్భాగవతము 1-8-25)

అంటూ బసవన్న సద్గురుదేవుని కారాగృహములోనుండి వేడుకుంటూ ఆర్తనాదముచే తన యొక్క ఆవేదనను విన్నవించుకుంటాడు. ఎప్పుడైతే బసవన్న ఇట్లు వేడుకుంటాడో, వెంటనే కారాగృహముయొక్క ద్వారము తెఱువబడినది. జైలు అధికారి లోనికి వచ్చి బసవన్నతో, నీవు ఇప్పుడు ఇంటికి వెళ్ళిపో నిన్ను విడుదల చేసినాము. పై అధికారులనుండి ఉత్తర్వులు వచ్చినవి. ఇప్పుడు నీవు నిర్భయంగా ఇంటికి వెళ్ళిపో–అని అంటాడు. ఈ విధంగా చెప్పి బసవన్నను కారాగృహమునుండి విడుదల చేసినాడు. బసవన్న తన ఇంటికి వచ్చి చూసేసరికి అగ్నిజ్వాలలో ఉన్న తనయొక్క గృహము కాలి భస్మమైపోయింది. సకలసంపత్తులు మంటకలిసినవి. బసవన్న తనలో తాను అనుకుంటాడు–సద్గురుదేవుడు నాయందు కృపజూపి నాకు మేలు చేకూర్చినాడు. ఇప్పుడు కాల్చి వేయబడింది నా యొక్క గృహము కాదు, నాలోని మోహము కాల్చివేయబడినది. పూర్వస్థితి ప్రాప్తించినది. సద్గురు దేవుని చరణాలపై నాయొక్క మనసు లగ్నమైనది. ఇదే మాకు దొరికిన నిజమైన ధనము. అప్పుడు బసవన్న అనుకుంటాడు. ఓసద్గురుదేవా! ఇకముందు మేము మొహములో పడకుండా ఆశీర్వదించుము. అది మళ్లీ మమ్ములను ఆవరించకుండా కాపాడి, సర్వదా నీయందు అనన్య భక్తిభావము కలిగి ఉండులాగున అనుగ్రహింపుము–అని వేడుకుంటాడు. ఈ ప్రకారముగా బసవన్న తనలో తాను అనుకుంటుండగా,ఇంతలో ఆయనయొక్క భార్య గురవ్వ పరిగెత్తుకుంటూ వచ్చి బసవన్న పాదాలపైబడి బోరున ఏడ్చింది. తర్వాత తన భర్తతో ఇలా అంటుంది. నేను సద్గురు సిద్ధనాథునివద్దకు వెళ్లి వేడుకున్నందుకే నీవు జైలునుండి విడుదల అయినావు. అప్పుడు బసవన్న గురవ్వ ఇద్దరు కలిసి సద్గురుదేవునివద్దకు వెళ్లి, దీర్ఘదండ ప్రణామములు చేసి వారియొక్క వృత్తాంతమంతా వివరించారు. అప్పుడు సద్గురుసిద్ధనాథుడు వారినుద్దేశించి ఇలా అంటాడు.బసవన్న!జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పటికీ మించిపోయింది లేదు. ఇప్పుడు మీవద్ద మిగిలియున్న కొద్దిపాటి ధనముతో మీయొక్క ఉపజీవనము గడుపుకుంటూ సుఖముగా ఉండండి–అని ఆశీర్వదిస్తాడు. ఆ కొద్దిధనము ఎక్కడిదనగా–వ్యాపారము చేస్తున్న సమయములో జనులు ఉద్దెరరూపంలో వారివద్ద వస్తుసామగ్రులు తీసుకపోయి ఉండిరి. ఇప్పుడు వారు నీతితప్పకుండా సద్గురుదేవుని మహిమవలన తూచా తప్పకుండా వారు ఇవ్వవలసిన ధనమును బసవన్నకు తిరిగి సమర్పించుకున్నారు. ఆ ప్రకారముగా వచ్చినటువంటి ధనమును, బసవన్న దీనితో అనర్థమున్నది.నన్ను మళ్లీ మోహము ఆవరించగలదని భావించి, ఆ ధనమును సద్గురుదేవునికి అర్పించినాడు.

అప్పుడు స్వామి అంటాడు. ఈ ధనము నీది కాదు. సద్గురుదేవునిదే అని భావించుకొని సద్వినియోగము చేసుకోండి. అన్ని విధముల శుభము కలుగుగాక! అని ఆశీర్వదించి ఆ ధనమును బసవన్నకు ఇచ్చినాడు. సద్గురుదేవుడు ప్రసాదించిన ఆ కొద్దిపాటి ధనమును స్వీకరించి తనయొక్క పూర్వస్థితియందుండి,ఎప్పుడుగూడా సద్గురుదేవుని విస్మరించకుండా అఖండముగా సద్గురుచింతన జేస్తూ జీవితము గడిపినారు.ఉదారమైన,దృఢవైరాగ్యయుక్తమైన జీవితము గడుపుతూ సద్గురుదేవుని ఆశ్రయించుకుని సద్గురుబోధకు పాత్రులై భవభయమునుండి విముక్తులైనారు.

విషయసంబంధముచేత అహంతా,మమత్వరూప మోహము జీవుని ఆవరించి అవివేకునిజేసి సద్గురుచింతనను విస్మరింపజేస్తుంది. గురుస్వరూపమైన తన నిజమైన స్వరూపమును (ఆత్మను) తెలుసుకోలేక జీవుడు తనకు తాను ఆత్మహంతకుడవుచున్నాడు.

**శ్లో ॥ దేహాత్మ బుద్ధిజం పాపం నతద్గోవధ కోటిబిః ।**

**ఆత్మాహం బుద్ధిజం పుణ్యం న భూతో న భవిష్యతి ॥**

సద్గురుచింతనకు విఘ్నముగానిలచిన ఈమోహమనే ముసలమ్మ,యోగసాధనలనే కారా-గృహములో పడవేసి, జీవుని అస్తిపంజరరూప జైల్లో బంధిస్తుంది. శ్వాసను బంధించి మనసును నిగ్రహించనంత మాత్రమున ఆత్మజ్ఞానము ప్రాప్తము కాదు. యోగము రోగముగా మారునే తప్ప ఆత్మసంయమ యోగము కానేరదు. ఉదాహరణకు:–చాంగ్ దేవ్ మహారాజు ప్రాణాన్ని స్తంభింపజేసి పదునాలుగు వందల సంవత్సరములు జీవించినాడు. కాని, ఆత్మజ్ఞానమును పొందలేదు. ఈ ప్రకారముగా ఆత్మజ్ఞానమును కోల్పోయిన జీవునియందు పూర్వ సుకృతానుసారముగా సద్గురు కృప వలన జీవునికి ముక్తినొసంగుటకు శమదమాది చోరులువచ్చి నానారూప వాసనలు అను ద్రవ్య-మును హరించి ప్రారబ్ధరూప గృహమును కాల్చివేస్తాయి.

ఈప్రకారముగా ఎప్పుడైతే జీవునియొక్కఅంతఃకరణమందలి జన్మజన్మాంతరముల సంస్కా-రములు హరించి వేయబడినప్పుడు, అంతఃకరణము శుద్ధమై జీవబ్రహ్మైక్య నిశ్చయము చేయగల వివేకముదయిస్తుంది. అటువంటి చిత్తశుద్ధిని గ్రహించి సద్గురుదేవుడు జీవుడిని వేదాంత అభ్యా-సమునందు ప్రవృత్తముచేసి యోగాది సాధనలనుండి విడుదలజేసి బ్రహ్మజ్ఞానమును బోధించి భవాబ్ధినుండి తరింపజేస్తాడు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు రసయుక్తమైన సద్గురు కథను ముందర అధ్యాయమునందు విన గలరు. సద్గురుచరణాంబుజముల నాశ్రయించినందున భవబంధము నివృత్తికాగలదు.పరిపూర్ణమైన దయాలువగు సద్గురుదేవుడు భక్తులయొక్క దుఃఖమును తనదిగా భావించుకొని, మంచివారు, చెడ్డవారు, చిన్నవారు, పెద్దవారు అనే తారతమ్యము లేకుండా అందరిపైనా సమదృష్టిని ప్రసరింపజేసి కృపతో వారిని ఉద్ధరిస్తాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచేతనే సకలపాపములు భస్మము కాగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఇరువది ఐదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యో నమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది ఆరవ అధ్యాయము

పద్యానువాదము:—నమ్రభావముచేత దీనముగా సద్గురుదేవుని మనస్ఫూర్తిగా స్మరించి, ప్రార్థించినట్లయితే సద్గురుదేవుని కృపగలిగి తప్పకుండా స్వస్వరూపాన్ని పొందు-తారు. తనువును, మనస్సును మరియు ధనమును సర్వస్వమును సద్గురుదేవునికి అర్పించు కొని, సర్వము తానే అని భావించుకొని, ఆ సద్గురుదేవుని ఆశ్రయించినట్లయితే సద్గురు దేవుడు జ్ఞానమును ప్రసాదించి, సర్వదుఃఖనివృత్తి, పరమానందప్రాప్తిరూప మోక్షమును ప్రసాదిస్తాడు.

ఓ సద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము. నీవు అనంత బ్రహ్మాండములయందు వ్యాపించియుండిగూడా భవసాగరమునుండి భక్తులను తరింపజేయు కార్యమును చేపట్టి సగుణరూపముగా ఈ లోకంలో అవతరించినావు. స్థూల, సూక్ష్మ, కారణశరీరముల కంటె విలక్షణముగా ఉండి, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షిగా ఉండిగూడా, "కల్పిత వస్తువు అధిష్టానస్వరూపమే ఉంటుంది"-అను నియమానుసారముగా,నీవు వాటిచేత అభిన్నము-గానే ఉన్నావు. గనుక అటువంటి నీయొక్క స్వరూపమును ఎఱుగలేక భక్తులు నిన్ను భిన్నరూపముగానే భజిస్తారు.

**శ్లో ॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**

**పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥** (గీత ౯-11)

పరిపూర్ణ అవతారస్వరూపుడవైన ఓ సిద్ధనాథా! నీవు భక్తులకు ఎటువంటి అపా-యములు కలిగినా, వాటిని నివృత్తి చేయుటకు ఎన్నో ఉపాయములు చేస్తావు. కాని, నీయొక్క శరీరమునకు ఎన్ని అపాయములు కలిగినా, వాటి నివృత్తికి ఎలాంటి ఉపాయ-ములు చేయవు. ఇతరుల శరీరము ఘాతుకమైనప్పుడు దానిని సహించలేక నీవు వారిపై విశేషదయను చూపి అపాయములను నివారింప చేస్తావు. కాని, స్వయంగా నీయొక్క శరీరయాతనలు నివారింప ప్రయత్నము చేసికొనవు. చిన్నపిల్లలు అమాయకత్వంలో ఉండి ఎన్ని తప్పులు చేసినాగాని, తండ్రి వారిని ఎలా సహించుతాడో, అదే ప్రకారముగా అజ్ఞాని జీవులుచేసిన తప్పులు క్షమించి, వారిని ఉద్ధరింపజేస్తావు. అటువంటి వారిపైననే అధిక-ముగా దయజూపి అజ్ఞదృష్టిగల వారికి సద్బుద్ధిని ప్రసాదించి, జ్ఞానమును ప్రసాదించి

సన్మార్గంలోకి తీసుకొనొస్తావు. ఓ సద్గురుదేవా! నీవు సర్వభూతములను ఆత్మస్వరూపముగా దర్శిస్తావు. వారిని నీకంటే భిన్నముగా ఎన్నడును చూడవు. వారి దుఃఖమే నీ దుఃఖముగా భావించి దయాదృష్టితో వీక్షిస్తావు.

**శ్లో ॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥**

**శ్లో ॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥** (గీత 6-29, 32)

శరీరమునకు ఏ తాపములు కలిగిన వాటిని ప్రారబ్ధముయొక్క ఫలమని నిశ్చయించుకొని వాటిని భోగించుట చేతనే ప్రారబ్ధము క్షీణిస్తుందని భావించి, దుఃఖములను దూరంచేయుటకు ఏఉపాయములుగూడా చేయవు."దుఃఖములు నివారించుటకు ప్రయత్నం చేసి వాటిని నిరోధించినట్లయితే ఆప్రయత్నం మళ్లీ సంచితంలో గణనమై పునర్జన్మకు కారణముకాగలదు"."**ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషా మమ" "ప్రారబ్ధం భోగతో నశ్యేత్".** ఇది జ్ఞానులయొక్క మతము,స్వభావము.

ఎవరైనా నిన్ను పీడించి దుఃఖమును కలుగజేసినచో అది ప్రారబ్ధముయొక్క ప్రేరణ అని భావించి, మనో వ్యాకులత (ఉద్వేగము) చెందక, వారిపై ఎలాంటి ప్రతీకారమునకు పూనుకొనక సమత్వబుద్ధితో,ఉదాసీనముగాఉండి,తిరుగా వారిపైదయజూపి కరుణిస్తావు. ఈ విషయంలో దృష్టాంతమును సావధానచిత్తులై శ్రవణము చేయగలరు.

ఒకానొక సమయములో శ్రీ సద్గురు సిద్ధదయాఘనుడు సిద్ధాశ్రమమందలి ఒక కట్టపై(అరుగపై) ధ్యానమగ్నుడై కూర్చున్నాడు. ఆ సమయమున మఠములో ఎవరు కూడా లేకుండిరి. అటువంటి సమయములో ఆరుగురు మ్లేచులు స్వామిని చంపుటకు నిశ్చయించుకుని, మద్యపానముచేసి మదోన్మత్తులై సిద్ధనాథుని వెనుకనుండి వచ్చినారు. అందులో ఒకడు స్వామిని కట్టమీదనుండి ఆకస్మాత్తుగా లాగి పడవేసినాడు. సిద్ధనాథుడు మళ్లీ లేచి యథావత్తుగా కట్టపై కూర్చున్నాడు. చెట్టుకొమ్మను నరికి క్రింద పడవేస్తే పడిన చోటనే, ప్రతీకారము చేయక ఎలా ఉంటుందో, అట్లే నన్ను ఎవరు పడవేసినది అని వెనుకకు కూడా మరలిచూడలేదు. స్వామియొక్క మౌనమునుచూసి వారిలో ఒకనికి కోపమువచ్చి,స్వామిని చేతులుపట్టి వడిగా బలముతో క్రిందికి లాగినాడు. అందరూ స్వామిని చుట్టుముట్టి స్వామితో ఇలా అంటారు. ఓరీ మూర్ఖుడా! మేము మద్యము తాగి ఆనందించుచున్నాము. నీకు కూడా మద్యము త్రాగించి ఆనందింపజేయాలని వచ్చినాము. నీవు కూడా మాతో పాటు త్రాగి ఆనందమును అనుభవించుము.నాకు నిషేధముకలదని అంటివా,నీవు ప్రాణాలతో దక్కవు. ఆరుగురు మంది చుట్టుగా నిలబడి స్వామిని మధ్యలో కూర్చుండబెట్టి, వారి జేబులలోనుండి

మద్యపుసీసాలను తీసి సిద్ధమునీంద్రునితో ఇలా అంటారు. నీవు నిశ్చయముగా శూద్రుడవు. కావున, నీవు నిస్సంశయముగా మాతో కలిసి మద్యమును సేవించవచ్చు. మద్యము త్రాగి-నచో నీదేమి పోతుంది, త్రాగు—అని ఒకడు స్వామిని ఒక తన్ను తన్నినాడు. సిద్ధనాథుడు మద్యమును స్వీకరించనందున అందరూ స్వామిని సర్వాంగములయందు తన్నసాగినారు. స్వామి ఏమీ చలించకుండా కూర్చున్నాడు.ఒకడు కట్టెతో కొట్టినాడు.ఒకడు కళ్ళల్లో పొడు-చుటకు ప్రయత్నము చేసినాడు. ఒకడు శిరస్సు పగులగొట్టుటకు యత్నము చేస్తున్నాడు. అయినాగాని స్వామి స్వస్థచిత్తుడై కూర్చున్నాడు. వారు అంతగా హింసిస్తున్నాగాని వారిని శాంత దృష్టితో చూడసాగినాడు. వారిపై క్రోధదృష్టిని అసలే రానీయలేదు. స్వామికి కోపము తెప్పించుటకు ఎన్నో విధములుగా ఆ దుర్మార్గులు హింసిస్తున్నారు. కొంత సమయమైన తరువాత స్వామి వారిని దయాదృష్టితో వీక్షిస్తూ, ఇలా అంటాడు. మీరు చాలా ఉత్తమమైన కార్యము చేస్తున్నారు. ఇటువంటి సేవ నాకు మున్నెవరును చేయలేదు. ఈ ప్రకారముగా ఉపకారము చేసేవారు లోకంలో చాలా అరుదు. దానికి ప్రతిఫలముగా నేను మీకు ఏమి ఇయ్యలేకుండా ఉన్నాను. మీకు ఉపకారము చేయలేకున్నా గాని అపకారము మాత్రము చేయను. మీయొక్క మేలు నాయొక్క మేలుగా భావిస్తాను. ఓ ప్రియతమ భక్తులారా! మీరు ఇంతవరకు నాకు చేసిన ఉపకారమునకు చాలా సంతోషము. కాని, గ్రామములోని నా భక్తులు వచ్చేవేళ అయ్యింది. వారు మిమ్ములను చూసి కోపించి మీకు ఘాతకము చేయ గలరు. అలా జరిగితే నేను సహించను. అందుకని మీరు ఈ క్షణమే ఇక్కడనుండి వెళ్లి పోండి. ఒకవేళ గ్రామస్తుల దృష్టి మీపై పడినచో చాలా అపఘాతకము కాగలదు. నన్ను ఇంకా పీడించాలని ఒకవేళ మీకున్నట్లయితే మళ్లీరేపు ఇదే సమయానికివచ్చి మీయొక్క అభీష్టమును నెరవేర్చుకోగలరు.ఈప్రకారముగా వారికిచెప్పి ఇక్కడనుండి తొందరగా వెళ్ళ-మన్నాడు. స్వామియొక్క వచనములను వినిన ఆ మ్లేచ్ఛులకు కోపమువచ్చి ఉన్మత్తులయ్యి, ఒరేయ్ పిచ్చివాడా! నీ ప్రాణరక్షణ కోసము మాతో అబద్ధము చెప్పి మమ్ములను భయపెట్టి పంపించాలనుకుంటున్నావా? చూడు, నిన్ను చంపిన తర్వాతనే మేము ఇక్కడ నుండి పో-తాము—అని ఒక పెద్ద బండరాయిని ఎత్తుకొని స్వామిపై వేసి చంపుటకు వస్తున్నారు.

ఇంతలో గ్రామభక్తులు దగ్గరనుండే వస్తున్నట్లుగా శబ్దము వినబడింది. ఆ శబ్దమును విన్న ఆ యవనులు బండరాయిని అక్కడే పడవేసి, అక్కడనుండి పలాయనమై దగ్గరలో ఉన్న చెట్లపొదలో దాగుకున్నారు. భక్తజనులు స్వామి సన్నిధిలోకి వచ్చి, అందరూ సాష్టాంగ న-మస్కారములు చేసినారు. పొదలో దాగుకొని ఉన్న యవనులు అక్కడ ఏమి జరుగుతుందో అని పొంచి పొంచి చూడసాగినారు. సిద్ధనాథుని చరణకమలములను పట్టుకొని భక్తులు ఇలా అంటారు. ఓ సిద్ధనాథా! నీవు కృపాసాగరుడవు. మాయొక్క కోరికను ఆలకించండి.

ఈరోజు కాలమ్మయొక్క రథోత్సవము చేయుటకు మేము గ్రామభక్తులందరము సర్వస-న్నాహాలు సిద్ధముచేసి, అపూర్వమైన కాలమ్మ రథమును శృంగారముగా సుసజ్జితముజేసి, కాలమ్మ మూర్తిని దివ్యముగా అలంకరించి గ్రామములో స్థాపించినాము. మేము గ్రామ ప్రజలందరము ఆరథమును లాగినాగాని ఆ రథము కించిన్మాత్రము కూడా కదలడము లేదు.

మహాత్ముడైన సిద్ధనాథుడు తప్ప ఈ రథమును కదిలించేవారు ఎవరూ లేరు అని– ఒకానొక గృహస్థుడు చెప్పగా మేము మీవద్దకు వచ్చినాము. ఓసద్గురుదేవా! మీరు నిశ్చ-యముగా మహాత్ములు.దయచేసి మాయొక్క మనోరథమును నెరవేర్చండి–అని వారియొక్క అభీష్టమును వెలిబుచ్చుకుంటారు. అప్పుడు సద్గురుదేవుడంటాడు. సరే మీయొక్క అభీష్టాను సారము నేను వస్తాను. కాని, ఉత్సవము సమాప్తము కాగానే నేను తిరిగి రాత్రికి మఠ-మునకే వస్తాను. అక్కడమాత్రము ఉండబోనని చెప్పాడు.ఈసంభాషణలను దగ్గరలో చెట్ల-పొదలో దాగుకొనిఉన్న మ్లేచ్ఛమూర్ఖులు సమగ్రవిషయమును విని ఇలా అంటారు. ఏమి-టి? ఒక పిచ్చివాడిని మహాత్మునిగా భావించి, గ్రామస్తులందరూ లాగినాగాని కదలని రథమును నడిపించుమని పడిపడి దండాలు పెడుతున్నారు. ఈపిచ్చివాడు ఎలా నడుపు-తాడు. ఈయన ఒక మహాత్ముడా? సరే మనమూ చూద్దాం పదండి–అని ఆ యవనులు రహస్యముగా ఆ జనములో కలిసి వెళ్తున్నారు. సిద్ధారూఢ స్వామి మరియు భక్తులు ముందు వెళ్తున్నారు. యవనులు వెనుక వెనుక పొంచి పొంచి నడుస్తున్నారు. అందరు కలిసి పాత హుబ్లీపట్టణములో కాలమ్మ రథమును అపూర్వముగా అలంకరించి త్రోవలో నిలబెట్టిన చోటికి చేరుకున్నారు. అచ్చట వందలాది మంది రథమును లాగుతున్నారు. కాని, కొంచెము కూడా కదలడము లేదు. సిద్ధనాథుడు ఆ రథమునకు ఎదురుగా ఉన్న ఒక గృహము ముందున్న అరుగుమీద ఆసనము వేసుకొని కూర్చున్నాడు. పూర్వము ఎనిమిదిమంది లాగితే ఆ రథము నడిచేది.కాని,ఇప్పుడు వందలాదిమంది లాగినాగాని అచలముగా ఉం-ది. ఇటువంటి దృశ్యమును చూసి జనులందరూ ఖిన్నులైనారు. అప్పుడు వారిలో రహ-స్యముగా ఉన్న మ్లేచ్ఛులు ఇలా అనుకుంటారు. ఈ జనులు మూర్ఖులుగాక మరేమిటి? ఒకవేళ ఈ పిచ్చివానియందు శక్తి ఉన్నట్లయితే ఇంతకుముందు మనము హింసించు-చున్నప్పుడు మనలను శపించి ఉండేవాడు గదా.

ఒకడంటాడు–ఈయన నిశ్చయముగా మహాత్ముడే అయినట్లయితే రథము ఎందుకు నడుచుట లేదు?ఇటువంటి వివాదము ఆయవనులలో పరస్పరము జరుగుచున్నది.ఇంతలో మహాత్మునియందు భక్తిశ్రద్ధలుగల ఒక గృహస్థుడు (ఎవరైతే మొదట స్వామివద్దకు పొమ్మని సలహా ఇచ్చినాడో) ఆయన మళ్లీ వచ్చినాడు.

గృహస్థుడు ఇలాఅంటాడు–ఓసద్భక్తులారా!నామాట వినండి.మీరు సద్గురుదేవుడైన సిద్ధనాథుని భావపూర్వకముగా, భక్తి పూర్వకముగా వేడుకోండి, ప్రార్థించండి. రథముపై కూర్చుండబెట్టి భజనలుచేస్తూ లాగినట్లయితే రథము తప్పకుండా కదులుతుంది–అని ఆ గృహస్థుడు చెప్పగా, కాలమ్మభక్తులకు కొందరికి కోపమువచ్చి అంగీకరించలేదు. సిద్ధ-నాథుని రథముపై కూర్చుండబెట్టినట్లయితే కాలమ్మ కోపిస్తుంది అంటారు. అప్పుడు గృహ-స్థుడు ఇలా అంటాడు. అయితే చెబుతాను వినండి. నిన్నటి రాత్రి నా కలలో (స్వప్నంలో) యథార్థముగా కాలమ్మ కనిపించి, మీరుగనుక సిద్ధనాథుని రథముపై కూర్చుండబెట్ట-నట్లయితే నేను రథమును కదలనీయను–అని అన్నది. నాకు కనిపించిన స్వప్నము ఇప్పుడు సత్యమైనది. స్వప్నములో కాలమ్మ చెప్పిందే నిజమైనది. ఇప్పుడు కాలమ్మయొక్క ఆజ్ఞను పాటించవలసిందే, వేరే ఉపాయము లేదు. సద్గురుదేవుని రథముపై కూర్చుండబెట్టనిదే రథము కదులదు. ఇది ముమ్మాటికి నిజము. ఇది మాకిష్టము. ఈ ప్రకారంగా ఆ గృహస్థుడు చెప్పగా అందరు భక్తులు సమ్మతించారు. అనేక దివ్యమైన భూషణములతో స్వామిని అలంకరించి రథముపై కూర్చుండబెట్టినారు.

రథములో కూర్చొన్న సద్గురుసిద్ధమూర్తి ప్రకాశవంతమై సూర్య,చంద్ర,తారలవలె మరియు మెరుపువలె ప్రకాశిస్తున్నాడు. ముఖముపై తేజస్సు ప్రజ్వలించుచుండగా ప్రశాంత-ముగా భాసిస్తున్నాడు. అందరి హృదయములలో ఆనందము ఉప్పొంగి, ముఖకమలముల ద్వారా వ్యక్తమగుచున్నది. తరువాత ముత్తైదువ(సుమంగళి)స్త్రీలు స్వామికి మంగళహారతులు పాడినారు. అందరు భక్తులు స్వామికి జయజయకారాలు చేస్తూ గర్జించినారు. అప్పుడు వెంటనే ఆరథము సహజముగానే నడవసాగింది.భక్తులందరు ఆ కౌతుకమును ప్రేమపూ-ర్వకముగా, ఆశ్చర్యముగా చూడసాగినారు. నిందక జనులు అందరు పిచ్చివారైనారు. వారి చిత్తమందు ఆశ్చర్యమునకు అంతులేదు. దిగ్భ్రాంతిని చెందినారు. స్వామియొక్క మహిమ వారికి బోధపడలేదు. ఒక గొప్ప నదీప్రవాహమునందు చెట్లు మరియు పెద్దపెద్దరాళ్లు సహితముగా కొట్టుకొని పోవునట్లుగా, రథోత్సవములో భక్తులు, అభక్తులు అందరూ కలిసి ఆనంద ప్రవాహములో ఏకత్రితమై అద్భుతమైన సద్గురుదేవునియొక్క నామఘోషలు చేస్తూ స్వామిని నిందించినవారు, స్తుతించినవారు అందరూ కలిసి నడవసాగినారు. ఈప్రకార-ముగా మహావైభవముగా ఉత్సవము సమాప్తమైన తరువాత భక్తులందరూ సద్గురుదేవుని పాదదర్శనము చేసుకుంటున్నారు. భక్తులయొక్కసందడి ఎక్కువైనది.తదనంతరము సద్గురు సిద్ధనాథుడు ఆశ్రమమునకు వెళ్లిపోయినాడు.యథాపూర్వకముగా కట్టపై(అరుగుపై)కూర్చుని స్వామి అనుకుంటాడు–ఇదంతా ఈశ్వరీయమాయ. నాదేమీ లేదు. ఈ జాగ్రత్ప్రపంచము కేవలము స్వప్నతుల్యము. సత్యము కాదు. ఇది నాయందే ప్రతీతి అగుచున్నది. దీనికంతటికి

నేనే ఆధారము.భిన్నభిన్న నామరూపాలతో ప్రతీతి అయ్యే ఈ జగత్తు నాయొక్క స్వరూపమే ఉంది.

అదే సమయానికి స్వామిని ఇదివరకు హింసించినటువంటి మ్లేచ్ఛులు స్వామి వద్దకు వచ్చినారు.ఆ ఆరుగురి ముస్లింలను స్వామిని చూసి ఆ....వచ్చినారా! ఇక మీయొక్క అభీ-ష్టానుసారము మీ పని మీరు చేసుకోండి అని అంటాడు. మీరు పడవేసి పోయిన ఆ పెద్ద బండరాయి అక్కడే ఉంది. ఇప్పుడు మీ వలన నాకేమీ భయం లేదు. ఇప్పుడు మీరు నిర్భయంగా మీ పని పూర్తి చేయండి.

ఈ ప్రకారంగా సద్గురు సిద్ధనాథుడు ఎప్పుడైతే పలికినాడో, వెంటనే ఆ ఆరుగురు యవనులువచ్చి స్వామి చరణకమలములపై పడి ఇలా అంటున్నారు. అయ్యా స్వామీ! ఓ సద్గురుదేవా! మమ్ములను క్షమించండి. మీయొక్క మహిమను తెలుసుకోలేని మూర్ఖులము. నిన్ను ఎన్నో విధములుగా హింసించినాము. మేము పాపాత్ములము. మమ్ములను క్షమించి రక్షించండి. మీరు మాకు ఒక పిచ్చివాడిలా కనిపించారు. అందుకనే నిన్ను అనేకముగా హింసించినాము. మీయొక్క అపారమైన మహిమ మాకు ఇప్పుడే తెలిసింది. మేము చేసిన నేరములకు మమ్ములను శిక్షించండి. మాకు తగిన శిక్ష విధించనిదే మేము ఇక్కడ నుండి వెళ్ళము.అని–

ఆ యవనులు పదేపదే వేడుకోగా అప్పుడు సిద్ధనాథుడు వారినుద్దేశించి ఇలా అంటాడు. ఇప్పుడు మీలో సద్గుణములు ప్రకటమైనవి. మీరు ఇంతవరకు నన్ను ఎంతగానో వేధించినారు. ఆ బాధలను ఓర్పుతో సహించినందుకు ఇప్పుడు మీలో పశ్చాత్తాపము కలిగి సత్త్వగుణము ఉదయించింది.తద్వారా మీయందు వివేకవైరాగ్యాదులుత్పన్నమై మీరు ధన్యు-లగుదురు గాక! "**సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్**" ఇప్పుడు మీలో ఈ మార్పు వచ్చినందువల్ల నాయొక్క పని పూర్తి అయినది.

మహాత్ములు అజ్ఞాన తిమిరములో చిక్కుకున్న జీవులయందు దయదలచి వారిని ఉద్ధరించుటయే వారి లక్ష్యముగా, తాను తరించి ఇతర అజ్ఞజీవులను తరింపచేయుటయే వారి బాధ్యతగా భావించి పరోపకారం గురించే జీవిస్తుంటారు.

**శ్లో ॥ పరోపకారాయ ఫలన్తి వృక్షాః, పరోపకారాయ వహన్తి నద్యః ।**
**పరోపకారాయ దుహన్తి గావః, పరోపకారార్థమిదం శరీరమ్ ॥**(సుభాషితము)

**శ్లో ॥ భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గమైః, నవామ్బుభిర్దూరవిలమ్బినో ఘనాః ।**
**అనుద్ధతా సత్పురుషాః సమృద్ధిభిః, స్వభావ ఏవైష పరోపకారిణామ్ ॥**

(అభిజ్ఞాన శాకుంతలము 5-12)

పరోపకారము కొఱకై వృక్షములు ఫలించును, నదులు ప్రవహించును, గోవులు పాడి యిచ్చును. పరోపకారార్థమే మహాత్ములు జీవింతురు.

వృక్షములు ఫలించినప్పుడు ఫలముల భారముచే క్రిందకు వంగియుండును. నూతన జలములచే పరిపూర్ణమైన మేఘములు వర్షించుటకు ఆకాశమునుండి భూమిసమీపమునకు వచ్చి వ్రేలాడబడును. సత్పురుషులు ఐశ్వర్యాది సమృద్ధులచే గర్వమునొందక, వినయశీలురై యుందురు, ఇది పరోపకారమును చేయువారి స్వభావమేయై యున్నది.

సిద్ధనాథుడంటున్నాడు–ఇప్పుడు మీరు మీమీ ఇండ్లకుపోయి మీమీ వర్ణాశ్రమధర్మానుసారముగా ఉద్యోగవృత్తులుచేస్తూ, సద్గుణములు సంపాదించుకొని ఎల్లప్పుడూ సద్గురు దేవుని స్మరిస్తూ, మద్యపానాదులను సంపూర్ణముగా త్యజించి వివేకవైరాగ్యాదుల యుక్తముగా ఎల్లప్పుడూ సత్సంగము చేస్తూ ఉండండి. తద్వారా మీరు ధన్యులు కాగలరు.

**శ్లో ॥ సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।**

**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥** (భజగోవిందము)

ఈప్రకారముగా మీరు సదాచారసంపన్నులై సద్గుణవంతులై తత్త్వమును తెలుసుకొని కృతకృత్యులు కావడమే నేను మిమ్ములను క్షమించినట్లుగా భావించుకోండి. ఇదే మీకు శిక్ష –అని సద్గురుదేవుడు వారితో అంటాడు. ఎప్పుడైతే సిద్ధనాథుడు ఈప్రకారముగా చెప్పినాడో, కండ్లవెంట జలజల కన్నీరు ఏకధారగా కారుతుండగా పశ్చాత్తాప హృదయముతో ఏడుస్తూ సద్గురు పాదపద్మములకు సాష్టాంగ నమస్కారములు చేసి, వారు సద్గురుదేవునితో ఇలా అంటారు. మేము నీయొక్క మహిమను తెలియలేక నిన్ను నానావిధముల కష్టపెట్టినప్పటికైనా నీవు మాయందు దయతలచి కరుణించి క్షమించి మమ్ములను కృతార్థులను చేసినావు. ఇది మాయొక్క పూర్వపుణ్య విశేషము కాబోలు. లేనిచో మాయొక్క జన్మ వృథాగా వ్యర్థమై పోయేది. మీయొక్క సంబంధమువలన మేము ధన్యులమైనాము.(ఉదాహరణకు:–హిరణ్యకశిపు, కంస, రావణ, శిశుపాలుర వలె) ఎవరు ఏ ఏ విధముల నిన్ను భజిస్తారో, వారిని ఆ విధముగానే రక్షిస్తారు.

**శ్లో ॥ యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।**

**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥** (గీత.4-11)

కావున, ఓ సద్గురుదేవా! ఇప్పుడు మాపై దయతలచి మీ యొక్క కృపాహస్తముచేత మాయొక్క దుష్టసాంగత్యమును (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను) నష్టముచేసి, సత్సాంగత్యము (వివేక, వైరాగ్య, షట్సంపత్తి, ముముక్షుత్వము)వృద్ధినొందునట్లుగా ఆశీర్వదించండి. ఈ విధముగా సద్గురుదేవుని ప్రార్థించి, మళ్లీ సిద్ధనాథుని చరణ

కమలములను దర్శించుకొని స్వామియొక్క ఆజ్ఞనుపొంది,వారి వారి స్వస్థానములకు వెళ్లి పోయినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క వేదాంతరూప లక్ష్యార్థమును శ్రద్ధాభక్తులతో వినండి. శరీరములోని అహంకారమనే కట్టపై, సద్గురుదేవుడనే ఆత్మ కూర్చుంది. అప్పుడు షడ్రిపురూప (ఆరుగురు మ్లేచ్ఛులు) అహంకారవృత్తులు (అజ్ఞానవృత్తులు) ఆత్మను చుట్టు ముట్టినవి. అజ్ఞానము ఆత్మను ఆశ్రయించుకొని ఆత్మనే తెలియకుండా చేస్తుంది (స్వాశ్రయ స్వవిషయము అజ్ఞానము). అప్పుడు ఈ షడ్రిపులు (కామ క్రోధ లోభ మోహ మద మాత్స-ర్యములు) శబ్ద స్పర్శ రూప రస గంధములనే విషయరూప మద్యమును సేవించి ఉన్మత్తులై ఆత్మకు ఘాతకము చేయుటకు ఉద్యుక్తులవుతారు. ఏ విధముగా మ్లేచ్ఛమూర్ఖులు స్వామిని మద్యము సేవించమని ప్రోద్బలముచేసి హింసిస్తారో, అదేవిధంగా ఈ అహంకార వృత్తులు షడ్రిపురూపముగా పరిణామముచెంది విషయరూప మద్యమును సేవించి ఉన్మత్తులై ఆత్మ ఘాతకమునకు పూనుకుంటాయి. కాని, స్వామి ఏ విధముగా మద్యమును స్వీకరించక మౌనముగా కూర్చున్నాడో,అదే ప్రకారముగా ఆత్మ విషయములు మరియు విషయవృత్తు-లచే నిర్లిప్తుడై తనయొక్క నిజస్థితియందే నిశ్చలమై ఉన్నాడు. దుష్టవృత్తులు అసంగమైన ఆత్మను భంగం చేసి సంగిగా చేయుటకు ఎన్నో విధములుగా ప్రయత్నము చేసినా, ఆత్మ తనయొక్క సచ్చిదానందఘన స్వరూపమునుండి ఏమాత్రము చలించక నిశ్చలమై, శాంత-ముగా ఉన్నాడు. అప్పుడు పూర్వపుణ్య విశేషముచేత (పూర్వపుణ్యము పరిపక్వముచెంది) వివేక, వైరాగ్య, శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము మముక్షుత్వము అను సద్గుణవృత్తులు అనే భక్తులు ఎప్పుడైతే ప్రకటమైనారో, అప్పుడు దుష్టవృత్తులు పలాయనమై లుప్తమైనవి, కాని సమూలంగా నష్టము కాలేదు. కావున, సాధనకాలమందు వివేక, వైరా-గ్యాదులు విశేషముగా ప్రకటముగా ఉండి, పరమార్థసాధన చేస్తున్నప్పుడు, విషయాలనుండి నివృత్తి అయినప్పటికీ సూక్ష్మమైన విషయ సంస్కారములు మనసులో గుప్తంగా ఉంటాయి.

**శ్లో ॥ విషయావినివర్తన్తే నిరాహారస్య దేహినః ।**

**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥** (గీత. ౨-౫౯)

కాలమ్మ రథమును కదిలించుట కోసము సద్భక్తులు వస్తూండగా, వారితోకలిసి గుప్తంగా యవనులు కూడా వచ్చినారు. అదేవిధంగా పరమార్థ సాధనలో సాధకునిలో విశేషంగా సద్వృత్తులు మరియు దుష్టవృత్తుల సూక్ష్మ సంస్కారములు కూడా ఉంటాయి. ఈ ప్రకారముగా సద్గుణములు ఆత్మను తీసుకొచ్చి వాటికన్న భిన్నముగా దూరంగా కూర్చుండ బెట్టి స్థూలసూక్ష్మదేహమును కదిలించుటకు ప్రయత్నము చేయసాగినవి. ఆత్మను విస్మరించిన అనేక వృత్తులు కలిసి దేహరథమును నడిపించుటకు ప్రయత్నముచేసినప్పటికీ,ఆ జడవృత్తులు

జడమైన దేహమును కదిలించలేవు. అందుకే ఈ దేహిరూప జీవుడు భవసాగరము నుండి తరింపబడుటకు నౌకారూప సద్గురుదేవునియొక్క ఉపదేశము అవసరము.

**गुरु बिन भवनिधि तरइ न कोई। जो बिरंचि संकर सम होई॥**

శంకరుడు మరియు బ్రహ్మదేవునితో సమానమైనవారుగూడ దేశికుడు లేనిదే భవ సాగరమును తరించలేరు.

అప్పుడు సద్గురురూప గృహస్థుడు వచ్చి ఇలా మార్గదర్శనము చేస్తాడు. ఆత్మ లేకుండా (సిద్ధనాథుడు రథముపై ఆరూఢుడు కానిదే) దేహరథము చలించదు అని చెప్పగా (సద్భక్తులు)సద్వృత్తులు (సిద్ధనాథుని) ఆత్మను ఆశ్రయించి స్వామిని వేడుకుని దేహరూప రథముపై కూర్చుండ బెట్టినారు. అప్పుడు రథము నిస్సందేహముగా, సహజముగా కదిలింది. అదేవిధంగా ఆత్మను పరోక్షునిగా ఎరిగి (దూరముగా కూర్చుండబెట్టి) ఎన్నిసాధనలుచేసినా దేహరథము గమ్యమును (మోక్షమును) చేరలేదు. ఎప్పుడైతే సాధన సంపత్తియుక్తుడై విధి-పూర్వకముగా సద్గురుదేవుని ఆశ్రయించి యథార్థమైన ఆత్మజ్ఞానము (దృఢ అపరోక్ష బ్రహ్మ జ్ఞానము) పొందుతాడో, అప్పుడే గమ్యమును చేరుకోగలడు.

ఎప్పుడైతే సద్గురుదేవుని ముఖారవిందమునుండి వేదశాస్త్ర ప్రమాణములను శ్రవణ మనన నిదిధ్యాసనములుచేసి యథార్థముగా ఆత్మనుయెఱుగుతాడో,అప్పుడు అంతఃకరణ-ములో సూక్ష్మంగా చోటుచేసుకునిఉన్నవాసనలు సమూలముగానష్టమై స్వస్వరూపస్థితిని పొందుతాడు."**పరం దృష్ట్వా నివర్తతే**". అప్పుడు దుష్టవృత్తులు ఆత్మనుచేరుకొని మేము ఇంత వరకు నిన్ను జీవునిగాభావించి ఎన్నోవిధములుగాపీడించినాము.ఇప్పుడుమీయొక్క యథా-ర్థస్వరూపము తెలిసింది. మీరు ప్రత్యగభిన్నపరబ్రహ్మస్వరూపులు. సచ్చిదానందస్వరూపులు. మమ్ములను క్షమించుము–అని వేడుకుంటాయి.

ఇక్కడ ఒక విషయము గమనించాలి. అంతఃకరణవృత్తి విషయాకారమును పొంది నప్పుడు విషయవృత్తులుంటాయి.“**అహంబ్రహ్మాస్మి**”యను బ్రహ్మాకారమును పొందినప్పుడు సాత్వికవృత్తులుంటాయి. కాని,అతఃకరణమనునది ఒక్కటే ఉంది. అది శుద్ధము, అశుద్ధ-మను భేదముచే పరిణతి చెందుతుంది.

**మనో హి ద్వివిధం ప్రోక్తో శుద్ధం చాశుద్ధమేవ చ।**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్॥** (మైత్రా 6-34; బ్ర.బిం. 1)

అజ్ఞానవశాత్ జీవుడు నేను బద్ధుడిని అనుకుంటాడు. యథార్థజ్ఞానముదయించిన మీదట ముక్తుడిని అనుకుంటాడు. దీనికి కారణము మనస్సే. అంతఃకరణ వృత్తి మాత్రమే.

**శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।**

**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥** (బ్ర.బిం. ౨)

**"బంధకాలేఽపి బంధ అభావః"**

అజ్ఞాన కాలమందు మరియు జ్ఞానానంతరము కూడా ఆత్మ స్వయంప్రకాశమై, బంధమోక్ష విహీనమయ్యే ఉంది. బంధమోక్షములు మాయాకల్పితములు.

**బంధముక్తివిహీనోహం శాశ్వతానందవిగ్రహః ।** (తేజోబిందు 3-37)

**మాయాక్లృప్తౌ బంధమోక్షౌ న స్తః స్వాత్మని వస్తుతః ।**

**యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాస వినిర్గమౌ ॥**

**బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః ।**

**అతస్తౌ మాయయా క్లృప్తౌ బంధమోక్షౌ నచాత్మని ॥** (ఆత్మోపనిషత్ 26 & 29)

ఈ ప్రకారముగా ఆత్మను ఆశ్రయించిన సద్వృత్తులను మరియు దుర్వృత్తులను ఆత్మ ఆశీర్వదించి అభయమిస్తుంది. అప్పుడు వృత్తులన్నీఉపశమించి శుద్ధబ్రహ్మముయొక్క చింతన చేస్తూ బ్రహ్మాకారమును పొంది జీవుడు స్వరూపసుఖమును పొందును.

స్వస్తి శ్రీసిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రముచే సకలపాపములు భస్మమై పోతాయి. శ్రీసద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు ఈ ఇరువది ఆరవ అధ్యాయమును శ్రీ శివదాస స్వామి సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధరూఢ చరణారవిందార్పణమస్తు







ॐ శ్రీ గణేశాయ నమః ॐ శ్రీ గురుభ్యోనమః ॐ శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది ఏడవ అధ్యాయము

పద్యానువాదము:—ఓసద్గురుసిద్ధనాథా! నీవు నిత్యముక్తస్వరూపుడవు. జీవులయొక్క భవభయమును సమూలముగా నివృత్తిచేసే అపారమైన దయగలవాడవు.నశ్వరమైన దేహాది ప్రపంచమునందుగల భ్రమను నివృత్తిచేసి షడ్రిపులను పారద్రోలి త్రిగుణాతీతుడవై (నిర్గుణ స్వరూపుడవై) ఉండిగూడా సగుణసాకారరూపమునుదాల్చి ఉదారమైన గుణముచేత భక్తుల యొక్క పాశరూప (కర్మరూప) బంధమును నివృత్తి చేయగలవాడవు. భక్తులందరికీ నిర్భయ-త్వమును ప్రసాదించే ఓ సిద్ధావతారా! నీకు సాష్టాంగ నమస్కారములు.

నిర్గుణనిరాకారస్వరూపుడవై యుండిగూడా భక్తులను ఉద్ధరించుటకై సగుణస్వ-రూపడవై అవతరించినావు. ఓ దీనబంధూ! ఓ దయాసాగరా! ఉదారస్వరూపుడవైన అభయ ప్రదాతా! ఓ సిద్ధారూఢ యతీశ్వరా! నీకు జయము జయము. నీయొక్క దివ్యనామమును స్మరించినంతమాత్రముననే పాపములు దశదిశలుపరుగెత్తుతాయి.అనగా సమూలంగా నష్ట మవుతాయి. భక్తులయొక్క ఈప్సితార్థములు(కోరికలు) సఫలమవుతాయి. భక్తులు ప్రేమచేత నీ దివ్యనామమును స్మరించి భజించుటవలన వారు వేరే ఇతర సాధనలు చేయకుండగానే నీ పాదపద్మములను ఆశ్రయించినందున వారి భవభయమును నివృత్తి చేసి, అధికారికి తగినట్లుగా ఇహపరసౌఖ్యములు ప్రసాదిస్తావు.జిజ్ఞాసవులకు జ్ఞానమును ప్రసాదించి తరింప చేస్తావు. నీయొక్క దివ్యమైన ముఖకమలముద్వారా వెలువడిన వాక్కులు అమృతముకన్నా తీపిగా ఉంటాయి.నీయొక్క సంభాషణమును శ్రవణముచేసినంతనే సకలపాపములు నివృ-త్తమై అంతఃకరణశుద్ధిగలిగి శాంతమైన నిశ్చలమైన బ్రహ్మానందము అనుభవమునకు వస్తుంది.

**శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనమ్।**
**సంభాషణం కోటితీర్థం వందనం మోక్షసాధనమ్॥**

నిత్య నిరామయ ఆనందమయుడవైన నీవు భక్తుల సుఖమే నీయొక్క సుఖముగా భావించి, వారికి పరమ సుఖమును ప్రసాదించుటకు అనేక ఉపాయములను శోధిస్తూ వారి సుఖముగూర్చి పరితపిస్తూ ఉంటావు.

ప్రతిసంవత్సరము సిద్ధాశ్రమమందు శ్రావణమాసమునందు మరియు శివరాత్రి సందర్భముగా ఏడు రోజుల సప్తాహ కార్యక్రమము నియమించి బ్రహ్మాండముగా ఉత్సవాలు జరుపుతారు. అఖండ భజన, కీర్తనలు, సత్సంగములు జరిగెడివి. ఆ ఉత్సవాలను దర్శించు-టకు లక్షలాదిమంది చుట్టుముట్టు గ్రామాలనుండి వచ్చి ఉత్సవకార్యక్రమములో పాల్గొనే వారు. వారందరికీ రోజుకు రెండు పూటలు భోజన సదుపాయము మఠములో ఏర్పాటు చేసేవారు. భక్తులందరూ స్నానముచేయుటకు, త్రాగుటకు మరియు వంటలకు వలసిన నీరు మఠముప్రక్కన ఉన్న కొలను (తటాకము)నుండి తెచ్చేవారు. ఆ కొలనులో వర్షము పడినచో నీరు ఉండేది, లేనిచో నీరు ఉండేది కాదు. ఒకవేళ ఏ కొద్దిపాటి నీరు కార్యక్రమమునకు తక్కువ పడినచో క్రోసు, రెండు క్రోసుల దూరమునుండి భక్తులు కష్టపడి తెచ్చి ఉత్సవము జరిపేవారు.

ఈ విధముగా ఒకానొక సంవత్సరమున వర్షములు కురియక కొలనులో నీరు లేక ఎండిపోయింది. శివరాత్రి ఉత్సవము సమీపిస్తుంది. ఒక చుక్క నీరు కూడా లేదు. ఇటువంటి పరిస్థితిని గమనించి దయాళువైన సద్గురు సిద్ధనాథుడు భక్తులతో ఇలా అంటాడు. ఓ సద్భక్తులారా! ఈ ఏడాది వర్షాలు పడనందున కొలనులో నీరు లేదు.ఉత్సవమునకు నీరు చాలా అవసరముంటుంది.అసంఖ్యాకమైన జనము వస్తుంది.కొలనులో నీరు అయితే లేదు. గతంలోనే ఏ కొద్ది నీరు తక్కువ పడితేనే ఎంతో ప్రయాసతో దూరమునుండి నీరు తెచ్చే వారు. ఇక ఈ ఏడాది పూర్తిగానే వర్షములు కురియక కొలనులో ఒక్క చుక్క నీరు కూడా లేదు. ఇక ఈ ఏడాది ఉత్సవమునకు వలసిన నీరు అంతయు దూరమునుండి మోసుకొని రావాలి అంటే దారుణమైన కష్టము కాగలదు. అందుకని నాయొక్క అభిప్రాయమును వినండి.నీరుతెచ్చుటకు చాలా కష్టమవుతుంది.కావున,ఈసంవత్సరము ఉత్సవముచేయుట మానుకోండి. ఉత్సవముచేస్తే అందరికీ ఉత్సాహము కలగాలిగాని,కష్టం కలిగించినట్లయితే బాగుండదు. అందుకనే ఈ ఏడాది ఉత్సవము చేయకండి.

ఇటువంటి సద్గురు వచనములను విని భక్తులు ఖిన్నులై, సద్గురుదేవుడు మమ్ములను పరీక్షింపగోరి గురుకార్యముచేయుటకు భక్తులు వెనుకంజ వేస్తారా? లేక ముందడుగు వేస్తారా? చూద్దామని సద్గురుదేవుడు మనలను ఇలా అన్నాడు. ఇందులో సంశయము లేదు–అని అనుకుంటారు.

అందులో ఒకానొక భేదవాది (తార్కికుడు) అంటాడు. ఏమయ్యా భక్తులారా! మీ సద్గురుదేవుడు సాక్షాత్ ఈశ్వరుడు, ఆయన సంకల్పము చేసినట్లయితే నెరవేరని కార్య-మంటూ ఉండదుగదా–అని అంటాడు. ఒకవేళ మీ సద్గురుదేవుడు పూజనీయుడైతే, సర్వశక్తి-

మంతుడైతే ఆయన సంకల్పముచేస్తే భూమిపై వర్షము కురుస్తుంది కదా! ఇక నీటిగురించి చింతిస్తున్నారేమీ? అని హేళనగా మాట్లాడుతాడు.

ఆ భేదవాదియొక్క పోటు మాటలు వినగానే "తుకప్ప" అనే భక్తునికి కోపమువచ్చి, వానితో ఇలా అంటాడు. ఒరేయ్ మూర్ఖుడా! మా సద్గురుదేవునియొక్క మహిమ తెలియలేక పిచ్చిగా వదరకు. మా సద్గురుదేవుడంటే ఎవరనుకున్నావు? ఆయన ప్రత్యక్షంగా నిర్గుణ నిరాకార పరబ్రహ్మస్వరూపుడు. ఈ సమస్తలోకాలకు (పిండబ్రహ్మాండములకు) అధిష్టాన స్వరూపుడు. సృష్టి స్థితి లయములు–అనే ఈ మామూలు కర్మలను చేయుటకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను నియమించి తాను నిరుపాధిక బ్రహ్మముగా ఉన్నాడు. భక్తులయొక్క ఉద్ధ-రణార్థము ఈవిధముగా సగుణరూపమును దాల్చి క్రీడిస్తున్నాడు. భక్తులయొక్క కర్మాను-సారము వారివారి వృత్తులుచేస్తూ సద్గురుదేవుని స్మరించినట్లయితే వారికి సుఖమును ప్రసాదిస్తాడు–అని ఆ సోమరునికి సమాధానము చెప్పి—

ఇక అక్కడున్న భక్తులందరూ ఇలా వారిలో వారు విచారించుచున్నారు. ఆపత్కా-లములోనే భక్తులు నిర్భయులై సద్గురుదేవుని విస్మరించక భక్తుల కార్యక్రమములో వెనుకంజ వేయకుండా గురుసేవ చేసినట్లయితే సద్గురుదేవుడు వారియందు ప్రేమతో కరుణగలవాడై భక్తుల సంకటములను బాపుతాడు. మనలో దృఢభక్తి, విశ్వాసము మరియు గురుకార్యము చేయుటకు దృఢనిశ్చయము ఉన్నదా? లేదా? అని పరీక్షించుటకు సద్గురుదేవుడు ఈ యుక్తిని పన్నినాడు. మన ప్రాణాలు పోయినా సరే–ఈ గురుకార్యములో వెనుకాడరాదు. నిశ్చయముగా తప్పకుండా చేసితీరాలి–అని"తుకప్ప"అందరితో విచారించగా, అప్పుడందరు భక్తులు "తుకప్ప" మాటలతో ఏకీభవించి, గురుకార్యము చేయుటకు నిశ్చయించుకున్నారు.

రెండవ రోజున భక్తులందరూ కలిసి తుకప్పను వారి నాయకునిగా ఎన్నుకొని, అందరూ కలిసి సద్గురుదేవునివద్దకు వచ్చి, వారి అభిప్రాయమును ఇలా వెలిబుచ్చుకున్నారు. ఈశ్వరావతారస్వరూపడవైన నీవు పామరులమైన మమ్ములనుద్ధరించడానికి అవతరించిన నీకు తెలియనిదంటూ ఏమీ లేదు. నిన్నటి రోజున నీవు శివరాత్రి ఉత్సవము చేయకూడదని ఆజ్ఞాపించినావు.దానిని మేము ఉల్లంఘిస్తున్నామని అనుకోకూడదు.మీరు మాయొక్క గురు భక్తిని పరీక్షింపగోరి అలా అన్నారు. ఈఉత్సవము లోకోద్ధరణ కోసము చేయబడుతుందే కాని, ఎవరి స్వార్థముకోసము కాదు. అటువంటి పుణ్యప్రదమైన గురుకార్యముచేసి గురు సేవలో పాల్గొనే సద్భాగ్యమును కల్పించండి స్వామీ!

ఒకవేళ ఈ సంధి సమయము తప్పిందా, ఇక మేము సంసారములో పడే గతి వస్తుంది. లక్షలాదిమంది దూరదూర ప్రాంతములనుండి వచ్చి గురుసేవలో పాల్గొని ఆ సేవా ఫలముచే ధన్యులవుతారు. కృతకృత్యులమైనామని ఎంతో తృప్తి పొందుతారు. అటువంటి

భక్తులకు ఈఉత్సవకార్యము నిలిపినచో,వారికి నిరాశ కలుగగలదు.భక్తులందరూ ఉద్ధరింప- బడాలనే సంకల్పము నెరవేర్చండి స్వామీ! ఈ సంవత్సరము నీరు లేనందున అధికముగా శ్రమపడి, అధిక సేవచేసి, అధిక పుణ్యము సంపాదించుకునే అవకాశము లభించింది. ఇటువంటి సదవకాశమును మాకు చేకూర్చండి స్వామీ! ఈ కార్యములో మా ప్రాణాలు పోయినా మేము వెనుకాడము. ఇందులో సందేహం లేదు. అశాశ్వతమైన ఈ శరీరము ఎన్నడో ఒకనాడు మట్టిలో కలిసేదే కదా! ఇటువంటి ధర్మకార్యములో సేవచేసే అవకాశము మళ్లీ దొరికేది కాదు. అందుకనే మేము ఈ నిర్ణయానికి వచ్చినాము.

**శ్లో॥ అనిత్యాని శరీరాణి విభవో నైవశాశ్వతః।**

**నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మ సంగ్రహః॥** (సుభాషితము)

కావున, ఓసద్గురుదేవా!ఈ లోకకళ్యాణార్థము జరుపబడే ఉత్సవమును చేయుటకు ఆజ్ఞను ఇవ్వండి స్వామీ! అని భక్తులందరూ పదేపదే సద్గురుదేవుని ప్రార్థించినారు. అప్పుడు వారి మాటలను ఆలకించి సద్గురుదేవుడు వారితో ఇలా అంటాడు.

సరే మీరు ఈ ప్రకారంగా దృఢనిశ్చయము చేసుకున్నట్లయితే మీయొక్క అభీష్టమే నెరవేరుగాక! ఎన్ని సంకటములు వచ్చినా ఈ ఉత్సవము నిర్విఘ్నముగా కొనసాగగలదు. అని ఇలా అంటూ స్వామి నవ్వి,ఈఉత్సవ కార్యభారము మీపై ఉంది.భక్తులయొక్క భారము నాపై ఉంది. ఇది తుది నిర్ణయము–అని సద్గురుదేవుడు గురుకార్యము చేయుటకు ఆజ్ఞను ఒసంగినాడు. కృపాపూర్వకమైన సద్గురుదేవునియొక్క వచనములను విని భక్తులందరూ ఆనందచిత్తులై సద్గురుదేవుని పదేపదే స్మరిస్తూ వారివారి ఇండ్లకు వెళ్లి పోయినారు. భక్తుల యొక్క ఆపద తన ఆపదగా, వారి సౌఖ్యమే తన సౌఖ్యముగా భావించుకునే సద్గురుదేవుడు దీనదయాళుడు–కాబట్టి భక్తులకు ఉత్సవముగూర్చి ఆజ్ఞ అయితే ఇచ్చినాను. కాని, నా భక్తులకు ఎంత కష్టమవుతుందో గదా! అని చింతించుకుంటూ కూర్చున్నాడు.

రెండవ రోజున స్వామి తనయొక్క అమృత హస్తములతో ఒక మట్టి పాత్రను తీసు- కొని బయలుదేరి, మఠమునకు ప్రక్కన ఉన్న కొలను వద్దకు వచ్చి, దాని మధ్యలోకి దిగి భూమిపై కూర్చొని, ఆ మట్టి పాత్రను తన దగ్గర ఉంచి, దానిపై చేయిపెట్టి మూడు ఘటికల సమయపర్యంతము అక్కడ కూర్చుని, తదనంతరము ఆ పాత్రను చేతులతో పట్టుకొని మళ్లీ సిద్ధాశ్రమమునకు వచ్చినాడు. ఆ మట్టి పాత్రను ఒక భక్తుడు చూసినాడు. అందులో జలము నిండి ఉంది.ఆయన అందరితోచెప్పగా అందరూ ఆశ్చర్యచకితులైనారు.కొలనులో ఒక్క చుక్క నీరు కూడా లేదు. స్వామి ఆ కొలనునుండి మట్టి పాత్రనిండా నీరు తీసుకొని వచ్చాడు. ఇది చాలా ఆశ్చర్యముగా ఉందని అనుకున్నారు.ఇది సద్గురుదేవుని మాహాత్మ్యమని తెలుసుకు- న్నారు. ఇంతలో ఆకాశంలో నలువైపులా మేఘములు క్రమ్మినవి. మెరుపులు మెరుస్తున్నవి.

మేఘములు గర్జించుచున్నవి. వర్షము పడుతుంది. అందరూ భక్తులు సంతోషించినారు. వారందరూ సద్గురుదేవుని వద్దకు వచ్చినారు. స్వామీ! వర్షము పడుచున్నది.మేము ధన్యులమైనాము. ఇదంతా మీయొక్క కృపయే కాని, వేరు కాదు-అని అన్నారు. వర్షము గొప్పగా కురిసింది. చుట్టూ కాలువనిండా నీరు ప్రవహించి కొలను,ఒక గంట సమయంలోనే నిండిపోయింది. "తుకప్ప" మరియు ఇతర భక్తులందరూ సంతోషము పట్టలేక నృత్యము చేయనారంభించినారు.

వారు సద్గురువుతో ఇలా అంటారు.స్వామీ! ఓ సద్గురునాథా! నీవు మమ్ములను పరీక్షించడానికి ఉత్సవము వలదని అన్నావు. కాని, మా ప్రార్థన అంగీకరించి మమ్ములను కృతకృత్యులను చేసినావు. ఈ కార్యమును నీవే చేపట్టి మమ్ములను ఆట ఆడిస్తున్నావు. అతి ఆనందంతో భక్తులందరూ పొంగిపోయినారు. సిద్ధనాథునితో సహా అందరూ కలిసి ఆ తటాకమువద్దకు వచ్చినారు. సద్గురుదేవునికి భక్తులు హారతి ఇచ్చినారు. స్వామికి జయ జయకారములు చేసినారు.

**శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి మహరాజ్ కీ జై....**

**శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి మహరాజ్ కీ జై....**

**శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి మహరాజ్ కీ జై....**

అప్పుడు ఏతార్కికుడైతే స్వామిని నిందించినాడో, ఆభేదవాది సద్గురుదేవుని ముందుకు వచ్చి స్వామీ! నిన్ను అనేక విధములుగా నిందించినాను.నన్ను క్షమించమని స్వామి పాదములను పట్టుకున్నాడు. అప్పుడు స్వామి అంటాడు. లే నాయనా! నీవు నిందచేయడము వల్లనే,ఈ"తుకప్ప"మొదలగు భక్తులకు రోషమువచ్చి ఉత్సవముచేయుటకు దృఢసంకల్పము చేసికున్నారు. ఈ భక్తులయొక్క కష్టము చూడలేక ఆ ఈశ్వరుడు వర్షము కురిపించినాడు. కాని, నాదేమీ లేదని సిద్ధనాథుడంటాడు. ఇప్పుడు ఉత్సవము చేయుటకు యోగ్యమైన పరిస్థితి ఏర్పడింది. నీయొక్క నిందయే సర్వులకు వందనీయమైనది. లేనిచో జనులందరూ క్షామముతో అలమటించేవారు. ఈశ్వరుడు నిందకులకు, వందకులకు అందరికీ సమాన ఫలమునే నిశ్చయముగా ఒసంగుతాడు. ఏరీతిగా ఈశ్వరుని చింతన చేసినాగాని, అందరిని తరింపజేయుటయే ఆ ఈశ్వరుని సత్యసంకల్పము. కొందరు నిందకమార్గమును అవలంబించి ఎల్లప్పుడూ ఈశ్వరచింతన చేసినారు.ఉదాహరణకు:–కంసుడు, శిశుపాలుడు,హిరణ్యాక్షుడు,హిరణ్యకశ్యపుడు,రావణుడు మొదలగువారు. కొందరు భక్తిమార్గమును అవలంబించి ధన్యులైనారు. ఉదాహరణకు:–ప్రహ్లాదుడు, ధృవుడు మొదలైనవారు.

**శ్లో॥ప్రహ్లాద నారద పరాశర పుండరీక**

**వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్।**

**రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్**

**"పుణ్యానిమాన్ పరమభాగావతాన్" స్మరామి॥** (పాండవగీత. 1)

మహాత్ముడైన సద్గురుదేవుని సద్గుణవిశేషమునుగాంచి ఆబాలగోపాలమంతా హృదయము ప్రేమతో ఉప్పొంగి కళ్ళవెంట ప్రేమాశ్రువులు రాల్చారు. సద్గురుదేవుడంటాడు– మీరందరూ అహర్నిశలు సద్గురునామస్మరణ చేస్తూ ఉండండి. మీయొక్క సంకటములు తొలగిపోతాయి.ఇందులో సందేహము లేదు.ఈప్రకారముగా సద్గురుదేవుడు భక్తులయొక్క పరీక్షార్థము లీలను ప్రకటముచేసి అవ్యాజకరుణాసముద్రుడగు సిద్ధనాథుడు భక్తుల కళ్యాణమునుగోరి వారిని క్షామమునుండి కాపాడినాడు. అందరిని నిత్యతృప్తులను చేసినాడు. ఇట్లు భక్తులకు ఎలాంటి ఆయాసములేకుండా వారికి ఆనందమును,శాంతిని ప్రసాదించినాడు. ఉత్సవము నిర్విఘ్నముగా జరిగింది.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును వినండి. ఏ ముముక్షువులైతే ఆధ్యాత్మవిచారమునందు తత్పరులై ఉంటారో, వారు నిత్య, నిరామయ, నిరంజన, ఆనందమయ పదవిని పొందుతారు.నిత్యతృప్తులవుతారు.ఏసాధకుడైతే వివేకాది సాధనసంపన్నుడై ఈభవబంధమునుండి విముక్తున్ని కావాలని పరితాపహృదయముతో శ్రోత్రియ,బ్రహ్మనిష్ఠుడగు సద్గురుదేవుని శోధించి శోధించి పుణ్యవశాత్తు సద్గురుదేవుని పొందిన తర్వాత ఆయనకు విధిపూర్వకముగా శరణాగతిని పొందినాంక, ఆ సద్గురుదేవుడు సాధకునియందు సంపూర్ణ సాధనసంపత్తి ఉందా? లేదా? అని పరీక్షంపగోరి సాధకుని ప్రలోభపెడతాడు. జ్యోతిశ్శాస్త్రము, మంత్రశాస్త్రము, ఆయుర్వేదము మొదలగు శాస్త్రములు నేర్చుకుంటే సుఖ జీవనము గడపగలరు. కాని, ఈ వేదాంత శాస్త్రములో ఏముందయ్యా–అని, నచకేతునికి యమధర్మరాజు ప్రలోభ పెట్టినట్లు, ప్రలోభ పెడతాడు.

**శతాయుషః పుత్రపౌత్రాన్వృణీష్వ, బహూన్పశూన్హస్తి హిరణ్యమశ్వాన్ ।**

**భూమేర్మహదాయతనం వృణీష్వ,స్వయంచ జీవ శరదోయావదిచ్ఛసి ॥**(కఠ.1-1-23)

అథవా, భయపెడతాడు.ఎట్లనగా, సకలజీవులు భవబంధ విముక్తులు కావాలంటే ఆనందరూప జలము (పరమానందము) కావాలి. అట్టి ఆనందరూపజలము మావద్ద లేదు. ఎవరికి వారే మోక్షస్వరూపులు. కావున, ఒకరిద్వారా పొందబడేది కాదు. ఒకవేళ మీకు పరమానందరూప జలము(మోక్షము)కావాలంటే ఆజలముతోనే మీరు నిత్య తృప్తులమవుతాము అని అనుకుంటే,మీరు దేహమును చాలాకష్టపెట్టండి. యోగాది సాధనలు తపము, జపము, కర్మ, ఉపాసన, తీర్థయాత్రలు, వ్రతములు మొదలగు సాధనలు చేయండి. ఇటు వంటి కఠిన సాధనలు చేసినప్పుడే ఆనందరూపజలము లభ్యమయి నిత్యతృప్తులై భవబంధ విముక్తులవుతారు.దీనికి వేరు ఉపాయము లేదు.లేనిచో ఈ సాధనలు కఠినమని అనుకు-

న్నట్లయితే మీరు తరించే కార్యము మానుకోండి. తద్వారా దేహదండనాదులు తప్పుతాయి. అన్యథా మార్గము లేదు–అని ఈప్రకారముగా సద్గురుదేవుడు సాధకుల పరీక్షార్థము భయ పెడతాడు.

ఏవిధంగా కథలో సకలజీవుల ఉద్ధరణార్థము జరిపే ఉత్సవకార్యమును నిలిపివే-యమని, చెరువులో నీరు లేదు. ఒకవేళ కార్యము చేయాలంటే పుష్కల జలము కావాలి. ఆ జలమును సంపాదించాలంటే దారుణమైన కష్టము భరించవలసి వస్తుంది. అందుకని ఈ సంవత్సరము ఉత్సవము చేయకండి–అని భక్తుల పరీక్షార్థము చెప్పినాడో, అదే ప్రకారముగా సద్గురుదేవుడు సాధకుని పరీక్షింపగోరి భయపెడతాడు. ఇటువంటి వచనములకు కొందరు బలహీన సాధకులు భయపడి నిజంగానే వారి సాధనలను మానుకొని ఆరూఢపతితులై మళ్లీ సంసార కూపములోనే దూకుతారు. కాని, సద్భావయుక్తమైన తీవ్రతర వైరాగ్యసంపన్నుడై, సంసారమునుండి తప్పకుండా ఈ దేహమున్నప్పుడే, ఈ కన్నులున్నప్పుడే, ఈ చెవులు-న్నప్పుడే, పరమాత్ముని దర్శించి పరమానందరూపజలమును గ్రోలి తరించుతాను–అని తీవ్రజిజ్ఞాస ఎవరికైతే ఉంటుందో, వారు ప్రలోభములకు భయమోహములకు లోబడక సాధన మార్గమునుండి చలించడు. సద్గురుచరణములే శరణ్యమని ఎవరు నిశ్చయముగా ఉంటారో, అటువంటి సాధకుని ఉత్తమ జిజ్ఞాసవుగా యెఱింగి, బ్రహ్మజ్ఞానమునకు అధికారి ఉన్నాడని ఎంచి, ఏకాగ్రతతో బ్రహ్మవిద్య (తత్త్వోపదేశమును) గావిస్తాడు. సద్గురుదేవుడు కరుణామయుడు. తనయొక్క భక్తుల కష్టములను సహించలేడు. ఏ విధంగా కథలో భక్తుల యొక్క కష్టము సహించలేక తనయొక్క మహిమచేత మేఘవిద్యను ప్రదర్శించి వర్షమును అనాయాసముగా కురిపించినాడో,అదే ప్రకారముగా ఉత్తమవిద్యార్థులైన వారిని ఏమాత్ర-ము కష్టపెట్టక అనాయాసముగా తత్త్వోపదేశముచేసి, భవబంధవిముక్తులను చేస్తాడు. బ్రహ్మ విద్యచేత పరమానంద రూపజలమును కురిపించి, తనయొక్క భక్తులను నిత్యతృప్తులను చేస్తాడు. వాస్తవముగా తత్త్వజ్ఞాన సంపాదనయందు ఎలాంటి కఠినమైన సాధనలు అవస-రము లేవు. కేవలము సద్గురుదేవుని చరణకమలములను భక్తిశ్రద్ధలతో ఆశ్రయించినట్ల-యితే ఆ సద్గురుదేవునియొక్క అపారమైన కృప సమృద్ధిగా మనపై కురిపించి, ఆ సద్గురు దేవుడే మనలను అనాయాసముగా మన కష్టములను దూరముచేసి భవసింధువునుండి తరింపజేస్తాడు. దేహదండనాదులద్వారా యోగము, తపము, జపము, కర్మ, ఉపాసన, తీర్థయాత్రలు, వ్రతాదుల ద్వారా పరమానందరూప జలము (మోక్షము) లభించదు.

**నాస్త్యకృతః కృతేన, న కర్మణా, న ప్రజయా, న ధనేన త్యాగేనైకేఽమృతత్వ-మానుషుః॥** (మహానారాయణోపనిషత్)

జీవులు వాస్తవముగా అవశ్యముగా చేయవలసిన కార్యము తత్త్వజ్ఞాన శోధన. అటువంటి కార్యసాధన (మోక్ష సాధన) కోసము సకలజీవులయందు దయదలచి, కృపా సాగరుడైన సద్గురుదేవుడు,వారి కార్యమును తానే స్వయంగా చేపట్టి తనను శరణుజొచ్చిన వారిని విడువకుండా తప్పకుండా తరింపజేసి పరమానందమును (మోక్షమును) ప్రసాదించి, నిత్యతృప్తులను చేస్తాడు.

ఇప్పుడు రసాలమైన ముందర అధ్యాయములో సుగమోపాయరూప చరిత్రను శ్రవణము చేసినట్లయితే భవాబ్ధినుండి తరించగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రమున సకలపాపములు నష్టమవుతాయి. శ్రీసద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు శ్రీశివదాసస్వామి ఈ ఇరవై ఏడవ అధ్యాయ-మును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది ఎనిమిదవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురు సిద్ధరాయా! నీయొక్క దివ్యమైన పాదారవిందములకు ప్రణమిల్లుచున్నాను. నీయొక్క భక్తులను ఉద్ధరించుటకై నీవు సగుణరూపముగా అవతరించినావు. సకల భక్తులకు నీయొక్క దివ్యమైన దేహము ఆశ్రయిస్థానమైనది. వారియొక్క యోగక్షేమములు నీవు స్వయముగా వహించి, సత్యమును తెలియపరచి అనేక మముక్షువులు వారియొక్క స్వస్వరూపమును యథార్థముగా తెలుసుకొని ఈ భవసాగరమునుండి తరించునట్లుగా అనుగ్రహించినావు.

మంగళస్వరూపుడవైన ఓ సద్గురుదేవా! నీకు జయము జయము. భక్తులయొక్క ఆత్మారామస్వరూపుడవైన ఆత్మకాముడవు. అటువంటి నీకు శిరసా ప్రణామములు. ఏ విధముగా ప్రజ్వలించుచున్న అగ్ని ఎండుకట్టెలను, పచ్చి కట్టెలను రెంటిని భస్మము చేయునో, అదే ప్రకారముగా జ్ఞానాగ్నిద్వారా (సంచిత ఆగామి ప్రారబ్ధ) సర్వకర్మలు భస్మమై పోతాయి.

**శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।**

**జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా** ॥ (గీత. 4-37)

ఏ ప్రకారంగా కులాలుడు సంవత్సర పర్యంతము శ్రమపడి కుండలు తయారుచేసిన, వాటిని ఒక దండద్వారా ప్రహారము చేసినచో కుండలన్నీ ఒక్క క్షణములో మృత్తిక రూపమగునో, అదే ప్రకారముగా అనాదికాలమునుండి అవిద్యోపాధిగల సంసారరూప జాల (వల)యందు చిక్కుకున్న జీవున్ని జ్ఞాన దండచే ప్రహారము చేసినచో అవిద్యోపాధి తొలగి పోయి జీవుడు చైతన్య స్వరూప పరబ్రహ్మముగానే అవశిష్టమై యుండును.ఉదా:–దండ ప్రహారముచే ఘటములు పగిలిపోయి వాటియందు ప్రతీతియయిన వ్యష్టి వ్యష్టి ఘటాకాశములన్నియు సమిష్టి మహాకాశస్వరూపమేయగునట్లు, జీవుడు పరమాత్మ స్వరూపుడే యగును.

**జీవుడే ఈశ్వరుండు తలపోయ జీవుడే పరమాత్మయు,**

**జీవుడను భ్రాంతి విడువ నఖిలంబు శివుడౌను రామ రామ.** (రామ రామ శతకము)

అట్టి జ్ఞానము సద్గురుదేవుని అమృతహస్తము మరియు శ్రీముఖకమలముయందు వసించి ఉంటుంది.ఎవరైతే సద్గురుదేవునికి శరణుబొంది, ఆయన దివ్యమైన పాదారవిందముల నాశ్రయిస్తారో,వారికి సద్గురుదేవుడు అమృతస్వరూపమైన జ్ఞానమును ప్రసాదిస్తాడు.

అటువంటి జ్ఞానం వల్లనే అజ్ఞానము, తత్కార్యరూప దేహాదిక ప్రపంచము నివృత్తమై యథార్థముగా ఆత్మస్థితిని పొంది, ఈ సకల జగత్తును ఆత్మ రూపముగానే దర్శిస్తాడు.

**శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**

**ఈక్ష్యతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః ॥** (గీత 6-29)

యథార్థముగా ఆత్మరూపమును దర్శించిన తర్వాత సకలదృశ్యజాలమును అభేద దృష్టితో వీక్షిస్తాడు. నాకంటె అన్యమైనది మరొకటి లేదు. ఏవిధంగా తన దేహమందలి సర్వాంగములు భిన్నభిన్నముగా ప్రతీతియైనప్పటికిని తన దేహస్వరూపముగానే ఉన్నాయో, అదేవిధముగా దృశ్యప్రపంచమంతయు తనస్వరూపముగానే దర్శిస్తాడు. అతనిని ఎవరు నిందించినా, స్తుతించినాగాని ఎవరిపై రాగముగాని, ద్వేషముగాని ఉండదు. కామమైతే ఆయన యందు అసంభవము.

**శ్లో॥ యస్సర్వత్రాఽనభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।**

**నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** (గీత 2-57)

ఇటువంటి యథార్థమైన జ్ఞాని మహాత్ముని ఎవరు ఆశ్రయించి అఖండముగా (నిత్య నిరంతర ఆదరణీయముగా-తైలధారావత్) ఆయనతో సంబంధము పెట్టుకుంటారో, అటువంటి ముముక్షువులు నిశ్చయముగా భవాబ్ధినుండి తరింపబడతారు.ఈప్రకారముగా సద్గురుదేవుడు భక్తులను ఉద్ధరించే నిమిత్తము అనేక లీలలు ప్రదర్శించి భక్తులను ధన్యులను చేస్తాడు. ఎవరైతే దయాసాగరుడైన సద్గురుదేవుని ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉంటారో, వారికి సద్గురుదేవుడు ఎల్లవేళలా అండగా నిలిచి సంకటములనుండి రక్షిస్తాడు.

ఈ విధముగా ప్రతిరోజు ప్రాతఃకాలముననే భక్తజనులు సద్గురుదేవుని వద్దకు వచ్చి భజనలు,కీర్తనలు గావించి, తదనంతరము స్వామికి మంగళహారతి ఇచ్చేవారు. భక్తజనులను ప్రాతఃకాలమున మేల్కొల్పుటకొఱకై ఒకానొక భక్తుడు, భక్తుల ఇండ్లకు వెళ్లి బ్రహ్మముహూర్తముననే మేల్కొల్పేవాడు.ఆ భక్తుడు భక్తుల ఇండ్లముందు "**ఓంనమఃశ్శివాయ**"అని భగవన్నామోచ్చారణ చేస్తూ నిలబడేవాడు. ఆ ఇంట్లోని భక్తులు లేవనిదే వేరొక ఇంటికి పోయేవాడు కాదు. ఇట్లు, ఆ భక్తుడు "**శివాయనమః**" అంటూ భగవన్నామమును జపిస్తూ భక్తులను జాగృతిచేసేవాడు. కావున, భక్తులు ఆయనను "**శివాయ నమః**" అని అదే పేరుతో పిలిచేవారు.అప్పటినుండి ఆయనపేరు "**శివాయ నమః**".ఆయన నిమిత్తముచే భక్తులందరూ సకాలమునకు బ్రహ్మముహూర్తముననే లేచి సద్గురుదేవుని వద్దకు వచ్చి భజన, కీర్తనలలో పాల్గొనేవారు. ఆ భక్తుడు భక్తతత్పరుడై ఇతరులకు ఉపకారము చేస్తూ శ్రద్ధతో నియమము తప్పకుండా భక్తులందరినీ నిద్రనుండి మేల్కొల్పి భజనచేయుటకు సహకరించేవాడు.అందుకని ఆయన అందరికీ ప్రీతిపాత్రుడైనాడు. చిమ్మనచీకటి ఉన్నప్పటికైనా ముమ్మరముగా

వర్షము కురుయుచున్నప్పటికిని లెక్కచేయకుండా సకాలముకు బ్రహ్మముహూర్తమున భక్తులను జాగృతిచేసేవాడు. ఇలా జరుగుచుండగా ఒక రోజు రాత్రి జరిగిన సంఘటన వినండి—

"**శివాయ నమః**"అనే భక్తుడు భక్తులనులేపుటకు నామోచ్చారణగావిస్తూ బయలుదేరి పోతున్నాడు. ప్రాతఃకాలము అయినదేమోనని భ్రమపడి మధ్యరాత్రిలేచి నిత్యనియమాను-సారముగా భక్తుల ఇండ్లముందు ద్వారమువద్ద నిలబడి నామగర్జన చేస్తున్నాడు.అదే సమ-యానికి ఇద్దరు గస్తీసిపాయలు ఊరిలో కాపలా కోసము తిరుగుతున్నారు. వారు "శివాయ నమః" ను చూసి ఆయనవద్దకు వచ్చి, ఆయనను నిలిపి, ఎవరు నీవు? అని అడిగినారు.ఈ మధ్యరాత్రి వీధుల్లో తిరుగుతూ నిద్రలో ఉన్నవారిని మేలుకొలుపి, ఊరకే అరుచుకుంటూ లోకులకు నిద్రాభంగముచేసి వారికి విక్షేపము కలిగిస్తున్నావు. ఇక్కడనుండి ఒక్క అడుగు కూడా ముందుకు వేయకుండా వెనక్కి తిరిగి వెళ్ళిపో! అని ఆ సిపాయిలు బెదిరించారు.

వారి మాటలు చెవిని పెట్టకుండానే నామగర్జన చేస్తూ "శివాయ నమః" ముందుకు వెళ్ళిపోతున్నాడు. అప్పుడు ఆ ఇద్దరు సిపాయిలకు కోపమువచ్చి ఆయనను పట్టుకొని, (చౌకీ)చావడి వద్దకు తీసుకుపోవుటకు సిద్ధపడి చేతులు బంధించినారు. అయినాగాని ఆ భక్తుడు నామగర్జన "శివాయ నమః" అంటూ ఉచ్చారణ చేస్తూనే ఉన్నాడు. అది గమనించి ఈయన నోరు మూయించుదామని, ఆ సిపాయిలు "శివాయ నమః"యొక్క నోటిలో నిండా వస్త్రములు నొక్కి చౌకీ వద్దకు తీసుకుపోవుచున్నారు.

భక్తులయొక్క కార్యములో నిమగ్నుడై,ఎవరికీ ఏఅపచారము చేయని నా భక్తుడిని మూర్ఖులు బంధించినారని భక్తవత్సలుడైన ఆ సద్గురుదేవుడు లేచినాడు. ఏ నేరము చేయని వాడిని అన్యాయముగా నిర్దయులై బంధించి పుణ్యకార్యములో విఘ్నము కల్పించినారని సద్గురుదేవుని హృదయము ద్రవించి, వెంటనే ఫోజుదారు వేషము ధరించి గుర్రముపై స్వారీచేస్తూ సిద్ధనాథుడు వారి ముందు ప్రకటమైనాడు.

ఫౌజుదారునుచూసిన తత్క్షణమే ఆసిపాయిలు ఆయనకు నమస్కారములు చేసినారు. అప్పుడు ఫౌజుదారు వారిని అడుగుతాడు. ఈయన యెవరు? ఎక్కడ-ఏమి చేసినాడని ఇతనిని బంధించినారు. మాట్లాడకుండా నోట్లో వస్త్రమును ఎందుకు నొక్కినారు? చెప్పండి. అని భయపెట్టినాడు. అప్పుడు సిపాయిలు సమాధానమిస్తూ–ఆయన ఈ మధ్యరాత్రి సమ-యమున బాగుగా కేకలువేస్తూ వీధులవెంట తిరుగుతూ ఇంటింటికి వెళ్లి లోకులకు నిద్రా భంగము కలగజేస్తున్నాడు.ఎంత చెప్పినా మా మాటలు లెక్కచేయకుండా అదే ప్రకారముగా భయంకరముగా "శివాయ నమః" అంటూ గర్జన గావిస్తూ లోకులకు నిద్రాభంగము కలగ జేస్తుంటే మేము ఈయనను బంధించి నోట్లో వస్త్రములు పెట్టినాము. ఈయనకు తగిన శిక్ష

ఇవ్వనిదే ఈయన పట్టువిడిచేలాగా లేడని చౌకీవద్దకు తీసుకువస్తున్నాము–అని సిపాయిలు అంటారు.

అప్పుడు ఫౌజుదారు వారితో ఇలా అంటాడు. ఒరేయ్? మీరు విచారించకుండా తొందరపడి ఈయనను బంధించినారు. చేతులువిడిచి, నోటిలోని వస్త్రమును తీసివేయండి. ఈయన దొంగకాదు. మీరుచేసే పనియే ఆయన చేస్తున్నాడు. మీరు రాత్రియందు గస్తీ తిరుగుతూ "హోషియార్ హోషియార్" అని లోకులను నిద్రపోకుండా మెలుకువ చేస్తారు. జీతాలు తీసుకొని వదరుతుంటారు. అదే ప్రకారంగా ఈయన లోకులను ఏ జీతభత్యము లేకుండానే ఈశ్వరనామోచ్చారణ చేస్తూ అందరిని నిద్రనుండి మేలుకొలుపుతున్నాడు. మీరు ఊరికే వదరుతూ బయట దొంగలనుండి లోకులను రక్షిస్తే, ఈయన ఈశ్వరుని నామో-చ్చారణచేస్తూ బయటదొంగలే కాకుండా లోనిదొంగల (కామ క్రోధ లోభాదుల) నుండికూ-డా ప్రజలను రక్షిస్తున్నాడు. ఈ ప్రకారముగా లోకోపకారము చేస్తున్న ఈ సద్భక్తున్ని వ్యర్థ-ముగా పీడించి బంధించినారు. వెంటనే ఈయనను బంధవిముక్తిని చేయండి. ఇకముందు ఎన్నడు కూడా ఈయనకు ఎలాంటి బాధ(ప్రతిబంధకము) కలిగించవద్దు–అని ఫౌజుదారు ఆ సిపాయిలను శాసిస్తాడు.

ఫౌజుదారుయొక్క వచనములను విని ఆ సిపాయిలు మారు మాట్లాడకుండా"శివాయ నమః"ను విడుదలచేసినారు. తదనంతరము వారి పనులలో వారు నిమగ్నులైనారు.అప్పుడు ఆ ఫౌజుదారు "శివాయ నమః"తో ఇలా అంటాడు. నీవు నిస్సంకోచముగా నీయొక్క భక్త కార్యములో చేరుము.ఇకనుండి నిన్ను ఎవరు ఏమి నిరోధించరు–అని పలికి, ఫౌజుదారు మెల్లమెల్లగా ముందు ముందుకు వెళ్లి చీకటిలోకి కనబడకుండా పోయినాడు. "శివాయ నమః" తత్క్షణమే తన పనిలో యథాప్రకారంగా చేరినాడు.

మరుసటి రోజున సిపాయిలు ఉదయముననే వారి కార్యాలయమునకు వచ్చి, అధికారి యగు పౌజుదారుకు క్షమాపణ చెప్పుకుంటారు. అయ్యా! మేము పొరపాటున రాత్రి అపరాధము చేసినాము. సద్భక్తుడైన వాణ్ణి పీడించినాము. మమ్ములను క్షమించుము–అని క్షమాభిక్షను కోరుకుంటారు. అప్పుడు ఫౌజుదారు ఆశ్చర్యపోయి, వారితో ఇలా అంటాడు. ఏమయ్యా! మీరు ఏమి అపరాధము చేసినారు? ఎందుకు మిమ్ములను క్షమించాలి?

అప్పుడు సిపాయిలు అంటారు. అయ్యా! నీకు అంతా తెలుసు. మేము నిన్నటి రాత్రి ఒక భక్తుడు ఇల్లిల్లూ తిరుగుతూ అందరికీ నిద్రాభంగము చేస్తూ, వీధులవెంట అరచుచుంటే, ఆయనను మేము బంధించగా నీవు వచ్చి మమ్ములను కోపించి, ఆయనను విడుదల చేయించావు–అని ఈ ప్రకారంగా సిపాయిలు చెప్పేసరికి—

ఆ ఫౌజుదారు ఆశ్చర్యపోయి ఇలా అంటాడు–ఇదేమిటండీ,నేను రాత్రి మీకు కలవడమేమిటి? మిమ్ములను కోపించడమేమిటి? ఇదంతా నాకేమీ అర్థము కావడం లేదు. నేనైతే నిన్నటి రాత్రి మా ఇంట్లోనే హాయిగా నిద్రపోయాను. అసలు రాత్రి ఏమి జరిగింది? అని ప్రశ్నించగా ఆసిపాయిలు జరిగిన వృత్తాంతమంతా తెలిపినారు. అప్పుడు ఆముగ్గురు ఖిన్నులై ఆశ్చర్యపోయి, వారిలో వారు విచారించుకొని, దీనిలో ఏది నిజమో ఏది అబద్ధమో వాస్తవము తెలుసుకోవాలంటే సిద్ధాశ్రమమునందు సద్గురుదేవుడున్నాడు. ఆయనను విచారించినచో సత్యము బోధపడుతుంది–అని నిశ్చయించుకొని,ఆ ఫౌజుదారు ఇద్దరు సిపాయిలను వెంటబెట్టుకొని ఆశ్రమమునకు వచ్చేసరికి, సద్గురుదేవుని సాన్నిధ్యములో "శివాయ నమః" కూర్చొని ఉన్నాడు. అప్పుడు ఆ ముగ్గురు సద్గురు సిద్ధారూఢస్వామికి సాష్టాంగ నమస్కారములుచేసి, రాత్రి గడిచిన చరిత్రను అంతా విన్నవించుకొని, వారి సమస్య నివృత్తి కోసము స్వామిని ప్రార్థించినారు.

భక్తవత్సలుడైన సద్గురుదేవుడు భక్తుల ఆపదలను తీర్చుటకు ఏ రూపములోనైనా రావచ్చు."శివాయ నమః"ను రక్షించుట కొఱకై ఫౌజుదారు వేషముతో వచ్చినాడు కాబోలు. ఇదంతా సద్గురు దేవుని మహిమదప్ప మరేమీ లేదు–అని సద్గురుదేవుడు నిరభిమానముగా అంటాడు. ఇట్టి వచనములను విని అందరూ ఆనందమునొంది భక్తియుక్తముగా స్వామికి నమస్కరించి సద్గురుదేవుని ఆశీర్వాదమును పొంది, ఆజ్ఞను తీసుకొని వెళ్ళిపోయినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క అద్భుతమైన ఆధ్యాత్మిక సంబంధమైన లక్ష్యార్థమును సావధానముగా వినగలరు. జీవుడు స్వస్వరూప విస్మృతిని పొంది, అజ్ఞాన రూప రాత్రియందు మూఢగ్రస్తుడై నిద్రిస్తున్నాడు. నిద్ర–సకల జీవులను ఆవరించుకొని ఉంది. ఈ అజ్ఞానరూప నిద్రనుండి మేల్కొనడానికి వివేకము జాగృతి కావాలి. అట్టి వివేకము ఉదయించాలంటే సద్గురుదేవుని కృప అత్యవసరము. ఆయన కృపచేతనే జీవునియందు వివేకము ఉదయించి, స్వస్వరూప ప్రత్యగాత్మను పొందడానికి సాధ్యమవుతుంది. అందుకే సద్గురుదేవుడు అజ్ఞానరూప నిద్రనుండి మేలుకొలుపుటకై "శివాయ నమః" అనే వివేకమును ప్రసాదిస్తాడు.

**"ఉత్తిష్ఠ జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత । క్షురస్య ధారా నిశితా దురత్యయా,**
**దుర్గం పథస్తత్కవయో వదన్తి ॥** (కఠ.1-3-14)

ఓ జీవులారా! మేలుకోండి! లేవండి! శ్రేష్ఠపురుషులను ఆశ్రయించి ప్రత్యగాత్మను తెలుసుకోండి. అజ్ఞానరూప రాత్రినుండి మేలుకొని మీ మీ స్వస్వరూపాన్ని యథార్థముగా తెలుసుకొని, మహాభయంకరమైన ఈ సంసారమునుండి తరించండి–అని సద్గురుదేవుడు జీవులపై దయగలిగి జాగృతి చేస్తాడు. ఈ ప్రకారంగా సద్గురుదేవుని కరుణతో వివేకము

ఉదయించి సాధకుడు పరమార్థరంగములో ముందడుగు వేస్తుంటే (ప్రవృత్తి అవుతుంటే) అప్పుడు మతవాదిరూప (భేద బుద్ధి) సాధనల నుండి విచలితున్నిచేసి పతనము గావిస్తుంది.

అజ్ఞానరూప నిద్రయందే (శబ్ద స్పర్శ రూప రస గంధాదులయందే) సుఖముంది. ఈ సుఖము ఎక్కడ లేదు. మహాత్ముల వచనములను వ్యర్థముగా ఆలకించకండి–అని భేదబుద్ధి, వివేకమును నోరుమూయించి భ్రష్టున్ని చేస్తుంది.

**శ్లో ॥ ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః ।**

**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥** (వే.పం. ౯-43)

విషయాసక్తి, బుద్ధిమాంద్యత, కుతర్కము, బేదవాదుల వచనాలపై విశ్వాసము ఇవి జ్ఞానసాధనకు ప్రతిబంధకములై సాధకున్ని ఆరూఢపతితున్ని చేస్తాయి. ఈ ప్రకారముగా మతవాదిరూప భేదబుద్ధి సాధకున్ని పరమార్థ పథమునుండి నివృత్తి చేస్తుండగా, అప్పుడు సద్గురుదేవునికి దయగలిగి వేదాంతరూప ఫౌజుదారు వేషములోవచ్చి మతవాదిరూప భేదవాదులను (ద్వైతవాదులను) ఖండించి, కట్టుబడిన జీవున్ని విడుదలచేస్తాడు.

**తావద్గర్జన్తి శాస్త్రాణి జమ్బుకా విపినే యథా ।**

**న గర్జతి మహాశక్తిర్యావద్వేదాన్త కేసరీ ॥**

ఎట్లు, అడవిలో సింహము గర్జించనంతవరకు నక్కలు కూస్తూ ఉంటాయో, అట్లే, వేదాన్తశాస్త్రరూప సింహము గర్జించనంతవరకు సాంఖ్య,యోగ,న్యాయాది భేదవాదిరూప నక్కలు కూస్తూ ఉంటాయి.

నీవు బద్ధుడవు కావు, నిత్యముక్తుడవు. షడ్రిపులబారినుండి ఎల్లప్పుడూ అప్రమత్తంగా సురక్షితముగా ఉండవలసింది–అని జాగృతిచేసి స్వస్వరూపాన్ని దర్శింపచేస్తాడు షడ్రిపురూప దొంగలు వివేకమును హరించి ఆత్మజ్ఞానమునకు అడ్డు నిలుస్తారు.వారినుండి నీవు తప్పించుకొని జాగ్రత్తగా వివేకమును కాపాడుకొని ఆత్మజ్ఞానమును పొందుము. వేదముయొక్క ఆజ్ఞను పాటించుము–అని వేదాంతరూప సద్గురుదేవుడు బోధిస్తాడు.

**శ్లో॥ కామ క్రోధం చ లోభం చ దేహే తిష్ఠన్తి తస్కరాః ।**

**జ్ఞానరత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥** (జీవప్రబోధ శ్లోకము)

మతవాదులవలన బంధింపబడిన వివేకహీనుడైన జీవుని సద్గురుదేవుడు జాగృతి చేసి మళ్లీ వివేకమును ప్రసాదించి, సాధనలయందు ప్రవృత్తుని చేస్తాడు. పరిపూర్ణమైన ప్రత్యగాత్మ స్వరూపము పొందింప చేస్తాడు.

ఈ ప్రకారముగా సద్గురు సిద్ధనాథునియొక్క విలాసరూప లీలా విశేషములు ముందర అధ్యాయమునందు రసయుక్తముగా ఉంటాయి. భక్తి శ్రద్ధలతో సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. స్వస్తి శ్రీ సద్గురుసిద్ధారూఢ కథామృత శ్రవణము చేసినంత మాత్రముననే సకల

పాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురుసిద్ధారూఢ పాదారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ఇరువది ఎనిమిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

పద్యానువాదము:–ఏ సద్గురుదేవునియొక్క కృపచేత పరబ్రహ్మాస్వరూపమును యథార్థముగా తెలుసుకొని ఐక్యభావమును పొందితినో, అటువంటి సగుణసాకార స్వరూపుడైన సిద్ధమూర్తిని నా హృదయమందు స్థాపించుకొని ఎల్లప్పుడు స్మరిస్తూ ఉంటాను.(వాచ్యార్థము)అనన్యఆత్మ భావముతో గురు(వ్యాపక)స్వరూపమైన ఆ పరబ్రహ్మముయందే ఐక్యమై(లీనమై) ఎల్లప్పుడూ ఉంటాను. త్రిపుటీ-భానరహిత అఖండ బ్రహ్మాకార స్థితియందే ఎల్లప్పుడు రమించియుండగలను.(లక్ష్యార్థము)

సచ్చిదానంద పరిపూర్ణ స్వరూపుడైన సద్గురుదేవుని దివ్యపాదారవిందములను ఆశ్రయించి ఎవరు అఖండముగా సద్గురుదేవుని వారి చిత్తమందు స్మరిస్తూ ఉంటారో, వారియొక్క అంతఃకరణము శుద్ధమై(మలదోషరహితమై)సంశయ, విపరీత జ్ఞానములు తొలగి స్వస్వరూపమును పొందుటకు అధికారి కాగలుగుతాడు. హరిహరాదులు కోపించినట్లయితే సద్గురుదేవుడు చేరదీసి సంరక్షిస్తాడు. ఒకవేళ సద్గురుదేవుడే ఉపేక్షించినచో వారిని రక్షించేవారు ఎవరునూ లేరు.

**శ్లో॥ శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన।**
**లబ్ధ్వాకులగురుం సమ్యగ్గురుమేవ సమాశ్రయేత్ ॥** (గురుగీత)

ఒకవేళ సద్గురుదేవుని కృప కలుగనట్లయితే ఈదేహము ఉన్నా లేకున్నా ఒకటే.అనేక దుఃఖములకు, సంతాపములకు నిలయమవుతుంది. ఈ దుఃఖములనుండి రక్షించే ఆప్తులే ఉండరు. ఒక వేళ సంసారసాగరమునుండి తరించాలనే తాపత్రయముతో సద్గురు అన్వేషణ చేస్తున్నప్పుడు సద్గురు దేవుడు లభించక కదాచిత్ శరీరము పడిపోయినయెడల అనతికాలములోనే మళ్లీ ఈ మానవ జన్మ లభించి పూర్వ అభిలాష పూర్తి కాగలదు. ఒక జన్మలో సద్గురు కృప కలుగకున్నయెడల వేలకొలది జన్మలైనా పొందుటకు వెనుకాడక ఆయన పాదపద్మములను నా అంతఃకరణమందు నిలుపుకొని ఉంటాను. ఒకవేళ సద్గురుదేవుని కృప గలగకున్నచో,ఏవిధముగా చాతకపక్షి మేఘము వర్షించినప్పుడే ఆ వర్షపునీరు క్రింద పడకముందే ఆ నీటిని గ్రహిస్తుంది. కాని, భూమిమీద పడిన నీటిని తన ప్రాణం పోయినాసరే కాని త్రాగదు. ఎన్ని రోజులైనా మళ్లీ ఆ మేఘము వర్షించినప్పుడే ఆ వర్షపు నీటిని మాత్రమే త్రాగుతుంది. అదేవిధంగా ఎన్ని జన్మలైనా ఎత్తగలను. కాని, నాకు ఆ సద్గురుదేవుని కృప మరియు ఆశీర్వాదమే కావాలి–కాని, మిథ్యయగు ప్రాపంచిక విషయములను అనుభవించను.

ఏ విధంగా తల్లి తన బిడ్డడు తన చెంత లేకున్నప్పటికీ నా బిడ్డడు ఎక్కడున్నాడో, ఎక్కడ ఆడుతున్నాడో,వానికి ఆకలేస్తుందేమో అనే బెంగ తల్లికి ఉంటుందో, అదే ప్రకారము సద్గురుదేవు-డవైన నీవు నీ భక్తుడు సమీపమున లేకున్నాగాని, నా భక్తుడు వృథాగా వ్యర్థమై జననమరణరూప సంసారములో కొట్టుకుపోతాడేమోయని వానిపై కరుణజూపి రక్షిస్తావు.దేహరక్షణకోసము నీవుచేసే (చూపే)కరుణ నిజమైన కృప కాదు. భోగభాగ్యములు, ఐశ్వర్యములు ప్రసాదించడము నిజమైన కృప కాదు. వాటిని కోరుకుంటే మేము నిజమైన భక్తులము, శిష్యులమూ కాము. స్వస్వరూపాన్ని దర్శింపజేసే దేహాతీత స్థితిని ప్రసాదించినప్పుడే నీయొక్క యథార్థమైన కృప మాపై కలిగినట్లు. అదే నిజమైన కృప. ఓ శ్రోతలారా! ముందర కథానుసంధానమును శ్రీ సద్గురుదేవుడే స్వయముగా చెప్పుచున్నాడు. భక్తిశ్రద్ధలతో ఏకాగ్రచితులై శ్రవణము చేయగలరు.

సిద్ధాశ్రమమునందు దూరప్రాంతములనుండి వచ్చిన భక్తులయొక్క వసతినివాసము కొఱకు క్రొత్తగా ధర్మశాల నిర్మాణము ప్రారంభించినారు. ప్రతిరోజు అనేకమంది భక్తులు వచ్చి సద్గురుసేవా-రూపముగా ధర్మశాల నిర్మాణకార్యంలో పాల్గొని అద్భుతంగా సేవచేస్తున్నారు. భక్తులు ఒకరి కంటే ఒకరు ముందుకువచ్చి కష్టించి చాలా చక్కగా పనిచేస్తున్నారు. సద్గురుదేవునియొక్క సేవ లభిస్తుందో లేదో అనే భీతిచేత తప్పకుండా సద్గురు సేవలో పాల్గొనవలెనని నిశ్చయించుకొని త్వరత్వరగా అందరిని జరుగు జరుగు మంటూ అందరిని త్రోసుకుంటూ "శివప్ప" అనే భక్తుడు ముందుకు వెళ్ళినాడు. ఎవరు పట్టుకొనక ముందే "శివప్ప" నిచ్చెనను వేగముగా ఎక్కుతూ చివరిమెట్టు వరకు చేరబోతుండగా,ఆ నిచ్చెన అకస్మాత్తుగా జారి, శివప్ప పైనుండి క్రిందకు విరుసుకు పడ్డాడు. రాళ్లతో కట్టిన అరుగుయొక్క అంచుపైన"శివప్ప"యొక్క తల గుద్దుకొని,వెంటనే మూర్ఛితుడై పడిపోయి-నాడు. ఆ సమయములో సద్గురుదేవుడు అక్కడే ఉన్నాడు. జరిగిన సంఘటనను తానే మొదలు చూసినాడు. ఇతర భక్తులుకూడా చూసి అందరూ వచ్చి"శివప్ప"గతిని గమనించారు. "శివప్ప"క్రింద పడినాడు.ఆయనపై నిచ్చెన పడింది.శరీరము రక్తమయమైంది.ఒకానొకడు నిచ్చెనను లేపి దూరంగా పెట్టినాడు.శివప్పయొక్క శరీరము గొప్పగా గాయపడినది.సర్వాంగములు రక్తమయమైనవి. భక్తులు చల్లనినీరు తీసుకొచ్చి శివప్పపై పోసి, కొంతనీరు త్రాగించినారు. కాని,లాభము లేకపోయింది. "శివప్ప"స్పృహతప్పి, మృతప్రాయుడై పడిపోయినాడు. భక్తులు"శివప్ప"కు అనేకవిధములుగా ఉపచా- రములు చేసినారు. కాని, అచేతనుడై పడిపోయినాడు. అప్పుడు ఈ విషయము తెలిసిన "శివప్ప" యొక్క భార్య, పుత్రుడు సత్వరముగా అక్కడికి వచ్చి"శివప్ప"యొక్క దుస్థితిని చూసి దుఃఖాక్రాంతులై- నారు. "శివప్ప"యొక్క నోటినుండి రక్తము నురుగులు వస్తున్నాయి. బ్రతుకుపై ఆశ లేదని అందరూ అనుకుంటున్నారు. ఏదిఏమైనా సరే"ప్రయత్నము పురుషలక్షణము"అన్నట్లు ఒకానొకడు వెళ్లి వైద్యుని పిలుచుకొని వస్తాడు.అప్పుడు ఆ వైద్యుడు చూసి,ఈయన జీవించిఉండే

సూచనలు కనిపించుటలేవు. ఇక మరణించినట్లే. అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయండి–అని అంటాడు. సద్గురు సేవలో నిమగ్నుడై దేహత్యాగము చేసినందుకు "శివప్ప" చాలా ధన్యుడు–అని అంటాడు. "శివప్ప"యొక్క భార్యాబిడ్డలు సద్గురుదేవుని చరణకమలములపైబడి ఆర్తనాదముతో మమ్ములను కాపాడుమని, నీవుతప్ప రక్షించే వారు ఎవరూ లేరని బోరున దుఃఖిస్తూ స్వామిని వేడుకుంటారు. మా సర్వస్వము నీ పాదములకు అర్పించి మీ సేవలో పాల్గొన్నాము. నీవుతప్ప మాకు ఎవరూ లేరని నీవే మా తల్లి, తండ్రి, దైవము. నీవే మా సర్వస్వమని భావించి నిన్ను ఆశ్రయించినాము. అటువంటి ఈ దీనులను ఉపేక్షించక కాపాడు స్వామీ–అని రోదిస్తూ ప్రార్థిస్తారు.

**శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ, త్వమేవ బన్ధుశ్చ సఖా త్వమేవ ।**

**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవదేవ ॥** (పాండవగీత ౨౮)

ఈ ప్రకారముగా పరిపరివిధముల వేడుకున్న "శివప్ప"యొక్క భార్యాబిడ్డల ఆర్తనాదమును ఆలకించిన సద్గురుదేవుడు తనయొక్క భక్తుడైన "శివప్ప"ను రక్షించుకొనుటకు సంసిద్ధుడైలేచినాడు. "శివప్ప"యొక్క శిరస్సుకు ఎడమవైపు గాయమై ఏకధారగా రక్తము కారుచున్నది. సద్గురుదేవుడు చూసి ఆయన సమీపమునకు వచ్చి కూర్చున్నాడు. పూజ్య గురుమాత (గురుమావులి) తనయొక్క అమృతహస్తమును "శివప్ప"యొక్క శిరముపైన గాయము తగిలినచోట ఉంచినాడు. వెంటనే రక్త స్రావము ఆగిపోయింది. మరియు సద్గురు మావూలీ **"ఓం నమశ్శివాయ"** అంటూ శివప్పయొక్క సర్వాంగములయందు తనయొక్క అమృతహస్తముతో స్పృశించినాడు.

అప్పుడు సద్గురుదేవుడు అంటాడు. బహుశః ఈయన ఆయువు (ప్రారబ్ధము) ముగిసినట్లుంది. అయినాగాని ఈ భక్తునికి సద్గురు సేవచేయాలని చాలా ప్రీతి ఉంది. కావున ఈయనను ఆ సద్గురు దేవుడే కాపాడుగాక! అని ఈప్రకారంగా అంటూ చల్లని నీటిని "శివప్ప"ముఖముపై ప్రోక్షించినాడు. "శివప్ప" సమాధిస్థితిలో ఉన్నట్లు ముఖచిహ్నములు కానొస్తున్నాయి. స్త్రీ పురుషులందరూ "శివప్ప" చనిపోయినాడని ఏడుస్తున్నారు. ఇంతలో కొంతసేపటికి "శివప్ప"పెదవులు కదులుతున్నట్లు కానొస్తున్నాయి. "రాం రాం"అంటూ నామోచ్చారణ గావిస్తూ"శివప్ప"మెల్లగా మేల్కొన్నాడు. ఆ దృశ్యమును చూసి అందరూ ఆశ్చర్యపడినారు. ఎంతో ఆనందమును పొందినారు.సద్గురుదేవుని మహిమను వర్ణిస్తూ జయజయకారములు చేసినారు.సద్గురుదేవుడు కరుణించి"శివప్ప"ను నిశ్చయముగా రక్షించినాడు. ఇకమీదట "శివప్ప"కు మరణ భయము లేదని నిరభిమానముగా అన్నాడు సిద్ధనాథుడు. ఇట్లు, కొన్నిరోజులు గడిచినాక"శివప్ప" ఆరోగ్యవంతుడైనాడు. అప్పటినుండి"శివప్ప"అత్యధిక ప్రీతిచేత సద్గురుసేవలో పాల్గొని *తన, మన, ధనము* ను సద్గురు దేవునికి అర్పించి సద్గురు సేవచేస్తున్నాడు.

---

సద్గురుదేవుడు సగుణరూపము ధరించి శరీరమును తీసుకొని వచ్చాడు. కావున, శరీరము రోగములకు పుట్టినిల్లు ఇది సహజము, ప్రకృతి సిద్ధము. ప్రసంగమునసుసరించి సద్గురుదేవునికి

ఒకసారి మహాజ్వరము తీవ్రముగా ఆవరించింది. ఎంతగానో దుఃఖముతో బాధపడుతూ మంచము పట్టినాడు. మహాత్ములైనాగాని దేహముయొక్క ధర్మానుసారముగా శరీరము రోగాది బాధలకు గురికాక తప్పదు.

భక్తజనులు భయాందోళన చెంది ఎవరికి తోచిన ఔషధములు (మాత్రలు) వారు వారు తెచ్చి స్వామిని సేవించమని ఇస్తున్నారు. ఎవరిని కాదనకుండా(నిరాకరించకుండా)అందరియొక్క ఔషధ-ములను స్వీకరించి తనయొక్క పడక శయ్యక్రింద పెట్టుకున్నాడు. ఇంకా కొంచెము ఆగిన పిదప మీ మాత్రలు సేవిస్తాను, మీరు వెళ్ళండి–అని చెప్పి ఆ ఔషధములను పడక క్రింద పెడుతున్నాడు. కాని, స్వామియొక్క జ్వరము తగ్గడము లేదు. అప్పుడు భక్తులు ఒకానొక వైద్యనిపుణుని తీసుకొచ్చినారు. ఆయన స్వామికి రామబాణమువంటి ఔషధమును ఇచ్చినాడు. స్వామి దానిని కూడా పడకక్రింద పెట్టి నాడు. భక్తులు ప్రతిరోజూ మందులు, గోళీలు తెచ్చిఇస్తున్నారు.వైద్యుడుకూడా అమోఘమైన ఔష-ధములు ఇస్తున్నాడు. వాటినికూడా పడకక్రింద దాచినాడు. కాని, రోగము (జ్వరము) ఏమాత్రం కూడా తగ్గలేదు. ఒకరోజున వైద్యనిపుణుడు వచ్చి స్వామిని ఈ విధంగా అడుగుతాడు. సద్గురుదేవా! నేను రామబాణమువంటి ఔషధములు ఇస్తున్నాను. ఒక్క ఘడియలో తగ్గుముఖము పట్టవలసిన జ్వరము ఇన్ని రోజులనుండిగూడ తగ్గడము లేదు. జ్వరము ఎప్పటివలనే ఉంది. బహుశః నీవు ఔష-ధమును స్వీకరించుట లేదు కాబోలు. లేకుంటే, నీవు ఔషధమును సేవించినచో జ్వరము ఇప్పటి వరకు తగ్గవలసి ఉండేది–అని అంటాడు. అప్పుడు అందరు భక్తులు కూడా భయకంపితులై స్వామిని వేడుకుంటారు. ఓ సద్గురుదేవా! నీవు నీ కోసము కాకపోయినా మా కోసము, మమ్ములను ఉద్ధ-రించుటకొఱకైనా నీ శరీరమును రక్షించుకోవాలి స్వామీ–అని దీనభావంతో ప్రార్థించినారు.

అప్పుడు సద్గురుదేవుడు నవ్వుకొని సరే! అయితే మీయొక్క ఆగ్రహము మేరకు నేను ఔషధమును స్వీకరిస్తాను, అని–లేచి పడక క్రింద తన హస్తమును దూర్చి పిడికిలి నిండా మాత్రలను తీసుకొని నోరు తెఱచి ఒక్కసారిగా పిడికెడు గోలీలను మ్రింగినాడు. ఈ దృశ్యమును చూసి వైద్యుడు ఒక్కసారిగా నిశ్చేష్టుడైనాడు. నోరు బాదుకుంటూ హర హరా! శివ శివా! అపరాధము జరిగిపో-యింది. ఇన్ని మాత్రలు ఒక్కసారి మ్రింగినచో శరీరముంటుందా? అని వైద్యుడు నేలకొఱిగినాడు. ఇతర భక్తుజనులందరూ చాలా దుఃఖించారు. ఇక మన పుణ్యము ఒడిసినది. సద్గురుదేవుడు మన నుండి దూరమవుతున్నాడు.ముమ్ముందు మనలను రక్షించేవారెవరున్నారు?మనము ఊరికే స్వామిని ఔషధము సేవించమని వ్యర్థముగా ప్రార్థించితిమి. మన ప్రార్ధన అనర్థమునకు కారణమాయెకదా! అయ్యో! ఎంతపని జరిగినది–అని ఏడుస్తున్నారు. ఇంతలో సద్గురుదేవుడు మంచమునుండి లేచి నిలబడి, ఎందుకు వ్యర్థముగా ఏడుస్తున్నారు? అసలు నాకు ఏమైందని?నాకు జ్వరమే రాలేదు–అని అన్నాడు. నాకు జన్మము లేదు. మరణము లేదు. శరీరమే నాకు లేదు. అలాంటప్పుడు జ్వరమెవరికి

వచ్చింది? దేనికి వచ్చింది? అసలు నేను ఎవరిని అనుకుంటున్నారు? అని స్వామి లేచి అటు ఇటు తిరుగుతున్నాడు.

**శ్లో॥ న మృత్యుర్న శంకా న మే జాతిభేదా, పితా నైవ మే నైవ మాతా చ జన్మ ।**

**న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్యః, చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్॥**

పదిహేను రోజులనుండి అన్నాహారములు, కనీసము మంచినీరైన త్రాగకుండా మంచము పట్టిన సద్గురుదేవుడు ఒక్క క్షణములోనే లేచి సశక్తునివలె తిరుగాడుచున్నాడు. ఇది చూసి అందరూ ఆశ్చర్యపోయినారు. అందరు ఇలా అనుకుంటున్నారు. మహాత్మునియొక్క మహిమను వర్ణించడానికి ఎవరి తరము? సద్గురుదేవుడు మనవలెనే శరీరియని భ్రమపడినాము.ఎవరి పాదతీర్థమును సేవించినట్లయితే మనమందరము భవసాగరమునుండి తరిస్తామో, దారుణమైన కష్టములు, రోగములు నివృత్తమగునో,అటువంటి సద్గురుదేవునికి మనము మూర్ఖత్వముచే ఔషధముసేవించమని ఆగ్రహించినాము–అని సద్గురుదేవుని వర్ణించుకుంటూ వారి మూర్ఖత్వమునకు సిగ్గుపడి, మన సద్గురుదేవుడు సాక్షాత్ ఈశ్వరుడున్నాడు.ఆయనకు రోగాలుఉండవు–అని అద్భుతమైన సద్గురుమహిమను స్తుతించుకుంటూ భక్తులు వారి వారి ఇండ్లకు నిష్క్రమించినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథలయొక్క లక్ష్యార్ధమును సావధానచిత్తులై భక్తిశ్రద్ధలతో వినగలరు. ఇప్పుడు మొదటి కథయొక్క లక్ష్యార్థమును వినండి. "శివప్ప" అను జీవుడు పరమార్థ సాధన చేస్తూ తొందరగా సప్తభూమికలను అధిరోహించాలని ఆతురతతో సప్తభూమికలనే నిచ్చెనను ఎక్కుచుండును. కాని, ప్రమాదము వలన అక్కడి నుండి పతనమై అధోగతిని పొందుతాడు.

**శ్లో ॥ ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన ।**

**ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణః సుతః ॥** (వివేకచూడామణి 322)

**శ్లో॥ న ప్రమాదానర్థోఽన్యో జ్ఞానినః స్వస్వరూపతః ।**

**తతో మోహస్తతోఽహం ధీస్తతో బన్ధస్తతో వ్యథా ॥** (వివేకచూడామణి 323)

తా॥శ్రీశంకరభగవత్పాదులు వివేకచూడామణి గ్రంథమందు ఈప్రకారముగా బోధించినారు. జ్ఞాననిష్టగల వానికి స్వస్వరూప ప్రచుతి అను ప్రమాదముకన్న మించిన చేటు మరొకటి లేదని నొక్కి వక్కాణించినారు. సాధకులు తమ నియమిత కార్యమగు బ్రహ్మనిష్ఠను చేయక స్వస్వరూపమును మరచుటయే గొప్ప ప్రమాదము.దీనికన్న మరణము(అనర్థము) ముముక్షువులకు మరియొకటి లేదు.

**శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే ।**

**సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥**

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।**

**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥** (గీత 2-62 & 63)

ధ్యానమును మరచి ఇతర విషయధ్యానరూప ప్రమాదమువలన వాని సంబంధము కలుగుతున్నది. సంగముచే కామము,కామముచే కోపము,దానిచే మోహము,దానిచే విస్మరణము,దాని వలన కర్తృత్వభోక్తృత్వరూప అహంకారము, తద్వారా బుద్ధిభ్రష్టమై, బంధములోచిక్కి జననమరణ రూప సంసారమును(అజ్ఞానతత్కార్యరూప అనర్థమును) పొంది జీవుడు అధోగతి పాలవుతున్నాడు.

ఈ ప్రకారముగా జీవుడు ప్రమాదములో చిక్కుకొని సంసారరూప బండరాయి మీదపడి విక్షేపరూప గాయమును (దుఃఖమును) పొందుతాడు. అప్పుడు వివేకరూప పుత్రుడు మరియు పరాభక్తిరూప భార్య (బుద్ధి) వీరిద్దరూ వచ్చి జీవునియొక్క దుర్గతిని చూసి ఏడుస్తారు. నితాంత ప్రీతిని భక్తి అంటారు. పరమాత్మను పొందాలనే తీవ్రతర ప్రీతిని పరాభక్తి అంటారు. ఆ పరాభక్తిరూప బుద్ధియందే వివేకమనే పుత్రుడుఉదయిస్తాడు.వివేకయుక్తమైనబుద్ధియందు జీవుడు జననమరణరూప సంసారమునుండి ముక్తుడు కావాలనే తాపత్రయము(పశ్చాత్తాపము)కలిగి సద్గురువును శోధించి ఆశ్రయించి, విధిపూర్వకముగా శరణాగతని పొందుతాడు. ఈ ప్రకారముగా శరణుబొందిన భక్తుని (జీవుని) పై సద్గురుదేవుడు కరుణించి తనయొక్క బోధ(జ్ఞాన)హస్తముచేత స్పర్శించి, దుఃఖరూప రక్తప్రవాహమును ఆపి అనగా సర్వదుఃఖములను నివృత్తిచేసి పరమానందరూప (స్వస్వరూప) అవస్థను ప్రాప్తముచేసి జీవుని అనర్థమునుండి రక్షిస్తాడు.

ఇప్పుడు రెండవ కథయొక్క లక్ష్యార్థ ము:—ప్రత్యగాత్మస్వరూపుడైన జీవుడు తనయందు ఏ విధమైన దుఃఖము (రోగము) లేకున్నను అవిద్యను అభిమానించి భవరోగమును తనయందు ఆరోపించుకుంటున్నాడు. అనాత్మరూపదేహాదిక ప్రపంచమును నేను నాదియను అహంకార మమకారములను పొంది బద్ధుడగుచున్నాడు. ఇట్లు అవిద్యాదోషమువలన ఆరోపించుకున్న భవరోగ నివృత్తికై సాంఖ్యాదిమతములు మొదలుకొని అనేకవిధములుగా మాయారూప జ్వరనివృత్తికి బోధిస్తాయి? ఔషధరూప అనేక మతబోధలు కేవలము వినోదకరముగానే ఉండిపోయినవిగాని మాయారూప జ్వరమును యథార్థముగా నివృత్తి చేయలేక పోయినవి. ప్రత్యగాత్మస్వరూపుడైన జీవుని ఆరోపిత మాయారోగము (భవరోగము) నివృత్తి కాలేదు. దుఃఖము దూరము కాలేదు. కావున,

**శ్లో॥ అజ్ఞాన సర్ప దంష్ట్రస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా ।**
**కిము వేదైశ్చ శాస్త్రై కిము మన్త్రైః కిమౌషధైః ॥** (వి.చూ.63)

అజ్ఞానం అనే పెనుబాముచే కాటువేయబడిన జీవునికి శోకమోహములను విషమెక్కి మూర్ఛితుడగువానికి వేదములచేతను శాస్త్రములచేతను మంత్రములచేతను మతవాదిరూప ఔషధములచేతను ప్రయోజనమేమియు లేదు ఇందులకు కేవలము బ్రహ్మజ్ఞానమే అమోఘ ఔషధము.

అప్పుడు ప్రత్యగాత్మ స్వరూపుడైన సిద్ధనాథుడు, కథయందు ఏవిధముగా భక్తులు ఏడుస్తుంటే వారినుద్దేశించి నాకు రోగము లేదు, నాకు జన్మమరణములు లేవని అన్నాడో, అదే ప్రకారముగా

ప్రత్యగాత్మస్వరూపుడైన జీవునియందు అవిద్య నామమాత్రముగూడా లేదు. అసంగ బ్రహ్మరూపుడై, స్వయంప్రకాశమానుడై, నిత్య, నిరామయ, నిరంజన, నిర్వికల్ప, నిరాకారరూపుడైయున్నాడు. బంధ మోక్షములు ఆయనయందు అసలే లేవు.

**అహం నిర్వికల్పో నిరాకారరూపో, విభూత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్।**

**నచాసంగతం నైవ ముక్తిర్నమేయః, చిదానంద రూపశ్శివోఽహం శివోఽహమ్॥**

సద్గురుదేవుడు సశక్తుడై లేచినప్పుడు భక్తులందరూ ఆనందమును పొందినట్లుగా, జీవుడు యథార్థమైన స్వస్వరూప జ్ఞానమును పొందినాక, జీవుడు మరియు మతవాదులు ఆనందమును పొందినారు. వాస్తవముగా నాయందు అజ్ఞానము లేశమాత్రము కూడా లేకున్నను భవదుఃఖమును నాయందారోపించుకొని వ్యర్థముగా భ్రాంతిజెందినానని పశ్చాత్తాపపడతాడు. జీవుడు యథార్థమైన ఆత్మజ్ఞానమును పొందిన పిమ్మట స్వస్వరూపానందమును అనుభవిస్తూ తనయొక్క మూర్ఖత్వమును వర్ణిస్తూ ఉంటాడు.*(విపులముగా తెలియగోరువారు శ్రీవిద్యారణ్యగురుదేవులచే రచింపబడిన శ్రీవేదాంత పంచదశి పదునాలుగవ ప్రకరణము "బ్రహ్మానందే విద్యానందమ్" ప్రకరణాంత్యమున చూడగలరు).*

ఓశ్రోతలారా! ఇప్పుడు మనోహరమైనకథను ముందరఅధ్యాయమునందు వినగలరు.దానిని శ్రవణము చేసినట్లయితే అసారమైన మిథ్యాసంసారము, సంసారదుఃఖములు నివృత్తి కాగలవు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము శ్రవణమాత్రమున సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు ఈ ఇరువదితొమ్మిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యైనమః

# ముప్పదియవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురు సిద్ధనాథా! నేను ఎల్లప్పుడూ నిన్నే స్మరిస్తుంటాను. నీయొక్క ప్రేమ నాపై ప్రసరింపజేసి నన్ను ధన్యుణ్ణి చేయుము. నాయొక్క మనో వాక్కాయములచే నా సర్వ-స్వమును నీ పాదారవిందములయందు అర్పించి నీ కృపకు పాత్రుడను కావాలని ఆకాంక్షిస్తున్నాను. చాతక, చకోరపక్షులలాగా నీ ఆశీర్వాదము కొఱకు, నీ కరుణాకటాక్షము కొఱకు నిరీక్షిస్తున్నాను. నన్ను అనుగ్రహించుము స్వామీ!

ఓ సద్గురు సిద్ధనాథా! నీయొక్క స్వరూపమును యథార్థముగా దర్శించిన వానికి ఈ నామ-రూప ప్రపంచము సమూలముగా నివృత్తమై బాధింపబడుతుంది.తాను ఎచ్చటెచ్చట చూసిన అచ్చట-చ్చట బ్రహ్మమునే వీక్షిస్తాడు."కల్పితవస్తువుఅధిష్ఠానస్వరూపమే ఉంటుంది"అను నియమానుసారము ఎప్పుడు వృత్తి బ్రహ్మాకారమవుతుందో, త్రిపుటియొక్క అప్రతీతివలన తాను బ్రహ్మస్వరూపుడై, బ్రహ్మ సుఖమునే అనుభవిస్తాడు. ఆనందస్వరూపుడై ఉంటాడు. అద్వైతావస్థానరూప నిర్వికల్పసమాధిని పొందుతాడు. వాస్తవానికి తాను ఎన్నడూ ద్వైతరూపుడు కాలేదు. అద్వైతస్వరూపుడని యథార్థ నిశ్చయము పొందినాక నిర్భయత్వముకలుగుతుంది. అప్పుడు సాధకుడు యథార్థజ్ఞానమును పొంద గలుగుతాడు. ద్వైతభావన నిరసించక, నిర్భయత్వమును పొందక కల్పాంతము వరకు సాధన చేసి-నప్పటికీ సహజావస్థను పొందలేడు.యథార్థముగా బ్రహ్మమునెఱిగి బ్రహ్మానుభవమును పొందినాక తాను నిర్భయత్వమును పొంది అద్వైతానుభవముతో సర్వత్ర బ్రహ్మమునే దర్శిస్తాడు. ఇక ఆయనకు ఈ సంసారచింత ఉంటుందా? తన శరీరములోని అంగములు భిన్నభిన్నములైనప్పటికీ తనయొక్క దేహమందే గలవియై తానే ఉన్నాడు. అట్లే, పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల చరాచరప్రపంచము తనయొక్క స్వరూపముగానే దర్శిస్తాడు. ధ్యాత, ధ్యానము, ధ్యేయరూపుడుగా తానేయై ఉన్నాడు. ఈ ప్రకారముగా తాను చైతన్యరూపుడై ఉంటాడు.

**శ్లో ॥ దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్ ।**

**సా దృష్టిః పరమోదారా న నాసాగ్రావలోకినీ ॥** (అప.116)

ఈ ప్రకారమైన దృఢాభ్యాసముద్వారా స్వస్వరూపముకన్న అన్యము గోచరించదు. ఈ జగ-త్తును తన స్వరూపముగానే వీక్షిస్తాడు. ఇట్టి బ్రహ్మజ్ఞానము సద్గురుదేవుని కృపాకటాక్షమువల్లనే

లభించును. సద్గురుకృపకు పాత్రుడై, సద్గురువచనములపై శ్రద్ధనుంచి,సద్గురుదేవునియొక్క ముఖకమలముద్వారా వెలువడిన బోధను శ్రవణ, మనన, నిధిధ్యాసనములు–నిత్య నిరంతర ఆదరణీయముగా చేసినట్లైన బ్రహ్మజ్ఞానము కలిగి బ్రాహ్మిస్థితిని పొందును.

ఓ శ్రోతలారా! ఇప్పుడు కథాప్రసంగమును ప్రారంభించెదము. "కురందకొప్ప" అనే సుందరమైన, మనోహరమైన ఒకానొక గ్రామము కలదు ఆ గ్రామములో ఒక తెలివైన గృహస్థుడు 'బసప్ప' అను పేరు గలవాడు ఉండెను. ఆయనయొక్క ధర్మపత్ని 'దానవ్వ'. వివాహమైన చాలా కాలమునకు ఆమె గర్భము ధరించినది. మొదటి గర్భము కాబట్టి వారికి విశేషమైన ఆనందము కలిగినది. కాని, దురదృష్టవశాత్తు నవమాసములు నిండి నిండక మునుపే గర్భము పతనమైనది. మళ్లీ కొంతకాలమునకు గర్భము ధరించినట్లుగా చిహ్నములు కానొచ్చినవి. నవమాసాలు నిండకమునుపే మళ్లీ గర్భస్రావమైనది. మళ్లీ మూడవ గర్భమును ధరించినది. రోజులు గడుస్తున్నాయి. అప్పుడు ఒకానొక స్త్రీ దానవ్వ ఇంటికి వచ్చి ఈ ప్రకారముగా గర్భరక్షణ కోసము కొన్ని సూచనలు చెప్తుంది. అమ్మా! దానవ్వ! నీకు లోగా రెండు గర్భములు పతనమైనవి. ఈసారైనా గర్భమును రక్షించుకోండి. దానికి నేనొక సుద్ధి చెపుతాను వినుము.

**'హుబ్లీ'** పట్టణమునందు సిద్ధాశ్రమము ఒకటి ఉంది. అచ్చట సిద్ధారూఢ సద్గురుదేవుడు ఉన్నాడు. ఆయన భక్తుల సంకటములను దూరముచేయుటకు ఆప్తకాముడై ఉన్నాడు. భక్తుల ఆపదలను తొలగించి అందరికీ కళ్యాణమును చేకూర్చుచున్నాడు. కావున, మీరిద్దరు దంపతులు ఆ సద్గురుదేవుని ఆశ్రయించి మీయొక్క పరిస్థితిని విన్నవించుకోండి.ఆ సద్గురుదేవుడు అపారమైన కరుణామయుడు. భక్తులను ఉద్ధరించుటకు సాక్షాత్ ఈశ్వరుడే అవతారమునకు వచ్చి జగద్గురువై వెలసినాడు. ఆయనయొక్క మహిమ వర్ణనాతీతము. అటువంటి సద్గురుదేవుని ఆశ్రయించి మీ సంకటములను నివేదించుకొని, పుత్రప్రాప్తిని అర్థించినట్లైన,ఆ కరుణాఘనుడగు సద్గురుదేవుడు ఏదైనా ఉపాయము చేసి మీకు సంతానము దక్కునట్లుగా అనుగ్రహించగలడు–అని ఈ ప్రకారముగా ఆ స్త్రీ వివరించింది.

అప్పుడు దానవ్వ ఆ స్త్రీతో ఇలా అడుగుతుంది. అయితే సరే! చాలా సంతోషము. కాని, ఆ సద్గురుదేవుడు మాకు పుత్రుడిని ప్రసాదించినట్లయితే అందుకు ప్రతిఫలముగా స్వామి ఏమైనా తీసుకుంటాడా? దయచేసి చెప్పమ్మా! మేము శ్రీమంతులమున్నాము. ఒకవేళ ఏమైనా అడిగినచో మేము ఇవ్వగలము. అప్పుడు ఆ స్త్రీ దానవ్వతో మళ్లీ ఈ ప్రకారముగా చెప్తుంది. ఆ సద్గురుదేవుడు ధన కనక వస్తు వాహనాలు ఏమీ కోరడు. ఆయన కేవలము నిర్మలమైన మనస్సును మాత్రమే కోరుతాడు. శుద్ధమైన అంతఃకరణముతో ఎవరైతే సద్గురుదేవునికి శరణాగతి అవుతారో,వారియొక్క సర్వదుఃఖ-

ములను నివృత్తి చేస్తాడు. ఆయనకు కేవలము భక్తి కావాలి. ఐశ్వర్యముతోగాని, దారిద్ర్యముతోగాని పనిలేదు.

**శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**

**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥** (గీత ౯-౨౨)

ఇటువంటి వచనములను విన్న దానవ్వ ఎంతోసంతోషించినది.హృదయములో ఆనందము ఉప్పొంగిపోయింది. సద్గురుదేవుడు మమ్ములను ఉద్ధరించుటకు, నిన్ను మావద్దకు పంపినాడు. మేము ధన్యులము. మేము సద్గురుదేవుని వద్దకు ఇప్పుడే తొందరగా వెళ్ళెదమని దానవ్వ అన్నది. అప్పుడు తన భర్త బసప్ప రాగానే ఆయనతో ఈ సంగతి వివరించింది. మనము ఈరోజునే హుటా హుటిగా సద్గురుదేవుని సన్నిధిలోకి వెళ్లి స్వామిని కలుసుకుందాము పదండి–అని భర్తతో వేడు-కొంది. అప్పుడు బసప్ప అంగీకరించినాడు. ఇద్దరు దంపతులు పండ్లు ఫలహారములు వెంట తీసు-కొని సద్గురుదేవుని ఆశ్రమమునకు (హుబ్లీకి) సంధ్యాసమయము వరకు చేరుకున్నారు. సద్గురుదేవుని వద్దకు వెళ్ళినప్పుడు రిక్త హస్తములతో వెళ్ళకూడదు. అందుకే వారు ఫలాదులను తీసుకొని పోయినారు.

**శ్లో॥ అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీ వృద్ధ బాలకౌ ।**

**రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతం గురుమ్ ॥** (నీతిశాస్త్రము)

ఆశ్రమద్వారము వద్దకు వచ్చినారు. అచ్చటనుండి లోనికి చూసేసరికి సద్గురుదేవుడు సింహా-సనముపై కూర్చొని ఉన్నాడు. ప్రకాశమానుడై శోభాయమానముగా విరాజిల్లుచుండెను. స్వామికి ఇరువైపులా భక్తులు నిలబడి భజనలు చేస్తున్నారు. దంపతులకు అమితానందము కలిగెను. పరుగు పరుగున పరుగెత్తుకుంటూ వచ్చి సద్గురుచరణకమలములపై వ్రాలినారు. ఫలాదులు స్వామి చరణ-ములవద్ద ఉంచి వినయముతో,దీనభావంతో నిలబడినారు.భక్తజనులు కర్పూరహారతులు వెలిగించి ముక్తకంఠముతో స్వామికి మంగళహారతులు పాడినారు. ఆ ఆనందము అవర్ణనీయము. తర్వాత స్త్రీ పురుష భక్తజనులు సద్గురుదేవునికి సాష్టాంగ నమస్కారములు చేసి స్వామియొక్క ఆశీర్వాదమును పొంది, ఆజ్ఞగైకొని వారి వారి స్వస్థానములకు వెళ్ళిపోయినారు.

అప్పుడు సద్గురుదేవుడు బసప్ప, దానవ్వల వైపుచూసి మీరు ఏమి పని నిమిత్తముగా ఇక్క-డకు వచ్చినారు. నిస్సంశయముగా చెప్పండి–అని అడుగగా, బసప్ప ఈ విధముగా తమ వృత్తాంత-మును నివేదిస్తున్నాడు. హే మహాప్రభో! ఈవిడ నా భార్య దానవ్వ. ఈమెకు లోగా రెండుసార్లు నవమాసములు నిండగానే గర్భము పతనమైంది. మళ్లీ మూడవసారి ఇప్పుడు గర్భమును ధరిం-చింది. ఈసారి అయినా ఈ గర్భము సురక్షితముగా ఉండి, మాకు సంతానము దక్కవలెనని మీ చరణాలను ఆశ్రయించినాము. మాపై కృపాదృష్టిని ప్రసాదించండి స్వామీ!

అప్పుడు సద్గురుదేవుడు విచారించి తనయొక్క మృదుమధురమైన,అమృతతుల్యమైన వాక్కులతో ఇలాఅంటాడు. బసప్పా! మీరు మహాపుణ్యవంతులయ్యా! ప్రస్తుతము నీయొక్క భార్యగర్భమున మగశిశువే ఉన్నాడు. తప్పకుండా సురక్షితముగా జన్మిస్తాడు. కాని, ఆయన యోగభ్రష్టుడై జన్మమునకు వస్తున్నాడు. ఆయన గొప్ప తపోసంపన్నుడు. మహావైరాగ్యపరుడు. ఆయనకు ఇహలోక భోగభాగ్యములు రుచింపవు. ఆయన పుట్టగానే మిమ్ములను వదిలి, సాధు సజ్జనులను ఆశ్రయించి, వారి సాంగత్యములోనే ఉంటాడు.మళ్లీ మిమ్ములను ఎన్నడుకూడా కలుసుకోడు.అని ఈ విధముగా సద్గురుదేవుడు చెబుతాడు.

పుత్రుడు కలుగుతాడన్న సద్గురుదేవుని వచనములను విని దంపతులు ఆనందమునొందినారు. సిద్ధనాథుడు వారిని ఆ పూటకు అక్కడే ఆశ్రమమందే ఉంచుకొని, మహాప్రసాదమును (భోజనమును) ప్రసాదించినాడు. మరుసటి రోజున ఉదయముననే వారిని తమ గ్రామానికి పంపించినాడు. ఆ దంపతులు క్షేమముగా వారి స్వగ్రామమునకు వచ్చి ఎల్లప్పుడూ సద్గురుదేవుని నామ స్మరణ, చింతనచేస్తూ కాలము గడుపుతుండగా ఒకనాటిరాత్రి ఒకవింత జరిగింది–వినండి. దానవ్వ పడకపై నిద్రిస్తుండగా ఒక వింత స్వప్నమును గాంచింది. ఆ స్వప్నంలోనే తాను ప్రసవవేదనను అనుభవిస్తున్నట్లు గోచరించింది.  ఆమె ఆ స్వప్నమందే ప్రసవవేదనను భరించలేక ఓ సద్గురు సిద్ధనాథా! రక్షింపుము–అని వేడుకుంది. వెంటనే సద్గురుదేవుడు ప్రత్యక్షమైనాడు. దానవ్వపై సద్గురుదేవుని కృపాకటాక్షము పడుటతోడనే వెంటనే ఆమె ఒక దివ్యమైన పుత్రున్ని కన్నది. అప్పుడు సద్గురుదేవుడు ఆ బాలుని తనయొక్క అమృతహస్తములతో ఎత్తుకొని ఓ పతివ్రతామ తల్లీ! ఈ పిల్లవాణ్ణి నేను తీసుకుపోతున్నాను. ఇది స్వప్నమని భావించకుము, వాస్తవము. ఈ బాలుని సాధు సత్పురుషుల చెంత చేర్చుతాను. ఈయన అక్కడే పెరిగి పెద్దవాడై పెంపొందుతాడు. ఈ బాలునిగూర్చి బెంగపడ వద్దు. మీకు మళ్ళీ తొందరగా అనతి కాలములోనే మరొక పుత్రుడు జన్మించగలడు. ధైర్యముగా ఉండండి. మీరు ఏమాత్రము చింతించవలదు.ఎల్లప్పుడూ సద్గురుదేవుని స్మరిస్తూ ఉండండి. ఒక సంవత్సరము కాలములోపు మీకు మరొక పుత్రుడు జన్మిస్తాడు.

ఇట్లు, సద్గురు సిద్ధనాథుడు చెప్పి ఆమెకు ఆశీర్వాదమొసంగి అదృశ్యమైనాడు. వెంటనే దానవ్వకు మెలకువ కలిగింది. తన శరీరమందు ప్రసవచిహ్నములు కనిపిస్తున్నాయి. ఇరుగుపొరుగు స్త్రీలను పిలిచి జరిగిన వింతను ప్రకటము చేసింది.ఈ వింత ఎలా జరిగింది? ఎవరికిని బోధపడ లేదు. కారణము తెలియలేదు. ఇంతలో బసప్ప వచ్చినాడు. దానవ్వ గర్భము మాయమైంది. ప్రసవ చిహ్నములు కనిపిస్తున్నాయి. బసప్ప ఈ వింత ఎలా జరిగిందా–అని కారణమును శోధిస్తూ విచారిస్తున్నాడు. అప్పుడు దానవ్వ తనకు కలిగిన స్వప్నవృత్తాంతమును వివరిస్తుంది. నాకు కలిగిన శిశువును సద్గురుదేవుడు తీసుకెళ్లాడు–అని చెప్పింది. వాస్తవమునెఱిగిన బసప్ప వృథాగా చింతించ

లేదు. పైగా ఆనందించినాడు. దంపతులు నిశ్చింతగా సద్గురు నామచింతన చేస్తూ కాలము గడు-పుతున్నారు. కొన్ని రోజులకు ఆ దంపతులు హుబ్లీకి వెళ్లి, సద్గురుదేవునికి వారియొక్క కథను నివేదించుకున్నారు. అప్పుడు సిద్ధనాథుడు వారితో ఇలా అంటాడు.

మీకు జన్మించిన పుత్రుని నేను సత్పురుషుల సాంగత్యంలో, యోగ్యమైన చోటుకే చేర్చినాను. ఆయన చాలా గొప్ప తపశ్శక్తి సంపన్నుడున్నాడు. తత్త్వజ్ఞానాభ్యాసము గూర్చి ఆయనను పవిత్రమైన స్థలములో ఉంచినాను. ఆయన గురించి మీరు చింతించవద్దు. మీకు మళ్ళీ పుత్రుడు జన్మించగలడు. ఆయన చాలా ఉత్తముడై మీతోనే ఉంటాడు–అని సద్గురుదేవుడు వారికి ఆశ్వాసమిస్తాడు. అందుకు వారు చాలా ఆనందమునొందినారు. అప్పుడు ఆ దంపతులు సద్గురుదేవునికి సాష్టాంగ నమస్కార-ములుచేసి స్వామియొక్క ఆశీర్వాదములు పొంది వారి ఆజ్ఞను గైకొని వారి స్వగ్రామానికి చేరుకొని అఖండముగా సద్గురు నామస్మరణ, సద్గురుచింతన చేస్తూ కాలము గడుపుతున్నారు. ఇలా ఉండగా కొంతకాలమునకు దానవ్వ మళ్లీ గర్భముధరించి, నవమాసములు నిండగా ఒక దివ్యమైన పుత్రుడిని కన్నది.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధానముగా వినగలరు. "కురం-దకొప్ప"అనే శరీరము. దానియందు బసప్ప అనే జీవుడు మరియు ఆయన భార్య దానవ్వ అనే బుద్ధి. ఈ ప్రకారంగా ఇద్దరు దంపతులున్నారు. వారియొక్క పుణ్యముదయించినందున వైరాగ్యమనే కోశమందు జ్ఞానగర్భము కలుగును. కాని, అపరోక్ష బ్రహ్మజ్ఞానము అనే పుత్రుడు కలగకుండా భూత ప్రతిబంధకము జ్ఞానగర్భమును పతనము చేస్తుంది. "ధనపుత్రాదిరూప ప్రియ వస్తువుల నాశనము కలిగినాక వాటియొక్క అనుసంధానము(అవిస్మరణ)ను **భూతప్రతిబంధక** మందురు". "కార్యాను-కూల విరోధమును **ప్రతిబంధక** మందురు".రెండవసారిగూడా జ్ఞానగర్భమును వర్తమాన ప్రతిబం-ధకము పతనము చేసింది.

**శ్లో ॥ ప్రతిబన్ధో వర్తమానో విషయాసక్తి లక్షణః ।**

**ప్రజ్ఞామాన్ద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥** (వే.పం.౨-43)

చిత్తమునందు 1.విషయాసక్తి, ౨.బుద్ధిమాంద్యము, 3.కుతర్కము అనగా శుష్కతర్కము ద్వారా శృతివచనములకు అన్యార్థము చేయుట, 4.విపర్యయ దురాగృహము అనగా ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వాదులను యుక్తిరహితముగా హఠముచేత ఒప్పుకోవడము.ఇవి వర్తమాన ప్రతిభంధకములు. వీటిద్వారా దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానము నిరుద్ధమగును.

బుద్ధి, మూడవసారి జ్ఞానగర్భమును ధరించినది. అప్పుడు జీవుడు ఆగామి ప్రతిభంధకము నుండి రక్షింపబడుటకు సద్గురుదేవుని ఆశ్రయించి శరణాగతినొంది దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానరూప

పుత్రుని రక్షించమని వేడుకుంటాడు. *(స్వర్గము మరియు బ్రహ్మలోకాదుల ఇచ్ఛ, జన్మాంతరహేతువైన శేష ప్రారబ్ధము ఆగామి ప్రతిబంధకము) .*

అప్పుడు సద్గురుదేవుడు అంటాడు. ఇప్పుడు పరోక్షజ్ఞానపుత్రుడు ఉదయిస్తాడు. కాని, ఆ జ్ఞానము సత్సంగమునందే ఉంటుంది. అది మీకు దక్కదు. అనగా ఫలప్రదము గాదు.సత్పురుషుల సాంగత్యమున ఉంటూ, మహావాక్యవిచారణ,'తత్వం'పదార్థశోధన పునపునః చేయడమే సరిపడు-తుంది. ఈప్రకారముగా వివేక, వైరాగ్య, షట్సంపత్తి మొదలగు సాధనసంపత్తి దృఢముగా కలిగి యుండి సద్గురుదేవుని సాన్నిధ్యమున మహావాక్య శ్రవణముచేసి తదనుసారముగా మననము, నిదిధ్యాసనము మరియు పునః తత్వం పదార్థశోధన, ఓతప్రోతభావనయొక్క తీవ్రతర అభ్యాసము చేయగా చేయగా,అప్పుడు బుద్ధియందు సమ్యగ్ జ్ఞానము(దృఢఅపరోక్ష బ్రహ్మజ్ఞానము)కలిగి(నాలు-గవ పుత్రుడు) స్వయంప్రకాశమానుడై స్వస్వరూపమునందే స్థిరముగ (స్థితి)కలిగి ఉంటాడు. ఈప్ర-కారముగా జీవుడు ధన్యుడై సహజావస్థను అనాయాసముగా పొందుతాడు.ఎల్లప్పుడు బ్రాహ్మీస్థితిలో ఉంటాడు.

కథయందు–సద్గురుదేవుడు బసప్ప, దానవ్వలకు మీరు నిత్య నిరంతర ఆదరనీయముగా సద్గురుచింతన చేసినట్లయితే, మీకు ఒక సంవత్సర కాలములో మరొక పుత్రుడు జన్మించగలడు. వాడు ఉత్తముడై పవిత్రుడై మీ చెంతనే ఉంటాడని ఏ విధముగా ఆశ్వాసనము ఇచ్చినాడో, ఆ ప్రకా-రముగానే జీవుడు నిత్య నిరంతర దృఢ అభ్యాసము చేయగా చేయగా జ్ఞానపుత్రుడు ఉదయించెను. ఈ కథయొక్క లక్ష్యార్థమును ఎల్లప్పుడూ మననము చేయుచుండిన మీరు కూడా ఆ బ్రాహ్మీ స్థితిని బడయగలరు.

స్వస్తి శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినట్లయితే సకల పాపములు భస్మము కాగలవు. శ్రీ శివదాసస్వామి శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణాంబుజములకు ఈ ముప్పదియవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది ఒకటవ అధ్యాయము

పద్యానువాదము:–ఓసద్గురుదేవా! నీయొక్క సంబంధముద్వారా దుఃఖరూపమైన భవసాగ-ర నివృత్తిరూప లాభము ప్రాప్తించింది. ఓ కృపాసాగరా! అటువంటి సంసారము మోహవశాత్తున మళ్లీ నా అంతఃకరణమునందు ప్రవేశము కాకుండా ఉపాయమును బోధించుము స్వామీ!

సచ్చిదానంద స్వరూపుడవైన ఓ సద్గురుదేవా! నీవు చిత్స్వరూపుడవై, నిర్గుణ, నిర్ద్వంద్వ, నిర్వికల్ప, నిరాకార స్వరూపుడవు. అటువంటి నీకు జయ జయ కారములు. ఓ సిద్ధారూఢ సద్గురు-రాయా! నీయొక్క పూర్ణమైన స్వరూపాన్ని వర్ణించడానికి శృతిమాతకూడా మౌనము వహించినది. నీవు నిర్గుణ నిరాకార పరబ్రహ్మవైయుండి కూడా సగుణరూపములో ఏతెంచి భక్తులపై నీయొక్క కృపాదృష్టిని ప్రసరింపజేసి, భక్తులయొక్క అజ్ఞాన తిమిరమును నివృత్తి చేయుటకు మనోహర దివ్య మూర్తివై వెలసినావు. నిన్ను ఆశ్రయించిన ప్రతిభక్తునియొక్క దుఃఖము నివృత్తి చేసినావు.

ఒకానొక సమయమున సద్గురుదేవుని సాన్నిధ్యమునకు ఒక పండ్రెండేళ్ల బాలుడు ఏడుస్తూ వచ్చి స్వామి చరణకమలములపై వ్రాలినాడు.కరుణామూర్తియగు సద్గురుదేవుడు ఆబాలుని కరుణించి తన అమృతహస్తములతో లేపి తనప్రక్కన కూర్చుండబెట్టుకొని, ఈప్రకారముగా అడుగుతాడు. బాలుడా! నీవెవరవు? ఎందుకు దుఃఖిస్తున్నావు? ఎక్కడినుండి వచ్చినావు? ఎవరికి సంబంధించిన వాడవు? ఏమీ భయపడకుము. నాకు సమాధానం చెప్పుము.

**శ్లో ॥ కస్త్వం శిశో! కస్య కుతోఽసి గన్తా, కిం నామ తే త్వం కుత అగతోఽసి ।**

**ఏతన్మయోక్తం వద చార్భక! త్వం మత్ప్రీతయే ప్రీతి వివర్ధనోఽసి ॥** (శంకరవిజయము)

ఇటువంటి సద్గురుదేవునియొక్క శాంతమైన అమృతవచనములను వినిన ఆబాలుడు శాం-తము వహించి, ఓ సద్గురుదేవా! నాయొక్క ప్రార్థనను ఆలకించండి స్వామీ! ఈ ప్రపంచమునందు నాకు నావారంటూ ఎవరూ లేరు. ఇంతవరకు నావారంటూ ఎవరైతే ఉండిరో, వారు నన్ను ఇంటి నుండి గెంటివేసినారు. గృహబహిష్కారము చేసినారు. అంతేగాక నాకు తల్లితండ్రి పరివారముపై ఆసక్తి లేదు.

**శ్లో ॥ మాతా నాస్తి పితా నాస్తి, నాస్తి బన్ధూ సహోదరః ।**

**అర్థం నాస్తి గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత జాగ్రత ॥** (జీవప్రబోధ శ్లోకము)

నేను ఎల్లప్పుడు శివధ్యానమందు నిమగ్నుడనై ఉండడంచూచి,వారు అసూయతో ఈర్ష్యతో కోపగించి నన్ను ఇంటినుండి వెళ్లగొట్టినారు. ఇకముందు నేను ఇంటికి వెళ్ళను. నీ పాదాలచెంతనే ఎల్లప్పుడూ నీ సేవ చేసుకుంటూ ఉండగలను.నీవు సాక్షాత్ శివస్వరూపడవని నీయొక్క కీర్తినివిని, నీకు శరణుజొచ్చినట్లయితే తప్పకుండా నన్ను రక్షిస్తావని ఆశతో నీ పాదాలను ఆశ్రయించినాను. ఇప్పుడు ఈ దీనార్తుని రక్షిస్తావో లేక కొట్టుతావో నా భారము నీపై వేసి నిన్నే నమ్ముకున్నాను. నీవే శరణము. నీవే రక్ష. పాహిమాం పాహిమామ్.

"**శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్**" (గీత. ౭-౭)

**गुरुदेव दया करदो मुझ पर, मुझे अपनी शरण में रहने दो।**
**चाहे डूबा दो चाहे तैरा दो, मुझे अपनी शरण में रहने दो॥**

ఆ బాలునియొక్క ఆర్తనాదమును విన్న సద్గురుదేవుని హృదయము ద్రవించి, ఆ బాలునితో ఇలా అంటాడు.నీవు ఇక్కడనే నావద్దనే ఉండుము.నన్ను మనస్ఫూర్తిగా సర్వముత్యాగముచేసి శరణుజొచ్చినావు. కావున, ఇప్పటినుండి నీ పేరు శరణయ్య. ఈ ప్రకారంగా శరణయ్య సద్గురు సాన్నిధ్యములో ఉంటూ ప్రతిరోజు మధ్యాహ్నము గ్రామములోకి వెళ్లి భిక్షను అడుగుకొచ్చి, సద్గురుదేవుని ముందుంచేవాడు. సద్గురుదేవుడు దయదలచి బిక్షను స్వీకరింపుమని ఆజ్ఞాపిస్తే ప్రీతితో ఆరగించేవాడు. లేనిచో స్వస్థచిత్తుడై ఉండేవాడు.

ఒకసారి సద్గురుదేవుడు శరణప్పను పరీక్షింపగోరి శరణప్పకు భిక్షను ఇవ్వకనే భుజించినాడు. శరణప్ప సంకోచముజేయక శాంతచిత్తముతో సద్గురు నామస్మరణచేస్తూ స్వస్థచిత్తుడై ఉన్నాడు. ఒకరోజు ఉపవాసము ఉండి, మరుసటి రోజున యథాప్రకారముగా బిక్షకు వెళ్ళినాడు శరణప్ప. ఆ రోజున భిక్ష అధికముగా లభించినది. అయినాగాని సద్గురుదేవుని ఆజ్ఞలేనిదే అందులో నుండి నేను భిక్షను స్వీకరించను–అని నిశ్చయించుకున్నాడు. సద్గురుదేవుని ఆజ్ఞలేనిదే భిక్షను ఆరగించినట్లయితే అది విషముతో సమానమని భావించినాడు. పస్తులతో మరణించినా మంచిదే, కాని, సద్గురుదేవుని ఆజ్ఞను ఉల్లంఘించను–అని నిశ్చయించుకున్నాడు.

శరణప్ప గ్రామమునుండి బిక్షతీసుకొని రాగానే సిద్ధానాథుడు శరణప్పను ఇలా అడుగుతాడు. నీవు నిన్నటి రోజున ఉపవాసముంటివి. మరి ఏమైనా బిక్షను స్వీకరించినావా? అయినా నీవు అలాంటివాడవు కాదు, అని నాకు తెలుసు. ఇందులో ఏమి సంశయము లేదు–అని అంటాడు . ఇటువంటి సద్గురుదేవుని వచనములను విన్న శరణప్ప మారుమాట్లాడకుండా జోలె స్వామి ముందుంచి మౌనముగా, ఉదాసీనముగా వెళ్లి సేవలో నిమగ్నుడైనాడు. ఎల్లప్పుడూ ప్రసన్న వదనముతో సద్గురు నామోచ్చారణ చేస్తూ రెండు రోజులనుండి ఆహారము లేనప్పటికైనా సద్గురు సేవయందు

జాప్యము లేకుండా లగ్నమై సేవచేస్తున్నాడు. అందరి భక్తులతో వినమ్రుడై కలసి మెలిసి ఉండేవాడు. శరణప్పయొక్క శ్రద్ధాభక్తులు, ఆచరణ అందరికీ సంతోషాన్ని కలుగజేసేది.

మూడవ రోజున సిద్ధనాథుడు శరణప్పను దగ్గరకు పిలుచుకొని నాయనా! శరణప్పా! నాకు మామిడి పండ్లు తినాలనిపిస్తుంది. ఈమఠమునకు ఎదురుగా అదిగో, మామిడిచెట్టుఉంది. ఆచెట్టు-పై ఎక్కి మామిడి పండ్లు త్రెంపుము–అని అన్నాడు. శరణప్ప సద్గురుదేవుని ఆజ్ఞను శిరసా వహించి వెంటనే ఆ మామిడి చెట్టును ఎక్కుటకు పూనుకున్నాడు. మూడు రోజులనుండి పస్తులు ఉన్నందున కాళ్లు చేతులు వణుకుచున్నవి.ఎక్కుటకు సామర్థ్యము అంతగాలేదు.అయినాగాని శరణప్ప వెనుకంజ వేయక తన మనసులో ఇలాఅనుకుంటాడు. నాశరీరము, మనస్సు సమస్తమును ఆ సద్గురుదేవునికే అర్పించాను. ఇక ఈ దేహము నాది కాదు. ఆ సద్గురు దేవునిదే. నాదంటూ ఏమీ లేదు. ఈ శరీర-ముచేత సద్గురుదేవునికి ఏమైనా ప్రయోజనము (ఉపయోగము)ఉంటే దీన్ని ఆయనే కాపాడుకుం-టాడు. లేనిచో పారేసుకుంటాడు. తానే కోల్పోవును. నాకు ఈ శరీరముతో లాభం లేదు, నష్టము లేదు. ఇది నాదే కాదు. దీనితో నాకేమి అవసరము. ఈ దేహము ఆ సద్గురుదేవునికి అంకితము.

ఈప్రకారము శరణప్ప తన మనసులో చింతించి, ఇక చెట్టుపై ఎక్కడము ప్రారంభించాడు. ఆహారము లేక అశక్తుడుగా ఉన్నా, సద్గురుభక్తిని దృఢముగా ధరించి చెట్టుపై ఎక్కుతున్నాడు. వాస్త-వమునకు సద్గురుదేవునికి ఈ మామిడి పండ్లు ఏమి అవసరము.కాని,సద్గురుదేవుడు నన్ను తరింప జేయుటకు ఈరూపముగా లీల గావిస్తున్నాడు–అని విచారిస్తూ,సద్గురుచరణములను హృదయంలో స్మరించుకొని ఎక్కుచున్నాడు. సద్గురు నామోచ్చారణ చేస్తూ సద్గురుదేవుని చరణకమలములను పదేపదే హృదయమందు నిర్మల భక్తితో స్మరిస్తూ చెట్టు పైశాఖల వరకు ఎక్కినాడు. ఆ కొమ్మలపై కూర్చుండి ఫలములను తెంపి క్రిందికి పడవేసినాడు. సద్గురుదేవుడు ఆచెట్టు క్రిందనే నిలుచుండి శరణప్పతో ఇలా అంటాడు. నాయనా శరణప్పా! అదుగో, చూడుము. ఆచెట్టు అగ్రభాగంలో ఉన్న శాఖకు ఫలములు పుష్కలంగా ఉన్నాయి. ఆ కొమ్మకు ఎక్కి అక్కడున్న పండ్లను త్రెంపుము–అని అన్నాడు.అట్టి వచనములను సద్గురుదేవుని ఆజ్ఞగా శిరసావహించి వెనకాడకుండా మెల్లమెల్లగా ఆ చిటారు కొమ్మకు ఎక్కి పండ్లు త్రెంపుటకు తనచేయిని చాచినాడు. అంతే, కాళ్లు జారినవి. చేతులు పట్టుదప్పినవి. సిద్ధారూఢా! అని శరణప్ప కేక వేస్తూ ఒక్క క్షణంలో అతివేగముతో వచ్చి భూమిపై చరుచుకుపడ్డాడు. శరణప్ప మూర్ఛితుడైనాడు. దగ్గరలో ఉన్న భక్తజనులు అందరూ శరణప్ప వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, అయ్యో! ఎంతపని జరిగింది–అని దుఃఖిస్తున్నారు. సర్వమును సద్గురుదేవునికి అర్పించి సద్గురు సేవలోనే తన అసువులు కోల్పోతున్నాడని ఏడుస్తున్నారు. శరణప్ప ధన్యుడైనాడని అనుకుంటున్నారు.

అప్పుడు సద్గురు దేవుడు దగ్గరకు వచ్చి ఏమిటి ఏడుస్తున్నారు. శరణప్పకు ఏమీ కాలేదు. ఈయనగూర్చి నేను చూసుకుంటాను. మీరందరూ మఠమునకు వెళ్ళండి–అని ఆజ్ఞాపించినాడు. ఇట్టి సద్గురుదేవునియొక్క వచనములను విని భక్తులందరూ ఆశ్చర్యపడి సద్గురుదేవుని ఆజ్ఞమేరకు మఠ-ములోకి వెళ్లిపోయినారు.

అప్పుడు ఏకాంతములో పడిఉన్న శరణప్ప సమీపమునకు సద్గురుదేవుడు వచ్చి, శరణప్ప ప్రక్కన కూర్చుండి, వక్షస్థలముపై తన అమృతరూప చల్లని హస్తమునుంచి వక్షస్థలమును స్పర్శిస్తూ, నాయనా శరణప్పా! అని పిలిచాడు. ఇటువంటి సద్గురుదేవునియొక్క కరుణాపూరితమైన పిలుపు శరణప్ప చెవిలో పడగానే వెంటనే శరణప్పకు స్మృతికలిగి మెల్లగా కళ్ళుతెఱచి చూసేసరికి సద్గురు దేవుడు తన ప్రక్కనే కూర్చుని ఉన్నాడు. అప్పుడు సద్గురు సిద్ధనాథుడు శరణప్పను ఇలా అడుగుతాడు. నాయనా శరణప్పా! ఇంతవరకు నీకేమి అనుభవమునకు వచ్చింది తెలుపుము. అప్పుడు శరణప్ప అంటాడు. స్వామీ! నాకు ఏమీ అనుభవమునకు రాలేదు. నాకేమీ తెలియలేదు. సద్గురుదేవుడు శర-ణప్పతో ఇలా అంటాడు.శరణప్పా!నీకు ఏమీ తెలియలేదు–అనే ఏదైతే అనుభవమును పొందినావో, అదే నీయొక్క నిజమైన స్వరూపము. యథార్థమైన స్వరూపజ్ఞానము. మూర్ఛావస్థలో ఏమి స్పృహ లేకుండా ఉండి నాకేమీ తెలియలేదు–అని జ్ఞాతత్వ ధర్మముతో ఉన్నావు. అదే నీయొక్క యథార్థ స్వరూపమని నిశ్చయము చేసుకొనుము. ఈ ప్రకారముగా పలుకుతూ సద్గురుదేవుడు తనయొక్క అమృతహస్తమును శరణప్ప శిరముపై ఉంచినాడు. అదే క్షణమందు శరణప్ప కండ్లు మూసుకొని అంతర్ముఖవృత్తిచేసి చూసేసరికి తన హృదయములో ఆత్మజ్యోతి కానొచ్చింది. కోటిసూర్యుల ప్రకా-శముకంటె అధిక తేజోవంతమైన తన ఆత్మజ్యోతి తన ఎదుట విరాజమానమై ఉంది. ఆ తేజస్సులో శరణప్ప జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయరూప త్రిపుటిరహితమై ఆత్మజ్యోతిలో ఐక్యమై పోయినాడు.

ఇట్లు, పరమాత్మజ్యోతిని దర్శించి, క్షణకాలమైన తర్వాత కళ్ళు తెరిచి చూసినాడు. ఇంత వరకు దర్శింపబడిన అభేదస్వరూపము ఉత్థానకాలమందుకూడా అంతటా జ్యోతిస్స్వరూపముగనే కనిపించుచున్నది. నామరూపజగత్తంతయు గురుస్వరూపముగానే (వ్యాపకచైతన్యముగానే) గోచరి-స్తుంది. సర్వత్ర వ్యాపకపరబ్రహ్మమునే దర్శిస్తున్నాడు. నశ్వర దృశ్యమునుండి విముఖుడై దృక్ స్వరూపుడై, సాక్షియై తాను సర్వత్ర చైతన్యస్వరూపమునే దర్శిస్తున్నాడు. దృశ్యజాలమంతయు నశించిపోయింది. బ్రహ్మమునే వీక్షిస్తున్నాడు. పరిపూర్ణ నిరావృతమైన తనయొక్క అఖండానంద నిజస్వరూపమునే అనుభవిస్తున్నాడు. అప్పుడు శరణప్ప బ్రహ్మానందమును అనుభవించి ఇలా అం-టున్నాడు. ఆహా! ఏమిటి పరమానందము, ఇటువంటి నాయొక్క స్వరూపజ్ఞానమును పొందడానికి కారణము శ్రీసద్గురుదేవుడే. ఆయనను శరణజొచ్చుటవలననే నాకు ఈ స్వరూపానందము కలిగింది. నాయొక్క మోహము నష్టమైనది.

**శ్లో || నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత |**

**స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం త్వం ||** (గీత 18-73)

నేను ధన్యుడనైనాను. ఈ స్వరూపానందముతో సమమైనది ముల్లోకమునందు కూడా లేదు. ఈ మానవ శరీరమును ధరించి ఏది పొందాల్సి ఉండెనో, దాన్ని నేను పొంది కృతకృత్యుడనైనాను.

**శ్లో || యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః |**

**యస్మిన్ స్థితిలో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ||** (గీత 6-22)

అటు తరువాత సద్గురు సిద్ధనాథుడు శరణప్పకు ఈ ప్రకారముగా బోధిస్తాడు.నీవు ఎల్లప్పుడూ స్వరూప ధ్యానమునందే ఉండవలెను. విషయాసక్తిని నీ చిత్తమునుండి సమూలముగా త్యజించవలయును. ఒకవేళ నీ మనమునందు "నేను జ్ఞానమును పొందినాను" అని అహంభావమును స్వీకరించితివా, నీవు స్వరూపజ్ఞానమునుండి పతితుడవు కాగలవు. ఇంద్రియములద్వారా ఎక్కడెక్కడ నీ వృత్తి వెళ్ళునో, అక్కడక్కడ అద్వయస్వరూప బ్రహ్మమునే దర్శించి, సోహం భావమును పెంపొందింప జేసికొని సర్వత్ర నిర్విషయానందమును అనుభవించుము.

**శ్లో || దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్ |**

**సా దృష్టిః పరమోధారా నా నాసాగ్రావలోకినీ ||** (అప.116)

బాహ్యమైన శబ్దాది విషయములందు గల ఆసక్తిని త్యాగము చేయడము కఠినము కాదు. కాని, అంతఃకరణమం దలి విషయవాసనలు త్యాగము చేయడము చాలా కష్టము.

**శ్లో || విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః |**

**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ||** (గీత 2-59)

విషయవాసనలు తొలగించుకొనుటకు ఉపాయము చెబుతున్నాను వినుము. నీకు సద్గురు దేవుడు పరబ్రహ్మస్వరూపుడని (ఆత్మస్వరూపుడని) సోఽహం భావముచేత పూజ్యభావన ఎంత దృఢముగా ఉంటుందో, అదే విధముగా నీయొక్క వృత్తి విషయాలపై వెళ్లి విషయాకారమైనప్పుడు కూడా సద్గురు స్వరూపముగా భావించి, గురుస్వరూపమైన బ్రహ్మమునే దర్శించాలి. ఇట్లు సర్వత్ర అద్వైత పరబ్రహ్మస్వరూపమును దర్శిస్తూ, సోహం అభ్యాసము దృఢమగు కొలది అంతర్ బాహ్యములలో నిర్వికల్ప స్వరూపుడవై అఖండానందమును అనుభవించగలవు.

ఈ విధంగా సద్గురుదేవుని ముఖకమలము ద్వారా అతిగోప్యమైన బోధను ఏకాగ్రచిత్తముచే శ్రవణముచేసి ఇలా అంటున్నాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క అపారమైన కృపవలన నేను ధన్యుడనైతిని. ముమ్మాటికి ధన్యుడనైనాను. శరణప్ప చెట్టుపైనుండి పడినాడు, కావున, ఆయనయొక్క శరీరము మూడు రోజులనుండి పస్తులు ఉండడము వలన జర్జరమైనది. అటువంటి అశక్తుడైన శరణప్ప శరీరముపై సద్గురుదేవుడు తనయొక్క అమృతహస్తముచేత స్పర్శించి, శరణప్పను మళ్లీ యథాపూ-

ర్వకముగా పుష్టిని కలుగజేసి ఆరోగ్యవంతునిగా చేసినాడు. శరణప్ప వెంటనే లేచి సద్గురుదేవుని పాదపద్మములకు నమస్కరించినాడు. సద్గురునాథుడు తనయొక్క రెండు అమృత హస్తములతో శరణప్పను పైకిలేవనెత్తి మఠమునకు తీసుకెళ్లాడు. శరణప్పకు స్నానాదులుచేయించి, సద్గురుదేవుడు తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని తానుస్వయంగా శరణప్పకు ప్రేమతో, ఆప్యాయతతో పసిపిల్లవానికి గోరుముద్దలు తినిపించినట్లుగా తినిపించాడు. శరణప్ప ఎంతో ఆనందంతో తృప్తిజెందినాడు.

ఒకానొక రోజున సిద్ధాశ్రమమునకు ఒక గృహస్థుడు వచ్చి సద్గురుదేవునికి సవినయముగా నమస్కరించి నిలుచున్నాడు. ఆయనను చూసి సిద్ధనాథుడు ఇట్లు మందలించాడు. ఎవరు నీవు? ఏ కార్య నిమిత్తముగా వచ్చినావు?

అప్పుడు ఆగృహస్థుడు సమాధానమిస్తూ–మహాత్మా!నేను బీజాపూర్ నివాసిని.షణ్ముఖారూఢ స్వామియొక్క ఆశ్రమములో ఉంటాను. నీ వద్ద ఉన్నటువంటి శరణప్ప నాకు బాగా తెలుసు. ఈ శరణప్ప షణ్ముఖారూఢస్వామి ఆశ్రమములో పసిపిల్లవాడుగా ఉన్నప్పటినుండి పండ్రెండు సంవత్సర-ముల పర్యంతము నావద్ద ఉండినాడు. పండ్రెండు సంవత్సరాల క్రితము ఒకానొక రోజు రాత్రి షణ్ముఖారూఢస్వామి నిద్రించుచుండగా నీవు (సిద్ధనాథుడవు) స్వప్నంలో వచ్చి స్వామితో ఇలా చెప్పియుంటివి. ఏమనగా,

సూర్యోదయమైన పిమ్మట నీకు ఒక పసిబాలుడు దొరుకును. ఆయనకు సత్సంగము కల్పించి నిర్విఘ్నముగా స్వాధ్యాయాభ్యసనము జరుగునట్లుగా అన్ని విధములుగా వ్యవస్థలు ఏర్పాటు చేసే బాధ్యత నీపై ఉంది. తప్పకుండా ఆయనను కాపాడుము–అని చెప్పి అదృశ్యమైతివి. శ్రీషణ్ముఖారూఢ స్వామి కలగన్న వెంటనే మేల్కొని ఆశ్రమము బయట ఉద్యానవనములో చూసేసరికి అక్కడ ఒక దివ్యతేజస్సు కనిపించెను.అంతటా చీకటికమ్ముకొని ఉండగా ఒక పూలచెట్టు క్రింద మాత్రము ప్రకా-శము ప్రజ్వరిల్లుచుండెను. వెంటనే మళ్లీ చీకటి వ్యాపించింది. ఏమిటో? అని స్వామి తెల్లవారేవరకు విశ్రమించి సూర్యోదయము కాగానే రాత్రి స్వప్నము పడడమేమిటి? అదే రాత్రి లేచి చూసేసరికి పూలచెట్టు క్రింద తేజోపుంజము కనిపించి, మళ్లీ అంధకారము వ్యాపించడమేమిటి? చూద్దామని షణ్ముఖారూఢస్వామి ఆ పూదోటలో పూలచెట్టు క్రిందకు వెళ్లి చూసేసరికి చమత్కారమైన ఒక వింత జరిగింది. రాత్రి కనిపించిన స్వప్నము నిజమైనది.

పూలచెట్టు క్రింద శుభ్రమైన తెల్లని వస్త్రము కప్పబడి ఒక బాలుడు పరుండి ఉన్నాడు. స్వామి అత్యంత ఆనందభరితుడై ఆ బాలుని తన చేతులలోకి తీసుకొని ఎత్తుకున్నాడు. బాలుని మఠములోకి తీసుకొచ్చాడు. అందరూ ఆశ్చర్యముతో ముగ్ధులైనారు. ఆ సమయానికి షణ్ముఖారూఢస్వామికి ఎదురుగా నేను నిలబడి ఉంటిని. స్వామి ఆ బాలుని నా చేతుల్లో ఉంచి నాతో ఇలా అన్నాడు. ఈ

పసిబాలుని నీ కుమారునిగా భావించి అతిజాగ్రత్తగా పోషించుము. ప్రతినిత్యము నీవు శ్రవణమునకు వచ్చేటప్పుడు నీవెంట ఈబాలునికూడా తీసుకొని రమ్ము.

మాగృహము మఠమునకు సమీపములోనే ఉంది. ఆ బాలుని నా సొంత కుమారుని వలె పెంచి ప్రతిరోజు మఠమునకు స్వామియొక్క అమృతవచనాలను శ్రవణముచేయుటకు తీసుకెళ్లే వాడిని. ఈ ప్రకారముగా పండ్రెండు సంవత్సరములు పెంచి పెద్దచేసి పోషించినాను. అటువంటి ఈ శరణప్ప నన్ను విడిచి ఇప్పుడు నిన్ను ఆశ్రయించినాడు. అచ్చట షణ్ముఖారూఢస్వామి ఆశ్రమమందు నిత్యము సత్సంగ శ్రవణము చేస్తూ కాలము గడిపేవాడు.

ఒకనాటి ప్రాతఃకాలమున ఈ శరణప్ప కనిపించక పోయేసరికి అన్నిచోట్ల వెదకి వెదకి వేసట చెందినాము. అప్పుడు మీయొక్క సాన్నిధ్యము చేరి మిమ్ములను ఆశ్రయించినాడని తెలిసింది. నేను ఈయన కోసమే వచ్చినాను. అందుకని ఇప్పుడు మీ సన్నిధిలో ఉన్న శరణప్పను చూసి మీ ఆశ్రయములో ఉన్నందుకు నాకు చాలా సంతోషముగా ఉంది. వానిని దయచేసి మళ్లీ నాకు అప్పగించినట్లయితే నేను మా ఇంటికి తీసుకెళ్తాను. కరుణించి అంగీకరించి, ఆజ్ఞ ఇవ్వండి స్వామీ! అని గృహస్థుడు తనయొక్క వృత్తాంతమంతా వివరించినాడు.

ఆ గృహస్థునియొక్క సంగతి తెలుసుకున్నాక, సద్గురు సిద్ధనాథుడు శరణప్పతో ఇలా అంటాడు శరణా! చూడు–నిన్ను ఈ గృహస్థుడు పండ్రెండు సంవత్సరాలు పెంచి పెద్దజేసినాడు. నీకు తండ్రి వంటివాడు. నిన్ను శోధిస్తూ వచ్చినాడు. నిన్ను మళ్ళీ తమ ఇంటికి తీసుకుపోతాను–అని అంటున్నాడు. మరి నీయొక్క ఉద్దేశమేమిటి? చెప్పుము. బీజాపూర్ కు పోతావా? అని ప్రశ్నించాడు స్వామి. అప్పుడు శరణప్ప స్వామితో ఇలా అంటాడు.

ఓ సద్గురుదేవా! నేను బీజాపూర్ కు వెళ్ళను. మళ్లీ లౌకిక సాంగత్యము చేయలేను. ఒకవేళ నేను నిన్ను విడిచి వెళ్లితినా, విపత్తులో పడినట్లే. కావున, నీ పాదాలచెంత నా ప్రాణాలను త్యాగ-మైనా చేస్తాను, కాని నేను వెళ్ళను. అప్పుడు సద్గురు దేవుడు ఆ గృహస్థునితో అంటాడు. చూడయ్యా! వాడు నేను బీజాపూర్ కు వెళ్ళను–అని అంటున్నాడు. నీవేమో తీసుకుపోతాను అంటున్నావు. ఇక మీరే ఏ నిర్ణయమైనా తీసుకోండి–అని స్వామి ఉదాసీనముగా ఉంటాడు. అప్పుడు ఆ గృహస్థుడు అంటాడు. సద్గురుదేవా! నేను వాడిని బంధించి బలవంతముగా తీసుకుపోలేను. సరే! వాని అభీ-ష్టానుసారమే ఉండనీగాక! నీయొక్క ఆశ్రయమందు ఉంటే నాకుగూడా ఆనందమే. శరణప్ప చాలా ధన్యుడు. ఈప్రకారముగా ఆ గృహస్థుడు సద్గురుదేవునితో చెప్పి స్వామి పాదదర్శనము తీసుకొని బీజాపూర్ కు పయనమైనాడు. అప్పుడు శరణప్ప చిన్న వయస్సు గలవాడైనను యోగ్య అయోగ్య-ములు యెఱిగిన వివేకి కాబట్టి, ఆ గృహస్థుడు ఎంతైనా తన తండ్రితో సమానుడు కాబట్టి, శరణప్ప

దీనవదనుడై,వినమ్రుడై కృతఘ్నుతా దోషము రాకుండా ఆ గృహస్థునికి అడ్డముగా వెళ్లి పాదాలకు నమస్కరించి, నన్ను క్షమించమని వేడుకుంటాడు.

**శ్లో ॥ మిత్రద్రోహీ, కృతఘ్నశ్చ, యశ్చ విశ్వాసఘాతుకః ।**

**త్రయస్తే నరకం యాన్తి యావచ్చన్ద్రదివాకరమ్ ॥** (నీతిశాస్త్రము)

ఈప్రకారముగా శరణప్పను ఆ గృహస్థుడు క్షమించి, ఆశీర్వదించి తన స్వస్థానమైన బీజాపూర్ కు వెళ్లిపోయినాడు. గత అధ్యాయమందు చెప్పబడిన బసప్ప, దానవ్వలకు స్వప్నమందు జన్మించిన పుత్రుని శ్రీ సిద్ధారూఢస్వామి, "ఇది కలగాదు నిజమే అనుకోండి"అని చెప్పి ఆ శిశువును తీసుకొచ్చి శ్రీ షణ్ముఖారూఢస్వామికి అప్పగించి పండ్రెండు సంవత్సరముల పర్యంతము ఆయనకు సత్సంగమును, స్వాధ్యాయమును వ్యవస్థగావించినాడు.పూర్వజన్మయందలి తపోబలముచేత(పూర్వ పుణ్యముదయించి)యోగభ్రష్టుడై జన్మించి,సచ్ఛాస్త్రశ్రవణమునకు అధికారియైనాడు. తద్వారా అంతరంగమునందు తీవ్రతర వైరాగ్యము ఉదయించినది. ఆ బాలుడు పండ్రెండేళ్లు షణ్ముఖారూఢస్వామి సాన్నిధ్యమందు సచ్ఛాస్త్రశ్రవణము, స్వాధ్యాయము చేసి, ఇప్పుడు శ్రీసద్గురుసిద్ధారూఢ స్వామిని ఆశ్రయించి, స్వామి సాన్నిధ్యములో ఉండి స్వామికి దత్తపుత్రుడై, స్వామి పాదాలచెంత ఉంటూ అద్వయ, అమల, అఖండ బ్రహ్మమును తన స్వరూపముగా యెఱిగి స్వస్వరూప జ్ఞానమును పొంది ధన్యుడైనాడు.

గత అధ్యాయమునందు చెప్పబడిన లక్ష్యార్థము ప్రకారము జ్ఞానపుత్రుడు జన్మించి గుప్తంగా ఉండి, విషయత్యాగము చేసి సత్సంగమునాశ్రయించినప్పుడే సద్గురుదేవునికి శరణాగతి అయినప్పుడే సద్గురుదేవుని కృపగలిగి గురుస్వరూపమైన బ్రహ్మమును అనగా తన ప్రత్యగభిన్నపరబ్రహ్మస్వరూపమును తెలుసుకొని దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానమును పొంది ధన్యుడౌతాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకలపాపములు భస్మమైపోవును. శ్రీ శివదాసస్వామి శ్రీసద్గురుసిద్ధారూఢస్వామి చరణకమలములకు ఈముప్పది ఒకటవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది రెండవ అధ్యాయము

పద్యానువాదము:–సద్గురుదేవునియొక్క మంగళకరమైన వచనామృతమును శ్రద్ధాభక్తులతో శ్రవణముచేసి, ఎల్లప్పుడు సద్గురుదేవుని నామామృతమును స్మరించినందున సంసార దోషము నివృత్తమైనది. అభయస్వరూపుడైన సద్గురుదేవునియొక్క ప్రేమభరిత వచనములపై విశ్వాసముంచి సద్గురుదేవుని ప్రేమకు పాత్రుడనై సద్గురుదేవుని చరణకమలములను ఎల్లప్పుడు స్మరించుటచేత జయము కలిగినది.

ముముక్షుజనులకు ఆధారభూతుడైన సద్గురుదేవుడు ఎవరి శిరస్సుపై తనయొక్క అమృత హస్తముచేత స్పర్శిస్తాడో, అదేక్షణమందు శిష్యునికి జ్ఞానోదయమై,అంతఃకరణమునందు ఉన్మనీస్థితి అనగా (పరమాత్మ యందు విలీనము) కలిగి ఉద్ధరింపబడతాడు. సద్గురుదేవుని కృపకు పాత్రుడై ఉన్మనీస్థితిని పొందినచో, దానికి సమానమైనది ముల్లోకములలో మరొకటి లేదు. అటువంటి శ్రీ సద్గురు సిద్ధనాథ స్వామికి సాష్టాంగ ప్రణామములు.

ఒకానొక భక్తునికి శంక గలిగి సద్గురు సిద్ధనాథునితో ఈ విధముగా విచారిస్తాడు. స్వామీ! మీయొక్క కృపాహస్తములతో ఎవరి శిరస్సుపై స్పర్శిస్తావో, తత్క్షణమే కృతార్థులౌతారు–అని అన్నారు. కాని, నేను ప్రతిరోజు మీయొక్క పాదదర్శనము తీసుకొనునప్పుడు మీరు ప్రతినిత్యము నా శిరస్సు పై మీయొక్క అమృత హస్తమునుంచి ఆశీర్వదిస్తూనే ఉన్నారు. కాని, నాకు ఇప్పటివరకు జ్ఞానోద-యము కలుగలేదే?

అప్పుడు సద్గురు సిద్ధారూఢస్వామి ఆయనతో ఇలా అంటాడు. ఎవరైతే అంతఃకరణశుద్ధి కలిగియుండి సద్గురు దేవునిపట్ల అచంచల విశ్వాసముంచి శుద్ధాంతఃకరణమునందు శుద్ధభావము గలిగియున్నట్లయితే, అటువంటి జీవుడు జ్ఞాన ప్రాప్తి కలిగి ఉద్ధరింపబడతాడు. సద్గురుదేవునియందు జీవబుద్ధి మరియు మూర్తియందు పాషాణబుద్ధి కలిగియున్నయెడల కల్పకోటి జన్మలకైనా తరింప బడడు. జ్ఞానప్రాప్తి అసంభవము.

అప్పుడు ఆ భక్తుడు అడుగుతాడు. స్వామీ! శుద్ధభావన ఎలా కలుగుతుంది? సద్గురుదేవుడు సమాధానమిస్తూ:—శిష్యుడు సద్గురుదేవునిపట్ల దృఢవిశ్వాసముంచిన యెడల శ్రద్ధ ఉద్భవమై, ఆశ్రద్ధ దృఢమైనయెడల ప్రేమ కలుగును. ఆ ప్రేమయొక్క పరిపక్వ అవస్థయే భక్తి. **“సాత్వస్మిన్ పరమ**

**ప్రేమరూపా"**(నారద భక్తిసూత్రము).ఎప్పుడైతే అద్వయ భక్తిచేత సద్గురుదేవుని సేవచేస్తాడో, శుద్ధాంతః-కరణమునందు శుద్ధభావన గలిగి జ్ఞానమునకు సాధన కాగలదు.

అనన్యమైన (అభేద) భక్తితో సద్గురుదేవునికి తన సర్వస్వమును నిస్సంకోచభావంతో సమ-ర్పించుకొని సద్గురుదేవుని సేవలో సంలగ్నమైనచో అంతఃకరణము శుద్ధిపడి జ్ఞానోదయం కలగ గలదు.

**శ్లో శరీరమిన్ద్రియం ప్రాణాంశ్చార్థాన్స్వజన బాన్ధవాన్**
**ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్** (గురుగీత)

,

,

సేవచేసేవాడు,సేవచేయించుకునే వాడు ఇద్దరుగూడా ఒకటే–అనే నిశ్చయముగలిగి యుం-డాలి. ఎట్లు, శిష్యుడు తన శరీర సౌఖ్యము కొరకు అనేకయుక్తులను ఆలోచించి సుఖమును పొం-దుతాడో, అట్లే, సద్గురుదేవునియొక్క దేహమునుగూడా తనదిగా భావించుకొని, తగిన సదుపా-యములన్ని సమకూర్చాలి. సద్గురుదేవునికి ముందుగా భోజనప్రసాదములను సమర్పించి, మిగిలి-నచో సద్గురుదేవుని ఆజ్ఞమీదట తాను భుజించవలెను.

ఇటువంటి శుద్ధభావన హృదయమున ధరించి సద్గురుసేవచేసినచో తద్వారా దేహాభిమాన-ము నివృత్తమగును. ఎప్పుడైతే దేహాభిమానము సమూలముగా నివృత్తమగునో, అప్పుడు అది గమనించిన సద్గురుదేవుడు తనయొక్క కృపాహస్తమును శిష్యుని మస్తకముపైనుంచి ఆశీర్వదిస్తాడు. వెంటనే జ్ఞానోదయమగును. ఈవిధముగా ఎవరికైతే జ్ఞానప్రాప్తి→జిజ్ఞాస కలదో, వారు దేహా-భిమానరహితులై శుద్ధభావనచేత సద్గురుసేవ చేసినయెడల సద్గురుదేవునియొక్క కృపకు పాత్రులై అద్వయ, అమల, పరిపూర్ణ జీవబ్రహ్మైక్యజ్ఞానమును బడసి గురుశిష్యులు అభేదస్వరూపులని తెలుసు కొని తరింపబడతారు. ఇట్లు, సద్గురుదేవుని సేవచేసి సద్గురుకృపకు పాత్రులై తరించిన వారెవరు– అని జిజ్ఞాసగలిగినట్లయితే, అట్టి ఒకానొక భక్తుని చరిత్రను సద్గురుదేవుడు చెప్పుచున్నాడు.

సజ్జనులైన ఓ శ్రోతలారా! వినండి. పూర్వము శ్రీ సిద్ధారూఢస్వామి భారతదేశమును పర్యటన గావించి, 'హుబ్లీ'కి చేరుకొని "డుమ్ గేరి"స్థలములో ఉంటుండగా, సద్గురుదేవునితో గొల్ల పిల్లలువచ్చి ఆడుకొనుచుండెడివారు. ఆసమయములో ఎవరైనా భక్తులు సద్గురుదేవుని దర్శనార్థము వస్తే–స్వామి, వారి సందడినుండి తప్పించుకొని దూరముగా వెళ్లేవాడు. లేదా పరుగెత్తుకుపోయే వాడు లేదా మౌనముగానైనా కూర్చునేవాడు. ఈ ప్రకారముగా ఉంటుండగా ఒకానొక రోజున "హిరేమఠము"నకు చెందిన గురుపాదయ్య అనే ఒక భక్తుడు "డుమ్ గేరి" వద్దకు వచ్చి, గొల్ల పిల్లలతో ఆడుకొనుచున్న సిద్ధనాథుని చూసి ఆశ్చర్యమునొందినాడు. ఆ సమయమున సిద్ధనాథుడు

ఒక చెట్టుపైన కూర్చుని చేతిలో ఒక రాయిని తీసుకొని దానితో భూమి పైనున్న ఒక పిల్లవాడిని విసిరికొట్టినాడు. ఆ రాయి పిల్లవాని శిరమున తాకగా, వాడు కెవ్వున కేకవేసి ఏడవసాగినాడు. పిల్లలంతా అల్లరి చేస్తుండగా వారి అలజడిని విని, స్వామి మరికొన్ని రాళ్ళను తీసుకొని "శివాయ నమః" అని ఉచ్ఛరిస్తూ, దెబ్బతగిలి ఏడుస్తున్న పిల్లవాణ్ణి మళ్లీ రాళ్లతో విసిరి కొట్టినాడు. రెండవ రాయి ఎప్పుడైతే ఆ పిల్లవానికి తగిలినదో వెంటనే పిల్లవానియొక్క బాధ ఉపశమనమై ఏడవడము మానివేసి శాంతించినాడు. అది చూసిన భక్తులంతా ఆశ్చర్యచకితులైనారు. పిల్లలంతా నవ్వుతూ ఎగురుతూ ఆడుచుండిరి.

దూరముగా నిలుచుండి తిలకిస్తున్న గురుపాదయ్యకు చాలా ఆశ్చర్యము కలిగి తనలో తాను ఇలా అనుకుంటాడు.లోకులు ఈయనను పిచ్చివాడని ఎగతాళిచేస్తూ అవమానిస్తారు.కాని, ఈయన మాలాంటి మూఢజనులను ఉద్ధరించుటకు మాభాగ్యము కొద్ది వచ్చిన అవధూత పురుషుడున్నాడు. ఇటువంటి మహాత్మునియొక్క కృపాదృష్టి మాపైపడిన చాలు. మా సకలపాపములు భస్మమైపోతా-యి ఈ మహాత్మునియొక్క సేవచేసినచో సంసార సాగరమునుండి నిశ్చయముగా తరింపబడతారు. ఈయన నిశ్చయముగా బ్రహ్మజ్ఞాని పురుషుడున్నాడు. ఇటువంటి అవధూత మహాత్మునికి స్నానాది శౌచక్రియలు గావించి అన్నాహారములు సమర్పించి సేవచేసి, ఆయన కృపకు పాత్రుడనైనచో నేను నిజముగా ధన్యుడనౌతాను.

అని ఇట్లు "గురుపాదయ్య" నిశ్చయముగా సద్గురు సేవచేయుటకు సంసిద్ధుడైనాడు. కాని, సద్గురు సిద్ధనాథుని పరిచయము లేనందున స్వామివద్దకు పోవుటకు భయపడుచుండెను. ఒకవేళ నేను స్వామి సన్నిధికి పోయి నా సంకల్పమును విన్నవించుకుందామంటే, ఆయన ఇంకా దూరంగా పరుగెత్తుకొని వెళ్లేటట్టుంది. ఏమిటి ఉపాయము? అని విచారించి, మెల్లమెల్లగా స్వామితో ఆడుకొనుచున్న పిల్లల వద్దకు వచ్చి, ఎవరినైతే స్వామి రాయితో కొట్టినాడో, ఆ బాలున్ని దగ్గరకు పిలుచుకొని ఈ విధంగా అడుగుతాడు. బాబూ! నిన్ను ఆయన రాయితో కొట్టినప్పుడు ఏడ్చినావు. మళ్లీ మరొక రాయితో కొట్టినప్పుడు శాంతించి ఏడుపు మానేసినావు. ఇది యెట్లు సంభవించింది? మొదలు కొట్టడము రెండవసారి కొట్టడములో దెబ్బ తగలడము సమానమే కదా! అలాంటప్పుడు మొదటనేమో ఏడ్చినావు. రెండవసారి కొట్టినప్పుడు ఏడుపు మాని నవ్వినావు. కారణమేమిటి? నాకు బోధపడడం లేదు–అని అడగగా, ఆబాలుడు సమాధానమిస్తూ–ఈయన పిచ్చివాడు అని అనడము నిజమే. కాని, ఆయన మహిమ చాలా అద్భుతము. మాతో కలిసి ఆడుతూ మమ్ములను అప్పుడే ఏడిపించి, మళ్లీ అప్పుడే నవ్విస్తాడు. ఆయన లీలలు అలాగే ఉంటాయి. ఆయన మొదటిసారి నన్ను రాయితో విసరి కొట్టినప్పుడు నాకు చాలా దుఃఖము కలిగింది. రెండవసారి "శివాయ నమః" అని ఉచ్ఛరిస్తూ రాయితో కొట్టినప్పుడు సుఖము కలిగింది. ఇప్పుడేకాదు, ప్రతినిత్యంకూడా ఇలాగే మాతో

కలిసి ఆడుతూ మాకు వినోదమును కలిగిస్తాడు. ఈయనయొక్క లీలలు ఎవరికి అర్థము కావు–అని పిల్లవాడు చెప్పినాడు. ఇటువంటి వచనములను విన్న "గురుపాదయ్య"కు చాలా ఆనందము కలిగి, మళ్లీ ఆ బాలుని ఇలా అడుగుతాడు. అవును బాబూ, నువ్వు చెప్పింది చాలా బాగుంది. మరి ఈ సిద్ధనాథుడు ఏమి సేవిస్తాడు? భోజనము ఏమి తీసుకుంటాడు? అని అడుగుతాడు. అప్పుడు ఆ బాలుడు ఉత్తరమిస్తూ, అయ్యా! మేము గొల్లపిల్లలము. గొర్ల కాపరులము. కావున, సిద్ధనాథుడు మావద్ద గొర్రెపాలు అడుగుకొని తాగుతాడు. అప్పుడప్పుడు మేము తలకొక కొంత రొట్టెముక్కను ఇస్తే దాన్ని తిని తృప్తిచెందుతాడు. అదికూడా లభించనప్పుడు రేగడిమట్టి మరియు నీరు కలుపుకొని తింటాడు.

ఈ ప్రకారముగా ఆ బాలునిచే చెప్పబడిన సద్గురుదేవుని వృత్తాంతమును విని గురుపాదయ్య చాలా దుఃఖితుడైనాడు. ఎలాగైనా సరే, ఈ మహాత్మునికి అన్నాహారములను సమర్పించి సేవచేసి ఈయన కృపకు పాత్రుడనై ధన్యుణ్ణి కావాలని దృఢనిశ్చయము చేసుకొని " గురుపాదయ్య" నేరుగా ఆ చెట్టు క్రిందకు వచ్చినాడు. గురుపాదయ్య చెట్టు కిందకు రావడముచూసి సిద్ధనాథుడు చెట్టుదిగి దూరముగా వెళ్ళబోతుండగా, గురుపాదయ్య సద్గురుదేవుని పాదములను పట్టుకొని నమస్కరించ బోగా, సిద్ధనాథుడు తప్పించుకోవడానికి తనయొక్క పాదములు ఝులిపించి తన్నినాడు. ఆ తన్ను-తో గురుపాదయ్య మస్తకమునకు బాధ కలిగింది. అయినాగాని పట్టువిడువకుండా ధైర్యముగా నమ్రభావముతో సిద్ధనాథునికి అడ్డముగా నిలబడి చేతులు జోడించి, గురుపాదయ్య స్వామితో ఇలా అంటాడు. స్వామీ! మీయొక్క చరణకమలములను నాయొక్క మస్తకమునకు స్పర్శచేసి నన్ను ఏ ప్రకారముగా ధన్యుణ్ణి చేసినావో, అవే పాదములను మా ఇంటియందు మోపి మమ్ములను అందరిని ధన్యులను చేయుము.

అప్పుడు స్వామి తనలో తాను అనుకుంటాడు. వీడిని నేను తన్నినప్పటికైనా నన్ను విడవ కుండా ప్రార్థిస్తున్నాడంటే వీడు నిర్భయ భక్తుడు ఉన్నట్లుంది–అని అనుకొని తనలో తాను నవ్వుకొని గురుపాదయ్యతో స్వామి అంటాడు. ఏమయ్యా! నేను మీ ఇంటికి వస్తే నాకేమిస్తావు? ఆ ఇచ్చేది ఏమిటో ఇక్కడికే తీసుకొచ్చి ఇవ్వు. నేను మీ ఇంటికి రాను. అందుకనే నీవు తొందరగా మీ ఇంటికి వెళ్ళుము–అని ఆజ్ఞాపించినాడు. ఎలాగైతేనేమి స్వామి నాయొక్క కోరికను మన్నించినాడు.ఇక నేను ధన్యుడనే అనుకొని వెంటనే గురుపాదయ్య తమ ఇంటికి పరిగెత్తుకుంటూ వెళ్లి తన భార్యతో ఇలా అంటాడు. మనకు ఇప్పుడు తరగని ధనము దొరికింది. మనము ధన్యులమైనాము. నేను ఈరోజు ఒక అవధూత మహాత్ముని దర్శించినాను. ఆయనకు మనము ఈరోజునుండి భోజన ప్రసాదములు సమర్పించుకొని ధన్యులము కావాలి. కావున, తొందరగా అన్నము రొట్టె తయారు చేయుము. నేను ఆ భోజనప్రసాదమును తీసుకెళ్లి ఆ అవధూత పురుషునికి సమర్పిస్తాను. నేటికి మన జన్మ సార్థక-

మైనది–అని గురుపాదయ్య భార్యతో అంటాడు. పతిదేవునియొక్క వచనములను విని పతివ్రతయగు పత్ని తొందరగా భోజనము తయారు చేసి కొంచెము సంకోచభావంతో తన భర్తచేతికి ఇచ్చింది. ఆ ప్రసాదమును తీసుకొని గురుపాదయ్య బయలుదేరినాడు. గురుపాదయ్య పత్ని సంకోచించడానికి కారణమేమంటే, వారి కుమారుడు ప్రతిరోజు భిక్షకు వెళ్లి దొరికిన బిక్షను తీసుకొచ్చి తల్లికి ఇస్తే, అప్పుడు తల్లి వంట తయారుచేస్తుంది. దానితో తల్లి, తండ్రి, కుమారుడు ముగ్గురు కాలము గడిపేదే కష్టమయ్యేది. ఇటువంటి క్లిష్టపరిస్థితుల్లో ఉన్నప్పుడు తన భర్త మరొకరికి భోజనము సమర్పిం-చాలంటే ఇబ్బంది ఉంటుంది కదా! అనుకొని ఆమె సంకోచించినది.

కాని, భక్తిపారవశ్యముచేత గురుపాదయ్య గమనించలేదు. భార్య ఇచ్చిన భోజన ప్రసాద-మును గురుపాదయ్య తెచ్చి సద్గురుదేవునికి భక్తిపూర్వకముగా సమర్పించుకున్నాడు. అప్పుడు స్వామి ఆ ప్రసాదమును పిల్లలకు పంచిపెట్టి, మిగిలిన కొంచెమును తాను సేవించి, స్వామి ఇలా అంటాడు. ఏమయ్యా! కొంచమే అన్నము తెచ్చితివి.అది ఎవరికీ సరిపడకపోయెను.ఇంకా చాలా తెచ్చి ఉన్న-ట్లయితే అందరికీ సరిపడేది కదా! అప్పుడు గురుపాదయ్య సరే స్వామీ, ఇప్పుడే వెళ్లి తీసుకొస్తాను–అని తిరిగి తన ఇంటికివెళ్లి చూసేసరికి భార్య, కుమారుడు వారివారి భోజనభాగమును తినేసినారు. ఇక గురుపాదయ్య భాగము మాత్రమే మిగిలి ఉంది. సరే అనుకొని, గురుపాదయ్య తన భాగపు భోజనము తీసుకొనివచ్చి సిద్ధనాథుని ముందుంచినాడు.తాను ఆపూటఉపవాసమున్నాడు.అయినా గాని ఒక అవధూత పురుషుని సంతృప్తి పరిచినాను–అనే సంతోషమును పొందినాడు. తాను ఇలా అనుకుంటాడు. ఈరోజు నేను సద్గురుదేవునికి ప్రసాదమును సమర్పించుకొని ధన్యుడనైనాను. నేను ఈరోజు నిజమైన ఉపవాసవ్రతము చేసినట్లయినది.

సద్గురుదేవుడు ఆ ప్రసాదమును స్వీకరించి దానిని పిల్లలకు పంచిపెట్టగా మిగిలిన అల్ప అన్నమును తాను తిని ఒక రొట్టెముక్కను మాత్రము మిగిల్చి దానిని గురుపాదయ్యకు ఇస్తాడు. దానిని సంతోషముతో స్వీకరించినాడు. వినయముతో భక్తిభావముతో చేతులు జోడించి దూసిలొగ్గి దానిని అమృతముకన్నా మిన్నగా, సద్గురు మహాప్రసాదముగా భావించి సేవిస్తాడు. ఆ చిన్న రొట్టె ముక్కను తినగానే కడుపునిండా తిన్నట్లుగా త్రేపులు వచ్చాయి. గురుపాదయ్యకు ఎంతో ఆశ్చర్యము కలిగింది. గురుపాదయ్య అనుకుంటాడు, ఆహా..... ఈ మహాత్ముడు సాక్షాత్ ఈశ్వరుడే. ఇటువంటి సద్గురుదేవుని సేవ చేసినట్లయితే నా జన్మ ధన్యము కాగలదని అనుకున్నాడు.

ఈ విధముగా గురుపాదయ్య సద్గురుదేవునికి నమస్కరించి తన ఇంటికి పోతుండగా, కొందరు అయ్యలు( జంగమయ్యలు) బాటలో కలిసి గురుపాదయ్యను ఇలా అడుగుతారు. ఏమయ్యా! ఎక్కడికి వెళ్లావు? సిద్ధనాథుని వద్దకు వెళ్లి వస్తున్నాను–అని గురుపాదయ్య జవాబిచ్చాడు. అప్పుడు ఆ అయ్యలు అంటారు.అవును,మాకు తెలుసు.నీవు ఆశూద్రుని చేతులద్వారా రొట్టెముక్కను తీసుకొని

తిన్నావు కదూ! ఇది మేము కండ్లనిండా చూచితిమి. ఈవిషయము గ్రామపెద్దలకందరికీ చెప్పెదము. నీవు కులభ్రష్టుడవైనావు. నీ పరువుప్రతిష్టలు మట్టిలో కలిసిపోయినవి. నిన్ను ఆ శూద్రునివద్ద భోజనము చేయడానికి ఎవరు పిలిచినారు. నిన్ను తప్పకుండా కులబహిష్కారము చేసెదము. రెండవ అయ్య అంటాడు. నీవు మా కులము కట్టడి (సంప్రదాయము)ను విడిచి భ్రష్టుడవైనావు. అందుకని నిన్ను కులమునుండి బహిష్కరిస్తున్నాము. ఇంకా ఆ అయ్య గురుపాదయ్యతో ఇలా అంటాడు–నీవు "హిరేమఠము"ను విడిచి తక్షణమే వెళ్ళిపో, లేనిచో ఆ శూద్రుడైన సిద్ధనాథుని అయినా వదులుకో– అట్లు చేసినట్లయితే నీకు ప్రాయశ్చిత్తము చేసి, మళ్ళీ మా కులములో చేర్చుకుంటాము–అని అంటారు. అప్పుడు గురుపాదయ్య వారికి సమాధానమిస్తూ—నేను సద్గురు సిద్ధనాథుని విడిచి ఒక్క క్షణము కూడా ఉండలేను. ఆయన సాక్షాత్ ఈశ్వరావతారము. ఇది నాకు నిశ్చయమైనది. కావున, నేను స్వామిని విడువను. నేను ఒక్కడినే మఠమును విడిచి వెళ్లిపోగలను. కాని, నా భార్య, కుమారుడు ఇక్కడే ఉంటారు. నేను తప్పుచేసినాను, కావున నేనే ఆ శిక్షను అనుభవించగలను. అప్పుడా అయ్యలంటారు–ఆ పిచ్చివాడిని ఈశ్వరుడని నమ్ముకొని కులభ్రష్టుడవైనావు. భ్రమలోపడి బాధలకు గురైనావని బెదిరించారు.

ఇటువంటి వచనములను విని గురుపాదయ్య తటస్థముగా ఉండిపోయినాడు. అప్పుడు తన భార్య కూడా కోపమునకువచ్చి సిద్ధనాథుని సంబంధము వదులుకొమ్మంటుంది. పుత్రుడుకూడా మందలించి, నీవు ఆ శూద్రుని వదిలివేయుము. మనము మన ఇంట్లో ఎప్పటివలె జీవితము గడుపుకుందాము. ఎందుకు ఈ బాధలు కొనితెచ్చుకుంటావు. ఆ పిచ్చివాని వలలోపడి నీవుకూడా పిచ్చి వాడివయ్యావు. ఆయనను విడువుము. లేనిచో ఇక్కడినుండి వెళ్ళిపో! నీకు వయసు మళ్ళింది. ముసలితనము వచ్చి బుద్ధి భ్రష్టమైనది–అని కోపించినాడు.

ఇటువంటి మాటలు విని గురుపాదయ్య మౌనము వహించినాడు. సరే, అనుకొని చేతిలో ఒక జోలె తీసుకుని ఇల్లు వదిలినాడు. గ్రామంలోకి పోయి భిక్ష అడుగుకొని నేరుగా సిద్ధనాథుని వద్దకువచ్చి ఆ భిక్షను సిద్ధనాథుని ముందుంచినాడు. దానిని స్వామి స్వీకరించినాడు. ఈ ప్రకారంగా గురుపాదయ్య సద్గురు సిద్ధనాథుని వద్దనే స్వామి సాన్నిధ్యములోనే కాలము గడుపుతున్నాడు.

గురుపాదయ్యయొక్క భక్తి, ఇతర భక్తులను కూడా ఆకర్షించింది. ఇతర భక్తులు కూడా సద్గురుదేవుని దర్శించి స్వామిపై శ్రద్ధ ఉంచి పునీతులైనారు. భక్తులయొక్క ప్రార్థన మరియు ఆగ్రహము మేరకు సద్గురుదేవుడు వారి వారి ఇండ్లకు వెళ్లి మహాప్రసాదమును స్వీకరించేవాడు. మరి కొందరు వారి వారి ఇండ్లయందు సద్గురుదేవుని ముఖకమలముద్వారా సచ్ఛాస్త్రశ్రవణము చేసేవారు. అందరూ ఆనందించేవారు. సద్గురుదేవుడు భక్తులయొక్క ఉద్ధరణ కార్యమందు సంలగ్నమైనాడని గురుపాద య్యయొక్క హృదయము ఆనందముతో ఉప్పొంగిపోయింది. భక్తుల కళ్యాణకార్యమందు

సద్గురుదేవుడు యథార్థమైన జ్ఞానప్రబోధము చేయుచుండగా చాలా సంతోషపడినాడు. గురుపాదయ్య సంకల్పానుసారముగా కార్తీక శుద్ధ పౌర్ణమి రోజున మహావైభవముగా సద్గురుదేవునియొక్క పూజ చేయాలని అందరూ భక్తులు నిర్ణయించుకున్నారు. వైభవముగా మండపమును నిర్మించి దానియందు సద్గురుదేవుని కూర్చుండబెట్టుటకు మహోన్నతమైన సింహాసనమును నిర్మించినారు.

ఇట్లు, కార్తీకపౌర్ణమి రోజు చూస్తుండగానే రానే వచ్చింది. అందరికి కన్నుల పండుగగా ఉంది. దయాసాగరుడైన సద్గురుదేవుని ఉన్నతాసనముపై ఆసీనముగావించి స్వామిని వైభవముగా అలంకరించి, ఆనందపరవశులైనారు. శిరస్సుపైన పుష్పకిరీటము, మెడలో దివ్యమైన హారము, వక్షస్థలమందు రత్నాలహారము, కంఠమునందు మెరయుచు మిరిమిట్లుగొల్పునట్టి ముత్యాల హారమును స్వామికి ధరింపజేసినారు. శరీరమంతటా పుష్పహారములు దేదీప్యమానమై శోభించుచుండెను. భుజములపైనుండి దివ్యమైన పీతాంబరమును ధరింపజేసినారు. స్వామి మనోహరమైన, సుందరమైన, దివ్యమైన ఆభూషణములతో ప్రకాశించుచుండెను. స్వామియొక్క కృపాదృష్టి, శాంతముద్ర కలిగి సింహాసనముపై విరాజిల్లుచుండెను.స్వామియొక్క దర్శనమాత్రముచేత భక్తులయొక్క మరియు (అభక్తుల)దుష్టులయొక్క హృదయగ్రంథిగూడా విచ్ఛిన్నమై,శ్రద్ధ ఉత్పన్నమై భక్తులుగా మారినారు. ఎవరైతే భక్తులు పూజా వైభవమును దర్శించినారో, వారు "సాక్షాత్ ఈశ్వరునియొక్క దర్శన భాగ్యము మాకు కలిగింది, మేము ధన్యులమైనాము" అని అనుకొని ఎంతో ఆనందపరవశులైనారు.

రోజురోజుకు ప్రజలలో భక్తి వ్యాపించి "హుబ్లీ"లో మరియు నలువైపుల సద్గురుదేవునియొక్క కీర్తి విస్తరించింది. పరదేశములనుండిగూడా భక్తులు స్వామియొక్క దర్శనార్థము వస్తున్నారు. దిన దినము భక్తులయొక్క సందడి ఎక్కువగుచున్నది. ఎందరో భక్తులు స్వామికి శిష్యులుగా హుబ్లీలోనే ఉండిపోయినారు. ఎందరో లింగాయతులు స్వామికి శిష్యులైనారు. భక్తులు మరియు శిష్యులు కలసి భవ్యమైన మఠమును నిర్మాణము గావించినారు. ఎవరైతే గురుపాదయ్యను కులబహిష్కారము చేసియుండిరో, వారే మళ్లీ గురుపాదయ్యను కులములోచేర్చుకున్నారు. ఆలుపిల్లలకు, బంధుమిత్రులకు, కులపెద్దలకు అందరికి దూరమై,లింగాయతులు ఎంత బాధించినా అన్నిటిని సహిస్తూ సద్గురుదేవునికి శరణాగతి పొంది, అచంచల దృఢవిశ్వాసముతో సద్గురుదేవుని సేవ చేసినందుకు గురుపాదయ్య చాలా ధన్యుడు. సద్గురుదేవుని చరణారవిందములను ఆశ్రయించి ధన్యుడైనాడు.

గురుపాదయ్య మొమ్మొదట స్వామిని దర్శించినంత మాత్రముననే సద్గురుదేవుడు యోగ్యుడున్నాడని గ్రహించి, స్వామిని తన సద్గురుదేవునిగా ఎన్నుకొని, ఆయన సేవలోనే నిమగ్నుడై, స్వామియొక్క కృపకు పాత్రుడై, అజ్ఞానాంధకారమును దూరము చేసుకున్నాడు. ఎన్నో దుఃఖములను సహించినాడు. సంసారసాగరమునుండి తాను తరించి ఇతర భక్తులనుగూడా భక్తిలోనికి ప్రేరేపించినాడు. అనేక జనులుగూడా సద్గురుదేవుని కృపకు పాత్రులై అక్షయ సంపత్తియగు మోక్షధామ-

మును పొంది ఉద్ధరింపబడినారు. ఆర్తరక్షకుడైన సిద్ధదయాసాగరుడు కేవలము తనను ఆశ్రయించినంత మాత్రముననే భక్తులను భవసాగరమునుండి విముక్తులనుజేసి భవబంధములను నాశనము చేసినాడు. స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము, కేవల శ్రవణ మాత్రముననే సకల పాపములను భస్మము చేయును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది రెండవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వతి నమః

# ముప్పది మూడవ అధ్యాయము

పద్యానువాదము:—ఓ సిద్ధారూఢ సద్గురునాథా! దయాసాగరా! వైరాగ్య శాంతిస్వరూపా! ద్వైతమును నిరసించి అఖండ అద్వైతమును స్థాపించి భక్తులను సంసారమునుండి తరింపజేయగల ఓ సద్గురుదేవా! నిన్ను స్మరించినంత మాత్రముననే సకలదోషములను నివృత్తిచేసి నీ సేవకులయొక్క సమస్త సంకటములను నివృత్తి చేయగల ఓ సద్గురుదయాసాగరా! నీకు సాష్టాంగ నమస్కారములు.

ఓ సిద్ధారూఢ యతీశ్వరా! భక్తవత్సలా! దీనరక్షకా! ఓ కృపాసాగరా! జగదోద్ధారా! నీకు నమస్కారములు. నీయొక్క సత్తచేతనే చరాచరసృష్టి క్రమబద్ధముగా నడుస్తున్నది. అజ్ఞానినైన నేను నీయొక్క సత్తను,మహిమను కనలేకున్నాను. అమాయకుడనైన నేను నిన్ను యథామతిగా స్మరిస్తున్నాను. సర్వసమర్థుడవైన నీవు నాయొక్క అల్పబుద్ధియందు సత్తా స్ఫూర్తిని, నీయొక్క కథను వర్ణించుటకు బుద్ధికౌశల్యమును ప్రసాదించుము. నీయొక్క అనుగ్రహమువలన మూగవాడైనను మాట్లాడగలడు.

**శ్లో ॥ మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్ ।** (భవిష్యమహాపు.బ్రా.పర్వము 1-3)

ఓ సద్గురు సిద్ధనాథా! నీయొక్క చరిత్రను ప్రకటముచేయాలని నాలో ప్రేమావేశము ఉప్పొంగి వస్తుంది. కావున, దయచేసి నీయొక్క అగాధమైన చరిత్రకథను విస్తారముగా వర్ణించి ప్రకటము చేయుటకు శుద్ధమైనప్రేమను బుద్ధికౌశల్యమును, స్ఫూర్తిని ప్రసాదించి,రక్షింపుము స్వామీ! నక్షత్రములమధ్య చంద్రునియొక్క కళ విశేషముగా ఎట్లు ప్రకాశించుచుండునో, అదేవిధంగా సంతుమహాత్ముల చరిత్రలయందు నీయొక్క లీలలు అత్యద్భుతము. నీయొక్క మహిమలు అగాధము. మహాత్ముల గాథలలో నీయొక్క దివ్యచరిత్ర తలమాణికమువంటిది. అందువలన నీయొక్క సచ్చరిత్రమును విస్తారముగా వర్ణించబూనిన నన్ను ఆశీర్వదింపుము స్వామీ! సంతు మహాత్ములయొక్క కథను కీర్తిని ప్రకటము చేయడమే నాయొక్క ముఖ్య అభిప్రాయము మరియు ప్రియముగూడ–అంటూ సద్గురు దేవుడు స్వయముగా నా హృదయమందుండి సంతుమహాత్ములయొక్క కీర్తిని ప్రతిపాదించుచున్నాడు.

**'గర్గగ్రామము'** అనే ఊరిలో **"మడివాల స్వామి"** అను పేరుగల మహాత్ముని చరిత్రను ప్రక-టించమని సద్గురుదేవుడు శరణప్పను అడిగినాడు. అప్పుడు సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి సంతు కథను ప్రతిపాదించుటకు పూనుకొనగా—

సద్గురుదేవుడు పూర్వకథను స్మరించుకొని ఈ విధముగా చెప్పుచున్నాడు. సద్గురుదేవుని యవ్వనకాలమందు జరిగిన సంఘటన—

కర్ణాటక దేశమందు అతిసుందరమైన, మనోహరమైన వన ఉపవనములతో కూడిన "కిత్తూరు" అనే ఒక రాజధాని నగరము ఉండెను. ఆ నగరమందు ఒక మహాత్ముడు ఉండేవాడు. అయితే ఆ మహాత్ముని వద్దకు సకల వేదశాస్త్రపారంగతుడైన బ్రహ్మచారి **"మడివాలప్ప"** అనే పేరు గలవాడు వచ్చినాడు.ఆయన విద్యాభ్యాసమునందు నిపుణుడుగానుండెను.ప్రతివిషయమును ధారణ చేసే శక్తి ఆయనయందు విశేషముగా ఉండెను. గురుకృపద్వారా సకలశాస్త్రములను ముఖోద్గత-ముగా అభ్యసించినాడు.

ఒకానొక రోజున గురుదేవుడు గ్రామాంతరమునకు వెళ్లిపోయినాడు. అదే సమయానికి ఆ ప్రాంతపు రాజకన్యలిరువురు 'మడివాలప్ప' ఒంటరిగానున్నదిగాంచి మఠములోకి అరుదెంచి ఆయ-నను సమీపించి– పరీక్షింపగోరి అనేక ప్రకారములుగా కామచేష్టలు–మనోవికారము, కామోద్రేకము కలుగునట్లు నటించి భ్రష్టున్ని చేయాలని ప్రయత్నించినారు. అయినాగాని మడివాలప్ప తీవ్రతర పరిపక్వవైరాగ్య సంపన్నుడు, కావున, వారిచేష్టలకు ఏమాత్రము చలించక వారికి వశపడక అజే-యుడై, ఆ రాజకుమార్తెల ముఖముగూడా చూడలేదు. తనయొక్క స్వాధ్యాయమునందే స్థితుడై యుండెను. వారు ఎన్నిప్రకారముల కామక్రీడలు గావించినాగాని,వారి ముఖమైనను చూడక మారు మాట్లాడకుండెను. రాజకుమార్తెలు మడివాలప్ప వైరాగ్యమునుగాంచి ఆశ్చర్యచకితులై నిరాశజెంది మన ఆటలు ఇక్కడ ఏమి సాగేటట్టు లేవని అనుకొని వచ్చిన దారిన వారి గృహమునకు వెళ్ళి పోయిరి. రాజకుమార్తెలు అనేక విధములుగా మడివాలప్పను పీడించినందున ఆయనకు కోపము వచ్చి ఇట్లు శపించెను—

*"నేను ఇప్పుడు ఈ గ్రామమును విడిచి వెళ్ళిపోతాను. నేను ఎప్పుడైతే తిరిగి ఈ గ్రామ-మునకు వస్తానో, ఆలోపుగా ఈరాజ్యము,రాజు,రాజకుమార్తెలు, రాజవైభవము అంతయు సర్వ నాశనమై పోవుగాక!"* అని శపించి, తాను కట్టుకున్న దోతిని ముక్కలు ముక్కలుగా చింపి పార-వైచి, దిగంబరిగా మఠమును విడిచి ఉత్తరహిందుస్థాన్ వైపు తొందరగా వెళ్ళిపోయినాడు.దిగంబర స్వరూపమునుధరించి ఏకాకిగా వెళుతుంటే మడివాలప్ప తేజస్సు,జ్ఞానప్రకాశము ముఖమునుండి ప్రకటమగుచుండగా జనులంతా ఆశ్చర్యపడినారు. ఈ ప్రకారముగా మడివాలప్ప నడుస్తూ నడుస్తూ నేరుగా కాశీక్షేత్రమును చేరుకొని,అక్కడున్న సకలవేదశాస్త్రపారంగతులైన పండితులను వాదములో

ఓడించి, వారి బిరుదులను లాగుకొని,వారి భూషణములను (గండపెండేరము మొదలగునవి) వశ-పరచుకొని, ఆ కాశీక్షేత్రమందు తనయొక్క కీర్తిప్రతిష్ఠలను విస్తరింపజేసుకొని ఎంతో మాన్యతను సంపాదించుకున్నాడు. తదనంతరము 'మడివాలస్వామి' కాశీవిశ్వనాథుని దర్శించి, ఏకాంత స్థలములో కూర్చుని, ఈ విధముగా పశ్చాత్తాపముజెందుచుండెను—

ఏమిటీ నా మూర్ఖత్వము? నేను విషయభోగములన్నింటిని త్యజించి వైరాగ్యోపరతులతో యుక్తుడనై జితేన్ద్రియుడనని అనిపించుకొని, మళ్లీ విద్యాభిమానమునకు లొంగిపోయి,పండితులను అందరిని వాదములో జయించి, వారి గౌరవ ప్రతిష్టలను భంగపరచి, ఎంతో పేరుప్రతిష్టలను కీర్తి ప్రఖ్యాతులను గడించితిని కదా! వాక్చాతుర్యంతో వాదంలో వారిని గెలిచి వారిని మానసికంగా హింసించితిని గదా! అని అత్యంత ఖిన్నుడై తనలోతాను దుఃఖించెను. ఇంద్రియములను గెలిచి జితేంద్రియుడనైగూడా అభిమానమునకు ఆహుతియైపోతిని కదా!

**శ్లో ॥ ప్రతిష్ఠా సూకరీవిష్ఠాసమా గీతా మహర్షిభిః ।**
**తస్మాదేనాం పరిత్యజ్య కీటవద్పర్యటేద్యతిః ॥** (నారదపరివ్రాజకోపనిషత్ 5-3)
**శ్లో ॥ అభిమానం సురాపానం గౌరవం రౌరవస్తథా ।**
**ప్రతిష్ఠా సూకరీవిష్ఠా త్రయం త్యక్త్వా సుఖీ భవేత్ ॥** (సాంప్రదాయిక శ్లోకము)
**త్రయం త్యక్త్వా హరిం భజేత్ ।** (పాఠాంతరము)

సకలవేదాంత పారంగతులైన పండితులను బాధపెట్టి బ్రహ్మహత్యాదోషమునకు బలియై బ్రహ్మరాక్షసునిగా జన్మించవలసి వచ్చెను గదా! నా వైరాగ్యము వ్యర్థమాయె గదా! బ్రహ్మజిజ్ఞాస శూన్యమాయె గదా! అన్యులను దుఃఖింపజేసి పరమార్థమును కోల్పోయితిని గదా! నా జన్మ వృథా ఆయెను గదా! అభిమానమువలన ఎంత అనర్థము జరుగెను గదా! అని ఈ ప్రకారముగా ఎంతో దుఃఖించెను. మరియు తనకు తానే ఈ విధముగా శపించుకుంటాడు. "*నేను నేర్చిన విద్యలు, సంస్కృత పాండిత్యము–ఈ రోజునుండి నాకు స్మృతికి రాకుండుగాక!*" అని శపించుకొని, తాను గెలిచిన భూషణములన్నిటిని పేదలకు పంచిపెట్టి కాశీక్షేత్రమును వదిలి, అదే క్షణమున బయలుదేరి, హిమాలయ పర్వతములలోకి వెళ్లి ఏకాంత స్థలమును ఎన్నుకొని అచ్చోట ఎన్నో రోజులు ఘోరమైన తపస్సుచేసి,తనయొక్క మనస్సును దృఢాభ్యాసముచేత అదుపులోకి తెచ్చుకొనుటకు ప్రయత్నించెను.

కొంతకాలమైన తర్వాత తనయొక్క మనస్సు నెమ్మదిగా శాంతించినది. సకలమనోవృత్తులు ఉపశమించినవి. చిత్తవృత్తులు లయించి బ్రాహ్మీస్థితిని పొంది,స్వరూపస్థితిని పొందినాడు.ఈ విధ-ముగా నిరంతర అభ్యాసముచేత ఆత్మజ్ఞానమును పొందినాడు. ముఖతేజస్సు దేదీప్యమానముగా ప్రజ్వలించుచుండెను. జీవన్ముక్తస్థితినొంది,బ్రహ్మానుభూతినొందెను. ప్రశాంతవృత్తి,తేజస్సు,ఆనందము అన్ని విస్తారముగా ప్రకటమైనవి. ఈవిధముగా తీవ్రసాధనచేసి ఆత్మజ్ఞానసంపన్నుడై హిమాలయ-

ములను విడిచి, మళ్లీ "కిత్తూరు" ప్రాంతమునకు వచ్చి చూసేసరికి శాపగ్రస్తమైన ఆ ప్రాంతమంతా సర్వనాశనమైపోయింది. పరరాజులు–రాజ్యమును, రాజబాండాగారమును, రాచస్త్రీలను, రాజవై-భవమునంతయునపహరించి, వశపరచుకున్నారు. ఇదంతా చూసి మడివాలప్ప దుఃఖించి అనవ-సరముగా ఆవేశమునకు గురియై వ్యర్థముగా శపించినందుకు, పాపము! రాజ్యమంతా సర్వ నాశనమాయె గదా! అని పశ్చాత్తాపపడినాడు.

ఎక్కడైతే మహాత్ములు అవమానింపబడి పీడింపబడతారో, వారియొక్క హృదయమందు దుఃఖము, వ్యథ కలిగించినట్లయితే–ఆ ప్రదేశము తప్పకుండా శాపగ్రస్తమై సర్వనాశనమౌతుంది. అట్లుగాక మహాత్ముల సేవచేసి వారిని సంతోషపెట్టి వారి కృపకు పాత్రులైనచో ఆ ప్రాంతము పావనము కాగలదు. ఆ మహాత్ములయొక్క కృపాదృష్టివలన అంతయు సుభిక్షముగా, వైభవముతో విలసిల్ల గలదు.

ఈ రీతిగా మడివాలప్పస్వామి గర్గగ్రామములో నివసించుచుండెను. ఆయనయొక్క జ్ఞాన స్థితిని చూచి అనేక భక్తులు నిత్యము స్వామి దర్శనార్థము తండోపతండములుగా వచ్చుచుండిరి. భక్తులందరూ కలిసి కొన్ని రోజులైన తర్వాత అక్కడున్న నది ఒడ్డున గొప్పగా మఠమును నిర్మించి, స్వామికి స్థిరనివాసమును ఏర్పాటు చేసినారు. మడివాలప్ప స్వామికి సేవచేయుటకు అనేకమంది విరక్తశిష్యులు ఉన్నారు. ఇలా ఉండగా కొన్నాళ్లకు మడివాలప్పస్వామికి ఏదో నిమిత్తముచే దృష్టి లోపించి అంధుడైనాడు. సరిగ్గా ఇదే కాలములో సిద్ధారూఢ స్వామి హుబ్లీ పట్టణంలో ఉండెను. భక్తులద్వారా మడివాలప్పస్వామియొక్క కీర్తిప్రతిష్టలను విని,ఒకనాడు సిద్ధారూఢస్వామి,మడివాలప్ప స్వామి దర్శనార్థము కొందరు భక్తులను వెంటబెట్టుకొని గర్గగ్రామమునకు విచ్చేసినాడు.భక్తులంద-రూ మడివాలప్పస్వామి దర్శనము తీసుకున్న తర్వాత భక్తులనుద్దేశించి మడివాలప్ప స్వామి ఇలా అడుగుతాడు.

మీరు ఎక్కడనుండి వచ్చినారు?

భక్తులు సమాధానమిస్తూ–మేము హుబ్లీ పట్టణమునుండి వచ్చాము స్వామీ.

మడివాలప్పస్వామి:–మీ గ్రామములో ఒక గొప్ప బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడైన శివయోగి ఉన్నట్లు విన్నాను.

భక్తులు సమాధానమిస్తూ–అవును స్వామీ, ఉన్నాడు. ఇప్పుడు ఆ స్వామిని వెంటబెట్టుకునే వచ్చాము.

మడివాలప్ప స్వామి:–ఆయన పేరేమి?

అప్పుడు ఆ సమయములో అక్కడే ఉన్న సిద్ధారూఢస్వామి జవాబిస్తూ–నా పేరు ఆరూఢుడు అని అంటారు.

మడివాలప్ప:–ఏమి? నీపేరు ఆరూఢుడు అని చెప్పుకుంటున్నావు.ఒకేసారి మేఘములనుండి ఊడిపడినావా? తల్లి గర్భములోనుండి జన్మించలేదా? మీ తల్లిదండ్రులు పెట్టిన పేరు చెప్పుము.

సిద్ధారూఢస్వామి:–వాస్తవముగా నేను బ్రహ్మము నుండే వచ్చినాను. మాయయొక్క ఆవర-ణమును తీసుకొని వచ్చాను. మాయ మిథ్య. మాయయొక్క కార్యముగూడ నిశ్చయముగా మిథ్యయే. కావున, తల్లి గర్భమునుండి జన్మించడముగూడా మిథ్యయే గదా!

మడివాలప్ప స్వామి, సిద్ధరూఢస్వామిని దగ్గరకు పిలుచుకొని శరీరమంతా తన చేతులతో స్పృశించినాడు. సిద్ధారూఢస్వామి చాలా బక్కచిక్కి ఉన్నది గ్రహించి, మడివాలప్పస్వామి తనలో తాను ఇలా అనుకుంటాడు. వాస్తవముగా ఈయన శమదమాదులతో,యమనియమములతో యుక్తముగా ఉన్నాడు. మనసును విషయములనుండి నిగ్రహించనిదే (శమదమాదులు లేనిదే) జ్ఞానము కలుగదు–అని అనుకున్నాడు.

మడివాలప్ప:–ఈ ప్రపంచములో ఒక నగరమున్నది. ఆ నగర ప్రదేశమంతటా కోతులు విచ్చలవిడిగా విహరిస్తూ ఆటలాడుతాయి. ఆ నగరమును నీవు చూశావా?

సిద్ధా:–(తనలో తాను విచారించి) అవును, చూశాను. ఈ శరీరమనేదే ఒక నగరము. దీని యందు చపలమైనమనోవృత్తులే నిశ్చయముగా కోతులున్నాయి. అవి విచ్చలవిడిగా క్రీడిస్తుంటాయి.

1.మనసు, ౨. మధుకరము (తేనెటీగ), 3. మేఘము, 4 మానిని (స్త్రీ), 5. మదనము (కామము), 6. మారుతము (గాలి), 7. మా (లక్ష్మి), 8. మదము, ౯. మర్కటము (కోతి), 10. మత్స్యము (చేప)- ఈ పది అత్యంత చంచలములు.

మరియు సిద్ధానాథుడు మడివాలప్పస్వామిని ఈ విధముగా అడుగుతాడు. నేను ఒక గ్రామములో విశేషముగా అన్ని కుక్కలనే చూశాను. అక్కడ కుక్కలు తప్ప మరేమీ లేవు.

మడివాలప్పస్వామి:–ఆ గ్రామములో అన్ని కుక్కలే ఉంటే మరి వాటికి ఆహారము ఎవరు పెడతారు?

సిద్ధారూఢస్వామి:–ఇతర గ్రామస్తులు చనిపోయిన జంతువులనన్నిటిని తెచ్చి వాటికి ఆహార-ముగా వేస్తారు. వాటియొక్క మాంసమును భుజించి ఆ కుక్కలు జీవిస్తాయి.

మడివాలప్పస్వామి:–దానియొక్క లక్ష్యార్థమేమిటో నీవే చెప్పుము.

సిద్ధారూఢస్వామి:–వ్యాపకమైన (అనేక) మనోవృత్తులే కుక్కలు. పంచభూతములే అన్యగ్రా-మములు. వాటిద్వారా ఉత్పన్నమైన జడమైన శబ్దాది విషయములు చనిపోయిన జంతువులు. మనోవృత్తులనే కుక్కలు శబ్ద స్పర్శ రూప రస మరియు గంధములనే పంచవిషయాలను అనుభవిస్తాయి.

ఇటువంటి లక్ష్యార్థరూపమైన చమత్కారమైన వచనములను విని మడివాలప్ప, సిద్దారూఢ స్వామియొక్క హృద్గతజ్ఞానమును గ్రహించి సిద్ధారూఢస్వామితో ఇలా ప్రశ్నిస్తాడు.

మడివాలప్ప:– ఒక విచిత్రమైన గృహమును చూసినావా? ఆ గృహములో ఒక వంటశాల ఉంది. ఆ వంటశాలయందు మూడు నదులు ప్రవహిస్తుంటాయి. ఆ నదులలోని నీటితో రకరకాలైన వంటలు తయారుచేస్తారు. ఆ వంటశాలనుండి బయటకు రావడానికి మూడు క్రోసుల దూరముంది. ఓ యతివరా! ఇటువంటి గృహమును నీవు చూసినట్లయితే నాతో చెప్పుము.

సిద్ధారూఢస్వామి:–దేహమనేదే ఒక గృహము. దానియందు ఇడ, పింగళ, సుషుమ్నానాడులు మూడు నదులున్నాయి.ఈమూడింటియొక్క కలయిక త్రివేణిసంగమము. భ్రూమధ్యమున మనసును నిలిపి సమాధి అనే వంట తయారు చేయబడుతుంది. జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను మూడు మాత్రలు అనేవి స్వరూపస్థితినుండి జాగ్రతకు వచ్చుటకు మూడు క్రోసుల దూరము. ఈ ప్రకారముగా సమాధానము చెప్పేసరికి మడివాలప్పస్వామి చాలా సంతోషించినాడు.

అప్పుడు మడివాలప్పస్వామి హుబ్లీ భక్తులతో ఈప్రకారంగా అంటాడు. మీయొక్క పుణ్య-వశాత్తు ఈశ్వరుడు ఈ సిద్ధనాథుని మీవద్దకు పంపించినాడు. మీరు ఎల్లప్పుడు ఈయన సాంగ-త్యమును చేయండి. అనన్య భావముతో ఈయనను భజించండి. మీరు చాలా ధన్యజీవులు. మీరు ఈయన సాంగత్యము ద్వారా తప్పకుండా ఉద్ధరింపబడతారు.

మరియు మడివాలప్పస్వామి సిద్ధారూఢస్వామిని హెచ్చరిస్తూ–వాక్కు,పాణి,శిశ్నము-ఈమూడు కర్మేంద్రియములను నిగ్రహించడములో చాలా జాగ్రత్త వహించాలి.మరియు ఇంకా చెప్తున్నాను జాగ్రత్తగా వినుము. "హుబ్లీ" జనులు చాలా దుష్టులున్నారు. వారు పైకెత్తుకొని మళ్లీ క్రింద పడవేయగలరు.

అప్పుడు సిద్ధారూఢస్వామి అంటాడు. నేను అందుకనే సంపూర్ణంగా విషయత్యాగము చేసినాను.ఇంకా వారు నన్నేమి చేయగలరు? ఏమీ భయము లేదు.

మడివాలప్ప:–నీకు ఎవరైనా భక్తులు వస్త్ర ద్రవ్యాదులను సమర్పించినట్లైన వాటిని ఎవరికీ ఇవ్వక, మాకు పంపగలవు.

సిద్ధారూఢస్వామి:–స్వామీ! నీవు సంపూర్ణ వైరాగ్య సంపన్నుడవు. నీకు ద్రవ్యము అవసర-ముంటుందా? ఒకవేళ ధనము అవసరముంటే నేను ఒక గొప్ప వ్యాపారము చేసి జ్ఞానధనమును సంపాదించి దానినంతయూ నీకు తీసుకొచ్చి ఇవ్వగలను–అని అంటాడు. నీయొక్క అమృత వచన-ములను మననముచేసి నీ కీర్తిని వ్యాపింపజేసి పేరు ప్రఖ్యాతులను నీకు పంపిస్తాను.

ఇటువంటి వివేకయుక్తమగు సంభాషణమును విని మడివాలప్పస్వామియొక్క హృదయము ప్రఫుల్లితమై, ఎంతో సంతోషించి ఇలా అంటాడు. "ఈరోజు నాకు నిజముగా ఆత్మబంధువు కలిసి నాడ"ని సిద్ధారూఢస్వామిని ఆలింగనము చేసుకున్నాడు.

ఇంకా ఆ మడివాలప్పస్వామి సిద్ధారూఢస్వామిని హెచ్చరిస్తున్నాడు. నీవు బ్రహ్మానుభవరూప వస్త్రద్రవ్యములను అనగా బ్రహ్మజ్ఞానమును అనధికారులకు పొరపాటున మరిచిగూడా బోధించ-కుము. సద్గురు చరణములయందు ఎవరికి భక్తిశ్రద్ధలు ఉండునో, వారికి మాత్రమే ఈ సద్బోధను చేయుము.

**శ్లో ॥ ఇదం తే నాతపస్కాయ నాఽభక్తాయ కదాచన ।**

**నచాఽశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి ॥** (గీత 18-67)

సిద్ధారూఢస్వామి ఉత్తరమిస్తూ—ఆర్యా! మీరు నాకన్న చాలా గొప్పవారు. జ్ఞానవృద్ధులు. అనుభవరూప బ్రహ్మజ్ఞానము నావద్ద ఏమీ లేదు. అది నీయందే ఉంది. దయచేసి దానిని నాకు ప్రసాదించిన, నిరంతరము మననముచేసి, నేను అనుభవమునకు తెచ్చుకొని,ధన్యుడనయ్యి, ఇత-రులకు దానిని పంచిపెట్టి, మళ్లీ నీకే అర్పించగలను.ఇంతలో,

అదే సమయానికి ఆశ్రమము పక్కన గొప్పగా అల్లరి వినబడింది. ఆ ధ్వనిని విన్న మడివాలప్పస్వామి ఏమిటా కోలాహలము? తెలుసుకొని రమ్మని ఒక భక్తుని పంపెను.

అప్పుడు ఆ భక్తుడు బయటకు వెళ్లి చూసేసరికి ఒక వ్యక్తి సర్పకాటువలన మృతిచెంది యుండెను. ఆ చనిపోయిన వ్యక్తియొక్క భార్యాబిడ్డలు ఏడుస్తున్నారు. వారి గోల విని జనులందరూ గుమిగూడినారు. ఈ సంగతి మడివాల స్వామికి చెప్పగా, స్వామి వెంటనే ఆ భక్తులతో ఇలా అంటాడు. చూడండి!ఈ సిద్ధారూఢస్వామియొక్క పాదపద్మములను కడిగి ఆ జలమును మృతిజెం-దినవాని నోటిలో కొంచెము పోసి శరీరమంతటా ప్రోక్షించండి.నోటిలో స్వామియొక్క పాదోదక-మును పోసి సర్వాంగములయందు ప్రోక్షించి అందరూ కొంతసేపు "**ఓం నమశ్శివాయ**" నామ స్మరణము చేయండి. వాడు తప్పకుండా పునర్జీవితుడు కాగలడు–అని ఆజ్ఞాపించినాడు.

ఇటువంటి వచనములను విని వెంటనే సద్గురు సిద్ధనాథుని ఆసనమందు కూర్చుండజేసి అతిప్రేమతో పాదప్రక్షాళనచేసి ఆ పాదోదకమును మృతశరీరముయొక్క నోటిలో కొంతపోసి, మ-రియు శవముయొక్క సర్వాంగములయందు ప్రోక్షించినారు. శుభ్రమైన తెల్లనివస్త్రమును శవముపై కప్పి అందరూ కూర్చుని "**ఓం నమశ్శివాయ**" అంటూ భజన చేయసాగినారు. ఈ ప్రకారముగా భజనలు చేస్తున్న ఘటిక (24 నిమిషముల) కాలంలోనే ఆ మృతదేహము మెల్లగా కదిలి నిద్రనుండి లేచినట్లుగా నిజముగా లేచి కూర్చుంది. నిర్జీవవ్యక్తి సజీవుడైనాడు. అందరూ ఆశ్చర్యచకితులైనారు. అప్పుడు ఆయన భార్య ఆశ్రమములోనికి పరిగెత్తుకుంటూ వచ్చి మడివాలప్పస్వామి మరియు సిద్ధా-

రూఢస్వామి(ఇద్దరి)పాదాలపైపడి నయనాశ్రువులతో వారి పాదములను ప్రక్షాళనముచేసి, సాష్టాంగ నమస్కారములుచేసి, చేతులు జోడించి భక్తియుక్తయై నిలబడి, ఓ సద్గురు దేవతలారా! ఓ దీనో-ద్ధారకులారా! మీకు జయము జయము. విష్ణు శివ స్వరూపులైన మీరు నాకు పతి దానముచేసి నా పతికి ప్రాణభిక్షను ప్రసాదించి, నన్ను మళ్లీ సుమంగళిగా చేసినారు–అని పరిపరి విధముల కృతజ్ఞతా భావమును వ్యక్తముచేసింది. సజీవుడైన ఆమె పతిగూడా ఇద్దరు మహాత్ములకు నమస్కరించినాడు. మహాత్ములారా! మీకు జీవితాంతము ఋణపడి ఉంటాను. నాయొక్క తనువు మనసు ధనము మరియు నా సర్వస్వము మీ పాదములకు సమర్పించి మీ సేవ చేసుకుంటాను–అని పలికినాడు.

అప్పుడు మడివాలప్పస్వామి ఆయనతో ఇలా అంటాడు. నాయనా! మాకు నీ ధన ద్రవ్య-ములు అవసరము లేదు. నీవు నీయొక్క మనసును ఆత్మవిచారమునందు లగ్నముచేసి నీవు ధన్యు-డవు కమ్ము. అదే మాకు కావలసింది. నీవు వ్యవహారముగూడా చేస్తూ, నీయొక్క భార్యాబిడ్డలను పోషించుకుంటూ ఇతర సమయాల్లో భగవచ్చింతన, నిష్కామబుద్ధితో మహాత్ములసేవచేస్తూ నిన్ను నీవు ఉద్ధరించుకొనుము. అదే నీవు చేయవలసిన కర్తవ్యము.

ఇటువంటి అమృతవచనములను విని భక్తులందరూ ఆనందముతో జయజయకారాలుచేస్తూ, ఇద్దరు మహాత్ములకు మంగళహారతులిచ్చారు. ముల్లోకములు ఆనందించాయి. ఈవిధముగా సిద్ధా-రూఢస్వామి, కొన్ని రోజుల పర్యంతము అక్కడే మడివాలస్వామి వద్దనే ఉండి, ఉన్నన్ని రోజులు "శ్రీ యోగవాసిష్ఠము"ను ఆశ్రమమునందు నిత్యము భక్తులకు బోధిస్తూ ఉండేవాడు. సద్గురు సిద్ధనాథుని దర్శనార్థము దేశదేశములనుండి భక్తులు వచ్చేవారు. అమృతముకన్న మించినటువంటి మధుర-మైన సద్గురుదేవుని వేదాంత ప్రబోధమును శ్రవణము చేయుటకు అనేక పండితులు, శాస్త్రజ్ఞులు వచ్చే వారు. హృదయపూర్వకముగా భక్తిశ్రద్ధలతో శ్రవణము చేసెడివారు. ఈప్రకారముగా రెండు నదుల సంగమమునందు స్నానముచేసిన వారి పాపములు ఏవిధముగా నశించునో, అదే ప్రకారముగా ఈ ఇద్దరి మహాత్ములసంగమములో(జ్ఞానగంగలో)ఉపస్థితులైనటువంటి భక్తులయొక్క సకలదుఃఖము-లు నివృత్తమై పరమానందమును పొందినారు. గర్గగ్రామము వీరిరువురియొక్క కలయికలో గంగా యమునల సంగమము (ప్రయాగ)లాంటి పవిత్రస్థలముగా మారింది. ఇద్దరు బ్రహ్మజ్ఞానులయొక్క సంగమమువలన గర్గగ్రామము అత్యుత్తమ పుణ్యక్షేత్రముగా మారింది. ముముక్షువులకు నిలయ-మైనది. ఈ విధముగా సిద్దనాథుని ముఖకమలముద్వారా అమోఘమైన వేదాంత సంభాషణమును వింటూ మడివాలప్పస్వామి ఆనందడోలికలలో క్షణక్షణము మునిగి ఆనందమును అనుభవించే వాడు. ఇట్లు సిద్ధనాథుడు యోగవాసిస్ఠములో ప్రసంగముననుసరించి జీవన్ముక్తి ప్రకరణమును ప్రతిపాదిస్తుండగా శ్రవణముచేస్తున్న మడివాలప్పస్వామి అకస్మాత్తుగా సిద్ధారూఢస్వామిని ఆపి ఇట్లంటున్నాడు.

ఉత్తమమైన షడ్రసోపేతమైన పక్వాన్నము పాత్రయందున్నప్పుడుగాని లేక తృప్తిగా భుజించిన తర్వాతగాని దానియొక్క రుచి తెలియదు. పక్వాన్నమును భుజించుచున్నప్పుడు కేవలము నాలుకపై ఉన్నప్పుడే దానియొక్క రుచి తెలియును. అదే ప్రకారముగా జీవ-శివైక్యత్వ ఆనందము అజ్ఞానావస్థలో ఉన్నప్పుడు దాని వాసనగూడా తెలియబడదు. మరియు విదేహకైవల్యమును బడసిన పిదప ఆ ఆనందమును అనుభవించుటకు వీలుపడదు. కాని, మధ్యలో "**బంధభ్రమ రహిత శరీర సహిత జీవన్ముక్త్యవస్థ**"యందు మాత్రమే జీవ–శివైక్య ఆనందము అనుభవించుటకు వీలుపడును. దీనినే జీవన్ముక్త విలక్షణానందము అంటారు. అందుకనే నిజమైన జ్ఞాని ఒంటరిగా ఉండక తాను అనుభవించిన బ్రహ్మానందమును అందరికి పంచి నిరంతరము భక్తియందే రమిస్తూ ఉంటాడు. నిజసుఖమును అనుభవిస్తూ ఉంటాడు. ఉదాహరణకు:–భక్తతుకారాంమహారాజుగారు, "*హేస్వామీ! హే పాండురంగా! నాకు మోక్షము వద్దు. నీయొక్క భజనచేస్తూ నీయందే సదా రమించి యుండుటకు ఎన్ని జన్మలనైనా ఇవ్వుము*" అని వేడుకుంటాడు.

**नको ब्रह्मज्ञान आत्मस्थितीभाव। मी भक्त तू देव एसे करी॥**

ఇటువంటి మడివాలప్పస్వామియొక్క అమూల్యమైన అమృతవచనములను భక్తులందరూ విని ఆనందోత్సాహముతో జయజయకారములు చేస్తూ, సిద్ధారూఢస్వామికి మరియు మడివాలప్ప స్వామికి (ఇద్దరికి) పూజలు గావించినారు. ఈవిధముగా కొన్ని రోజులు గడచిన పిమ్మట సిద్ధా-రూఢస్వామి హుబ్లీ పట్టణమునకు వెళ్ళుటకు నిశ్చయించుకొని మడివాలస్వామికి తనయొక్క విజ్ఞాపనమును తెలియజేసినాడు. అప్పుడు మడివాలస్వామి, సిద్ధారూఢస్వామికి వీడ్కోలు చెబుతూ కొన్ని సూచనలు, హెచ్చరికలు ఈ ప్రకారముగా చేస్తున్నాడు.

ఇక నీయొక్క దేశసంచారమును పూర్తిచేయుము. ఇప్పటినుండి నీవు హుబ్లీ పట్టణమును విడిచి ఎక్కడకు వెళ్ళకుము.అక్కడనే నీయొక్క వైభవము వర్ణించరానంతగా కీర్తిప్రఖ్యాతులు విలసి-ల్లగలవు. ఇంకొక విషయమును చెబుతాను జాగ్రత్తగా వినుము. స్త్రీలయొక్క ముఖమును ఎన్నడు-నూ జూడకుము. స్త్రీముఖము పాషాణయుక్తమని యెఱుంగుము. స్త్రీయొక్క వాక్కులకు, రూపసౌం-దర్యమునకు మోహవశులై ఎందరో ఋషిమునులు అధోగతి పాలైనారు.

**విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనా**
**స్తేఽపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహఙ్గతాః ॥**
**శ్లో ॥ యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిఃస్త్రీకస్య క్వ భోగభూః ।**
**స్త్రియం త్యక్త్వా జగత్యక్తం జగత్యక్త్వా సుఖీ భవేత్ ॥** (మహో.3-48; యాజ్ఞవల్క్య. 17)
**శ్లో ॥ అగ్నికుండ సమా నారీ ఘృతకుంభ సమో నరః ।**
**సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥** (యోగవాసిష్ఠము)

కావున, స్త్రీలపట్ల చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇట్లు చెప్పి మడివాలస్వామి,తన రెండు హస్తములతో సిద్ధారూఢస్వామిని హృదయపూర్వకముగా ఆలింగనము చేసికొని హత్తుకుపోయాడు. రెండునేత్రములనుండి జలజల కన్నీరు కార్చుతూ ఏవిధముగా పుత్రవియోగముతో దీర్ఘకాలమునుండి పరితపిస్తున్న తల్లికి తన పుత్రుడు అకస్మాత్తుగా కలిసినప్పుడు ఆతల్లియొక్క పరిస్థితి ఎలాఉంటుందో, ఆ విధముగా ప్రేమ కల్లోలిత హృదయుడై మడివాలస్వామి సిద్ధారూఢస్వామిని తన వక్షస్థలము-నకు గట్టిగా వాటేసుకొని హత్తుకుపోయాడు. ఎంతో దృఢతర వైరాగ్యసంపన్నులైయుండి, జ్ఞాన సంపన్నులైయుండి కూడా వారి వియోగమును భరించలేక ఇద్దరు తమ తమ నయనాలనుండి ప్రేమాశ్రువులను రాల్చినారు.

అప్పుడు మడివాలస్వామి తనయొక్క కంఠమును సవరించుకొని సిద్ధనాథా! నన్ను ఎన్నడు మర్చిపోవుగదూ! అని అంటాడు. అప్పుడు సిద్ధనాథుడు సరే! ఎన్నడును మర్చిపోను-అంటూ ఆశ్వా-సనమిచ్చాడు. సిద్ధనాథుడు వెళ్లలేక లోలోన కుములుతున్నాడు. మడివాలస్వామి పొమ్మని అనలేక రోధిస్తున్నాడు. అయినాగాని ఈ ఆత్మీయమైన ప్రేమబంధము విడిపోక తప్పలేదు. మడివాలస్వామి సిద్ధనాథుని శిరస్సుపై తనయొక్క అమృతహస్తమునుంచి నీయొక్క బ్రహ్మజ్ఞానము అఖండముగా వర్ధిల్లుగాక! అనేక అజ్ఞాన జీవులకు ఉపయోగమగుగాక! అని ఆశీర్వదించినాడు. అప్పుడు సిద్ధా-రూఢస్వామి,మడివాలస్వామియొక్క చరణకమలములకు నమస్కరించాడు.మడివాలస్వామికి సిద్ధ-నాథునిపైనున్న ప్రేమనుచూచి భక్తులందరూ సద్గదితకంఠయుక్తులై ఇద్దరు మహాత్ములకు నివాళుల-ర్పించారు. భక్తులతో కలిసి సిద్ధనాథుడు హుబ్లీకి బయలుదేరి నడుస్తున్నాడు. మడివాలస్వామి సిద్ధనాథుని వియోగము సహించలేక సిద్ధనాథునితోపాటు చాలాదూరము మాట్లాడుకుంటూ నడి-చినాడు. చాలాదూరము పోయినాక సిద్ధారూఢస్వామి, మడివాలస్వామియొక్క చరణకములము-లకు మరొక్కసారి నమస్కరిస్తూ స్వామీ!ఎంత దూరమని వస్తావు. దయచేసి ఇక మళ్ళిపొండి–అని నమ్రభావంతో వేడుకుంటాడు. అప్పుడు మడివాలస్వామియొక్క శిష్యుడు మఠమువైపు చేయి పట్టుకొని తీసుకొస్తుండగా అక్కడక్కడ ఆగుతూ అంధుడైనప్పటికీ విరహబాధతో వెనుకకు మళ్లీ చూస్తూ, ముందుకు నడుస్తున్నాడు. ఈప్రకారముగా శిష్యుడు మడివాలస్వామిని నెమ్మదిగా తీసు-కొచ్చి మఠముయందు శయ్యపైకూర్చుండబెట్టినాడు.కాని,మడివాలస్వామి సిద్ధనాథునియొక్క గుణ-గణాలను స్మృతికి తెచ్చుకుంటూ నేత్రములనుండి ఏకధారగా కన్నీరు కారుస్తూ పదేపదే ఏడు-స్తున్నాడు.ఈయనయొక్క పరిస్థితి చూస్తుంటే దశరథ మహారాజు పుత్రులు వనాంతరమునకు వెళ్ళగా వారిని జ్ఞాపకము చేస్తూ ఏడ్చినట్లుంది. గర్గగ్రామమునుండి సిద్ధారూఢస్వామి వెళ్ళిపోయినాక కొన్ని రోజులు మాత్రమే జీవించి తదనంతరము మడివాలస్వామి విదేహకైవల్యస్థితిని పొందినాడు.

ఆ గర్గగ్రామమందు భక్తులు స్వామియొక్క దివ్యమైన సమాధిని నిర్మించారు. ఇటువంటి మహాత్ములయొక్క చరిత్ర శ్రవణమాత్రముననే సకల కలిదుఃఖములు నివృత్తమై అంతఃకరణశుద్ధి ద్వారా జ్ఞానప్రాప్తికి అధికారులు కాగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకలపాపములు భస్మమైపోవును. శ్రీ సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది మూడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది నాలుగవ అధ్యాయము

పద్యానువాదము:–భవదుఃఖగ్రస్తులైన భక్తులు నిన్ను ఆశ్రయించినచో కృపాసాగరుడవైన నీవు వారిని రక్షించి, ఎల్లప్పుడూ నీ పాదాలయందే సంలగ్నచిత్తులయి ఉండునట్లుగా అనుగ్రహిస్తావు. అలాంటి ఓ దీనదయాళా! నాకు స్వస్వరూపపదవిని కరుణించి ప్రాప్తముచేయుము స్వామీ!

శ్రీ సిద్ధారూఢ భగవంతుడా! సకలజీవులపై నీయొక్క సత్త గలదు. నీయొక్క సగుణ రూపమును దర్శించినంత మాత్రమున అహంతా మమత్వరూప సంసారము పలాయనమగును. ఎంతవరకు సద్గురుచరణకమలములను ఆశ్రయించరో, వారికి అంతవరకు జన్మమరణరూప సంసారము వృద్ధిబొందుతూ కఠినముగానే ఉంటుంది. ఎవరైతే నీయొక్క చరణకమలముల నాశ్రయించి నీ కృపకు పాత్రులై నీయొక్క వచనామృతమును ఒక్కసారి చవిచూసినచో ఇక వారికి సంసార చింతయే ఉండదు.

**एर्हवीं माझियां भक्तां। आणि संसाराची चिन्ता।**
**काय समर्थांची कांता। कोरान्न मांगे?॥** (ज्ञानेश्वरी १२-८५)

అమృతమును సేవించినాక ఎవరైనా గంజిని కోరుకుంటారా? అదే ప్రకారముగా నీయొక్క కరుణాకటాక్షముచేత ఆనందప్రాప్తిరూప మోక్షమును పొందినాక, దుఃఖరూపమైన లౌకికభోగాలు కోరుకొనరు(ఇచ్ఛగించరు). సంసారము దుఃఖసాగరము. అల్పమైన సంసారసుఖములను కోరుకునేవాడు, పామరుడుగాక మరేమవుతాడు? వ్యర్థముగా దుఃఖభారమునే గాడిదలాగా మోయగలడు. సంసారము దుఃఖరూపమని సకలశాస్త్రములు, పురాణములు, శృతి స్మృతులు ప్రకటిస్తున్నాయి. మరియు సకలజీవులకుగూడా దుఃఖముయొక్క అనుభవము ప్రత్యక్షముగా ఉన్నది.కావున, అటువంటి దుఃఖనివృత్తి కేవలము జ్ఞానముచేతనే కాగలదని సకలవేదాంతములు, మహాత్ములు నొక్కి వక్కాణించి చెప్పుచున్నారు. యథార్థమైన పరమాత్మ జ్ఞానముద్వారానే సకల దుఃఖనివృత్తి, పరమానందరూప బ్రహ్మప్రాప్తి అనగా మోక్షము లభిస్తుంది.

**శ్లో ॥ భిద్యతే హృదయగ్రన్థి ఛిద్యన్తే సర్వ సంశయాః ।**

**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥** (ము౦.2-2-8)

**నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।** (గీత 4-38)

జ్ఞానికి సంసారము మిథ్యారూపముగా గోచరిస్తుంది. నాటకములో వేషధారి నేను రాజునని భావించక కేవలము నటనమాత్రమే అని ఎలా అనుకుంటాడో, అదే ప్రకారముగా జ్ఞాని ఈ ప్రపంచము మిథ్యారూపమని భావించి వ్యవహరిస్తాడు. అంతఃకరణమునందు జ్ఞానికి రాగద్వేషాలు ఉండవు. ప్రపంచముపట్ల ఔదాసీన్యముగా ఉంటాడు. ఈ జగత్తును చిత్రపటమువలె వీక్షిస్తూ కర్తృత్వ అభిమాన రహితుడై వ్యవహరిస్తాడు.

**పశ్యామి చిత్రమివ సర్వమిదం ద్వితీయం, తిష్ఠామి నిష్కలచిదేకవపుష్యనన్తే ।**

**ఆత్మానమద్వయమనన్తసుఖైకరూపం, పశ్యామిదగ్ధరశనామివ చ ప్రపఞ్చమ్ ॥** (సం.శా.4-54)

**ఆభాతీదం విశ్వమాత్మన్యసత్యం, సత్యజ్ఞానానన్దరూపే విమోహాత్ ।**

**నిద్రామోహాత్ స్వప్నవత్తన్నసత్యం, శుద్ధఃపూర్ణో నిత్యఏకః శివోఽహమ్ ॥** (అద్వైత పంచరత్నమ్)

**నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో, దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః ।**

**కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహఙ్కారస్యైవ హ్యాత్మనో మే శివోఽహమ ॥** (అద్వైత పంచరత్నమ్)

మరియు, దుఃఖమునకు మూలకారణము మోహము. అది నివృత్తమైతే సంసారము సుఖమయమగును. ఆ మోహనివృత్తికి ఆత్మ జ్ఞానమొక్కటే సాధనము.

**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి** (ముం.3-2-9); **బ్రహ్మవిదాప్నోతి పరమ్** (తై.2-1-1); **తరతి శోకమాత్మవిత్** (ఛాం.7-1-3 ).

**యస్మిన్సర్వాణి భూతాన్యాత్మన్యేవావతిష్ఠతే ।**

**తత్ర కో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః ॥** (ఈశా.7)

అటువంటి ఆత్మజ్ఞానము సద్గురుదేవుని వద్దనే ఉంది. ఎవరికి ఆత్మజ్ఞానమును పొందాలని తీవ్రతర జిజ్ఞాసగలదో, వారు సద్గురుదేవుని తప్పనిసరిగా విధిపూర్వకముగా ఆశ్రయించి శరణు బొందవలెను.

**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ ।సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥** (ముం.2-2-12)

ఈ రీతిగా సద్గురుదేవుని చరణకమలములను ఆశ్రయించి సద్గురుదేవుని సేవ శ్రద్ధాభక్తులతో చేసిన వారికి సద్గురుదేవుడు కరుణించి పరమోత్కృష్టమైన జ్ఞానోపదేశము చేస్తాడు. అటువంటి జ్ఞానఘనుడైన సద్గురు సిద్ధనాథుడు హుబ్లీ పట్టణమునందు నివసిస్తూ చాతకపక్షి మేఘమునే అపేక్షిస్తున్నట్లు, ఏ ముముక్షువు, సిద్ధనాథుని శరణుబొంది జ్ఞానాన్ని అర్థిస్తాడో, అటువంటి వారికి సద్గురుదేవుడు తత్త్వోపదేశము చేసి బంధవిముక్తుని చేసేవాడు. సద్గురుదేవునియొక్క అద్భుతమైన అనంత విభూతిస్వరూపమైన చరిత్ర కేవలము శ్రవణ మాత్రముననే అంతఃకరణము శుద్ధమై జీవుడు యథార్థ జ్ఞానమును పొందుతాడు.

మహారాష్ట్రలో అరేబియాసముద్రము ఒడ్డున ఉన్న కొంకణప్రాంతములో ఇద్దరు బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. ఆబ్రాహ్మణుని భార్యకు పిశాచము ఆవరించింది. ఎన్నోవిధముల మంత్ర-ములు, ఔషధములు మొదలగు ఉపాయములు చేసినప్పటికి ఆ పిశాచము వదలడములేదు.అయితే వారు "నరసోబావాడి" అనే ఊరిలో నృసింహస్వామి ఆలయము ఉంది. అక్కడికి పోయినచో ఆ నృసింహస్వామి పిశాచపీడ నివృత్తి చేయగలడని నమ్మకముతో ఆ క్షేత్రమునకు వెళ్ళినారు. వారు నృసింహస్వామి దేవునితో ఇలా ప్రార్థించుకున్నారు. స్వామీ! నీయొక్క అనుగ్రహముచేత నా భార్య యొక్క పిశాచబాధ నివృత్తి అయినచో నీకు ఒక వంద రూపాయలు సమర్పించుకొని ప్రేమతో నీ సేవ చేసుకుంటాము. ఈ విధముగా కొన్ని రోజులు సేవచేస్తూ ఉన్నాక, ఒకానొక నాటి రాత్రి ఆ బ్రాహ్మణ స్త్రీయొక్క స్వప్నములో క్షేత్రాధిదేవుడు నృసింహస్వామి దర్శనమిచ్చి ఇలా అంటాడు.

నీవు సత్వరముననే హుబ్లీ పట్టణములో ఉన్నటువంటి సిద్ధారూఢ స్వామి వద్దకు వెళ్ళుము. నేనే ఆ సద్గురురూపమును ధరించి ఉన్నాను. నీవు ఆ సిద్ధనాథునికి శరణు బొందినట్లయితే, ఆయన కరుణించి నీ పిశాచబాధ నివృత్తి చేయగలడు. ఇటువంటి నరసోబా వచనములను విని ఆ స్త్రీ వెంటనే మేల్కొంచి తన భర్తతో స్వప్నవృత్తాంతమును తెలియజేసి, మనము తొందరగా హుబ్లీకి వెళ్దాం పద–అని అంది. వేకువజాముననే లేచి నిత్యకృత్యములు తీర్చుకొని స్నానసంధ్యాదులు చేసి కొని నరసోబాకు నమస్కరించుకొని, హుబ్లీకి బయలుదేరి వచ్చి, సిద్ధారూఢస్వామిని కలుసుకొని అతి ప్రేమతో సాష్టాంగప్రణామములు సమర్పించుకున్నారు.

ఓ సద్గురుదేవా మా వృత్తాంతమును వినుము. నాయొక్క భార్యకు పిశాచము ఆవరించింది. తన్నివారణార్థము మేము "నరసింహవాడి"కి పోయినాము. అచ్చట నరసోబాస్వామి  స్వప్నములో కనబడి హుబ్లీలో సద్గురు సిద్ధనాథుడు ఉన్నాడు. ఆయనను శరణుజొచ్చినచో మీ సంకటము నివృత్తమగును–అని ఆజ్ఞాపించినాడు. అందుకని నా భార్య పిశాచపీడ నివారణార్థము నిన్ను ఆశ్రయించాము స్వామీ! నీవు మా యందు కరుణజూపి మాయొక్క ఆపదను నివారించుము–అని ప్రార్థించాడు.

సద్గురుదేవుడు వారియొక్క ప్రార్థనను మన్నించి సరే! ఇక్కడే ఈ ఆశ్రమమందే ఉంటూ నిత్యము సద్గురు భజనచేస్తూ ఉండండి.ఆ సద్గురుదేవుడు తప్పకుండా పిశాచపీడ నివృత్తిచేయగలడు –అని అంటాడు. ఈ ప్రకారముగా సద్గురుదేవుని ఆజ్ఞమేరకు వారు అక్కడే ఉండి, సద్గురుదేవుని సేవ, ఆశ్రమ సేవచేస్తూ, భజనచేస్తూ క్షేమంగా ఉంటున్నారు. అంతేగాక సద్గురుదేవుని సాన్నిధ్యములో కూర్చుని ప్రతినిత్యము వేదాంతశాస్త్రశ్రవణము ఏకాగ్రచిత్తముతో చేసినారు. తద్వారా చిత్తశుద్ధిగలిగి అనాత్మ దేహబుద్ధి నివృత్తమై ఆత్మబుద్ధి నిశ్చయమైనది. స్త్రీయొక్కభూతపీడ సమూలముగా నివృత్త-మైనది. ఇద్దరూ పరమానంద భరితులై, ఒకరోజు స్వామి పాదాల నాశ్రయించి వారి మనోభీష్టాన్ని

నివేదించుకున్నారు. సద్గురుదేవా! దయాసాగరా! మీయొక్క కృపాదృష్టిచేత మాయొక్క సంకటము-లన్నీ నివృత్తమైనవి. మాకు నీ పాదాలను విడిచి మా గ్రామానికి వెళ్లాలని అనిపించుటలేదు. ఎల్లప్పుడు ప్రేమతో నీ పాదసేవ చేస్తూ ఇక్కడే ఉండాలని అనిపిస్తుంది—అని అంటారు.

అప్పుడు సద్గురు సిద్ధనాథుడు వారితో ఇలా అంటాడు. మీరు భూతబాధ నివృత్తి కోసము వచ్చినారు. ఆ భూతబాధ నివృత్తమై మోక్షమునకు దారి దొరికింది. ఇప్పుడు మీరు నిశ్చింతగా మీ స్వగ్రామమునకు పోయి, ఎల్లప్పుడూ మీ ఇంటియందు శాస్త్ర శ్రవణమో, పఠనమో లేక సద్గురుదేవుని స్మరణమో చేస్తూ ఉండండి. మీకు సమాధానము కలుగగలదు.

ఇటువంటి సద్గురుదేవుని అమృతస్వరూపమైన వచనములను విని పరమానంద పరవశులై, ఆ దంపతులు సద్గురుదేవుని చరణకమలములకు వందనమాచరించి, సద్గురుదేవుని ఆజ్ఞను గైకొని వారి స్వగ్రామమునకు బయలుదేరి ఇంటికి క్షేమముగా చేరుకున్నారు. అప్పుడు వారికి వారు 'నర-సోబా' దేవునికి వంద రూపాయలు సమర్పించగలమని చేసిన వాగ్దానము జ్ఞాపకము వచ్చింది. ఎంతో చింతించినారు. స్త్రీయొక్క పిశాచబాధ సద్గురు సిద్ధనాథుని కరుణాకటాక్షముద్వారా నివృ-త్తమైనది. వంద రూపాయలు నరసోబాకు ఇస్తామని ఒప్పుకుంటిమి. ఇప్పుడు వంద రూపాయలు ఎవరికి ఇవ్వాలి—అని బ్రాహ్మణ దంపతులు సందేహములో పడ్డారు.

ఆనాటి రాత్రి స్త్రీకి స్వప్నములో నరసోబా కనిపించి మీరు ఒప్పుకున్న వంద రూపాయలు సద్గురు సిద్ధారూఢస్వామికి సమర్పించుకోండి—అని చెప్పి నరసోబా అంతర్ధానమైనాడు. అప్పుడు స్త్రీ మేల్కాంచి తన పతితో స్వప్నసంగతిని తెలియజేసి, మనము నరసోబాకు ఇస్తామని వాగ్దానము చేసిన వంద రూపాయలు సిద్ధారూఢస్వామికే ఇవ్వాలి—అని చెప్పింది. ఇదే మహా ఆజ్ఞగా భావించి వెంటనే ఇద్దరు దంపతులు బయలుదేరి వెళ్లి సిద్ధారూఢస్వామిని కలుసుకొని సాష్టాంగ ప్రణామము-లుచేసి దీనవదనులై ఈ విధముగా వారి అభిప్రాయమును వెలిబుచ్చినారు. హే ప్రభో! నాయొక్క స్త్రీ ఆరోగ్యము కుదుటపడి పిశాచపీడ నివృత్తి అయినట్లయితే నీకు వంద రూపాయలు సమర్పించు-కుంటామని నరసోబా దేవునికి వాగ్దానము చేసియుంటిమి. కాని, పిశాచబాధ నీయొక్క అనుగ్ర-హమువలన నివృత్తమైనది. రూపాయలు నరసోబాకు సమర్పించాలా? లేక పీడ నివృత్తిచేసిన మీకు సమర్పించాలా? అని సందిగ్ధావస్థలోపడి ఉండగా, రాత్రి మాఆవిడకు నరసోబా స్వప్నములో కని-పించి, సిద్ధారూఢస్వామికే సమర్పించమని ఆజ్ఞాపించినాడు. అందువలన మేము వంద రూపాయలు మీ చరణకమలములకు సమర్పించుకొని పోదామని వచ్చాము—అని ఈ రీతిగా వారి మనోభీష్టాన్ని తెలిపి, వంద రూపాయలు స్వామి చరణాలకు అర్పించి సద్గురుదేవుని ఆశీర్వాదమును పొంది తిరిగి వారి స్వగ్రామమునకు పోవుటకు సిద్ధమై, సద్గురు భజన అఖండముగా చేస్తూ వారి ఇంటికి చేరు కొని, అప్పటినుండి సద్గురుదేవుని పాదాలయందు దృఢమైన భక్తిని వృద్ధి చేసుకొని సకామభక్తి

పరిపక్వమై నిష్కాములుగా మారి సద్గురుదేవుని అనుగ్రహముచేత అంతఃకరణము పవిత్రమై స్వస్వ-రూపాన్ని బడసి వారు ధన్యులు అయినారు. పరిపూర్ణమైన స్వరూపానుభవమును పొందినారు.

ఇప్పుడు మరొక కథను వినండి. "నిరుపాదప్ప" అనే భక్తుడు హుబ్లీ పట్టణమందు నివసించే వాడు.అతడు జీవికావృత్తి ఏమి చేసేవాడుకాదు.బంధువుల గృహముయందు సమయానికి భుజిస్తూ, సద్గురుదేవుని భజిస్తూ కాలము గడిపేవాడు. సిద్ధారూఢస్వామిపట్ల అచంచలమైన భక్తిశ్రద్ధలు కలిగి ఉండెను. సద్గురుదేవుని దర్శనార్థము ప్రతినిత్యము సిద్ధాశ్రమమునకు వచ్చేవాడు. దినమంతా అక్కడే ఉండి నిష్కామముగా సేవచేస్తూ ఉండేవాడు. జీవనము గడవడానికి ఏ పని చేసేవాడు కాదు. ఈ విధముగా ఆశ్రమములో ఉంటున్న నిరుపాదప్పను గమనించి, సద్గురు సిద్ధనాథుడు దగ్గరకు పిలుచు కొని, నాయనా! జీవనోపాధి కోసము ఏదైనా పని చేయరాదా! వృథాగా తిరుగక ఎవరిపై ఆధార పడకుండా, ఒకరికి దుఃఖము కలిగించకుండా జీవించాలి–అని సద్గురుదేవుడు ఆజ్ఞాపించినాడు.

అప్పటినుండి సద్గురుదేవుని ఆజ్ఞమేరకు ఏదో ఒక వృత్తిని చేపట్టినాడు. కొంత ధనమును సంపాదిస్తున్నాడు. సంపాదించిన ధనమును తెచ్చి తన బంధువుకు ఇచ్చి ఆయన వద్దనే భోజనము చేస్తున్నాడు. ఇలా జరుగుచుండగా ఒక రోజున నిరుపాదప్ప తన బంధువుతో ఇలా అంటాడు. నేను ప్రతిరోజు సద్గురు సిద్ధారూఢస్వామికి నైవేద్యము తీసుకెళ్లాలి. సదుపాయమును కల్పించమని కోరి-నాడు. ఆ బంధువు నిరుపాదప్ప కోరికను తిరస్కరించి పైగా రెండు చీవాట్లు పెట్టి, నీకు సద్గురు దేవునిపై అంతగా ప్రేమఉంటే నీ భోజనమునుండియే సగభాగము మీ సద్గురుదేవునికి సమర్పించు-కోగాని, నేను అధికముగా నైవేద్యము ఇవ్వను–అని కోపగించినాడు. ఆనాటి నుండి నిరుపాదప్ప తనయొక్క భోజనమునుండి సగభాగము తీసి, మిగిలిన సగము భోజనమును భుజించిన పిమ్మట దాచి ఉంచిన సగభాగము భోజనమును అత్యధిక ప్రేమతో తీసుకొని పరుగెత్తుకుంటూవచ్చి సద్గురు సిద్ధారూఢస్వామికి అర్పించేవాడు. నిరుపాదయ్య తెచ్చినటువంటి ప్రసాదములో నాలుగు బుక్కలు సద్గురుదేవుడు స్వీకరించి, మిగిలిన ప్రసాదమును తదితర భక్తులకు పంచిపెట్టేవాడు. నిరుపాదప్ప యొక్క ప్రగాఢమైన ప్రేమనుచూసి భక్తులందరూ ఆశ్చర్యపడేవారు.

ఒకానొక రోజున నిరుపాదప్పయొక్క బంధువు అకస్మాత్తుగా సద్గురు సిద్ధారూఢస్వామికి త్రోవలో కలిసినాడు. స్వామి ఆయనతో అంటాడు. ఏమయ్యా! ప్రతిరోజూ నైవేద్యము మఠమునకు ఎందుకు పంపిస్తావు?ఇంట్లోనే విగ్రహమునకు చూపించండి.అప్పుడు ఆబంధువు స్వామితోఅంటాడు. స్వామీ! నేను ఎన్నడును మఠమునకు నైవేద్యము పంపించలేదే! అప్పుడు స్వామి అంటాడు. మీ బంధువైన నిరుపాదప్ప ప్రతిరోజు నైవేద్యము తీసుకొస్తున్నాడయ్యా!

వెంటనే ఆ బంధువు ఇంటికెళ్లి నిరుపాదయ్యను శాసిస్తూ–ఇక మీదట నీవు నైవేద్యమును మఠమునకు తీసుకొని పోకూడదని ఆజ్ఞాపించాడు. ఒకవేళ నీవు నైవేద్యమును మఠమునకు తీసు-

కెళ్లితివా, నీ సద్గురుదేవుని మీద ఒట్టు–అని శాసించాడు. నీ వాటాలోనే సగభాగము ప్రసాదమును కూడా మఠమునకు తీసుకెళ్లకూడదు–అని కఠినముగా శాసించినాడు.

'నిరుపాదప్ప' తల్లినుండి దూరమైన లేగదూడవలె దుఃఖించినాడు. ఎంతో చింతించినాడు. సద్గురుదేవునికి నైవేద్యము తీసుకపోయే నియమము భంగమాయేగదా!అని ఎంతో విలపించినాడు. రెండవ రోజున నిరుపాదప్ప భోజనము ముందు పెట్టుకున్నాడు. నోటిలో బుక్క పెట్టడము లేదు. నైవేద్యము ఇక్కడే సమర్పిస్తానని తనలో తాను నిశ్చయించుకుని, అదే ఇంట్లో వేరే చోటికి వెళ్లి ఒంటరిగా ఉన్న ప్రదేశములో కూర్చుని స్వామిని ప్రార్థించాడు. ఓ సద్గురుదేవా! ఓ సిద్ధమూర్తి! నీకన్నా అన్యమైన స్వబాంధవులు నాకు ఎవరు లేరు. నా సర్వస్వము నీవే. నీవు తప్పకుండా ఇక్కడికి వచ్చి ఈ దీనుడు సమర్పించే నైవేద్యమును స్వీకరించుము స్వామీ! నేను ప్రతినిత్యము స్వయముగా మఠమునకు ప్రసాదము తీసుకొచ్చేవాడిని. కాని, ఈరోజు నాయొక్క బంధువు నన్ను నిరోధించి, నీ మీద ఒట్టు పెట్టినాడు. అందుకనే నేను మఠమునకు రాలేకున్నాను. దయచేసి నా మొరనువిని నీవే ఇక్కడికి వచ్చి ప్రసాదమును స్వీకరించుము స్వామీ! అని వేడుకుంటున్నాడు. ఒకవేళ నీవు వచ్చి ప్రసాదమును స్వీకరించనిచో నేను ఒక్క బుక్కగూడా భుజించను. నీవు తొందరగా వచ్చి ప్రసాదమును స్వీకరించుము స్వామీ! లేనియెడల నా ప్రాణాలను త్యజించుటకు సిద్ధముగా ఉన్నాను.

ఇట్లు, నిరుపాదయ్య అనేక విధములుగా ప్రార్థిస్తూ–సద్గురుదేవుని రాకకు ఎదురుచూస్తూ కొంతసేపు నిరీక్షించాడు. సద్గురుదేవుడు ఇంకా రాకపోయేసరికి నిరుపాదయ్య దూలమునకు త్రాడు గట్టిగా కట్టి ఉరివేసుకునేందుకు సంసిద్ధుడైనాడు. ఇక కంఠమునకు త్రాడు వేసుకోబోతూ మళ్లీ ఒకసారి సద్గురుదేవుని ఇలా ప్రార్థిస్తున్నాడు. ఈరోజు నీకు ఎవరు ప్రసాదమును తీసుకురారు. నీవు ఉపవాసము ఉండవలసి వస్తుంది. అందుకని తొందరగా వచ్చి ప్రసాదమును సేవించుము. లేనిచో ఇదిగో, నేను ఆత్మహత్య (ఉరివేసుకొని) ప్రాణత్యాగము చేస్తున్నాను–అని వెంటనే కంఠమునకు త్రాడు వేసుకొని వ్రేలాడబడ్డాడు. తత్క్షణమే సద్గురుసిద్ధనాథుడు అక్కడికక్కడే ప్రత్యక్షమై నిరుపాదప్ప మెడలోని త్రాడునుతప్పించి భూమిపై దించినాడు.అప్పుడు నిరుపాదప్ప,స్వామితో ఇలా అంటాడు. స్వామీ! నీయొక్క రాక చాలా మంచిదైనది. ఇప్పటికే చాలా ఆలస్యమైనది. తొందరగా ప్రసాదమును స్వీకరించండి స్వామీ! అని అన్నాడు.

ఈ ప్రకారముగా నిరుపాదప్ప, స్వామి ముందు ప్రసాదమునుంచాడు. స్వామి తాను తినుకుంటూ–తన స్వహస్తములతో నిరుపాదయ్యకు చిన్నపిల్లవానికి తినిపించినట్లు తినిపించాడు. భోజనమైన పిమ్మట స్వామి అంతర్ధానమైనాడు. ఈ సంబరమును చూసి ముల్లోకాలు సంతసించాయి. స్వామిని నిరుపాదప్ప తప్ప మరెవరు చూడలేదు. ఇట్లు కొన్ని రోజులు గడిచినవి. సిద్ధారూఢస్వామి వచ్చి నిరుపాదయ్యతో కలసి భోజనముచేసి వెళుతున్నాడు. ఒకనాడు నిరుపాదప్పయొక్క బంధు-

వునకు అనుమానము వచ్చి ఏమిటీ? నిరుపాదప్ప మాతో కలిసి భోజనము చేయకుండా ఒక్కడే ఏకాంతములోకి వెళ్లి తినుచున్నాడు. ఏమిటో విశేషము-చూడాలి–అని గుప్తంగా ఉండి చూడసాగినాడు. ఆ బంధువు ఒక్కసారిగా ఆశ్చర్యచకితుడైనాడు. నిరుపాదప్పతో కలిసి సిద్ధారూఢస్వామి భుజిస్తూ, తాను స్వయముగా నిరుపాదప్పకు తినిపించుచున్నాడు. ఈ దృశ్యమును చూసిన బంధువు వెంటనే పరిగెత్తుకుంటూ వచ్చి సద్గురుదేవుని పాదపద్మములపై వ్రాలి, స్వామీ! నన్ను రక్షించుము. నన్ను క్షమించుము. నేను అత్యంత మూర్ఖుడను. నీయొక్క అగాధమైన కీర్తిని యెఱుగలేక పోయాను. నాయొక్క మూర్ఖత్వమునకు ధిక్కారమగుగాక! అని పదేపదే వేడుకుంటాడు. నీయొక్క సంబంధము చేత నిరుపాదప్ప ధన్యుడైనాడు-అని అంటాడు. నీయొక్క అనన్య భక్తుడైనటువంటి నిరుపాదప్పను ఈరోజునుండి నీవద్దనే మఠముయందే ఉంచుకోగలవు. నేనే స్వయంగా మీకిద్దరికీ భోజనము మఠమునకే తెచ్చి ఇవ్వగలను. ఈనాటికి ఆయన బంధుత్వమువలన నేను నా కుటుంబము ధన్యమైనది. నీయొక్క దర్శనభాగ్యము కలిగింది. మీయొక్క దివ్యచరణములు మాఇంటిని పావనము చేసినవి. ధన్యోఽహం ధన్యోఽహం–అంటూ బంధువు సిద్ధారూఢస్వామిని ప్రార్థిస్తాడు.

అప్పుడు సద్గురుదేవుడంటాడు–అవును, నాకుగూడా నిరుపాదప్పను విడిచి ఉండాలనిపించుటలేదు. ఈరోజు నుండి నా వద్దనే ఉంటూ సేవ చేస్తుంటాడు. సద్గురుదేవుని అమృతవచనములను విన్న నిరుపాదయ్య అత్యంత హర్షమును పొందినాడు. ఈరోజు నా పుణ్యముదయించింది. నాకు పుణ్యస్థలము(సద్గురుపాదసేవ)లభించినదని ఎంతో సంతోషించినాడు.ఈరోజునుండి సద్గురుస్వామి చెంతనే ఉండి సేవచేసుకుంటాను. ప్రతినిత్యము సద్గురుదేవుని సేవ లభిస్తున్నందుకు నేను ధన్యుడనని తలంచి నయనాలనుండి ప్రేమాశ్రువులు రాల్చుతూ, గద్గదకంఠముతో పలికినాడు.

ఈ విధముగా కొన్నాళ్లు సేవచేస్తూ తన జీవితమును ధన్యము చేసుకొని, తర్వాత కాలధర్మమునుసరించి శరీరమును వదలవలసి వచ్చింది. అవసానదశలో నిరుపాదప్ప ఇలా అంటాడు. నేను ఇప్పుడు సద్గురుదేవుని కృపచేత కైలాస పర్వతమును చేరుకుంటున్నాను.

ఇట్లు, సద్గురుదేవుని సేవిస్తూ తన శిరస్సును సద్గురుదేవుని పాదపద్మములపైనుంచి అంత్యశ్వాసను వదిలినాడు.ఆసమయంలో ఒక మెరుపులాంటి ప్రకాశము కనిపించింది.అంత్యకాలములో సద్గురుపాదాల నాశ్రయించి ప్రాణాలను త్యాగముచేసి, ధన్యుడైన నిరుపాదప్పను కైలాసపతి తనలో ఐక్యము చేసుకున్నాడు. ఈ ప్రకారముగా ఈ లోకంలో సద్గురు సిద్ధారూఢస్వామి భక్తులనుద్ధరింప జేయుటకు సగుణసాకారరూపముతో అవతరించాడు.

ఓ శ్రోతలారా!ఇప్పుడు వేదాంతరూప లక్ష్యార్థమును ఆలకించండి. జీవుడు-బుద్ధి అను ఇరువురు దంపతులు. బుద్ధికి విషయచింతన అనే పిశాచము పట్టి పీడిస్తున్నది. అందుకని, ఈ విషయ చింతనారూప పిశాచ నివృత్తి కోసము నరసింహసరస్వతి (విద్యారూపసింహము)స్థానమును ఆశ్ర-

యిస్తే, తాను ఈ భవరోగ నివృత్తిచేయు సద్గురుదేవుడైన సిద్ధారూఢస్వామికి శరణు బొందమని సెలవిస్తాడు. ఎప్పుడైతే జీవుడు-బుద్ధిరూప భార్యతోసహా సద్గురుదేవుని ఆశ్రయించి హృదయపూర్వ-కముగా సేవచేయనారంభించినాడో, క్రమంగా విషయచింతనారూప భూతము నివృత్తమైనది. వృత్తి రూప రూపాయలను సద్గురుదేవునికి అర్పించినారు.(వృత్తియనగా మనసు)దీనిని సద్గురుదేవునికి అర్పించినాక ఇక విషయచింతన ఉంటుందా?మనస్సే లేనప్పుడు దేనిద్వారా చింతన జరుగుతుంది? మనస్సు ఉంటేనే గదా విషయచింతన జరిగేది. అందుకే—

**శ్లో ॥ మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః ।**

**బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥** (బ్రహ్మబిందూప. ౨)

కావున, ఎప్పుడైతే మనస్సును సద్గురు పాదపద్మములకు అర్పిస్తామో, ఇక బంధము లేదు, మోక్షము లేదు. కేవల స్వస్వరూపస్థితినే పొందగలము.

ఇప్పుడు రెండవ కథయొక్క లక్ష్యార్థము. నిరుపాదప్ప ఉపాధిరహిత జీవుడు ఎల్లప్పుడూ మఠరూప సమాధియందు ప్రశాంతముగా ఉంటాడు. అటువంటి జీవుణ్ణి 'ప్రారబ్ధరూప' బంధువు విషయాకారవృత్తులనే వ్యాపారము(పని)లో ప్రవేశపెట్టింది. సద్గురుదేవునికి ఆత్మాకారవృత్తిరూప నైవేద్యమును సమర్పించుటకు ప్రారబ్ధరూప బంధువు ప్రతిబంధకమైనాడు. ఈ ప్రతిబంధకమును జీవుడు సహించలేక ప్రారబ్దమును ఎదిరించి,దానిని జయించి సద్గురుదేవునిగూర్చి తాపత్రయ పడుతూ,ఆత్మాకారవృత్తిరూప నైవేద్యమును సద్గురుదేవునికి సమర్పించుటకు తహతపడుచుండగా-అప్పుడు జ్ఞానరూప సద్గురుదేవుడు ప్రకటమై ప్రారబ్ధమునుండి విడుదలచేసి విదేహకైవల్యమును, పరమశాంతిని ప్రసాదించి, తన చెంతనే అనగా తన స్వరూపునిగా చేసుకుంటాడు. ఈ ప్రకారముగా అర్పణరూప బుద్ధిగల శిష్యునికి యథార్థమైన జ్ఞానోపదేశముచేసి సమాధిని ప్రసాదించి ధన్యుణ్ణి చేస్తాడు.

శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రముననే సకలపాపములు భస్మమై పోవును. శ్రీ సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది నాలుగవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది ఐదవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సిద్ధమూర్తీ! నిన్ను నా హృదయమునందుంచుకొని నీ దివ్యమైన పాదధూళులకు వందనములు సమర్పిస్తున్నాను. ఓ సద్గురుదేవా! ఆర్తరక్షకా! వినుము. సత్పురుషుల హృదయనివాసివైన నీ కీర్తిని, నీ గుణగణాలను, లీలలను పాడుతూ, నీయొక్క దివ్యచరిత్రను నిర్వి-ఘ్నముగా వ్రాయుటకు నీ పాదదాసుడనైన నాకు యోగ్యమైన బుద్ధిని, స్ఫూర్తిని ప్రసాదించుము.

ఓంకార స్వరూపుడవైన ఓసద్గురు సిద్ధనాథా! నాయొక్క మనస్సు ఎల్లప్పుడు నీయొక్క దివ్య పాదారవిందములయందే లగ్నమై ఉండులాగున అనుగ్రహించుము. నీ పాదాలయొక్క ప్రాప్తముచేత బ్రహ్మదేవుడు సహితము ఉపాధిని నిరసించి ధన్యుడగును. బ్రహ్మాదిదేవతలకు ఉపాధులు మరియు తత్సంబంధమైన వ్యవహారములున్నవి. కాని, నిర్గుణ, నిరాకార, పరబ్రహ్మవై, సర్వమునకు అధిష్టాన స్వరూపుడవైన ఓ సద్గురుదేవా! నీవు నిరుపాధిక స్వరూపుడవు. నీయొక్క చింతన, భజనచేసినట్ల-యితే సకలఉపాధులు నివృత్తమై ఉపాధిరహిత బ్రాహ్మీస్థితిని పొందగలము. నీయొక్క కృపద్వారా అనాత్మదేహధర్మములు నివృత్తమై, విదేహ కైవల్యమునుబొంది సకల భ్రమరూప ప్రపంచమును నీయొక్క స్వరూపముగానే దర్శిస్తారు. (కల్పిత వస్తువు అధిష్టాన స్వరూపమే).

**శ్లో ॥ దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని ।**

**యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః ॥** (వాక్యసుధా.30; సరస్వతీ రహ.31)

ఎంతవరకైతే నీయొక్క చరణకమలములయొక్క ఆశ్రయము లభించదో, అంతవరకు స్త్రీ పుత్రాది బంధనమునుండి నివృత్తి కలుగదు. నిన్ను హృదయపూర్వకముగా తాపత్రయహృదయ-ముతో, తరించాలన్న తపనతో శరణుజొచ్చినప్పుడే విషయాలనుండి మనసు విముఖమై భవసాగ-రమునుండి తరించుటకు సాధ్యమౌతుంది.

అజ్ఞానముచేత ఏదేది నాది నాది అని అహంకరిస్తున్నానో, నీయొక్క కృపవలన వాటి యందలి అహంతా-మమతారూప మోహము నివృత్తమై, సంసారరూప భారము నష్టమగును. కావున, ఈభవబంధమునుండి విముక్తి చేయుటకు నీవుతప్ప మరెవ్వరునూ లేరు. దుఃఖరూపమైన శబ్దాదివిషయములయందు అజ్ఞానముచే యే సుఖబుద్ధిని, అనురాగబుద్ధిని పెంచుకొంటినో, నీ యొక్క కృపద్వారా అజ్ఞానము నశించి, విషయాసక్తి నివర్తించి, సర్వత్ర సద్వస్తువైన పరబ్రహ్మమే

గోచరించును. ఇటువంటి జ్ఞానమును నీయొక్క కృపవలన పొంది, మాయావిలాసమైన ఈ క్షణిక సుఖాలనుండి విముఖుడనై యథార్థస్వరూపమును పొందును. పవిత్రమైన సద్గురుచరిత్ర శ్రవణ-ముద్వారా శ్రోత్రేంద్రియము పవిత్రమై, సకల దోషగుణములు నివృత్తమై బ్రాహ్మీస్థితి ప్రాప్తించును.

ఓ శ్రోతలారా ఇప్పుడు సద్గురు చరిత్రను సావధానముగా ఆలకించండి. శ్రీ సిద్ధారూఢస్వామి సిద్ధాశ్రమమునందు శోభాయమానముగా ఆసీనుడై ఉన్న ఒకానొక సమయమున "మైసూరు" ప్రాంతమునుండి ఒకానొక భక్తుడు వచ్చి సద్గురు దేవునికి శరణు పొందినాడు. సద్గురుదేవుడు ఆ భక్తుని ముఖచిహ్నములు గుర్తించి, ఆయన స్థితిగతులు గమనించి, ఈయన ఎటువంటి కోరికలు లేని నిస్పృహ హృదయుడని తెలుసుకొని, ఆయనకు "భోలాభక్తుడు" అని పేరు పెట్టినాడు. అప్పుడు ఆ బోలాభక్తుడు అంటాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క పేరు ప్రఖ్యాతులు, కీర్తిని విని కృపాళుడవైన నీవు ఈ దీనున్ని తప్పకుండా తరింపజేస్తావని ఆశతో నిన్ను శరణుజొచ్చినాను. కావున,ఓ దీనదయాళా! ఈ దీనుని రక్షించి భవసాగరమునుండి తరింపజేయుము.

భోలాభక్తుని ప్రార్థననాలకించి,సద్గురుదేవుడు అతనిని స్వీకరించి, ఈ విధంగా చెప్పినాడు. నీవు ప్రతిరోజు మఠమునకు వచ్చి యథాయోగ్యమైన సేవచేస్తూ నిత్యము వేదాంతశ్రవణము చేసి-నట్లైన నిశ్చయముగా నీకు కళ్యాణము చేకూరును. అప్పుడు ఆ బోలాభక్తుడు ధన్యోస్మి–అంటూ గ్రామములోకి పోయి ఒక గదిని అద్దెకు తీసుకొని, అందు నివసిస్తూ ప్రతిరోజు సమయానికి ఆశ్ర-మమునకు వచ్చి సద్గురు ముఖకమలముద్వారా వేదాంతశ్రవణము చేసేవాడు. అయితే ఆ భోలా-భక్తుడు ఇంటినుండి వచ్చేటప్పుడు కొద్దిపాటి ధనమును (డబ్బును) తీసుకొని వచ్చియుండెను. దానిని గదిలో దాచిపెట్టి నిత్యము శ్రవణమునకు వచ్చేవాడు. కాని, ఆయన మనస్సు శ్రవణమందు లగ్నము గాక, ఆ ధనమునే ధ్యానము చేయుచుండెను. శ్రవణమందు చిత్తము లగ్నము కాకపోవడమేగాక, ఇంటికి పోయినాక పడకపై నిద్రించినా కూడా సరిగా నిద్రపట్టక పోయెడిది. ఎవరైనా చోరులు వచ్చి ఈ ధనమును దొంగిలిస్తారేమో అనే భయముచే నిద్రపట్టక పోయెడిది. ఈ ప్రకారముగా రాత్రి నిద్ర లేనందువలన ఉదయము ఆశ్రమములో శ్రవణమునకు కూర్చున్నప్పుడు నిద్ర వచ్చుచుండెడిది. ఒకవేళ మేల్కొంచితే మనసు ఇంటివైపు వెళ్లి ధనమును ఎవరైనా దొంగలిస్తున్నారేమో అని చింతన చేయుచుండెడివాడు.

సద్గురుదేవుడు ఈ భోలాభక్తునియొక్క అవస్థను గ్రహించి, ఈయనకు ముముక్షు లక్షణా-లున్నప్పటికీ ఈయనవద్ద ఉన్నటువంటి కొద్దిపాటి ధనమువలన, ఈయనకు శ్రవణమందు విక్షేపము కలుగుచున్నది–అని తెలుసుకున్నాడు. మల విక్షేపములు లేకుండా ఉండి కేవల ఆవరణ దోషము ఉంటే అటువంటివాడు వేదాంత శ్రవణమునకు అధికారి కాగలడు.

ఒకరోజు రాత్రి ధనచింతనలో భోలాభక్తునికి చాలా రాత్రివరకు నిద్ర పట్టలేదు. తీరా రెండుగంటలు దాటినాక నిద్ర ఆగలేక కన్నుమూసినాడు (నిద్రించినాడు). సరిగ్గా అదే సమయానికి దొంగలువచ్చి ద్వారమును పగులగొట్టి గదిలోకి ప్రవేశించినారు. వారు బోలాభక్తుని లేపి స్తంభ-మునకు బంధించి, నోటిలో వస్త్రములు నొక్కి తన వద్ద ఉన్నటువంటి ద్రవ్యమును సామగ్రులను వస్త్రములతో సహా అన్నిటిని హరించుకుపోయినారు. కట్టుకొనుటకు వస్త్రముకూడా మిగిల్చలేదు. ద్రవ్యలోభముచేత దైవచింతన, సద్గురుస్మరణ కాదు. కావున,చోరులు కౌపీనమునకుగూడా గుడ్డ మిగిల్చకుండా దోచుకుపోయినారు.

దొంగలందరూ వెళ్లిపోయినాక ఇరుగు పొరుగువారు ద్వారము కూలిపోయి ఇల్లు చెల్లాచెదరయ్యి పోయింది గమనించి, లోనికి వచ్చి చూసినారు. బోలాభక్తుడు స్తంభమునకు కట్టి వేయబడి ఉన్నాడు. దయదలచి వారు ఆయనను విడుదల చేసి, ఆయన పరిస్థితిని చూడలేక ఒక గుడ్డను ఇస్తే, దానిని కౌపీనముగా ధరించుకొని అతడు నేరుగా సద్గురుదేవునివద్దకు వచ్చి, సద్గురు దేవుని పాదాలపైపడి గొల్లున ఏడ్చాడు.

అప్పుడు స్వామి అంటాడు–ఈశ్వరుడు ఏమిచేసినా మనమంచికొరకే చేస్తాడు. ఈశ్వరుడు దుఃఖములను మన కళ్యాణమునుగోరి ఇస్తాడు. నీవేమి దిగులు చెందకు.చాలా మంచిదే జరిగింది. ధనలోభమువలన శ్రవణమందు చిత్తము లగ్నము కాదు. ఇప్పుడు నిశ్చయముగా నీ కళ్యాణము జరుగును. నిశ్చింతగా ఉండుము. అని ఊరడిస్తాడు సద్గురుదేవుడు. ఇప్పుడు పూర్తిగా నీపై ఈశ్వర కృప కలిగింది–అని అంటాడు.

లోకంలో ప్రతినిత్యము జనులనుండి కామ క్రోధ లోభ మోహ మద మత్సరములు అనే ఆరుగురు దొంగలు జ్ఞానమనే మహత్తరమైన ధనమును దొంగిలిస్తున్నారు. ఆ జ్ఞానధనమునకు మించిన ధనము మరొకటి లేదు.

**"నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే"** (గీత.4-38)

**శ్లో ॥ కామ క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః ।**

**జ్ఞానరత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥** (జీవప్రబోధ శ్లోకము)

అటువంటి మహత్తరమైన, శాశ్వతమైన జ్ఞానధనమును షడ్రిపులు దొంగిలిస్తున్నప్పటికీ జనులు ఏమాత్రము చింత, భయము–లేక ఉంటున్నారు. కాని, అల్పమైన, క్షణికమైన ధనమును గూర్చి ఎంతో భీతిల్లి లోకులు చింతిస్తున్నారు. కావున, నాయనా! బోలాభక్త! నీవు ఈ దొంగిలిం-పబడిన క్షణికధనమునుగూర్చి చింతించకుము. నీకు ముస్ముందు నిజమైనటువంటి శాశ్వతమైన ధనము లభ్యము కానున్నది. నీవు ఏమాత్రము సంకోచమునొందకుము. ఈ విధముగా ధైర్యము చెప్పి సద్గురుదేవుడు బోలాభక్తుని ధరించుటకు వస్త్రములు ఇచ్చినాడు. అప్పుడు బోలాభక్తుడు

అంటాడు. స్వామీ! దీన దయాళా! నేనెప్పుడూ ఎక్కడికి పోను. నీ చరణకమలములనే ఆశ్రయించి, ఇక్కడనే నీ సాన్నిధ్యములోనే, ఈ ఆశ్రమమందే ఉంటాను. ఊరిలో భిక్ష అడుగుకొని జీవిస్తాను. నా చిత్తము నీ పాదములయందే సంలగ్నము చేస్తాను–అని తన దీనత్వమును వెలిబుచ్చినాడు.

సద్గురుదేవుడు ఆనందభరితుడై బోలాభక్తుని తన రెండు హస్తములతో వక్షస్థలమునకు ఆలింగనము చేసుకొని అంటాడు. నాయనా! నీవు ఇప్పుడు బోలాభక్తుడనే పేరును సార్థకము చేసుకున్నావు. ఇప్పటినుండి నీవు ఇక్కడే సుఖముగా ఉండగలవు–అని ఆశ్వాసనమిచ్చినాడు.

బోలాభక్తునియొక్క ద్రవ్యమును చోరులు దొంగిలించిన పిదప ఆయనయొక్క చింత దూర మైనది. రాత్రి నిశ్చింతగా గాఢనిద్రను (సుషుప్తి) పొందుచున్నాడు. శ్రవణమునకు కూర్చున్నప్పుడు నిద్ర రావడము లేదు. చిత్తైకాగ్రత గలిగి వేదాంతమును సద్గురుదేవుని ముఖకమలమునుండి శ్రవ-ణము చేస్తున్నాడు. ఈ ప్రకారముగా ప్రతినిత్యము వేకువనే లేచి వేదాంత శ్రవణములో పాల్గొనుట వలన క్రమక్రమముగా సద్గురుసేవ చేస్తున్నందున విషయవాసనలన్నీ సమూలముగా నివృత్తమై అంతరంగమందు వైరాగ్యజ్వాల రగిలి, చిత్తము పరిశుద్ధమై జ్ఞానమునకు అనుకూల(సాధన)మైనది.

ఒకానొక సమయములో సద్గురు సిద్ధారూఢస్వామికి చలిజ్వరము (మలేరియా) వచ్చింది. దానిచేత స్వామి శరీరము అశక్తమైనది. అదే సమయానికి శివరాత్రి మహోత్సవము సమీపించినది. ఇంకా ఒక్కరోజు మాత్రమే మిగిలి ఉంది. ఉత్సవమేమో సమీపించింది. మరి ఎలా చేస్తాము?అని భక్తులందరూ చింతాక్రాంతులై నిరాశ జెందినారు. సద్గురుదేవుని దర్శనార్థము శివరాత్రి ఉత్సవము నిమిత్తముగా దేశదేశములనుండి భక్తులు ఎంతో ఉత్సాహముతో వస్తారు. ఒకవేళ ఈ ఉత్సవము ఆగిపోతే భక్తులందరూ నిరాశజెందుతారు–అని దిగులు జెందుతారు.

అప్పుడు సద్గురుదేవుడు ఆ భక్తులయొక్క అభిప్రాయమునెఱిగి, వారిని తన సమీపమునకు పిలుచుకొని, ప్రతిఒక్కరిని ఇలా అడుగుతాడు. నాయనా?ఈ నాచలిజ్వరమును నీవు తీసుకుం-టావా?మీలో ఏ ఒక్కరైనా నా ఈ చలిజ్వరమును తీసుకున్నట్లయితే, నేను ఆరోగ్యవంతుడనై శివ-రాత్రి మహోత్సవమును నిర్విఘ్నముగా బ్రహ్మాండముగా జరిపించిన తర్వాత మళ్లీ నా జ్వరమును నేను తీసుకుంటాను. మీలో ఎవరైనా సిద్ధముగా ఉన్నారా? చెప్పండి.

ఈ ప్రకారముగా స్వామి ఆ భక్తులను అడిగేసరికి, ఒకడంటాడు-అయ్యా! నీ జ్వరము నేను తీసుకున్నచో నా భార్య, పిల్లలు భయపడతారు. మరొకడు అంటాడు-స్వామీ! నేను రాత్రింబవళ్లు వ్యవహారము చేసుకుంటేనే నా కుటుంబపోషణ జరుగుతుంది. ఒకవేళ నీ జ్వరము నేను తీసుకు-న్నచో నా వ్యవహారము స్తంభించిపోయి దివాలా తీయగలదు. ఇంకొకడంటాడు-గురుదేవా! నా భార్య నిండు గర్భముతో ఉంది. ఇంకొకడంటాడు-మహాత్మా! నా భార్య యుక్తవయస్సులో ఉంది. ఒకవేళ నేను నీ జ్వరమును తీసుకొని అకస్మాత్తుగా చనిపోయినచో నా భార్య గతి ఏమిటి? మ

రొకడంటాడు-స్వామీ! నాకు ఇంకా పెళ్లి కాలేదు. నేను ఇంకా ఏ భోగభాగ్యములు అనుభవించ లేదు. ఈ ప్రకారముగా గ్రామములోని గృహస్థ భక్తులంతా ఏదో ఒక నెపము చెప్పుకొని తప్పించు కొని వెళ్ళిపోయినారు.

ఇక ఇప్పుడు అన్నిటిని త్యాగముచేసి మఠములో సేవ చేసుకుంటూ ఉండే సన్యాసులను పిలుచుకొని ఒక్కొక్కరిని అడుగుతాడు. అప్పుడు ఆ సన్యాసి శిష్యులలో ఒకడంటాడు- ఓ సద్గురు దేవా! ఇంకా నాయొక్క అభ్యాసము, శాస్త్రాధ్యయనము పూర్తి కాలేదు కదా! ఇంకొకడంటాడు-ఓ సద్గురుదేవా! నేను రేపు ఉదయముననే తీర్థయాత్రలకు బయలుదేరుతున్నాను. నీ జ్వరమును నేను తీసుకుంటే నా ప్రయాణము ఆగిపోతుంది స్వామీ!

ఈరీతిగా అందరు భక్తులు ఏదోఒక నిమిత్తము చెప్పుకుని తప్పించుకున్నారు.అప్పుడు సిద్ధా-రూఢస్వామి బోలాభక్తుని పిలిచి నాయనా!నీవైనా నాజ్వరమును తీసుకుంటావా?అని అడుగు-తాడు. బోలాభక్తుడంటాడు–స్వామీ! అవశ్యము మహాప్రసాదముగా స్వీకరిస్తాను. ఎందుకంటే ఇంత కంటే భాగ్యము మరొకటి ఉంటుందా! సద్గురుదేవుని కొఱకు నా ప్రాణాలైనా అర్పిస్తాను. నేను నీ జ్వరమును తప్పకుండా స్వీకరిస్తాను. తొందరగా ఇవ్వుము స్వామీ! నీయొక్క జ్వరమును తీసుకొని ఒకవేళ నీ సాన్నిధ్యమునందు నేను మరణించినాగాని నాజన్మ ధన్యప్రదమౌతుంది. ఇంతవరకు నీకు చేసిన సేవతో నాకు తృప్తి కలుగలేదు. కావున,ఈరూపముగానైనా నీకు సేవచేసే భాగ్యము కల్పిం-చుము–అని ప్రాధేయపడినాడు. సేవచేసే సౌభాగ్యమును ప్రసాదించమని వేడుకున్నాడు.ఇటువంటి ప్రేమపూర్వకమైన వచనములువిని సద్గురుదేవుడు చాలాసంతోషించి,అయితే నాజ్వరమును తీసు-కో! అంటూ స్వామి తన హస్తముతో బోలాభక్తుని స్పర్శించాడు.వెంటనే బోలాభక్తునికి జ్వరము సంక్రమించింది. శరీరమువేడెక్కింది. సద్గురుదేవుడు నిరోగియైనాడు. సకలభక్తులు ఆనందభరితు-లైనారు.

ఇక శివరాత్రి మహోత్సవము యథాతథముగా ప్రారంభమైంది. సద్గురుదేవుడు బోలాభక్తుని యొక్క నిరవధిక ప్రేమను క్షణక్షణము స్మృతికి తెచ్చుకుంటూ, ఘడియ ఘడియకువచ్చి బోలాభక్తుని మందలిస్తూ నాయనా!భయపడకుము–అని ధైర్యము చెప్పుచుండెను.మహోత్సవము సమాప్తమై-నది. సద్గురుదేవుడు తొందరగా బోలాభక్తునివద్దకు వచ్చి నాయనా! బోలాభక్తా! ఉత్సవము ముగి-సింది. ఇక నా జ్వరము నేను తీసుకుంటాను–అని అంటాడు. అప్పుడు బోలా భక్తుడంటాడు-స్వామీ! ఒకవేళ మళ్లీ నీవు ఈ జ్వరము తీసుకుంటే ఎందరో భక్తులకు దుఃఖము కలుగుతుంది. ఈ జ్వరము నాకు ఉంటేనే బాగుంటుంది అంటాడు. అప్పుడు సద్గురునాథుడు అంటాడు. కాని, నాయనా! నీవు ఈ జ్వరముతో బాధపడుతుంటే నాకు దుఃఖము కలుగుతుంది. కావున, ఆ జ్వరము నాకే ఇవ్వుము బిడ్డా! అని అంటాడు.

అప్పుడు బోలాభక్తుడు అంటాడు–ఈ చలిజ్వరము నాకే ఉండాలి. నీకు కాదుగదా, మరెవ-రికినీ ఇవ్వను. నీవు స్వస్థుడిగా (సుఖంగా) ఉంటేనే, నాకు సుఖమనిపిస్తుంది. నీ సుఖమే నా సుఖము. నీదుఃఖమే నాదుఖము. ఈశరీరము నాది కాదు. నాది కానప్పుడు నాకెందుకు దుఃఖము కలుగుతుంది? నాకు దుఃఖమే లేదు. ఈ శరీరమును ఏనాడో నీకే అర్పణము చేసినాను. కావున, ఈ జ్వరము నాకే కావాలి. ఇటువంటి భక్తిపూర్వక వచనములను విని భక్తులందరూ హర్షమును పొంది, బోలాభక్తుడు ధన్యుడైనాడు. సద్గురుదేవుని కృపాకటాక్షమునకు పూర్ణపాత్రుడైనాడు. దేహా-భిమానమును సమూలముగా త్యజించినాడు–అని అంటారు.

అప్పుడు సద్గురుదేవుడు తన మనసులో అత్యంత సంతోషమునొంది కరుణామయుడైన సద్గురుదేవుడు బోలాభక్తుని స్పర్శించి, స్వస్థుని (నిరోగి)గా చేసినాడు. బోలాభక్తుడు లేచి ఏడవడ-ము మొదలు పెట్టాడు. బోలాభక్తుడు ఇలా స్వామితో అంటాడు. సద్గురుదేవా! నన్ను ఎందుకు ఆరోగ్యవంతునిగా చేసినావు? ఒకవేళ నీవు జ్వరముతో బాధపడితే నేను సహించలేను చూడు. నేను తప్పకుండా నా ప్రాణాలను వదులుకుంటాను. నీయొక్క దుఃఖమును నేను చూడలేను. అని ఈ ప్రకారముగా పలుకుతూ ఏడుస్తున్నాడు.అప్పుడు సద్గురు సిద్ధనాథుడంటాడు-నాయనా!ఏడవకుము. ఈజ్వరము ఎన్నిరోజులు పీడించాలో అన్నిరోజులు పీడించింది.ఇప్పుడు దాని గడువు తీరిపోయింది. ఇక ఆ జ్వరము మళ్లీ నీకుగాని, నాకుగాని రాదు. నీవు నిశ్చింతగా ఉండుము-అని ఊరడిస్తాడు.

ఒకరోజు రాత్రి సరిగ్గా పండ్రెండు గంటలకు బోలాభక్తుడు గాఢనిద్రలో ఉండగా, సద్గురు సిద్ధనాథుడు బోలాభక్తుని వద్దకు వెళ్లి, నాయనా! నేను ఇప్పుడు బయటకు వెళుతున్నాను. నీవు నాతో రావాలి–అని ఆజ్ఞాపించాడు. సద్గురుదేవుని వచనములను శిరసావహించి, నిద్రనుండి లేచి స్వామిని వెంబడించినాడు. సద్గురుదేవుడు ముందు నడుస్తుండగా బోలాభక్తుడు స్వామియొక్క వెను వెంట అడుగులో అడుగు వేసుకుంటూ దట్టమైన చీకటిలో పయనిస్తున్నారు. సద్గురుదేవుని వైపు ఎక్కువగా నిగ(లక్ష్యము)ఉంచి నడుస్తున్నాడు. ఇలా కొంతదూరము పోయినాక సద్గురుమూర్తి ఒక బావిలో పడినట్లుగా బోలాభక్తునికి భ్రమ కలిగింది. తొందరపాటుతో బోలాభక్తుడు హఠాత్తుగా వెనుకముందు ఆలోచించకుండా ఒక్కసారిగా బావిలో దూకినాడు. బావి లోతుగా ఉన్నందున దెబ్బలు తగిలి గాయపడి, ఆ చీకటి బావిలో పడిపోయినాడు. అయినాగాని ధైర్యము వీడక బోలా-భక్తుడు సద్గురుదేవుని స్మరిస్తూ ఆయాసమును మరిచిపోయినాడు. ఇంతలో దేదీప్యమానముగా ఒక ప్రకాశము కానొచ్చింది. ఆ ప్రకాశమును చూస్తూ చూస్తూ బోలాభక్తుడు తన మనసునందు ఎంతో ఆనందమునొందినాడు. ఆ దివ్యప్రకాశమునందు సద్గురుదేవునియొక్క దర్శనమయ్యింది. వెంటనే లేచి నిలబడి, సద్గురుదేవునియొక్క రూపమునుగాంచి పరమానందభరితుడై బోలాభక్తుడు పరుగు పరుగునవచ్చి సద్గురుదేవుని ఆలింగనము చేసుకున్నాడు. సద్గురుదేవునిచే అభేదరూప ఐక్య-

మునొంది, అమితానందముతో పరమానంద సాగరములో మునకలు వేస్తున్నాడు. దేహభానమును విస్మరించి గురు- శిష్యులనే భేదమును పూర్తిగా మరచి, సద్గురుదేవునితో తాదాత్యమును పొంది, వృత్తి ఆనంద సాగరములో తల్లీనమైంది. ఐదు ఘటికల కాలము అదేవిధంగా తల్లీనమై ఏకత్వరూప అవస్థను అనుభవించినాడు. తర్వాత సద్గురుదేవుడు తనకన్నా భిన్నముగా అగుపించినాడు. ఎప్పు-డైతే ఏకత్వరూప తల్లీనావస్థ ఖండింపబడినదో, సద్గురుదేవుడు తనకన్న భిన్నముగా కానొచ్చినాడు. కాని, ఇంతవరకు ఏదైతే ఆనందము అనుభవించినాడో, అది మాత్రము మరిచిపోలేదు. ఎప్పటి వలెనే అఖండానందము స్థిరముగా ఉంది.ఐదు ఘటికల తర్వాత మెల్లమెల్లగా ప్రకాశము లుప్త-మైనది. సద్గురుదేవుడు అదృశ్యమైనాడు. కాని, ఆనందము అఖండముగా ఉన్నందున భోలాభక్తుడు ఉన్మత్తునివలె కానొస్తున్నాడు. ఈ ప్రకారముగా నాలుగు గడియలవరకు ఆనందోధధియందే ఉండి పోయినాడు. నాలుగు ఘడియల పిమ్మట భోలాభక్తునికి దేహస్మృతి కలిగినది. ఎప్పుడైతే వృత్తి దేహతాదాత్మ్యమును పొందినదో, దుఃఖము గోచరించి ఆయాసపడుచుండెను. ఇంతలో పైనుండి సద్గురుదేవుడు, నాయనా భోలాభక్తా! ఎక్కడున్నావురా? తొందరగా రా! అని పిలిచినట్లు, శబ్దము వినబడింది. ఆశబ్దమును వినగానే భోలాభక్తునికి ధైర్యము చేకూరింది. దుఃఖమును మరిచి పోయినాడు. అప్పుడు సద్గురుదేవుని పిలుపు విని స్వామీ! నేను ఇక్కడే ఈ బావిలో ఉన్నాను-అని భోలాభక్తుడు ఉత్తరమిచ్చాడు. అప్పుడు సద్గురుదేవుడు తనయొక్క అమృతహస్తములను బావిలోనికి చాచి,రా నాయనా!అంటూ పిలిచాడు.భోలాభక్తుడువచ్చి స్వామియొక్క హస్తములను పట్టుకొనగా, స్వామి భోలాను నెమ్మదిగా పైకి లాగాడు.భోలాభక్తుడు పైకి రాగానే సద్గురుదేవుడు ఎంతో ప్రేమతో, ఆనందముతో భోలాను దృఢముగా ఆలింగనము చేసుకున్నాడు. భోలాయొక్క సర్వదుఃఖములు నిరసించినవి. పూర్ణస్వస్థతను పొందినాడు. సద్గురుదేవుడు కరుణామయుడు. ఆయన లీలలు చాలా చిత్రవిచిత్రములు. అత్యద్భుతములు. ఈ ప్రకారముగా భోలాభక్తుని కరుణించి సద్గురుదేవుడు సమాధి సుఖమును ప్రసాదించి బ్రహ్మజ్ఞానిగా చేసినాడు.

భోలాభక్తుడు యే వేదాంత శాస్త్రములనభ్యసింపకయే *"సద్గురుదేవుడు శరీరధారి కాదు. పరబ్రహ్మస్వరూపుడు"* అనే శ్రద్ధగలిగి, దేహాభిమానమును పూర్తిగా త్యజించి, సద్గురుదేవుని వచ-నాలపై అచంచల విశ్వాసము (శ్రద్ధ)నుంచి యథార్థమైన బ్రహ్మజ్ఞానమును బడసి ధన్యుడైనాడు. ఈ ప్రకారముగా సద్గురుదేవునిపై ప్రేమ, భక్తి, శ్రద్ధతో సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి ధన్యుడైనటు వంటి కథను విన్నట్లయితే సకల పాపములు నశించగలవు.

ఇప్పుడు ఈ కథయొక్క వేదాంతరూప లక్ష్యార్థమును సావధానచిత్తులై వినగలరు. సద్భావయుక్తుడైన భోలాభక్తుడు విషయాసక్తిరూప కొద్దిపాటి ధనమును తీసుకొని సద్గురుదేవుని

ఆశ్రయించినాడు. విషయాసక్తి ఉన్నందున శాస్త్రాధ్యయనమునందు చిత్తము లగ్నము కాకయుండెను. అప్పుడు ఉపరతిరూప చోరులు వచ్చి విషయాసక్తిరూప ధనమును హరించినారు.

**त्याग किये पीछे प्रप्त भये विषय की इच्छाका अभाव कू "उपरति" कहिए हैं।**

అప్పుడు వైరాగ్యమనే జ్వాలరగిలి దేహాభిమానమనే గడ్డిని కాల్చివేసింది. ఇదం ప్రతీతికి విషయమగు దేహముపట్ల ఉదాసీనత ఏర్పడింది. సద్గురుదేవుడు శిష్యుని (సద్భావమును) భక్తిని పరీక్షింప గోరినప్పుడు శిష్యుడు ప్రేమతో జ్వరమును స్వీకరించాడు. విషతుల్యమైన జ్వరమును స్వీకరించి ప్రేమ–భక్తిరూప పరీక్షలో ఉత్తీర్ణుడైనందున, సద్గురుదేవుడు కరుణించి శుద్ధమైన సద్భావయుక్త అంతఃకరణము, దృఢవైరాగ్యము, శమాది షట్క సంపత్తి కలిగి ఉన్నందున, జ్ఞానమును ప్రసాదించుటకు ఏకాంత ప్రదేశమునకు తీసుకెళ్లి సమాధిరూప బావిలో పడునట్లుగా చేసెను. దేహబుద్ధుని త్యజించి, శిష్యుడుగూడా సమాధిరూప బావిలో దూకుతాడు. ఇంద్రియములు గాయపడి, పనిచేయకుండా అయినవి. దేహేంద్రియ భానము లేకుండా అగును. సమాధియందు గురురూప (వ్యాపకస్వరూపమైన) తన స్వరూపప్రకాశమును చూసి స్వరూపస్థితియందు ఐక్యస్థితిని పొంది పరమానంద సాగరములో మునిగి సమాధి సుఖమును అనుభవిస్తాడు.పునరుత్థానము కలిగినప్పటికి (సమాధినుండి బయటకు వచ్చినప్పటికి) అఖండానందానుభవము అట్లే ఉంది. ఈ ప్రకారంగా బ్రహ్మజ్ఞానమును పొంది నిత్యము నిజమైనటువంటి సమాధి సుఖమును అనుభవిస్తూ ఉంటాడు. కేవలము ఒక్క దేహాభిమానమును త్యజించి సద్గురుదేవుని ఆశ్రయించి గురురూప (వ్యాపకస్వరూప) తనయొక్క స్వస్వరూపమునందు ఐక్యము పొందడమే నిజమైన ముక్తి. స్వరూప-మును విడిచి, దేనిని పొందినప్పటికైనా అది మోక్షము కాదు. బంధమే అగును.

దేహాభిమానపాశేన చిరంబద్ధోఽసి పుత్రక! ।

బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నిఃకృత్య సుఖీ భవ ॥ (అష్టావక్ర గీత 1-14)

' ' దేహాభిమానమును వదిలినచో మోక్షము అరచేతిలోని ఉసిరికాయవలె స్వతస్సిద్ధమై ఉంది, అను శ్రీ తుకారాం మహారాజుయొక్క వచనము ప్రమాణముగా ఉన్నది. సకల వేదాంతములయొక్క సారభూతమైన జ్ఞానము సద్గురుదేవునియందు మూర్తీభవిం-చినది. అటువంటి ప్రత్యక్ష దైవమైన సద్గురుదేవుని వర్ణించడము వేయిపడగల ఆదిశేషునకే శక్యము కానప్పుడు, నావంటి ఈ అల్పమతికి సాధ్యమా? అయినాగాని సద్గురుదేవుని నా హృదయకమల-మందు స్మరించుకొని నా శక్తికొలది సద్గురుదేవుని కథను వ్రాయుటకు ప్రయత్నిస్తున్నాను. రసవ-త్తరమైన ముందర అధ్యాయమును ప్రేమతో శ్రవణము చేసినట్లయితే సకల దోషములు నివృత్తమై, దేహబుద్ధి నిస్సందేహముగా నివృత్తమై సద్గురుదేవుని కృపకు పాత్రులవుతారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణముచేసిన మాత్రమున సకల పాపములు భస్మ-మగును. శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది ఐదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది ఆరవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురు సిద్ధనాథా! భక్తజన పరిపాలకుడవైన సచ్చరిత్రా! పవిత్ర-మైనటువంటి ప్రకాశమానమగు (సంపూర్ణ జ్ఞానయుక్తమైన ముఖతేజస్సుగల) దివ్యమైన నీయొక్క ముఖకమల దర్శనముద్వారా నా నేత్రములు మోహరహితమై ధన్యులమగునట్లు, నా మనస్సు నీ పాదాల చెంత నిరంతరము సంలగ్నమై సమర్పితమగునట్లు నీయొక్క అభయకర అమృత హస్తము నా శిరస్సుపైనుంచి నన్ను ఆశీర్వదింపుము.

ఓ సద్గురు సిద్ధనాథా! నీకు జయము జయము. నీ యొక్క పవిత్రమైన కథను వర్ణించడానికి యోగ్యమైన స్ఫూర్తిని ఇవ్వమని నీ పాదాలయందు నా శిరస్సునుంచి ప్రణమిల్లుచున్నాను. నీవు ఎల్లప్పుడూ నా హృదయమందు వసించి నీ చరిత్రను వర్ణించుటకు శుద్ధమైన బుద్ధిని ప్రసాదించుము. లేనిచో నాకు దుస్సాధ్యము. నీ యొక్క కృపాకటాక్షము కలిగినచో ఈ జగత్తులో నాకు అసాధ్య-మైనదంటూ ఏమీ లేదు. అందుకే నీవు నా అంతరంగమందుండి నాపై కృప చూపుము. నీయొక్క నామామృతము భజించినట్లైన ఇహలోక కామనలు సిద్ధించి, దేహ పతనానంతరము పరలోక సౌఖ్యమును కూడా పొందగలము. జన్మమరణమునుండి విముక్తులమవుతాము–ఇది నిశ్చయము. అయినాగాని నీవు ఆలస్యముచేయక సత్వరమే నా హృదయమందు ప్రవేశించుము. నీయొక్క భావన, చింతన గూర్చి ఈ జీవుడు పరితపించుచున్నాడు. ఈ ప్రకారము సద్గురుదేవుని చరిత్ర శ్రవణముకోసము సద్భక్తులు తాపత్రయపడుచున్నారు. కావున, ఓ శ్రోతలారా!ముందర కథాను-సంధానమును, సావధానచిత్తులై వినండి.

"పరశురామ పంత్" అనునొక బ్రాహ్మణ గృహస్థుడు హుబ్లీ పట్టణమందు నివసిస్తుండెను. ఆయన ఒకసారి సద్గురుదేవుని సాన్నిధ్యమునకు అరుదెంచి వినయముగా చేతులు జోడించి నిలబడి ఈ విధముగా తనయొక్క ఆవేదనను నివేదించుకుంటున్నాడు. ఓ సద్గురుదేవా! నేనొక దీన పామరుడను. అనేక సంసార తాపత్రయములచే అలమటిస్తున్నాను. నేను ఎక్కడెక్కడ వెళ్ళినాగాని ఎన్ని ప్రయత్నములు చేసినాగాని ఈ సంసారతాప నివృత్తి కలుగలేదు. శాంతి లభించలేదు. ఓ దీననాథా! చివరగా నీ పాదపద్మములను ఆశ్రయించినాను. అనుగ్రహించండి స్వామీ! నిన్ను ఆశ్రయించిన సద్భక్తులకు యథార్థమైన జ్ఞానమును ప్రసాదించి సంసార సాగరమునుండి తరింప జేసి రక్షిస్తావని,

అనేక విధములుగా నీయొక్క కీర్తిని విని, దీనోద్ధారకుడవని, నిన్ను ఆశ్రయించినట్లయితే నేను నిశ్చయముగా ధన్యుడను కాగలనని, నిన్ను శరణు పొందినాను. నీవే నాకు రక్షకుడవు. అందుకని నా శిరస్సును నీ చరణాలపై ఉంచుతున్నాను. ఈ దేహపతన పర్యంతము నీ సేవచేస్తూ ఉంటాను– అని ఈ ప్రకారముగా ఆ పరుశురామ పంత్ దీనవదనుడై స్వామిని వేడుకుంటాడు.

'పరశురామ పంత్' యొక్క ఆర్తనాదమును ఆలకించి సద్గురుదేవుడు తన దగ్గరకు పిలుచుకొని సమీపములో కూర్చుండ పెట్టుకుని పరశురామ పంత్ యొక్క శ్రోత్రమందు (చెవిలో తనయొక్క అమృతవాణితో తారక మంత్రమును ఉపదేశించినాడు. మరియు నీవు సంసారము నుండి తప్పకుండా ముక్తుడవౌతావని ఆశీర్వదించినాడు. *(తరించుటకు ఉపదేశింపబడే మంత్రము తారక మంత్రము. అది ఏ నామమైన కావచ్చు).* ఈనాటినుండి సంసార తాపత్రయములు నిన్ను పీడించవు. నీవు ధన్యుడవగుదువు–అని ఈ ప్రకారముగా స్వామి పరశురామపంత్ ను ఆశీర్వదించి, నీవు నాయొక్క చరిత్రను దేశదేశములలో ప్రచారముచేసి సకల జనులను ఉద్ధరించుటకు నీవు సంసిద్ధుడవై నీ గురుసేవా కార్యమును నెరవేర్చుకొనుమని ఆజ్ఞాపించి, తనయొక్క అమృత హస్తమును పరుశురామ పంత్ యొక్క శిరస్సుపైనుంచి ఆశీర్వదించాడు. తత్క్షణమే పరశురామ పంత్ యొక్క ముఖము తేజోవంతమైనది. సద్గురుదేవుని హస్త స్పర్శవలన పరశురామ పంత్ దైవీగుణసంపన్నుడై బ్రహ్మ వర్చస్సుచే ప్రకాశించుచున్నాడు.

మహాభగవద్భక్తుడు, సద్గురుదేవునియందు అత్యంత ప్రీతిచే రమించినవాడై సద్గురుదేవుని కృపకు పాత్రుడైన పరశురామ పంత్ ఈ విధంగా సద్గురుదేవునితో అంటాడు. ఓ సద్గురు దేవా! మావూలీస్వరూప (తల్లివంటి) ఓ దీననాథా! ఈ దీనునిపై కృపజూపి సేవారూప గురుకార్యమును ప్రసాదముగా అప్పగించినావు. నేను ధన్యుడను. మహాభాగ్యముగా భావించి స్వీకరిస్తున్నాను. కాని, నాదొక చిన్న విన్నపము. నీయొక్క అద్భుతమైన చరిత్రను వ్రాయాలని నాకు ఇచ్ఛగలిగింది. నా ఈ సంకల్పమును మన్నించి దానికి తగు స్ఫూర్తిని మరియు ఆజ్ఞను ఇవ్వగలవని ప్రార్థన. నీయొక్క కృపగలిగినచో అసాధ్యమంటూ ఏమీ లేదు. దరిద్రునికి రాజ్యము నీయగలవు. గుడ్డివాడుకూడా దృష్టి ప్రాప్తమై నీ చరిత్ర వ్రాయగలడు. "సిద్ధారూఢ విజయము" అను గ్రంథమును వ్రాయాలని సంకల్పించినాను. నీవు కృపదలచి ఆజ్ఞాపించినట్లయితే, ఈ మహత్తర సేవాకార్యమును చేపడుతాను. పరశురామ పంత్ యొక్క సత్సంకల్పమును విని సద్గురుదేవుడు చాలా సంతోషించి, గ్రంథరచనకు అంగీకరించి, ఆజ్ఞనొసంగుతాడు. ఈ ప్రకారముగా సద్గురుదేవుని అనుగ్రహమునకు పాత్రుడై, ఆజ్ఞను గైకొని తనయొక్క స్వస్థానమునకు వెళ్ళినాడు. పరశురామ పంత్ ఒక నెల రోజులలోనే గ్రంథమును సంపూర్ణముగా రచించి సద్గురుదేవుని చరణములకు సమర్పించినాడు. పరశురామ పంత్ ఆ గ్రంథమును చదివి వినిపించినాడు. సద్గురుదేవుడు ఎంతో ఆనందించినాడు. భక్తిరసయుక్తముగా,

జ్ఞానయుక్తముగా ఉన్నందున సద్గురుదేవుడు ఆనందించినాడు. సద్గురుదేవుని కృపకు పాత్రుడైన పరశురామ పంత్ తాను రచించిన సద్గురు దేవునియొక్క చరిత్ర గ్రంథమును గోవా,డయ్యు, డమన్ మొదలగు ప్రాంతములలో ప్రచారము చేసినాడు. ఈ సచ్చరిత్రను శ్రవణముచేసి సకల జనులు భక్తిశ్రద్ధలుగలిగి భవసాగరమునుండి తరిస్తారు. పంత్ యొక్క వైరాగ్యయుక్త ఆచరణ నిష్కామ సద్గురుసేవకు భక్తులందరూ తన్మయుడై, గురుభావనచేత ఆయనను కూడా పూజించేవారు.

ఒకానొక సమయమున "రోణా" గ్రామమునుండి భక్తులు వచ్చి సద్గురుదేవునికి వారి విన్నపమును సమర్పించుకొని వారి గ్రామమందు సప్తాహ కార్యక్రమమును నియమించి సద్గురు దేవుని చరిత్రను శ్రవణముచేయుటకు వారి అభిప్రాయమును వెల్లడించుకొనగా,స్వామి అంగీకరించి ఆ కార్యమునకు 'పరశురామపంత్' ను పొమ్మని ఆజ్ఞాపించాడు. సద్గురుదేవుని ఆజ్ఞను శిరసా వహించి 'పంత్'బయలుదేరుటకు ఒప్పుకున్నాడు.సద్గురుదేవుని చరిత్రకథను భక్తులకు వినిపించుటకు అంగీకరించాడు. ప్రతిరోజు ఆ రోణా గ్రామమందు ఏడుదినములు హరికీర్తనము, ఉపన్యాసములు చేయుటకు నియమించుకున్నారు. ఈ ప్రకారముగా పరశురామ 'పంత్' కు ఆహ్వానమిచ్చి భక్తజనులు ముందుగా వెళ్ళిపోయినారు. 'పంత్' తదుపరి వస్తానన్నాడు. అదే ప్రకారముగా 'పంత్' తన భార్య 'జానకీబాయి' మరియు 'మంగేశా' అను ఒక భక్తురాలుతో కలిసి ముగ్గురు పయనమైనారు. సద్గురుసిద్ధనాథునియొక్క ఆజ్ఞను గైకొని 'పంత్' హుబ్లీ రైల్వేస్టేషన్ కు వచ్చినాడు. జనసమూ హము ఎక్కువగా ఉన్నందున 'పంత్' కు టిక్కెట్లు లభించలేదు. ఒకవేళ ఈ రైలుబండి తప్పితే ఉత్సవ కార్యక్రమమునకు హాజరు కావడము కష్టము. ఈ బండికి వెళ్లిపోతేనే సరిగ్గా కార్యక్రమమునకు అందుతాడు. అందువలన 'పంత్' చాలా వ్యథ చెందినాడు. అప్పుడు సద్గురుదేవుని స్మరించుకొని 'పరశురామ పంత్' ఇలా అనుకుంటున్నాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క కార్యము నిమిత్తమే మేము బయలుదేరినాము. కార్యక్రమము దిగ్విజయముగా కొనసాగాలంటే ఎటువంటి విఘ్నములు రా-కుండా అనుగ్రహించు స్వామీ! నీదే భారము.

ఇంతలో ఒక వ్యక్తి వచ్చి ఏమయ్యా! మీరు ఎక్కడికి పోవాలి? ఇలా నిలబడినారేమీ? అని అడుగగా 'పరశురామ పంత్' ఆయనతో ఇలా అంటాడు.అయ్యా! మేము ముగ్గురము 'రోణా' పురమునకు వెళ్ళుటకు సిద్ధమై వచ్చినాము. కాని, మాకు టిక్కెట్లు దొరకలేదు.ఈ సమయములో మేము అక్కడికి పోకుంటే భక్తులు నిరాశజెందుతారు. ఇప్పుడు మాకు 'మల్లాపురము' నకు టికెట్లు కావాలి. 'మల్లాపురము'నకు 'రోణాపురము' కొంచెము (క్రోసు)దూరములో ఉంది. ఏమి చేయాలో తెలియుట లేదు. అని 'పంత్' ఆ వ్యక్తితో అంటాడు. అప్పుడు ఆ నూతన వ్యక్తి అంటాడు. అయితే మంచిదైనది. ఇదిగో నా వద్ద మూడు టిక్కెట్లు ఉన్నవి. మేము మల్లాపురమే పోవలసి ఉండెను.

కాని, కొన్ని అనివార్య కారణాలవల్ల మేము ఇప్పుడు పోవుటకు వీలుపడలేదు. ఈ టికెట్లు మీరు నిశ్చింతగా తీసుకొని రైలు ఎక్కండి.

ఇట్లు చెప్పి ఆ అపరిచిత వ్యక్తి టిక్కెట్లు తీసి 'పరుశురామ పంత్' చేతిలో ఉంచి వెంటనే ఆ జనములోనే అక్కడికక్కడే అదృశ్యమైనాడు. డబ్బులుకూడా తీసుకోకుండా వెళ్లిపోయినాడు. అప్పుడు 'పరశురామ పంత్' ఇలా అంటాడు. సద్గురు దేవునికి మనయొక్క విపత్తు తెలిసి ఆయనే స్వయంగా వచ్చి మనకు టిక్కెట్లు ఇచ్చి సంకటమును బాపినాడు.

తర్వాత ఆ ముగ్గురు రైలులో ఎక్కినారు. మల్లాపూర్ స్టేషన్లో దిగినారు. అక్కడినుండి రోణా పురము ఒక క్రోసు దూరములో ఉంది. సాయంత్రమైనది. చిమ్మన చీకట్లు క్రమ్మినవి. మందమంద-ముగా వర్షము కురుస్తుంది. దారి కనిపించడము లేదు. ప్రదేశము కొత్తది. కావున, ఆ ముగ్గురు ఎక్కడ పోవాలో దోచక ఆ రైల్వేస్టేషన్ లోనే దిగులుగా కూర్చున్నారు. ఇంతలో ఒక మనుష్యుడు వచ్చి ఏమండీ? మీరు ఎక్కడికి పోవాలి?అని అడిగినాడు. అప్పుడు 'పరశురామ పంత్' అంటాడు. మేము రోణాపురము పోవాలి.ఈ రాత్రి పోవు టకు వీలులేదు. వాతావరణము బాగులేదు. తెల్ల-వారు వరకు మాకు విశ్రమించుటకు ఎక్కడైనా స్థలము దొరుకుతే, అక్కడ విశ్రమించి తెల్లవారు ఝామున రోణాపురమునకు పోగలము.

అప్పుడు ఆ మనిషి వెంటనే పోయి ఒక లాంతరు తీసుకొని వచ్చి ఆ ముగ్గురిని సమీపములో ఉన్న ఒకానొకగృహమునకు తీసుకొనిపోయినాడు.ఆగృహముయొక్క వరండాలో వీరిని కూర్చుండ బెట్టి, ఆ వ్యక్తి గృహములోనికి పోయి ఒక చాప, చతురంజి తీసుకొచ్చి, వారికిచ్చి మీరు ఇక్కడే నిద్రించండి–అని అన్నాడు. అప్పుడు ఆయనయొక్క నిష్కామ సేవను చూస్తూ 'పరశురామ పంత్' ఆయనను అడుగుతాడు. ఆయ్యా! నీ పేరేమిటి? అప్పుడు ఆయన నా పేరు "సిద్ధప్ప" అని చెబుతాడు. అప్పుడు 'పంత్' యొక్క భార్య 'జానకీబాయి' అంటుంది. నిజంగా మన సద్గురు సిద్ధనాథుడే, వేరే ఎవరు కాదు. మన సంకటమును తీర్చువారు. ఆయనగాక మరెవరున్నారు. సిద్ధప్ప ఇంట్లోకి వెళ్లి అరటి పండ్లు, శర్కర, పాలు వగైరా(ఫలహారాలు) తెచ్చి 'పరశురామ పంత్' ముందుంచినాడు. అప్పుడు 'పరశురామ పంత్' సిద్ధప్పను ఇలా అడుగుతాడు. అయ్యా! నీవు ఆ హుబ్లీ సిద్ధనాథునివే కదా! అప్పుడు సిద్దప్ప అంటాడు. నేను హుబ్లీ సిద్ధప్పను కాను. నా గ్రామము ఎవరికీ తెలియదు– అని, మీరు ఈరాత్రి ఇక్కడే విశ్రమించి ఉదయమునలేచి రోణాపురమునకు వెళ్ళండి-అని నవ్వుతూ వారితో చెప్పి చీకటిలోకి వెళ్లిపోయినాడు. ముగ్గురు ఆశ్చర్య పోయినారు. ఆయన నిశ్చయముగా సద్గురు సిద్ధనాథుడే అయి ఉంటాడని అనుకుంటారు. అప్పుడు 'మంగేశా' ఆ ఇంటివారిని పిలుస్తుం-ది. అప్పుడు ఆ గృహస్థులంతా బయటకు వచ్చినారు. ఎవరండీ మీరు?ఎందుకు వచ్చినారు? ఎవరు తీసుకొచ్చారు?అని అడుగుతారు.'పరశురామ పంత్'వారి వృత్తాంతమంతా వివరిస్తాడు. ఇది ఒక

చమత్కారమని తలచినారు. మా ఇంట్లో సిద్ధప్ప అను పేరుగల వ్యక్తి ఎవరూ లేరు. ఆయన మా ఇంట్లోకి కూడా రాలేదు. మేము హాయిగా నిద్రించుచుంటిమి. ఈ ఫలహారములు మేము పంపలేదు. చాలా విచిత్రముగా ఉన్నది–అని అందరూ ఆశ్చర్యపోయినారు. ప్రస్తుతము ఈ ఇంటి యజమాని లేడు. ఆయన వేరే గ్రామాంతరమునకు పోయినాడు. సరే! ఇప్పటికైనా మంచిదే అయ్యింది. లేనిచో ఒకవేళ యజమాని ఉన్నట్లయితే మిమ్ములను ఇక్కడ ఉండనిచ్చేవాడు కాదు. మీరు సిద్ధనాథస్వామి భక్తులు కదా! తెల్లవారు వరకు నిర్భయముగా విశ్రమించండి–అని అంటారు. అప్పుడు 'పరశురామ పంత్' వారితో అంటాడు. ఆ మనిషి మీకు తెలియకపోతే మాకు ఫలహారాలు ఎవరు పంపినారు? అప్పుడు వారంటారు. అయ్యో! మా ఇంట్లోకి ఎవరు రానేలేదు.ఇదేదో మాయగా ఉంది. ఇది నిజ-ముగా సిద్ధారూఢ స్వామియొక్క లీలయే అయి ఉంటుంది. ఇప్పుడు సద్గురుదేవుడే వేషము మార్చు-కొని పనిమనిషిగా వచ్చి ఈ భక్తులను కాపాడినాడని అందరూ నిశ్చయించుకున్నారు. ఆ ఇంట్లోని వారంతా ఎంతో సంతోషించి, సద్గురుదేవుని భక్తులు మా ఇంటికి వచ్చినందుకు మేము ధన్యులము. మీ నిమిత్తముగా సద్గురుదేవుడు మా ఇంట్లో తనయొక్క దివ్య పాదములను మోపి మా ఇంటిని, మమ్ములను ధన్యులను చేసినాడు–అని ఎంతో ఆనందమును పొందినారు. మరియు మేము మీతో పాటుగా సద్గురుదేవుని సాన్నిధ్యమునకు (హుబ్లీకి) వచ్చి సద్గురుదేవుని దర్శనము చేసుకుంటాము అని అంటారు. ఈ ప్రకారముగా ఆ రాత్రి ఆ ఇంట్లో గడిపి, వేకువనేలేచి 'పరశురామ పంత్', 'జానకీబాయి' మరియు 'మంగేశా'-రోణా గ్రామమునకు పోవుటకు బయలుదేరినారు.

రోణా గ్రామములో వారు ఉత్సవమును పూర్తిగావించుకొని తిరిగి వస్తూ, మళ్లీ ఆనాడు రాత్రి ఎవరి ఇంట్లోనైతే విశ్రమించిరో, వారి ఇంటికి వచ్చినారు. ఎందుకంటే, వారు హుబ్లీకి మీతో వస్తామని మాట ఇచ్చినారు.అప్పుడు అందరూ కలిసి "హుబ్లీ" కి చేరుకొని మఠమునకు వచ్చి సద్గురు సిద్ధమూర్తిని దర్శించుకుని గత వృత్తాంతమును వివరించినారు. అప్పుడు సద్గురుదేవుడు నవ్వుకొని 'పరుశురామ పంత్'తో ఇలా అంటాడు.సద్గురుదేవునిపై సకలభారమునుమోపి ఆయనే శరణ్యమని జీవించే సద్గురుదేవుని భక్తులయొక్క యోగక్షేమములు, సద్గురుదేవుడు చూసుకోకపోతే మరెవరు ఆదరిస్తారు. లేనిచో సద్గురుదేవునకు "ఆర్తరక్షకుడని, భక్తవత్సలుడ"ని పేరు నిరర్థకము కాదా! సద్గురుదేవునియొక్క ఇటువంటి అమృత వచనములు విని అందరు జయజయకారాలు చేసినారు. ఆ జయఘోషలు చేయుటతో ఆకాశము మారుమ్రోగినది.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ పవిత్రమైన కథయొక్క దివ్యమైన వేదాంతరూప లక్ష్యార్థమును సావధానముగా వినండి.'పరశురామ పంత్'అనే వివేకము,'జానకీబాయి'అనే శాంతి, 'మంగేశా' అనే వైరాగ్యముతో యుక్తమైన జీవుడు విషయవృత్తులు అనే జనులుగల రోణాపురము అనే సంసార రూప గ్రామమునకు సద్గురుదేవునియొక్క బోధ బోధించుటకు సప్తావస్థలరూప సప్తదినముల

కార్యక్రమమునకు వెడతారు. సప్తావస్థలకు వెళ్ళుటకు సద్గురుదేవుడు నిష్కామమనే టిక్కట్టు ఇస్తాడు. మనోరూప రైలులో కూర్చుండ బెడతాడు. సంసారరూప గ్రామమును చేరుకొని సప్తావస్థలలో ప్రవేశించాలంటే అజ్ఞానరూప చీకటి–అనాత్మాకార వృత్తిరూప వర్షము మార్గమునకు ప్రతిబంధకము అవుతుంది. జీవునికి యథార్థబోధ కలుగకుండ నిరోధిస్తుంది. అప్పుడు సద్గురుదేవుడు భాగత్యాగ-రూప లాంతరు తెచ్చి స్వస్వరూప గృహమునకుతెచ్చి అచ్చట జీవుని కూర్చుంబెడతాడు. స్వరూప గృహమందు ఆనందరూప ఫలహారములిచ్చి స్వరూపానుభవమును ప్రసాదించి, స్వరూపానంద-ములో విశ్రమింపజేస్తాడు. ఆ తరువాత జీవన్ముక్త విలక్షణానందమును ప్రసాదించి ఉపచారము చేస్తాడు. తదనంతరము సంసారసుఖములలో మగ్నులైన విషయవృత్తిరూప అజ్ఞానిజనులకు బోధ-రూప జ్ఞానమును బోధించుటకు పంపిస్తాడు. ఇటువంటి సద్గురు దేవునియొక్క మహిమ అత్య-ద్భుతము. సద్గురుదేవునియొక్క పవిత్రమైన సత్కథను శ్రద్ధాభక్తులతో శ్రవణము చేసినట్లైన సంసార దుఃఖము నివృత్తమై హృదయమందు సద్గురుదేవుని దర్శనమవుతుంది. బ్రాహ్మీస్థితి ప్రాప్తమగును.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకల పాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది ఆరవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓమ్ శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ సద్గురు భ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది ఏడవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సిద్ధరాజా! ఉదారస్వరూపమైన గుణగణములు కలవాడా! నిజమైన బోధచేత జనులయొక్క సర్వబంధములను నివృత్తిచేసేవాడవు. కావున, నీవు నిజ భవతారకుడవని పేరు సార్థకము చేసుకున్నావు. కలిమాయను సమూలముగా నివృత్తిచేసే నిత్య శుద్ధ అపార స్వరూపుడవు. జ్ఞానశస్త్రముద్వారా బంధాన్ని హరింపచేసేవాడవు. నిర్గుణ నిరాకారస్వరూపుడవైన ఓ సద్గురుదేవా!నీకు సాష్టాంగనమస్కారములు.

ఓంకారస్వరూపుడవైన ఓ సద్గురుదేవా!నీకు నమస్కారములు. మేము అజ్ఞానముచేత నిన్ను యథార్థముగా తెలుసుకోలేక భవసాగరమునందు మునుగుచున్నాము.నీవు మమ్ములను ఈసంసారసాగరమునుండి నిశ్చయముగా తరింపజేయగల సమర్థుడవని, నిన్నే దృఢముగా నమ్ముకొని నీ పాదాలను ఆశ్రయించినాము. ఒకవేళ మమ్ములను నీవు నిరాకరించినట్లయితే మాకు ఆశ్రయమిచ్చేవారెవరు? తాపత్రయరూప సంసారమునుండి నీకు తప్ప మరెవ్వరికీ తరింప చేయగల సామర్థ్యము లేదు. నీయొక్క ఆశ్రయమును పొందాలని ఆశిస్తున్నాము. ఎల్లప్పుడూ నీయొక్క కీర్తిని గానము చేయగలము. నీ స్వరూపాన్ని మా హృదయమందు ధ్యానిస్తాము. నీకే మా చిత్తమును అర్పిస్తాము. మనో వాక్కాయములచేత ఎల్లప్పుడూ నీ సాన్నిధ్యముననే ఉంటూ నిన్నే సేవిస్తూ, నీ దివ్యనామాన్ని గానముచేస్తూ కలిదోషానికి ఏమాత్రము భయముజెందక ఉంటాము. ఓ సద్గురు సిద్ధనాథా! నా హృదయమందు నీ దివ్యపాదారవిందములను స్థాపించుకొని నిన్నే స్మరించినట్లు, ఎల్లప్పుడూ సాధు సత్పురుషుల సాంగత్యమును, సద్వస్తుచింతన చేయులాగున అనుగ్రహింపుము. దేహము, గృహము, దేహసంబంధ విషయాలయందు ఉదాసీనత్వము కలుగునట్లు ఆశీర్వదించుము. ఇంతకంటె నిన్నేమీ కోరను. అటువంటి సద్గురుదేవుని పాదాలను ధరించినట్లయితే భక్తికి, ముక్తికి కొదువ ఉండదు. ఎల్లప్పుడూ అఖండముగా సత్సంగముచేసేవాడే ఈజగత్తులో ధన్యుడు.సత్సంగము సుఖస్వరూప సాగరము. సత్సంగమే సకలబంధములను నివృత్తిచేస్తుంది. సత్సంగముద్వారానే యథార్థజ్ఞానము కలిగి తప్పకుండా మోక్షము ప్రాప్తించును.

**సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।**

**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥** (భజగోవిందమ్)

ఇటువంటి సత్సంగముయొక్క మహిమగూర్చి పార్వతీ మాత పరమేశ్వరుని అడిగెను. అప్పుడు పరమేశ్వరుడు అంటాడు. ఏ సత్సంగము చేతనైతే ఆత్మారాముడు (పరమాత్మ) పొంద బడతాడో, ఆ సత్సంగమును వర్ణించడము నాకు శక్యముగాదు. సత్సంగమును పొందినట్లయితే సకల దోషములు తొలగి, సహజముగా అర్పణబుద్ధి (త్యాగబుద్ధి) కలుగును. సంపూర్ణ సంతృప్తిని, ఆత్మజ్ఞానమును సద్గురుదేవుడు ప్రసాదిస్తాడు.

**శ్లో ॥ కల్పద్రుమః కల్పితమేవ దత్తే, సా కామధుక్ కామితమేవ దోగ్ధి ।**

**చిన్తామణిశ్చిన్తితమేవ దత్తే, సతాం హి సఙ్గః సకలం ప్రసూతే ॥** (సుభాషితరత్న భాండాగారము)

**శ్లో ॥ మోక్షద్వారే ద్వారపాలాః చత్వారః పరికీర్తితాః ।**

**శమో విచార సంతోషః చతుర్థః సాధుసఙ్గమః ॥** (యోగవాసిష్ఠము ముముక్షువ్య.ప్ర. 11-59)

కథా ప్రసంగము:–హరిద్వారము అనే మహా పుణ్యక్షేత్రమందు ఒక తెలివైన బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు 'కృష్ణ' అని పేరుగల ఒక కుమారుడు ఉండేవాడు. ఆ బ్రాహ్మణుడు ప్రతిరోజు తమ ఇంట్లో శ్రీ గోస్వామి తులసీదాస్ మహారాజ్ రచించినటువంటి "శ్రీరామచరిత మానసము" అను తులసీ రామాయణమును పారాయణం చేసేవాడు. కృష్ణ తన తండ్రివద్ద కూర్చుని శ్రద్ధతో శ్రవణము చేసేవాడు. ఆనందముతో తన్మయత్వమును పొందేవాడు. ప్రసంగముననుసరించి సాధు సత్పురుషుల జీవిత చరిత్రలను అత్యాదరముతో విని ఆనందచిత్తుడయ్యేవాడు. ఈవిధముగా క్రమంగా మహాత్ముల చరిత్రలు వింటూ ఉంటే, సాధు సత్పురుషులపై శ్రద్ధ అధికమైనది. వారి సేవచేయుటకు నిశ్చయించుకున్నాడు. కబీర్ దాసు చరిత్రను శ్రవణముచేసే సమయమందు ఆయనయొక్క గురుభక్తి, ఈశ్వరభక్తిని యథార్థముగా శ్రవణముచేసి కృష్ణ, కబీర్ దాసువలెనే తానుగూడా కావాలని అనుకున్నాడు.

గంగానది తీరమునకు వెళ్లి అక్కడ ఉన్నటువంటి సాధు సత్పురుషులయొక్క సేవచేస్తూ వారి మైత్రికి, కృపకు పాత్రుడైనాడు. కృష్ణ పాఠశాలకు పోవడము మానేశాడు. ప్రతిరోజు సత్పురుషుల సేవయందే ప్రీతి అధికమైనది. ఈవిధముగా కుమారునియొక్క వ్యవహారమును చూసి తండ్రికి చాలా చింత గలిగింది. కృష్ణ పదిసంవత్సరాల పిల్లవాడు. తల్లిదండ్రులు కృష్ణకు ఎంతగానో బుజ్జగించి నాయనా! విద్యాభ్యాసము పూర్తి చేయుము. లేనిచో నీ భవిష్యత్తు చెడిపోగలదని చెప్పినారు. కాని, వారి మాటలను పెడచెవిన పెట్టి, సాధుసజ్జనుల సేవచేయడమే కాకుండా వారిని క్రమంగా ఇంటికి తీసుకొచ్చి భోజన ప్రసాదములను సమర్పించి వారిని సాగనంపేవాడు. ఈ ప్రకారముగా చేస్తుండగా కొన్నిరోజులు గడిచినాక తండ్రి కృష్ణను వారిస్తాడు. నీవు ఇకముందు సాధువులను ఇంటికి తీసుకు రాకూడదు. ఈవిధముగానే నిరంతరముచేస్తూ ఉంటివా,ఇక ఇల్లు గుల్లవుతుంది.ఈ వ్యాపారము (దంధ) మానుకో. చేసిన నిర్వాకము చాలు. ఒకవేళ మళ్లీ సాధువులను ఇంటికి తీసుకొస్తివా–నిన్ను

చాలా కఠినముగా శిక్షిస్తాను, జాగ్రత్త! అని తండ్రి కృష్ణను బెదిరించినాడు. సాధువులను ఇంటికి తీసుకొస్తే వారిని మరియు నిన్ను మెడలుబట్టి బయటకు గెంటివేస్తాను–

అని ఇట్లు తండ్రి కోప-గించేసరికి, కృష్ణకు చాలా బాధ కలిగింది. నిద్రపట్టడము లేదు. ఈ విధముగా చింతాక్రాంతుడై, ఒకనాడు గంగానది తీరమునుండి కృష్ణ పోవుచుండెను. ఆ సమయ-ములో ఒకానొక సాధువు హాహాకారముచేస్తూ స్పృహదప్పి మూర్ఛితుడై పడిపోవడము గమనిం-చాడు. వెంటనే కృష్ణ సాధువువద్దకు వెళ్లి స్వామీ! ఏమైంది? ఆహారము లేక స్పృహ తప్పి పడ్డావా? అన్నము కావాలా? తొందరగా అన్నము తీసుకురావాలా? అని అడుగుతాడు. అప్పుడు ఆ సాధువు అంటాడు.నేను ఆహారము తీసుకోను.కేవలము పాలతోనే జీవిస్తాను.ఒకవేళ నీవు అన్నము తెచ్చినా నేను స్వీకరించను. పాలుమాత్రమే సేవిస్తాను అని అంటాడు. సాధువుయొక్క వచనములను విని కృష్ణ చాలా చింతలోపడ్డాడు. ఇంట్లో పాలు లేవు. పోనీ-బజారులో పాలు కొనుగోలుచేసి సాధు-వునకు ఇస్తామంటే దగ్గర డబ్బులు లేవు. అప్పుడు బాగా విచారించి, అటు ఇటు చూసి మెల్లగా ఇంట్లో పెట్టెలోనుండి కొన్ని డబ్బులు దొంగిలించుకుని తొందరగా పాలు కొని తీసుకెళ్లి సాధువుకు ఇవ్వబోతుండగా కృష్ణయొక్క తండ్రి అకస్మాత్తుగా చూసి ఏమిటిరా అది? అని అడిగినాడు. కృష్ణ నిలువుగా చల్లబడినాడు. వణుకుతూ సత్యమును చెప్పినాడు. నాన్నా! నేను మన ఇంట్లో డబ్బులు దొంగిలించి ఉపవాసముతో, ఆకలితో అలమటిస్తున్న సాధువుకు పాలు కొని ఇస్తున్నానని యథార్థమును వివరించినాడు.

అప్పుడు తండ్రి చాలా కోపించి, కర్ర తీసుకొని బాగా కొట్టి, ఇంటికి తీసుకొచ్చి ఒక గదిలో స్తంభమునకు బంధించి, గడియవేసి గొళ్ళెము పెట్టినాడు. బంధింపబడిన కృష్ణ తనగూర్చి తాను బాధపడక దూరంగా ఉన్నటువంటి సాధువుగూర్చి విలపించసాగినాడు. సాధుపుంగవునికి పాలు ఎవరిస్తారు? పాలు ఇవ్వని యెడల ఆయన మరణించగలడు. ఏ విధి చేసేది. నేను బంధింపబడితిని అని ఏడుస్తూ శ్రీరామ ప్రభువును ఈ విధముగా ప్రార్థిస్తున్నాడు.

ఓ రామచంద్ర ప్రభో! దీనుడనైన నాపై దయదలచి నన్ను విడిపించినట్లయితే నేను తొందరగా ఆ సాధువువద్దకు వెళ్లి నా దేహమును విక్రయించి అయినాసరే, ఆ సాధువునకు పాలు సమర్పించుకొని ఆయనను దక్కించుకుంటాను అని ఏడుస్తున్నాడు. ఈ ప్రకారముగా ఏడుస్తున్న సమయములో, ఏ సాధువుగూర్చి కృష్ణ విలపిస్తున్నాడో, ఆ సాధువే ఇక్కడ కృష్ణ ముందు ప్రత్యక్షమై కృష్ణయొక్క శిరముపై తన అమృత హస్తమునుంచి ఎంతో చనువుగా నిమురుతూ నాయనా! నా గూర్చి ఏమి దిగులు చేయకుము. నాకు ఏమైందని బాధపడుతున్నావు? ఏడవకు నాయనా! అని మందలించినాడు. బంధించినటువంటి త్రాళ్లు వాటంతట అవే తొలగిపోయినవి. సాధువు అంటాడు.

నాయనా! నా గురించి ఏమీ చింతించకుము. నేను ఎల్లప్పుడూ నిన్ను అనుసరించియే ఉంటాను. సమయము ఆసన్నమైనప్పుడు నిన్ను భవబంధమునుండి విడుదల చేస్తాను.

అప్పుడు కృష్ణ సాధుమహాత్మునితో అంటాడు. స్వామీ! నన్ను నీ వద్దనే ఉండనిమ్ము. నీతోనే వస్తాను. నీ సేవయే నాకు మిక్కిలిప్రీతి. ఎల్లప్పుడూ నీ పాదసేవ చేసుకుంటూ ధన్యుడనౌతాను స్వీకరించండి స్వామీ! నన్ను ఇక్కడ ఉండనీయక నీ వెంటనే తీసుకెళ్ళు. లేనిచో నా ప్రాణాలను త్యాగము చేస్తాను. నా తండ్రి నన్ను బంధించి బాధిస్తున్నాడు. నేను నీ వెంటనే వస్తాను స్వామీ!–అని నేత్రములనుండి అశ్రుధారులు కారుతుండగా గద్గదకంఠముతో సాధువును పదేపదే ప్రార్థిస్తూ, బోరున వెక్కివెక్కి ఏడుస్తూ స్వామిని ప్రార్థిస్తాడు. అప్పుడు సాధుమహాత్ముడు కృష్ణకు ఆశ్వాసన-మిస్తూ, నా గురించి ఏమి చింత చేయకుము. నీవు ఏమాత్రము భయపడకుము. నేనెవరినని తలంచుచున్నావు. అనంటూ సాధువు అక్కడికక్కడే అదృశ్యమై–

శ్రీరామచంద్ర ప్రభువు ప్రత్యక్షమైనాడు. ప్రభువుయొక్క దివ్యతేజస్సు నలువైపుల ప్రజ్వలించు-చుండగా కృష్ణ ఆ దివ్యస్వరూపమును దర్శించినాడు. శ్యామలవర్ణము, రత్నఖచిత కిరీటము, సువర్ణకుండలములు, మెడలో వైజయంతీమాల, నేత్రములు ఆకర్షింపబడు శోభాయమానమైన దివ్య స్వరూపము,సూర్యునిబోలు ముఖారవిందము–ఇటువంటి దివ్యస్వరూపుడైన శ్రీరామచంద్రప్రభువును గాంచి,'కృష్ణ'సకల దేహభానమును విస్మరించి, రామస్వరూపమునందే తల్లీనమై బ్రహ్మానంద సాగ-రములో మునిగినాడు.

శ్లో ॥ రామం శ్యామాభిరామం రవి శశినయనం కోటిసూర్యప్రకాశం,
దివ్యం దివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తమ్ ।
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేద దక్షం,
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం భజేఽహమ్ ॥ (శ్రీరామకర్ణామృతమ్)

అప్పుడు శ్రీరామ ప్రభువు తన మధుర భాషణముతో కృష్ణతో ఇలా అంటాడు. నాయనా కృష్ణ! నీయొక్క అనంత జన్మలయొక్క పుణ్యము ఒక్కసారిగా ఫలోన్ముఖమై నన్ను దర్శించే భాగ్యము కలి-గించింది. నీయొక్క దృఢమైన సంతుమహాత్ముల యెడలగల భక్తికి మెచ్చి నిన్ను ఆశీర్వదించడానికి వచ్చాను. మహాత్ములయొక్క సాంగత్యము తప్ప మరో ఆసక్తి నీకు లేదు. యథార్థమైన భక్తికి ఇది తార్కాణము. నీవు అనతికాలములోనే నన్ను పొంది తరిస్తావు. అంతవరకు సాధుమహాత్ముల యందే సేవాతత్పరుడవై, వారి సేవచేస్తూ నాయొక్క దివ్య నామామృతమును ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉన్నట్లైతే నిన్ను నేను అనుసరించే ఉండి రక్షిస్తూ ఉంటాను–అని ఆశీర్వదించినాడు. ఈవిధముగా శ్రీరామ ప్రభువు తనయొక్క అమృత వచనములను చెప్పి తత్క్షణమే అంతర్ధానమైనాడు. అప్పుడు వెంటనే కృష్ణయొక్క తండ్రి వచ్చి కృష్ణను ఆప్యాయతతో హృదయపూర్వకముగా ఆలింగనము

చేసుకుని, ఇలా అంటున్నాడు. నాయనా! ఏమిటి నీ ముఖవర్చస్సు,అపూర్వ తేజస్సుచే నిశ్చింతమైన శాంతస్వరూపముతో పూర్ణమై ఉన్నది. ఈనాటినుండి నిన్ను ఎటువంటి నిర్బంధము చేయను. నీ ఇష్టప్రకారమే వ్యవహరించుము. సాధుసాంగత్యమే చేస్తావో, లేక ఇంట్లోనే ఉంటావో, ఇక నీ ఇష్టము. నీకు ఏ విధమైన ఆంక్షలు విధించను. స్వేచ్ఛగా ఉండుము అని వాగ్దానము చేసినాడు.

తండ్రియొక్క వాక్కులను విని కృష్ణ ప్రఫుల్లిత హృదయుడై సంతోషము పట్టలేక గంతులు వేయసాగినాడు.తనయొక్క సంకల్పసిద్ధి ఫలించినందుకు ఆనందభరితుడై రామనామోల్లాసముచేత గానము చేయసాగినాడు. ప్రతినిత్యము సాధుసంతులను ఇంటికి తీసుకొచ్చి సేవాది ఉపచారములు చేసి భోజనాది ప్రసాదఫలహారముల నొసంగి వారిని సంతృప్తిపరచి సాగనంపేవాడు. పదహారు సంవత్సరాల ప్రాయము వచ్చిన పిమ్మట తల్లిదండ్రులు విచారించి కృష్ణకు ఒక ఉత్తమ సంస్కారము గల ఇంటి బిడ్డనుచూసి వివాహము చేసినారు. ఇట్లు, ఒక సంవత్సరము పాటు గృహస్థాశ్రమమందు నివసించినాడు. తదనంతరము ఒకరోజున వైరాగ్యయుక్తుడైన ఒక సాధువుద్వారా సంబంధము కలిగింది. ఆయనద్వారా సంసారాసక్తి నివృత్తిగూర్చి యథార్థమైన బోధను శ్రవణము చేసినాడు. ఆ దృఢమైన వైరాగ్యబోధద్వారా తల్లిని, తండ్రిని, భార్యను-అందరిని విడిచి ఇంటినుండి బయలు దేరినాడు. మధ్యరాత్రివేళ ఎవరికి చెప్పకుండా ఇంటినుండి వెళ్లి, అనేక అరణ్యములగుండా నడుస్తూ నడుస్తూ అనేక పుణ్యక్షేత్రములలో సంచరిస్తూ,చివరికి కాశీక్షేత్రమునకు చేరుకున్నాడు. అచ్చట ఒక సన్యాసిని ఆశ్రయించి ఆయన సేవచేస్తూ ఉండిపోయినాడు.

ఒకసారి ఆ సన్యాసి కృష్ణను నీకు ఎవరైనా నీ వారంటూ ఉన్నారా? అని అడిగినాడు. నా వారంటూ నా బంధువులు గాని, సహోదరులుగాని, తల్లిదండ్రులుగాని ఎవరూ లేరు-అని కృష్ణ సమాధానమిచ్చినాడు. ఎందుకంటే దృఢవైరాగ్యముచేత మనఃపూర్వకముగా దేహము, దేహసంబంధ అనాత్మ పదార్థాలన్నిటిని త్యజించినాడు. అప్పుడు ఆ సన్యాసి కృష్ణకు విధిపూర్వకముగా సన్యాస దీక్షనొసంగి ప్రణవమంత్రోపదేశముచేసి "గోవిందానందుడ"ను యోగపట్టచే బిరుదాంకితుని చేసి-నాడు. కొన్నిరోజులు గడచిన పిదప గోవిందానందుడు,స్వామియొక్క అజ్ఞానుసారము తీర్థక్షేత్రములు తిరుగుతూ తిరుగుతూ "ద్వారక"క్షేత్రమునకు వచ్చినాడు. అక్కడ శివానందుడనే మహాత్ముని సంద-ర్శించినాడు. అప్పుడు ఆ శివానందస్వామి కృష్ణతో ఇలా అంటాడు. నాయనా గోవిందానందా! హుబ్లీ పట్టణమునందు శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి ఉన్నాడు. ఆయన సాక్షాత్తు శివావతారము. నీవు తప్పకుండా ఆయనను సందర్శించుము-అని చెప్పి, ఇంకా ఇలా అంటున్నాడు. నేను సద్గురు సిద్ధారూఢస్వామియొక్క సన్నిహిత శిష్యుడనుంటిని.ఆయనయొక్క విశేషమైన ప్రేమ,కృప నాయందు ఉండేది. శ్రావణ, మాఘమాసములలో జరుపబడే ఉత్సవములగూర్చి, నేను దేశదేశములు తిరిగి, వలసిన సామగ్రులను సమకూర్చెడివాడిని. మాఘమాసము, శ్రావణమాసములలో ఉత్సవములు

మహావైభవముగా జరుపబడును. ఆఉత్సవములలో స్వామిని అనేక దివ్యాభరణములతో అలంక-రించి పూజిస్తారు. ఆయన కరుణామయుడు. కృపాసముద్రుడు. అందరిపై తనయొక్క పవిత్రమైన కృపాదృష్టిని సమముగా ప్రసరింపజేసి, భక్తులయొక్క సంకటములను దూరముచేసి వారిని చేరదీసి ఆదరిస్తాడు. అందుకనే ఆ మహాత్ముడు 'దీనానాథుడ'నే పేరును సార్థకము చేసుకున్నాడు. అటువంటి సద్గురుదేవుని ఒక్కసారి దర్శించితివా, కేవలము దర్శనభాగ్యముచేతనే ముఖకమలము తేజో(జ్ఞాన) వంతమై హృదయమందు శాంతి చేకూరగలదు.ఆ మహాత్ముని దర్శనమాత్రముననే సకలతాపములు నివృత్తి కాగలవు. ఇటువంటి అమృతవచనములను శివానందస్వామిద్వారా, గోవిందా నందుడు విని ఆనందపరవశుడై సిద్ధారూఢస్వామిని ఎప్పుడెప్పుడు దర్శింతునా–అనే ఉత్కటమైన ఇచ్ఛ నిర్మాణ-మైనది. తత్క్షణమే గోవిందానందుడు 'ద్వారక'ను వదిలి రెండు మూడు రోజులు పయనించి, ఒకనాటి మధ్యరాత్రి వరకు హుబ్లీపట్టణమునకు చేరుకొని సిద్ధాశ్రమము ముందుకు వచ్చి నిలబడినాడు. అర్ధ రాత్రి సమయము కావున, అందరూ గాఢనిద్రలో ఉన్నారు.

సరిగ్గా అదే సమయానికి సద్గురుమూర్తి మేల్కాంచి బయటకు వచ్చి గోవిందానందుని చూసి ఆనందముతో దగ్గరకు వచ్చినాడు. అప్పుడు గోవిందానందయతి సంతోషించి స్వామితో ఇలా అడుగుతాడు. ఓ మహారాజా! సిద్ధారూఢ యతీంద్రులు ఎక్కడుంటారు? అప్పుడు సిద్ధారూఢ స్వామి అంటాడు. ఆ విషయమంతా తర్వాతగాని, నీవు మొదలు లోనికి రా. నీవు చాలా ఆకలితో ఉన్నావు-అని స్వామి అంటాడు. స్వామియొక్క ప్రేమపూర్వక ఆప్యాయ వచనములను విని గోవిందానందుడు ఆశ్చర్యపోయినాడు. నేను ఆకలితో ఉన్నది, ఈయనకి ఎలా తెలుసు. నాయొక్క స్థితిగతులు తెలు-సుకొననిదే నా ఆకలి సంగతి ఎలా గుర్తించాడు–అని అనుకున్నాడు. స్వామి, గోవిందానందుని చేయిపట్టుకొని ఆశ్రమములోనికి తీసుకెళ్లి తన శిష్యులను నిద్రనుండి లేపి చూడండి! ఈయన మూడు రోజులనుండి ఉపవాసంతో ఉన్నాడు,తొందరగా భోజనము వడ్డించండి–అని చెప్పగా విని గోవిందానందుడు అంటాడు. శ్రీ సద్గురు సిద్ధనాథుని దర్శించనిదే నేను భుజించను. మొదట స్వామిని దర్శనము చేసుకుంటాను. దయచేసి స్వామి ఎక్కడ ఉంటాడో చెప్పండి–అని అడుగుతాడు. అప్పుడు ఒకానొక శిష్యుడు అంటాడు. ఓ సాధువర్యా! నీ ఎదురుగానే ఉన్నాడయ్యా. ఈయనే సిద్ధనాథుడు. మరెవరనుకుంటున్నావు–అని స్వామిని చూపించగా, గోవిందానందుడు వెంటనే అత్యంత ప్రేమతో స్వామియొక్క పాదపద్మములకు నమస్కరించి ఇలా వేడుకుంటున్నాడు. ఓ సద్గురు దీనదయాళా! నీయొక్క ప్రేమ హృదయము, ఆచరణ. అప్పుడు శివానందస్వామి చెప్పితే విన్నాను. కాని, ఇప్పుడు ప్రత్యక్షముగా చూస్తున్నాను.ఆహా! భక్తులపై ఎంత చింత. నీకు నిజముగా శివానందస్వామి చెప్పి-నట్లుగానే ఉంది. ఆర్యా!నీయొక్క కృప పొందడానికి అంతగా అధికారము నాకులేదు. అయినాగాని ఈ పామరునిపై అకస్మాత్తుగా ఇంతటి దయచూపినావంటే, నాకు చాలా ఆశ్చర్యముగా ఉంది.నేను

నీయొక్క పాదరేణువుతో సమానుడను అని ఈ విధముగా స్వామిని స్తుతిస్తూ గోవిందానందుడు మళ్లీ స్వామి చరణములకు నమస్కరించాడు. తదనంతరము శిష్యులు వంటశాలలోకి వెళ్లి అన్నము కోసము అంతటా వెతికినారు. కాని, కొంచెముకూడా అన్నము దొరకలేదు. ఫలహారములుకూడా ఏమియు లేవు. ఈ విషయము గోవిందానంద స్వామికి తెలిసి, పూర్వపు ఒక కథ జ్ఞప్తికి వచ్చింది. దుర్వాసమహామునియొక్క పరీక్షకు ద్రౌపదీదేవి శ్రీకృష్ణ భగవానుని ప్రార్థించి ఆపదనుండి ఎలా బయటపడిందో, అదే ప్రకారముగా ఇప్పుడు ఇక్కడి పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో నేనెవరిని వేడుకునేది అని గోవిందానందుడు అనగానే—

సద్గురుదేవుడు నవ్వుకొని వెంటనే మఠముబయటకువచ్చి త్వరలోనే మళ్లీ దోతిని చేతులతో పట్టుకొని, మఠములోనికి వచ్చి ఆ దోతిని క్రింద పరచి అందులోనుండి రకరకాలైన పండ్లు ఫల-హారములు తీసి ఇచ్చినాడు. ఇవి ఎక్కడివి మీకెవరికి తెలియదు–అంటాడు సద్గురు సిద్ధనాథుడు. అప్పుడు గోవిందానందుడు తనలో తాను, ఈ మహాత్ముడు సాక్షాత్ ఈశ్వరునియొక్క అవతారమే. మరేమీ కాదు. (సామాన్యమానవుడుకాదు)–అని దృఢనిశ్చయము చేసుకొని, స్వామి ప్రసాదించిన ఫలహారములను సేవించి ఆ రాత్రి అచ్చట నిద్రించినాడు.

మరునాటి ఉదయమున స్నానసంధ్యాది నిత్యక్రియలు తీర్చుకున్న పిమ్మట సద్గురు సిద్ధ-నాథుడు భక్తులతో కలిసి ఉన్నటువంటి గోవిందానందస్వామిని ఇలా ప్రశ్నిస్తాడు. ఆనందమూర్తివైన ఓ గోవిందానందస్వామీ! నీవు ఇక్కడనే మా సాన్నిధ్యమందే వసిస్తూ, భక్తులకు జ్ఞాన లాభమును కలిగింప జేయుము–అని సద్గురు దేవుడంటాడు. అప్పుడు గోవిందానందస్వామి సద్గురుదేవునితో ఇలా అంటాడు. ఓ సద్గురుదేవా! అనంత జన్మలయొక్క పుణ్యము ఉదయించినందువలన మీయొక్క దివ్యపాదారవిందముల దర్శనభాగ్యము కలిగింది. ఇప్పుడు మీ సాన్నిధ్యమందే ఉండమని ఆజ్ఞాపిం-చినారు. ఇది ఇంకా అహోభాగ్యముగా భావించి, నీ పాదాల నాశ్రయించి నేను విదేహకైవల్యము నొందే వరకు ఇక్కడే ఉంటాను. దేశదేశములలో నీయొక్క పుణ్య కీర్తిని, నీ దివ్యమైన, పవిత్రమైన చరిత్రను ప్రకటము చేయుటకు శుద్ధమైన మతిని ప్రసాదించుము. సేవారూపమైన ఈ కార్యమును నిర్వహించుటకు ఆజ్ఞను ఒసంగుము స్వామీ! ఇదే నాయొక్క కోరిక-అని గోవిందానందస్వామి వేడుకుంటాడు. అప్పుడు గోవిందానందస్వామియొక్క కోరికను మన్నించి సద్గురుదేవుడు సంతోషించి ఆజ్ఞను ఒసంగుతాడు.

సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి సద్గురు సన్నిధానమున లేచినిలబడి సద్గురుదేవుని యొక్క కీర్తిని అద్భుతముగా వర్ణించాడు.గోవిందానందస్వామి సద్గురుదేవుని కీర్తిని వర్ణిస్తుంటే శ్రవ-ణము చేస్తున్న భక్తులందరూ తల్లీనమై మైమరచి పోయినారు. కీర్తనరూపమైన, భక్తిరసయుక్తమైన సద్గురుదేవుని గుణగాథను ప్రకటిస్తుంటే, శ్రోతలందరూ పరవశులై ఆనందచిత్తులై నయనములవెంట

ప్రేమాశ్రువులను రాల్చినారు. ఈప్రకారముగా దేశదేశములనుండి భక్తులేగాక, అనేకమంది సంతు మహాత్ములుకూడా వచ్చి సద్గురుదేవుని దర్శించి, తిరిగి వారి స్వస్థానములకు పోవుటకు ఇచ్ఛగించక ఇక్కడే సద్గురు సాన్నిధ్యమందే ఉంటూ జీవితాంతము సద్గురుదేవుని సేవలో పాల్గొని, ధన్యులై విదేహకైవల్యమును పొందినారు.

అందుకని జ్ఞానమూర్తియగు సిద్ధసద్గురుమూర్తి సాక్షాత్ ఈశ్వరుని అవతారము. జ్ఞానాపేక్ష గల ముముక్షువులు సద్గురుదేవుని శోధిస్తూ శోధిస్తూ వచ్చి సద్గురు సిద్ధమూర్తిని ఆశ్రయించి సద్గురు దేవుని కృపకు పాత్రులై తరించి ముక్తులైనారు. దయాసాగరుడైన సద్గురుదేవుడు స్వస్వరూపప్రాప్తిని ఇచ్ఛగించి వచ్చిన ప్రతివారికి అద్వైత జ్ఞానామృతమును పంచి సుఖశాంతులను ప్రసాదించి తన-యందైక్యము చేసుకున్నాడు. ఈవిధముగా సంతుమహాత్ముని చరిత్ర కథనమువలన, శ్రోతల కర్ణపు-టములు పవిత్రమై హృదయమందు సకలసంశయములు నివృత్తమై, చిత్తదోషములు తొలగి మహ-దానందమునొందినారు. సద్గురుదేవుని అనుగ్రహమువల్ల ఇట్టి సంతుమహాత్ముని కథను చెప్పుటకు ప్రవర్తించిన నేను నా అహోభాగ్యముగా భావించుచున్నాను.

స్వస్తి శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రముననే సకలపాపములు భస్మమై పోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది ఏడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది ఎనిమిదవ అధ్యాయము

పద్యానువాదము:–ఆరూఢ అవస్థయందు వసించునటువంటి ఓ సద్గురు సిద్ధరాజా! నిన్ను దర్శించి లేక స్మరించినంత మాత్రముననే అందరి భక్తులయొక్క సకల అనర్థములు నివృత్తిచేసి, కారుణ్యభావముతో వారిని భవసాగరమునుండి తరింపజేస్తావు. క్షణకాలములో సకల సంకట-ములను దూరముచేసే ఓ దీననాథా! నీకు సాష్టాంగనమస్కారము.

ఓం అనాద్యనంతస్వరూపుడవు, విశ్వాతీతుడవు, విశ్వవ్యాపకుడవు, మాయాతీతుడవు, లోక రక్షకుడవు, నామరూపాతీతుడవు మరియు నిర్వికార స్వరూపుడవైన ఓ సద్గురు సిద్ధనాథా! నీకు నమస్కారము. నీకు నమస్కారము చేయుదమనుకుంటే నమస్కారము, నమస్కర్త, నమస్కార్యము త్రిపుటి స్వరూపడవు నీవే అయి, మళ్ళీ మమ్ములను ఆశీర్వదించుచున్నావు.అంతేకాక నిన్ను ధ్యానిం-చుదామంటే ధ్యానము, ధ్యాత, ధ్యేయము త్రిపుటిస్వరూపుడవు నీవే అవుతావు. దేహబుద్ధిని సమూ-లముగా నివృత్తిచేసి సహజముగా ఐక్యయోగ ప్రాప్తిని కలుగజేస్తావు. ఇతరమైన అన్యకలినసాధనలు ఏమి చేయకుండానే నీయొక్క సేవ నిరభిమానముగా చేసిన వారికి సహజముగానే జ్ఞానమును ప్రసాదించినావు. అందుకే నీవు సాక్షాత్ జ్ఞానదాతవు. నీవు తప్ప ఎవరి నాశ్రయించినా అందరూ బంధధాతలున్నారు. నీవు ఏ అభేదస్థితిని పొందినావో, ఆ అద్వైతస్థితిని ప్రాప్తము చేసి, ద్వైతస్థితిని నిరసనము చేస్తావు. ఇటువంటి మహిమాన్వితుడవైన ఓ సద్గురు సిద్ధనాథా! నీ దివ్యపాదారవింద-ములనాశ్రయించినందున అహంతా మమతారూప మోహము నిరసించి హృదయమందు శాంతిని ప్రసాదిస్తావు. ఓ శ్రోతలారా! ఇప్పుడు రసయుక్తమైనటువంటి సద్గురు చరిత్రకథను సావధానచిత్తులై ఆలకించండి. పరమ పవిత్రమైన ఈ సద్గురుచరిత్ర శ్రవణముద్వారా చిత్తమందలి సకలదోషములు నివృత్తమై హృదయమందు యథార్థ జ్ఞానము ప్రకటమై భవబంధము నివృత్తి కాగలదు.

"కాలప్ప బడిగేరి" అను పేరుగల నిర్మల హృదయము, ప్రేమ, శ్రద్ధాభక్తులు గల ఒకానొక సద్భావయుక్తమైన భక్తుడుండేవాడు. ఆయన సద్గురుసిద్ధనాథుని తమగృహమునకు ఒకసారి ఆహ్వా నించి భోజన తాంబూలాదులను సమర్పించాలని సంకల్పము చేసుకొని బజారుకు వెళ్లి మధురమైన మామిడి పండ్లు మరియు భోజన సామగ్రులను తీసుకొచ్చి ఇంట్లో పెట్టి సద్గురుదేవుని వద్దకు వెళ్లి స్వామికి ఆమంత్రణము ఇచ్చి, స్వామీ! మీరు మాపై దయదలచి రేపు మా ఇంటికి మహాప్రసాదమును

స్వీకరించుటకు రావలసింది–అని తనయొక్క కోరికను విన్నవించుకున్నాడు.మరుసటిరోజున వేకు-వనే కాలప్ప లేచి కాలకృత్యాలు తీర్చుకుని తొందరగా భోజనము తయారు చేయమని తన భార్యతో చెప్పినాడు. భోజనములు తయారు అయినాక కాలప్ప సద్గురుదేవుని తీసుకొచ్చుటకు మఠమునకు పోయి స్వామిని ఆహ్వానించాడు. సద్గురు సిద్ధనాథ స్వామి కాలప్పయొక్క విన్నపమును స్వీకరించి, కాలప్ప గృహమునకు విచ్చేసినాడు. ఇంటికి రాగానే కాలప్ప సద్గురుదేవునికి యోగ్యమైన ఉన్న-తాసనమును ఇచ్చి స్వామిని కూర్చుండజేసి, షోడశోపచార పూజలు గావించినాడు. తదనంతరము సద్గురుదేవుని మరియు వారి బంధువులను భోజనము చేయుటకు కూర్చుండబెట్టి అందరి ముందు పళ్లెములను ఉంచి భోజన పదార్థములను వడ్డించినాడు. మరియు స్వామికి మామిడిపండ్లు వడ్డిం-చుదామని పండ్లు తీసుకున్నాడు.

అప్పుడు ఒక విచిత్రమైన వింత జరిగింది. ప్రతి మామిడిపండులో క్రిములుఉత్పన్నమై భుజిం-చుటకు అయోగ్యముగా ఉన్నవి. కాలప్ప ఖిన్నుడైనాడు. చాలా బాధపడుతూ చింతిస్తున్నాడు. ఎంతోప్రేమతో సద్గురుదేవునికి సమర్పించుకుందామని మామిడిపండ్లు తెస్తే, ప్రతిబంధకము వాటి-ల్లెను కదా!అని చాలా దుఃఖించినాడు. మళ్లీ ఈ విధముగా అనుకున్నాడు–జరిగిందేదో జరిగింది. సరే! మళ్లీ వేరే పండ్లు కొని తెస్తామని నిశ్చయించుకొని సిద్ధమైనాడు. అప్పుడు ఈసంగతి తెలుసు-కున్న సద్గురుదేవుడు, కాలప్పను పిలిచి నీవు ఏమి చింతజేయకు–ఏవి ఆ పండ్లు చూపెట్టు, ఇటు తీసుకురా? అని అన్నాడు. కాలప్ప కుళ్ళిన పండ్లు తీసుకొచ్చి స్వామికి ఇచ్చినాడు. సద్గురుదేవుడు ఆ పండ్లను తీసుకొని ఒక్కొక్క దానిని త్రిప్పి త్రిప్పి చూసినాడు. సద్గురుదేవుడు స్పర్శించినాక ఇక పురుగులు ఉంటాయా? పండ్లు శుద్ధముగానున్నవి. ఏమయ్యా! కాలప్ప! పండ్లు అన్ని మంచిగానే ఉన్నవి కదా! ఎందుకిలా హూళిక్కి పడుతున్నావు, వడ్డించుము.

ఈవైచిత్ర్యమును ఇతరులందరు చూసినారు. మామిడిపండ్లలో క్రిములు లేవు.పరిశుద్ధముగా నున్నవి. అవే పండ్లను కోసి వాటి రసమును అందరికి ఇచ్చినాడు. "శుకముఖాదమృత ద్రవసం-యుతమ్"(శ్రీమద్భాగ 1-1-3). చిలుక ముట్టిన ఫలమువలె, రసము అతిమధురముగానున్నది. అంద-రూ ఆశ్చర్యమును పొందినారు. సద్గురుదేవుని హస్తస్పర్శద్వారా ఒక నిర్జీవమైన మామిడిపండు ఇంత శుద్ధమైనది. ఇక సజీవమైన మానవునికి సద్గురుదేవుని అమృతహస్తస్పర్శ కలిగినచో ఎంత పరిశుద్ధము కావాలి–స్వామియొక్క కృపగలిగి తన అమృతహస్తముచే స్పర్శించి ఆశీర్వదించినట్ల-యితే తద్రూపుడే కాగలడు.(కైముతికన్యాయము). నిర్మల అంతఃకరణముగల ముముక్షువునకు సద్గురు దేవుడు జ్ఞానరూప ఫలమును ప్రసాదిస్తాడు. దానిని అనుభవించిన శిష్యుడు నామరూపములను విసర్జించి సమరసభావమును పొందుతాడు. అటువంటి శుద్ధాంతఃకరణముగల భక్తుని హృదయ-

మును తెలుసుకొని యథార్థతత్త్వమును బోధించి ధన్యుణ్ణి చేస్తాడు. తనయొక్క అమృత హస్తస్పర్శ ద్వారా ఆశీర్వదించి ఏకాత్మభావమును ప్రసాదించి తద్రూపున్ని చేసుకుంటాడు.

ఈరీతిగా కాలప్ప ఎంతో ఆనందమును పొందినాడు. హృదయము ప్రేమతో ఉప్పొంగి పోయింది. సద్గురుదేవుడు వచ్చి మమ్ములను ఉద్ధరించాడు, మేము ధన్యులమైనామని ఎంతో సంతోషమునొందినాడు. భోజనానంతరము కాలప్ప సద్గురుదేవునికి దక్షిణ తాంబూలాదులను ప్రేమపూర్వకముగా సమర్పించి స్వామిని మఠమునకు తీసుకెళ్లి పాదదర్శనము చేసుకుని నేను కృతార్థుడనైనానని అనుకొని తన ఇంటికి తిరిగి వచ్చినాడు.

ఇప్పుడు మరొక కథను వినండి. తుక్కప్ప అనే ఒక భక్తుడు సద్గురుదేవునిపై అపారమైన ప్రేమ భక్తి గలవాడు. నవరాత్రి ఉత్సవ నిమిత్తముగా సద్గురుదేవులను తమ గృహమునకు తీసుకొచ్చి భక్తిశ్రద్ధలతో స్వామిని పూజించాలను కున్నాడు. ఇంటిముందు దివ్యమైన మండపమును నిర్మించాడు. నవరత్నఖచితమైన దేదీప్యమానమై తేజోవంతముగా ప్రకాశించునట్లు అనేక అలంకారములను అమర్చి నిర్మించినాడు. మండపపరిసరమంతా దీపాలతో శోభాయమానముగా తీర్చిదిద్దాడు.ఇంకా ఏఏ ఏర్పాట్లు చేయాలో అన్ని చేసి సద్గురుదేవుని ఆ మండపమందు కూర్చుండబెట్టి పాదపూజ చేయాలనుకున్నాడు. తదనంతరము సద్గురుదేవుని తీసుకొని వస్తామని తుక్కప్ప సంసిద్ధుడు కాగా–

అదే సమయానికి అతని భార్యవచ్చి ఏమండీ! మీరు సద్గురుదేవుని తీసుకొచ్చి పాదపూజచేసి బ్రహ్మాండముగా ఉత్సవ కార్యక్రమము చేయాలని నిశ్చయించుకున్నారు. అది సరే, బాగుంది. నేను సమ్మతించుచున్నాను. కాని, మన కుమారుడైన 'హనుమంతు' రోగ పీడితుడై మృత్యుముఖమున పడబోవుచున్నాడు. నిశ్చేష్టుడై పడిఉన్నాడు. ఒకవేళ ప్రారబ్ధము క్షీణించి దేహము పడిపోయినచో కార్యక్రమమునకు విఘ్నముగలిగి అమంగళ మగునేమోనని భయమేస్తుంది–అని అంది. అప్పుడు తుక్కప్ప తన కుమారునివద్దకు పోయి నాయనా! హనుమంతూ! నేను ఇప్పుడు సద్గురుదేవుని తీసుకురావడానికి పోతున్నాను. స్వామి వచ్చినాక రోగబాధతో హాహాకారముచేయక స్వస్థతగా ఉండుము. ఓరిమితో రోగబాధను సహించుము. ఏమి విక్షేపముగాని, విఘ్నముగాని కలిగించకుము అని ఊరడించి చెబుతాడు. ఒకవేళ మరణసమయము ఆసన్నమైనప్పటికీని ఆత్మయందు నిష్ఠగలిగియుండి సద్గురునామామృతమును ఉచ్చరిస్తూ అనాయాసముగా ప్రాణములను వదులుము. హాహాకారము చేస్తూ పూజకు విఘ్నము కలిగించకుము. తండ్రియొక్క వాక్కులను శిరసావహించి సరే! అలాగే చేస్తాను. అంటూ అశక్తుడై ఉన్న హనుమంతు నోటితో చెప్ప వీలులేక సైగతో చెప్పాడు.

కాని, మాతృహృదయము (తల్లి)ఆ స్థితిని చూసి భరించలేక ఏడవ సాగింది. అప్పుడు తన భార్యను ఊరడిస్తూ ఏమిటమ్మా రోగముతో పీడింపబడుచున్న మన కుమారుడు ఏడవడానికి బదులుగా, నీవు ఏడుస్తున్నావు. వాడిని ఊరడించడానికి బదులుగా, నీవే ఇలా అధైర్యము జెందితే

ఎలాగా? అయినా ఇది ఏడవవలసిన సమయము కాదు. అసలు నీ అభిప్రాయమేమి? సద్గురు దేవుని తీసుకు రమ్మంటావా?లేదా?చెప్పుము–అని తుక్కప్ప తనభార్యతో అంటాడు.అప్పుడు ఆయన భార్య ఇలా అంటుంది. సరేనండీ. నాది పొరపాటైయ్యింది. ఒకవేళ మన కుమారుడు చనిపోయి-నప్పటికీ నేను ఏడవకుండా స్వామి కార్యమునకు విఘ్నము కాకుండా కుమారునిపై గొంగడి కప్పి సద్గురుదేవుని సేవలో నీతోనే సహకరిస్తానండీ–అని అన్నది. సద్గురుదేవుడు తిరిగిపోయే వరకు నేను ఏడవను–అని అంది.

తుక్కప్ప,భార్యాపుత్రులపైగల మమకారమును కాలదన్ని ఎలాగైనా సరే సద్గురుదేవుని తీసు-కొచ్చి పూజిస్తానని నిశ్చయించుకొని స్వామిని తీసుకురావడానికి మఠమునకు బయలుదేరి వెళ్ళి-నాడు. భక్తులందరూ కలిసి వైభవముగా భజనలు చేస్తూ ఇంటికి తీసుకొచ్చి మండపములో ఏర్పాటు చేసినటువంటి సింహాసనముపై స్వామిని కూర్చుండబెట్టి కీర్తనలు ప్రారంభించినారు. అప్పుడు ఒక వింత జరిగింది వినండి–

ఇక్కడ హనుమంతు రోగంతో బాధపడుతున్నప్పటికీ తండ్రి ఆజ్ఞమేరకు సద్గురు నామా-మృతమును గొంగడిలో పడుకొని మెల్లగా లోలోనస్మరిస్తున్నాడు.నేత్రములగుండా కన్నీరుకార్చుతూ విలపిస్తూ సద్గురుదేవుని ఈవిధంగా ప్రార్థిస్తున్నాడు. ఓ దీననాథా! సద్గురుదేవా! అందరిలాగా నేను సశక్తుడనై ఉంటే నాకు నీయొక్క దర్శనభాగ్యము కలిగి ఉండేది. నేను లేచి వస్తామంటే నాలో శక్తి లేదు, ప్రాణం పోయే సమయము ఆసన్నమైనది. ఈ అంతిమ సమయంలో నాకు నీవే దిక్కు. ఒక వేళ నేను నిన్ను బిగ్గరగా పిలిచినట్లయితే నీయొక్క పూజకు విఘ్నము కాగలదు. కావున, ఓ సద్గురు దేవా! ఈవేళ దయచేసి మీయొక్క కృపను ప్రసరింపజేయుము ఒక్కసారి నీవు దర్శనమిచ్చితివా ఇక నేను సుఖముగా శాంతముగా నా ప్రాణాలను త్యజించగలను. అయినాగాని కీర్తన చాలా ముమ్మ-రంగా జరుగుతుంది. ఆఘోషణలో నాయొక్క ఆర్తనాదము(పిలుపు)నీకు వినపడుతుందా స్వామీ!

కీర్తన చాలా రమ్యమునకు వచ్చింది. సద్గురుదేవుడు మండపములో కూర్చుని ఉన్నాడు. అకస్మాత్తుగా లేచి తుక్కప్పను దగ్గరకు పిలుచుకొని, ఆయన చేయి పట్టుకుని ఇలా అంటాడు— *"నీ కుమారుడైన హనుమంతుడెక్కడున్నాడు. వానివద్దకు నన్ను తీసుకుపో"*. అప్పుడు తుక్కప్ప–స్వామీ! ఇప్పుడెందుకు లెండి, పూజ అయినాంక పోదాములే!అయినా వాడు ఇప్పుడు హాయిగా నిద్రిస్తు-న్నాడు. వానికి విక్షేపము చేయడమెందుకు? పూజానంతరము తీసుకెళ్లి చూపిస్తాను లే! అని అంటాడు.

కాని, స్వామి ఇప్పుడే పోదామని ప్రోద్బలము చేస్తున్నాడు. చేయునది లేక తుక్కప్ప సద్గురు దేవుని చేయిపట్టుకుని తన కుమారునివద్దకు తీసుకుపోయాడు. స్వామి హనుమంతుని చూసినాడు. హనుమంతుపై కప్పినటువంటి వస్త్రములను తొలగించి చూసేసరికి, ముఖముపై మృత్యుకల కానొ-

స్తున్నది. మెల్లగా సద్గురునామాన్ని మనసులో ఉచ్ఛరిస్తున్నాడు. వాని పరిస్థితిని తెలుసుకుని సద్గురుదేవుడు "**శివాయనమః**"అంటూ హనుమంతుయొక్క శరీరముపై తన అమృతహస్తమును త్రిప్పి స్పర్శించినాడు. వెంటనే హనుమంతుయొక్క ముఖముపై కాంతి, తేజము వచ్చింది. మెల్లమెల్లగా కాళ్లు చేతులు కదిలించడము ప్రారంభించాడు. సద్గురుదేవుడు స్వయముగా తన అమృతహస్తము-లతో హనుమంతుని లేపి కూర్చుండబెట్టినాడు. స్వామియొక్క కృపచేత హనుమంతు సచేతనుడై-నాడు.తుక్కప్ప మరియు ఆయన భార్య ఇరువురు ఆనందంతో ప్రేమాశ్రువులనురాల్చారు.కుమారుడు సద్గురుదేవుని కృపవలన క్షేమముగా ఉండడము చూసి, వారు సద్గురుదేవుని ఈవిధంగా స్తుతిస్తు-న్నారు. ఓ దీననాథా! దయాసాగరా! మహత్తరమైన సంకటమునుండి మమ్ములను రక్షించావు. ఇరువురు దంపతులు సద్గురుదేవుని చరణాలకు నమస్కరించి, నీయొక్క పూజాకార్యక్రమములోనే కుమారుడు చనిపోతాడేమోనని మాకు చాలా బెంగ ఉండెను. నీయొక్క అనుగ్రహమువలన మా యొక్క అనర్థములు నివృత్తమైనవి. మేము వేడుకొనకున్నను, నిన్ను ప్రార్థించకున్నను మమ్ములను ఆదరించి అపారమైన కృపజూపి రక్షించినావు. నీయొక్క మహిమను ఏమని వర్ణించగలము. నీ యొక్క మహిమను తెలుసుకోలేక కార్యమునకు విఘ్నము కలుగుతుందేమోనని భయపడితిమి. మూఢులమైన మమ్ములను ఆదరించితివి.

ఓ సద్గురుదేవా! మా కుమారుని ఆరోగ్యము బాగులేదని మేము నీతో చెప్పియుండలేదు. ఈ సంగతి నీకు ఎలా తెలిసింది? అప్పుడు సద్గురుదేవుడు ముసిముసి నవ్వులు నవ్వి భక్తులయొక్క ఆర్తనాదమును, వారి ప్రార్థనలను వినుటకు నాయొక్క కర్ణములు ఎల్లప్పుడూ సావధానముగా ఉంటాయి. అందుకే, కీర్తనానందములో రమించి ఉన్న నాకు మీ కుమారుని దుఃఖపూరితమైన ఆర్తనాదము నాచెవిలో పడింది. అందుకనే నేను తొందరగా ఇక్కడికి వచ్చాను. ఇక హనుమంతుకు మృత్యుభయము లేదు. ఇప్పుడు వీడిని భుజములక్రింద చేతులువేసి మెల్లగా పూజామండపములోకి తీసుకురండి. వీనికి ఆ వైభవమును దర్శించాలని చాలా ఇచ్ఛ ఉంది. ఈ విధముగా సద్గురుదేవుడు తుక్కప్పతో చెప్పి మండపములోనికి వెళ్లిపోయినాడు. సద్గురుదేవుడు ఆసీనుడై ఉండ, కీర్తన మహా రమ్యమునకు వచ్చింది. ఒకవైపు స్వామిని పూజించుటకు సన్నాహాలు జరుగుచున్నవి. తుక్కప్ప తన కుమారుని చేతులుపట్టుకొని మెల్లగా మండపములోనికి తీసుకొస్తున్నాడు. దూరమునుండి సద్గురు దేవుని దర్శనము ఎప్పుడైతే అయ్యిందో, వెంటనే హనుమంతు తుక్కప్పను విడిపించుకుని తానే స్వయంగా పరుగెత్తుకుంటూ వచ్చి సద్గురు చరణాలపై వ్రాలినాడు. మరియు ఇలా వేడుకుంటున్నాడు. ఓ దీనదయాళా! సద్గురుదేవా! నీవు నాయొక్క ప్రార్థన నాలకించి వచ్చి నన్ను రక్షించినావు. రోగ పీడితమైన ఈ దేహమును తల్లిదండ్రులు బ్రతికించుకోలేని స్థితిలో, నీవు వచ్చి రక్షించావు. కావున, నీయొక్క ప్రసాదరూపముగా ప్రాప్తించిన ఈ శరీరమును నీయొక్క సేవలో నీకే అర్పణచేసి దేహా-

వసాన పర్యంతము నీ సాన్నిధ్యములోనే ఉంటాను. నీకంటే నాకు మరెవరు దిక్కు, నీవే శరణ్యము. నా సర్వస్వము నీవే.

**శ్లో ॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।**

**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవదేవ ॥** (పాండవ గీత ౨౮)

ఈ రీతగా హనుమంతు త్రికరణశుద్ధిగా సద్గురువే సర్వస్వమని నమ్ముకుని ఎప్పుడైతే శరణు పొందినాడో,అప్పుడు వెంటనే సద్గురుసిద్ధనాథుడు తన ఆసనమునుండి లేచి, పాదాలపై పడియున్న హనుమంతుని తనయొక్క అమృతహస్తములతో పైకిలేపి హృదయపూర్వక ఆనందముతో ఆలింగనము చేసుకున్నాడు. మరియు స్వామి ఇలా అంటాడు. బాబూ! నీయొక్క అపూర్వమైన, నిర్మలమైన, నిష్కపటమైన ప్రేమవలన నన్ను నేనే మరచిపోయాను. నీలాంటి ప్రేమభక్తుడే నాకు ముఖ్యప్రీతి. అయినాగాని నాయందు ఎంతగా ప్రేమను చూపుతున్నావో, నాలాగే నీ తల్లిదండ్రులయెడ భక్తి శ్రద్ధ వినయములతో, వారి సేవచేస్తూ వారియందు నన్నే దర్శిస్తూ ఉండుము. సద్గురుదేవునియొక్క ఇట్టి కరుణాపూరిత వాక్యములను విని, తుక్కప్పకు దుఃఖము ఆగలేదు. సద్గురుదేవుని చరణాలపైపడి నయనాలనుండి ప్రేమాశ్రువులనురాల్చుతూ, స్వామియొక్క దర్శనముచేసుకుంటాడు.

అప్పుడు సద్గురుదేవుడు తుక్కప్పతో అంటాడు. పుత్రుడు మరణావస్థలోనున్నప్పటికి నీవు సద్గురుదేవుని ఆహ్వానించి, పూజించడానికి నిశ్చయించుకొని కార్యమును జరిపించడానికి పూనుకున్నావు. అందుకని నీవు భక్తులలో అగ్రగణ్యుడవు. సంతుమహాత్ముల శ్రేణిలో శిఖామణివి. సద్గురు దేవుని పాదాలపై పరిపూర్ణమైన ప్రేమగలిగియుండడమే భక్తునియొక్క నిజమైన భూషణము. దృఢవైరాగ్యముచేత ఎలాంటి కోలికలను ఇచ్ఛగించక, ఉపరతిగలిగియుండి సద్గురువే సర్వస్వమని భావించిన వాడే వాస్తవమైన కౌపీనధారి.

తదనంతరము తుక్కప్ప సద్గురుదేవుని పూజించుటకు పరదా(తెరను)అడ్డువేసి వైభవముగా అలంకరించాడు. అలంకరించిన పిమ్మట తెరను తొలగించినారు. సద్గురుదేవుడు మేఘమండలమందలి మెరుపువలె దేదీప్యమానస్వరూపుడై, చిన్మయస్వరూపుడై భక్తులందరికీ దర్శనమిచ్చాడు. శిరమునందు నవరత్నఖచితమైన కిరీటము, బంగారముతో చేయబడిన నాగుబాముపడగ దివ్యతేజముతో ప్రదీప్తుడై అద్భుతముగా విరాజమానమై ఉన్నాడు. వేయిసూర్యుల ప్రకాశము కంటె అధికముగా స్వామియొక్క ముఖము కాంతివంతమై ప్రకాశిస్తుంటే, భక్తులయొక్క నేత్రములు మిరుమిట్లు కొలుపుచుండెను. కంఠమున సర్పహారము, ఆపాదమస్తకమువరకు పుష్పభారములతో అలంకరించబడి, భుజములపై అనేక భూషణములు మొహరీలతో అమర్చబడి ఉండెను. వక్షస్థలమందు రత్నఖచితమైనపథకము,కంఠములో ముక్తాహారము,పాదములకు సువర్ణముతో చేయబడిన పాదుకలు మొదలుకొని అనేక భూషణములతో స్వామి శోభాయమానముగా ఆసీనుడై ఉన్నాడు. భక్తులు

జయజయకారాలు చేస్తూ, మంగళహారతులు పాడుతూ, పంచారతులు త్రిప్పుతూ ప్రేమపూర్వకముగా అర్చన గావిస్తున్నారు. హనుమంతు ఆనందముతో గంతులు వేస్తున్నాడు. అందరూ ఆశ్చర్యముతో విస్మయమొందినారు. సద్గురుదేవుని లీల చాలా అగాధమైనదని అనుకుంటారు. ఇట్లు, మహావైభ-వముగా పూజాదులు ముగిసిన పిమ్మట, తుక్కప్ప సద్గురుదేవుని చేయిపట్టుకొని భోజన ప్రసాద-ముగూర్చి తీసుకెళ్తాడు. భోజన మండపమందు భక్తులందరూ పంక్తులు పంక్తులుగా కూర్చున్నారు. ఆ పంక్తులమధ్య–తారలమధ్య చంద్రునివలె సద్గురుదేవుని కూర్చుండజేసినారు. ప్రసాదమును తీసుకొ-నుటకు భక్తులు స్వామి వద్దకు వస్తే వారికి సద్గురుదేవుడు స్వయముగా ప్రసాదమును వారి నోటిలో పెట్టుచుండెను. ఆనందముతో ప్రేమతో అందరూ సద్గురుదేవునితో సహా తృప్తిగా భుజించినారు. అందరూ భక్తులు భుజించిన తరువాత సద్గురుదేవుడు వాహనముపై కూర్చుండి ఆశ్రమమునకు వెళ్ళిపోయినాడు. ఈ ప్రకారముగా సద్గురుదేవుడు, భక్తులు ఎల్లప్పుడూ సుఖశాంతులతో ఉండునట్లు కోరుకునేవాడు.

ఓ శ్రోతలారా!ఇప్పుడు ఈ కథయొక్క వేదాంతరూప లక్ష్యార్థమును వినండి. సద్భావయుక్త-మైన తుక్కప్ప అనే జీవునికి సద్భక్తి అనే భార్య ఉంది. ఆ సద్భావసద్భక్తులకు జ్ఞాన పుత్రుడుదయించి-నాడు. ఇద్దరు దంపతులు కలిసి సంసారమనే జీవనయాత్ర చేస్తుండగా, జ్ఞానసుతుడు ఉదయించ కుండా ఆవరణమనే రోగము వచ్చింది. ఆ రోగనివృత్తి కలిగి జ్ఞానపుత్రుడు క్షేమముగా ఉండాలంటే సద్గురుదేవుని ఆశ్రయించాలని సద్భావయుక్త జీవుడు సద్భక్తి అనే భార్యను హెచ్చరిస్తాడు. కావున, ఏ జీవునియందు సద్గురుదేవునియెడల సద్భావము(పూజ్యభావము) ఉంటుందో, అచ్చట భక్తి ఉత్పన్నమై జీవునితో సహకరిస్తుంది. అదే ప్రకారముగా తుక్కప్ప భార్య సద్గురుదేవుని సేవకు అంగీకరించి సేవలో సహకరించింది. పూజ నిర్విఘ్నముగా చేయుటకు ఎప్పుడైతే సద్భావము సద్గురుదేవుని ఆశ్రయించినాడో, సద్గురుదేవుని ఆగమనముచేత జ్ఞానపుత్రునికి ఆవరించిన ఆవరణదోషరూప రోగము నివృత్తమై జ్ఞానపుత్రుడు సశక్తుడై (దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానము) కలిగి అంతటా సద్గురు స్వరూపాన్ని (వ్యాపకబ్రహ్మమునే) దర్శిస్తాడు. సిద్ధసద్గురు దయాసాగరుడు భక్తులయొక్క ఆర్తనాద-మును చెప్పకుండానే తెలుసుకుని సహకరించి సశక్తులను చేస్తాడు. ఆయనకు నిత్యము వారియొక్క చింతయే ఉంటుంది. అందువలన ఓ శ్రోతలారా!ఇప్పుడు ముందర అధ్యాయము చాలా రసవత్తర-ముగా ఉంటుంది. దానిని శ్రవణము చేసినట్లయితే భవబంధ నివృత్తి కలిగి స్వరూప జ్ఞానముదయి-స్తుంది. స్వస్తి శ్రీసద్గురుసిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రమున సకలపాపదోషములు భస్మీభూతము కాగలవు. శ్రీసద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు శ్రీశివదాసస్వామి ఈముప్పది ఎనిమిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు. ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ముప్పది తొమ్మిదవ అధ్యాయము

పద్యానువాదము:–హరిహరాదులు, మునులు సహితము యే స్వరూపాన్ని ధ్యానిస్తారో, దేవతలు దేనినైతే గుణగానము చేస్తూ కీర్తించెదరో, ఆర్తజనులు యే సద్గురుదేవుని ఆశ్రయించి తమతమ విషయవృత్తులను, విపత్తులను నివృత్తి చేసుకొని పరమశాంతిని పొందుతారో, అటువంటి శాంతమూర్తివగు సిద్ధరాయా! నీకు ప్రణామములు.

**యం బ్రహ్మావరుణేంద్రరుద్రమరుత స్తున్వన్తి దివ్యైస్తవైః,**
**వేదైస్సాంగపదక్రమోపనిషదైర్గాయన్తి యం సామగాః ।**
**ధ్యానావస్థితతద్గతేనమనసా పశ్యన్తి యం యోగినో,**
**యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః ॥** (శ్రీమద్భాగ.12-13-1)

మావులీ(తల్లి)స్వరూపుడవైన ఓ సద్గురుసిద్ధనాథా! భక్తులకు ఆశ్రయదాతవు.వారిపై కరుణ-బూని వారిని ఉద్ధరించు నిమిత్తము నీవు సగుణరూపము ధరించి అవతరించినావు. భక్తులకు ప్రేమ భిక్షను ప్రసాదించి బ్రహ్మానందమనే రసయుక్తమైన క్షీరమునొసంగినావు.దానినిసేవిస్తూ భక్తజనులు సంసారమనే దుఃఖమునువిస్మరించి బ్రహ్మానుభూతియందు సమరసులవుతారు.పరిపూర్ణమైన దయ గల ఓ సద్గురు దయాసాగరా! నిన్ను ఆశ్రయించినటువంటి భక్తులను స్వీకరించి వారికి ఆశ్రయమిచ్చి వారియొక్క భవబంధములు నివృత్తిచేసి జ్ఞానభిక్షను ప్రసాదించావు. స్పర్షవేది ఇనుమును సువర్ణ-ముగా మారుస్తుంది. కాని, ఆ సువర్ణము మరో ఇనుప ముక్కను సువర్ణముగా మార్చలేదు. కాని, సద్గురుదేవుడు స్పర్శవేది వలె కాదు. నీయొక్క శిష్యులను నీ స్వరూపులుగా చేసుకొని మళ్లీ వారు వారి ప్రశిష్యులను కూడా ఉద్ధరించి, బ్రహ్మస్వరూపులుగా మార్చుటకు నీవు సమర్థుడవు. సద్గురు దేవునికి సరైన ఉపమానము లేనందున సద్గురుదేవుడు నిరుపమస్వరూపుడు అంటారు. అందుకే, సద్గురుచరణాలనే దృఢముగా ఆశ్రయించాలి.

**దృష్టాంతో నైవ దృష్టస్త్రిభువనజఠరే సద్గురోర్జ్ఞానదాతుః,**
**స్పర్శశ్చేత్తత్ర కల్ప్యః స నయతి యదహో స్వర్ణతామశ్మసారమ్ ।**
**న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురుః స్వీయశిష్యే,**
**స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేన వాలౌకికోఽపి ॥** (శతశ్లోకి)

శ్రీ గురుదేవులకు సమమగు వస్తువుగాని, వ్యక్తిగాని ముల్లోకములలో గూడ లేదు (లేడు).శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు వారి"**శతశ్లోకి**"యను గ్రంథారంభమున సద్గురుదేవునియొక్క యోగ్యతను మరియు మాహాత్మ్యమును మొదటి శ్లోకము ద్వారా వర్ణించియున్నారు. ఎందుకనగా! "**యస్య దేవే పరా భక్తి**"(శ్వే.6-23)యెవరికి దేవునియందువలె గురువునందు పరమభక్తి గలదో, వారికే శ్రుత్యుక్త తత్త్వము ప్రకాశింపబడును. జ్ఞానదానము జేయు సద్గురువులకు సదృశముగా శోభించు దృష్టాంతము త్రిభువనములలో యెక్కడనూ దొరుకదు. వ్యావహారికమైన క్షుద్ర విద్యలను నేర్పించు గురువులకు యోగ్యమగు దృష్టాంతము కదాచిత్ యెక్కడైనా దొరుకవచ్చు. కాని "**నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే** "(గీత.4-38) జ్ఞానమునకు సదృశమైన(సమానమైన)పవిత్రమగు వస్తువు యీ జగత్తులో లేదు–అని శ్రీ కృష్ణ పరమాత్మ జ్ఞానముయొక్క పవిత్రతను చెప్పియున్నందున, అటువంటి పరమపవిత్ర జ్ఞానదానము జేయు శ్రీ గురుదేవులను పోల్చి చెప్పుటకు నానా చిత్ర విచిత్రమైన వస్తువులతో నిండియున్న త్రిభువనములలో ఒక్క దృష్టాంతముగూడ కన్పించదు. ఒకవేళ లోహము (ఇనుము)ను బంగారముగా మార్చగల్గు పరుసవేధిని సద్గురువులకు దృష్టాంతముగా చెప్పెదమన్నచో, అదియును సరిపడదు. కారణమేమనగా,స్పర్శవేది లోహమును పూర్వస్థాయి నుండి ఉచ్చ స్థాయికి అనగా సువర్ణముగా మార్చగలదేమోగాని, స్పర్శత్వమును మాత్రము ప్రసాదింపజాలదు. అనగా, తన వలె మరొక లోహమును పుత్తడిగా మార్చగల యోగ్యతను మాత్రము అనుగ్రహింపజాలదు. కాని, సద్గురుదేవుని చరణయుగళమును ఆశ్రయించి శ్రద్ధా భక్తిపురఃసరముగా సపర్యలుజేయు శిష్యుని అనుగ్రహించి తన స్వరూపునిగా మార్చి ధన్యుడిని జేయును. అందుకే, వివిధ విచిత్ర వస్తువులతో, దేవ తిర్యగాది ప్రాణులతో విలసిల్లు త్రిలోకములలోగూడ సద్గురుదేవులకు తుల్యమగు ఉపమానము దొరకదు. ఎట్లు లౌకిక దృష్టాంతము లేదో, అట్లే అలౌకిక (ప్రపంచాతీత)మగు దృష్టాంతముగూడ దొరుకదు.ఎందుకంటే,"**జ్ఞానీత్వాత్మైవ మే మతమ్**"(గీత.7-18),"**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి**"(ముం.3-2-9) ఇత్యాది ప్రమాణములచే జ్ఞానియగు సద్గురుదేవుడు సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడుగా ధృవీకరించబడినందున, అలౌకికమైన పరమాత్మకు సమానమైన అన్య వస్తువు లేదు. "**హేతు దృష్టాన్త వర్జితమ్**"(బ్ర.బిం.9). కావున, పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ గురుదేవులకు అలౌకిక దృష్టాంతముగూడ లేదు. సారాంశమేమనగా, సద్గురు సాంగత్యము లేనిదే, వారు ప్రసన్నులై అనుగ్రహించనిదే యే సాధకుడుగూడ కృతార్థుడు కాజాలడు. శ్రీ గురుదేవులకు శరణు వెళ్లకుండా, ఆశ్రయించిన పిమ్మట శిష్యుని అధికార విషయంలో గురువునకు నిశ్చయము కలుగనిదే, ఎప్పుడుగూడ తత్త్వోపదేశము చేయనెంచడు. (తలపెట్టడు, విచారించడు). కాని, శిష్యుని యోగ్యతను గుర్తించి ఒక్కసారి తత్త్వోపదేశము చేసినచో–అంతే..... శిష్యుని కళ్యాణమయ్యి తీరుతుంది. సందియము లేదు. అందువలన, గురూపసదనము (గురువునకు శరణు వెళ్ళుట), గురుసేవ, తద్వారా గురువును ప్రసన్నము జేసి

కొనుట–మరియు వారి ముఖారవిందమునుండి మహావాక్యమును శ్రవణముచేయుట మున్నగునవి పరమ పురుషార్థమునకు ఉత్కృష్ట సాధనములని గ్రహించవలెను.

"తాయీబాయి దాబోల్కర్"అను పేరుగల బొంబాయి(ముంబాపురము) వాస్తవ్యురాలగు సద్భక్తురాలు ఎల్లప్పుడూ సద్గురుదేవునిపై దృఢమైన భక్తిగలిగి అహోరాత్రులు సద్గురుదేవుని స్మరిస్తూ ఉండేది. ఒకనాడు ఆమె ఇంటికి ఒక సాధుపుంగవుడు వచ్చాడు. ఆయనకు అత్యంత ఆదరముతో ఆహ్వానించి సద్భావయుక్తురాలై సాధువునకు ఉన్నతాసనమునిచ్చి, నమస్కారములు చేసి తనయొక్క కొడుకులను, కోడళ్లను, మనుమలను, మనమరాండ్రను అందరిని సాధుదర్శనము చేయించింది. అప్పుడు ఆసాధువు ఈమెయొక్క భక్తిశ్రద్ధలనుగాంచి చాలా ఆనందించి–ఇలాఅంటాడు.అమ్మా!మీరు చాలా శ్రీమంతులైయుండి కూడా సాధుసత్పురుషులపై ఇంతటి భక్తి గలిగియుండడము మిక్కిలి అరుదు. ఇటువంటి సాధుప్రేమను చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యమనిపిస్తుంది. అయినాగాని నీకు ఒక విషయము చెబుతాను వినుము."**హుబ్లీ**" పట్టణములో శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి ఉన్నాడు. నాపైన జూపినటువంటి ప్రేమ ఒకవేళ మీరు ఆ స్వామిపై చూపినట్లయితే మీరు ధన్యులు కాగలరు. అటువంటి మహాత్ములు శుద్ధమైన పరమ పవిత్రమైన సద్గురుదేవునితో సమానులు. ఈ పృథ్విపై చాలా అరుదు. అసంఖ్యాకమైన భక్తజనులు ఆ సద్గురు సిద్ధనాథుని సాన్నిధ్యమునకు ఏతెంచి స్వామి యొక్క దర్శనభాగ్యమును పొంది, వారి వారి అభీష్టములను కోరి (అభ్యర్థించి) ఆయాఫలములను పొంది కృతకృత్యులౌతారు. సుఖశాంతులతో విరాజిల్లునటువంటి సద్గురుమూర్తియొక్క రూపము అత్యంత మనోహరము. అలాంటి సద్గురుదేవుని దర్శనమాత్రముననే తత్క్షణమే త్రివిధదుఃఖములు నివృత్తమగును. ఈవిధంగా సద్గురుదేవుని గుణగణములను వర్ణిస్తూ సాధువు 'తాయీ బాయి'కి సద్గురుసిద్ధనాథుని మనోహరమైన ముఖచిత్రమునొకదానిని ఇచ్చినాడు.ఆచిత్రమును దర్శించగానే తాయి భాయి ఎంతో ఆనందమునొంది ఇలా అంటుంది.

ఓ సాధువర్యా! నీవే మాకు నిజమైన సద్గురుదేవునివి. నీ కారణముననే మాకు యోగ్యమైన దేవుని జాడదొరికింది కావున, ఓ మహాత్మా! దయచేసి మమ్ములను కరుణించి ఆ సద్గురు సిద్ధా-రూఢస్వామివద్దకు తీసుకెళ్ళు–అని వేడుకుంటుంది. అప్పుడు ఆసాధువు అంటాడు. సరే,ఒకవేళ మీరు స్వామిని దర్శింపగోరినట్లయితే, ఎప్పుడు ఏ వేళ నిర్ణయించుకుంటారో చెప్పండి. నేను ఎప్పుడైనా సిద్ధమే. మీతో తప్పకుండా వస్తాను. అంతవరకు నేను ఉంటాను. తదనంతరము ఆ సాధువుగారికి పూజలు గావించి ఆశీర్వాదమును పొందినారు. సద్గురు సిద్ధారూఢస్వామి వద్దకు తెల్లవారున పోవుటకు నిశ్చయించుకున్నారు. తాయి బాయికి ఎప్పుడెప్పుడు సద్గురు సిద్ధనాథుని దర్శనమగునా –అని తహతహ ప్రారంభమైనది. ఆ రోజున ఒక వింత జరిగింది వినండి.

తాయీబాయి సాయంత్రము భోజనముచేసిన పిమ్మట నిద్రించుట కోసము పడకలో పడు-కుంది. హృదయములో స్వామిని ఎప్పుడు దర్శించుకుంటానో అను ఉబలాట ఉన్నది. ఎలాగో స్వామిని స్మరిస్తూ నిద్రించింది. వెంటనే స్వప్నములో ప్రత్యక్షరూపముగా సద్గురుదేవుడు స్వయముగా వారి ఇంటికి వచ్చినాడు. స్వామియొక్క హస్తమును పట్టుకొని ఇంట్లోకి తీసుకెళ్లి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి, ప్రణామములు చేసింది. సద్గురు సిద్ధనాథునియొక్క ముఖకమలము శోభాయమా-నముగా ప్రకాశించుచున్నది. సాధువుగారు స్వామిగూర్చి ఏవిధముగా వర్ణించియుండెనో,అదే ప్ర-కారముగా సద్గురునాథుడున్నాడు. సౌమ్యస్వరూపుడైన సద్గురుదేవుని పాదపద్మములను దర్శించు-కుని, అలాగే స్వామి పాదాలపైనే వ్రాలి ఉంది. అప్పుడు సద్గురుదేవుడు ఆమెను తన అమృతహస్త-ములతో పైకి లేపి ఆశీర్వదించినాడు. తర్వాత తాయిబాయి పూజ సామగ్రులు తెచ్చి విధిపూర్వక-ముగా సద్గురుదేవుని ప్రేమతో పూజించి, స్వామిని ఇలా కోరుకుంటుంది. ఓ సద్గురుదేవా నాదొక చిన్న విన్నపము. మీరు ప్రతినిత్యము ఇదే ప్రకారముగా మా ఇంటికివచ్చి దర్శనమివ్వండి.ఇంతకంటె మిమ్ములను వేరే ఏమీ కోరను. కావున, నాయొక్క ప్రార్థనను మన్నించండి. "తథాస్తు" అంటూ సద్గురుదేవుడు అంతర్ధానమైనాడు. తాయీబాయియొక్క ఆనందమునకు అంతులేక,ముల్లోకములలో పట్టకుండా ఉంది.

ప్రాతఃకాలముననే లేచి కొడుకులకు కోడండ్రను తనవారినందరిని పిలిచి స్వప్నవృత్తాంత-మును వినిపించింది. సద్గురుదేవుని మహిమ వర్ణనాతీతము అంటూ ఎంతో ఆనందించింది. తాయీ బాయికి భక్తి సద్గురుదేవునిపై ఇంకా ఉత్కటమైనది. అంతఃకరణమందు క్షణక్షణము సద్గురుదేవుని స్మరిస్తూ అత్యంత భక్తియుక్తురాలై, ఎప్పుడు సద్గురుదేవుని దర్శిస్తానో అని ఆరాటపడుచుండెను. అదేరోజు ప్రయాణ సన్నాహాలు సిద్ధముచేసుకుని సద్గురుదేవుని దర్శనార్థము హుబ్లీకి ప్రయాణమై పొగబండిలో కూర్చున్నారు. ఎంతెంత హుబ్లీ దగ్గర పడుతుంటే తాయీబాయికి అంతంత ఉబలాట ఎక్కువవుతుంది. ఈ విధముగా కొంత సమయానికి హుబ్లీ స్టేషన్ లో దిగి సిద్ధారూఢ మఠమునకు చేరుకున్నారు. సిద్ధసద్గురునాథుడు ఆ సమయములో ఆశ్రమములో లేడు. గత అధ్యాయములోని తుక్కప్ప గృహమున మండపమునందు స్వామి కూర్చుని కీర్తనలు జరిపిస్తున్నాడు.

తాయీబాయి మరియు తన కుటుంబసభ్యులు అందరూ కలిసి తుక్కప్ప ఇంటికి వచ్చినారు. ఎప్పుడైతే దూరమునుండి సద్గురుదేవుని దర్శనమైందో, తాయిబాయి ఆనందము పట్టలేక పరిగెత్తు-కుంటూ వచ్చి, సద్గురుదేవుని చరణకమలములపై వ్రాలి, పంచాంగ ప్రణామములు చేస్తూ అలాగే పడిఉంది. ప్రేమాశ్రువులు ఏకాధారగా కారుచున్నవి. అత్యద్భుతమైన ప్రేమచేత తాయీబాయి సద్గురు దేవుని ముఖకమలమును తదేకముగా వీక్షిస్తూ వీక్షిస్తూ అలాగే ఉండిపోయింది. ఎంత చూసినా తనివి తీరుట లేదు. మనసు నిండుటలేదు. తృప్తి కలుగుటలేదు. అలాగే సద్గురు స్వరూపాన్ని దర్శి-

స్తుంది. కాని, స్వామియొక్క దివ్యమైన ముఖమును ఇంకా చూడాలని ఆసక్తి కలిగి ఉన్నది. అప్పుడు స్వామి ఆమెయొక్క అపూర్వమైన ప్రేమ, భక్తిశ్రద్ధలను వీక్షించి, అమ్మా!ఏ ఊరినుండి వచ్చారు–అని అడిగాడు. స్వామియొక్క ముఖకమలమునుండి వెలువడిన శబ్దమును విని తన్మయత్వమును వీడి స్పృహకు వచ్చి బొంబాయి వాసులము. మీయొక్క దర్శనార్థము యేతెంచినాము–అని జవాబుచ్చెను.

నిన్నటి రాత్రి మీరు స్వప్నములో దర్శనమిచ్చితిరి. ఎప్పుడైతే మీరు నాకు స్వప్నములో దర్శనమిచ్చానారో, అప్పటినుండి మిమ్ములను ఎప్పుడెప్పుడు దర్శనముచేసుకోవాలనే ఉత్కట జిజ్ఞాసతో వెంటనే బయలుదేరి మీ సన్నిధికి చేరుకున్నాము. అప్పుడు స్వామికి తుక్కప్ప చేసినటువంటి పూజావిధానము సత్కారమును తాయీబాయి కన్నులారాచూసి చాలా సంతోషించింది. మరియు ఇలా అంటుంది–సద్గురుదేవుడు మమ్ములను పూజా సమయానికి తనవద్దకు రప్పించుకున్నాడు. మేము ధన్యులమైనాము. సద్గురుదేవుడు కరుణామయుడు–అని అంటుంది. తదనంతరము పూజ, భోజనాలు పూర్తైనమీదట సద్గురుదేవుడు తాయీబాయిని మరియు ఆమె కుటుంబసభ్యులను తీసుకొని ఆశ్రమమునకు వచ్చినాడు. అచ్చట సద్గురు సాన్నిధ్యములో కొంతకాలము ప్రశాంతముగా గడిపి తరువాత సద్గురుదేవుని ఆజ్ఞను గైకొని తిరిగి వారి స్వస్థానమగు ముంబాపురికి వెళ్ళిపోయినారు. అప్పటినుండి తాయీబాయి ప్రతి సంవత్సరము శివరాత్రి ఉత్సవమునకు తన కుటుంబముతో సహా వచ్చి ఉత్సవములో పాల్గొని సద్గురుదేవుని దర్శించుకొని, స్వామియొక్క ఆశీర్వాదమును బడసి మరియు స్వగ్రామమునకు వెళ్లిపోయేది. తాయీబాయి ఇది నియమముగా పెట్టుకుంది.

ఆమెకు ముగ్గురు పుత్రులుండిరి. రెండవ వాని పేరు ప్రభాకర్. ఆయనకు ఏడు సంవత్సరాల బాలిక "నళిని" అను పేరుగల అందమైన కుమార్తె ఉండెను. ఒకసారి తాయీబాయి ఉత్సవ నిమిత్తముగా సహకుటుంబముతో హుబ్లీకి వచ్చింది. హుబ్లీకి చేరుకున్న తర్వాత ఆమె మనమరాలు 'నళిని' విషమ జ్వరముతో పీడితురాలయ్యింది. మూడు రోజులవరకు జ్వరము క్రమముగా తీవ్ర రూపము దాల్చింది. మూడవ రోజు రాత్రి వరకు 'నళిని' ప్రాణాపాయ స్థితికి చేరుకుంది. తాయీబాయి ఆమె మనమరాలుకు ఎలాంటి ఔషధోపాచరములు చేయనివ్వడము లేదు. సర్వము సద్గురుదేవునిపై భారమువేసి కేవలము స్వామియొక్క పూజాతీర్థమును మాత్రము 'నళిని'కి అందించుచుండెను. కాని, జ్వరము తగ్గడం లేదు. బాలికయొక్క పరిస్థితి విషమించింది. జ్వరము తీవ్రమైంది. ఆ రాత్రి స్వామి నిద్రపోయి ఉంటాడు. కావున, స్వామివద్దకు పోయి, వారి పరిస్థితిని విన్నవించుకొనుటకు వీలులేదు. మాతృ హృదయము కావున, 'నళిని'యొక్క తల్లి, బిడ్డయొక్క పరిస్థితిని చూసి దుఃఖము పట్టలేక ఏడుస్తున్నది. ఇంకా ఆమె సద్గురుదేవుని ఇలా ప్రార్థిస్తుంది. దీననాథా! నా బిడ్డకు మరణ సమయమాసన్నమైనది. ఈ విషమ పరిస్థితుల్లో నిన్ను ఏ పగిది లేపుదును. నీవు సర్వాంతర్యామివి. అందరి హృదయాలలో వసించువాడవు. మాయొక్క ఆర్తనాదమును విని, నా బిడ్డను

రక్షించుము–అని వేడుకుంది. తాయీబాయి కూడా ఈ విధముగా స్వామిని ప్రార్థిస్తుంది. ఓ సద్గురు దేవా! నాయొక్క కొడుకులను, కోడండ్రను, మనుమలను, మనుమరాండ్రను అందరిని తీసుకొచ్చి నీ పాదాలచెంత పడవేశాను. ఇప్పుడు వారిని రక్షిస్తావో, భక్షిస్తావో నీ ఇష్టము. ఒకవేళ నా మనుమ-రాలును నీవు రక్షించక పోయితివా, నీ యొక్క ఆర్తరక్షకుడు, భక్తరక్షకుడనే బిరుదుకు కళంకము రాగలదు. ఇప్పుడు ఏమి చేస్తావో నీవే యోచించుము. మా సర్వభారము నీపైనే వేసి నిన్నే ఆశ్ర-యించినాము. ఇక నీ ఇష్టము అని వేడుకుంది.

ఇక్కడ సద్గురుదేవుడు ఆశ్రమములో నిద్రించియున్నాడు. ఎప్పుడైతే తాయీబాయియొక్క ఆర్తనాదము స్వామి ఆలకించాడో, దిగ్గున పడకనుండి లేచి, ఆతురతతో గడపడగా కాళ్లకు పాద రక్షలు వేసుకొని తత్క్షణమే వారి గది ముందు ప్రత్యక్షమైనాడు. స్వామియొక్క ఆగమనమును చూసి తాయీ బాయి స్వామికి నమస్కారములుచేసి ఇలా అంటుంది. ఓ సద్గురు సిద్ధనాథా! ఓ దయా సాగరా! మా ఈ సంకటముగూర్చి నీకెవరు తెలిపినారు? నిన్నెవరు లేపినారు? అప్పుడు స్వామి అంటాడు. మీయొక్క ఆర్తస్వరము నా చెవిలో పడింది. అందుకనే నేను తొందరగా లేచి వచ్చాను. అది సరేగాని, 'నళిని' ఎక్కడుంది? నాకు చూపించండి–అని అంటాడు.

అప్పుడు తాయీబాయి సద్గురుదేవుని హస్తమును పట్టుకొని 'నళిని' వద్దకు తీసుకెళ్లింది. తనయొక్క కృపాదృష్టితో 'నళిని'ని వీక్షించి భయపడకండి–అని అంటాడు. 'నళిని'కి ఏమీ భయము లేదు. ఈమె ఆరోగ్యము కుదుటపడుతుంది. మీరేమీ కంగారు పడకండి–అని సద్గురుదేవుడు అనగానే తాయీబాయి 'నళిని'ని స్వామి పాదదర్శనము చేయించింది. ఇంతలో సద్గురుసిద్ధనాథుడు వారికి ధైర్యము చెప్పి ఆశ్రమమునకు వెళ్లిపోయినాడు. 'నళిని' లేచి కూర్చుంది. జ్వరము తగ్గిపోయింది. ఆరోగ్యము కుదుటపడింది. తాయీబాయికి ఎంతో ఆనందము కలిగింది. ఈ రీతిగా సద్గురుదేవుడు, భక్తులయొక్క ఆపదలను తీర్చుటకోసము ఎల్లప్పుడూ సంసిద్ధుడై వారి సుఖమునే కోరి సంకటముల నుండి రక్షించి సుఖశాంతులను ప్రసాదిస్తాడు.

ఈ సంవత్సరము కార్తీక శుద్ధ చతుర్థి రోజున తాయీబాయిని చూడాలని హుబ్లీనుండి కొందరు భక్తులు ఆనందముతో ముంబాపురికి బయలుదేరి వెళ్ళినారు. బొంబాయికి చేరుకున్నాక వారికి అత్యాదరముతో తాయీబాయి ఉపచారములు చేసి తగు సదుపాయములను సమకూర్చింది. తదనంతరము స్వామియొక్క యోగక్షేమములను తెలుసుకొని ఎంతో సంతోషమును పొందింది. ఆ భక్తులద్వారా సద్గురుదేవునియొక్క గుణకథామహిమలను గురించి పరస్పరము ముచ్చటించుకుం-టూ అగణితమైన స్వామియొక్క లీలలను స్మరించుకుంటూ తాయీబాయి తన్మయత్వమును పొంది, దేహభానమును విస్మరించింది. భక్తులు స్వామియొక్క లీలలనుగూర్చి వర్ణిస్తూ ఉన్నారు.ఆమె తన్మ-యురాలై వింటుంది. ఇంతలో సద్గురుదేవుడు ఆమె ముందు ప్రత్యక్షమై ఆమెను పిలిచినట్లు అని-

పించింది. వెంటనే తాయీబాయి దిగ్గున లేచి స్వామి నన్ను పిలుస్తున్నాడు–అంటూ స్వామివద్దకు పోయింది. సద్గురుదేవుని నామామృతమును ఉచ్చరిస్తూ స్వామి పాదారవిందములపై వ్రాలి దర్శిస్తూ తన్మయురాలయింది. భక్తులందరూ ఈ సంఘటనను చూస్తూనే ఉన్నారు. ఆమెకు ఒక్క దానికి మాత్రమే స్వామి కనిపిస్తున్నాడు. వీరికి కనిపించడం లేదు. ఇంతలో ఒక వింత జరిగింది. తాయీ బాయి సద్గురుదేవునికి నమస్కరించినప్పుడే భక్తులందరికీ కానొచ్చింది–అంతే. ఇంతలో అకస్మాత్తుగా ఒక మెరుపు మెరిసింది. దివ్యమైన ప్రకాశము ప్రకటమైంది. కండ్లు మిరుమిట్లుగొల్పాయి. తాయీ బాయి ఆ ప్రకాశముచే ఆవరింపబడింది (అదృశ్యమైనది). కొన్ని క్షణాల పిమ్మట క్రమముగా ప్రకాశము నివృత్తమైనది. భక్తులందరికీ ఒక చమత్కారము కానొచ్చింది. అదేమనగా తాయీబాయి సద్గురు చరణాలను దర్శిస్తూ స్వామి పాదాలనాశ్రయించి సద్గురు నామోచ్చారణ చేస్తూ తనయొక్క అంతిమ యాత్రను సాగించింది(ప్రాణత్యాగము చేసింది). సద్గురు చరణాలను ఆశ్రయించినట్లుగా భావించి అంతిమదర్శనముచేస్తూ హఠాత్తుగా మృత్యువునుపొందినందుకు ఆమెయొక్క కొడుకులు, కోడళ్లు, పిల్లలు వగైరా బంధువులంతా శోకించినారు. ఏ భక్తులైతే తమ అవసానసమయములో సద్గురు నామామృతమును స్మరిస్తూ స్వామి చరణాలనాశ్రయించి దేహయాత్ర సాగిస్తారో, వారికి సద్గురుదేవుడు జనన మరణము లేని పదవిని ప్రాప్తము చేస్తాడు.

**శ్లో ॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్ ।**

**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥** (గీత 8-5)

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క వేదాంతరూప లక్ష్యార్థమును సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. దైవయోగముచేత తాయీబాయి అను సద్భక్తిగల జీవునికి సాధురూప సద్గురు దేవుడు అనాయాసముగా ప్రాప్తమవుతాడు. ఈ ప్రకారముగా ఏ జీవుడైతే సద్భక్తిచేత సద్గురుదేవుని ఆశ్రయిస్తాడో, సద్గురుదేవునికి శరణు వెళ్ళుతాడో ఆయనకు సద్గురుదేవుడు యథార్థమైన స్వరూప బోధను గావించి స్వప్నరూప (తాయీబాయికి స్వప్నములో సద్గురుదేవుడు దర్శనమిచ్చినట్లు) తురీ-యావస్థను ప్రాప్తింపజేసి స్వరూపానుభూతినికలుగజేస్తాడు.సద్గురుస్వరూపదర్శనము కలుగుతుంది. ఒకసారి సద్గురుకృపచేత స్వరూపానుభూతిని చవిచూచాడా, ఇక మళ్లీమళ్లీ ప్రతినిత్యము ఆ స్వరూ-పానుభూతినే పొందాలని ఉత్కటమైన ఇచ్ఛతో తహ తహ పడుతుంటాడు. దినదినము సాధన వృద్ధి చేసుకుంటూ ఉంటాడు. స్వరూపానందములోనే మునిగిపోవుటకు సద్భక్తిగల జీవుడు సద్గురుదేవుని ప్రార్థిస్తుంటాడు. సద్భక్తిచేత స్వస్వరూపాన్ని పొందాలనే తపనతో నిశ్చలమైన మనోరూప వాహనము (గాడీ)యందుకూర్చుని తీవ్రజిజ్ఞాసతో సాధన(ప్రయాణము)చేసినట్లయితే ఆత్మాకారవృత్తిరూప 'హుబ్లీ' ని చేరుకుంటాడు. ఆ ఆత్మాకారవృత్తియందు స్వప్రకాశమగు ఆత్మ (స్వరూపము) సహజముగా ప్రకట మవుతుంది. అట్లు ప్రాప్తించిన బ్రాహ్మీస్థితిలో ఆనందసామ్రాజ్యములో నిత్యతృప్తుడై రమిస్తాడు. ఎల్ల-

ప్పుడూ సద్భావయుక్త సద్భక్తిచేత జ్ఞానాన్ని పొందాలనే తీవ్రతర జిజ్ఞాసగల ముముక్షువుకు తప్ప-కుండా సద్గురుదేవుడు దర్శనమిచ్చి వారిని కనికరించి యథార్థమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

రెండవ కథయొక్క లక్ష్యార్థము:–'నళిని' అనే బాలికవలె జీవుడు తన యంతఃకరణమును నిష్కామకర్మ, నిష్కామ ఉపాసనలుచేసి శుద్ధము చేసుకున్న తర్వాత శమదమాదులను (జ్ఞానసాధ-నములను) సాధించే సమయములో మాయారూప విషయాసక్తి అనే విషమజ్వరము తగులుకొని పీడిస్తుంది. జనన మరణరూప సంసారములో పడవేయుటకు ప్రయత్నిస్తుంది. ప్రాణసంకటములో ఉన్నటువంటి సాధకుని వద్దకు సద్గురుదేవుడు పరిగెత్తుకుంటూ వచ్చి విషయాసక్తిని సమూలముగా నిర్మూలించి, శమదమాదులను వృద్ధిపరుచుటకు ప్రోత్సహించి జ్ఞానమును బోధించి శాంతిని సుఖమును ప్రసాదిస్తాడు. ఎవరైతే సద్గురుదేవుని, ఆత్మజ్ఞానమును పొందాలనే తీవ్రజిజ్ఞాసతో ఆశ్ర-యిస్తారో, శరణుబొందుతారో, వారికి ఆత్మానందమును స్వరూపజ్ఞానమును ప్రసాదించి భవసాగ-రమునుండి తరింప చేస్తాడు.

స్వస్తి శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకల పాపములు భస్మమై పోవును. శ్రీ సద్గురు సిద్ధరూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ముప్పది తొమ్మిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబదియవ అధ్యాయము

పద్యానువాదము:–ఏ జీవుడైతే జన్మమరణరూప సంసారభారముచే సంతప్తుడై దిక్కుమ్రొక్కు తెలియక పరితపిస్తాడో, ఆ జీవుడు చిత్తశుద్ధిచేత సద్భావయుక్తముగా సద్గురు నామాన్ని సర్వదా స్మరిస్తూ, సద్గురుదేవుడే సర్వస్వముగా భావించి ఆయనను ఆశ్రయించినట్లయితే, సద్గురుదేవుడు కరుణించి యథార్థమైన సద్బోధను(తత్త్వమును)ప్రేమచేత బోధించి సంసారంనుండి తరింపజేస్తాడు.

దయాసింధువైన ఓ సిద్ధసద్గురునాథా! సకల జీవులకు యథార్థముగా బ్రహ్మజ్ఞానమును బోధించి వారి అంతఃకరణమునందున్న అనర్థరూప దుఃఖమును నివృత్తిజేస్తావు. ఎప్పుడైతే నీయొక్క యథార్థతత్త్వమును శ్రద్ధాభక్తులచేత శ్రవణముచేసి "అహంబ్రహ్మాస్మి" అని నిశ్చయిస్తాడో, తత్క్షణమే విషయ విస్మృతిగలిగి హృదయమందు శుద్ధమైన అద్వైత స్థితిగలిగి నిరంజన పదవిని పొందుతాడు. ఎక్కడైతే పాదములు లేకున్నా నడిపిస్తాడో, నాలుక లేకున్నా మాట్లాడిస్తాడో, దృష్టి లేకున్నా చూపిస్తాడో (తెలియజేస్తాడో), చక్షురాదీంద్రియములు లేకున్నా ఆయా జ్ఞానము కలుగుచున్నదో, అటువంటి సద్గురుస్వరూపము (వ్యాపక పరబ్రహ్మము) సర్వత్ర తానేయై నిండినిభిడీకృతమై పిండబ్రహ్మాండములలో వ్యాపించి ఉన్నాడు. నిరపేక్షిక స్వయంప్రకాశుడై ఉన్నాడు. ఇటువంటి స్వరూపప్రాప్తి సద్గురు కృపలేనిదే కలుగదు. అందువలన స్వరూప ప్రాప్తిగురించి సద్భావయుక్తుడై సద్గురుదేవుని తప్పకుండా ఆశ్రయించాలి.

ఒకానొక విషయాసక్త (అజ్ఞాని) పురుషుడు స్వామిని ఇలా ప్రశ్నిస్తాడు.అయ్యా!మాకు శబ్దాది విషయాలలో సుఖము లభ్యమగుచుండగా, స్వరూప సుఖమెందుకు? దాంట్లో విశేషమేముంది?

అప్పుడు సద్గురుదేవుడు సమాధానమిస్తూ అవును, నాయనా!నీవు చెప్పినట్లుగానే విషయాలలో సుఖముంది. కాని, వివేకముచే కొంచము విచారించుము. విషయాలలో దొరికే సుఖము ఎక్కడిది? అది ఎట్లు లభించింది? దాని స్వరూపమేమిటి? సుఖమును కోరి విషయాలను ప్రీతితో అనుభవిస్తారు. ఆ విధముగా లభించే సుఖము అల్పసుఖము, సుఖము కాదు. ఒకే విషయము నీకు అనుకూలమైనప్పుడు సుఖమును, ప్రతికూలమైనప్పుడు దుఃఖమును ఇస్తుంది. ఒకవేళ విషయాల యందే సుఖమున్నట్లయితే ఒకప్పుడు దుఃఖమును మరొకప్పుడు సుఖమును ఇవ్వకూడదు. మరియు ఆ సుఖముగూడా ఆత్మ సుఖమే. ఎట్లా అంటావా? ఎప్పుడైతే విషయము ప్రాప్తించునో, అప్పుడు

ప్రియ, మోద, ప్రమోద వృత్తులద్వారా చిత్తము ఏకాగ్రతను పొందుతుంది. ఆ ఏకాగ్ర చిత్తవృత్తియందు ఆత్మయొక్క ప్రతిబింబసుఖమును అనుభవిస్తారు. కాని, వాస్తవముగా విషయాలలో సుఖము లేదు. సుఖమని అనిపించినప్పటికీ అది క్షణికసుఖమే. ఏ స్వరూపానంద సుఖమున్నదో అది యథార్థము, శాశ్వతము. దానిని పొందినట్లయితే విషయ సుఖముల యెడగల ప్రీతి నివృత్తమగును. దీనియొక్క ప్రాప్తిచేత దుఃఖము లేశమాత్రము కూడా లేకుండా నివృత్తి అవుతుంది, అదే నిజానందము. అనుభవములో చెప్పుకోవాలంటే సుషుప్తిలో అనుభవించే సుఖము నిర్విషయ సుఖమున్నది. కాని, అది ఆవృత సుఖము. ఎప్పుడైతే మనోవృత్తులు, తమకు కారణమైన 'అవిద్య'లో లయమవుతాయో, అచ్చట దుఃఖము లేశమాత్రముగూడా ఉండదు. అక్కడ తనకు తానే సాక్షిస్వరూపుడై ప్రకాశిస్తాడు. అదే తన నిజస్వరూపము. ఈప్రకారముగా యథార్థమైన ఆత్మానుభూతిని సద్గురుదేవుడు బోధించ-గా శిష్యబృందము ధన్యులమైనామని యథార్థమైన గమ్యమును చూపించినావని, స్వామియొక్క చరణాలకు ప్రణమిల్లినారు. ఈ విధముగా దయాసాగరుడైన సద్గురుదేవుని చరిత్ర కథను శ్రద్ధా భక్తులతో శ్రవణము చేసినటువంటి జడ (అజ్ఞాన) వృత్తిగల జీవులు చేతన స్వరూపులవుతారు.

శివరాత్రి ఉత్సవసందర్భముగా దూరదూర దేశములనుండి అనేకమంది భక్తులు శ్రద్ధాభక్తు-లతో ప్రతి ఏటా బండ్లపై వచ్చేవారు. ఒకానొక సమయములో శివరాత్రికి ఒక కుగ్రామము నుండి నాలుగు బండ్లు కట్టుకొని నలుగురు పురుషులు తమ స్త్రీలు, పిల్లలతో సహకుటుంబముగా హుబ్లీకి ప్రయాణమైనారు. స్త్రీలు రకరకాలైన తమ సువర్ణభూషణములను ధరించి ఎంతో ఆనందముతో సద్గురు నామస్మరణ చేస్తూ సద్గురు కథను కీర్తిస్తూ, బండ్లలో కూర్చుని ప్రయాణము చేస్తున్నారు.

ఇట్లు, ప్రయాణము చేస్తూ ఒక నిర్జన ప్రదేశమునకు చేరుకున్నారు.అచ్చట వారిలో నలుగురు పురుషులు (యజమానులు) తప్ప ఐదవపురుషుడు లేడు. దట్టమైన అరణ్యము. సాయంకాల సమ-యము. చీకటి పడింది. ఇటువంటి సమయములో అకస్మాత్తుగా దారిప్రక్కన ఉన్నటువంటి పొద-లలో నుండి భయంకరమైన అరుపులు అరుస్తూ ఇరువది నాలుగు మంది దారి దొంగలు బండ్ల వద్దకు వచ్చినారు. చేతులలో శస్త్రములు (ఖడ్గములు) పట్టుకొని వాటిని చేతులలో గిరగిర తిప్పుతూ పట్టండి! కొట్టండి! అని భయంకర ఘోషణలుచేస్తూ వచ్చి, బండ్లకు అడ్డముగా నిలిచినారు. స్త్రీల హృదయము కనిపించింది. బండ్లు నడిపే నలుగురు పురుషులను మొదట పట్టి సమీపములోగల చెట్లకు కట్టి బంధించినారు. బండ్లలో స్త్రీలు, బాలురు మాత్రమే ఉన్నారు. చోరులు స్త్రీలపైగల భూష-ణములను దొంగిలించుటకు బండ్లలో ప్రవేశించినారు.

ఈ దుస్థితిని గాంచి స్త్రీలు భయకంపితులై వెంటనే సద్గురు సిద్ధనాథుని ఆర్తనాదముచే ప్రార్థించారు.కొందరు స్త్రీలు తమయొక్క భూషణములను గబగబాతీసి దాచిపెట్టుచున్నారు. కొందరు తల్లులు తమ పిల్లలను అపహరించుకుపోతారేమోనని వారిపై గొంగళ్లు కప్పుచున్నారు. కొందరు

భీతిచేత రోధిస్తున్నారు. ఒకరంటారు అయ్యో ఇంతపని జరుగుతుందని తెలిస్తే నేను నా నగలను ఇంట్లోనే పెట్టివచ్చి ఉండేదానిని. కాని,ఎవరికి తెలుసు. మరియు విచారపరులైన కొందరంటారు. మనము సద్గురు కార్యముగూర్చి, స్వామి దర్శనార్థమై ఉత్సవమునకు వస్తున్నాము. ఆ సద్గురు దేవునిపై భారమేసి వస్తున్నాము. ఇప్పుడు ఏఅనర్థము అన్యాయము జరిగినా, అవమానము సద్గురు దేవునికే, కాని, మనకు కాదు. తనను ఆశ్రయించిన వారిని రక్షించే బాధ్యత ఆయనదే కదా! ఈ విధముగా సద్గురుదేవునిపై భారమువేసి ఇలా ఆర్తనాదముతో ప్రార్థిస్తున్నారు.

ఓ ఆర్తరక్షకా! భక్తవత్సలా! అనాథనాథా! నీవు తప్ప మాకు రక్షకులెవరు? తొందరగా వచ్చి మమ్ములను ఈ విపత్తునుండి రక్షించుము. ఒకవేళ నీవు ఉపేక్షించినట్లయితే ఇచ్చట మమ్ములను రక్షించువారెవరు? మా పురుషులను చెట్లకు కట్టివేసినారు. మేము నిస్సహాయులమైనాము. ఓ దీన దయాళా! నీవే రక్ష. నీవే శరణ్యము. కాపాడుము,కాపాడుము.నీ దర్శనార్థము అనేక భక్తులు వస్తుంటారు. అలాగే మేము కూడా నిన్నే నమ్ముకుని, నీవే సర్వస్వమని, నీ దర్శనము కోసము వస్తుంటే, మధ్యలో ఈ దారిదొంగలు మా భూషణములను దొంగిలించడమే కాకుండా మమ్ములను హతముచేయుటకుకూడా సిద్ధమైనారు. పసిపిల్లలతో యుక్తమైన అబలలము. కావున, ఓ ఆర్తరక్షకా! పరుగు పరుగున వచ్చి మమ్ములను తొందరగా రక్షింపుము. దొంగలయొక్క క్రూరరూపములు చూసి పిల్లలు భయపడుతున్నారు. చోరులు మా ప్రాణాలను తీస్తామంటున్నారు. దయచేసి రక్షించు స్వామీ! ఓ భక్తపాలకా! కరుణాకరా! పాహి, పాహి–అంటూ రోధిస్తున్నారు. మరియు ఇలా అంటున్నారు. ఓ సద్గురుదేవా! ఒకవేళ నీవు మమ్ములను ఈ సంకటమునుండి రక్షించినచో, మా జీవితాంతము నీ సేవచేస్తూ,నీ మహిమలను వర్ణిస్తూ,నీ స్మరణచేస్తూ ఈశరీరమును నీకే అర్పిస్తాము. నిన్నే ఆశ్రయించుకొని ఉంటాము. ఈ ప్రకారముగా ఆర్తనాదము చేస్తూ స్వామిని రకరకాలుగా ప్రార్థిస్తూ, పిల్లలను తమ హృదయాలకు హత్తుకొని భయపడుచుండిరి.

వీరియొక్క ఆక్రోశమును సద్గురుదేవుడు ఆలకించాడు.తత్క్షణమే వర్షాకాలమేఘము గర్జించినట్లుగా ఒక భయంకరమైన శబ్దము వినిపించింది అందరూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. ఆ సమయములో చోరులు బండ్లలో ప్రవేశించి స్త్రీలను క్రిందికి లాగుతూ ఆభూషణములను ఇవ్వమని బెదిరిస్తున్నారు.ఈవిధముగా కామాంధులైన చోరులు వారి ప్రయత్నములో లగ్నమైఉన్నారు.ఇంతలో ఈ భయంకరమైన శబ్దము వినిపించగా భయకంపితులై తూర్పు దిశవైపు చూసినారు. వారిముందు ఒక గొప్ప వికృతరూపము (ఉగ్రరూపము) కానొచ్చింది. తాటిచెట్టువలె ఎత్తుగాఉంది. వృక్షశాఖల వలె వెంట్రుకలు, కండ్లు సూర్యునివలె ప్రకాశిస్తున్నాయి. అతితీక్షణమైన పండ్లకోరలతో కూడిన ముఖము, రక్తవర్ణము లోనున్న నాలుకనుగలిగి ఇప్పుడే మమ్ములను మింగుదును–అన్నట్లు పొడవుగా చాచింది. వాడియైన ఖడ్గమువలె గోర్లుగలిగి, తేజోవంతముగా భీకరమైన ఆకృతిగల

శరీరము కనిపించింది. అద్భుతమైన ఆ భీకరాకారమును చూసి ఇది నిజముగా రాక్షసి ఉన్నట్లుంది. మనలను మింగుటకు వస్తుంది–అని చోరులు భయపడినారు.

ఎప్పుడైతే బండ్లలో ఉన్నటువంటి స్త్రీలు అటువైపు చూసినారో, వారికి సిద్ధసద్గురుదేవునివలె సౌమ్యముగా ప్రశాంతముగా దర్శనమిచ్చినాడు. కాని, విగ్రహము(ఆకారము) మాత్రము చాలా ఎత్తుగా ఉంది. సద్గురుదేవుని సౌమ్యమూర్తిని ఎప్పుడైతే స్త్రీలు దర్శించినారో, వచ్చాడు... వచ్చాడు... సద్గురుదేవుడు మనలను రక్షించడానికి వచ్చాడు... అంటూ ధైర్యముజెందినారు. చోరులకు అదే రూపము భయంకరముగా గోచరిస్తుంది. చోరులు భయకంపితులై వణుకుచున్నారు. చేతులలో నుండి శస్త్రములు క్రింద పడిపోయినవి. అందరూ అధైర్యమునుజెంది నిశ్చేష్టులై ఆశ్చర్యమును పొంది నారు. కాళ్లు, చేతులు గజగజ వణుకుతున్నవి. ఈ రాక్షసినుండి తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించారు. కాని, కాళ్లు కదలడము లేదు.కాళ్లు కంపిస్తున్నాయి.అప్పుడు ఆ తేజోవంతమైన మహాప్రతాప ఉగ్రరూపము మెల్లమెల్లగా అతికోపముతో వారి వద్దకు వచ్చింది. ఇద్దరు దొంగలు మాత్రము లెక్కచేయకుండానే బండ్లలోకి దూసుకెళ్లి భూషణములను దొంగిలించుటకు ప్రయత్ని-స్తున్నారు. వారిద్దరిని ఒకటిగా కట్టగట్టి ఉగ్రరూపుడైన సద్గురుదేవుడు ఒక చెట్టుపైకి విసిరివేసినాడు. వారు అక్కడే వ్రేలాడబడినారు. ఈ భయంకరమైన కృత్యమును చోరులందరూ కండ్లారా చూసి, గుండె అదిరి ఇక మనము బ్రతికే ప్రసక్తి లేదని, వెంటనే వారి ఇష్టదేవతయైన భద్రకాళిని రక్షించు తల్లీ! అని ప్రార్థించారు. ఓ తల్లీ! ఒకవేళ మమ్ములను ఈ భూతమునుండి రక్షించినట్లయితే నీకు గొప్ప గుడి కట్టిస్తాము. నిన్నే భజిస్తాము. నీకు ఎల్లప్పుడూ పూజలు గావిస్తాము. ఓ భద్రకాళి మాతా! తొందరగా మమ్ములను ఈరాక్షసి భారినుండి రక్షింపుము. అలా రక్షించినట్లయితే గొప్పగా ఉత్సవ-ములు గావించి నీ పూజలు చేయించి మా జీవితాంతము నీ సేవచేస్తూ ఈ శరీరమును నీకే అర్పి-స్తాము–అని ఆ చోరులు భద్రకాళిని వేడుకుంటారు.

అప్పుడు వీరి ప్రార్థనలను విని ఆ ఉగ్రరూపము ఈ దొంగలను సమీపించి ఒరేయ్! మీరు భద్రకాళిని ప్రార్థిస్తున్నారు కదూ! ఒక్కసారి తిరిగిచూడండి. ఆభద్రకాళి నా వెనుకనే ఉంది,చూడండి! అప్పుడు ఆ భద్రకాళి చోరులతో ఇలా అంటుంది. మీరు సద్గురుభక్తులను పీడించుటకు వెనుకాడ-కుండా ఉద్యుక్తులైనారు. నేనెట్లు రక్షించాలి? రక్షించడానికి నాకు అవకాశము లేకుండా చేసినారు. రక్షింపబడే అధికారమును కోల్పోయినారు. ఎందుకనగా మీకును నాకును సకలచరాచర ప్రపంచ-మునకు అధిష్ఠానమును, ఆధారము ఆసద్గురుదేవుడే ఉన్నాడు.అలాంటివాని భక్తులను మీరు పీడిం-చినారు. కావున, మిమ్ములను నేను క్షమించను. రక్షించను. ఆ సద్గురు శక్తి (సత్తు) చేతనే సకల భూతములు మరియు ఈ సృష్టి నడపబడుచున్నది. సర్వభూతములలో ఆయనే వసించియున్నాడు. సర్వము తానేయై ఉన్నాడు. ఆయనకు వ్యతిరిక్తమైనది మరొకటి లేదు. అటువంటి జగదీశ్వరుని

భక్తులు, ఆయన సన్నిధానమునకు వెళ్ళుచుంటే, మీరు దారిలో వారిని నిర్దాక్షిణ్యముగా హింసించడానికి పూనుకున్నారు. కావున, మీరు రక్షింపబడుటకు యోగ్యులు కారు. నాకు కూడా రక్షించే అర్హత లేదు. కాని, మీరు రక్షింపబడాలంటే ఒక చక్కని ఉపాయమును చెబుతాను వినండి. మీరు అందరూ కలిసి **హుబ్లీ** పట్టణమునకు వెళ్లి సద్గురు సిద్ధారూఢస్వామిని శరణుజొచ్చి రక్షింపమని ప్రార్థించండి. ఒకవేళ మీరు పరిపూర్ణభావముతో స్వామికి శరణు వెళ్ళక పోయితిరా–ఈ భూతము మిమ్ములను వదలదు-అని భద్రకాళి చోరులను ఆజ్ఞాపించింది. ఇదంతా విన్న తరువాత చోరులు వెనక్కి తిరిగి చూశారు. భీకరస్వరూపమైన ఆ రాక్షసి నోరు తెరుచుకొని సిద్ధముగా ఉంది. ఇక గత్యంతరము లేదంటూ ఆ తస్కరులు నిశ్చయించుకుని, సిద్ధాశ్రమమువైపు పరుగెత్తసాగినారు.అంత వరకు కాళ్లు చేతులు వణుకుబుట్టి అశక్తులైనవారు, ఎప్పుడైతే ఆశ్రమమువైపు పరుగెత్త సాగినారో, వారిలో మళ్లీ బలము శక్తి వచ్చేసింది. ఇలా కొంతదూరము పరుగెత్తి, ఆ రాక్షసి ఏమైందో అని కొంచెము ఇలా తిరిగి చూశారు. రాక్షసి అక్కడే ప్రత్యక్షమైంది ఆఁ...పదండి! లేదా మిమ్మల్ని మ్రింగుతాను–అంటుంది. ఇక తప్పించుకోవడానికి వీలులేదని నేరుగా సిద్ధాశ్రమము వరకు పరిగెత్తు కుంటూ వెళ్ళి, సద్గురు సన్నిధానమును చేరుకున్నారు.

ఆ దొంగలు, ప్రశాంతస్వరూపుడైన సద్గురుదేవుని ఎప్పుడైతే దూరమునుండి దర్శించినారో, వారికి మునుపటికంటె ఎక్కువగా కాళ్ళు వణుకుతున్నాయి. ఎందుకంటె, వారిలో ఒక సంశయము వచ్చేసింది. కొద్ది సమయము క్రితము మనకు కనుపించిన ఆ రాక్షసి అక్కడేమో భీకరస్వరూపమును చూపించింది. ఇక్కడ ఆ రాక్షసియే సౌమ్యరూపమును ప్రదర్శిస్తుంది. ప్రశాంతరూపమును ప్రదర్శించి మనలను మింగునేమో–అని ఈవిధముగా సంశయించి భయపడి తప్పించుకొని పారిపోవుటకు వెనక్కి తిరిగినారు. భీకరస్వరూప ఆ రాక్షసి వారి ఎదుట సిద్ధముగా ఉంది. ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లు వారికి ఎటు దోచడము లేదు. ఇక సద్గురుదేవునికి శరణువెళ్ళక తప్పదని నిశ్చయించుకున్నారు.లేనిచో ఈ రాక్షసి మనలను వదలదని అనుకొని, అప్పుడు మళ్లీ సద్గురుదేవుని వద్దకువెళ్లి చరణకమలములపై దండవత్తుగాపడి, ఓసద్గురుదేవా!మమ్ములను క్షమించి రక్షించుము. మేము మొహవశమున నీ భక్తులను హింసించినాము. ఈభూతము మా వెంటపడి మ్రింగుతానంటుంది. కావున, కరుణించి మా తప్పులు మన్నించి, భూత బారినుండి రక్షించమని క్షమాపణ వేడు కుంటారు.

అప్పుడు దయాసాగరుడైన సద్గురుదేవుడు వారితో ఇలా చెబుతాడు. భయపడకండి, భీతిని వదలండి. మీయొక్క దుష్కర్మలే ఈ విధముగా మిమ్ములను పీడించాయి. మీ పాపములు ఇప్పటికీ నివృత్తమైనవి. ఇకమీదట మీ చోరవృత్తిని మాని, బుద్ధితో స్వధర్మాచారపరులై ఎవరిని పీడించక ధర్మయుక్తులై శేషజీవితమును గడపండి. ధర్మాచరణమువలన మాయా భ్రమరూప కామక్రోధాదులు

నివృత్తమై ధన్యులుకాగలరు. ఈప్రకారమైన కరుణాభరిత ఆశీర్వచనములను విని,ఆదొంగలు సద్గురుదేవునితో ఇలా వేడుకుంటారు. ఓసద్గురుదేవా! నీవు మమ్ములను పాపకూపమునుండి రక్షించినావు–అంటూ పదేపదే అత్యంత భక్తియుక్తులై పశ్చాత్తాప హృదయముతో వేడుకుంటారు.

ఈవిధముగా ఒకసారి సద్గురుదేవుని చరణాలయందు మస్తకమునుంచినచో (ఆశ్రయించినచో)మహాపాపాత్ములైనాగాని వారి దుష్టగుణములన్ని అనాయాసముగా నివృత్తమై రక్షింపబడతారు. ఆ రోజునుండి ఆ దొంగలందరూ చోరవృత్తినివీడి సద్గురుదేవునిపై దృఢభక్తిగలిగి అతిప్రేమతో సద్గురు దేవుని సేవచేస్తూ బాటసారులకు సహాయపడుతూ జీవితమును ధన్యప్రదము చేసుకున్నారు.

ఇక్కడ దొంగలు బండ్లను విడిచి హుబ్లీ వైపు వెళ్లిపోయినది గాంచి బండ్లలోని స్త్రీలు అత్యంత ఆనందమునొంది సద్గురుదేవుని ఇలా స్తుతి చేస్తున్నారు. ఓ సద్గురు సిద్ధరాయా! నీవు మాయొక్క ఆర్తనాదమును విని తొందరగావచ్చి దుస్తరమైన సంకటమునుండి రక్షించావు.నీయొక్క మహిమను కీర్తిని ఏమని వర్ణించగలము. అనేకమంది భక్తులను రకరకములైన ఆపదలనుండి రక్షించావు. దుష్టులైన దొంగలనుండి మమ్ములను సురక్షితముగా రక్షించి,ఆర్తరక్షకుడవనే బిరుదును సార్థకము చేసుకున్నావు. నీ కీర్తి దశదిశలు వ్యాపించింది.

దొంగలచే చెట్లకు బంధింపబడినటువంటి వారివారి భర్తలను స్త్రీలు కట్లువిప్పి ముక్తులను చేసినారు. అందరూ కలిసి సురక్షితముగా హుబ్లీకి వచ్చి సిద్ధాశ్రమమునకు చేరుకొని సద్గురు సిద్ధనాథుని దర్శనము చేసుకొని వారియొక్క వృత్తాంతమును వివరిస్తూ, ఓ సద్గురుదేవా! ఆపదలో చిక్కుకున్న మమ్ములను రక్షించడానికి అద్భుతమైన రూపమును ధరించి ఎంతో శ్రమ తీసుకున్నావు.

అప్పుడు సద్గురుదేవుడు వారియొక్క వచనములనువిని తనయొక్క మృదుమధురమైన అమృత వాక్కులతో ఇలా అంటాడు. మీయొక్క యథార్థమైన సద్భావయుక్త ఆర్తనాదమే, సద్గురుదేవుడు ఆ రూపములో ప్రకటము కావడానికి కారణమైనది. దీనియందు నాదేమీ శ్రమ లేదు. ఇటు చూడండి! మీయొక్క సంబంధముద్వారా దుష్టులైన ఈ దొంగలు వారి దుష్టస్వభావమును మార్చుకొని చోరత్వమును వీడి సద్గురుదేవుని కృపకు పాత్రులై, సద్గురుదేవుని సేవలో నిమగ్నులై ధన్యులైనారు. సద్గురుదేవునియొక్క లీలలు, మహిమలు అత్యద్భుతము, అపారములు–అని స్వామి అంటాడు.

ఈ రీతిగా జరిగిన వృత్తాంతమంతా ఆలకించి భక్తులందరూ సద్గురుదేవునియొక్క మహిమ అపారమని, ఏ పగిదిగూడా వర్ణింప శక్యముకానిదంటూ జయజయకారములు చేసినారు.

ఇప్పుడు కథయొక్క లక్ష్యార్థమును సావధానముగా వినండి. జీవుడు ప్రత్యగాత్మను దర్శించాలని సాధనచతుష్టయము నాశ్రయించి మనోరూప బండ్లయందు పయనిస్తుంటాడు. సాధన చతుష్టయమును (నలుగురు పురుషులను)ఆశ్రయించి స్త్రీరూప జీవులు పారమార్థిక మార్గములో పయనిస్తుండగా, 24 తత్త్వములతో తయారుజేయబడిన ఈ స్థూలదేహాభిమానమనే 24 దొంగలు (24

తత్త్వములు) స్వరూపప్రాప్తి కలుగకుండా ప్రతిబంధకమును కలుగజేసి నలుగురుపురుషులను(సాధన చతుష్టయమును) సంసారరూప వృక్షములకు బంధించినారు.

**మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త ।**

**షోడషకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః ॥** (సాంఖ్యకారికా 3)

మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు 5, పంచమహాభూతములు 5, మనస్సుతో సహితము పదినొకండు ఇంద్రియములు–ఇవి 24 తత్త్వములు. ప్రత్యగాత్మ పురుషుడు.

అప్పుడు జీవులనే స్త్రీలు దుఃఖమునుబొంది అనర్థముగలిగినదని గుర్తించి అర్తనాదముచే సద్గురుదేవుని వేడుకుంటారు. సద్భావయుక్తమైన జీవుని మొరనాలకించి సద్గురుదేవుడు ప్రకటమైనాడు. ఎప్పుడైతే జీవుడు సద్గురురూప ఆత్మయొక్క అనుభూతిని పొందినాడో, అప్పుడు చోరరూప 24 తత్త్వములు నావి కాదు, నేను కాదు. నేను వాటికి ద్రష్టనైఉన్నానని తెలుసుకొని,దుఃఖరాహిత్యమును పొందుతాడు. 24 తత్త్వములు నిరసింపబడతాయి. దేహాభిమానము నివృత్తి కాగలదు. భవ దుఃఖము నివృత్తి కాగలదు. 24 తత్త్వములు(దొంగలు) ప్రకృతిరూప భద్రకాళిని ప్రార్థించారు. 24 తత్త్వములు ఆత్మజ్ఞానముచే, వాటి వినాశమునుండి రక్షింపమని వేడుకుంటాయి. కాని, ఆ ప్రకృతి రూప భద్రకాళి వాటిని రక్షించలేక పోయింది. ఎందుకంటె, చేతన సత్తచేతనే ప్రకృతికి అస్తిత్వముంది. ప్రకృతికి అధిష్టానము చైతన్యమే. ఆ ప్రకృతియే స్వయముగా పరతంత్రమై చేతనమును ఆశ్రయించుకొని ఉన్నదనినచో, 24 తత్త్వములను ఎలా రక్షించగలదు? అప్పుడు ప్రకృతిరూప భద్రకాళి ఆ తత్త్వములతో ఇలా చెప్తుంది. మీరు సగుణబ్రహ్మస్వరూపుడైన సిద్ధసద్గురుదేవుని శరణజొచ్చి మీ భయమును వీడి సుఖముగా ఉండండి. 24 తత్త్వములు సగుణబ్రహ్మను ఆశ్రయించి ఈశ్వరకృపను బడసి, వ్యాపకస్వరూపమును అనగా అస్తి, భాతి, ప్రియ రూపసామాన్యచైతన్యమును (నిర్గుణ బ్రహ్మమును) సర్వత్రదర్శించి నిర్భయస్థితిని పొందును.ఈవిధముగా 24 తత్త్వములబుద్ధి (దేహబుద్ధి) నిరసించిన పిదప సాధన చతుష్టయము దృఢమై నిర్విఘ్నముగా ప్రత్యగాత్మను జీవుడు పొందగలుగుతాడు. ఎప్పుడైతే యథార్థముగా ప్రత్యగాత్మ దర్శనమైందో 24తత్త్వములతో యుక్తమైన ఈస్థూల శరీరముచేత (జీవ-శివైక్యమునొంది) జీవన్ముక్త విలక్షణానందమును అనుభవిస్తాడు.

**శ్లో ॥ నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః ।**

**యే మందాస్తేఽనుకంప్యన్తే సవిశేషనిరూపణైః ॥**

**శ్లో ॥ వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్ ।**

**తదేవావిర్భవేత్సాక్షాదపేతోపాధికల్పనమ్ ॥** (బ్రహ్మసూత్రము 1-1-20 వేదాంతకల్పతరువు)

సగుణబ్రహ్మోపాసనగూడ చిత్తైకాగ్రతద్వారా నిర్విశేష(నిర్గుణ)బ్రహ్మసాక్షాత్కారమునకు కారణమగును. కల్పతరుకారులంటారు–నిర్విశేషబ్రహ్మసాక్షాత్కారమునకు అసమర్థులగు యే మందప్ర-

జ్ఞులు ఉన్నారో, వారికొఱకు శ్రుతిమాత గొప్ప అనుకంప(దయ)చేత సవిశేష(సగుణ)బ్రహ్మ నిరూ-పణమును (ఉపాసనను) చెప్పింది. సగుణబ్రహ్మోపాసనద్వారా మనస్సు వశమైనపుడు, సర్వోపాధి రహిత ఆ నిర్విశేషబ్రహ్మసాక్షత్కారము అనుభూతమగును.

సచ్చిదానందస్వరూపుడైన సద్గురుదేవుడు సకలభూతములయందు కరుణగలిగి స్వయముగా జీవభావమును పొంది, అజ్ఞజీవులను భవసాగరమునుండి తరింపజేయుటకు అవతరించినాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకలపాపములు భస్మము కాగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణాంబుజములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబదియవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ౘ శ్రీ గణేశాయ నమః ౘ శ్రీ గురుభ్యోనమః ౘ శ్రీ సరస్వత్యై నమః

# నలుబది ఒకటవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సిద్ధారూఢ సద్గురుదేవా! నీవే తల్లివి, తండ్రివి. నీయొక్క నామామృత స్మరణచే సకలపాపములు హరించిపోవును. కావున, ఎల్లప్పుడు నీయొక్క దివ్యపాదారవిందము లందు నా మనస్సు ఉండులాగున నన్ను ఆశీర్వదించుము స్వామీ!

నీవే తల్లివి దండ్రివి నీవే నా తోడు నీడ నీవే సఖుడౌ ।

నీవే గురుడవు దైవము నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! ॥

ఓ సిద్ధారూఢ భగవంతా! సకలజీవులపైన నీయొక్క కృపాదృష్టిని ప్రసరించి, కేవలము నీ యొక్క నామామృత స్మరణ మాత్రముననే సాక్షాత్కరించి ధన్యులను చేయగలవు.

భగవంతుడనే పదమునకు అర్థము:—

**శ్లో ॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః ।**

**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥** (వి.పు.6-5-74)

**శ్లో ॥ ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిమ్ ।**

**వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥** (వి.పు.6-5-78 )

సంపూర్ణ ఐశ్వర్యము (అణిమా, లఘిమా, మహిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ–ఇవి అష్టైశ్వర్యములు), ధర్మము, యశస్సు, శ్రీ, జ్ఞానము మరియు వైరాగ్యము–ఈ ఆరింటికి భగము అంటారు. ఈ భగము గలవాడు భగవంతుడు. జీవులయొక్క ఉత్పత్తి వినాశములను, గమనాగమనములను మరియు విద్య అవిద్యలను ఎవరు తెలిసికొందురో, అతనిని భగవంతుడందురు.

ఈ కలియుగ జీవులకు కేవలము నీయొక్క దివ్యనామమే పరమసాధనము. దానిని విడిచి మిగతా సాధనలు (యోగ, ప్రాణాయామాదులు) అనర్థమును కలుగజేయగలవు.

**శ్లో ॥ గురోర్నామ గురోర్నామ గురోర్నామైవ కేవలమ్ ।**

**కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥**

ఒకవేళ నామస్మరణమును వీడి యోగసాధనలచే తరిస్తానని యోగసిద్ధులు పొందాలనే ప్రయత్నములో గురువును అన్వేషించుటలోనే కాలము సరిపోతుంది. ఉన్న కాస్త ఆయువు దుర్విని-యోగమవుతుంది. ఎంతో ప్రయాసతో గురువును పొంది సాధనలుచేసి యోగసిద్ధిని బడిసేవరకు

శరీరము ఉండదు. యోగమును నేర్పే గురువును ఎక్కడ వెదకాలి, అని తనకు తానే అభ్యాసము చేయాలనుకుంటే యోగము రోగముగా మారి మరణాంతకమునకు గురి అయ్యి భ్రష్టుడు కాగలడు. ఒకవేళ అధిక ప్రయాసచేత యోగమును సాధించినప్పటికైనా బ్రహ్మజ్ఞానము మాత్రము కలుగదు. కేవలము విచారము చేతనే బ్రహ్మ జ్ఞానము కలుగగలదు.

**శ్లో ॥ అవిచారకృతో బన్ధో విచారేణ నివర్తతే ।**

**తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్ ॥** (వే.పం. 10-5 )

కావున, విచారముద్వారా ఏ ఫలము (మోక్షము)లభిస్తుందో అది సద్గురువు లేనిదే కలగదు. అటువంటి శ్రోత్రియ బ్రహ్మనిష్ఠగురువు నాశ్రయించినట్లయితే ఈ శరీరమున్నప్పడే జీవన్ముక్తుడు కాగలడని శ్రుతులు తెలుపుతున్నాయి.

**శ్లో ॥ గురుశాస్త్రోక్తమార్గేణ స్వానుభూత్యా చ చిద్ఘనే ।**

**బ్రహ్మైవాహమితి జ్ఞాత్వా వీతశోకో భవేన్మునిః ॥** (మహోపనిషత్ 2-25)

**శ్రుతి:–తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ శ్రోత్రియంబ్రహ్మనిష్ఠంసమిత్పాణిః ।** (ముం.1-2-12)

ఒకవేళ వేదాంత విచారానికి అనుకూల సమయము లేకుంటే నామస్మరణచేత క్రమముక్తిని పొందవచ్చును. ఇదిగాక వేరే మార్గములేదు. నామస్మరణచే జీవుడు భవసాగరమునుండి సుల-భముగా తరించగలడు. దానిని విస్మరించినట్లయితే బంధమునకు గురికాగలడు. నామస్మరణను విడిచి ఇతర సాధనలు దుఃఖహేతువులు. అందుకే,ఏ భక్తుడైతే నామమును ఆశ్రయిస్తాడో, ఆయనకు కాలుని (మృత్యువు)యొక్క భయముండదు. సద్గురుదేవుడు ఏ నామము ఉపదేశించి ఆజ్ఞాపిస్తాడో, ఆ నామాదిష్ఠానదేవత(నామి) ప్రసన్నుడై కృపను ప్రసాదిస్తాడు. ఈశ్వరకృప, గురుకృప ఎప్పుడైతే ప్రాప్తమౌతుందో, అప్పుడు జీవుడు తప్పకుండా తరించబడతాడు.అందుకే, సద్గురుదేవుని విధిపూ-ర్వకముగా ఆశ్రయించి, అతని కృపకు పాత్రుడు కావలెను. నామోపదేశమును పొంది జపిస్తూ ఉండవలెను.

**శ్లో ॥ అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతే మే శరణం కిమస్తి ।**

**గురో కృపాళో కృపయా వదైతద్, విశ్వేశ పాదామ్బుజదీర్ఘ నౌకా ॥** (ప్రశ్నోత్తర మణిరత్నమాలా)

ప్ర:–హే దయాళో! కరుణించి చెప్పండి గురుదేవా! అపార సంసారరూప సముద్రములో మునిగిపోతున్న నాకు ఆశ్రయమేమిటి?

జవాబు:–విశ్వేశ్వరుడగు పరమాత్మయొక్క చరణకమలములు అను గొప్ప నౌక.

కావున, సకలదేవతలకు అధిష్ఠానస్వరూపుడైన పరమాత్మ కృపకు పాత్రుడై బ్రహ్మానుభూతిని పొందగలడు.

ఇప్పుడు కథానుసంధానమును చెప్పుకుందాము. "విరూపాక్షప్ప" అను పేరుగల సద్భక్తుడు 'హుబ్లీ' పట్టణమందు నివసించేవాడు. ఆయనకు గుణవంతురాలైన వృద్ధురాలైన "హీరూబాయి"అను తల్లి ఉండెను. ఆమె ఎల్లప్పుడూ సద్గురుదేవుని నామస్మరణచేస్తూ ప్రతినిత్యముఆదరణీయముగా భక్తి శ్రద్ధలతో ఆశ్రమమునకు వెళ్లి శాస్త్రశ్రవణము చేసేది. ఒకానొకరోజున సంధ్యాసమయములో యథా ప్రకారముగా శాస్త్రశ్రవణము చేయడానికి సద్గురు సన్నిధానమునకు వెళుతుండగా, అకస్మాత్తుగా కాలికి ఒక రాయి తాకి బండరాయి మీద పడింది. వెంటనే "**ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః**" అంటూ సద్గురుదేవుని స్మరిస్తూ లేవడానికి ప్రయత్నించింది. కాని, హఠాత్తుగా క్రిందపడినందున కాలుకు చాలా దెబ్బతగిలి, కాలి ఎముక విరిగింది. నడవడానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితిని చూసిన భక్తులు ఆమెను మెల్లగా తన ఇంటికి తీసుకెళ్లారు. మరునాటి ఉదయమున సద్గురు సిద్ధనాథుని తమ ఇంటికి పిలిపించి శాస్త్రోక్తముగా సద్గురుదేవునికి పాదపూజ గావించి, పిమ్మట హీరూబాయి స్వామిని ఇలా అడుగుతుంది. ఓ సద్గురుదేవా! నాకు ఒక చిన్న సంశయము కలిగింది. తాము దయచేసి ఈ సంశయమును తీర్చగలరు. భక్తులు పుణ్యకర్మలు చేయబోగా వారికి ఇటువంటి కష్టములెందుకు వస్తాయి?అని అడిగింది. అప్పుడు సద్గురు సిద్ధనాథుడు ప్రత్యుత్తరమిస్తూ-

అమ్మా ! ఎప్పుడైతే నీవు బండపై పడితివో,అప్పుడే నీయొక్క ఆయువు ముగిసింది. అప్పుడే నీ ప్రాణాలు పోయేవి. కాని, నీవు ప్రతినిత్యము శాస్త్రశ్రవణము చేయుటవలన, ఆ సత్సంగ పుణ్యము వలన ఆ సద్గురుదేవుడు నిన్ను కాపాడినాడు. కావున, ఎల్లప్పుడూ నామస్మరణ చేస్తూ ఉండుము– అనిచెప్పి సద్గురుదేవుడు ఆశ్రమమునకు వెళ్లిపోయినాడు. సద్గురుదేవుని ఆజ్ఞప్రకారము సద్గురునామ స్మరణ సర్వకాల సర్వావస్థలయందు చేస్తూ హీరూబాయి తన ఇంటియందే ఉండెను. కాలు విరిగి పోయిన కారణమున హీరూబాయికి శాస్త్రశ్రవణమునకు ప్రతిబంధకమైనందున ఇంటిలోనే పడి యుండెను. శాస్త్రశ్రవణము చేయాలని జిజ్ఞాస తీవ్రముగా ఉంది. కాని, లాభము లేదు. అందుకని ఆమె తన కుమారుని విరూపాక్షప్పను ప్రతినిత్యము సిద్ధాశ్రమమునకు పోయి శాస్త్రశ్రవణముచేసి మళ్లీ ఇంటికి వచ్చి సవిస్తరముగా నాకు తెలియజేయవలసింది అని ఆజ్ఞాపించింది.

ఒక రోజున కథా ప్రసంగమునుసరించి సద్గురుదేవుడు సిద్ధాశ్రమమందు మార్కండేయ మహామునియొక్క కథను చెప్తూ, మార్కండేయుడు మరణకాలమునందు కూడా భగవన్నామస్మరణ చేసినాడు. కావున, ఆయన యముని భారినుండి సదాశివునిద్వారా రక్షింపబడినాడని ప్రతిపాదించినాడు. విరూపాక్షప్ప ఈ ప్రసంగమును ఇంటికి వచ్చి తన తల్లికి వివరించినాడు. అప్పుడు హీరూబాయి అనుకుంది–నేనుగూడా ఆ మార్కండేయమహామునివలె ఆ సద్గురునామస్మరణ నిరంతరము చేసినచో, ఆ సద్గురుమావూలీ నన్ను తప్పకుండా నిశ్చయముగా నా మరణకాలములో రక్షిస్తాడు– అని అనుకొని సద్గురుదేవునిపై దృఢమైన భక్తిని ఏర్పరచుకుంది. ఈ ప్రకారముగా నిత్య, నిరంతర,

ఆదరణీయముగా సద్గురు నామస్మరణచేస్తూ, సద్గురుదేవుని తన హృదయమున ధరించి ధ్యానిస్తూ ఉన్నది. ఒక రోజున హీరూబాయి భోజనానంతరము విశ్రాంతి తీసుకుంటుండగా అకస్మాత్తుగా తల తిరిగినట్లయి, మూర్ఛవచ్చి స్పృహ తప్పింది. ఆ మూర్ఛలోనే ఆమెముందు ఇద్దరు భయంకర ఆకార-ముగల పురుషులను చూసింది. వారు నోరు తెరిచి నాలుకను చాచి ఎదుట నిలబడినారు. కనులు ఎర్రగాచేసి నీ ఆయువు ముగిసింది, ఇక రమ్మంటూ పిలిచినట్లు అనిపించింది. వారి శరీరము గా-ఢాంధకారమువలె నల్లగా ఉంది. అప్పుడు హీరూబాయి అనుకుంది–వీరు నిజముగా యమదూతలే ఉన్నారని, ఎలాగైనా నా ప్రాణాలు లాగుకొని పోతారని తలంచి, వెంటనే "**ఓం శ్రీ సద్గురు సిద్ధా రూఢాయ నమః**"అని సద్గురుదేవుని స్మరించి, ఈవిధముగా వేడుకొంది. ఓసద్గురు సిద్ధనాథా! రక్షిం పుము, రక్షింపుము. యమదూతలు వచ్చి నా ప్రాణాలు తీసుకెళ్తున్నారు. వీరి భారినుండి రక్షించు-ము–అని ఆర్త హృదయముతో వేడుకుంది. ఓ సద్గురుదేవా నాకు ఇంకా బ్రతకాలని ఈ శరీరముపై మమకారము లేదు. కాని, ఇంకా కొన్నాళ్లు సద్గురుదేవుని ముఖకమలముద్వారా సచ్ఛాస్త్రశ్రవణము చేసి జ్ఞానమును పొందక పోయితిననే–అను బెంగ ఉంది. సద్గురుదేవుని అనుగ్రహమును పొంది ఆయన కృపద్వారా యథార్థబోధను బడసి, తదనంతరము సుఖముగా యమపురికి పోవాలని ఇచ్ఛ ఉంది. కావున, దయచేసి నన్ను ఈ యమదూతల బారినుండి రక్షించుము–అని వేడుకుంది.

ఆమెయొక్క ఆర్తనాదమునాలకించి సద్గురుదేవుడు అక్కడికక్కడే ప్రకటమైనాడు. ఎప్పుడైతే సద్గురుదేవుని దర్శనమైనదో, హీరూబాయికి ధైర్యము వచ్చింది.అప్పుడు ఆమె యమదూతలతో ఇలా అంటుంది. నేను యమ పురికి రాను. మీరు వెళ్లిపోండి. నేను సద్గురుదేవుని ముఖకమలముద్వారా సచ్ఛాస్త్రశ్రవణముచేసి యథార్థమైన బోధను పొంది, తదనంతరము సద్గురుదేవుని ఆజ్ఞను తీసుకొని యముపురికి వస్తాను. అంతవరకు నేను రాను–అని పలికింది. ఈ మాటలు విన్న యమకింకరులు ఆమె దగ్గరకువచ్చి నిన్ను తప్పకుండా ఇదేక్షణములో యమపురికి తీసుకుపోతాము అంటూ హీరూ-బాయికి యమపాశమును వేయబోయినారు. ప్రక్కనేఉన్న సిద్ధసద్గురుదేవుడు ఆపాశమును అందు-కున్నాడు. అంతే.....ఆ పాశము ముక్కలు ముక్కలై పోయింది. వారి ప్రయత్నము నిష్ఫలమైంది. సద్గురుదేవుడు ఒక పొడుగాటి కర్రను తీసుకొని భయంకరముగా శబ్దముచేస్తూ ఆ యమదూతల పైకి ఉరికినాడు. వెంటనే యమకింకరులు భయపడి యమపురికి పలాయనమైనారు. యమధర్మ-రాజుకు వారి వృత్తాంతమును తెలుపుతూ, మేము హీరూబాయి ప్రాణాలు తీసుకురావడానికి పాశ-ము వేసినాము. కాని, ఒక యతీశ్వరుడు అడ్డువచ్చి మమ్ములను భయపెట్టి పారద్రోలినాడు–అని విన్నవించుకున్నారు.

అప్పుడు సర్వజ్ఞుడైన యమధర్మరాజు ఆ యమదూతలతో ఇలా అంటాడు. మీకు అడ్డువచ్చిన ఆ యతీశ్వరుడు ఎవరో కాదు. సద్గురు సిద్ధనాథునిగా సాక్షాత్ ఈశ్వరుడే మర్త్యలోకములో భక్తు-

లను ఉద్ధరించే నిమిత్తముగా అవతరించినాడు.మీరు అజ్ఞానవశాత్ ఆయనను తెలుసుకోలేక ఆయన భక్తురాలును తీసుకురావడానికి ప్రయత్నించారు. అచ్చట మీ సత్త ఏమి నడవలేదు. ఆయన యొక్క సత్తచేతనే మీరు,నేను,ఈ సర్వజగత్తు నడుస్తుంది. ఈ జగత్తుకు ఆయనే నియంత ఉన్నాడు. సృష్టికర్త, పాలకుడు మరియు సృష్టిసంహారకర్త కూడా ఆయనయే–అని ఈ విధముగా యమధర్మ-రాజు అంటాడు.

ఇక్కడ హీరూబాయి సద్గురు సిద్ధనాథునితో ఇలా వేడుకుంటుంది.ఓ సద్గురుదేవా! నన్ను మృత్యువునుండి తప్పించి కాపాడినావు.అదేవిధముగా విరిగిన నా కాలునుగూడా బాగుచేయండి–అని ప్రార్థించింది. అప్పుడు స్వామి అంటాడు. సరే, నీకు ఇంకా ఆరు నెలల ఆయువును ఇస్తున్నాను. ఈ ఆరునెలలలోగా నీవు పుణ్యకార్యములుచేసి జన్మసాఫల్యము చేసుకొని, నన్నే భజిస్తూ, నన్నే ఆశ్రయించి, నా స్వరూపాన్ని తెలుసుకుని, నా లోకాన్నే చేరుము–అనిచెప్పి తనయొక్క అమృతహ-స్తముచేత హీరూబాయియొక్క కాలును స్పర్శించాడు. వెంటనే కాలు నయమైంది. హీరూబాయి సశక్తయై తనంతట తానే లేచి నిలబడింది.తరువాత హీరూబాయి సద్గురుదేవునికి నమస్కరించింది. ఇంతలో సద్గురు సిద్ధనాథుడు అంతర్ధానమైనాడు.

ఈ సంఘటన జరిగినంత సేపు హీరూబాయియొక్క కుమారుడు విరూపాక్షప్ప ఆమె పక్కనే ఉన్నాడు. కాని,ఆయనకు మాయ కప్పినట్లయ్యి ఏమిజరిగిందో తెలియలేదు. కాని,తన తల్లి హీరూ-బాయి కొన్ని రోజులనుండి మంచముపట్టి ఉన్న తాను స్వయముగా ఎవరి సహాయము లేకుండా తనంతట తానే లేచి నిలబడింది. ఇది విరూపాక్షప్ప కండ్లారా చూసి, తన తల్లిని ఈ విధముగా అడుగుతాడు. అమ్మా! నీవు ఇంత బలహీనముగా ఉండి మంచములో పడుకున్న దానివి, అకస్మా-త్తుగా స్వయముగా లేచి నిలబడినావు. ఇంత శక్తి నీకు ఎక్కడనుండి వచ్చింది–అని అడుగగా, హీరూబాయి తన కుమారునితో తాను గాంచిన వృత్తాంతమును తెలుపుతూ, నన్ను ఆ సద్గురుదేవుడే కాపాడినాడు. సద్గురుదేవుడు పురాణ శ్రవణముచేసి సంపూర్ణంగా చింతనజేయు నిమిత్తముగా నాకు ఆరునెలల ఆయువును ప్రసాదించినాడు. కాలుని (మృత్యువు)యొక్క బాధలేకుండా చేసినాడు. పిమ్మట నిజపదవిని ప్రసాదిస్తానని వాగ్దానముచేసి ఆశీర్వదించినాడు–అని చెప్పింది.

తల్లియొక్క అద్భుతమైన వాక్కులను విని విరూపాక్షప్ప సంతోషించినవాడై, వెంటనే తన తల్లిని తీసుకొని సిద్ధాశ్రమమునకువెళ్లి సద్గురుదేవుని పాదదర్శనము చేసుకున్నారు.జరిగిన వృత్తాం-తమంతా సవిస్తరముగా సద్గురుదేవునికి వివరించారు. ఓ దీనదయాళా! నీవు సాక్షాత్ ఈశ్వరునివి. భక్తులయొక్క మృత్యుభయమును బాపి, వారిని భవబంధమునుండి విముక్తులనుజేయు నిమిత్త-ముగా నీవు ఈజగత్తులో సగుణరూపముగా అవతరించినావు. పూర్వము మార్కండేయమహాఋషి యమపాశమునుండి తప్పించుకొనుటకు నిన్ను ప్రార్థించగా నీవు శీఘ్రముగా ప్రత్యక్షమై ఆయనను

రక్షించి, కాలుని భయమునుండి తప్పించినావు. అదే ప్రకారముగా నన్నుగూడా యమభటులనుండి రక్షించి మృత్యు భయమును బాపినావు.

అప్పుడు సిద్ధసద్గురుదేవుడు ఇలా అంటాడు. అమ్మా! సద్గురుదేవునిపైగల నీయొక్క దృఢమైన భక్తిశ్రద్ధలే నీవు రక్షింపబడుటకు హేతువులైనవి. నాదేమీ లేదు. కాని, నీవు ఇక్కడికే కర్తవ్యము ముగిసిందని అనుకోకుండా, ఎల్లప్పుడూ సద్గురునామమును స్మరిస్తూ, అఖండముగా జపించినట్ల-యితే భ్రమబంధము నివృత్తమై నిజధామమును పొంది విశ్రమించగలవు–అని చెప్పినాడు. ఈరీతిగా హీరూబాయి సద్గురుదేవునియొక్క ఆశీర్వాదరూప ఉపదేశమును ఆలకించి క్షణకాలము సమాధి సుఖమును అనుభవించింది. తదనంతరములేచి సద్గురుదేవుని పాదదర్శనముచేసుకొని, హృదయ-మందు సద్గురుదేవుని సదుపదేశమును ధరించి,తన కుమారునితోగూడి తనఇంటికివచ్చి,నాటినుం-డి సద్గురునామామృతమును అఖండముగా రాత్రింబవళ్లు జపిస్తూ ధ్యానములో నిమగ్నురాలయింది.

కాలధర్మముననుసరించి సద్గురుదేవుడు ఇచ్చిన ఆరునెలల ఆయువు సమీపించింది. గడువు పూర్తి అయిన రోజున హీరూబాయి సద్గురుదేవుని స్మరిస్తూ స్మరిస్తూ నిద్రించింది. సద్గురుదేవుడు హఠాత్తుగా హీరూబాయి విశ్రమిస్తున్న స్థానమునందు ప్రత్యక్షమై, ఆమెను తట్టి నిద్రనుండి లేపి, ఈ ప్రకారముగా అంటున్నాడు. అమ్మా! లే, తొందరగా లెమ్మ-అని హీరూబాయిని పిలిచేసరికి, సద్గురు దేవుని కంఠస్వరమును విని హీరూబాయి దిగ్గునలేచి చూసేసరికి తన పక్కనే నిలబడి ఉన్న అద్భు-త తేజోముఖముగల దివ్యస్వరూపుడైన సద్గురుసిద్ధనాథుని దర్శించింది. సమీపములో దేదీప్య-మానమైన రత్నఖచిత ప్రకాశయుక్తమైన దివ్యమైన అలంకారములతో ప్రజ్వరిలుచున్న విమానము-న్నది. దానిపై ఇద్దరు తేజోస్వరూపులైన దివ్యపురుషులు సద్గురుస్వరూపముతో సమానులై ఉన్నారు. సద్గురుదేవుడు హీరూబాయియొక్క హస్తముపట్టుకొని విమానములో కూర్చుండబెట్టినాడు.ఆ సమ-యములో హీరూబాయియొక్క ఆనందమును వర్ణించడానికి శ్రుతి, శాస్త్రములు కూడా వెనుకంజ వేసినవి. ఆ ఆనందములో తన్మయమైన హీరూబాయి తన కుమారులను, మనుమలను, తదితర బంధుజనమును విస్మరించి మనుష్యత్వమును కోల్పోయి,ఆనందములో మునిగిపోయింది.చెంతనే ఉన్న విరూపాక్షునికి ఈ సంఘటన ఏమి గోచరింపలేదు. కేవలము ఒక దివ్యప్రకాశము మాత్రము కానొచ్చింది.ఆ క్షణకాల ప్రకాశములో తన తల్లి హీరూబాయి "**ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః**" అంటూ నామోచ్చారణ చేసింది. ఇంత మాత్రమే వినిపించింది. ఎప్పుడైతే ప్రకాశము నివృత్తమైనదో హీరూబాయి ప్రాణాలను కోల్పోయి పడిఉంది. అప్పుడు అందరూ సహకుటుంబ, సపరివారమంతా కలిసి అత్యంత అద్భుతముగా భజనలుచేస్తూ, మహావైభవముగా ఆమె భౌతిక కాయమునకు దహన సంస్కారక్రియలు జరిపినారు.ఈరీతిగా సద్గురుదేవుడు కేవలము తన దివ్యనామమును ఆశ్రయిం-చిన భక్తులను యమపాశమునుండి విముక్తులను చేసి, తన నిజధామమును ప్రసాదించినాడు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క వేదాంతరూప లక్ష్యార్థమును సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. హీరూబాయి అను మోక్షేచ్ఛగల జీవుడు యథార్థమైన జ్ఞానప్రాప్తిగూర్చి శ్రవ-ణము చేయడానికి సంసిద్ధుడు కాగా, ప్రారబ్ధభోగము అడ్డునిలచి ప్రతిబంధకము కలుగజేస్తుంది. వైరాగ్య సాధనలో మోహరూపమైన దృఢవాసన ప్రతిబంధకమును కలిగించి, శాస్త్రశ్రవణమునకు విఘ్నమును చేకూరుస్తుంది. అప్పుడు జీవుడు అభిమానగ్రస్తుడై శ్రవణమునకు ఎక్కడ వెళ్లకుండా గృహమందే ఉంటాడు. కాని, ప్రబలమైన వివేకమును కోల్పోనందువలన, శుభేచ్ఛ సజీవమయ్యే ఉంటుంది. వివేకజాగృతివలన ఎల్లప్పుడు స్వరూపాకార వృత్తియందే నిమగ్నుడై ఉంటాడు. ఈ విధ-ముగా వ్యవహారము జరుగుచుండగా క్రోధము,లోభమనే దుష్టవృత్తులు ప్రబలమై ఆ వివేకమును హరించేందుకు ప్రయత్నముచేస్తాయి. ఆ ప్రబలమైన క్రోధలోభములు(యమదూతలు) స్వరూపాకార వృత్తిని భంగపరచి దేహాకారమైన నరకప్రాప్తి చేయుటకు జీవునిపై విజృంభిస్తాయి. కాని, స్వరూపా-కారవృత్తినుండి చలించకుండా ఉన్నందున విజృంభించిన క్రోధలోభములు నష్టమైపోవును. స్వరూ-పముయొక్క ఐక్యరూప అభేదానుభూతిని పొందడానికి షట్సంపత్తి (శమ,దమ,ఉపరతి,శ్రద్ధ,సమా-ధానము,తితీక్ష) దృఢముగా ఉండవలెను. అప్పుడు సద్గురుదేవుని కృపద్వారా జీవ-శివైక్యమును పొంది జీవన్ముక్తుడు కాగలడు. ఈ ప్రకారముగా ఏకత్వ బోధరూప సద్గురుదేవుని కథను శ్రవణము చేసినచో జీవుడు తాను యథార్థముగా సద్గురుదేవుని కృపకు పాత్రుడై జీవ-శివైక్య స్థితిని పొంది, షడ్రిపులను (కామాదులను) జయించి జీవన్ముక్తుడై పరమశాంతిని పొందగలడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకలపాపములు భస్మమై పోగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది ఒకటవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది రెండవ అధ్యాయము

పద్యానువాదము:–పరిపూర్ణమైన అఖండఅద్వైతజ్ఞానాన్ని సద్గురుదేవుని కృపద్వారా పొందిన పిమ్మట సకలభూతములయందు సచ్చిదానందరూపమైన మరియు సకలపదార్థములయందు అస్తి, భాతి, ప్రియరూపమైన తనయొక్క స్వరూపసత్తను దర్శించి, అందరికీ ప్రేమతో నమస్కరిస్తాడు. స్వదేహాభిమానమును సమూలముగా నివృత్తిజేసుకొని ముముక్షువు–సద్గురుదేవుని కృపచే స్వస్వరూపాత్మయందు నిమగ్నుడై ఉంటాడు.

ఓ శ్రీ సిద్ధసద్గురుదేవా! నిన్నే పరమగతిగా ఆశ్రయించి తనువును, మనస్సును, ధనమును నీ చరణకమలములకు అర్పించి, నీపైనే భారమేసి ముక్తుడనయ్యాను. క్షణకాలము నీయొక్క సాంగత్యము ప్రాప్తమైనచో జననమరణరూప సంసారభయము నివర్తించును.నిర్మలమైన అంతఃకరణము యందు యథార్థమైన జ్ఞానముదయించి సర్వత్ర బ్రహ్మమునే దర్శిస్తాడు. ఇటువంటి స్థితి ఎట్లు ప్రాప్తమగునో దృష్టాంతముద్వారా సవిస్తరముగా చెబుతాను సావధానముగా విని కృతార్థులు కండి.

దక్షిణ దేశమందు ముక్తాపురమనే గ్రామములో సద్గుణ సంపన్నులైన వైరాగ్యయుక్తమైన బ్రాహ్మణదంపతులుండేవారు. వారియొక్క గృహసమీపములో వారికి ఇష్టదైవమగు శ్రీకృష్ణమందిరముండెను. వారు ప్రతినిత్యము ఆలయమునకు వెళ్లి దృఢమైన భక్తిశ్రద్ధలతో పూజించి, భజన కీర్తనలందు రమిస్తూ సంసారాసక్తి లేక నిశ్చింతగా ఉండేవారు. వారికి ఐదుగురు పుత్రులుండిరి.అందులో రెండవ వాడైన శంకరుడు బాల్యమునుండే తల్లిదండ్రులతోగూడి ఆలయమునకు వెళ్లి శ్రద్ధగా పురాణ శ్రవణము చేసేవాడు. ఆ దేవాలయములో కృష్ణస్వామి అనే మహాత్ముడు జ్ఞానేశ్వరి భగవద్గీతను ప్రవచిస్తూ ఉండేవాడు. అప్పుడప్పుడు శంకరుడు ఆలయములో ఎవరు లేనప్పుడు తాను ఒంటరిగా వెళ్లి శ్రీకృష్ణ పరమాత్మతో ఇలా వేడుకునే వాడు. కృష్ణా! నేను కూడా జ్ఞానేశ్వర్ మహారాజువలె బ్రహ్మానుభూతినొందుటకు యథార్థమైన స్వస్వరూపజ్ఞానమును ప్రసాదింపుము.

ఇట్లు, కాలచక్రము తిరిగింది. క్రమంగా బాల్యావస్థను అతిక్రమించి శంకరుడు యువకుడైనాడు.లౌకికవిద్యలు అభ్యసించినపిదప వివాహము చేసుకున్నాడు.కృష్ణభక్తినుండి చ్యుతుడై సంసారాసక్తియందే రమించాడు. ఉద్యోగవ్యవహారమును చాలా నైపుణ్యముగాచేస్తూ అధికముగా ధనము సంపాదించాడు.లోకములో చాలా పేరుప్రతిష్టలు గడించాడు.తన జీవితాన్ని ప్రవృత్తిపరముగా విని-

యోగించాడు. వివాహమైన కొంతకాలానికి ఒక సుందరమైన పుత్రుడుదయించినాడు. శంకరుడు ఎంతో ఆనందించినాడు. ఇంతలో ఒకనాడు ఒక విచిత్రమైన ఘటన జరిగింది, సావధానముగా వినగలరు.

శంకరుని కుమారుడు ఆరునెలల వాడయ్యాడు. ఒకనాడు శంకరుడు రాత్రి భోజనానంత-రము శయ్యపై పడుకున్నాడు.నిద్రలో శంకరుడు ఒక స్వప్నమునుగాంచినాడు.ఒక సన్యాసి శంకరు-ని కోపముతో చూసినాడు. *"కృష్ణభక్తినుండి విముఖుడవై సంసారములో మునిగి జననమరణరూప కూపములో పడిపోతున్నావు"* అన్నట్లుగా క్రోధదృష్టితో చూసి ఆ సన్యాసి అదృశ్యమైనాడు.

వెంటనే శంకరుడు మేలుకొని హరి హరీ! కృష్ణ కృష్ణ! నేను అపరాధము చేస్తున్నాను. నిన్ను విస్మరించి సంసారములో మునిగిపోయాను. హేపరమాత్మ! నేను ఎంత మూర్ఖుడిని.నన్ను క్షమిం-చుము స్వామీ! అంటూ వెక్కివెక్కి ఏడ్చిఏడ్చి స్పృహదప్పి పడిపోయినాడు. కుటుంబసభ్యులందరూ భయపడినారు. వెంటనే శంకరుని కృష్ణమందిరములోకి తీసుకెళ్లినారు. ఎప్పుడైతే కృష్ణభగవానుని చూసినాడో,శంకరుని దుఃఖము కట్టలుతెంచుకొని వరదలుబారి ఇంకా ముంచెత్తుకొచ్చి బోరుమని ఏడవడము ప్రారంభించాడు. ఇట్లు మూడుగంటలు ఏడ్చినాడు. ఏడ్చిఏడ్చి, తరువాత తనకు తానే సమాధానచిత్తుడై ముందు కర్తవ్యమును ఆలోచించెను. వివేకము జాగృతియై స్త్రీపుత్రాదులతోగల తాదాత్మ్యమును త్రెంపుకొని దృఢవైరాగ్య యుక్తుడైనాడు. ఈ ప్రపంచములో నా వారంటూ ఎవరూ లేరు. స్త్రీపుత్రాదులు చూపే ప్రేమ బూటకము.నిజమైన,శాశ్వతమైన,శ్రేష్టమైనప్రేమ ఆ పరమాత్మ యందే ఉంది. అటువంటి పరమాత్మను పొందాలంటే సద్గురుదేవుడనే నౌక కావాలి.కావున,ఇప్పుడు సద్గురుదేవునియొక్క అన్వేషణ నా తక్షణకర్తవ్యమని శంకరుడు నిశ్చయించుకున్నాడు.

అప్పుడు ఆయనకు ఒక విషయము స్మృతికి వచ్చింది.శంకరుని చిన్నతనములో ఒక వృద్ధుడు అంటూఉండేవాడు."**హుబ్లీ**"పట్టణములో మహాజ్ఞానిమహాత్ముడగు సిద్ధారూఢస్వామి ఉన్నాడు–అని. ఈవిషయము స్మృతికివచ్చి, తప్పకుండా నేను సిద్ధరూఢస్వామిని ఆశ్రయించాలి-అని నిశ్చయించు కొని, ఎవరికి చెప్పకుండా గృహమునుండి బయలుదేరి పూర్వదిశకు వెళ్లిపోయినాడు.

తరువాత తన కుటుంబసభ్యులు మరియు పరివారమంతా ఆయన కోసము ప్రతిచోటు వెదకివెదకి శంకరుని పట్టుకొని తిరిగి ఇంటికి తీసుకొచ్చారు.కాని,శంకరుడు నేను ఇంట్లో ఉండను. తప్పకుండా సిద్ధారూఢస్వామిని దర్శించుకుని, ఆయన సాన్నిధ్యములోనే ఉంటాను. నేను హుబ్లీకి వెళ్ళాలి అని హఠముచేసినాడు. అప్పుడు తన తల్లిదండ్రులు ఇక లాభం లేదని, ఒక తెలిసిన మిత్రుని తోడుగా ఇచ్చి శంకరుని హుబ్లీకి పంపించినారు. శంకరుడు హుబ్లీకి చేరుకొని సద్గురు సిద్ధారూఢ స్వామి సన్నిధికేతెంచి హృదయపూర్వకముగా సాష్టాంగ నమస్కారములు చేసినాడు. తదనంతరము శంకరుడు తన వృత్తాంతమును సవిస్తరముగా స్వామికి నివేదించుకున్నాడు. నాకు సంసారము

గూర్చి ఇచ్చలేదు. ఎల్లప్పుడు నీ సాన్నిధ్యములోనే ఉంటూ పరమార్థము సాధించాలని ఉంది-అని వేడుకున్నాడు.

అప్పుడు సద్గురు సిద్ధనాథుడు శంకరునితో ఇలా అంటాడు. సరే! కాని, నీవు ఇప్పుడు జ్ఞానానికి అధికారివి కాదు. నీకు అధికారత్వము ప్రాప్తమయ్యేవరకు ధ్యానము, నామస్మరణ చేస్తూ ఉండుము–అని ఆదేశించినాడు. ఇటువంటి అమృతముకన్న మించిన సద్గురువచనములు విన్న శంకరునికి హృదయములో ఆనందము ఉప్పొంగి వచ్చింది. సుఖమును పొంది నిశ్చితంగా ఉండి పోయినాడు. ఈవిధముగా సద్గురూపదేశమును తీసుకొని సద్గురుదేవుని ఆజ్ఞను గైకొని స్వగ్రామ-మునకు ఏతెంచి, ధర్మకర్మలను పరిత్యజించి అరణ్యములోకి వెళ్లి ఏకాంతముగా ధ్యానము సలు-పుతూ, నామస్మరణము చేస్తూ ఉన్నాడు. శంకరునికోసము వారి గృహస్తులు ఒక చిన్నకుటీరమును నిర్మించి ఇచ్చినారు. దానియందు రాత్రింబవళ్లు సద్గురుచింతన చేస్తూ నామస్మరణ చేస్తూ ఉన్నాడు.

శంకరుడు తన స్వహస్తములతో వంట తయారుచేసుకునేవాడు. రసయుక్తమైన భోజన-మును త్యజించి కేవలము నీరు మాత్రమే బియ్యములో పోసి వండుకొని, భుజించేముందు "**సిద్ధా-ర్పణమస్తు**"అని ఆచమనముచేసి భుజించేవాడు.ఈప్రకారముగా నిత్యము ప్రశాంత వాతావరణ-మందు ఏకాంతమున చిత్తమును నామస్మరణలో రమింపజేయుటవలన చిత్తము సహజముగా నిర్మలమై, భేదభావము నిరసించింది.

ఒకరోజున శంకరుడు భోజనమునకు కూర్చున్నాడు. ఇంతలో ఒక నల్లకుక్క కుటీరములోకి దూరింది. శంకరుడు తొందరగా లేచి ఆ శ్వానమునకు నమస్కరించినాడు. ఆ శ్వానము శంకరుడు భుజించే పళ్ళెములోని అన్నమును సుఖముగా భుజించింది. సద్గురు ప్రసాదముగా భావించి ఆ కుక్కతోసహా శంకరుడు కూడా భుజించినాడు. తర్వాత దానికి నమస్కారము చేసినాడు. శునకము అక్కడనే మలత్యాగము చేసి, తిరిగి దానిని తినబోతుండగా శంకరుడు చూసి ఛీ! ఛీ! ఏమిటీ పని–అంటూ దానిని దగ్గరకు తీసుకొని దాని మూతిని కడిగినాడు. ఇట్లు, దినదినము దేహబుద్ధిని సమూలంగా నివృత్తి చేసికొని, నిరభిమాన వృత్తిని వృద్ధి పరచుకొని, హృదయమందు సద్గురుభావన (వ్యాపకభావన)పెంపొందించుకున్నాడు. సమస్త భూతములలో ఆ సద్గురుదేవుడినే దర్శించసాగి-నాడు.

*"తనకన్నభిన్నమైన సకలభూతములయందు ఉచ్చనీచభేదములేకుండా పరమాత్మస్వరూప-మని పూజ్యభావముచే నమస్కరించేవారు, అనంతస్వరూపాన్ని తమ హృదయమందు దర్శిస్తారు"*–అను శ్రీతుకారాం మహారాజుయొక్క వచనములపై విశ్వాసముంచి, యథార్థానుభూతిని పొంది తదనుసారముగా ఆచరించాడు. దీనికి ప్రమాణము సాధనకాలములో భాగవత పురాణములోనిది శ్రవణముచేసి ఉండెను. తదనుసారముగా నిశ్చయముగా ఆచరిస్తున్నాడు.

**శ్లో ॥ విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికమ్।**

**ప్రణమేద్దణ్డవత్ భూమౌ అశ్వచాణ్డాలగోఖరాన్ ॥** (శ్రీమద్భాగవతము 11-29-16)

తనయొక్క ఇష్టమిత్రులు, బంధుపరివారమంతా హేళనచేస్తారనే భావన వదిలేసాడు.అటు వంటి లజ్జ(సిగ్గు) సమూలంగా విడిచి, అది కేవలము దేహసంబంధ బుద్ధేనని తెలిసికొని అశ్వ, చండాల, ఖరము (గాడిద)మొదలగు సకల భూతములలో యథార్థ చైతన్యమునే దర్శించి సాష్టాంగ దండవత్ ప్రణామములు చేసేవాడు. పరిస్థితులు వాతావరణ పరిసరములను అన్నివిడిచి శంకరుడు గ్రామాన్ని వదిలినాడు. ఎక్కడెక్కడ తన బంధుమిత్రులు కలిసినారో, వారు ఇచ్చే మానావమాన-ములను సమబుద్ధితో సహిస్తూ నమస్కరిస్తూ వెళ్ళిపోతున్నాడు. శంకరునియొక్క స్థితిని చూచి కొందరు పిచ్చివాడని అనుకున్నారు. స్త్రీలు, పిల్లలు భయపడి పరుగెత్తుతున్నారు. కొందరు అయ్యో పాపము! ఈయన పరిస్థితి ఎలా అయ్యింది–అని సానుభూతిని తెలుపుచున్నారు. కాని, కొందరు సజ్జనులుచూసి ఈయన స్థితిని గమనించి ఈయన నిజముగా సద్గురుకృపకు పాత్రుడై ధన్యుడైనాడు –అని అనుకున్నారు. శంకరుని ఈ నిశ్చయము యథార్థమైనది. ఇటువంటి అవస్థ సద్గురు కృప ద్వారానే కలుగుతుంది. దీనియందు సంశయము లేదు.

ఊరికి కొద్ది దూరములో ఒక కొండపై నివాసము ఏర్పరచుకున్నాడు.ఆయన భార్య ప్రతి నిత్యము అన్నాహారములు తీసుకెళ్లి సమర్పించెడిది. ఈ విధముగా అఖండముగా సాధనచేస్తూ సద్గురుదేవుని ధ్యానిస్తూ, ఏకాంతములో స్వానుభూతిని అనుభవిస్తుండగా, ఒకరోజున శంకరునిలో *"సద్గురు సన్నిధానమునకు పోవాలి"*అను ఒక దివ్య సంకల్పము,స్ఫురణ ఉదయించింది. సద్గురు దేవుని ఆజ్ఞ లభించినట్లుగా భావించి, మధ్యరాత్రివేళ హుబ్లీకి వెళ్లడానికి సంసిద్ధుడైనాడు. మధ్యరాత్రి ఘోరమైన కారుచీకటి మరియు అదే సమయానికి మేఘములు కప్పి మరింత చీకటిని కల్పించాయి. వర్షము ప్రారంభమైంది.నీరు ఉధృతముగా ప్రవహిస్తుంది.అయినను కించన్మాత్రముగూడా వెను-కంజ వేయకుండా సద్గురుదేవునిపైనే తన దృష్టి(లక్ష్యము) నుంచి పయనిస్తున్నాడు. నడుస్తూనడుస్తూ ఉండగా మార్గములో ఒక విశాలమైన నదిని దాటవలసి వచ్చింది. ప్రవాహము జోరుగా ఉధృత-మైనది. అంధకారము గూర్చి విచారించలేదు. ప్రవాహమును లెక్క చేయలేదు. మనస్ఫూర్తిగా సద్గురుదేవుని స్మరిస్తూ ఈ విధంగా ప్రార్థిస్తున్నాడు. ఓ సద్గురు సిద్ధనాథా! ఈ శరీరము నీ వలన ప్రాప్తమైనది. దీనిని నీవే రక్షించుకోగలవు. *"నారు పోసిన వాడు నీరు పోయడా"* అని సర్వము సద్గురుదేవునిపై భారమేసి ముందుకు సాగిపోతున్నాడు. సద్గురుదేవుని స్మరించి ఆ విశాల నదీప్రవా హములో "**జై శ్రీ సద్గురుదేవా**"అంటూ ఒక్కసారిగా దూకినాడు. నదిలో కొట్టుకు పోతున్నాడు.కాని, ఇలా అనుకుంటున్నాడు. సద్గురుదేవుడు నదీరూపముగా మారినాడు.నేను ఆ సద్గురుదేవుని కడుపు-లో ఉన్నాను. ఇప్పుడు యథార్థముగా నిన్ను ఆశ్రయించినాను. నిజముగా నీలో ఐక్యమైనాను అని

భావపూర్వకముగా ప్రార్థించినాడు. ఈ విధమైన భక్తిపూర్వక ప్రార్థనను ఆలకించి సద్గురు సిద్ధ-నాథుడు అక్కడికక్కడే అదేక్షణములో ప్రకటమైనాడు.ప్రకాశమానుడైయున్న సద్గురుదేవుడు శంకరుని నదీ ప్రవాహమునుండి తనయొక్క అమృతహస్తములచేత ఒడ్డుకు చేర్చినాడు. ఎప్పుడైతే శంకరుడు ఒడ్డుకు చేరినాడో, సద్గురుదేవుని పాదపద్మములకు సాష్టాంగ నమస్కారములుచేసి ఓ కరుణాకరా! ఓ సద్గురుదేవా! నేను ధన్యుడనయ్యాను. ఇక నీవు నేను ఇక్కడే ఉందాము, నీవు నన్ను విడిచి వెళ్ళకుము–అంటాడు.

అప్పుడు సద్గురు దేవుడంటాడు. నాయనా! నేను నీకంటె భిన్నముగా లేను. నీయొక్క, నాయొక్క స్వరూపము ఒకటే. సర్వభూతములలో నాయొక్క స్వరూపమునే దర్శించుము. సర్వత్ర సర్వవ్యాపక పరమాత్మను (నన్ను) దర్శించినాక, ఇక విడవడము–పట్టుకోవడమేమిటి? భిన్నత్వమే లేదు. నీవు ఎలాంటి చింతజేయక అఖండముగా భావయుక్తముగా నన్నే స్మరిస్తూ హుబ్లీకి రమ్ము. కొంతకాలమువరకు నా సాన్నిధ్యములోనే ఉందువుగాక! అని ఈప్రకారముగా ఆశ్వాసనమిస్తూ, ఆశీర్వదించి సద్గురుదేవుడు అదృశ్యమైనాడు. శంకరుడు సద్గురుదేవుని స్మరిస్తూ పయనమైనాడు. రెండురోజులు అఖండముగా ఎక్కడగూడా విశ్రమించకుండా,అన్నాహారములు లేకుండా,ఆహారము కొఱకు ప్రయత్నించకుండా, తీవ్రజిజ్ఞాసతో పయనించాడు. మార్గాయాసముచే అనేకవిధముల భాధ కలిగినందున పాదములు ఉబ్బి ముందుప్రయాణమునకు అవరోధము (ప్రతి బంధకము) ఏర్పడి, చాలా ఆయాసముతో ఒకానొక ధర్మశాలయందు శంకరుడు ఉండిపోయినాడు. రెండు దినముల-నుండి ఆహారము లేనందున శరీరము చాలా శుష్కించి, నడుచుటకు ఓపిక లేదు. కాని, శంకరుడు సద్గురు స్మరణ మాత్రము వీడలేదు. సద్గురు నామస్మరణ అఖండముగా చేస్తున్నాడు.

సద్గురుదేవుడు భక్తులను రక్షించుటకై, వారి ఆర్తనాదమును వినుటకై ఎల్లప్పుడు సంసిద్ధుడై ఉంటాడు.ఆయన గుణగణములను వర్ణించుటకు ఎవరి తరము?అటువంటి సద్గురుమూర్తి బ్రాహ్మణ వేషధారియై శంకరుడు ఉన్నచోటికి వచ్చాడు. అనాథుడుగా పడిఉన్న శంకరునియొక్క దయనీయ స్థితినిజూసి బ్రాహ్మణవేషములో ఉన్న సద్గురుదేవుడు కండ్లవెంట అశ్రువులు రాల్చాడు. మరియు శంకరునితో ఇలా అంటాడు. నాయనా! నీ యోగక్షేమములు చూసేవారు ఎవరు లేరా? పోనీ నీకేమి కావాలో నన్నడుగుము. నేను నీ సేవ చేస్తాను అని అంటాడు.

అప్పుడు శంకరుడు అంటాడు. స్వామీ! నేను తొందరగా హుబ్లీకి చేరుకోవాలి. అది తప్ప నాకు యే ఇచ్ఛయును లేదు. సద్గురుదేవుని దర్శించి ఆయన సేవచేయడమే నాయొక్క ఆకాంక్ష. అప్పుడు ఆ బ్రాహ్మణుడు అంటాడు.సరే నాయనా!కాని,నీకు అన్నాహారములు లేక శరీరము శుష్కించింది. కాళ్లు ఉబ్బి నొప్పిగాఉన్నాయి.కావున,నీ ఆరోగ్యము కుదుటపడేవరకు ఇక్కడే ఉండవలసింది –అని చెప్పి, బ్రాహ్మణుడు స్వయంగా వెళ్లి కొంత తైలమును తెచ్చి శంకరుని పాదములకు బాగుగా

మర్ధనచేసినాడు. శంకరుని కోసము మధ్యాహ్నము, రాత్రి–రెండుపూటల భోజన ప్రసాదములు తెచ్చి పెట్టినాడు. ఇట్లు,మూడు రోజులు గడిచినాక శంకరుడు స్వస్థతను పొంది ఆరోగ్యవంతుడైనాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు కొంత డబ్బును తీసికొచ్చి, శంకరుని చేతికిచ్చి, నీవు కాలినడక చేస్తే బాధ కలుగుతుంది. ఈడబ్బుతో నీవు రైలుబండి ఎక్కి హుబ్లీకి వెళ్ళిపో–అని అంటాడు.కాని, శంకరుడు ఆ డబ్బులు స్వీకరించలేదు. మరియు ఇలా అంటాడు. అయ్యా! నన్ను డబ్బులుజూపి ప్రలోభ పెట్టకుము.నీవు చేసిన మేలు నేను నాజీవితాంతము వరకు మరువలేను.ఇంకా డబ్బులు ఎందుకు? నేను ఎలాగో హుబ్లీకి వెళ్ళగలను. నీవు నా తల్లివి తండ్రివి అయ్యి ఎన్నో విధములుగా సేవచేసి నన్ను రక్షించావు. యథార్థముగా నీవే సద్గురుదేవునివలె దోచుచున్నది–అని పలుకుతూ, శంకరుడు బ్రాహ్మణుని చరణములపైబడి సాష్టాంగ దండవత్ ప్రణామములు చేసినాడు.

అప్పుడు ఆబ్రాహ్మణుడంటాడు–అయితే నాతో రమ్ము, నిన్ను రైలుబండియందు కూర్చుండ బెడతాను–అని బలవంతముగా శంకరుని లేపుకొని, రైల్వే స్టేషన్ కు తీసుకెళ్లి టిక్కెట్టు తీసికొచ్చి శంకరునికిచ్చి రైలులో కూర్చుండ బెట్టినాడు. శంకరుడు హుబ్లీకి చేరుకొని సిద్ధాశ్రమమునకు వెళ్లి, సద్గురు సిద్ధనాథునికి సాష్టాంగ ప్రణామములు చేసి, ప్రేమాశ్రువులు రాల్చాడు. ఎంతో ఆనందమును పొందినాడు. ఓ దయాసాగరుడవైన సద్గురుదేవా! అనేక విధములైన భాధలనుండి నన్ను రక్షించి నీ సాన్నిధ్యమునకు చేర్చుకున్నావు. దీనుడనైన నన్ను ఏ ఉపాయము చేతనైనను ఉద్ధరించుము- అని వేడుకున్నాడు.

అప్పుడు సిద్ధ సద్గురుదేవుడంటాడు–నాయనా! నీవు ఇక్కడనే ఉండి ప్రతినిత్యము వేదాంత శ్రవణము చేయుము. నీవు నిశ్చయముగా వేదాంత శ్రవణమునకు అధికారివి ఉన్నావు. ప్రతిదినము వేదాంతశ్రవణముచేసి, దానిని అఖండముగా మననము, నిదిధ్యాసనము చేసినట్లయితే హృదయ మందు ఆత్మజ్ఞానము ప్రకటమై ముల్లోకములలో ధన్యుడివి కాగలవు–అని ఆజ్ఞాపిస్తూ, సద్గురుసిద్ధనాథుడు తనయొక్క అమృతహస్తముచేత ఆశీర్వదించి, అభయమొసంగినాడు. తద్వారా శంకరుడు తన్మయుడై సద్గురు చరణాలకు మరొక్కసారి వందనమాచరించినాడు. ఈ విధముగా ప్రతిరోజు సద్గురు ముఖకమలముద్వారా సచ్ఛాస్త్రమును (జీవబ్రహ్మైక్యబోధను)శ్రవణముచేస్తూ సద్గురు సాన్నిధ్యములో ఉంటూ, సద్గురు సేవచేస్తూ నిస్సంశయ జ్ఞానమును పొంది ఎల్లప్పుడూ ఆనందపరవశుడై ఉండేవాడు.

శ్రవణముచేసిన దానిని మననము చేయుటకు ప్రశాంతమైన ఏకాంతస్థలమును ఎన్నుకుని ప్రతినిత్యము అక్కడికివెళ్లి అఖండముగా మననము చేసేవాడు. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనలు చేస్తుండగా కొంతకాలమునకు యథార్థమైన పరిపూర్ణమైన ఆత్మజ్ఞానమును పొందినాడు. ఆ అపరోక్ష జ్ఞానముచేత వర్ణనాతీత ఆనందమును అనుభవించేవాడు. స్థావర జంగమరూప ప్రపంచ-

మును అభేద దృష్టితో తన స్వరూపముగానే దర్శించేవాడు. నిర్వికార వృత్తి కలుగుటవలన అసంగ స్వరూపుడే అయినాడు.

**శ్లో ॥ అహం నిర్వికల్పో నిరాకారరూపో, విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్।**

**నచాసంగతం నైవ ముక్తిర్నమేయః, చిదానంద రూపశ్శివోఽహం శివోఽహమ్॥**

ఆ సమయములో కేవలము స్వయంప్రకాశ స్వరూపుడై ద్వైతప్రపంచమును విస్మరించి సర్వత్ర సర్వవ్యాపిని నేనే ఉన్నానని, నేనెల్లప్పుడు సద్రూపుడనే ఉన్నానని నిశ్చయించుకున్నాడు.ఈ ద్వైత ప్రపంచముతో నాకెప్పుడూ సంబంధములేదు. నేను,నాది అను అభిమానమునకు నిమిత్తము కూడా నాయందు లేదు. నేను నిత్యుడను, ఏక స్వరూపుడను. నేను(పరోక్ష ప్రత్యక్షములకు విలక్షణమైన) సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడను. **"యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ"** (బృ.3-4-1). జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములకు సాక్షినై ఉన్నానని తెలుసుకున్నాడు.నాయందు బంధము లేదు, మోక్షము లేదు.ఇక్కడ దేహభావము హాస్యాస్పదమయ్యే ఉంది. కామక్రోధములు సిగ్గుపడుచున్నవి. పంచవిషయముల గంధము కూడా నాయందు లేదు. ఎవరు ఏ ఏ దేవతలను ప్రార్థిస్తున్నారో ఆయా ప్రార్థన "**సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి**" అన్నట్లుగా ఆ కేశవుడను నేనే ఉన్నాను. నాకు నేనే నమస్కరించు కుంటున్నాను.

(विचारसागर मङ्गलदोहा)

**సర్వభావాన్తరస్థాయ చైత్యముక్తచిదాత్మనే ।**
**ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యామేవ నమో నమః ॥**(సంన్యాసోప. 2-25; వరాహోప. 2-33)
**త్వం వాఽహమస్మి భగవో దేవ తేఽహం వై త్వమసి ।**
**తుభ్యం మహ్యమనన్తాయ మహ్యం తుభ్యం చిదాత్మనే ॥** (వరాహోప. 2-34)
**నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ ।**
**కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్ ॥** (వరాహోప. 2-35)
**ఏకస్మై కృతకృత్యాయ నిత్యాయ విమలాత్మనే ।**
**నిర్వికల్పచిదాఖ్యాయ మహ్యామేవ నమో నమః ॥**
**న శోకోఽస్తి న మోహోఽస్తి నచైవాహమహం స్వయమ్ ।**
**న చ నాహం నచాన్యోఽహం మహ్యామేవ నమో నమః ॥**
**న మమాశా న కర్మాణి న సంసారో న కర్తృతా ।**
**న భోక్తృతా న దేహో మే మహ్యామేవ నమో నమః ॥**
**నాహమాత్మా న వా కోఽన్యో నాహమస్మి నచేతరః ।**
**సర్వమేవాహమేతస్మై మహ్యామేవ నమో నమః ॥**

**అహమాదిరహం ధాతా చిదహం భువనాన్యహమ్ ।**

**మమ నాస్తి వ్యవచ్ఛేదో మహ్యామేవ నమో నమః**

**నిర్వికారాయ నిత్యాయ నిరంశాయ మహాత్మనే ।**

**సర్వస్మై సర్వకాలాయ మహ్యామేవ నమో నమః ॥**

**నీరూపాయ నిరాఖ్యాయ ప్రకాశాయ మహాత్మనే ।**

**స్వయమాత్మైకసంస్థాయ మహ్యామేవ నమో నమః ॥**

**సమాం సర్వగతాం సూక్ష్మాం జగదేకప్రకాశినీమ్ ।**

**సత్తాముపగతోఽస్మ్యన్తర్మహ్యామేవ నమో నమః ॥**

**సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం నాహమేవాహమేవ వా ।**

**జగత్సర్వం పదార్థాఖ్యం మహ్యామేవ నమో నమః ॥** (యో.వా.ఉపశమ ప్ర.80-40 నుండి 48)

**ఇదం సత్యమిదం సత్యం సత్యమేతదిహోచ్యతే ।**

**అహం సత్యం పరం బ్రహ్మ మత్తః కిఞ్చిన్న విద్యతే ॥** (వరాహోప.2-38)

శంకరునికి, ఎవరైనా కుక్కను బాధిస్తుంటే,ఆబాధ తనకే కలుగుతున్నట్లుగా భావించేవాడు, భాధ్య,బాధకము నేనే అనునది ఆత్మజ్ఞాన సంపన్నులకే సంభవించును.

ఈ ప్రకారముగా శంకరుడు సద్గురుదేవుని స్వరూపమైన అద్వైత జ్ఞానమును పొంది, దేహ భావన వీడి, దేహాతీత అనుభూతిని పొంది ముక్తుడైనాడు. సద్గురు స్వరూపముచేత ఐక్యమునొంది అద్వైతానుభూతిని బడసినాడు.సద్గురు సాన్నిధ్యమువలన శంకరుడు అతిశీఘ్రముగా బ్రహ్మపదమును చేరుకున్నాడు. ఇటువంటి సద్గురు విభూతివలన సహజముగా జీవన్ముక్తిని, మరియు విదేహముక్త స్థితినిబొంది కృతకృత్యులు కాగలరు.

ఇప్పుడు ఈకథయొక్క లక్ష్యార్థమును వినండి.శంకరుడనే ముముక్షువు స్వరూపమును పొందడానికి తీవ్రముగా ప్రయత్నము చేయుచుండగా, జననమరణరూప సంసారమునందుబడి బాధింప బడుచున్నాడు. ఈవిధముగా సంసారరూప ప్రవాహములో మునకలువేస్తున్న జీవునికి ఎప్పుడైతే వివేకముదయించి, సద్గురుదేవుని ఈ సంసారమునుండి తరింపజేయుమని హృదయపూర్వకముగా ప్రార్థించినాడో, అప్పుడు కరుణాసాగరుడైన సద్గురుదేవుడు వచ్చి జీవుని (ముముక్షువు)పై దయదలచి తనకు అండగా ఉండి, సంసారమునుండి ముక్తున్నిచేయుటకు అనుగ్రహించినాడు. ఈ విధముగా సద్గురుదేవుని కృపను బడిసి సాధన సాగిస్తూ ఇహపరసౌఖ్యములను సమూలముగా త్యజించి వివేక, వైరాగ్యములనే రెండు పాదములచే సాధన చూస్తుండగా, దృఢమైన విషయాసక్తి అనే రోగము వివేక వైరాగ్యమునకు బాధ గలుగజేసి సాధనకు విఘ్నము కలగజేస్తుంది. అప్పుడు సద్గురుదేవుడు సన్నిహితుడై ఉండి జ్ఞానరూప తైలముచేత విషయాసక్తిరూప రోగమును సమూలముగా నివృత్తిచేసి

బ్రహ్మాత్మలయొక్క ఐక్యమును ప్రసాదించి, ప్రత్యగాత్మయందు స్థాపితము చేసినాడు. విషయాసక్తి రూప రోగమును సమూలముగా నివృత్తిచేసి బ్రహ్మాత్మైక్య వాహనమునందు కూర్చుండబెట్టి ప్రత్యగాత్మవైపు పంపినాడు. ఎప్పుడైతే ప్రత్యగాత్మను ముముక్షువు యథార్థముగా అపరోక్షముగా దర్శించినాడో, తత్క్షణమే బ్రహ్మపదవిని పొంది, జీవించినంత కాలము జీవన్ముక్తవిలక్షణానందమును అనుభవించి, అంత్యమున శాశ్వతమైన మోక్షరూప విదేహకైవల్యము ద్వారా నిత్యముక్తుడైనాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచేతనే సకలపాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురు సిద్ధరూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది రెండవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది మూడవ అధ్యాయము

పద్యానువాదము:–ఎవరియొక్క కృపద్వారా యథార్థజ్ఞానమును పొంది ఎల్లప్పుడు స్వస్వ-రూపమునందు విశ్రమించియుంటాడో, అట్టి, ఆత్మస్వరూపానుభూతిని ప్రసాదింపజేయు ఆ సద్గురు దేవులకు నాయొక్క నమస్కారములు.

అఖండానంద అద్వయస్వరూపుడవైన ఓ సద్గురుదేవా! భక్తులను తరింపజేయుటకు హుబ్లీ పట్టణమునందు అవతరించినావు. సాధురూపమును ధరించి అవతరించి, నీయొక్క భక్తులు నిన్ను ఎక్కడెక్కడ భజిస్తూ, స్మరిస్తూ ఉండిరో, అక్కడక్కడ నీవు ప్రకటమై వారిని దయదలచి ప్రేమతో తరింప చేసినావు.

గోందువలేపురమను గ్రామములో ఇద్దరు బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. వారు నిత్యము శ్రీ పంఢరినాథుడైన పాండురంగస్వామిని పూజిస్తూ,భజిస్తూ వారి జీవనమును సుఖముగా గడు-పుచుండిరి. ప్రతి ఏడాది ఆషాఢ మరియు కార్తీక మాసములలో నియమముగా పంఢరీపురమునకు వెళ్లి వారికులదైవమైన పాండురంగస్వామిని ప్రేమతోదర్శించేవారు.భక్తిశ్రద్ధలతో పాండురంగస్వామి యొక్క నామమును ఉచ్చరిస్తూ హృదయమందు విఠలనాథుని మంగళస్వరూపాన్ని ధరించి ఉత్క-టమైన ప్రేమతో జనులతో వ్యవహరించేవారు. ఈప్రకారముగా ఆ దంపతులు తమ గృహస్థజీవన-మును సాగిస్తుండగా, ఒకానొక రోజున పాండురంగస్వామి వారికి స్వప్నమందు దర్శనమిచ్చి మీ యొక్క గర్భములో అతిత్వరగా రామదాసస్వామి అవతారమునకు రాబోవుచున్నాడని ఆశీర్వ దించినాడు. కృతయుగములో నారదమహర్షిగా, త్రేతాయుగములో ఆంజనేయస్వామిగా, ద్వాపరమున భీష్ముడుగా, మరియు కలియుగములో సమర్థరామదాసుగా అవతరించిన ఆ మారుతి అవతారము మీకు పుత్రరత్నముగా మళ్లీ జన్మించనున్నాడు–అని తెలిపి విఠలేశుడు అదృశ్యమైనాడు.

ఈవిధమైన పాండురంగస్వామి అమృతవచనములవలన ఆదంపతులు అత్యంతహర్షమును పొంది స్వామికి నిదురనుండి లేచి మొక్కినారు. కృతజ్ఞతలు తెలిపారు. మేము ధన్యులైనామని, మా జన్మ సార్థకమైనదని మురిసిపోయినారు. ఇంతలో భగవద్వచనానుసారముగా స్త్రీ గర్భమును ధరించింది. క్రమముగా నవమాసములు నిండినవి. సుందరమైన పుత్ర రత్నమును కన్నది. ఆదంప-తులు తమ పుత్రునికి సంప్రదాయానుసారముగా "**గణపతి**" అను నామకరణము చేసినారు. చిన్న-

తనమునుండి పాండురంగ భజనయందు ప్రవృత్తున్ని చేస్తున్నారు.క్రమంగా గణపతి ఎనిమిది సంవత్సరాల బాలుడైనాడు. విధిపూర్వకముగా ఆయనకు ఉపనయన సంస్కారముచేసి తారకమంత్రోపదేశమును చేసినారు. అప్పటినుండి గణపతి ఆ దివ్యమంత్రమును జపించడము మొదలు పెట్టినాడు. లేచినప్పుడు, కూర్చున్నప్పుడు, భుజించునప్పుడు, నడుస్తున్నప్పుడు అఖండముగా ఆ దివ్యమంత్రమునే విస్మరించకుండా స్మరిస్తూ దృఢమైనవిశ్వాసముతో భజించుటవలన వివేక వైరాగ్యములు ఉత్పన్నమైనవి.పదిహేనుసంవత్సరములు ప్రాప్తించినమీదట గణపతి తీర్థాటనగూర్చి బయలుదేరి అనేకపుణ్య క్షేత్రములను దర్శిస్తూ దర్శిస్తూ చివరికి గురుస్థానమును పొందినాడు.'**వరాడ్**'ప్రాంతంలో 'ఏహలే' గ్రామము బయట "**తుకారామ చైతన్య**" అను పేరుగల ఒక సత్పురుషుడుండేవాడు. ఆయనయొక్క కీర్తిప్రతిష్ఠలను జ్ఞానప్రతిభను విని 'గణపతిబువా' ఆయనలో సద్గురులక్షణములు సంపూర్ణముగా ఉన్నవని తెలుసుకొని, ఆయనను సద్గురుదేవునిగా భావించుకొని దర్శనార్థము వెళ్ళినాడు.

అప్పుడు ఆ సద్గురువు, ఈయన గజదొంగ ఉన్నాడు, దొంగతనము చేయుటకు వచ్చినాడు– అని అంటాడు. సమీపమందున్నటువంటి శిష్యులు సద్గురుదేవుని వచనములను విని ఆశ్చర్యచకితులైనారు. కాని,ఆ సద్గురుదేవునియొక్క అమృతవాక్కుల అభిప్రాయమును'గణపతిబువా'తెలుసుకుని, మనమున సంతసించి, నేను ధన్యుడనైతినని అనుకున్నాడు.

అప్పుడు గణపతిబువా అంటాడు. ఓ సద్గురుదేవా!నేను యోగ్యమైన సద్గురుదేవునిగూర్చి అనేక క్షేత్రములను తిరుగుతూ సద్గురుదేవుని శోధిస్తూ శోధిస్తూ మీయొక్క జ్ఞానవైభవ ప్రతిష్ఠలను విని, మీరే యోగ్యమైన సద్గురుదేవులని నిశ్చయముగా మీవలన నేను ధన్యుడను కాగలనని, మీ పాదకమలములను ఆశ్రయించినాను. ఓసద్గురుదేవా! నన్ను స్వీకరించి అనుగ్రహించుము.మీయొక్క సేవలుచేస్తూ ఇక్కడే ఉంటాను-అని దీనుడై తన అభిప్రాయమును వ్యక్తము చేసుకున్నాడు.

అప్పుడు తుకారామ చైతన్య స్వామి అంటాడు. ఓ గణపతి బువా! నేను చాలా క్రూరుడను, చెడ్డవాన్ని. నా సేవచేయడము నీవల్ల కాదు. నీకు తెలియకుంటే ఇక్కడ ఉన్న ఈ నా శిష్యులను అడిగి,నాయొక్క స్వభావముగూర్చి తెలుసుకో–అని అంటాడు.ఈవిధముగా పలుకుతూపలుకుతూనే రాళ్లు తీసుకొని గణపతిని కొట్టడము ప్రారంభించాడు. తుకారామ చైతన్య స్వామి విసిరిన రాళ్లు గణపతికి తాకి, క్రింద పడుచుండగా, గణపతి తాను ఆ రాళ్ళను అన్నిటిని ప్రోగు చేస్తున్నాడు. ఈ రాళ్లు చాలా పూజనీయములు. ఇవి పుష్పములతో సమానము. ఇవి సద్గురు ప్రసాదమని భావించి నుదుట ధరించినాడు. సద్గురు స్పర్శను పొందిన ఈ రాళ్లు చాలా పవిత్రమైనవి–అని అనుకుంటూ ప్రోగు చేస్తున్నాడు. అప్పుడు సద్గురుదేవుడు చాలా కోపముతో గణపతిబువాను దగ్గరకు పిలుచుకొని నా పాదములు చాలా నొప్పిగా ఉన్నవి, కాస్త మర్ధించుము–అని అంటాడు. అప్పుడు గణపతిబువా మహాప్రసాదమని సద్గురుదేవుని ఆజ్ఞ లభించినదని సేవకు పూనుకొని, పాదములు ఒత్తుచుండెను.

కమలములవంటి కోమలమైన సద్గురుదేవుని పదములను స్పర్శించి గణపతి సేవచేస్తున్నాడు.పాదములను స్పర్శచేయగానే, సద్గురుదేవుడు కోపమునకు వచ్చి అబ్బబ్బ....నీచేతులు ఎంత కఠినముగా నున్నవి. నేను సహించలేను అంటూ గణపతిని ఒక్క తన్ను తన్నినాడు. ఈ ఘటనవలన గణపతి ఏ మాత్రము సంకోచింపకుండా చేతులు జోడించి అక్కడే వినయముతో లేచి నిలబడినాడు. అప్పుడు సద్గురుదేవుడు అంటాడు. మనమిద్దరము ఇప్పుడు వనము లోనికి వెళ్లి వంటచెఱకును తీసుకొద్దాము, అని అనగా గణపతి అతి వినయముతో ఓ సద్గురుదేవా! నేను ఒంటరిగా వెళ్లి వంట చెఱకును తెస్తాను, స్వామీ! మీకెందుకు ఈ శ్రమ. మీరు ఇక్కడే ఉండండి–అని గణపతి అంటాడు.

అప్పుడు తుకారామ చైతన్య గురుదేవుడు అంటాడు. నీకు కట్టెలగూర్చి మంచి చెడులు తెలియవు. నేను నీ వెంబడి ఉంటే మంచి కట్టెలను ఎన్నుకొని తీసుకొద్దాము–అని వనమునకు బయలు దేరినాడు. గురుశిష్యులు ఇద్దరు వనములో ప్రవేశించి మంచిమంచి కట్టెలను పోగుచేసి గణపతి యొక్క దోతిలో మూటకట్టినారు. ఆ కట్టెలమోపును లేపి గణపతియొక్క నెత్తిన పెట్టినాడు. సద్గురు దేవుడు తన చేతితో ఒక సన్నని పొడుగాటి బెత్తమును ధరించి గణపతితో అంటాడు. నీవు ముందు నడువుము. నీ వెనక నేను వస్తాను. సద్గురు ఆజ్ఞను శిరసావహించి గణపతి ముందు నడుస్తున్నాడు.

ఇద్దరు మనుష్యులు మోయగల కట్టెలను కట్టి గణపతికి ఎత్తినాడు. కావున, భారము ఎక్కువై శిరస్సున బాధగలుగ, గణపతి క్షణకాలము కట్టెలమోపును దించుదామని ఆగబోగా వెంటనే వీపుపై బెత్తము దెబ్బపడింది. ఈవిధముగా కొట్టుచు నడిపిస్తున్నాడు."*నెత్తిన కట్టెలమోపు,వీపున బెత్తము తీపు*" తీయుచుండగా,నోటితో అఖండముగా రామనామ స్మరణచేస్తూ ఉన్నాడు.ఇట్లు,ఒక ఘడియ కాలము నడుచినారు. భారయుక్తమైన కట్టెలను మోయుచు, దెబ్బల బాధను అనుభవిస్తూ సద్గురు దేవునిపై అఖండవిశ్వాసముంచి నెమ్మదిగా నడుస్తున్నాడు.క్షణకాలము నిలబడగానే వెంటనే బెత్తముతో కొట్టుచుండెను. ఈవిధముగా భారమును మోయలేక, దెబ్బల బాధలకు ఓర్వలేక గణపతి మూర్ఛితుడై నేలపై పడిపోయినాడు. శిష్యుడు దేహస్ఫురణలేకుండా పడిపోవడము చూసిన సద్గురు దేవుని హృదయము కరిగిపోయింది. దయార్ధహృదయుడైన సద్గురుదేవుడు తనయొక్క అమృతహస్తమును శిష్యుని శిరస్సుపైనుంచి ఆశీర్వదించినాడు. వెంటనే గణపతి లేచి కూర్చున్నాడు.

తదనంతరము సద్గురుదేవుడు గణపతిని చేతితో పట్టుకుని మెల్లగా నడిపించుకుంటూ ఒక చల్లని నీడగల చెట్టు క్రిందకు తీసుకెళ్లి కూర్చుండబెట్టినాడు. తనయొక్క కృపాదృష్టిని ప్రసరింపజేయగా శిష్యుని తాపము ఉపశమించింది. తత్క్షణమే శిష్యుని బాధలు సమూలముగా నివృత్తమైనవి. ప్రశాంతచిత్తుడైన శిష్యుని ప్రసన్నముఖచిహ్నములను గుర్తించి సద్గురుదేవుడంటాడు. నీవు నిజమైన దొంగవు.ఎందుకనగా నీవు నాయొక్క హృదయమును పూర్తిగా దోచుకున్నావు.నాయొక్క అభిప్రాయమును క్షుణ్ణముగా తెలుసుకున్నావు. నీవంటి నిజమైన శిష్యుడిని ఇప్పుడు పొందినాను. అప్పుడు

సద్గురుదేవుడు యథార్థమైన ఆత్మజ్ఞానోపదేశము చేసినాడు.శిష్యుడు దానినిపొంది దేవతలకుగూడా దుర్లభమైన ఉత్తమపదవిని చేరుకున్నాడు. శిష్యుడు సమాధిస్థితిని పొందినాడు. అప్పుడు సద్గురు దేవుడు శిష్యుని సమాధిస్థితినుండి ఉత్థానముచేసి–ఇలాఅంటాడు.ఈజ్ఞానము దృఢముగా ఎల్లప్పు-డూ ఉండాలంటే పవిత్రమైన పరమాత్ముని నామస్మరణ విడువరాదు–అని కర్తవ్యమును బోధించి-నాడు.మరియు '**దాసబోధ**'అను గ్రంథమును ఎల్లప్పుడూ త్రికరణశుద్ధిగా భక్తిశ్రద్ధలతో అధ్యయనము చేయుము. నేను చెప్పినట్లు మూడు కాలములయందు మెదలవలయును. ఇప్పుడు నీవు నీయొక్క గృహమునకు వెళ్లి,ఎవరైనా భక్తులు నీవద్దకువచ్చి భవసాగరతరుణోపాయమును కోరుదురో, వారి అధికారమును చూసి నామస్మరణ, ఉపాసన, జ్ఞానమును బోధించుము. నీవు ఇప్పుడు ఏది పొంద దగినదియుండెనో, దానిని (జ్ఞానమును) పొందినావు. నీవు కృతకృత్యుడవైనావు. నీవు శుద్ధచైతన్య స్వరూపమును పొందినావు. కావున, ఈరోజునుండి నీయొక్క పేరు "**బ్రహ్మాచైతన్య**" అని పేరిడెను.

సద్గురుదేవుడు హృదయపూర్వక ప్రేమామృతవచనములచే శిష్యునియొక్క అనుభవమును గుర్తించి,"బ్రహ్మాచైతన్య"అనే నామకరణముచేసి ఆశీర్వదించినందుకు,ఆసంతోషము పట్టలేక శిష్యు-డు ఆనందాశ్రువులద్వారా తన్మయుడై సద్గురుదేవుని చరణకమలములనాశ్రయించినాడు. తర్వాత శిష్యుడు అంటాడు. ఓ సద్గురుదేవా! నేను ధన్యుడనయ్యాను. దయాసాగరుడవైన ఓ సద్గురురాజా! నాయొక్క నిజస్వరూపమును నాకు యథార్థముగా దర్శింపజేసినావు. కృతకృతుడనయ్యాను.

'బ్రహ్మాచైతన్య' ఈరీతిగా పలుకుతూ మళ్లీ ఒకసారి సద్గురు పాదకమలములకు నమస్క-రించి, సద్గురుదేవుని ఆజ్ఞమేరకు స్వగృహమునకు వెళ్ళెను. ఆయనయొక్క స్వస్థానములో (స్వగృ-హములో) ఉంటూ సద్బోధలు గావిస్తుంటే, అనేకమంది భక్తులు 'బ్రహ్మాచైతన్య' సన్నిధానమునకు వచ్చి సద్బోధలను విని తరింపబడినారు.ఎంతోమంది భక్తులకు నామమంత్రోపదేశమును చేసినా-డు. తద్వారా ఎందరో తరించినారు.

హుబ్లీ పట్టణములో గోంద్వలేకర్ మహారాజు అనేవాడు ఒకడుండేవాడు. ఆయనయొక్క భక్తుడు తమ్మన్నశాస్త్రి అను గొప్ప విద్యాపారంగతుడుండేవాడు. ఆ తమన్నశాస్త్రి సద్గురు సిద్ధనాథు-నికి సన్నిహిత శిష్యుడు. ఆయన మరియు ఇతర భక్తజనులు అందరూ కలిసి హుబ్లీ పట్టణమందలి ఇతర అనేక భక్తుల ఉద్ధరణార్థము బ్రహ్మాచైతన్యను తీసుకురావడానికి ఆమంత్రణము చేసినారు. వారియొక్క ఆమంత్రణమేరకు మరియు అట్లే, హుబ్లీ పట్టణములో సద్గురు సిద్ధనాథుడనే మహాత్ముని కూడా దర్శించి వస్తామని 'బ్రహ్మాచైతన్య'తనయొక్క కొందరి శిష్యులతోగూడి హుబ్లీకి వచ్చి తమన్న శాస్త్రి ఇంట్లో విడిదిచేసినాడు.ఇక్కడ అనేకమంది భక్తులు బ్రహ్మాచైతన్యను దర్శించుకుని ధన్యులమై-నామని ఆనందమునొందినారు.

అయితే,ఎవరైతే సిద్ధారూఢస్వామిని శూద్రుడని నిరాకరించినారో,అటువంటి బ్రాహ్మణులు తండోపతండములుగా బ్రహ్మచైతన్యస్వామి వద్దకువచ్చి మంత్రోపదేశమును తీసుకున్నారు. అనగా బ్రాహ్మణ సంప్రదాయమునకు అవరోధము లేనందున, అందరూ బ్రాహ్మణుడైన 'బ్రహ్మచైతన్య'ను ఆశ్రయించినారు. ఆయనను సిద్ధారూఢస్వామి వద్దకు కులాభిమానముచేత పోనివ్వడము లేదు. ఒక నాడు బ్రహ్మచైతన్యస్వామి బ్రాహ్మణులయొక్క అభిప్రాయమును తెలుసుకొని, ఎవరికి చెప్పకుండా ఎవరిని వెంటబెట్టుకోకుండా తాను ఒక్కడే ఒక బండిమీద సిద్ధాశ్రమమునకు వెళ్ళినాడు.

ఇచ్చట సిద్ధాశ్రమములో సద్గురు సిద్ధనాథుడు విశ్రాంతి కోసము పడుకొని ఉన్నాడు. 'బ్రహ్మ చైతన్యస్వామి'యొక్క ఆగమనమును తెలుసుకొని శయ్యనుండి లేచి సమీపములో ఉన్నటువంటి శిష్యులకు బ్రహ్మచైతన్యస్వామి వస్తున్నాడని హెచ్చరికచేసినాడు.ఇట్లు సద్గురు సిద్ధనాథుడు శిష్యులకు చెప్పి బయటకువచ్చి చూసేసరికి దూరమునుండి బ్రహ్మచైతన్యస్వామి రావడము గాంచి తత్క్షణమే సిద్ధసద్గురుదేవుడు బ్రహ్మచైతన్యస్వామికి ఎదురుగా పరిగెత్తుకుంటూ వెళ్లి, ప్రేమపూర్వకముగా ఆలిం-గనమొనర్చినాడు. అట్టి,ఆఇద్దరు మహాత్ములయొక్క అపూర్వప్రేమానంద ఐక్యానుభూతియొక్క వర్ణన చేయుటకు ఎవరికిని సాధ్యము కాదు. త్రిపురాసురవధానంతరము'శివ-విష్ణువుల' యొక్క కలయిక వలె అద్భుతముగా ఉన్నది. జీవ-శివైక్య స్థితిని పొందిన తర్వాత బ్రహ్మసాక్షాత్కారానందము ఎలా ఉంటుందో, అట్లు, వారిద్దరి ఐక్యములో అంత ఆనందము ప్రతీతమగుచున్నది. ఆ ఆనందములో తల్లీనమై ఇద్దరు దేహభానమును విస్మరించినారు. ప్రేమానందములో నిమగ్నులై ఆనంద భాష్పములు రాల్చారు. అత్యంత ప్రియమైన బంధువు ఎన్నో సంవత్సరముల క్రితము విడిపోయి అదృష్టవశాత్తు మళ్ళీ కలిసినప్పుడు వారి సంతోషము ఎంత అంతుపట్టలేకుండా ఉంటుందో, ఆ విధముగా ఇద్దరు మహాత్ములు ఆనందమును పొందుచున్నారు. ఒకరినొకరు ఆలింగనము చేసుకొని క్షణకాలము విదేహస్థితియందు తన్మయులై బాహ్యజగత్తును సంపూర్ణముగా మరిచినారు. ఆ ఇద్దరు మహాత్ముల యొక్క ఆలింగనమువలన ప్రకటమైన ఆనందకిరణములు ఇతర భక్తులను కూడా తన్మయులను చేసినవి. వారిద్దరియొక్క ఆనందానుభూతిని భక్తులందరూ కూడా అనుభవించారు. త్రిభువనము-లలోగూడ లభ్యము కాని ఆ ఆనందము వర్ణనాతీతమై, అఖండమై ఉండెను. ఆలింగనము తరువాత ఒకరి చరణములకు మరొకరు ప్రణమిల్లుకున్నారు. తదనంతరము సిద్ధారూఢస్వామి బ్రహ్మచైతన్య స్వామియొక్క కరములు పట్టుకొని మఠములోనికి తీసుకెళ్లినాడు. ఉన్నతమైన ఒకే ఆసనమందు ఇద్దరు మహాత్ములు శివ-విష్ణువులవలె ఆసీనులైనారు.

అప్పుడు బ్రహ్మచైతన్యస్వామి సిద్ధారూఢస్వామియొక్క మహిమను తన అమృతవచనముల ద్వారా వర్ణించాడు. మరియు ఓ సద్గురు సిద్ధారూఢస్వామీ! ఈ దేహము 'గోంద్వలే' గ్రామమునందు ఉంటుంది. దీనిని అభిమానించేవారు ఈ హుబ్లీపట్టణములో ఉన్నారు. వారు ఈ పట్టణమునకు

దీనిని ఆహ్వానించినారు. కావున, ఇది ఇక్కడికి వచ్చింది. ఇప్పుడు మీయొక్క సందర్శనమువలన కృతకృత్యతను పొంది పరమానందమును పొందింది. ఈ దేహము ఎల్లప్పుడూ "**శ్రీరామ జయరామ జయ జయ రామ**" అంటూ స్మరిస్తూ ఉంటుంది. మరియు ముముక్షువులకు సద్బోధతోపాటు ఇదే నామమును ఉపదేశిస్తుంది. అదే నామోచ్చారణ చేయిస్తుంది. ఇట్లు ఈ దేహము వ్యవహరిస్తుంది. ఇది మీకు నచ్చినదా, లేదా? దయచేసి చెప్పండి స్వామీ! అని సిద్ధారూఢస్వామిని బ్రహ్మచైతన్యస్వామి అడుగుతాడు.

ఇటువంటి మధుర వచనములను విన్న సద్గురు సిద్ధనాథుని మనస్సు ఎంతో ఆనందమును పొందింది. అప్పుడు సంతుమహాత్ముడైన బ్రహ్మచైతన్యస్వామితో తన రసవత్తర మధురవాక్కులతో తనయొక్క అభిప్రాయమును ఇలా తెలుపుతాడు.అనేక దోషయుక్తమైన ఈ కలియుగములో మాన-వులు తరించడానికి పరమాత్మయొక్క దివ్యనామము ఆశ్రయనీయమై ఉంది. అంతేకాక, పరమేశ్వ-రుడుగూడా పరమపవిత్రమైన '**రామ**'నామ జపము చేస్తుంటాడు.దుఃఖరూపమైన జననమరణరూప సంసారమునుండి తరింపబడుటకు పరమాత్మయొక్క నామమే శ్రేష్ఠమై ఉన్నది. నామమునకు అధి-ష్ఠానమైన నామి (పరమాత్మ)భక్తులయొక్క భారయుక్తమైన సంసారమును నివృత్తిజేస్తాడు.నామము కన్నా శ్రేష్ఠమైన అన్య సాధనము లేదు. జీవుడు బంధవిముక్తుడు కావడానికి ఈనామము పరంపరా సాధనము కాగలదు. దీనినే నీవు జపిస్తున్నావు. ఇదే నామమును నేను ప్రతి శివరాత్రి ఉత్సవ సందర్భములో అఖండముగా అహోరాత్రులు ఏడుదినములు జపింప చేస్తుంటాను. అన్ని వేదాంత శాస్త్రములుగూడా రామనామము సత్యమని, ఆ రాముడే ఆత్మారాముడని, ఆ ఆత్మా రాముడే సకల చరాచర భూతములయొక్క స్వరూపమని హెచ్చరిస్తున్నాయి. అన్ని రకముల జనులను ఉద్ధరించ-డానికి అన్ని సాధనముల కన్న నామోపదేశము శ్రేష్ఠమైనది. ఆ నామమహిమను అందరికీ ప్రబో-ధించడమే సంతుమహాత్ములయొక్క పవిత్ర కార్యమై ఉంది.

**హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్ ।**
**కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥**

సద్గురు సిద్ధనాథుని ముఖకమలముద్వారా వెలువడిన ఈ అమృతవచనములను శ్రవణము చేసి బ్రహ్మచైతన్యస్వామి పరమానందమును పొందినాడు. భక్తులహృదయాలలో ఆనందముప్పొంగి పొరలి వచ్చింది. అందరూ ఇద్దరు మహాత్ములయొక్క చరణారవిందములకు సాష్టాంగప్రణామములు చేసినారు. జయజయకార గర్జనలు చేసినారు. మరియు స్త్రీ భక్తులంతా పంచారతుల(మంగళహార-తుల)ద్వారా ఇద్దరు మహాత్ములకు మధురమైన భక్తిరసములైన మంగళాష్టకములచే గానముచేసి వారియొక్క ఆశీర్వాదములను పొందినారు. తదనంతరము సద్గురు సిద్ధనాథుడు బ్రహ్మచైతన్య స్వామిని చేయిపట్టుకొని లోనికి తీసుకెళ్లి, ఫలహారములను స్వీకరించమని స్వామి ముందుంచి,

స్వహస్తములతో అరటిపండ్లను ఒలిచి, బ్రహ్మచైతన్యస్వామికి తినిపించినాడు.ఈరీతిగా ఒకరికొకరు తినిపించుకున్నారు. ఆ సన్నివేశము అతిమాధుర్యముగా ఉండెను. అటుపిమ్మట బ్రహ్మచైతన్యస్వామి సద్గురు సిద్ధారూఢస్వామియొక్క ఆజ్ఞను పొంది, శాస్త్రిగారి ఇంటికి వచ్చినాడు.

అప్పుడు తమ్మన్నశాస్త్రిగారు బ్రహ్మచైతన్యస్వామితో ఇలా అంటాడు. ఓ సద్గురుదేవా! మీ యొక్క మహిమను హరిహరులుగూడా తెలుసుకొనజాలరు. నీవు సద్గురుసిద్ధనాథుని కలుసుకోవడము మరియు అంతటి గొప్పమహాత్ముడు నిన్ను ఆదరించినాడూ—అంటే సంతుమహాత్ములయొక్క వైభవము సంతులకే గోచరమగును. మాకు తెలియనలవి కాదు. కావున, నిన్ను హృదయపూర్వకముగా అడుగుతున్నాను. సిద్ధ సద్గురుదేవుడు ఎటువంటి వాడు? ఆయన మహిమ ఎటువంటిది? దయచేసి తెలపండి స్వామీ! అని శాస్త్రి అడిగినాడు. అప్పుడు బ్రహ్మచైతన్యస్వామి ఈ విధముగా ప్రకటిస్తాడు. సిద్ధారూఢస్వామి సాక్షాత్ ఈశ్వరావతారము. ఆయన పూర్వము మహారాష్ట్ర దేశములో 'జ్ఞానేశ్వర్'మహారాజుగా అవతరించి,యథార్థముగా ఆత్మారాముని పొంది,ఆత్మస్వరూపుడై యుండెను. ప్రస్తుతము ఆ జ్ఞానేశ్వర్ మహారాజుగారే కర్ణాటకలో అనేక జనులను ఉద్ధరించుటకు ప్రత్యక్ష దైవమై యతీశ్వరుని రూపములో అవతరించినాడు.

ఇటువంటి వచనములను శాస్త్రి విని అమితానందభరితుడై, సిద్ధాశ్రమమునకు వెళ్లి సిద్ధనాథుని కలుసుకొని, స్వామికి సాష్టాంగ నమస్కారములుచేసి, ఈవిధముగా అడుగుతాడు. ఓ సిద్ధారూఢ యతీశ్వరా! నేను అజ్ఞానముతో ఒక విషయము అడుగుతాను, తాము దయచేసి చెప్పండి. బ్రహ్మచైతన్యస్వామి మిమ్ములను దర్శించే కుతూహలముతో మీవద్దకు వచ్చినాడు. సంతుల హృదయము సంతుమహాత్ములకే యెరుక. కావున, ఆయనయొక్క మహిమ నాకు తెలియక మిమ్ములను విచారిస్తున్నాను. కృపతో అనుగ్రహించండి స్వామీ! అప్పుడు సిద్ధ సద్గురుదేవుడు అంటాడు. ఆయన పూర్వము'**సమర్థరామదాసు**'గా అవతరించి ఉండెను.ఆయనను నీవు నేను ఎరుగలేదు.కాని,ఇప్పుడు ఆయన ప్రత్యక్షముగా బ్రహ్మచైతన్యస్వామిగా అవతరించినాడు. ముముక్షువులయొక్క పుణ్యము వలననే ఇటువంటి మహాత్ములు ప్రకటమవుతారు,అని ఇట్టి,సద్గురువచనములను విన్న శాస్త్రి పరమానందమును పొంది సంశయరహితుడైనాడు. ఈవిధముగా సంతుమహాత్ములయొక్క మహిమలు శ్రవణముచేయుటద్వారా అంతఃకరణశుద్ధిగలిగి సద్గురుదేవుని సంబంధముగలిగి,ఆయన కృపద్వారా గురుప్రసాదరూపమైన జ్ఞానము కలుగగలదు. రసవత్తరమైనటువంటి ముందర అధ్యాయమునందు తమ్మన్నశాస్త్రియొక్క విశేషకథనము జరుగుతుంది. ఆయనే సచ్చిదానందబువా అని వ్యవహరింప బడుతాడు. సిద్ధారూఢస్వామికి మిక్కిలి ప్రీతి పాత్రుడౌవుతాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రముననే సకల పాపములు

భస్మమైపోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది మూడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది నాలుగవ అధ్యాయము

పద్యానువాదము:—చైతన్యస్వరూపుడవైన ఓ సద్గురుసిద్ధనాథా! భక్తులయొక్క ఆర్తనాదములను హరించే దివ్యమూర్తి! నీయొక్క అద్భుతమైన కీర్తిని స్తుతించి వర్ణించడానికి నీ పాదదాసుడనైన నా బుద్ధియందు స్ఫూర్తిని కలిగించుము.

కృపాసాగరుడవైన ఓ సద్గురు సిద్ధనాథా!ఉదారస్వరూపుడవై భక్తులను రక్షిస్తావు. అంతేగాక, అభక్తులనుగూడ కరుణిస్తావు. మరియు ముముక్షుజనులకు జ్ఞానమును ప్రసాదిస్తావు. ఇటువంటి దివ్యమూర్తిని స్మరిస్తూ ఏ కార్యమును ప్రారంభించినా సకల విఘ్నములు (అనర్థములు)నివృత్తమై అనాయాసముగా కార్యసిద్ధి లభిస్తుంది.ఆ సద్గురుదేవుని చింతనద్వారా కోరికలన్నీ సఫలము కాగలవు. ఆయన దర్శనభాగ్యము కలిగినచో ప్రపంచములో కీర్తి ప్రతిష్ఠలు కలుగుతాయి. ఆయనపై సకల భారమునుమోపి సాష్టాంగ దండవత్ ప్రణామములు చేసినట్లైనా సకలకామనలు పూర్ణ ఫలమునిస్తాయి. ఒకవేళ ద్రవ్య(ధన) ప్రాప్తి ఇచ్ఛ ఎవరికైనా ఉన్నట్లయితే, సద్గురుదేవుని మనస్ఫూర్తిగా చరణకమలములనాశ్రయించి, భజించినచో వారి మనోఽభీష్టములు సిద్ధించును.

ముల్లోకములలోగూడా లభ్యముగాని జ్ఞానము కేవలము సద్గురుదేవుని వద్దనే ఉంది. కావున, సద్గురుచరణాలను హృదయపూర్వకముగా ఆశ్రయించినచో, సద్గురుదేవుడు ప్రసన్నుడై అసాధ్యమైనటువంటి ఆ జ్ఞానము తప్పకుండా అనాయాసముగా ప్రసాదిస్తాడు.సకలతీర్థములు ఏకత్రితమైన స్థానము సద్గురుదేవుడు, జ్ఞాననిధి. కావున, సద్గురు చరిత్రను ఆదరనీయముగా శ్రవణము చేయవలెను.

భక్తులలో అగ్రగణ్యుడు, సంతులలో శ్రేష్ఠుడు, జ్ఞానులలో శిరోమణి-ఇన్ని సుగుణములతో గూడిన తమ్మన్నశాస్త్రి అను భక్తుడున్నాడు. ఆయనయొక్క జన్మస్థలము "నవలగుంద". "హుబ్లీ"లో నివసిస్తూ,పురాణములు,శాస్త్రములను ఎంతోగంభీరముగా బోధిస్తూ ఉన్నాడు.అసంఖ్యాకమైన భక్తులను ఉద్ధరింపజేయుచుండెను.ఎటువంటి శాస్త్రసంబంధములేని మూఢులైన భక్తులకుగూడా ఉత్తమ భక్తిమార్గమును బోధించేవాడు. పురాణప్రవచనములద్వారా భక్తులకు ప్రేమానురాగములను వృద్ధిజేసి, తన వాక్చాతుర్యముచే పరమార్థము యందు ప్రీతి కలిగించేవాడు. ఆ తమన్నశాస్త్రి నిరభిమాన, ఉదాసీనవృత్తిచేత వైరాగ్యాది షడ్గుణసంపన్నుడై సమస్త వాసనలను త్యజించి నిష్కళంకుడైయుండెను.

తమన్నశాస్త్రి ఒకనొక సమయములో శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి సాన్నిధ్యమునకు వచ్చి సిద్ధనాథుని చరణములను ఆశ్రయించి దీనభావముతో ఇలా ప్రార్థించినాడు. ఓ సద్గురుదేవా! నీవు జ్ఞానరాశివి. ముముక్షుజనులకు ఆశ్రయమిచ్చి, నీ చరణాలను ఆశ్రయించిన వారికి నిశ్చయముగా అక్షయ పదవిని ప్రసాదిస్తావు. నీయొక్క అగాధమైన కీర్తిని విని, ఈ సంసారమునుండి విరక్తుడనై, తరింపజేయ సమర్థుడవని నిశ్చయించుకొని, నీ చరణాలను ఆశ్రయించినాను. నేను సంసారతాప-త్రయములచేత గ్రసింపబడియున్నాను. సంసారములోని విషయాలయందు ఏమాత్రముగూడా సుఖములేదు. దుఃఖరూపములేయున్నవి. అటువంటి సంసారము ఏ ఉపాయముచేతగూడా నివృత్తి కాదు.

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।**

**ఆద్యన్తవన్త కౌన్తేయ న తేషు రమతే బుధః ॥** (గీత. 5-22)

**దుఃఖాలయమశాశ్వతమ్** (గీత.8-15)

కావున, నీ ద్వారా నేను తరింపబడగలనని నీయొక్క శరణుజొచ్చినాను. ఇటువంటి ఆర్తనాద, దీనవచనములను విని దయార్ద్రహృదయుడైన సద్గురుదేవుని హృదయము ద్రవించి ఈ ప్రకారముగా ఆశీర్వదిస్తాడు.

నాయనా! తమ్మన్న శాస్త్రీ! వాస్తవముగా నీవు వైరాగ్యాది సాధన సంపన్నుడవు. స్వతస్సిద్ధ-ముగా జ్ఞానరాశివి. కాని, బయటకు నరవేషములో ఉన్నావు. ఏమి తెలియని అజ్ఞానివలె ఉండి, సకల జీవులను ఉద్ధరించడానికి నీవు అనుభూతిని పొందిన సాధనలను భక్తులకు బోధిస్తున్నావు. అయినాగాని నీకొక గురువు-అంటూ ఉండాలి. ఎందుకనగా, సాక్షాత్ అవతారస్వరూపులైన రామ కృష్ణాదులుగూడా వశిష్ఠ సాందీప్యులను గురువుగా చేసుకొని గురుసంప్రదాయమును నిలబెట్టినట్లు చరిత్రలు చాటిచెబుతున్నాయి.

నీవు వైరాగ్య సంపన్నుడవైయుండి, నిరభిమానవృత్తిచేత జనులను ఉద్ధరించుటకు బోధిస్తూ ఉన్నావు. అయినను,నిన్ను నీవు శోధించుటకు. లోటుపాట్లలు సరి చేసుకొనుటకు ప్రయత్నిస్తున్నావు. నాకు చాలా ఆనందము కలిగింది. నీలో ఏ విధమైన సాధనల లోటులేదు. ఇదే విధముగా నీయొక్క సాధనలను భక్తులకు బోధిస్తూ ఉండుము. అయితే, నీకు ఒక గురువు అంటూ అవసరముంది గావున,నేను ఇప్పుడు ఆజ్ఞాపిస్తున్నాను.

"గోందువలే" పురములో "బ్రహ్మచైతన్య" అను పేరుతో విలసిల్లుతున్న మహాభక్తుడున్నాడు. ఆయనయొక్క కీర్తి అపారమై వ్యాపించినది. నీవు ఆయనకు శరణువెళ్లుము. లోకసంగ్రహార్థము నీవు ఆయనకు శరణుజొచ్చి, జనులకు ఆదర్శముగా ఉండి, సకల జీవులను ఉద్ధరింపుము. శ్రీకృష్ణ పర-మాత్మగూడా శ్రీమద్భగవద్గీతలో చెప్పియున్నాడు.

**శ్లో ॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥** (గీత. 3-21)

ఈ ప్రకారముగా తమ్మన్నశాస్త్రి సద్గురు సిద్ధనాథునియొక్క అమృతవచనములను విని ఆనంద భరితుడై, సద్గురుదేవునికి సాష్టాంగప్రణామములుచేసి,స్వామియొక్క ఆశీర్వాదమును,ఆజ్ఞను గైకొని బయలుదేరి,గోందువలే పురమును చేరి బ్రహ్మచైతన్యస్వామిని దర్శించి దండవత్ ప్రణామ-ములుచేసి, తనయొక్క వృత్తాంతమును తెలిపి, ఆవేదనను నివేదించుకున్నాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క మహిమను యథార్థముగా తెలుసుకుని నిన్ను ఆశ్రయించినాను. నీవు దయదలచి నన్ను స్వీకరింపుము. నాయొక్క హితమేమిటో నాకు యథార్థముగా తెలియదు. కావున,అజ్ఞానియై నిన్ను ఆశ్రయించి వచ్చాను. దీనదయాళుడవైన ఓ సద్గురురాయా! నాకు నిజమైన హితమును బోధించ వలసినదిగా అర్థిస్తున్నాను.

ఇటువంటి ఆర్తవచనములను విని, శ్రీ బ్రహ్మచైతన్యస్వామి, తమన్నశాస్త్రియొక్క అధికార-మును గుర్తించి ఈవిధముగా అంటాడు. నీవు నివసించే హుబ్లీపట్టణముయందే సిద్ధారూఢ యతీంద్ర మహాత్ముడున్నాడు. ఆయన సకల అజ్ఞజీవులను ఉద్ధరించేవాడైయుండియు నిన్ను నావద్దకు పంప-డము–ఇది ఆయనయొక్క ఔదార్యము, ఆశీర్వాదముగూడ. నేను కేవలము నీకు నిమిత్తమాత్రుడను. అందువలన, నీకు మంత్రోపదేశము చేస్తున్నాను. ఈమంత్రమును పదమూడు లక్షలు జపించినట్లైన నీయొక్క భవబంధము తొలగి, లక్ష్యమును చేరుకోగలవు. ఇదిగో, ఆ మంత్రము:—ఉచ్చరింపుము.

"**శ్రీరాం జయరాం జయ జయ రామ్**"

వెంటనే సద్గురుదేవుని ఆజ్ఞనుసారముగా పరమపవిత్రమైన దివ్యనామమును ఏకాగ్రచిత్తము చేత నిర్జన ప్రదేశమునందు కూర్చుని, దృఢమైన భక్తిచేత జపించినందున మంత్రదేవత అయిన శ్రీరామప్రభువు ప్రత్యక్షమై దర్శనమిచ్చినాడు. కోటిసూర్యప్రభలనధిగమించు దివ్యజ్యోతి ప్రకాశము-లో వ్యాపించినటువంటి శ్రీరామమూర్తిని దర్శించి,తమన్నశాస్త్రి దేహభావమును విస్మరించి సమాధి స్థితిని పొందినాడు. ఘటికకాలము మైమరచి శ్రీరామప్రభువును మనసారా దర్శిస్తూ దర్శిస్తూ తన్మయుడై ఇట్లు,వేడుకుంటున్నాడు. నీయొక్క దర్శనలాభము ఎల్లప్పుడు కలుగులాగున ఆశీర్వ-దింపుము. మరియు పరిచ్ఛిన్నభావన లేకుండా చేయుము స్వామీ! అప్పుడు శ్రీరామప్రభువు ఆశ్వా-సనమిస్తూ నాయనా! ఏ నామ జపముచేత నా దర్శనము నీకు లభించిందో, మళ్లీ అదే నామ-మును ఎల్లప్పుడూ విస్మరించకుండా జపిస్తూ ఉండుము. నా దర్శనము నీకు ఎల్లప్పుడు లభించును గాక! నీయొక్క అభీష్టములు నెరవేరుగాక-అని ఆశీర్వదించినాడు.

అప్పుడు శాస్త్రి అతి ప్రేమచేత శ్రీరామప్రభువునకు నమస్కారము చేసినాడు. స్వామి అంత-ర్ధానమయ్యాడు. సద్గురుదేవుని కృపద్వారా పొందిన ఈ అనుభూతిని సద్గురు ప్రసాదముగా భావించి

సద్గురుచరణాలను పదేపదే శిరసా నమస్కరించాడు. హృదయములో అపారమైన ప్రేమానందము ఉప్పొంగి వస్తుండగా ప్రేమాశ్రువులను రాల్చాడు. తరువాత సద్గురు బ్రహ్మచైతన్యస్వామి,తమ్మన్న శాస్త్రిని ఉద్దేశించి ఇలా అంటాడు. సచ్చిదానంద స్వరూపుడైన సద్గురుదేవుడు కరుణించి నిన్ను ప్రేరేపించి నా వద్దకు పంపించడము, నా ద్వారా తారకమంత్రమును పొంది బ్రహ్మానుభూతిని నీవు పొందడము, ఇదంతా సిద్ధసద్గురుదేవునియొక్క కరుణయే. కావున, నీకు నేను "సచ్చిదానందుడ"నే పేరిడుచున్నాను.ఇప్పుడు నీవు వెళ్లి జనులను ఉద్ధరించవలసింది-అని ఆశీర్వదిస్తూ,ఆజ్ఞాపించినాడు.

తదనంతరము శాస్త్రి, బ్రహ్మచైతన్యస్వామియొక్క ఆజ్ఞను శిరసావహించి, హుబ్లీ పట్టణమునకు చేరుకొని సద్గురుసిద్ధారూఢస్వామిని దర్శించి సద్గురుచరణకమలములకు అనన్యభావముచే సాష్టాంగ దండవత్ ప్రణామములు చేసినాడు. మరియు ఓ సద్గురుదేవా! నీయొక్క ఆజ్ఞానుసారముగా నేను బ్రహ్మచైతన్య సద్గురుదేవుని ఆశ్రయించి త్రయోదశాక్షరి మంత్రమును బడసి కృతకృత్యుడనయ్యాను అని అన్నాడు.నీయొక్క కృపచేత నేను సర్వత్ర నీయొక్క స్వరూపాన్ని దర్శించగలిగినాను. కావున, నేను బ్రహ్మానుభూతిని పొందినాననే అభిమానము నాలో రాకుండా యుక్తిని బోధించుము స్వామీ! అని వేడుకుంటాడు. ఇటువంటి నిరభిమాన వచనములను విని సద్గురుదేవుడు నవ్వుకొని ఇలా అంటాడు. నాయనా! ఆ అభిమానము పోవాలంటే నీవు ఇంటింటికి వెళ్లి భిక్షను సేకరించి అన్నసంతర్పణ గావించుము.

సద్గురుదేవుని ఆజ్ఞనుసారముగా తమన్నశాస్త్రి భిక్షావృత్తిని స్వీకరించి, భిక్షను సేకరించి లోక కళ్యాణము కొఱకు ఆబిక్షను జనులకు అన్నసంతర్పణచేయుటకు సంకల్పించుకున్నాడు."దాసనవమి" సందర్భముగా భవ్యమైన ఉత్సవముచేయుటకు నిశ్చయించుకుని,సద్గురుదేవుని ఆజ్ఞమేరకు మండపము నిర్మించినాడు. సప్తదివసములు కార్యక్రమము జరుపుటకు నిర్ణయించినాడు. రాత్రింబవళ్లు కీర్తనలు, భజనలు, ప్రవచనములు, గావిస్తున్నాడు. దూరదూర ప్రాంతములనుండి హరిదాసులు కీర్తనలు చేయుటకు విచ్చేసినారు. అనేకమంది భక్తజనులు కీర్తనానందమును అనుభవిస్తున్నారు.

ఈ విధముగా అఖండముగా ఉత్సవము ఆనందపూర్వకముగా జరిపించిన పిదప ఎనిమిదవ రోజున ఉపసంహార సమారాధన కార్యక్రమము నిర్వహించుటకు అసంఖ్యాకమైన భక్త జనులను పిలిపించినాడు. సుమారుగా పదివేలమంది భక్తులు వచ్చినారు. మొదలు వేయిమంది చొప్పున రెండు పంక్తులు అయినవి. ఇంకా ఎనిమిది వేలమంది భోజనముచేయుటకు సిద్ధముగా ఉన్నారు.

ఈ ప్రకారముగా భోజన సమారంభము ఎంతో గంభీరముగా జరుగుచున్న సమయములో సద్గురు సిద్ధనాథుడు వచ్చిచూసి ఎంతో ఆనందమును పొందినాడు. మరియు తనయొక్క అమృతవచనములతో ఇలా అంటున్నాడు. తమ్మన్న శాస్త్రీ! నీవు ధన్యుడవయ్యా!నీ కీర్తి చిరస్థాయిగా ఈ

భూలోకములో నిలిచిపోతుంది. ఇటువంటి గొప్ప సమారాధన నిర్విఘ్నముగా జరుపుతున్నందుకు నీవు ధన్యుడవు–అంటూ సద్గురు దేవుడు తన్మయుడై సంతోషముతో పలుకుతాడు.

అప్పుడు తమ్మన్నశాస్త్రి అంటాడు. సద్గురుదేవా! నాదేమున్నది, దీనికంతటికి కర్తవు నీవే. ఈ వైభవమంతా నీదే. నీయొక్క కృపచేతనే నిర్వహింపబడుతున్నది. నేను కేవలము నిమిత్తమాత్రుడను. కాని,ఓ సద్గురునాథా!ఇప్పుడు భోజనముచేయుటకు ఇంకా ఎనిమిదివేలమంది సిద్ధముగానున్నారు. కాని, భోజనప్రసాదము రెండువేలమందికి మాత్రమే తయారచేసినాము. అందరికి సరిపడేటట్టు లేదని తహతహ పడుతూ ఖిన్నమనస్కుడై తన అభిప్రాయమును వ్యక్తపరుస్తూ, ఇప్పుడు భోజనప్రసాదము మిగతా వారికి ఎలా వడ్డించేది? అప్రతిష్ఠకు గురికావలసి వస్తుందేమో స్వామీ! అని సద్గురుదేవుని శాస్త్రి విచారించినాడు. సద్గురుదేవా! ఈ విపత్తునుండి నీవే రక్షింపుము. నీవే కర్తవు. భారమంతా నీదే స్వామీ! అంటూ సిద్ధనాథుని పాకశాలలోకి తీసుకెళ్ళాడు.

అప్పుడు సిద్ధసద్గురుదేవుడు, తనయొక్క కృపాదృష్టిని పాకశాలలోని భోజన ప్రసాదములపై ప్రసరింపజేసి, అంటాడు. నాయనా! నీవేమీ బెంగపడకు.భోజన ప్రసాదములు సరిపడతాయో లేదో అని చింతించక ఆ సద్గురుదేవుని స్మరించి, వడ్డన ప్రారంభించు. తొందరగా భోజన కార్యక్రమము సాగించండి-అని ధైర్యము చెప్పగా, శాస్త్రి చిత్తములో ధైర్యము చేకూరింది. ఆనందముతో సంతోషించినాడు. మరియు తమ్మన్నశాస్త్రి అంటాడు.నాయొక్క హృదయభారమును సద్గురుదేవుడు తనయొక్క అభయ వాక్కుద్వారా నివృత్తి చేసినాడు. ఇక ఎలాంటి భయము లేదు. నిస్సంకోచంగా వడ్డించండి-అని కార్యకర్తలకు సెలవిచ్చినాడు. భోజన ప్రసాదములు ముమ్మరముగా వండిస్తున్నారు. భక్తులందరికీ మళ్లీ మళ్లీ తినండి, తృప్తిగా భుజించండి, అని వడ్డిస్తున్నారు. అన్నము,శాకము ఏ లోటులేకుండా వడ్డిస్తున్నారు. అందరూ తృప్తిగా భుజిస్తున్నారు. ఇంతలో ఒకానొకడు ఇంత మందికి భోజనము ఎలా వడ్డించ గలుగుతున్నారు? భోజనము రెండు వేలమందికి మాత్రమే తయారు చేసినారు. వడ్డించేది పదివేల మందికి. ఇది ఎలా సాధ్యము-అని శంకించి, పాకశాలలోకి వెళ్లి చూసినాడు. భోజన సంగ్రహము చాలా మిగిలి ఉంది.

భక్తులందరూ భోజనముచేసిన పిమ్మట వడ్డించిన కార్యకర్తలు కూడా తృప్తిగా భుజించినారు. ఎప్పుడైతే ఒక్కరు మిగలకుండా అందరూ భుజించినారో, అన్నశాకములు పరిసమాప్తమైనవి. ఏమీ మిగలలేదు. ఈ విచిత్రమును చూసి అందరూ ఆశ్చర్యపడినారు. మహత్తరమైన ఈ కార్యము నిర్విఘ్నముగా నిర్వహింపబడినందుకు శాస్త్రి హృదయము ఆనందముతో ఉప్పొంగి పోయింది. ఈ కార్యము సద్గురుదేవుని కృపవలననే జరిగిందని, సద్గురుదేవుని పదేపదే స్తుతించారు. సకలభక్త జనులు సద్గురుదేవుని కృపచేత నిశ్చింతగా ఉన్నారు. తరువాత సిద్ధసద్గురుదేవుడు సిద్ధాశ్రమమునకు

వెళ్లిపోయినాడు. భక్తులు తమతమ స్వస్థానములకు వెళ్ళిపోయినారు.ఇట్లు తమ్మన్నశాస్త్రి ఎల్లప్పుడూ సద్గురు చింతనచేస్తూ లోకోద్ధరణ కోసము విచారిస్తూ ఉన్నాడు.

ఒకసారి తమ్మన్నశాస్త్రి సద్గురు సిద్ధారూఢస్వామి సాన్నిధ్యమునకు వచ్చి సాష్టాంగ ప్రణామములు గావించి,తనయొక్క అభిప్రాయమును ఈప్రకారముగా వెలిబుచ్చుకున్నాడు.భక్తులందరూ నామస్మరణ చేయుటకు నేనొక యుక్తిని చేపట్టినాను. అదేమనగా పదమూడు కోట్ల నామజపము జరుపులాగున సంకల్పముచేసినాను.ప్రతి ఒక్కభక్తుడు తన శక్తికొలది ప్రతిరోజు ఎంత నామజపము చేస్తే అంత లెక్కచేస్తూ సంవత్సరముచివరివరకు పదమూడుకోట్ల నామజపము అగులాగున సంకల్పించినాను. మీరు అనుగ్రహించి ఆజ్ఞ ఇచ్చినట్లయితే, ఈ లోకోద్ధరణ కార్యము ప్రారంభిస్తాను–అని వేడుకుంటాడు. ఇటువంటి కార్యము చేపట్టినందుకు సద్గురుదేవుడు సంతోషించి ఆజ్ఞ నొసంగినాడు. అప్పుడు శాస్త్రి తన ఆశ్రమమునకు వెళ్లి భక్తులందరికీ తనయొక్క అభిప్రాయమును వ్యక్తపరిచినాడు. ప్రతి ఒక్కరూ మీమీ శక్త్యనుసారముగా తారక మంత్రమును జపిస్తూ ప్రతిరోజు సాయంత్రము నాకు జ్ఞాపకము పెట్టుకొని లెక్క చెప్పండి. ఈ విధంగా సంవత్సరాంతము వరకు పదమూడుకోట్ల నామ జపము చేయాలి అని చెప్పినాడు. శాస్త్రియొక్క అజ్ఞానుసారము భక్తులు తారకమంత్ర జప కార్యక్రమములో నిమగ్నులై, వారి వారి శక్త్యానుసారము నామస్మరణ చేయుచున్నారు. ప్రతిరోజు భక్తులు వేకువజాముననే వచ్చి వారి జపసంఖ్యను చెబుతున్నారు. శాస్త్రి లెక్కలు వ్రాస్తున్నాడు. ప్రతి భక్తుడు అత్యాదరముచేత, ఉత్సాహముచేత నామస్మరణ "**శ్రీరామ జయరామ జయ జయ రామ**"అను పదమూడు అక్షరముల తారకమంత్రమును జపము చేయుచున్నారు. ఏమాత్రముకూడా సమయము వృథాచేయకుండా దినదినము జపసంఖ్య వృద్ధి చేయుచున్నారు.వారియొక్క నిరంతర నామజపము ఆరునెలల వరకు పదమూడుకోట్ల సంఖ్య పూర్తి అయ్యింది. అయినాగాని వారి నామజపమును ఎవరు కూడా ఆపడము లేదు. సంవత్సరమువరకు మళ్లీ పదమూడు కోట్లు చేద్దాము-అని నామ స్మరణ సాగిస్తున్నారు.జపసంఖ్యను వృద్ధిచేస్తున్నారు.ప్రతి ఒక్కరిచేతిలో మాల తిరుగుతుంది. పిల్లలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు అందరూ ఉత్కట జిజ్ఞాసచేత జపముచేస్తున్నారు.ఇట్లు సకలజనులకు నామస్మరణ పరిపాటి (అలవాటు) అయ్యింది. అత్యానందముతో ప్రేమతో స్పష్టముగా మంత్రజపము చేస్తున్నారు. ఇదంతా సద్గురుకృపచేతనే జరుగుతున్నదని తమన్నశాస్త్రి భావిస్తూ నిరభిమానవృత్తి గలిగి ఉండేవాడు.

తమన్నశాస్త్రికి సద్గురుదేవునిపై అపారమైన ప్రేమయుండెను.ప్రతినిత్యము తన ఆశ్రమమందు పురాణమును బోధించేవాడు.అసంఖ్యాకమైన భక్తులు భక్తిశ్రద్ధలతో వచ్చి శ్రవణముచేసేవారు.సద్గురు దేవుడు ప్రేమసాగరుడు. అపారమైన ఆ ప్రేమ సాగరములో రత్నాలవంటి భక్తులు ఒకరికన్నా ఒకరు

సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి బ్రహ్మానందసాగరములో మునకలువేస్తూ తల్లీనులై తరించే వారు. సద్గురుదేవుడు వారి అభీష్టములను నెరవేర్చి భవబంధములను తొలగించి రక్షించేవాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచే సకలపాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది నాలుగవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది ఐదవ అధ్యాయము

పద్యానువాదము:–ఆరూఢ స్వరూపుడవైన ఓ సిద్ధ సద్గురుదేవా! నేను ఎల్లప్పుడు నీయొక్క దివ్యస్వరూపమును నా హృదయమందు భజిస్తుంటాను. నా హృదయమందుగల సంసార తాపాలను నివృత్తి చేయవలసింది. అభేదస్వరూపుడవై నా హృదయమందు వసించవలసింది. అందుకే నీకు పదేపదే పాదాభివందనములు సమర్పించుచున్నాను.

ఓంకార స్వరూపుడవైన ఓ సిద్ధారూఢ సద్గురుదేవా! నీయొక్క దివ్య పాదారవిందములకు సాష్టాంగ నమస్కారములు. నీయొక్క కృపవలన సకల మానవులు జ్ఞానశస్త్రమును పొంది వారి భవారణ్యమును నివృత్తి చేసుకొని స్వస్వరూపానుభూతిని పొంది ధన్యులగుదురు. ఈశ్వరుడు అందరికీ పరోక్ష స్వరూపుడై యున్నందున ఆయన ప్రత్యక్షయోగ్యుడు కాదు. కాని, నీవు అందరికీ ప్రత్యక్షదైవముగా వెలసియున్నందున నిన్ను ఆశ్రయించి తరించడానికి సులభసాధ్యుడవై ఉన్నావు. భక్తులనుద్ధరించే నిమిత్తముగా నీవు ఈ సగుణసాకారరూపముగా అవతరించి అనేక సచ్చరిత్రలు (లీలలు) ప్రకటము చేసినావు. ఆ చరిత్రలయొక్క పఠనము, శ్రవణము ద్వారా చిత్తశుద్ధిగలిగి జ్ఞాన-మునకు అధికారులౌతారు. ఆపద సమయములో నీయొక్క పవిత్రచరిత్రను శ్రవణము చేసినగాని, కేవలము స్మరించినాగాని సకలవిఘ్నములు నివృత్తమై, హృదయము నిర్మలమై, భక్తులలో ప్రేమ దృఢమగును. ప్రేమానందముకన్న శ్రేష్ఠమైనది వేరొకటి లేదు. భక్తులు యథార్థముగా తెలుసుకుని నీయొక్క అలౌకికప్రేమకు పాత్రులై ఉద్ధరింపబడినారు. శాశ్వతసుఖమును పొందినారు. ఎటువంటి వేదశాస్త్రములు తెలియని మందబుద్ధిగల భక్తులుగూడా కేవలము నీయొక్క కృపద్వారా అనాయా-సముగా భవసాగరమునుండి తరించబడినారు. భక్తులయొక్క ఆపదలను తెలుసుకొని వారిపై నీ యొక్క అపారమైన కృపను కలుగజేసి, వారి హృదయమందు సంసారచింత లేకుండాజేసి శాశ్వత సుఖమును ప్రాప్తముజేసినావు.

హుబ్లీ పట్టణమందు "నారాయణ మోడక్" అను పేరుగల బ్రాహ్మణుడుండేవాడు. ఆయనకు "చంపూ"అను పేరుగల పుత్రికయుండెను.ఆ అమ్మాయి యుక్తవయస్కురాలాయెను.ఆమెకు వివాహ-ము చేయదలచి అనేక స్థలములకు వెళ్లి సంబంధముగూర్చి ప్రయత్నము చేసినాడు. కాని, నిష్ఫల-మాయెను. ఆమెకు తగినవరుడు లభించలేదు. ఆ తర్వాత నారాయణ సిద్ధాశ్రమమునకువెళ్లి సద్గురు

దేవునికి తనయొక్క వ్యథను విన్నవించుకున్నాడు. సిద్ధారూఢస్వామిపై ఆయనకు, ఆయన భార్యా బిడ్డలకు అత్యంత భక్తియుండెను. ప్రతిరోజు సిద్ధాశ్రమమునకు వారు వెళ్లి భక్తిశ్రద్ధలతో భజనలు జేసి స్వామియొక్క కృపకుపాత్రులైరి. ఇటువంటి సద్భక్తుడైన నారాయణుడు సద్గురుదేవునితో ఇలా ప్రార్థి-స్తాడు. ఓ సద్గురుదేవా! ఆర్తరక్షకా! నాయొక్క కుమార్తెకు యోగ్యమైన వరుని ప్రాప్తముజేసి, లగ్నము నిర్విఘ్నముగా జరపించు స్వామీ! అని వేడుకున్నాడు. నారాయణుని దీన వినతిని విని సద్గురు దేవుడు తన అమృతవచనములద్వారా ఇలా అంటాడు. ఎల్లప్పుడూ సద్గురుచింతన చేయు నీకు నీ సంకల్పము నిర్విఘ్నముగా నెరవేరుగాక! అని అభయమిచ్చినాడు.

ఇటువంటి ఆశీర్వాదరూప అభయవాక్కులను విని హృదయమందు ఎంతో ఆనందమును బొంది, నారాయణ ఇంటికి తిరిగివచ్చినాడు. సద్గురుదేవునియొక్క వాణి సత్యమైనది. కుమార్తెకు వరుడు కుదిరినాడు. వివాహమునకై అనేక వస్తుసామగ్రులను సమకూర్చుతున్నాడు. ఫాల్గుణ శుద్ధ విదియ రోజున లగ్నసుముహూర్తమును బ్రాహ్మణోత్తములు నిశ్చయించినారు. ఇక వివాహమునకు రెండురోజుల సమయముండగా ఒక దారుణమైన సంకటము ప్రాప్తమైనది.నారాయణ కుమార్తెయ-గు చంపూ(వధువు)నకు తీవ్రమైన జ్వరతాపము వచ్చింది. రెండవ రోజువరకు ఆ జ్వరము మరింత తీవ్రమైనది.ఎన్ని ప్రయత్నాలు చేసినాగాని జ్వరము తగ్గలేదు. అదిచూసిన బంధువులు,తల్లి మున్నగు వారు చాలా భయపడినారు. అదే సమయానికి వరుని తీసుకొని అతని తల్లిదండ్రులు, వారి బంధు బలుగమును వెంటబెట్టుకొని హుబ్లీకి వచ్చినారు. వారికి నారాయణ యోగ్యమైన స్థలమును చూసి, విడిది ఏర్పాట్లుచేసి ఇంటికి వచ్చినాడు. 'చంపూ'యొక్క పరిస్థితిని చూసి ఎంతో దిగులుజెందినాడు.

"చంపూ" దేహస్మృతి కోల్పోయింది. సుధ్ధితప్పిన చంపూకు వెక్కిళ్లు పట్టినవి. పరిస్థితి అంతా అయోమయముగా ఉంది.ఇదంతాగమనించిన నారాయణ చింతాక్రాంతుడై హృదయమందు సద్గురు సిద్ధనాథుని స్మరించుకున్నాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క కృప, ఆశీర్వాదమువలన నా కుమార్తె-యగు చంపూకు యోగ్యమైన గుణసంపన్నుడైన వరుడు లభించినాడు. కాని,తీరా లగ్నసమయానికి దారుణమైన విపత్తు ప్రాప్తించింది. ఈఘోరమైన ఆపదనుండి నీవే రక్షించవలసింది-అని నారాయ-ణుడు ప్రార్థించినాడు. మేము ఇప్పుడు ఏ వైద్యుని వద్దకు వెళ్ళము. సకల భారమును నీపై మోపి నిన్నే ఆశ్రయించినాము. అన్యాశ్రయమును యెఱుగము. నీయొక్క చరణములపై విశ్వాసముంచి నిన్నే నమ్ముకున్నాము.

**"త్వమేవ శరణం మమ అన్యథా శరణం నాస్తి"**

జాగుచేయక వచ్చి ఈ విపత్తునుండి రక్షించి, నిర్ణయించిన లగ్నము విఘ్నము కాకుండా జరపవలసింది. నీవు అభయమిచ్చినందువల్లనే యోగ్యమైన వరుడు దొరికినాడు. లగ్నముగూర్చి అన్ని సంసిద్ధము చేసుకొని లగ్నము నిశ్చయించుకున్నాము. బంధువులందరికి ఆహ్వానము పంపి-

నాము. వారంతా సమయానికి విచ్చేసినారు. వరుని పక్షమునుండిగూడా బంధువులంతా వచ్చి-నారు. వారు లగ్నము కొఱకు వచ్చి విడిదిలో ఉన్నారు. తీరా సమయానికి లగ్నము భంగము కలిగినచో నేను అప్రతిష్ఠ పాలు కాగలను. నా బిడ్డకు కళంకము వాటిల్లగలదు. ఒకవేళ వివాహము భంగమైనచో నీవు ఇచ్చిన వాగ్దానము అసత్యము కాగలదు. ఏ అప్రతిష్ఠ కలిగినా నీకే. మేము నిమిత్తమాత్రులము.భారమంతా నీదే. మమ్ములను నీవే రక్షించగలవు.ఓ సద్గురుసిద్ధరాయా! ఏమాత్రముగూడా జాగుచేయక తొందరగా పరిగెత్తుకుంటూ వచ్చి ఈ దీనున్ని రక్షించుము. నీవు తప్ప నాకు రక్షకులెవరు? మేమందరము నీ వారమే. కావున, అంత్య సమయమువరకు నన్ను పరీక్షింపకుము. శీఘ్రముగా వచ్చి రక్షించ వలసింది. ఈ సంసారమంతా నీది. మేమంతా నీ వారము. ఓ సద్గురుదేవా! నీవు నా కూతురు లగ్నము నిర్విఘ్నముగా కాగలదని ఆశీర్వదించినందు వల్లనే నేను వివాహము చేయుటకు సంసిద్ధుడనయ్యాను. తీరా పెళ్లి సమయానికి భంగము కలిగినట్లయితే నీయొక్క అభయవాక్కు పొల్లు కాదా స్వామీ! ఒకవేళ లగ్నము విఘ్నమైతే అవమానము నాకుకాదు, నీకే. ఎందుకంటే, "**కర్తా కారయితా తూహీ పాండురంగ**" (హే పాండురంగా!నీవే చేసేవాడవు, చేయించేవాడవు)అన్నట్లు సర్వము నీవే అయి ఉండ మేమెవరము? కేవలము నిమిత్తమాత్రులము. సకల భారము నీపై మోపి నీవే సర్వస్వము అని భావించుకొని నిన్నే ఆశ్రయించిన మమ్ము రక్షింపనిచో అపకీర్తి నీకేగాని మాకు కాదు. నీయొక్క వచనములు అసత్యములు కాగలవు. అని ఈ ప్రకారముగా పరిపరి విధముల సద్గురుదేవుని నారాయణ అతిదీనముగా వేడుకోగా—

తత్క్షణమే ద్వారము తెరుచుకుంది. సిద్ధసద్గురుదేవుడు ప్రత్యక్షమైనాడు. భక్తుడైన నారాయణ తన కుమార్తెను తీసుకొని పరుగు పరుగున స్వామి కడకరిగి సాష్టాంగ దండవత్ ప్రణామములుచేసి, సద్గురుదేవుని నారాయణ లోనికి తీసుకొని వచ్చి ఇలా అంటాడు. ఆర్తరక్షకుడవైన ఓ సిద్ధనాథా! నాయొక్క ప్రార్థననాలకించి నన్ను రక్షించడానికి తొందరగా అరుదెంచినావా స్వామీ!అంటూ గద్గద కంఠముతో అశ్రుపూరిత నయనాలతో హృదయములో ప్రేమ ఉప్పొంగిరాగా సద్గురు సిద్ధనాథుని చరణకమలములను ధరించినాడు. అప్పుడు సిద్ధసద్గురుదేవుడు తనయొక్క కృపాదృష్టిని చంపూ పై ప్రసరింపజేసి, అమ్మాయిని ఆశీర్వదించి, ఈ విధముగా అభయవాక్కులను పలికినాడు. నాయనా! నారాయణా!మీరు ఏమి భయపడకండి.మీ మనసులో ఏవిధమైన చింత పెట్టుకోకండి. వివాహము నిర్విఘ్నముగా జరుగుతుంది. ఆ సద్గురుదేవుని ఎల్లప్పుడూ స్మరించండి. నిర్భయముగా కార్యము నిర్వహించండి అని ఆజ్ఞాపించి, చంపూయొక్క శిరస్సుపై తనయొక్క అమృతహస్తమునుంచి ఆశీర్వదించినాడు. తత్కాలమే చంపూయొక్క జ్వరము నివృత్తమైనది. బంధువులందరూ సంతోషించారు. నారాయణ అత్యంత ఆనందమును పొందినాడు.

సద్గురుదేవుడు ఈ ప్రకారముగా ఆజ్ఞాపించి ఆశీర్వదించి అక్కడికక్కడే అంతర్ధానమయ్యాడు. నారాయణ ఆశ్చర్యచకి తుడైనాడు. సద్గురుదేవుని మనసారా పూజించకముందే వెళ్లిపోయెనుగదా, అని బాధపడినాడు. తరువాత నారాయణ తన బంధుమిత్రులకు భార్యాపిల్లలకు అందరికీ ఇలా చెప్పినాడు. సిద్ధారూఢ పరమేశ్వరుడు వచ్చి, నా బిడ్డ చంపూయొక్క జ్వరమును నివృత్తి చేసినాడు. ఇది విని సకలజనులు ఘోరమైన విపత్తునుండి సద్గురుదేవుడు కాపాడినాడని సద్గురుదేవుని మహి-మను వర్ణిస్తూ, స్తుతిస్తూ జయజయకారములతో గర్జించినారు.

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహరాజ్ కీ జై.......

అందరూ తొందరగా వచ్చి చంపూయొక్క ఆరోగ్యమునుగూర్చి తెలుసుకున్నారు. జ్వరము పూర్తిగా తగ్గిపోయింది. కానీ.....శరీరమంతటా దేవి బొబ్బలు(అమ్మతల్లి)లేచినవి.అందరూ దిగ్భ్రాం-తిజెందినారు. తల్లిదండ్రులు ఇంకా భయపడినారు. రెండో రోజున ఆ బొబ్బలు విస్తారంగా విడ్డూ-రంగా కనిపించినవి. బంధువులందరూ ఆ దురవస్థను చూసి చాలా బాధపడినారు, మరియు ఇలా అంటున్నారు. ఒకవేళ ఈ అమ్మాయికి దురదృష్టవశాత్తు రెండు కన్నులు పోయినట్లయితే పాపము ఆమె భవిష్యత్తు ఎలా? ఆమె లగ్నము విఘ్నమౌతుందో ఏమో! అని భావించారు. వరుని పక్షపు బంధువులు వచ్చి ఇలా అంటున్నారు. ఈ అమ్మాయి ఆరోగ్యము కుదుటపడుతుందో లేదో! అంతా ఈశ్వరాధీనము. మరొకరు అంటారు–ఇక్కడే ఉండి వివాహము జరుపుకొని మన స్వస్థానమునకు పోదాము.ఇంకొకరంటారు–ఏమోనండీ!ఏదియెట్లగునో ఎవరికి తెలుసు?పదండి ఇంటికిపోదాము. ఒకవేళ వధువు ఆరోగ్యవంతురాలైతే మళ్లీ వచ్చి వివాహము చేయవచ్చు. మరియు అందరూ కలిసి ఒక నిర్ణయమునకు వచ్చి నారాయణతో ఇలా అంటారు. మేము మీ కూతురు ఆరోగ్యము కుదుట పడినాక వేరే ముహూర్తము చూసుకొని మళ్లీ రాగలము. అంతవరకు మేము మా గ్రామానికి వెళ్ళిపోతాము. నీవు ఏమి బాధపడకు–అని అంటారు.

నారాయణ, హృదయములో అధికమైన భారముగలవాడై ఎంతో బాధపడుతూ ఇలా అంటాడు. ఏమండీ! ఇంతవరకు ఎంతో ఓపికతో నిగ్రహించి ఉన్నారు. దయచేసి ఇంకొక్క రోజు ఓపిక పట్టండి. ఆ సద్గురుదేవుడు తప్పకుండా కరుణించి వివాహము జరిపించగలడు. ఈశ్వరుడు మాయందు దయదలచి తప్పక లగ్నము జరిపించగలడు అనియెంతో చింతతో వారిని వేడుకు-న్నాడు. అప్పుడు వరుడు తన మిత్రులతో కలిసి నారాయణునితో ఇలా అంటాడు. ఒకవేళ ఈ తరుణములో ఈ పెండ్లి కుమార్తెతో నాకు బలవంతముగా పెళ్లి జరిపితే, తదనంతరము ఆమె రెండు కళ్ళు పోయినచో నా గతి ఏమిటి? అమ్మతల్లి (దేవి) అయింది. కావున, కనులు పోతే పోవచ్చు. ఆమె కురూపి కావచ్చు. కావున ఏదో దుష్టకాలము దాపురించినట్లు గోచరిస్తుంది. నేను ఇప్పుడు వివాహము చేసుకోను అంటాడు. మరియు వివాహమునకు విచ్చేసిన బంధువులుకూడా అలాగే

అభిప్రాయపడుతూ లగ్నము అయ్యేందుకు శుభశకునములు కనబడుటలేవు. ప్రస్తుత పరిస్థితిని చూస్తే లగ్నము విరమించుకుంటేనే బాగుంటుంది–అని వారిలో వారు గుసగుసలాడసాగినారు.

వారి మాటలు విన్న నారాయణునకు పిచ్చెక్కిపోయి చింతాక్రాంతుడై ఉన్నాడు. అప్పుడు ఆయన చాలా విచారించి సద్గురుదేవుని వచనములను జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. నేను బంధువులకు ఎన్నివిధముల నచ్చజెప్పినాగాని, వారు వినుటకు సిద్ధముగా లేరు. ఇప్పుడు ఆ సద్గురుదేవుని ఇక్కడికి తీసుకొస్తాను. ఆ సద్గురుదేవుడు ఎలాగైనా నచ్చ చెబుతాడు–అని నిశ్చయించుకొని, కార్యమును ఎలాగైనా నిర్విఘ్నముగా స్వామి జరిపించగలడని మనసులో సంకల్పించుకొని వెంటనే అశ్వరథ-మునధిరోహించి (టాంగాను తీసుకొని) సిద్ధాశ్రమమునకు సత్వరముగా వెళ్లి, సద్గురుచరణములను దృఢముగా ధరించి, ఈ విధముగా ప్రార్థించుచున్నాడు. ఓ సద్గురు సిద్ధనాథా! దుస్తరమైన ఆపద వచ్చిపడింది. పెళ్లివారంతా తిరిగి వెళ్లిపోవడానికి నిశ్చయించుకున్నారు. ఏమిచేయాలో బోధపడుట లేదు. వారికి ఎలా సమాధానము చెబుతావో నీదే భారము స్వామీ! నీయొక్క అనుగ్రహమువలన చంపూయొక్క జ్వరము నివృత్తమైనది. కాని, దేవి ప్రకటమై(ఆవరించి)దేహమంతా బొబ్బలు లేచినవి. దానితో పెండ్లివారియొక్క భావము మారింది. వారు పెండ్లికి నిరాకరిస్తున్నారు. వెళ్లిపోవడానికి సిద్ధమైనారు. ఈ క్లిష్టపరిస్థితుల్లో నేనేమి చేయాలి? ఒకవేళ వారు వెళ్లిపోయినచో మళ్లీ తిరిగి వస్తారనే నమ్మకము లేదు. మళ్లీ నాయొక్క కూతురుకు వరుడు దొరకడము దుర్లభము కాగలదు. ఆమె జీవితమునకే కళంకము వాటిల్లగలదు. కావున దయాసాగరుడవైన ఓ సద్గురుదేవా! నీవు తొందరగా మా ఇంటికి వచ్చి మేము అందించే పూజలు స్వీకరించి, పెళ్లివారిని ఏ విధముగానైనా ఒప్పించండి. మమ్ములను అనుగ్రహించి ఈ దుష్టపరిస్థితినుండి కాపాడగలరనే నమ్మకముతో మీ చరణకమలముల నాశ్రయించాను. కావున, దయచేసి మమ్ములను రక్షించండి స్వామీ! అని ఆర్త-నాదముతో వేడుకున్నాడు.

నారాయణయొక్క భక్తిపూర్వకమైన, వినయపూర్వకమైన ఆర్తనాదమును ఆలకించిన సద్గు-రుదేవునియొక్క హృదయము ద్రవించింది. భక్తుడైన నారాయణ ఇంటికి పోవుటకు సంసిద్ధుడై అశ్వరథముపై ఆరూఢుడై బయలుదేరినాడు. సద్గురుదేవుని ఆగమనమును చూసి అందరూ ఆనంద-మునొంది,స్వామికి నమస్కరించుటకు ఎదురుగా పరిగెత్తుకుంటూవచ్చినారు.లగ్నమండపమునందు ఉన్నతాసనముపై స్వామిని కూర్చుండబెట్టి వేదోక్తముగా షోడశోపచార పూజలు గావించి, ఆరా-ధించి, పాదపూజచేసి పంచారతులు వెలిగించి,స్వరయుక్తముగా మంగళారతులు పాడినారు.వివా-హమునకు విచ్చేసిన బంధుజనులంతా స్వామియొక్క దర్శనముతీసుకున్నారు.సద్గురు దివ్యమంగళ మూర్తినిగాంచి ఎంతో ఆనందించినారు. వారి హృదయమందుగల ఆవేదన దూరమయింది. వరుడు గూడా స్వామి చరణములకు నమస్కరించినాడు. ఏ విధముగా సూర్యోదయము కాగానే గాఢాం-

ధకారము నివృత్తమవుతుందో, అదే ప్రకారముగా సద్గురునాథుని దర్శనముద్వారా వారి హృదయ గుహలోగల అంధకారము దుర్గుణములు, ఆవేదన దూరమై, సద్గురుదేవుని ఆజ్ఞకోసము ఎదురు చూస్తున్నారు. సద్గురుదేవుని దర్శించినంత మాత్రముననే మరుక్షణమే వారి మనసు మారి అందరి యొక్క సంశయము నివృత్తమైనది. ఇక స్వామియొక్క అమృతవచనములు విన్నచో సంశయ-ములుంటాయా?

ఇప్పుడు సద్గురుదేవుడు నారాయణతో ఇలా అంటాడు. నారాయణా! భయపడకుము. ధైర్యమునొందుము. చంపూకు ఏమీ కాదు. ఆమె స్వస్థత చెందగలదు. వరుడిని తీసుకురండి. ఇద్దరి వధూవరులను ఆశీర్వదించి అక్షతలు వేసెదము.ఈప్రకారముగా సద్గురుదేవుడు పలుకుతూ, సద్గురు నామోచ్చారణచేస్తూ మంత్రాక్షతలు చేగొని వధూవరులపై చల్లి ఆశీర్వదించినాడు. బంధువులుకూడా అక్షతలువేసినారు. అందరూ సంతోషించినారు. తదనంతరము బంధువులందరికి భోజన ప్రసాద-ములను సమర్పించుటకు ప్రారంభించినారు. సద్గురుసిద్ధనాథుడు వారితోకలిసి ప్రసాదమును స్వీక-రించినాడు. తర్వాత నారాయణ, స్వామిని సిద్ధాశ్రమమునకు పంపినాడు. బంధువులందరికి ఎంతో ఆనందము కలిగింది. అందరియొక్క సంశయము నివృత్తమైనది. అప్పుడు వరుడు ఆ లగ్నమండప-ములో అందరి సమక్షమున ఇలా అంటాడు. మనము లగ్ననిమిత్తముగా హుబ్లీకి వచ్చినాము. సమయానికి లగ్నము జరగకున్నచో మనకే అవమానము జరిగి యుండెడిది. ఒకవేళ వివాహము చేసుకొనక ఇంటికి తిరిగి వెళ్ళినచో నన్ను చూసి లోకులు నవ్వుకొనగలరు. కావున, నేను లగ్నము చేసుకున్న పిదపనే ఇంటికి పోవుదును. ఒకవేళ కన్య కురూపి అయినను నేను ఆమెనే వివాహము చేసుకొనెదను–అని వరుడు తన నిశ్చయమును వెల్లడించాడు.

మరియు ఈవిధముగా అంటాడు—వాస్తవముగా సద్గురుదేవుడు కరుణించడము వల్లనే మనము నిందలకు గురికాకుండా బయటపడినాము. సద్గురుదేవుడు ఆశీర్వదించి,ఆమె తప్పకుండా ఆరోగ్యవంతురాలు కాగలదని ఆశ్వాసనామిచ్చినాడు. ఆ మహాత్మునియొక్క సత్యసంకల్పముపై నాకు పూర్ణ విశ్వాసము మరియు సద్గురుదేవునిపై పరిపూర్ణ భక్తి కుదిరింది.స్వామియొక్క వచనములపై నాకు పరిపూర్ణమైన శ్రద్ధ కలిగింది. కావున, ఒకవేళ వధువుకు అంగవైకల్యము కలిగినా సరే, నేను ఆమెనే వివాహమాడుతాను అని వాగ్దానము చేసినాడు. ఆ సద్గురుదేవుని కృప ఉంటే చాలు అన్ని సవ్యముగా జరుగుతాయి–అని వరుడు చెప్పినాడు. పెండ్లి కుమారునియొక్క మనస్థితిని గమనించి, ఆయన తల్లిదండ్రులు, బంధువులు అందరూ పెళ్లి జరుపుటకు సమ్మతించినారు. వధువుయొక్క ఆరోగ్యము కుడుటపడినాక లగ్నము జరుపుదామని నిశ్చయించుకున్నారు.

ఆ సద్గురుదేవుడు అందరి హృదయములలో నివసించి వారివారి కర్మానుసారముగా ఫల-ములను ప్రసాదిస్తాడు. జగత్తులో ఏ జీవికి కూడా స్వాతంత్రము లేదు. సద్గురుదేవుని ప్రేరణ ద్వారానే

వారివారి వ్యవహారములను నిర్వహిస్తున్నారు. ఇక్కడ చంపూయొక్క ఆరోగ్యముగూర్చి విచారించి చూస్తే ఆమె సశక్తయై లేచి కూర్చున్నది.అందరి వ్యాకులత నివృత్తమైనది. ఇక లగ్నసుముహూర్తము గూర్చి ఆతురత పడుతున్నారు.సరియైన లగ్నసుముహూర్తమునకు వధూవరులను లగ్నమండపము లోనికి తీసుకొచ్చి పెండ్లి పీటలపై కూర్చుండబెట్టి, పరమాత్మయొక్క నామోచ్చారణ చేస్తూ విధిపూ-ర్వకముగా వేదోక్తధర్మమునునుసరించి వేదమంత్రోచ్చారణ చేస్తూ, వేదబ్రాహ్మణులచేత వివాహము చేసి, అక్షతలు వేసినారు. ఆ లగ్నవేడుక నాలుగు రోజులు జరిగింది. తదనంతరము నారాయణ తన కుమార్తె అయిన వధువును మరియు అల్లుడగు వరుని తీసుకొని సిద్ధాశ్రమమునకుపోయి సద్గురు దేవుని దర్శనము చేసుకున్నారు. స్వామియొక్క ఆశీర్వాదమును పొందినారు.

భక్తుడైన నారాయణ సద్గురుదేవునితో ఇలా అంటాడు. హే సద్గురునాథా! భవదుఃఖములు నివృత్తిచేసి నీయొక్క నామము సార్థకము చేసుకున్నావు. ఓ సద్గురుదేవా! ఈ నూతన దంపతులను ఆశీర్వదించి పంపించుమని వేడుకోగా, స్వామి వారిని ఆశీర్వదించినాడు. అందరూ తమ స్వస్థాన-మునకు నిష్క్రమించినారు. సద్గురుదేవుని ఎవరైతే విస్మరించి కార్యములు చేస్తారో, వారికి అనేక విపత్తులు సంక్రమించగలవు. సంసారసాగరములో మునిగిపోగలరు. ఎవరైతే సద్గురుదేవుని నిరం-తరము స్మరిస్తారో, వారిని దయాసాగరుడైన సద్గురుదేవుడు తనయొక్క దివ్య సంకల్పముద్వారా భక్తులయొక్క భయనివృత్తిజేసి సంసారము నుండి తరింపజేస్తాడు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధానచిత్తులై శ్రవణము చేయ గలరు. కథలోని నారాయణ అను జీవునికి భక్తి అను చంపూ యథార్థమైన పుత్రిక గలదు. భక్తి అనే కూతురికి దృఢవైరాగ్యమనే వరుడు కావలసి వచ్చింది. ఎందుకంటే, వైరాగ్యయుక్తమైన భక్తియే–భక్తి. వైరాగ్యమనే వరుడు ప్రాప్తించక ముందే భక్తికి సంసారమనే వ్యాధి పట్టుకుంది. సంసారమందు ఆసక్తి ఉంది.కావున,వైరాగ్యము కుదరదు. సంసారతాపత్రయములలో చిక్కుకొని బాధలననుభవిస్తున్న జీవుడు తాపత్రయములకు ఓర్వలేక వైరాగ్యమునుగోరి పరుగుపరుగున సద్గురుదేవుని వెతుకుతూ వెతుకుతూ సద్గురుదేవుని ఆశ్రయించినాడు.అప్పుడు సద్గురుదేవుని కృపవలన సంసారతాపత్రయము నివృత్తమై వైరాగ్యమనే వరుడు లభ్యమయ్యాడు. కాని, విషయేచ్ఛ స్ఫురణకు వస్తుంది. విషయాసక్తి సమూలముగా నష్టము కాలేదు. కావున,దృఢవైరాగ్యము కుదరడములేదు. దృఢవైరాగ్యము కలగా-లంటే విషయాసక్తియుక్త భక్తి అయోగ్యము. నిష్కామభక్తి కావాలి. అప్పుడు సద్గురుదేవుని ఆశ్రయించి మనస్ఫూర్తిగా పూజించాడు.జీవుడు,సద్గురుదేవుని తన హృదయగృహములోనికి రప్పించుకున్నాడు. జీవుని భక్తియొక్క పరాకాష్టను గుర్తించి, సర్వభారమును తనపైమోపి సద్గురుదేవుడే సర్వస్వముగా భావించుకున్న జీవుని, ఆ సద్గురుదేవుడు కరుణించి దృఢవైరాగ్యమును ప్రసాదించి, ఆత్మాకారవృత్తి-రూప అక్షతలు వేసి మోక్షము ప్రాప్తమవుగాక!అని ఆశీర్వదించినాడు.సద్గురుదేవుని ఆశీర్వాదమును

పొందిన జీవుని భక్తి ఫలోన్ముఖమై భక్తివైరాగ్యముల ఏకత్వము కుదిరింది. సకల మనోవృత్తులు ఆనందవృత్తులుగా మారినవి.ఈప్రకారముగా వైరాగ్యయుక్త భక్తిని సద్గురుదేవుని కృపద్వారా పొంది సకలజీవులు భవసంద్రమునుండి తరించుదురు గాక!

స్వస్తి శ్రీ సద్గురు సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముననే సకలపాపములు భస్మమై పోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది ఐదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు. ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది ఆరవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురు సిద్ధారూఢనాథా! పవిత్రమైన నీ నామామృత స్మరణద్వారా సకలజీవులు సర్వ దుఃఖములనుండి బయటపడి ఆనందమును బొంది భవసాగరమునుండి తరించ బడతారు. కాని, నీ నామాన్ని ఆశ్రయించినందువల్ల సర్వథా పరిపూర్ణ యథార్థ ఆనందము కలుగ దేమో—ఎందుకంటే, బ్రహ్మాత్మల ఏకత్వ అనుభవములో లభించిన ఆనందము నామస్మరణలో దొరకదు. కావున, అభేదజ్ఞానమును, సమభావనను ప్రసాదించమని నీ చరణములను ఆశ్రయించి ప్రణమిల్లుచున్నాను.

ఓ సిద్ధసద్గురుదేవా! నీవు నా హృదయ మందిరములోకి వేంచేసి అక్కడే స్థిరముగా ఉండి, నాజన్మ సార్థకము చేయుము.నీయొక్క కృపవలన సంసారిజీవులయొక్క సకలదుఃఖములు సమూ-లముగా నివృత్తమగును. నీయొక్క అపారమైన కృపను వర్ణించడానికి ఎవరికి శక్యము? సంసారి జీవులు అనాయాసముగా తరింపబడుటకు వారివారి శక్త్యనుసారముగా సద్గురుదేవులను ఆశ్ర-యించి పూజించాలి. తద్వారా సకలపాపములు నివృత్తమై శుద్ధాంతఃకరణము ఏర్పడగలదు. సద్భ-క్తులపై దయగలిగి వారి జన్మ వ్యర్థము కాకూడదని, వారికి యథార్థజ్ఞానమును బోధించుటకై నీవు సాధురూపములో అవతరించినావు.

**—:కథాప్రసంగము:—**

సద్గురు సిద్ధనాథునియొక్క పరమభక్తుడు అక్కలకోట నివాసియగు సాధు,"**శరణప్ప**"ఎల్ల-ప్పుడు సద్గురుదేవునియొక్క మహిమను కీర్తనలద్వారా భక్తులకు బోధించేవాడు. శ్రావణమాసము మరియు శివరాత్రి ఉత్సవసందర్భముగా ప్రతి ఏటా నియమము తప్పకుండా సిద్ధాశ్రమమునకు వచ్చే వాడు.అంతేకాకుండా గ్రామ గ్రామానికి వెళ్లి సద్గురు కీర్తిని తనయొక్క కీర్తనలద్వారా వర్ణించేవాడు. సాధు 'శరణప్ప' తన చిన్నతనమునుండియే సద్గురుదేవునియందు భక్తిగలిగి లింగ జంగమ పూజ చేస్తూ పరోపకారముచేయుటయందాసక్తి కలిగి వీరశైవ ధర్మమునకు విరోధము కలుగకుండా నడుచుకునేవాడు. అటు తరువాత వీరశైవ మతభేదమును నిరసించి సర్వమతసమన్వయము–అను ఐక్యమతమును స్థాపించినాడు. పురాతన జంగమములందరూ ఐక్యమతమును పూజింపసాగిరి. అనేక మఠములు, సంస్కృత పాఠశాలలు కూడా నెలకొల్పినాడు. లౌకిక వైదిక విద్య గురించి

పాఠశాలలను నెలకొల్పినాడు. కరువు కాటకాలలో ప్రజలకు అన్నవస్త్రాలను ఇచ్చి కాపాడినాడు. అప్పుడప్పుడు శరణప్ప తనలో తాను ఇలా అనుకునేవాడు. ఒకవేళ నేను బసవన్న కాలములో జన్మించియున్నట్లయితే ప్రభుసేవ చేసి ధన్యుడినయ్యేవాడిని. నాకు ఆ భాగ్యము కలగకపోయె కదా- అని చింతించేవాడు. మళ్లీ అదే క్షణమందు తన అంతర్యమునుండి ఈ విధముగా స్ఫురణ కలిగేది. మల్లికార్జున సద్గురుదేవుడు ఆ కాలములోనే కాదు, ఇప్పుడుగూడా సిద్ధసద్గురురూపములో 'హుబ్లీ' పట్టణములో వెలిసి ప్రత్యక్ష దైవముగా ఉన్నాడు. ఆ మల్లికార్జున సద్గురుదేవుడే, ఈ సద్గురు సిద్ధా- రూఢస్వామి అని సంతృప్తి చెంది సమాధాన పడినాడు. సిద్ధారూఢ ప్రభువు ప్రస్తుతము ఈ లోక- ములో అజ్ఞానిజీవులను ఉద్ధరించే నిమిత్తముగా అవతరించినాడు–అని నిశ్చయించుకొని హుబ్లీప- ట్టణమును జేరి సిద్ధాశ్రమమునకు పోయి సిద్ధసద్గురుదేవుని సందర్శించుకుని సంతృప్తినిజెందినాడు. స్వామియొక్క దర్శనమునకు పూర్వము ఎన్నో కర్మలు మరియు యోగాభ్యాసము మొదలగు సాధ- నలు చేసియుండెను. కాని, వాస్తవస్థితి (ఆత్మజ్ఞానము) పొందలేదు. ఎప్పుడైతే సద్గురుదేవుని సంద- ర్శించినాడో, సద్గురుదేవుని కృపవలన స్వరూపస్థితిని పొంది ధన్యుడైనాడు. సద్గురుదేవుని దివ్య చరణారవిందములను ఆశ్రయించినందువలన సకల చిత్తవృత్తులు ఉపశమించినవి. తనయొక్క వాస్తవ స్వరూపమును తెలుసుకొని ధన్యుడైనాడు.

అటు తరువాత సద్గురుదేవుని మహిమను సకలజీవులకు బోధించుటగూర్చి బయలుదేరి పల్లెలు, పట్టణములు తిరిగి స్వామియొక్క కీర్తిని కీర్తనలద్వారా వర్ణిస్తూ, అనేక జీవులను తరింప చేసినాడు."**పూరి**"పట్టణమునకు వెళ్లి అక్కడ భక్తులతో సత్సంగముచేసి, సద్గురుదేవుడు సాక్షాత్ ఈశ్వరావతారమని బోధించి, వారికి స్వామియొక్క మహిమను వర్ణిస్తూ, వారికి స్వామియెడల అపూర్వమైన ప్రేమభక్తి నిర్మాణము చేసినాడు. సద్గురు నామోచ్చారణ ఎల్లప్పుడు చేస్తూ తన్మయుడై కీర్తనలు గానము చేస్తుంటే,భక్తులుగూడా స్వామి భక్తిలో మునిగిపోయి, శ్రోతల నేత్రములవెంట ప్రేమాశ్రువులు రాలుచుండ,భక్తిలో పారవశ్యమును పొంది మళ్లీ"తుకారామ మహారాజు"ఈ శరీర- మును ధరించి వచ్చాడా ఏమి? అని అనుకునేవారు. ఆ"పూరి"పట్టణ భక్తులలో సద్గురు సిద్ధనాథుని యెడల ఉత్కటమైన ప్రేమభక్తి నిర్మాణమైనది. వారి మనసులో సద్గురుదేవుని తప్పకుండా దర్శించు కోవాలనే తీవ్రజిజ్ఞాస ఉత్పన్నమైనది. సాధు శరణప్ప ఆ భక్తులను హుబ్లీకి తీసుకెళ్లి స్వామియొక్క దర్శనము చేయించేవాడు.వేలకొలది భక్తులను తీసుకెళ్లి సద్గురు సిద్ధారూఢస్వామియొక్క దర్శనము గావించేవాడు. స్వామియొక్క చరణముల స్పర్శకాగానే వారి మనసు ప్రశాంతతనుపొంది కృతజ్ఞు- లమైనట్లుగా అనుభూతినొంది సంతృప్తి చెందేవారు. ఒక్కసారి సద్గురుచరణకమలముల దర్శనము చేసుకోగానే వారికి మనసులో ఎల్లప్పుడు సద్గురు సాన్నిధ్యములోనే ఉండిపోవాలనిపించేది.స్వామి యొక్క వియోగమును భరించేవారు కాదు. ఈ ప్రకారముగా కొందరు భక్తులు సాధు శరణప్పను

సమీపించి, ఓ సద్గురుదేవా! నాయొక్క మనసు ఎల్లప్పుడు నిన్ను విస్మరించకుండా నీ దివ్యచరణాల యందే లగ్నమగునట్లు ఆశీర్వదింపుము. మరి కొందరు ఓ సద్గురుదేవా! మాకు పుత్రసంతానము కలుగుట గూర్చి ఏ దేవుని పూజించాలి? అని అడిగేవారు.

వారితో సాధు శరణప్ప ఇలా సమాధానము చెప్పేవాడు. సాక్షాత్పరమశివుడే సిద్ధారూఢ సద్గురుదేవుని రూపములో అవతరించినాడు. ఆ స్వామి ప్రతి ఏటా నియమము తప్పకుండా శ్రావణ మాసము మరియు మాఘమాసములలో ఉత్సవములు జరుపుతాడు. మీరు వెళ్లి ఆ ఉత్సవములో పాల్గొని స్వామిని సందర్శించినట్లైన, మీయొక్క మనోరథములు నెరవేరగలవు. ఇటువంటి వచన-ములపై వారు పరిపూర్ణ విశ్వాసముంచి, ప్రతిసంవత్సరము ఆ ఉత్సవములలో పాల్గొని స్వామిని దర్శించేవారు. అందువలన వారియొక్క కోరికలు ఫలించెడివి. తర్వాతకూడా వారు వారిజీవిత పర్యంతము ప్రతిసంవత్సరము తప్పకుండా శ్రావణ, మాఘమాసములలో ఉత్సవములలో పాల్గొని, సద్గురుమూర్తిని దర్శించేవారు. తద్వారా వారు బ్రతికినన్నాళ్లు ఇహ పరలోక భోగములను ఇక్కడే అనుభవించి దేహమును త్యాగము చేసినారు. అనేక పట్టణములలో, గ్రామాలలో సాధు శరణప్ప సత్సంగములు చేసి తనయొక్క కీర్తనలద్వారా సద్గురుదేవుని మహిమను వర్ణిస్తుంటే, ఆయన కీర్తి నలుమూలల వ్యాపించింది. హుబ్లీపట్టణ సమీపములోనున్న"ఉణకల"అను గ్రామభక్తులు సాధు'శర-ణప్ప' కీర్తిని విని శరణప్ప వద్దకు వచ్చి ఇలా ప్రార్థిస్తారు. ఓ సద్గురుదేవా! శరణప్పస్వామీ! దయచేసి మీరు మా గ్రామమునకు వచ్చి ఒక నెల రోజులు మీయొక్క అద్భుతమైన కీర్తనలు గావించి మా గ్రామ భక్తులను ధన్యులను చేయుము–అని వేడుకున్నారు.

వారియొక్క ప్రార్థనను ఆలకించి శరణప్ప ఇలా అంటున్నాడు.నేను మీ గ్రామమునకు విచ్చే-యుటకు సమ్మతిస్తున్నాను. కాని, ఒక షరతు వినండి. నాయొక్క కోరికను మీరు నెరవేర్చగలిగిన-ట్లయితే నేను మీ గ్రామమునకు వస్తాను. అదేమనగా, మీరందరూ కలిసి ఒక ఎడ్లబండి నిండుగా వండిన అన్నము నింపుకొని భజనలు చేసుకుంటూ శ్రావణ సోమవారమునాడు సిద్ధాశ్రమమునకు తీసుకెళ్లి సద్గురుదేవులకు అర్పించాలి. ఇటువంటి సేవను మీరు చేయుటకు ఒప్పుకున్నట్లయితే, నేను మీ గ్రామమునకు వచ్చి కీర్తన గావించగలను. ఈ షరతును విని "ఉణకల"గ్రామభక్తులు అంగీకరిం-చారు. అందుకు శరణప్పకూడా ఒప్పుకున్నాడు. అప్పుడు ఆ"ఉణకల"గ్రామప్రజలు ధన్యులము ధన్యు-లము–అంటూ ఆనందముతో వెనుదిరిగి పోయి, వారి గ్రామములో కార్యక్రమమును నిర్వహించు స్థలమును శుభ్రపరచి భవ్యముగా మండపమును నిర్మించినారు. స్వామియొక్క రాకకు ఎదురు చూస్తున్నారు. నిశ్చయించిన సమయమునకు శరణప్ప "ఉణకల" గ్రామమునకు వెళ్లి అద్భుతముగా కీర్తన చేయుచున్నాడు.వేలకొలది భక్తులువచ్చి శ్రవణము చేయుచున్నారు. భక్తులు సద్గురుదేవుని యొక్క నామ సంకీర్తనమును శ్రవణము చేయుచు దేహవిస్మృతిని పొందినారు.

ఈ విధముగా కీర్తన జరుగుతుండగా భూతభాధచే పరితపిస్తున్న ఇద్దరు స్త్రీలుకూడా అక్కడికి వచ్చి కీర్తన విన్నారు. ఎప్పుడైతే సద్గురు సిద్ధారూఢస్వామియొక్క పేరును విన్నారో, తత్క్షణమే భూతబాధ నివృత్తమై స్వస్థతను పొందినారు.

**"ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః"**

ఈ దృశ్యమును గాంచిన శ్రోతలు ఎంతో ఆనందమునొంది శరణప్పయొక్క సాంగత్యము వలన గొప్పలాభమును పొందినారు. అప్పుడు శరణప్ప అంటాడు. మీయొక్క కోరిక మేరకు నెల రోజుల కీర్తన ముగిసింది. ఇక ఉత్సవమునకు సిద్ధముకండి. సాధు శరణప్పయొక్క ఆజ్ఞానుసారము గ్రామస్తులు అందరూ సిద్ధమైనారు. వెయ్యిమంది తాళమృదంగములు చేబుని భజనలుచేస్తూ,సద్గురు నామఘోషలుచేస్తూ గ్రామము నుండి బయలుదేరినారు.

**శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి మహారాజుకీ జై........**

వారి వెనుక వెయ్యిమంది ముత్తైదువ స్త్రీలు అనేక రకముల ఆభరణములను అలంకరించు-కొని చేతులలో పంచారతులను పట్టుకొని సద్గురు సిద్ధారూఢస్వామియొక్క మంగళారతులను ముక్త కంఠముతో శ్రావ్యముగా పాడుతూ వస్తున్నారు. వారి వెనుక తొమ్మిది రకముల పత్రములతో (తోరణములతో) అలంకరించి వాటి నిండుగా అన్నమును మరియు దానికి సరిపడు శాకమును కూరగాయలను నింపుకొని అరువది ఎడ్లబండ్లు వస్తున్నాయి. అనేక వాద్య ఘోషలతో నామగర్జన-లతో ఆకాశము మారుమ్రోగుచు, దశ దిశలు శబ్దము వ్యాపించి వాతావరణము మంగళప్రదముగా మారింది."ఉణకల"కు "హుబ్లీ"కి మధ్య ఒక క్రోసు దూరము సందులేకుండా భక్తులయొక్క పంక్తులతో త్రోవ నిండిపోయింది. సద్గురు నామగర్జనలు చేస్తూ వెళ్ళుచున్నారు.

సిద్ధాశ్రమములో సద్గురుదేవుడు ఆసీనుడై యున్నాడు. ఒకరి తరువాత ఒకరు భక్తులందరూ మధ్యాహ్న సమయమువరకు చేరుకొని, వచ్చిన వారు వచ్చినట్లు స్వామియొక్క దర్శనము తీసు-కుంటున్నారు. భోజన సమయమయ్యింది. భోజనము కార్యక్రమము ప్రారంభించినారు. పదివేల మందికి ఒక పంక్తి చొప్పున కూర్చున్నారు. సద్గురు నామగర్జన చేస్తున్నారు. భోజనకాలమునందు సద్గురు సిద్ధారూఢస్వామి ఉన్నతాసనముపై కూర్చుని ఆ భోజన సమారంభమును తిలకిస్తూ ఎంతో ఆనందమును పొంది, భక్తులయొక్క సుఖమే నా సుఖమని భావించుకున్నాడు. ఈవిధముగా పది-వేలమంది చొప్పున ఆరు పంక్తులలో అరువది వేలమంది భక్తులకు భోజనము వడ్డించినారు. శర-ణప్పకు ఎంతో సంతోషము కలిగింది. భోజనానంతరము అందరూ భక్తులను ఒకచోట కూర్చుండ జేసి సద్గురుదేవుని సమక్షమున శరణప్ప రెండు గంటలు అద్భుతముగా కీర్తన చేసినాడు. అందరికీ కీర్తనానందమును పంచినాడు. తదనంతరము భక్తులందరూ సద్గురుదేవుని యొక్క ఆశీర్వాదమును పొంది తిరిగి వారి స్వస్థానమునకు వెళ్ళుతూ శరణప్పకు ఒక నివేదనను అందజేసినారు.

అదేమనగా సద్గురు సిద్ధారూఢస్వామి ఒకసారి మా"ఉణకల"గ్రామమునకు వచ్చి మా గ్రామమును పునీతము చేసి మమ్ములను ధన్యులను చేయగలరని నివేదించుకున్నారు. కొన్నిరోజుల తర్వాత స్వామిని "ఉణకల"గ్రామమునకు తీసుకురండి. అంతవరకు మేము అన్ని ఏర్పాట్లు చేస్తామని వేడుకున్నారు. అప్పుడు శరణప్ప వారితో ఇలా అన్నాడు—సద్గురు సిద్ధనాథుడు మాత్రము సిద్ధాశ్రమము విడిచి ఎక్కడికి వెళ్ళడు. ఒకవేళ మీ ప్రార్థనను మన్నించి సమ్మతించినచో, మీరు ధన్యులు. కాని, స్వామి మీ గ్రామమునకు వచ్చుటకు అంగీకరించినచో, అన్ని వ్యవస్థలు చాలా జాగ్రత్తగా చూసుకోవాలి సుమా! అని చెప్పి, శరణప్ప ఆ"ఉణకల"గ్రామ భక్తుల ప్రతినిధిగా మెల్లగా సద్గురు దేవుని సాన్నిధ్యమునకరుదెంచి వారియొక్క ప్రార్థనను నివేదించి, అన్ని సౌకర్యములు ఏర్పాటు చేయుటకు భక్తులు ఒప్పుకున్నారు–అని చెప్పినాడు.

ఈ విన్నపమును హుబ్లీ భక్తులు విని ఇలా అంటారు. సద్గురుదేవుడు 'హుబ్లీ' విడిచి ఎక్కడికి వెళ్ళడు. ఆయనను విడిచి మేము ఉండలేమని ఖచ్చితంగా అంటారు. అప్పుడు శరణప్ప అంటాడు. ఎప్పుడైతే మీరు సద్గురుదేవుని విడిచి ఉండలేరో, అయితే మీరుకూడా ఆహ్వానితులే. స్వామితో పాటు మీరుకూడా "ఉణకల"గ్రామమునకు విచ్చేయవలసింది."ఉణకల" భక్తులు మీ "హుబ్లీ" భక్తులందరికీ స్వామితో పాటు ఆమంత్రణము చేసినారు. మీ అందరికీ ఏ లోటు లేకుండా భోజన సదుపాయాలు చేయుటకు అంగీకరించినారు–అని శరణప్ప చెప్పినాడు. మరియు స్వామి "ఉణకల"కు వచ్చిన పిదప భోజనానంతరము స్వామికి పాదపూజ గావించిన పిమ్మట స్వామిని తీసుకొని మళ్లీ సిద్ధాశ్రమమునకు వస్తాము, అని ఎన్నో విధముల వారికి నచ్చజెప్పినాడు. ఈ విధమైన శరణప్పయొక్క నమ్ర నివేదనను విని హుబ్లీ భక్తులు సరే అని ఒప్పుకున్నారు. అప్పుడు సద్గురు సిద్ధారూఢస్వామి కూడా అంగీకరించి, అన్ని ఏర్పాట్లు చేసుకోండి–అని ఆదేశించి, ఆశీర్వదించినాడు. మరియు యోగ్యమైన దినమును నిర్ణయించుకొని మాకు తెలియజేయండి–అని ఆజ్ఞాపించినాడు. ఈ సంగతి శరణప్ప "ఉణకల" గ్రామ భక్తులకు తెలియజేయగా వారు ఎంతో సంతోషించి, వారి గ్రామమునకు వెళ్లి అన్ని సామగ్రులు ఏర్పాటు గావించుకొని, ఒక నియమిత రోజున స్వామిని"ఉణకల"గ్రామమునకు తీసుకు పోవుటకు సద్గురుదేవుని వద్దకు వచ్చి వారి అభిప్రాయమును వెలిబుచ్చి స్వామిని ఆహ్వానించారు. వేలకొలది హుబ్లీ భక్తులను ఆహ్వానించినందున వారు స్వామితో పాటు బయలుదేరినారు.

సద్గురు దేవుని పల్లకిలో కూర్చుండబెట్టుకుని ఉణకల గ్రామానికి వస్తున్నారు. మనోహరమైన సద్గురుదేవుని పల్లకిలో కూర్చుండబెట్టి ముందు అనేక మంగళవాయిద్యములతో భజనలుచేస్తూ నామ గర్జనలుగావిస్తూ ఊరేగింపుగా వెళ్తున్నారు. సువర్ణ కిరీటముతో అలంకరింపబడిన సద్గురు సిద్ధారూఢస్వామి పల్లకిలో ప్రసన్నవదనుడై ప్రశాంతముగా కూర్చుని దేదీప్యమానముగా ప్రకాశిస్తున్నాడు. మేనుపై రక్తవర్ణముతో కూడిన దివ్యమైన వస్త్రాలంకరణము శోభించుచు, ఎంత చూసినా

తనివితీరనంత ఆనందమును కలుగజేస్తున్నాడు. సద్గురుదేవుని దర్శిస్తూదర్శిస్తూ తదేకంగా చూస్తూ, దేహవిస్మృతినిపొంది తన్మయులై ఆనందసాగరములో ఓలలాడుచుండిరి. సద్గురుదేవుని చూసిన కన్నులు మరొకవస్తువును చూచుటకు ఇష్టపడుట లేవు.అలాగే కనురెప్ప కొట్టకుండాచూస్తూ సంబర పడుచుండిరి. ఊరంతా కన్నుల పండుగగా నుండెను. సద్గురుదేవునియొక్క దృష్టి పడినంత మాత్ర-ముననే హృదయపూర్వక యథార్థమైన బ్రహ్మానుభూతి కలుగుచుండెను.

ఇవ్విధమున ఆ ఉత్సవము ఒకానొక సుముహూర్తమున అద్భుతముగా ప్రారంభమైనది. సద్గురుదేవుని పల్లకినుండి నెమ్మదిగా క్రిందకుదించి ఉన్నతాసనమునందు పరుపుపై కూర్చుండబెట్టి-నారు.మధ్యాహ్నసమయమైంది. భోజనములు ప్రారంభించినారు.ఒక విశాలమైదానములో వరుస-గా ఒక లక్షమంది భోజనము చేయుటకు కూర్చున్నారు. వడ్డన ప్రారంభమైనది. భక్తులు తృప్తిగా భుజిస్తున్నారు.ఆ దృశ్యము ఎలా ఉందంటే,ఒకానొక సరోవరతీరమున హంసపక్షుల పంక్తులు ఎలా ఉంటాయో అలా ఉంది. ఆ దృశ్యమును చూసి శరణప్ప ఎంతో సంతోషించి, ఆనందము పట్టలేక సద్గురుదేవుని చేయిపట్టుకొని, తన వెంటబెట్టుకొని అంతా చూపిస్తూ ఉన్నాడు.

సద్గురుదేవుడు ఆ దృశ్యమును తిలకించాడు. మానససరోవరములో హంసల పంక్తులవలె కనిపట్టుచున్నది–ఈ జనసరోవరము. ఆ ప్రదేశము మంగళప్రదముగా గోచరిస్తున్నది.సద్గురుదేవుడు సంతోషముతో అద్భుతమైన ఆ వైభవమునుచూసి ఎంతో ఆనందించినాడు. దేవతలకుగూడా దుర్ల-భమైన ఈ సదవకాశము భక్తులకు లభించినది. అంతటితో స్వామి ఊరుకొనక శరణప్పను ఇలా అడుగుతాడు. ఏమయ్యా శరణప్ప! ఈ కార్యక్రమమును ఇంత వైభవముగా ఎలా జరిపి స్తున్నావ-య్యా? అప్పుడు శరణప్ప తనయొక్క నిరభిమానమును వ్యక్తముజేస్తూ నాదేముంది స్వామీ!మీ యొక్క ఆశీర్వాదము తప్ప. మీయొక్క కీర్తి ప్రభావము కీర్తనలద్వారా చెప్పడమువలన మీయొక్క మహిమ ఈ విధముగా రూపుదిద్దుకుంది. అంతా మీయొక్క వైభవమే, నాదేమీ లేదు స్వామీ! అని అన్నాడు.మీయొక్క గుణమహిమను ప్రతిరోజు కీర్తనద్వారా ప్రవచించడమువల్ల వారియొక్క అంతః-కరణము శుద్ధిపడి మీయందు ఇలా దృఢభక్తి ఉద్భవించి, ఈ కార్యరూపమును ధరించినది.

ఈవిధముగా భోజనకార్యక్రమము ముగిసిన పిమ్మట సద్గురుసిద్ధనాథుని మండపములోనికి తీసుకొనివచ్చి మహావైభవముగా పాదపూజ గావించినారు.ఆ సన్నివేశము వర్ణనాతీతము తదనం-తరము స్వామిని మళ్లీ పల్లకిలో కూర్చుండబెట్టి భాజాభజంత్రీలతో సిద్ధాశ్రమమునకు పంపినారు. ఈ ప్రకారముగా శరణప్ప ఎల్లప్పుడూ సద్గురుదేవుని కీర్తిని, మహిమను తన కీర్తనలద్వారా జనులకు బోధిస్తూ లోకోద్ధరణ కార్యములను నిర్వహిస్తూ సద్గురుదేవుని కృపకు పరిపూర్ణముగా పాత్రుడ-య్యాడు.

ఒకానొక సమయమున శ్రావణ మాసమందు శరణప్ప గోకాక్ నుండి హుబ్లీకి సిద్ధాశ్ర-మమునకు వెళ్లడానికి పయనిస్తున్నాడు. మార్గములో 'ఘటప్రభ' నది ఒప్పొంగి మహావేగముగా ప్రవహిస్తుంది. ఆరోజున సద్గురుసిద్ధనాథుని దర్శనము చేసుకొననిదే అన్నపానాదులు స్వీకరించను-అని దృఢసంకల్పము చేసుకున్నాడు.నది పొంగిపొరలి ప్రవహిస్తుంది.నా నిశ్చయమునకు భంగము వాటిల్లునేమో అని చింతిస్తూ దీనముగా ఒడ్డున నిలబడినాడు. ఆ నదీతీరమున ఒకే ఒక నావ ఉండేది. అదిగూడా ప్రవాహములో కొట్టుకుపోయింది. నదిని దాటి వెళ్లవలసిన ఇతర ప్రయాణికులు కూడా వచ్చినారు. నదీప్రవాహము తీవ్రమైనది. నావ లేదు. దాటుటకు శక్యముకాదు. కావున, చేయునది లేక కొంత తడవు అక్కడే నిలబడినారు. ఒకవేళ నది వేగము తగ్గినయెడల దాటి వెళ్ళ-వచ్చును అని అనుకున్నారు. కొంతసేపు వేచి చూచినారు.కాని,ప్రవాహము ఇంకా ఉధృతమౌ-తుంది, కాని, తగ్గడములేదు. ఇక ప్రయోజనము లేదని నిశ్చయించుకొని ఇతరప్రయాణికులు వెను-దిరిగినారు. శరణప్ప మాత్రము అక్కడే నిలబడి సద్గురు నామోచ్చారణ చేస్తున్నాడు.

**"ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః"**

ఆ ప్రయాణికులు శరణప్పను వారితో రమ్మని వారించినారు. రేపటి ఉదయమువరకు నదీప్రవాహము తగ్గుతుంది. సూర్యోదయమైన పిమ్మట మళ్లీవచ్చి, నదిని దాటి వెళ్లిపోవచ్చును–అని అన్నారు. అప్పుడు శరణప్ప వారితో అంటాడు. సద్గురుదేవుని దర్శనము కానంతవరకు నేను అన్న పానాదులు స్వీకరించను, ఎక్కడ విశ్రమించను-అని అంటాడు. ఆయనయొక్క దృఢనిశ్చయమును అర్థముచేసుకొని ఆ ప్రయాణికులు శరణప్పను అక్కడేవదిలి వెళ్ళిపోయినారు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. కారుచీకట్లు అంతటా క్రమ్ముకున్నాయి. కాని, శరణప్ప దృఢనిశ్చయముతో అక్కడే సద్గురుదేవుని స్మరిస్తూ ఉన్నాడు. మరియు శరణప్ప సద్గురుదేవుని ఇలా ప్రార్థిస్తున్నాడు. ఓ సద్గురు దేవా! ఓ దీనదయాళా! ఒకవేళ ఈ సమయమున ఈ దుస్తరమైన నదినుండి, నీవు నన్ను దాటించక పోయినచో,నీవు నిర్వహిస్తున్న శ్రావణమాసపు ఉత్సవాలలో పాల్గొని నీయొక్క మహిమను కీర్తనల ద్వారా ప్రవచించుటకు నేను ఏర్పరచుకొన్న నియమమునకు భంగము కలుగగలదు. భవసాగర-మును దాటించగల సమర్థుడవైన నీకు ఈ సామాన్యమైన నదిని దాటించుట గొప్ప విశేషము కాదు. కావున, ఓ సద్గురుదేవా! నీవు తప్పకుండా సరుగున వచ్చి ఈ నదినుండి నన్ను దాటించవలసింది. నీయొక్క పూజకు నన్ను హాజరుపరచుకోవలసింది అని సర్వభారమును సద్గురుదేవునిపైవేసి ఆర్త స్వరముతో ప్రార్థించి, ఒక దృఢనిశ్చయమునకు వచ్చి సద్గురు నామోచ్చారణచేస్తూ నదిలోదిగి వెళ్లి-పోవడానికి శరణప్ప సంసిద్ధుడైనాడు. నదిలో ప్రవేశించాడు. సద్గురుదేవుని నామగర్జన చేశాడు.

శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహరాజ్ కీ జై........

అంటూ నదిలో దూకినాడు. నదివేగముగా ప్రవహించడమువల్ల తాను ఈదలేక నదిలో కొట్టుకుపోతున్నాడు. తక్షణమే సద్గురుసిద్ధనాథుడు ప్రత్యక్షమై,ఒక నావలో స్వామి కూర్చొని,నావను శరణప్ప సమీపమునకు తీసుకొచ్చి, శరణప్పను మెల్లగా నావలోనికి తీసుకొని ఒడ్డుకు చేర్చాడు. శరణప్ప ఎప్పుడైతే నదులోదూకినాడో, నదీప్రవాహమునకు తట్టుకొనలేక ఉక్కిరిబిక్కిరై స్పృహను కోల్పోయినాడు. తీరమున పడిన కొంతసేపటికి మళ్ళీ తెప్పరిల్లుకొని నలువైపులా పారచూసినాడు. ఎవరునూ కనిపించడము లేదు.ఈమధ్యలో ఏమి జరిగిందో తనకు ఏమాత్రముగూడా తెలియలేదు. ఎలాగో ఒడ్డునకు చేరుకున్నాడు. అప్పుడు శరణప్ప ఇలా విచారిస్తున్నాడు. దుస్తరమైన ఈ నదినుండి సురక్షితముగా దాటించగల సామర్థ్యము ఒక్క సద్గురుదేవునికి తప్ప మరెవరికినీ లేదు. ఆ సద్గురు దేవుడే నన్ను ఈ దుస్తరమైన నదినుండి క్షేమముగా దాటించి అదృశ్యమైనాడని అనుకొని, అక్కడ నుండి శరణప్ప బయలుదేరి, హుబ్లీకి చేరుకొని సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవుని దర్శించి పిదప జరిగిన వృత్తాంతమును సవిస్తారముగా తేటపరిచినాడు.

అప్పుడు సిద్ధారూఢస్వామి అంటాడు.మోహరూప ప్రవాహములో దరిగానలేక కొట్టుకుపోతున్న జీవులను రక్షించుటకు ఈ లోకములో ఒక్క సద్గురుదేవుడే సమర్థుడు. అన్యులు కారు. ఈవిధముగా శరణప్ప ఎల్లప్పుడూ సద్గురుదేవుని మహిమను తన కీర్తనలద్వారా భక్తులకు బోధిస్తూ, సద్గురు దేవునియెడల దృఢభక్తికలుగునట్లు ప్రయత్నము చేస్తుండేవాడు.

సద్గురు భక్తుడైన శరణప్ప సద్గురుదేవుని మహిమను అద్భుతముగా బోధిస్తూ అనేక జీవుల కళ్యాణముగూర్చి అహర్నిశలు ప్రయత్నము చేస్తున్నాడు. శివరాత్రి మరియు శ్రావణ మాసములలో జరుపబడు ఉత్సవ నిమిత్తముగా సద్భక్తుల కోసమై ధాన్యమును సేకరించేవాడు. ప్రతి ఉత్సవ సమ-యానికి వంద క్వింటాళ్ల ధాన్యమును సేకరించి సద్గురు భక్తులకు ప్రసాదరూపముగా అర్పించేవాడు. అన్నిచోట్ల భజనలు, కీర్తనలు చేయించేవాడు. స్వామియొక్క మహిమను కీర్తనద్వారా వర్ణించేవాడు. శరణప్పకు సద్గురుదేవునియొక్క దర్శనము ఏ స్థలములో లభించిందో, ఆ స్థలమును తాను ఖరీదు చేసి, అక్కడ సాధుసత్పురుషుల కోసము ధర్మశాలలు నిర్మించినాడు. భజనమందిరము నిర్మించి-నాడు. పగలు రేయి నిరంతరము సద్గురుభజనలు చేయించేవాడు.అంతేగాక చుట్టూనాలుగు గ్రామా లలో కూడా ఇదే ప్రకారముగా భజన కీర్తనల గురించి వసతులు ఏర్పరచి, అఖండముగా భజన కీర్తనలు, సద్గురుచరిత్ర ప్రవచనము జరిపేవాడు. రాజ దర్బారులలో ప్రవేశించి వారికి సద్గురుదేవుని మహిమను బోధించి శిష్య సంప్రదాయమును వృద్ధిపరుచుటకొఱకు భక్తులకు పంచాక్షరి మంత్రో-పదేశము చేసెను. ప్రతి భక్తునికి సద్గురుదేవుని భావచిత్రమునిచ్చి సద్గురు చరిత్రను, సద్గురు స్తోత్ర-మును పఠించుకోమని చెప్పేవాడు. శివరాత్రి ఉత్సవ సందర్భముగా పన్నాలాల్ అనే మహారాజు, స్వామికి వెండి రథమును సమర్పించాడు."యడళ్ళీ"మరియు"చిమ్మడ"అను మహారాజులు మరియు

ఇతర సత్పురుషులకు శరణప్ప సద్గురుదేవుని దర్శనమును చేయించినాడు. శివరాత్రి పర్వదిన సందర్భముగా రుద్రాక్షమండపములో ఉన్నతాసనములో కూర్చుండబెట్టి శరణప్ప మహావైభవముగా స్వామికి పాదపూజ చేసినాడు. శరణప్ప ఈవిధముగా స్వామి సేవద్వారా తన జీవితమును ధన్యము చేసుకొని, ఇతర జీవులనుగూడా ధన్యులను చేసినాడు. లోకోద్ధరణార్థము అనేక సత్సంగములు ఏర్పాటుచేసి కార్యక్రమములు నిర్వహించి అనేక జీవులకు జీవ-బ్రహ్మైక్యరూప మోక్షమును ప్రాప్తము చేయించినాడు. ఇటువంటి శరణప్ప లాంటి శిష్యుడు కరుణాఘనుడైన, ఆనందపూర్ణుడైన ఆ పర-మాత్మ కృపలేకుండా దుర్లభము. ఇలాంటి సంబంధమును సర్వజ్ఞుడైన ఈశ్వరుడే కలుపుతాడు. ఈశ్వర స్వరూపమైన సద్గురుదేవుని దివ్య నామమంత్రమును ఉచ్చరించినంత మాత్రమున సకల కార్యములు సఫలమై యథార్థ జ్ఞానమును పొంది భవబంధ విముక్తులౌతారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతము శ్రవణ మాత్రముననే సకల పాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది ఆరవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః	ఓం శ్రీ గురుభ్యోనమః	ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది ఏడవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురు సిద్ధనాథా! నీవు పరిశుద్ధమైన హృదయములో నివసిస్తావు. యథార్థమైన భక్తులకు నిర్భయపదవిని ప్రాప్తముజేసి వారిని తప్పకుండా సంకటములనుండి రక్షి-స్తావు. భక్తులు అధికారులైనా, అనధికారులైనా వారి స్థోమతనుబట్టి బోధచేసి వారిని ఉద్ధరిస్తావు. ఉత్తమోత్తమ అధికారులకు (ముముక్షులకు) సాక్షాత్ జ్ఞానబోధజేసి తరింపజేస్తావు. పద్మములవంటి నీయొక్క దివ్యపాదములను హృదయములో స్మరించినచో వారికి ముక్తిని ప్రసాదించి భవరోగ-మును నివృత్తి చేస్తావు.

ఉత్పత్తి రహితుడవు=అనాది; దేశకాలవస్తు పరిచ్ఛేదరహితుడవు=అనంతము; నిర్గుణస్వ-రూపుడవగు నో సిద్ధసద్గురుదేవా! నీవు భక్తులను భవసాగరమునుండి తరింపజేయు నిమిత్తముగా సగుణరూపముగా అవతరించి అనేక లీలలను (అభిమానరహిత వ్యవహారమును) ప్రదర్శించుచు-న్నావు. జగత్తులోనున్నట్టి దేహాదులన్నియు నీయొక్క రూపాలే. కావున, భక్తులు ఆపత్సమయములో నిన్ను ఆర్తనాదముతో వేడుకున్నట్లయితే తత్క్షణమే నీవు వెళ్లి వారిని (నిన్ను నీవే) రక్షించుకుంటావు. నీ సాన్నిధ్యమునకు చేర్చుకుంటావు. నీయొక్క భక్తులు శోభాయమానముగా పూజ్యభావనతో నిన్ను కీర్తించడము వలననే, నీవు కీర్తివంతుడవయ్యావు. వారందరూ సుఖముగా ఉంటే, నీవు సుఖము-గా ఉన్నట్లే. వారు ప్రేమతో, పూజ్యభావనతో నిన్ను దైవముగా భావించి పూజించడమువల్లనే, నీవు దేవుడవయ్యావు. భక్తులు నిన్ను భక్తిభావముచేత నిర్గుణమునుండి సగుణములోనికి తీసుకొచ్చారు. సగుణరూపముగా నిన్ను ఆరాధించడము వల్లనే, నీవు సగుణరూపమును ధరించినావు. లేనిచో, నీవు నిర్గుణ, నిరాకార, నిరంజన, నిత్య, శుద్ధ, బుద్ధ స్వరూపుడిగానే ఉండేవాడివి. అటువంటి నిర్గుణస్వరూపడవై యుండికూడా భక్తులయొక్క ఉద్ధరణార్థము అజన్ముడవైన నీవు జన్మమునకు వచ్చినావు. భక్తులయొక్క పుణ్యప్రభావము చేతనే నీవు సగుణరూపుడిగా జన్మించావు. వారే నీకు జన్మనిచ్చారు. నీయొక్క లీలలు అన్నికూడా భక్తుల రక్షణార్థమే అయి ఉన్నవి. ఎవరెవరు నిన్ను ఎలా వేడుకుంటే, వారి వారిని అలాగే రక్షిస్తావు. ధనము కోరినవారికి ధనమును, సంతానమును కోరినవారికి సంతానమును, మోక్షమును గోరువారికి జ్ఞానమును ప్రసాదించి, ఆశీర్వదించి ధన్యులను చేసినావు.వారివారి అధికారమునకు తగినట్లుగా మంత్రోపదేశమును,తత్త్వోపదేశమును

బోధించి ఉద్ధరించినావు. నీయొక్క భక్తుల సంకటములను అనేక ఉపాయములను కల్పించి, ఎవ-రిని ఎలా రక్షించాలో వారిని అలా రక్షించినావు. పండితులు, పామరులు అనుభేదము లేకుండా అందరిపైనా నీయొక్క దయను సమానముగా చూపుదువు. సకలభూతములను నీయొక్క స్వరూ-పముగా భావించుదువు. ఈ ప్రకారముగా భక్తుల నిమిత్తముగా శ్రీ సద్గురు సిద్ధనాథుడు సిద్ధాశ్ర-మమందు విరాజమానుడై అనేక లీలలను ప్రదర్శిస్తూ ఉన్నాడు.

ఒకానొక రోజున ఒక భక్తుడు పరుగు పరుగున సద్గురు సన్నిధానమునకు వచ్చి, ఓ సద్గురు దేవా!మా ఇంటికి ఒక వృద్ధబ్రాహ్మణుడు చాలా దూరదేశమునుండి వచ్చినాడు. ఆయన వ్యాధిగ్రస్తుడై అంత్యావస్థలో నున్నాడు. ఎల్లప్పుడూ నీయొక్క నామామృతమును ఉచ్చరిస్తూ, నీయొక్క దర్శనము కోసము పరితపిస్తున్నాడు.నిన్ను కడసారిగాదర్శించి ప్రాణత్యాగముచేయుటకు సిద్ధముగానున్నాడు. కావున, ఆయనకు నీయొక్క దర్శనభాగ్యము తొందరగా కలుగజేయవలసింది-అని వేడుకున్నాడు. ఆ భక్తునియొక్క ఆర్త వచనములను విని సద్గురుదేవుడు వెంటనే బయలుదేరి, ఆ భక్తుని ఇంటికి వెళ్లి ఆ వృద్ధబ్రాహ్మణునికి దర్శనమిచ్చినాడు. రోగగ్రస్తుడైన ఆ వృద్ధుడు లేవలేని పరిస్థితిలో ఉండిగూడా తొందరగా లేచి సద్గురుదేవునికి నమస్కారము చేసినాడు. మరియు స్వామితో ఇలా అంటున్నాడు. ఓ సిద్ధనాథా! నీయొక్క దర్శనభాగ్యముచేత శుష్కించిన నాశరీరము సశక్తమైనది. నీయొక్క అంత్య దర్శనము కోసము పంచప్రాణాలను నిలబెట్టుకొని ఎదురుచూస్తున్న నన్ను రక్షించుము స్వామీ! ఆర్యా! నేనెవరో కాదు. నా పేరు సుబ్బయ్యశాస్త్రి. నీకు నాకు శ్రీమల్లికార్జున క్షేత్రములో సద్గురు గజదండస్వామి సమక్షమున వాదము జరిగినది. పాండిత్యాహంకారముచేత యున్న నన్ను ఖండన చేసితివి. యథాయోగ్యముగా సప్రమాణముగా,సయుక్తికముగా నాయొక్క వాదనను ఖండించతివి. అంతవరకు నాకు చాలా పాండిత్యాభిమానము, దురహంకారము ఉండేది. నీయొక్క సంబంధము వలన నా అహంకారము సమూలముగా నివృత్తమైనది. కాలాంతరములో నాకు చాలా పశ్చాత్తా-పము కలిగింది. నీకు క్షమాపణ చెప్పుకోవడానికి మళ్లీ గజదండస్వామి ఆస్థానమునకు వెళ్లి విచా-రించగా, నీవు సద్గురు ఆజ్ఞానుసారముగా తీర్థయాత్రలకు వెళ్లి పోయినావని తెలిసింది.అప్పటినుండి నిన్ను వెతికి పట్టుకొని నిన్ను దర్శించి క్షమాపణ చెప్పుకోవాలని, అనేక తీర్థక్షేత్రములు, అనేక స్థల-ములు వెదుకుతూ వెదుకుతూ పరిపూర్ణ వైరాగ్యభరితుడనై తిరుగుతూ, చివరకు ఇక్కడ చేరుకు-న్నాను. ఎలాగైనా సరే నిన్ను దర్శించాలన్న తీవ్రేచ్ఛచేత శరీరము వ్యాధిగ్రస్తమైనప్పటికీ నిన్ను వెదుకుతూ వెదుకుతూ చివరికి ఈ హుబ్లీ క్షేత్రమునకు వచ్చాను. పరమేశ్వరుడు నీ దర్శనము కోసము నాయొక్క అంత్యప్రాణాలను కాపాడినాడు. ఇప్పుడు నీయొక్క అంత్య దర్శనభాగ్యము వలన నా చివరికోరిక ఫలించింది. నాజన్మ ధన్యమైనది. ప్రశాంతచిత్తుడనై నా శరీరమును అనాయాస-ముగా త్యాగము చేయగలను.నిర్గుణ,నిరాకార,అజన్ముడవైన నీ స్వరూపాన్ని తెలుసుకోలేక పోయి-

తిని. నిర్గుణస్వరూపుడవైయుండిగూడా ఈజగత్తులో సగుణరూపముగా అవతరించినావు. ఓసద్గురు దేవా! నీయొక్క నిర్గుణ, నిరాకార స్వరూపమును నీ కృపచేత పొందాలని పరితపిస్తున్నాను. దయ చేసి నాకు శీఘ్రముగా జ్ఞానమును ప్రసాదించండి స్వామీ!ఒకవేళ ఆ జ్ఞానమును పొందే అధికార-ము ఈ జన్మకు లేనట్లయితే, నీ స్వరూపమును తెలుసుకొని తరించుటకు దయచేసి నాకు మళ్ళీ పునర్జన్మను ప్రసాదించండి. ఎల్లప్పుడూ నీ సాన్నిధ్యములోనే ఉండి నిశ్చింతగా నీయొక్క సేవ చేస్తూ ఉండాలని నాయొక్క చివరి కోరిక గలదు. దయచేసి నెరవేర్చండి స్వామీ!మరుజన్మలోనైనా నా(నీ) స్వరూప జ్ఞానమును పొందునట్లు ఆశీర్వదించి అనుగ్రహించండి. ఇక నాకు సెలవు ఇవ్వండి. నేను నిశ్చింతగా ప్రాణత్యాగము చేస్తాను-అని ఈ విధంముగా సుబ్బయ్యశాస్త్రి పదేపదే వేడుకుంటాడు. శాస్త్రియొక్క వివేకయుక్త ప్రార్థనను విని సద్గురు సిద్ధనాథుడు హృదయము ద్రవించినవాడై, అశ్రు పూరిత నయనములచేత శాస్త్రిని ఇట్లు ఆశీర్వదిస్తాడు.

ఓ సుబ్బయ్యశాస్త్రీ! నీవు ధన్యుడవయ్యా! అంత్యకాలములో జ్ఞానప్రాప్తియొక్క సద్వాసన దృఢముగా ఉంచుకొని,ఈ దేహ త్యాగము చేస్తున్నావు. తప్పకుండా నీవు ధన్యుడవౌతావు.

**శ్లో ॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేవరమ్ ।**

**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥** (గీత 8-6)

మనుష్యుడు అంత్యకాలములో ఏయే భావమును ధరించి, స్మరిస్తూ శరీరమును త్యజిస్తాడో, అతడు క్రమశః తత్సంబంధి యోనియందే జన్మిస్తాడు. ఎవరు యేచింతన చేస్తూ మరణిస్తారో, అంత్యకాలములోని ఆ చింతనానుసారమే తత్సంబంధ యోనిని పొందుతారు. జీవితకాలమంతా దేనిని చింతిస్తూ జీవితము గడుపుతారో, ఆ సంస్కారమే ప్రాణప్రయాణ సమయములో స్ఫురణకు వస్తుంది. ఆ స్మరణానుసారముగానే భావిజన్మ లభించగలదు. కావున, నీవు నీయొక్క అవసాన దశలో జ్ఞానాపేక్షతో సద్గురుదేవుని దర్శిస్తూ, స్తుతిస్తూ శరీరమును త్యాగము చేస్తున్నావు. నీవు తప్పకుండా మళ్లీ నావద్దకే అతిత్వరలో వస్తావు-అని ఆశీర్వదిస్తాడు.ఇటువంటి సద్గురు దేవునియొక్క అమృతవచనములను విని శాస్త్రి సద్గురు వదనమును చూస్తూ చూస్తూ సద్గురు నామోచ్చారణ చేస్తూ అసువులు వదిలినాడు.

**ఓం శ్రీ సద్గురు సిద్ధరూఢాయ నమః**

ఆ ఊరి బ్రాహ్మణులంతా కలసి సుబ్బయ్యశాస్త్రియొక్క భౌతికదేహమునకు అంత్యక్రియలు జరిపినారు.సిద్ధసద్గురుదేవునికి యథాయోగ్యముగా పూజలుగావించి, మఠమునకు పంపించినారు.

గర్గ గ్రామమునందుండెడి బ్రహ్మనిష్ఠ మహాత్ముడైన "మడివాలప్పస్వామి" వద్ద 'శివబసప్ప' అనే ఒకానొక గృహస్థుడుండేవాడు. ఆయన శ్రద్ధాభక్తులతోడ స్వామియొక్క సేవ ప్రతినిత్యము చేసేవాడు. జీవన నిర్వాహణ నిమిత్తము దినమంతా 'మొగ్గము' నేసి సాయంత్రము మఠమునకు

వెళ్లి స్వామి సేవ చేస్తూ రాత్రంతా అక్కడే గడిపి ఉదయమున ఇంటికి వచ్చెడివాడు. ఈ ప్రకారముగా దేహాభిమానమును విడిచి మడివాలప్పస్వామియొక్క సేవ చాలా శ్రద్ధతోచేస్తూ ప్రతినిత్యము స్వామి యొక్క ముఖకమలముద్వారా వేదాంత శ్రవణముచేసేవాడు. విరామ సమయములో భజన, కీర్త-నలుచేసేవాడు.

శివబసప్పయొక్క భార్య శివలింగవ్వ. ఆమె చాలా సదాచార సంపన్నులురాలైన పతివ్రత స్త్రీ. ప్రతినిత్యము ఆమె తన పతిసేవతోపాటు సద్గురుసేవకూడా చేసేది.ఆ నిర్మలాంతఃకరణముగల దంప తుల సేవకు సద్గురుదేవుడు సంతుష్టుడై శివబసప్పను ఇలా అడుగుతాడు.నాయనా బసప్పా! ఇన్నా-ళ్లుగా చూస్తున్నాను, ప్రతినిత్యము నియమము తప్పకుండా నా సేవ చేస్తున్నావు. ప్రయోజనము లేకుండా పసివాడు కూడా ప్రవృత్తుడు కాడు కదా!

**శ్లో ॥ ప్రయోజనమనుద్దిశ్య మన్దోఽపి న ప్రవర్తతే ।**

**ప్రయోజనం సంప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్ ॥** (సర్వ వేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము 11)

మరి, నీవు యే కోర్కెతో నా సేవ చేస్తున్నావు? అని అడుగగా, శివబసప్ప సద్గురుదేవునికి ఇలా సమాధానమిచ్చినాడు. ఓ సద్గురుదేవా! నీయొక్క సేవ లభించడమే నాకు మహాభాగ్యము. నాకు సంసారాసక్తి లేదు. దుఃఖమిశ్రితమైన, అనిత్యమైన సంసారమందలి అల్పసుఖములయందు నా మనసు రమించడము లేదు. నీయొక్క సేవతప్ప నాకు వేరేఇచ్ఛలేదు-అని అంటాడు.అప్పుడు స్వామి, బసప్పయొక్క భార్యను విచారించాడు. ఏమమ్మా! నీకేమైనా కోరిక గలదా? అప్పుడు శివలింగవ్వ స్వామిని ఇలా కోరుకుంది.స్వామీ!నాకు సంతానము లేదు. మా దంపతులకు ఒక సుపుత్రుడు కలు-గునట్లు ఆశీర్వదించండి, అని వేడుకుంది. ఆమెయొక్క కోర్కెమేరకు మీకు జ్ఞానవంతుడైన సుపుత్రుడు జన్మించు గాక! అని ఆశీర్వదించాడు. కొంతకాలము గడచిన పిమ్మట శివలింగవ్వ గర్భము ధరించి, నవమాసములు నిండిన మీదట ఒక చక్కని సుపుత్రుని ప్రసవించింది.

ఒకరోజున వారు జ్యోతిష్కుని పిలిపించి బాలునియొక్క భవిష్యత్తును విచారించగా, ఆ బాలునియొక్క చిహ్నాలను అనుసరించి జ్యోతిష్కుడు ఇలా అంటాడు. ఈ బాలుడు ఈశ్వర ప్రసాద-ముగా మీకు జన్మించినాడు. కావున, ఈయనకు"శివపుత్రప్ప"అని నామకరణము చేయండి.ఇతనిది యోగభ్రష్టశరీరము. సద్గురుదేవుని కృపకు పాత్రుడై బ్రహ్మనిష్ఠుడు కాగలడు. మీయొక్క కులమును ఉద్ధరింపజేస్తాడు–అని చెప్పినాడు. బాలుడు దినదిన ప్రవర్ధమానమై పండ్రెండు సంవత్సరాల వయ-స్కుడైనాడు.తర్వాత తల్లిదండ్రులు ఆయనకు వివాహము చేసినారు. పదునైదు సంవత్సరాలు ప్రాప్తిం-చిన పిమ్మట శివపుత్రప్పకు తీవ్రవైరాగ్యము కలిగింది.

ఆ సమయమున భార్య తల్లిగారింటియందుండెను. అప్పుడు 'శివపుత్రప్ప' తన తల్లిదండ్రుల-కెవరికి చెప్పకుండా ఇంటినుండి బయలుదేరి, నేరుగా '**హుబ్లీ**'కి వచ్చి సిద్ధాశ్రమము చేరుకున్నాడు.

సిద్ధసద్గురు దివ్యపాదారవిందములను దృఢముగా ధరించి, సాష్టాంగ నమస్కారములుచేసి,స్వామిని ఇలా వేడుకుంటాడు. ఓ సద్గురుదేవా! దీన దయాళా! కరుణా నిధీ! నీవే సర్వస్వమని భావించి సర్వమును త్యాగముచేసి నిన్ను ఆశ్రయించితిని.నన్ను కరుణించి రక్షింపుము.నీవుతప్ప నన్ను రక్షించేవారెవరునూ లేరు. నీ దివ్యపాదారవిందముల నాశ్రయించి ఎల్లప్పుడూ నీ పాదసేవచేసే భాగ్యమును ప్రసాదింపుము–అని దీనముగా వేడుకున్నాడు.

**శ్లో ॥ స్వామిన్నమస్తే నతలోకబన్ధో, కారుణ్యసిన్ధో పతతం భవాబ్ధౌ ।**

**మాముద్ధరాత్మీయ కటాక్షదృష్ట్యా, ఋజ్వ్యాతికారుణ్య సుధాభివృష్ట్యా ॥**

**దుర్వారసంసారదవాగ్నితప్తం, దోధూయమానం దురదృష్టవాతైః ।**

**భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః, శరణ్యమన్యం యదహం న జానే ॥** (వి.చూ.37 & 38)

దయాసాగరుడైన సద్గురు సిద్ధనాథుడు, ఆ బాలునియొక్క ఆర్తనాదమును విని హృదయము ద్రవించి, తనయొక్క అమృతహస్తములతో బాలుని పైకిలేపి,నీవు నిర్భయుడవై ఎల్లప్పుడూ నా సన్నిధానముయందే ఉండుము.ఇక ఈసంసారతాపత్రయ భయము నీదరికి రాదు,అని అభయమిస్తాడు.

**శ్లో ॥ మా భైష్ట విద్వం స్తవనాస్త్యపాయః, సంసారసిన్ధో స్తరణేఽస్త్యుపాయః ।**

**యేనైవ యాతా యతయోఽస్య పారం, తమేవ మార్గం తవ నిర్దిశామి ॥** (వి.చూ. 45)

సద్గురుదేవుడు ఆ బాలుని ముఖచిహ్నాలను గుర్తుపట్టి, ఈ బాలుడు తప్పకుండా గత జన్మలోని సుబ్బయ్యశాస్త్రీయే అయి ఉంటాడని,అంత్యకాలములో నన్ను దర్శిస్తూ,స్మరిస్తూ నన్నే పొందాలనే తీవ్రతర ఇచ్ఛను హృదయములో ధరించి మరణించాడు. కావున, ఇప్పుడు నన్నే చేరుకున్నాడని– సద్గురుదేవుడు నిశ్చయించుకున్నాడు. ఈయనకు తొందరగా బ్రహ్మవిద్యను ప్రాప్తము చేయాలని నిశ్చయించుకుని, ఈయన మహాపండితుడు, బ్రహ్మజ్ఞాని కాగలుగుతాడని వెంటనే వేదాంత విచారమునందు ప్రవేశపెట్టినాడు. సద్గురుదేవుడు, శివపుత్రప్పకు సంస్కృతము నేర్పించుటకు పాఠశాలకు పంపినాడు. గతజన్మలోని సంస్కారబలముచే వేదాంత గ్రంథములను ఎన్నిటినో,తానే స్వయముగా చదివి విచారము చేసినాడు. సద్గురుదేవుడు సకలవేదాంత శాస్త్రములను బోధించాడు. క్రమముగా సద్గురుదేవునియొక్క సంపూర్ణ కృపకుపాత్రుడై వేదవేదాంగములలో–షడ్దర్శనములయందు అత్యంత నిపుణుడయ్యాడు. త్రికరణశుద్ధిగా సన్యాస దీక్షను స్వీకరించాడు. *(వేదవేదాంగముల గూర్చి 36, 37 పృష్ఠములలో గనదగును).*

తదనంతరము శివపుత్రప్పయొక్క గురునిష్ఠను పరీక్షించుటకై సద్గురుదేవుడు తన సమీపమునకు పిలుచుకొని, ఒక పెద్దబండరాయిని చూపించి, ఈ రాయిని ఎత్తుకొని పరిగెత్తుమని ఆజ్ఞాపించినాడు. సద్గురుదేవుని ఆజ్ఞనుశిరసావహించి శివపుత్రప్ప అలాగే చేసినాడు.రాయి చాలా బరువుగా ఉండడమువల్ల పరిగెత్తుతూ ఉంటే చాలా ఆయాసముగలిగి శ్రమించినవాడై భూమిపై చరు-

చుకుపడినాడు. శరీరము బాగా గాయపడింది. ఆ గాయములతో బాధపడుతున్న శివపుత్రప్పను గాంచి స్వామి, ఎందుకు దుఃఖిస్తున్నావు?అని మందలిస్తాడు.అప్పుడు శివపుత్రప్ప అంటాడు. సద్గురు దేవా! శరీరమునకు గాయములు తగిలి చాలా బాధపడుతున్నాను. ఆయాసముగా ఉంది స్వామీ! అంటాడు. అప్పుడు సద్గురు దేవుడంటాడు–దేహమే నేను అని అభిమానమును పొందినావు. కావున, దుఃఖమును అనుభవిస్తున్నావు. దేహమునకు దుఃఖము సహజమే. అదే నేనని అభిమానించావు. కాబట్టి, నీకు దుఃఖము కలుగుచున్నది. దేహముయొక్కబాధ నీకు సహజముగా తెలియపడుచున్నది కదా! మరి నీవు దేహానివి ఎలా కాగలవు? ఈ రాయి నీ కంటే భిన్నముగా ఉంది. రాయి అంటే నేను కాదని,అది జడమైనదేయని నీవు ఎలా తెలుసుకుంటున్నావో, ఈ శరీరముగూడా జడమైనదే, నీకన్నా భిన్నమైనదే. అలాంటప్పుడు దేహమును ఆత్మయని (నాస్వరూపమని) ఎలా భావిస్తున్నావు?

ఇటువంటి సద్గురువచనములను శివపుత్రప్ప విని,ఏకాంతములో కూర్చుండి,మననము చేస్తున్నాడు. సద్గురుదేవుడు చెప్పినట్లుగా ఈ శరీరము జడమైనది.నాకంటే భిన్నంగా ఉంది. నాచేత తెలియపడుచున్నది. కావున,శరీరము నేను కాదు,నాది కాదు–అని సంవత్సరకాలము చింతనచేసి, దేహము నేను కాదని నిశ్చయించుకున్నాడు. దేహబుద్ధి క్షీణించింది. కాని, ఇంద్రియములు నేను కావచ్చును గదా! అని అనుకున్నాడు.ఈవిధముగా ఇంద్రియములంటేనే నేనని శివపుత్రప్ప విపరీ-తముగా నిశ్చయించుకున్నాడని సద్గురుదేవుడు తెలుసుకొని, ఇంద్రియములుకూడా నీవు కాదని బోధించుటకై, కొద్దిగా మిరపకారము నీళ్ళు దగ్గర పెట్టుకొని, శివపుత్రప్పను దగ్గరకు పిలుచుకొని అకస్మాత్తుగా ఆ కారము నీళ్ళను శివపుత్రప్ప రెండు కళ్ళలో చల్లినాడు. అప్పుడు శివపుత్రప్ప అయ్యో! స్వామీ! నా కళ్ళు మండుచున్నవి అని రోధించాడు. అప్పుడు సద్గురు సిద్ధనాథస్వామి అడుగుతాడు.

ఏమయ్యా శివపుత్రా! కండ్లమంటను నీవు తెలుసుకుంటున్నావు కదా! మరి ఆకండ్లు నీవెలా కాగలవు? చెప్పు. ఒకవేళ ఇంద్రియములే నీవైతే పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు కలిసి మొత్తము పదిఇంద్రియములు ఉన్నాయి.వాటిలో నీవు యే యింద్రియమువు?లేక పది ఇంద్రి-యరూపములుగా ఉన్నావా? నాకు చెప్పు. ఇటువంటి సద్గురుదేవునియొక్క వచనములను విని శివపుత్రప్ప బాగుగా విచారించి మననముచేసి మరొక నిశ్చయమునకు వచ్చినాడు. ఇంద్రియము-లను ప్రేరేపించి వాటి వాటి కార్యములలో ప్రవృత్తము చేయించేది మనస్సు. కావున, మనస్సే నేను. మనసుయొక్క సంకల్ప వికల్ప వృత్తులద్వారా ఇంద్రియములు ప్రేరేపింపబడి వాటి వ్యవహారము (వ్యాపారము)నందు ప్రవృత్తి అగుచున్నవి. కావున, మనస్సే నేను. ఇట్లు,"శివపుత్రప్ప"సంవత్సరము పర్యంతము మననముచేసి మనస్సే నేనను దృఢనిశ్చయమునకు వచ్చినాడు.

ఇలా ఉండగా,ఒకరోజు సద్గురుదేవుడు శివపుత్రప్పను, నీవెవరు?అని ప్రశ్నించాడు. అప్పుడు

శివపుత్రప్ప అంటాడు. స్వామీ! సంకల్పవికల్పరూప మనస్సే నేను. దానిద్వారానే పుణ్యపాపములు జరుగుచున్నవి. వాటి ఫలములను నేను అనుభవిస్తున్నాను అని చెప్పినాడు.

అప్పుడు సద్గురుదేవుడంటాడు–ఏమయ్యా! క్షణక్షణమునకు వికారమును పొందే మనసు నీవెలా కాగలవు? సకల మనోవృత్తులను నీవు నిర్ధారణచేసి చెప్పగలుగుతున్నావు. మనస్సు, మనోవృత్తులును నీకు తెలియబడుచున్నప్పుడు, నీ కన్నా భిన్నంగా ఉండి నీకు తెలియపడే మనస్సు నీవెలా కాగలవు చెప్పు.

తదనంతరము, స్వామియొక్క వచనములను బాగుగా ఒక సంవత్సర కాలము మననము చేసి, సుఖదుఃఖములను, సకల మనోవృత్తులను తెలుసుకొని యుక్తాయుక్తములు యోచించి నిశ్చ-యముచేయు కర్తృత్వ భోక్తృత్వరూప బుద్ధియే నేనని చివరకు నిశ్చయించుకొని, ఒకసారి సద్గురు దేవుని వద్దకు వెళ్లి, స్వామీ! బుద్ధియే నేనని తన నిర్ణయమును తెలిపినాడు. సద్గురుదేవుడు ఆ మాటలను విని, అప్పుడే ఏమి మారు మాట్లాడక, ఒకనాటి ప్రభాత సమయములోనే శివపుత్రప్ప గాఢనిద్రలో ఉండగా, ఆయన వద్దకు వెళ్లి వీపుతట్టి లే నాయనా! అని పిలిచినాడు. శివపుత్రప్ప, స్వామియొక్క పలుకులను విని వెంటనే గగుర్పాటుతో లేచినాడు.

అప్పుడు స్వామి ఇలా అడుగుతాడు. నీవు ఇంతసేపు గాఢనిద్రలో దేనిని అనుభవించావు? చెప్పు అని ప్రశ్నించాడు.శివపుత్రప్ప సమాధానము చెప్పలేక ఓ సద్గురుదేవా! నాకు ఏమి తెలియబడ లేదు, ఏమి అనుభవమునకు రాలేదు–అని చెప్పగా, అప్పుడు స్వామి అంటాడు. ఇంతవరకు బుద్ధిని నేనను నిశ్చయమును నీవు చెప్పియుంటివి. కదా! ఆ బుద్ధిరూప నీవు ఇంతవరకు ఎక్కడున్నావు?

అప్పుడు శివపుత్రప్ప అంటాడు–నేను ఏమియు లేనటువంటి శూన్యస్వరూపుడనై రాత్రంతా కేవలము సుఖమును మాత్రమే అనుభవించాను. ఆ సుఖముగూడా ఎక్కడిదో, నాకు తెలియదు. అప్పుడు సద్గురుదేవుడంటాడు. నేనున్నానని అన్నావు కదా! అదే నీవు. జాగ్రత, స్వప్నము, సుషుప్తు-లలో, భూత భవిష్యద్వర్తమాన కాలములలో ఎల్లప్పుడూ, మణులలో సూత్రమువలె ఉన్నావు. గనుక నీవు సత్స్వరూపుడవు.అదే నీవు.జాగ్రదాదులు ఒకదానియందు మరొకటి పరస్పరము వ్యభిచారము లున్నాయనిగూడ చెప్తున్నావు. గనుక,అవస్థలయొక్క భావాభావములను, సుఖదుఃఖములను ప్రకా-శించే చిత్స్వరూపుడివి. సుషుప్తిలో సుఖమును అనుభవించానని తెలుసుకుంటున్నావు.కనుక,ఆనం-దరూపుడివి నీవే–అని తెలుసుకో.ఎందుకనగా, సుషుప్తిలో బాహ్యసుఖనిమిత్తములేమియు లేవు. కావున, నీవు సచ్చిదానంద స్వరూపుడవు. దానికి ఏ పాపపుణ్యముల సంబంధములేదు.దానియొక్క అస్తిత్వముయందే ఆభాసరూప ఈజగత్తు తోచుకున్నది. వాస్తవముగా ఈజగత్తు లేనిదై కానుస్తుంది. దానిని నువ్వు తెలుసుకునే చిద్రూపచేతనుడవు. జడమైన ఈదేహము ఇంద్రములప్రేరణద్వారా కదు-లుచున్నది. (కన్ను చూసిన చోటికి కాలు నడుస్తుంది, కావున) ఇంద్రియములు ప్రాణవాయు సహిత

మనస్సుయొక్క ప్రేరణద్వారా వాటివాటి వ్యాపారములను చేయుచున్నవి. ఎందుకంటే "ప్రాణబంధనం హి సౌమ్య మనః"(ఛాం.6-8-2) ప్రాణవాయువు ఆడితేనే మనసు వ్యవహరిస్తుంది. ప్రాణవాయువును బంధించినచో, మనసు నిరోధింపబడుతుంది మరియు, మనస్సు బుద్ధియొక్క ఆదేశానుసారము వ్యాపారము చేస్తుంది. ఆ బుద్ధియొక్క వ్యాపారమును ఏకరసమై సర్వప్రకాశకమైన సాక్షి స్వరూపుడవైన నీవే స్వయముగా తెలుసుకుంటున్నావు. ఆ సాక్షివే నీవు. ఇట్లు, ప్రత్యగభిన్నపరబ్రహ్మమును నేనని నిశ్చయించుకుని, ఈ అభ్యాసమును ఎప్పుడునూ విడువకుము.

**శ్లో ॥ దేహో నాహం, శ్రోత్ర వాగాదికాని నాహం బుద్ధిర్నాహమధ్యాసమూలమ్ ।**
**నాహం, సత్యానందరూపశ్చిదాత్మా–మాయాసాక్షీ, 'కృష్ణ' ఏవాహమస్మి ॥**
(తత్త్వానుసంధానము - మంగళశ్లోకము)

**శ్లో ॥ అనుభూతోఽప్యయం లోకో వ్యవహారక్షమోఽపి సన్ ।**
**అసద్రూపో యథా స్వప్న ఉత్తరక్షణబాధితః ॥**

**శ్లో ॥ స్వప్నే జాగరితం నాస్తి జాగరే స్వప్నతా నహి ।**
**ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యనయోర్నచ ॥** (యోగశిఖోపనిషత్ 4-10 & 11)

**శ్లో ॥ ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్య పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥** (గీత. 3-42)

నాయనా శివపుత్రా!ఆ స్వరూపధ్యానములోనే ఉండి, విషయాలకు లోబడక సర్వకాల సర్వావస్థలయందు వేదాంత చర్చ, మననము, నిదిధ్యాసనము చేస్తూ కాలక్షేపము చేయుము.

ఇటువంటి సద్గురుదేవుని అమృతవచనములను విన్న శివపుత్రప్పయొక్క మనసు స్వరూపాకారమును పొంది,పరిపూర్ణ బ్రహ్మానందమును అనుభవించినాడు.తదనంతరము శివపుత్రప్ప, సద్గురు దేవుని ఇలా ప్రార్థించాడు. ఓ సద్గురుదేవా! ఓ సిద్ధారూఢ దయాళా! నీయొక్క అపారమైన కృపవలన నేను ఆత్మానుభూతిని బడిసినాను. నాజన్మ ధన్యమైనది. యథార్థమైన బ్రహ్మానంద ప్రత్యక్షానుభూతిని పొందినాను. ఇప్పుడు నీయొక్క దివ్యమైన చరణారవిందములయందు అనన్య భక్తిభావముగలిగి యుండి ఎల్లప్పుడూ నీ పాదసన్నిధిలో ఉండి, నీ దివ్యచరణముల సేవచేయుటకు కరుణతో అనుగ్రహింపుము.

శివపుత్రప్పయొక్క ప్రార్థనను ఆలకించి ఆనందఘనుడైన సద్గురుదేవుడు, ఈవిధముగా అనుమతినిచ్చినాడు. ముముక్షువులకు ఎల్లప్పడు వేదాంత(సిద్ధాంత) గ్రంథములను ప్రవచించి వాటిని యథార్థముగా బోధించుము.ఇదే నిజమైన సద్గురుసేవ అని ఆజ్ఞాపించినాడు. సమస్త జీవులనుద్ధరించడానికి నీ హృదయమందు దృఢసంకల్పమును నిశ్చయించుకొనుము. ఇట్లు, నీవు పొందిన జ్ఞానమును ఇతరులకు బోధించుటవలన అది మరింత దృఢతరము కాగలదు.

సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి, పరమప్రమాణముగా భావించి, శివపుత్రప్ప సద్గురు చరణాలకు సాష్టాంగ నమస్కారములు చేసి, ఇక ఎల్లప్పుడూ సద్గురుదేవుని సమక్షమున వేదాంత శాస్త్రమును ప్రవచించేవాడు. శివపుత్రప్పస్వామిద్వారా వేదాంత శ్రవణము చేసిన శ్రోతలు యథార్థ-మైన జ్ఞానమును పొంది, వారుకూడా బ్రహ్మాకారవృత్తిని పొంది బ్రహ్మానుభూతిలో ఉన్మత్తులై,సద్గురు చరణాలయందు లీనమై ధన్యులైనారు. సద్గురుదేవునియొక్క కృపద్వారా జీవభావమును నివృత్తి చేసుకొని బ్రహ్మాత్మైక్య స్థితిని బడసి భవభయమునుండి తరించి, నిత్య నిరామయస్థితిని పొంది అనేక జీవులు ధన్యులైనారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతముయొక్క శ్రవణమాత్రముచే సకలపాపములు భస్మమై పోగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది ఏడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది ఎనిమిదవ అధ్యాయము

పద్యానువాదము:–సాక్షాచ్ఛివస్వరూపుడవైన ఓ సద్గురుసిద్ధరాయా! విషయాసక్తుడనై విషయ సుఖములకు లోబడి జననమరణరూప సంసారమునకు ఆహుతియైనాను. నీ దివ్యచరణారవింద-ములను ఆశ్రయించే భాగ్యమును కలుగజేసి, తొందరగా భవదుఃఖము నుండి తరింపజేసి, ఈ దీనున్ని రక్షించుమని ప్రార్థిస్తున్నాను.

**శ్లో ॥ కథం తరేయం భవసింధుమేతం, కావా గతిర్మే కథమోఽస్త్యుపాయః ।**

**జానే న కిఞ్చిత్కృపయావ మాం ప్రభో, సంసారదుఃఖ–క్షతిమాతనుష్వ ॥** (వి.చూ.42)

బ్రహ్మానంద స్వరూపుడవైన ఓ సద్గురుదేవా! నీవు అవినాశివి. సిద్ధరూపముగా అవతరించి జ్ఞానప్రకాశము ద్వారా అజ్ఞానచీకట్లను పారద్రోలినావు. జ్ఞానజ్యోతిని వెలిగించినావు. సద్గురుదేవుని ఆశ్రయించకుండా ఎన్ని శాస్త్రములు చదివినను వేదాంతముయొక్క గూఢాభిప్రాయము తెలియదు. బ్రహ్మానుభూతిని పొందలేరు. బ్రహ్మభావము పొందే మార్గము సద్గురుదేవునిచెంత మాత్రమే గలదు. సద్గురుదేవుని ఆశ్రయించనిదే, ఆయనకు శరణు వెళ్ళనిదే జీవుని గతి–అధోగతియే. సద్గురుదేవుని యొక్క కరుణాకటాక్షము లేనిదే, సకలసంపత్తులు(ఇహపరసంపత్తులు) నిరర్ధకములేయగును. భావ యుక్తముగా, భక్తిపూర్వకముగా సద్గురుదేవుడే సర్వస్వమని సకలభారమును ఆయనపై వదిలేసి, ఆ సద్గురుదేవుని దృఢముగా నమ్ముకున్న వారికి సంసారచింత లేశమాత్రముగూడా ఉండదు.ఆయనకు శరణువెళ్ళిన వారికి అనర్థమునకు మూలకారణమైన అహంకార మమకారములు సమూలముగా నివృత్తమగును. ముక్తికాంత వరించును. సద్గురుదేవుని ఎవరైతే విస్మరిస్తారో, వారికి జన్మమరణ రూప సంసారము ప్రాప్తించును. ఎవరు సంసార భీతిచేత సద్గురుదేవుని వద్దకు పరిగెత్తుకుంటూ వెళ్లి పాహి పాహియని శరణుబొందుతారో, వారు ధన్యులౌతారు. అందుచేతనే, తప్పకుండా సద్గురు దేవుని ఆశ్రయించాలి. భవసంద్రమునుండి తరించాలి. సద్గురుదేవునియొక్క చరిత్ర అమృతముకన్న మిన్న.సద్గురుకథామృత శ్రవణమాత్రముచే బ్రహ్మానందముననుభవించి భవబంధ విముక్తులవుతారు.

"బాగల్ కోట" నగరంలో "పాటిల్"అను పేరుగల ఒక గొప్ప శ్రీమంతుడుండేవాడు. ఆయన వద్ద ఎంతో ధనమున్నది. కీర్తిప్రతిష్ఠలుగలవు.కాని,ఎప్పుడుగూడా పరమాత్మను భజించేవాడు కాదు. వ్యాపారములో నిమగ్నుడై రాత్రింబవళ్లు ఆ వ్యవహారచింతనయందే రమించెడివాడు. జనముతో

లావాదేవీల సంబంధముగలిగి ఉండేవాడు.ఆయనకు రుక్మిణి అను పేరుగల సద్గుణవంతురాలు సర్వ లక్షణసంపన్నురాలగు ఒక కుమార్తె ఉండెను. ఆమె భూతబాధచే పీడింపబడుచుండ, తల్లిదండ్రులకు చాలా చింత,దుఃఖము కలుగుచుండెను. ఒకరోజున రుక్మిణి భూతబాధచేత ఆవేశముతో తల్లిదండ్రు లను తిట్టుచూ, నాకు వివాహము తొందరగా చేయవలసిందిగా అనేక విధముల పిచ్చిచేష్టలు చేస్తూ, అసహ్యముగా మాట్లాడుచుండెను. బిడ్డయొక్క దుస్థితిని చూచి 'పాటిల్' కు చాలా బాధ కలిగింది. అదే సమయానికి 'అక్కల్ కోట' 'శరణప్ప' గ్రామ గ్రామాలు తిరుగుతూ సద్గురు సిద్ధనాథుని కీర్తి, మహిమను ప్రచారము చేస్తూ జ్ఞానబోధ చేస్తూ బాగల్ కోటకు వచ్చినాడు. సిద్ధసద్గురుదేవునియొక్క సన్నిహిత భక్తులు గ్రామాలలో పల్లెలలో పట్టణాలలో సద్గురు సిద్ధనాథుని మహిమను తప్ప వేరే ఏమీ బోధించేవారు కారు. వారి కీర్తనలద్వారా సిద్ధారూఢస్వామియొక్క చరిత్ర మహిమను బోధించు-చుండేవారు. సద్గురు సేవాకార్యమును చేస్తుండేవారు.

స్వామియొక్క కీర్తిని విని, ఆ శ్రీమంతుడు తన భార్య మరియు భూతభాదచే పీడింపబడు-తున్న రుక్మిణిని తీసుకొని శరణప్పవద్దకువచ్చి వారి దుస్థితినిగూర్చి విన్నవించుకున్నారు. అప్పుడు శరణప్ప రుక్మిణిని చూసి వారికి ధైర్యము చెప్పుతూ ఇలా అంటాడు. మీరు మీ బిడ్డగురించి ఏమి చింతించనవసరము లేదు. సిద్ధారూఢ సద్గురుదేవుని చరిత్ర ఏడు రోజులు భక్తిశ్రద్ధలతో చదవండి. తద్వారా భూతపీడ సమూలముగా నివృత్తి కాగలదు. మరియు ప్రతిరోజు సిద్ధసద్గురుదేవుని నామ-మును స్మరించండి. విధిపూర్వకముగా వ్రతమును పెట్టుకొని పూజించండి. మరియు సాక్షాత్ సద్గురుదేవునియొక్క పాదోదకమును స్వీకరించండి. ఇట్టి, విధానములను చేసినట్లయిన మీ కుమార్తె యొక్క ఆధిదైవిక దుఃఖము నివర్తించగలదు.

శరణప్పయొక్క వచనములను విని ఆ శ్రీమంతుడు హేళనగా ఇలా అంటాడు. నేను ఇంత వరకు ఎంతోధనమును ఖర్చుచేసినాను.అనేక మంత్రతంత్రములను చేయించినాను.అనేక దేవతలకు పూజలు,ఉత్సవాలు జరిపించినాను. వ్రత దానములను చేసినాను. కాని, సకలోపాయములు నిష్ఫ-లములయ్యెను. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలము లభించనప్పుడు, కేవలము ఒక పుస్తకమును (సద్గురు చరిత్రను) చదివినచో గుణమివ్వగలదా?

అప్పుడు సాధు శరణప్ప ఆ శ్రీమంతునితో ఇలా అంటాడు. సద్గురు సిద్ధారూఢస్వామియొక్క నిరుపమానమైన అగాధమహిమ నీకు తెలియదు. ఆయనను ఆశ్రయించిన వారికి తప్పకుండా ఫల-ము లభించింది. నా మాట నమ్మము. దీనికి నిదర్శనము చెబుతాను విను. 'ఉణకల' గ్రామములో నేను సద్గురుదేవుని మహిమను కీర్తనద్వారా బోధిస్తుండగా, నీ కుమార్తెను ఆవహించిన భూతము కంటె పెద్దభూతము ఆవహించిన ఇద్దరు స్త్రీలు, కేవలము సద్గురు నామకీర్తన శ్రవణ మాత్రముచే వారి భూతబాధ నిశ్శేషముగా నివృత్తమైనది. భావయుక్తముగా, మనస్ఫూర్తిగా, శ్రద్ధ భక్తులతో ఏడు

రోజులు సద్గురు చరిత్రపారాయణ, నామస్మరణ, పూజ, కథామృత శ్రవణయజ్ఞము చేసినచో, తప్ప-కుండా నీ కుమార్తెయొక్క దారుణమగు భూతబాధ సమూలముగా నివృత్తమగును.

ఈవిధమైన శరణప్ప వచనములను ఆ శ్రీమంతుడు విని ఇలా అంటాడు.సరే స్వామీ!సద్గురు చరిత్ర పారాయణచేసి కథాశ్రవణము రుక్మిణికి చేయిస్తాను.పూజలు మొదలుకొని చేయించగలము. కాని, సద్గురుదేవునియొక్క పాదతీర్థము ఎలా లభించగలదు? నేను వ్యాపారములోనే నిమగ్నుడనై ఉంటాను. కావున, తీరిక దొరకదు. నాయొక్క సేవకుడిని ఒకరిని హుబ్లీకి పంపించి స్వామియొక్క పాదోదకమును తెప్పించుకుంటే నడుస్తుందా?అని శ్రీమంతుడు అడిగినాడు.అప్పుడు శరణప్ప తన-లో తాను ఇలా అనుకుంటాడు. ఈ శ్రీమంతుడు ఎప్పుడుకూడా భగవంతుని పూజ తాను ఇష్టపూ-ర్వకముగా చేసినవాడు కాదు. సరే ఏదో విధముగా ఇంత పూర్తికైనా సద్గురుదేవునిపై శ్రద్ధ కలిగింది కదా! చాలు, అని అనుకొని, అప్పుడు శ్రీమంతునితో శరణప్ప అంటాడు. పాటిల్ గారూ! ఇదిగో, సద్గురుదేవునియొక్క చరిత్ర గ్రంథము స్వీకరించుము-అని సద్గురుచరిత్రను అందజేసి, సద్గురు నామ ఘోషలు చేయించినాడు.

**శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహరాజ్ కీ జై........**

సద్గురు నామధ్వని చెవినబడగానే వెంటనే రుక్మిణికి దేహ సుద్ధి కలిగింది. అప్పుడు రుక్మిణి తండ్రితో ఇలా అంటుంది. నాన్నా! నాకు సద్గురు సిద్ధరూఢస్వామియొక్క భజన చాలా నచ్చింది. ఎల్లప్పుడూ సద్గురునామస్మరణ చేయాలనిపిస్తుంది. సద్గురుదేవుని గుణగానము చేయాలనిపిస్తుంది.

శరణప్ప కూడా చెప్పాడు.అమ్మా! ఇదే ప్రకారముగా ప్రతిదినము సద్గురుభజన, నామస్మరణ చేస్తూ ఉండుము. తద్వారా భూతబాధ సమూలముగా నివర్తించును. మళ్లీ ఎన్నడుకూడా నిన్ను ఆవరించదు–అని చెబుతూ, ఆ అమ్మాయి చెవిలో నామోపదేశముచేసి, సద్గురుచరిత్ర పారాయణ క్రమమును బోధించి వెళ్లిపోయినాడు. ఆమె అదే ప్రకారముగా ఆచరించుటచేత కాలాంతరములో ప్రశాంతతను పొందింది. అప్పుడు శ్రీమంతుడు సద్గురు పాదతీర్థము కోసము తన సేవకుని హుబ్లీకి పంపించినాడు. ఆ సేవకుడు హుబ్లీకి వెళ్లి సద్గురు సిద్ధనాథుని పాదతీర్థమును తీసుకొని వచ్చినాడు. స్వామియొక్క చరణతీర్థమును కొంచెము స్వీకరించి,మరికొంత రుక్మిణిపైప్రోక్షించగా,ఆమె పూర్తిగా స్వస్థతను పొందినది. ఆమె ప్రతిరోజు అత్యంత ప్రేమతో సద్గురుచరిత్ర పఠనము చేయుచుండెను. ఈ ప్రకారముగా ప్రతినిత్యము సద్గురునామస్మరణ, చరిత్రపఠనము చేయుచుండగా క్రమక్రమముగా రుక్మిణి పూర్ణస్వస్థతను పొందినది.భూతబాధ సమూలముగా నివృత్తమైనది.పూర్వము రుక్మిణి శరీ-రమును ఆవహించిన భూతము ఏడు రోజుల వరకుకూడా తిరిగి రాలేదు. శ్రీమంతుడు తన బిడ్డ యొక్క స్వస్థతను చూచి చాలా ఆనందించినాడు.భూతబాధ పలాయనమైనది. సద్గురుచరిత్ర పఠిం-చుటవలననే నా కుమార్తె ఆరోగ్యము కుదుటపడినది. శాస్త్రోక్తముగా ప్రతినిత్యము సద్గురుదేవుని

నామోచ్చారణ, పూజ, చరిత్ర పారాయణ చేయుట ద్వారానే భూతబాధ తొలగి మళ్లీ తిరిగి భూతము పట్టలేదు. శరణప్ప వచనములను విశ్వసించినందుకు ఫలము లభించింది. ఏ దేవునియందు కూడా శ్రద్ధ భక్తిలేని నాకు ఇప్పుడు సిద్ధసద్గురుదేవునిపై శ్రద్ధ ఉదయించింది. స్వామిని దర్శించాలని ఇచ్ఛ నిర్మాణమైనది. రుక్మిణితోసహా నేను సద్గురు సాన్నిధ్యమునకరిగి స్వామి పాదదర్శనము తీసుకోవాలి అని ఆ శ్రీమంతుడగు పాటిల్ నిశ్చయించుకున్నాడు.

ఈవిధముగా సద్గురుచరిత్ర పఠనము పూర్తి అయిన పిదప ఏమి జరిగిందంటే—ఒక రోజున మధ్యాహ్న కాలమున రుక్మిణి తమ ఇంటికి ఎదురుగా ఉన్నటువంటి రావి (అశ్వత్థ) వృక్షము క్రింద కూర్చుండెను.ఆ వృక్షము ఎత్తైనకట్ట(అరుగు)మీద ఉండడమువలన ఆ కట్టపైకూర్చున్న రుక్మిణి క్రిందికి దిగి ఇంటిలోకి పోవుటకు లేచినది. కట్టపైనుండి లేచి క్రిందకు దిగగానే, తల తిప్పినట్లయి కండ్లకు చీకట్లు క్రమ్మి స్పృహకోల్పోయి, మూర్ఛవచ్చి అకస్మాత్తుగా ఒక పెద్దబండరాయిపై చరుచుకు పడింది. రుక్మిణి రాతిపై పడుటతోడనే గొప్పగా గాయముతగిలి రక్తము ప్రవాహమువలె స్రవించుచుండెను. అది గమనించిన తండ్రి వెంటనే ఆమె కడకేగి చేయితో తట్టి చూసేసరికి రుక్మిణి లేదు. ఆమె శవమై పడిఉంది. అనగా మరణించినది. ఆ శ్రీమంతుడు తన కుమార్తె మరణమును గాంచి దుఃఖము పట్టలేక గుండెలు బాదుకుంటూ సద్గురుదేవుని ఇవ్విధముగ మొరపెట్టుకుంటాడు. హే సద్గురో! నిన్ను నమ్ముకున్నందుకు నా బిడ్డయొక్క భూతబాధ నీయొక్క కరుణాకటాక్షముద్వారా సమూలముగా నివృత్తమయింది. ఆ భూతబాధ నివృత్తి కాగానే, ఈమెకు ఈ గతి ప్రాప్తమైంది. ఏమిటి వైచిత్ర్యము. నీకు అపకీర్తి కలుగుతుంది సుమా! నీయందు నాకు విశ్వాసము లేకుండెను.శరణప్పయొక్క వచ-నానుసారముగా నీయందు విశ్వాసము, శ్రద్ధ ఉంచినందుకు భూతబాధ నివృత్తమైనది. నా కుమార్తె మరణముతో నిన్ను నమ్ముకున్న వారికి మరణము ప్రాప్తమగునను కళంకము అపకీర్తి, అపనింద నీకు వాటిల్లగలదు. నీయొక్క నామజపము చేయుటవలన, చరిత్రపారాయణ చేయుటవలన రుక్మిణి మరణించిందని అపకీర్తి వస్తుంది. ఈ సమయమున ఒకవేళ నీవు నా బిడ్డను బ్రతికించకున్నట్లయితే ప్రజలందరూ కూడా నీయొక్క భక్తిచేస్తే మరణిస్తారు–అని నిన్ను అపకీర్తి పాలు చేస్తారు. అందుకని ఓ సద్గురు సిద్ధనాథా! నీవు పరుగు పరుగున వచ్చి, ఈ దీనుని ఆర్తనాదమును విని, నా కుమార్తెను రక్షించి మమ్ములను ఈ ఘోరవిపత్తునుండి కాపాడుము. నిన్ను శరణుజొచ్చిన ఈ అమాయకురా-లిని యముని చేతికి అప్పగించకుము.

ఇట్లు,ఆ శ్రీమంతుడు గొంతెత్తి బిగ్గరగా అరుస్తూ, సద్గురుదేవుని వేడుకుంటుండగా,ఇంతలో అక్కడికి ఒక సాధుమహాత్ముడు వచ్చినాడు. శ్రీమంతుని ఎదుట నిలబడిన సాధువుయొక్క ముఖ వర్చస్సు ఎంతో ప్రసన్నముగా శాంతముగా ఉండెను. శిరస్సుపై ఎరుపు రంగుగల వస్త్రము చుట్టబడి, శరీరమున కేసరి(కాషాయ)రంగుగల వస్త్రము కప్పబడి, కంఠమున రుద్రాక్ష మాలలు ధరించబడి

ఉండగా, కుడిచేతిలో కమండలమును ధరించి ఉన్నాడు. ఇటువంటి దివ్యమైన సాధుమహాత్ముడు ప్రత్యక్షమై విలపిస్తున్న శ్రీమంతుని గాంచి ఇలా విచారిస్తాడు. ఏమయ్యా! ఎందుకు ఏడుస్తున్నావు? ఈ కన్యకు ఏమైంది?

అప్పుడు శ్రీమంతుడంటాడు–ఓ యతీశ్వరా! మాయొక్క దుఃఖమును ఏమని వివరించను. సిద్ధారూఢస్వామిని నమ్ముకుని ఆయనను భజించినందున, మేము ఘోరవిపత్తులో పడినాము. ఆయనను విశ్వసించి, ఆయన భక్తిచేసినందుకు ప్రతిఫలముగా మాకీ దుఃఖము ప్రాప్తమైనది. ఒకానొక శరణప్ప అను సాధువు మాటలు నమ్మి వారమురోజుల నుండి సిద్ధారూఢస్వామియొక్క చరిత్ర పారాయణ మొదలగునవి నిర్వహించినందుకు చిట్టచివరికి ఏ పాప పుణ్యము ఎరుగని నా కూతురు ప్రాణములను కోల్పోయినది.

ఇటువంటి కఠోరమైన వాక్కులను శ్రీమంతుని ద్వారా విన్న ఆ సాధువర్యుడు చెవులు మూసుకున్నాడు. సిద్ధారూఢస్వామికి ఎంతటి అపకీర్తి వచ్చెగదా! "శివశివ శివశివ శివశివ" అంటూ చెవులపై చేతులు వేసుకున్నాడు. కాలకర్మవశాత్ ఈమెకు మృత్యువు సంభవిస్తే, సద్గురుదేవునిపై ఈ నిందమోపి, సిద్ధసద్గురుదేవుని కీర్తికి కళంకము తెచ్చి పెడుతున్నారు. సిద్ధనాథుడు అజ్ఞానజీవులను తరింపజేయుటకు అవతరించినాడే కాని, ఇటువంటి అపనిందల పాలగుటకు కాదు.

ఆ సాధుమహాత్ముడు శ్రీమంతుని వద్దకు వచ్చి ఏమయ్యా! నీ బిడ్డ కాలధర్మమననుసరించి ఆయువుముగిసి మరణిస్తే, ఆ దోషమును సద్గురుదేవునికి అంటగడతావా? ఆర్తరక్షకుడు,దయాసాగరుడైన సిద్ధసద్గురుదేవుడు ఈ కళంకము రాబోతున్నదని మొదలే ఊహించి, ఆ కళంకమును రూపుమాపి రమ్మని నన్ను పంపించినాడు. దీనదయాళుడు, ఆర్తరక్షకుడైన సిద్ధారూఢస్వామిని కలుసుకొనుటకు నేను నిన్నటి రోజున వెళ్లి ఉంటిని. అప్పుడు స్వామి నాతో ఇలా చెప్పియున్నాడు. ఓ యతిరాయా! నీవు రేపు ఒక గ్రామానికి పోయేదవు. ఆ గ్రామములో ఒక శవమును చూడగలవు. ఆ శవముయొక్క నోటియందు ఈవిభూతిని ప్రసాదరూపముగా వేసినచో,ఆమె మళ్లీ సజీవము కాగలదు–అని నుడివినాడు. సిద్ధారూఢస్వామియొక్క వచనములు వినుటతోనే నేను విస్మయమొంది, శవము మరల సజీవమగుటయా! ఏమిటి ఆశ్చర్యము అనిపించింది. ఈ రోజు నేను ఇచ్చటికి రావడము, స్వామి నిన్న చెప్పినట్లుగానే నేనిచ్చట శవమును చూడడము-చాలా వింతగానున్నది. సద్గురుదేవుడు నిజముగా సర్వజ్ఞుడున్నాడు. ఆయనయొక్క కృపవలన మీయొక్క కూతురు తప్పకుండా బ్రతుకుతుంది. ఏమి ఫికరు చేయకండి.

ఈ ప్రకారముగా పలుకుతూ ఆ మహాయతీశ్వరుడు తన జోలెనుండి విభూతినితీసి కుడి చేతిలో కొంచెము ఉంచుకొని శవము సమీపమునకు పోయి, ఆ శవమును చూస్తూ ఇలా అంటున్నాడు. ఓ సిద్ధారూఢ సద్గురుదేవా! నీయొక్క ఆజ్ఞ ప్రకారము, నీవు ఇచ్చిన ప్రసాదరూప విభూతిని

ఈ శవము నోటిలో వేయుచున్నాను. నీయొక్క మాట నిలబెట్టుకొనుటకు, నీ కీర్తికి వాటిల్లిన కళంకమును నివృత్తి చేసుకొనుటకు తప్పకుండా ఈ ఆడపడుచును రక్షించి,సజీవముగా చేయుము- -అని సద్గురుదేవుని స్మరిస్తూ ఆ యతీశ్వరుడు రుక్మిణియొక్క శవము నోటిలో విభూతిని వేస్తూ—

**ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః**

అంటూ సద్గురు నామోచ్చారణ చేసినాడు. రుక్మిణి చనిపోయినదని తెలియగానే గ్రామము-లోని జనమంతా శవముచుట్టూ గుమిగూడినారు. ఆ యతీశ్వరుడు ఏమి చేస్తాడు? అని వింతగా చూస్తున్నారు. ఎప్పుడైతే సద్గురు నామగర్జన చేస్తూ ఆ సాధుపుంగవుడు శవము నోటిలో విభూతిని వేసినాడో, రుక్మిణి మెల్లగా నిద్రనుండి లేచినట్లుగా కళ్ళు తెరిచింది.అదిగాంచిన శ్రీమంతునికి ఆనం-దము పట్టలేక వెంటనే ఆ సంతుమహాత్మునియొక్క చరణకమలములపై బడినాడు. ప్రజలు దిగ్భ్రాంతి జెందినారు. రుక్మిణి లేచి కూర్చున్నది. ఈ అద్భుత కృత్యమును చూసిన ప్రజలు ఎంతో ఆనందించి-నారు.తక్షణమే ఆ సాధుమహాత్ముడు అక్కడికక్కడే అదృశ్యమైనాడు.ఈవింతను చూసిన శ్రీమంతుడు మరియు జనము మరింత ఆశ్చర్యమునొందినారు.ఈ సాధువు–సాధువు కాదు సాక్షాత్ సిద్ధసద్గురు దేవుడే అని నిశ్చయించుకొని సద్గురు దేవునికి జై జై కారాలు చేసినారు.

**శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి మహారాజ్ కీ జై.......**

ఆ సమయములో రుక్మిణియొక్క తల్లి ఇంటిలో లేకుండెను. జరిగిన వృత్తాంతము తెలియ-గానే వెంటనే పరిగెత్తుకుంటూ విచ్చేసినది. పుత్రికను గుండెకు హత్తుకుని ప్రేమ పొంగి పొరలు-చుండగా వెక్కివెక్కి ఏడ్చినది. సద్గురుదేవునిద్వారా రక్షింపబడినందుకు ఎంతో ఆనందముకూడా పొందినది. ఈప్రకారముగా రుక్మిణి తల్లిదండ్రులు రుక్మిణితోసహా, ఎవరి వలన రుక్మిణి రక్షింప-బడినదో, అటువంటి సిద్ధసద్గురునాథుని సాన్నిధ్యమునకు (హుబ్లీకి) వేంచేసినారు.

సిద్ధాశ్రమమునకువచ్చి సద్గురుదేవునికి సాష్టాంగ వందనమాచరించిన పిమ్మట, స్వామి వారినిగూర్చి విచారించి, ఏమయ్యా! రుక్మిణి ఆరోగ్యము బాగుందా? అని అడిగినాడు. సిద్ధనాథుని యొక్క ఈ వచనములను విన్న శ్రీమంతుడు విస్మయమొందినాడు. ఏమిటి? నేను వర్తమానము తెలుపకమునుపే సద్గురుదేవుడు ఎలా తెలుసుకున్నాడు–అని శ్రీమంతుడు చింతలో పడ్డాడు.తదనం-తరము వారు తెచ్చిన కానుకలు సద్గురుదేవునికి అర్పించుకున్నారు.రుక్మిణి సద్గురుపాదపద్మములకు నమస్కరించినది. అప్పుడు శ్రీమంతుడు జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగా సద్గురుదేవునికి విన్నవించుకున్నాడు. మరియు ఇలా అంటున్నాడు.ఓ కృపాసాగరుడవైన సద్గురుదేవా నీయొక్క కృప వలననే మా కూతురు రక్షింపబడినది. నిన్ను ఆశ్రయించినందువల్లనే నీయందు మాకు భక్తి దృఢమై ధన్యులమైనాము. ఈ విధముగా భక్తులందరూ కలసి సద్గురు దివ్యనామాన్ని కీర్తించినారు. స్వామి

యొక్క నామగర్జన చేసినారు. సద్గురుదేవుని ఆజ్ఞతీసుకొని అందరూ తమతమ నెలవులకు (ఇండ్ల-ల్లోకి)వెళ్ళిపోయినారు.

ఓ శ్రోతలారా! ఇప్పుడు ఈ కథయొక్క అద్భుతమైన వేదాంతరూప లక్ష్యార్థమును వినండి. ముముక్షు జీవుడనే శ్రీమంతునికి సద్భక్తి అనే పుత్రిక (రుక్మిణి) జన్మించినది. ఆ సద్భక్తి దృఢము కాకుండా సాంసారిక వ్యవహారరూప భూతము సంబంధమైనది. వైరాగ్యమనే వరునితో వివాహము చేయనిదే సంసారాసక్తిరూప భూతబాధ నివృత్తి కాదు. కాబట్టి, సద్భక్తి, నాకు వివాహము చేయండి అని అన్నది. సద్గురుదేవుని కృపకుపాత్రులైన సద్భక్తులు కలిసినప్పుడు, వారి సంబంధమువలన నామ స్మరణ, మహాత్ములచరిత్ర పారాయణ సంభవిస్తాయి. తద్వారా సంసారాసక్తిరూప భూతబాధ నివృత్త మగును. ఈ విధముగా సశక్తయయిన భక్తిని ప్రారబ్ధభోగము విఘ్నము కలిగించి, సమూలముగా నష్టముచేసింది. ప్రారబ్ధకర్మ భక్తిని నష్టపరుస్తుంటే అప్పుడు సద్గురుదేవుని కోసము మొరబెట్టుకొన-గా ఆ సద్గురుదేవుడు ప్రాప్తమై నశించిన భక్తిని ప్రోత్సాహమిచ్చి దృఢము చేస్తాడు. నిర్మలమైన వ్యాపక పరబ్రహ్మస్వరూపుడైన సద్గురు సిద్ధనాథుడు భక్తులు తనను తొందరగా పొందుటకోసము అనేక సంకల్పరూప లీలలు గావిస్తుంటాడు. సద్గురుదేవుడు సాక్షాత్ సర్వేశ్వరుడున్నాడు. అటువంటి సద్గురుదేవుని ప్రతినిత్యము నిర్మలహృదయముతో భక్తిపూర్వకముగా ధ్యానించి హృదయ స్థానమున స్థాపించుకున్న వారికి సద్గురుదేవుడు సర్వత్ర లోన, బయట–అంతటా ఆయనయొక్క దివ్యస్వరూపమే దర్శనము కాగలదు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచే సకలపాపములు భస్మము కాగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుపది ఎనిమిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# నలుబది తొమ్మిదవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సిద్ధారూఢ సద్గురుదేవా! భక్త పరిపాలకా! నిన్ను అనన్యభావముచే భజించే భక్తులకు అభయమిచ్చి రక్షింపుము.వారియొక్క చిత్తమునందు విషయవాసనలు తొలగించి యథార్థమైన వివేకయుక్తమైన సద్బుద్ధిని ప్రసాదించుము.కామక్రోధాది అరిషడ్వర్గములయొక్క భ-యమును నివృత్తిచేసి స్వస్వరూపాన్ని ప్రసాదించుము. ఎవరి సంబంధమువలన "తత్వమసి"ఇత్యాది మహావాక్యములకు లక్ష్యస్వరూప అభేదస్థితిని పొందగలనో,అటువంటి సద్గురుదేవుడవైన నీ దివ్య-పాదపద్మములయొక్క ప్రాప్తిని కలుగజేయుము.

మావూలీ(తల్లి)స్వరూపుడవైన ఓ సద్గురుదేవా! భక్తులను ఉద్ధరించే నిమిత్తము హుబ్లీ పట్ట-ణమునందు వసించి అనేకమైన అద్భుతలీలలను ప్రదర్శించి, దయచేత భక్తులను కాపాడి నీ కీర్తిని నిలుపుకున్నావు. నీయొక్క పుణ్యకీర్తిని స్మరించి, నీ నామగానము చేసినచో మనసు ఉపశమించి చిత్తము నిర్మలమై హృదయములో ప్రశాంతత నెలకొనగలదు. నీయొక్క పవిత్రమైన కథామృతము గానముచేసినచో అనేకజన్మల సంచితకర్మలచేత మలినమైనచిత్తము ఒక్కక్షణములో కడిగివేయబడి పరిశుద్ధమగును. పరమపావనమైన నీయొక్క చరిత్ర శ్రవణముద్వారా భక్తులహృదయము పరమా-నందముతో నిండిపోయి, ఉన్మనీ(నిర్వికల్ప)స్థితిని పొందగలరు. ఉన్మనీ అవస్థను పొందిన హృదయ మందు సద్గురుదేవుడు (పరమాత్మ)ప్రకటమై బ్రహ్మజ్ఞానమును కలుగజేస్తాడు. ఇటువంటి అవస్థను పొందిన పిదప అన్యసాధనలయొక్క ఆవశ్యకత ఉండదు.పసిపిల్లవానియొక్క తృప్తికోసము కృపా-ళువైన తల్లి అన్ని విధముల సహకరించి ప్రేమతో, ఆప్యాయతతో బుజ్జగించి అన్నమును తినిపిస్తుంది. మంచి చెడ్డలు తెలిసిన వానిగూర్చి తల్లికి ఎక్కువగా బెంగ ఉండదు. అదేవిధముగా కల్మషములేని బోలాభక్తులు నీ పాదాల నాశ్రయించినంత మాత్రమున వారికి బ్రహ్మానుభూతిని ప్రసాదిస్తావు. ఎవరైతే నేను జ్ఞానిని అని అభిమానించి నీయొక్క చరిత్ర శ్రవణమును ఉపేక్షిస్తారో, వారియొక్క పతనము నిశ్చయము. చాలామంది మేము జ్ఞానులమని అభిమానముతో గ్రసింపబడుచున్నారు. వారు నిశ్చయముగా అజ్ఞానులేయని సద్గురుదేవుడంటున్నాడు.అటువంటివారు సద్గురుదేవుని, పెద్ద-లను గౌరవించరు.ఇతరులు సద్గురుదేవుని గౌరవించినచో వారిని సహించరు.ఇటువంటి వారి-కంటే మూర్ఖులు వేరే లేరు. వీరలు తప్పకుండా రౌరవాది నరకమును అనుభవిస్తారు. ఇలాంటి

దుష్టులయొక్క గుణములను వల్లించడమువలన మనకు దారుణమైన పాపము సంక్రమించగలదు. కావున, వారి గురించి సంభాషణమును మాని, సద్గురు నామోచ్చారణ చేయుచు తరించెదము.

**ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢాయ నమః**

ఒకానొకప్పుడు సిద్ధాశ్రమమునందు సద్గురుదేవుడు విరాజమానమై ఉన్నప్పుడు భక్తులందరూ కలిసి సద్గురుదేవుని అలంకరింపబడినట్టి పల్లకియందు కూర్చుండబెట్టి ఊరేగింపు చేశారు. అది చూసిన దుష్టులకు ఈర్ష్యకలిగింది."బసప్ప ఉప్పిని"అను పేరుగల ఒక లింగాయతు సద్భక్తుడు హుబ్లీ పట్టణములో నివసించేవాడు.ఆయనకు సద్గురుసిద్ధారూఢస్వామిపట్ల అత్యంతభక్తి యుండెను.ఆయన ప్రతినిత్యము సద్గురుదర్శనమునకు నియమము తప్పకుండా వచ్చేవాడు.బసప్ప గృహమునకు సమీపమున "రుద్రాక్షమఠము" ఒకటి ఉండెను. ఆ మఠములోనికి సద్గురునాథుని ఒకసారి తీసుకొచ్చి పాదపూజ చేయాలని బసప్ప ఎన్నో రోజులనుండి ఇష్టపడి సమయముకొఱకు ఎదురుచూస్తున్నాడు. ఎంతో కాలమునుండి ఎదురుచూస్తున్న బసప్పకు మంచి అవకాశము దొరికింది. శివరాత్రిఉత్సవ సందర్భముగా స్వామిని పల్లకిలో కూర్చుండబెట్టి ఊరేగించే ఏర్పాట్లు జరుగుచున్నవి. అయితే పల్లకి రుద్రాక్షమఠము ముందునుండే పోవును. కావున,అక్కడికి పల్లకి రాగానే స్వామిని కొంత సమయమువరకు ఆ మఠములోనికి తీసుకెళ్లి పాదపూజచేయాలని బసప్ప అభిప్రాయపడి, సద్గురుదేవుని కడకువెళ్లి తన సంకల్పమును విన్నవించుకున్నాడు.అందుకు స్వామి అంగీకరించినాడు.కాని, బసప్ప నిర్ణయమును ఇతర లింగాయతులు ఒప్పుకొనలేదు.ఎందుకంటే,సిద్ధనాథుని మెడలో లింగములేదు. కావున, ఆయన శూద్రునితో సమానము. ఆ శూద్రుని మఠములోకి తీసుకొస్తే మన సంప్రదాయమునకే కళంకము వస్తుంది. అందరు లింగాయతులు ఏకమైనారు. ఒకవేళ సిద్ధారూఢస్వామిని మఠమునకు తీసుకొస్తే మన సంప్రదాయము కల్మషమై పోవును. కావున, ఈ కార్యమునకు ప్రతిబంధమును కలిగించి నిరోధించాలి అని అనుకున్నారు.

ఒకవేళ ఆ కులభ్రష్టుడిని మఠములోకి తీసుకొచ్చినట్లయితే మళ్లీ అతనిని ప్రాణాలతో బయటకు పోనీయగూడదని కంకణము కట్టుకున్నారు. ఈ సంగతి విన్న 'బసప్ప' చాలా దుఃఖపడినాడు. వెంటనే బసప్ప వచ్చి సద్గురుదేవునికి ఆ దుష్టులయొక్క అభిప్రాయమును తెలిపినాడు. అప్పుడు స్వామి అంటాడు.జనులకు దుఃఖము కలిగించే కార్యము చేయకూడదు.నీవు సంకల్పించిన కార్యము వారికి బాధను కలిగిస్తుంది. కావున, మనమే ఆ కార్యమును విరమించుకుందాము–అని బసప్పకు సమాధానపరిచినాడు. ఇంతలో ఒక సర్కారు అధికారి వచ్చి సద్గురు సిద్ధారూఢస్వామికి రుద్రాక్ష మఠప్రాంగణములో పాదపూజ జరిగే తీరాలి. దానికి ఎవరు అడ్డు వచ్చినా నేను ఎదుర్కొని వారిని నివారించగలను. తప్పకుండా కార్యము జరిపించండి అని ఆ అధికారి హామీ ఇచ్చినాడు. అతని వచనములను విన్న బసప్పకు ఎంతో ఆనందము కలిగింది. సర్కారు అధికారి వెళ్లి మిలిటరీ

పోలీ- సులను తీసుకొచ్చి మఠముచుట్టు ప్రహరా పెట్టినాడు. నిర్ణయించుకున్న విధముగా రుద్రాక్ష మఠములో కార్యక్రమము నిర్విఘ్నముగా జరిగింది.బందూకులతో సశస్త్రధారులైన పోలీసు బంధో- బస్తును గాంచి దుర్జనులైన లింగాయతులు ఎక్కడివారక్కడే దాగి రహస్యముగా ఉండిపోయినారు. స్వామి యొక్క పూజ వైభవముగా జరిగిన పిమ్మట మళ్లీ సిద్ధాశ్రమమునకు సద్గురుదేవుడు, భక్తులు అందరూ తిరిగి వచ్చినారు. తదనంతరము ఆ దుర్జన లింగాయతులు అందరూ పన్నిన ప్రయత్నము విఫలమైనందుకు వేరు ఉపాయముచేత సిద్ధనాథుని హింసించాలని సంకల్పించుకొని"కవడీమఠ- ము"లో సమావేశమైనారు. పన్నాగమును ఎలా వేయాలని, వారు ఒక్కొక్కరు తమతమ అభిప్రా- యమును ఇలా చెప్పుచున్నారు. వారి విచారము ఇలా జరుగుచున్నది.

ఒకడు ఈవిధంగా అంటాడు. ఆ కులహీనుని ప్రాణాలతో విడువకూడదు. సజీవునిగా విడిచినట్లయితే మన ధర్మము సమూలముగా నాశనము కాగలదు.

రెండో వాడంటాడు. ఆ మహారాజును చంపుటకు ఎంతో సమయము పట్టదు. ఎందుకంటే ఆయన భక్తప్రియుడు ఏ భక్తుడు భోజనమునకు పిలిచిన వారింటికి వచ్చి భుజిస్తాడు. అందులో మనమేదైనా కుట్రపన్ని కొంచెము విషము కలిపితే చాలు–మరణిస్తాడు.

మూడవ వాడంటాడు–ఆయనను వేరే భక్తులెందుకు తీసుకురావాలి? నేనే ఆయనకు భక్తు- డనౌతాను. ఆయనను ఒక రోజున భోజనమునకు ఆహ్వానిస్తాను. అప్పుడు ఆయన తప్పకుండా వస్తాడు. ఆయనను మెల్లగా ఈ కవడీమఠములోకి తీసుకొచ్చి మన మనోవాంఛను పూర్తిచేసుకో- వచ్చును. వానియొక్క సంభాషణమును విని ఇతర దుష్ట లింగాయతులందరూ ఆనందించినారు. ఆయనను చంపిన పిమ్మట ఆరూఢస్వామి అను పేరు లేకుండా మాసిపోవును.

ఒకనాటి సాయంకాలమున ఒక లింగాయతుడు సద్గురు సిద్ధనాథుని సాన్నిధ్యమునకేతెంచి స్వామికి వినయముగా సద్భావముతో సాష్టాంగ నమస్కారములు చేసి, మధురమైన వచనములతో ఇలా అంటాడు. హే మహాప్రభో! ఈ దీనుని ప్రార్థననాలకించి ఈ రోజు మా ఇంటికి వచ్చి మేము ఇచ్చు ఆతిథ్యమును స్వీకరించి మహాప్రసాదమును గైకొని రావలసింది. ఈ దీనుని కరుణించి తప్పకుండా వేంచేయండి స్వామీ!

అప్పుడు సిద్ధసద్గురుదేవుడంటాడు. నాయనా! నేను సాయంత్రము పూట భోజనము చేయను. రేపు మధ్యాహ్నము తప్పకుండా వస్తాను. నీవు కూడా ఇక్కడికి రమ్ము. ఇద్దరము కలిసి పోయెదము.

అప్పుడు ఆ భక్తుడు గద్గదకంఠముతో ఏడుస్తూ, ఓ సద్గురుదేవా! మా వారందరూ నిన్ను ఇప్పుడే సత్కరించి పూజించాలి అనుకున్నారు. ఆలస్యము ఏమీ లేదు. అన్ని సిద్ధపరచుకున్నాము దయచేయండి స్వామీ! కొంచెము అల్పప్రసాదమును తీసుకొని తిరిగి మఠమునకు రావచ్చును. ఒక

వేళ మీరు మా ఇంటికి రాకున్నట్లయితే మా ఇంట్లో ఎవరునూ భోజనము చేయమని నియమము పెట్టుకున్నారు. ఓ దీననాథా!ఈ దీనుని కరుణించి మా ఇంటికి వచ్చి మమ్ములను, మా గృహమును పావనముచేసి మహాప్రసాదమును తీసుకోండి స్వామీ! అని దీనముగా ప్రార్థించగా, దయాసాగరు-డైన సద్గురుదేవుడు వాని కపటమును తెలుసుకోలేక వాని ఇంటికి పోవుటకు అంగీకరించినాడు. మఠములో ఉన్న ఇతరశిష్యులనెవరినిగూడ పిలువకుండా స్వామిని ఒక్కడిని మాత్రమే తీసుకొని ఆ లింగాయతుడు వెళ్లిపోయినాడు.

ఆ కపట లింగాయతుడు స్వామిని నేరుగా కవదీమఠమునకు తీసుకెళ్లి, ఒక గదిలో కూర్చుండబెట్టి, మళ్లీ వస్తాను–అంటూ బయటకువచ్చి తలుపులుమూసి తాళమువేసినాడు.ఆ దుర్జను లందరూ మహారాజు మన చేతిలో చిక్కినాడు. తప్పకుండా ఈరోజున యమపురికి పంపెదము–అని ఆనందిస్తూ, అర్ధరాత్రి సమయముకోసము ఎదురు చూస్తున్నారు.

ఈ ప్రకారముగా స్వామిని బంధించి బయటకు వెళ్ళగానే స్వామికి కొంచెము అనుమానము వచ్చి, ఏమిటి? ఈ లింగాయతుడు నన్ను సత్కరిస్తానని, పైగా మహాప్రసాదము ఏర్పాటు చేస్తానని తీరా తీసుకొచ్చి ఈ గదిలో కూర్చుండబెట్టి తాళమువేసి బయట పడినాడే? ఏమిటి వీని అభిప్రా-యము? అని స్వామి తన జ్ఞానదృష్టితో చూసి వారి నాటకమంతా తెలుసుకున్నాడు.

అప్పుడు సద్గురుదేవుడు తనలో ఇలా విచారిస్తున్నాడు ఈ దుష్ట బుద్ధిగల మూర్ఖులు వాస్త-వాన్ని తెలుసుకోలేక అజ్ఞానముచేత వారి జీవితాలనే నాశనము చేసుకుంటున్నారే–అని వారి గురించి చింతిస్తున్నాడు. వీరికి నాయొక్క మహిమను చూపించి, వీరిలో భక్తిబీజమును అంకురింప జేసి, భక్తి మార్గములో ప్రవేశపెట్టడమే నా లక్ష్యము. అప్పుడే నా అవతారము సఫలము కాగలదని సద్గురుదేవుడు సంకల్పించుకున్నాడు.తర్వాత సిద్ధనాథుడు వృత్తిని అంతర్ముఖముచేసి ఆత్మధ్యాన-ములో ప్రశాంతముగా కూర్చున్నాడు.

ఇక్కడ సిద్ధాశ్రమములో శిష్యులయొక్క చిత్తములో కలత చెలరేగింది. ఎందుకంటే, భోజన-మునకు వెళ్లి స్వామి ఇంకా రాలేదే? చాలా సమయమైనది. పైగా ఒంటరిగా వెళ్ళినాడు. ఎవరిని వెంట తీసుకెళ్లలేదు-అని కలవరపడుతున్నారు.చాలా సమయమువరకు సద్గురుదేవుని రాకకోసము ఎదురుచూస్తూ ఉన్నారు. ఇంకా స్వామి రాలేదు. ఇక శిష్యులు ఉండబట్టలేక స్వామికి ఏమైందో అని భయమేసి ఒక్కొక్కరు ఒక్కొక్కవైపు గ్రామములో స్వామిని శోధిస్తూ వెళ్ళినారు. త్రోవలో కలసిన ప్రతివ్యక్తిని స్వామిగురించి ఆచూకీ అడిగినారు. కాని, ఎవరుకూడా స్వామిని గూర్చి ఏమి చెప్పడము లేదు. దుఃఖము ఆపుకోలేక విలపిస్తున్నారు. చాలా రాత్రి అయింది. శిష్యులలో భయాందోళన పెరి-గింది. అప్పుడు వారు సద్గురుదేవునిగూర్చి కేకలు వేస్తూ ఓ సద్గురుదేవా! నీ కోసము మేము ఎక్కడని వెతకాలి? వీధి వీధి,ఇల్లు ఇల్లు, వెదకి వెదకి వేసారి పోయినాము. నీవు ఎక్కడున్నా దయచేసి

తొందరగా వచ్చి మాకు దర్శనము ఇవ్వుము–అని మొరపెట్టుకున్నారు. అనేక చెరువులలో, వాగులు వంతలలో, చెట్లలో, గుట్టలలో, అడుగడుగునా నిన్ను వెతికినాము. కానీ నీ జాడ తెలియలేదు. దయచేసి దర్శనమివ్వండి. మేము తిరిగి తిరిగి చాలా అలసిపోయాము. నీవు ఎక్కడున్నావో, ఈ దీనులయొక్క ఆర్తనాదమును విని తొందరగా విచ్చేయండి స్వామీ! అని రోధిస్తూ వేడుకుంటారు. ఎవరి ఇంట్లో ఉన్నావో, మమ్ము కరుణించి, మా మొరవిని శ్రమించిన మమ్ము రక్షించి ఈ అనాథ-లను కాపాడుము–అని పదేపదే వేడుకుంటున్నారు. పట్టణమంతా వెదకి వెదకి, పరిసరాలలో వెదికి శిష్యులందరూ సద్గురుదేవుని జాడదెలియక ఒక బావిదగ్గర గుమిగూడి స్వామిగూర్చి విచారిస్తు-న్నారు. కంఠములు గద్గదితమై నేత్రములనుండి మేఘవర్షమువలె అశ్రుధారలు కారుచుండగా, సద్గురుదేవుని గుణగణములను కీర్తిస్తూ, వర్ణిస్తూ ఆ కారుచీకట్లలో శిష్యులందరూ కూర్చున్నారు.

ఇంతలో వారి ముందు ఒక దివ్యప్రకాశము కానొచ్చింది. ఆ ప్రకాశమధ్యమున సద్గురుదేవుని దర్శించినారు. వెంటనే శిష్యులందరూ లేచి దివ్యతేజస్సుతో విరాజిల్లుతున్న సద్గురుదేవుని చెంతకు వెళ్లి భావయుక్తముగా, ఎంతో కాలమునుండి దూరమైన ప్రాణమిత్రులు అకస్మాత్తుగా కలుసుకుంటే ఎంత ఆనందముతో వాటేసుకుంటారో, ఆ విధముగా శిష్యులు సద్గురుదేవుని కౌగిలించుకున్నారు. సిద్ధసద్గురుదేవుని చేతులు పట్టుకొని సిద్ధాశ్రమమునకు తీసుకొచ్చి, శిష్యులు ఇలా విచారిస్తారు. ఏమిటి స్వామీ? మమ్ములను పరీక్షింపగోరి ఈ విధమైన లీలను ప్రదర్శించావా? అని అడిగినారు.

అప్పుడు సద్గురు సిద్ధనాథుడంటాడు. నన్ను ఆ లింగాయతుడు తీసుకెళ్లి ఒక గదిలోవేసి తలుపులు మూసి తాళము వేసినాడు. ఇంతకన్నా ప్రశాంతస్థలము దొరకదని నేను స్వస్వరూపస్థితి-లోకి వెళ్లి ధ్యానస్థుడనయ్యాను. ఇంతలో మీయొక్క ఆర్తధ్వని నా చెవిలో పడింది. వెంటనే లేచి మీ వద్దకు వచ్చినాను. మీరు పిలవకుంటే స్వరూపానందమును అనుభవిస్తూ హాయిగా అక్కడే ఉండే వాడిని–అని స్వామి అన్నాడు.

శిష్యులంటున్నారు–మాయొక్క పెన్నిధివైన నిన్ను ఆ దుర్జనులు అపకారముచేయుటకు సిద్ధ-పడినారు. దైవబలముచేత ఆపదనుండి రక్షింపబడి మళ్లీ మాకు దక్కినావు.

ఇక్కడ కవటీమఠమువద్ద స్వామిని బంధించిన దుర్జనులు మధ్యరాత్రి సమయముకోసము ఎదురుచూస్తూ నిరంతరముగా సద్గురుదేవుని ద్వేషబుద్ధిచేత ధ్యానిస్తూ–ఇలా ఆలోచిస్తున్నారు. గ్రామస్థులందరూ వారి వారి వ్యవహారమునుండి విముఖులై, ఎక్కడివారక్కడ గాఢనిద్రలో ఉండగా మనము మెల్లగా గదిలోకి వెళ్లి సిద్ధనాథుని నోటిలో వస్త్రములు నొక్కి అరవకుండాచేసి, ఆయనను నానాచిత్రహింసలుపెట్టి చంపుదామని నిర్ణయించుకున్నారు.

ఇంతలో వారు అనుకున్నప్రకారము మధ్యరాత్రి సమయమైంది. గ్రామస్థులందరూ మెల్లమె-ల్లగా వ్యవహారములనుండి విముఖులై నిద్రిస్తున్నారు. అంతటా నిశ్శబ్దముగా ఉంది. అప్పుడు ఆ

దుర్జనులు మెల్లగా లేచినారు. గదియొక్క తాళము తీసి ద్వారము తెరిచి లోనికి వెళ్లి, దీపము వెలిగించి గదిలో నలుమూలల చూసినారు. కాని, సిద్ధనాథుడు కనిపించుటలేదు. ప్రతి ఒక్కరు చేతిలో కర్రను పట్టుకొని స్వామిని కొట్టుటకు వెతుకుచుండగా, గదిలో ఒక మూలకు స్వామి ఉన్నట్లుగా ప్రతీతి అయింది. వెంటనే ఆ దుర్మార్గులు పరుగెత్తుకుంటూ అక్కడికి వెళ్ళినారు. వారు సిద్ధనాథుని గూర్చి తీవ్రమైన చింతనచేస్తున్నారు. కావున, వారికి–వారిలో వారిని, ఎవరిని చూసినా సిద్ధనాథుడే ప్రతీతి అగుచుండెను. దేహస్మృతిని కోల్పోయినారు. నిరంతరతీవ్రధ్యానము, సిద్ధనాథుని చింతనము చేయుటవలన అంతా సిద్ధమయముగా కానొస్తుంది. వారిలో వారిని ఒకరినొకరు చూసి ఇలా అంటున్నారు. అదుగో సిద్ధనాథుడు పట్టండి, ఇదిగో సిద్ధనాథుడు కొట్టండి–అని అరచుచున్నారు. వారి చేతిలోని కర్రలతో భ్రాంతిచేత ఒకరినొకరు తీవ్రముగా కొట్టుకొనుచున్నారు. సిద్ధా! సిద్ధా! అంటూ బాగుగా ఒకరినొకరు కొట్టుకొనుచున్నారు. దెబ్బలు బాగుగా తగలడమువలన కేకలువేస్తున్నారు. కుయ్యో! మొర్రో! అబ్బో! అమ్మో! అంటూ కేకలు వేస్తున్నారు. వీరి ఘోరమైన అరుపులు విని ఇరుగుపొరుగు వారందరూ నిద్రనుండి మేల్కాంచి మఠములోనికి వచ్చి చూసేసరికి ఆరుగురు దుర్జనులు ఒకరినొకరు సిద్ధా! సిద్ధా! అంటూ పిచ్చెక్కిన వారిలాగా ఒకరినొకరు బాదుకుంటున్నారు. అప్పుడు ఆ జనులు, లోనికి ప్రవేశించి ఆరుగురిని పట్టుకొని బయటకు తీసుకొచ్చి, వారి పరిస్థితిని గాంచి నవ్వుతూ ఇలా అంటున్నారు.

ఏమయ్యా! మీకు పిచ్చిపట్టిందా? సిద్ధా! సిద్ధా! అంటూ మీకు మీరే కొట్టుకొనుచున్నారు. ఏ సిద్ధనాథుని మీరు స్మరిస్తూ కొట్టుకుంటున్నారో, ఆ సిద్ధనాథుడు ఈ సమయమున హాయిగా పడకలో నిద్రిస్తున్నాడు. సిద్ధాశ్రమమునుండి మేము ఇప్పుడే వచ్చినాము. కావాలంటే పదండి చూపిస్తాము. వారి మాటలు విన్న దుర్జనులకు వెంటనే దేహస్మృతి కలిగింది. కైపుదిగింది. వారి పరిస్థితిని గమనించుకొని వారికి వారే లజ్జాభరితులై తలలు వాల్చి, వెంటనే అక్కడినుండి పలాయనమైనారు. గ్రామస్తులు కూడా వారి వారి ఇండ్లకు వెళ్లి పోయినారు.

ఆ రోజునుండి వారి బుద్ధిని మార్చుకొని స్వామియొక్క మహిమను తెలుసుకొని సద్గురు దేవునికి సన్నిహిత భక్తులైనారు. గతంలో వారు చేసిన దుష్కర్మలను స్వామికి తెలిపి, వారు చేసిన అపరాధమును క్షమించమని వేడుకొని పశ్చాత్తాపపడినారు. స్వామి వారిని క్షమించాడు.

ఎవరైతే ఈ ఆరు మందిని ప్రేరేపించి సిద్ధసద్గురుదేవుని హత్య చేయమని పంపించినారో, వారు వారి ప్రయత్నము విఫలమైనందుకు మళ్లీ వేరే ఉపాయములచేత చంపడానికి నిశ్చయించుకొని, మళ్లీ ఒక కుతంత్రమును పన్నినారు. కటిక దరిద్రముచేత అలమటిస్తున్న ఒక నిరుపేద అభాగ్యురాలిని పిలిపించి కొంత ధనమును ఆమె చేతికిచ్చి, నీవు కొంత పక్వాన్నమును తయారుచేసుకొని, అందులో కాలకూటవిషమును కలిపి సిద్ధనాథునికిచ్చి ఆయనను చంపుము. ఇట్టి కార్యమును

నీవు సాధించినట్లైన నీకు ఇంకా రెట్టింపు ధనమును ఇవ్వగలము-అని ధనముయొక్క ఆశ చూపి సిద్ధనాథుని చంపుటకు ఆమెను ప్రేరేపించినారు. ఈ ప్రకారమైన మాటలు విన్న ఆ అభాగ్యురాలు ఈ పని చేసినట్లయితే భాగ్యవంతురాలనగుదుననే ధనాశ(పేరాశ)చేత, ఈ దుష్కార్యమును చేయుటకు ఆనందపడి లోభబుద్ధిచేత సిద్ధపడినది. అదే రోజునుండి ప్రతినిత్యము సద్గురుదేవుని వద్దకు వెళ్లి స్వామి దర్శనము తీసుకొని మంచి భక్తురాలిగా నటించింది. కొంతకాలమైన పిదప పక్వాన్నమును తయారుచేసి అందులో విషము కలుపుకొని దానిని తీసుకొని సిద్ధాశ్రమమునకువచ్చి సద్గురుదేవుని కలుసుకొని హృదయములో కుటిలత్వమును పూని, పైకి సాధువులాగా నటిస్తూ ఇలా మధురమైన మాటలతో స్వామితో అంటుంది.

ఓ సద్గురుదేవా! నేను ఎంతో శ్రమపడి నా స్వహస్తములతో ఈ రసయుక్తమైన పక్వాన్న-మును మీ కోసము వండుకొని తెచ్చాను. నామీద దయదలచి ఈ పేదరాలిని అనుగ్రహించి, ఈ పక్వాన్నప్రసాదమును స్వీకరించండి–అని అభినయించినది. ఇటువంటి ప్రేమపూరిత వచనములను విని సద్గురుదేవుడు ఆమెతో అంటాడు. అమ్మా! నేను ఇప్పుడే భోజనముచేసి బయటకి వచ్చి కూర్చున్నాను. నాకు ఆ ప్రసాదము ఇప్పుడు అక్కరలేదు.

స్వామియొక్క మాటలు విన్న ఆ స్త్రీ చాలా ఆగ్రహము చేసింది. అప్పుడు సద్గురుదేవుడు సరే! అంటూ ఒకే ఒక పిడికెడు అన్నమును తీసుకొని భుజించి, ఇది విషయుక్తమైన అన్నము అని గుర్తిం-చిన సద్గురుదేవుడు ఆ స్త్రీని ఇలా ఆజ్ఞాపిస్తాడు. ఇదిగో ఈ మిగిలిన అన్నమును తీసుకెళ్లి ఇంటికి వెళ్లకుండా, ఏ ఇతర ప్రాణులకు ఇవ్వకుండా, దీనిని భూమిలో పాతిపెట్టుము–అని హెచ్చరించాడు.

స్వామియొక్క వచనములను విన్న ఆ స్త్రీ సద్గురుదేవుడు ఈ అన్నము విషయుక్తమైనదని గుర్తించి యున్నాడని  భయపడి నిస్తేజమైన వదనముతో అక్కడినుండి పలాయనమైనది. ఇక మళ్ళీ సిద్ధాశ్రమమునకు రాలేదు. ఆమె ఎంతో భయాందోళనకు గురియై రాత్రింబవళ్లు సిద్ధనాథుని స్మరిస్తూ దిగులుగా ఉండింది. భయముచేత ఎల్లప్పుడూ సద్గురుచింతన, ధ్యానము చేయుటవలన ఆమెకు ఎటు చూసినా అంతా సిద్ధమయమయింది. కళ్ళు మూసినా, తెరిచినా సద్గురుదేవుడే కానొస్తున్నాడు.  ఆ దౌర్భాగ్య స్త్రీకి ఎక్కడ వెళ్లి చూసినా,ఎవరిని చూసినా, చంద్ర నక్షత్రాదులను చూసినా, ఆమెకు ఆమె ఎదురుగానే సద్గురుదేవుడు భయంకర రూపము ధరించి కానొస్తున్నాడు.

ఈ ప్రకారముగా పదునైదు దినములు భయదుఃఖములకు గురియై, దారుణమైన నరక బాధను అనుభవిస్తూ క్షణక్షణము ఏడతెగకుండా సద్గురుదేవుని స్మరిస్తూ ప్రాణములను కోల్పో-యింది. భయ వృత్తి చేతనైనా ఎందుకుగాదు, ఆమె నిరంతరము సిద్ధా! సిద్ధా! అంటూ సద్గురుదేవుని స్మరిస్తూ చనిపోయింది. కావున, ఆమె సద్గురుదేవునిలో ఐక్యమై ధన్యురాలైనది. కాని, చేసిన పాపమునకు ఫలితముగా నరకమును అనుభవించవలసి వచ్చింది. సర్వజ్ఞుడైన సద్గురు సిద్ధనాథుడు

ఆమె మరణమును తెలుసుకొని సంతోషించినాడు. చేసిన నేరమునకు పశ్చాత్తాపపడుతూ అంత్య సమయములో నన్నే స్మరిస్తూ దేహత్యాగము చేసింది. కనుక, ఆమె జన్మ ధన్యము–అని సద్గురు దేవుడనుకుంటాడు.

**శ్లో ॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేవరమ్ ।**

**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥** (గీత 8-5 )

శరీరమునకు విషప్రయోగము జరిగిన అనుభవాన్ని యథార్థముగా తెలుసుకుని, దానికి సంబంధించిన దుఃఖమును అవశ్యముగా అనుభవిస్తూ, లోకహితార్థము సావధానముగా నటించాలి అని సద్గురుదేవుడు తనలో నిశ్చయించుకున్నాడు. విషయసుఖములను ఏ తామసజీవులు ప్రీతికరముగా అనుభవిస్తారో, వారు అవసాన దశయందు దుఃఖమును అనుభవిస్తారు.

**శ్లో ॥ విషయేన్ద్రియ సంయోగాద్యత్తదగ్రే ఽమృతోపమమ్ ।**

**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥** (గీత. 18-38)

అజ్ఞాని తామసజీవులు అనాత్మ పదార్థములైన విషయములద్వారా క్షణిక సుఖమును అనుభవించి పరిణామములో దుఃఖమును పొందుతారు. రాజస జీవులు (విషయాపురుషులు)ఐహిక పారలౌకిక సుఖములను కోరి వేదవిహిత యజ్ఞయాగాది కర్మలు చేస్తారు.

సద్గురుదేవుడు, వారి దుఃఖమును నేను సహించి అయినా సరే, సుఖమును చేకూర్చాలి అనుకున్నాడు. ఎందుకంటే, సద్గురుదేవుడే సర్వస్వమని నమ్ముకున్న భక్తులకు నాకు విషప్రయోగము జరిగిందని చెప్పినచో, వారికి ఎనలేని దుఃఖము కలుగుతుంది. కావున, వారికి దుఃఖము కలిగించ కుండా ఆ దుఃఖమును స్వయముగా అనుభవిస్తూ, వారికి సుఖమును పంచి ఇవ్వాలని నిశ్చయించు కున్నాడు. ఏ విధముగా మురికి నీటిలో చిల్లగింజల పొడిని వేసినచో, అది నీటిలోని మురికి నంతయు తీసికొని అడుగంటి, నీటిని శుభ్రముగా చేయునో, అదే విధముగా సద్గురుదేవుడు తనకు జరిగిన విషప్రయోగబాధను తాను స్వయముగా అనుభవిస్తూ, ఇతరుల దుఃఖమునుకూడా తానే సహజముగా అనుభవిస్తూ వారికి సుఖమును పంచుతాడు.సద్గురుదేవులు, ముముక్షుజనులయొక్క తాపత్రయరూప దుఃఖములను పోగొట్టి, దయచేత ఆత్మసాక్షాత్కారమును ప్రసాదించి సుఖమును పంచుతాడు. అందువల్ల ముముక్షుజనులయొక్క హితమునుగూర్చి తాను అనేక దుఃఖములను అనాయాసముగా అనుభవిస్తూ పారమార్థిక సుఖమును కృపచేత ప్రాప్తము చేసేవాడు.

ఈ విధముగా సద్గురుదేవుడు విషయుక్త ఆహారమును భుజించిన నాటి రాత్రి తనలోతాను విచారము చేస్తూ నిద్రించినాడు. మరునాటి ఉదయమున లేచి చూసేసరికి శరీరమంతటా (కాలిన బొబ్బలవలె) వికారయుక్తమైన బొబ్బలు లేచినవి. కాలిన బొబ్బలలోనుండి ద్రవము స్రవించినట్లుగా, ఆ బొబ్బల నుండి ద్రవము స్రవించి కాయము తడిసిపోయింది. ఎంతో దుఃఖము కలిగింది. నోటిలో

నాలుక ఉబ్బి(వాచి)ఆహారమును కొంచెముకూడా కంఠముద్వారా మ్రింగుటకు అశక్యమైనది. కనులవెంట రక్తము కారుచుండెను. దేహము భయంకరముగా కన్పట్టుచుండెను. వికారయుక్తమైన, భయంకరమైన సద్గురుదేవుని దేహమును చూసి భక్తజనులు భయకంపితులై వ్యాకులచిత్తులైనారు. కొందరు వైద్యుని తీసుకొచ్చి ఉపచారము చేయించారు.సద్గురుదేవునియొక్క విషమపరిస్థితిని గమనించి వైద్యుడు అంటాడు.ఈయన ఇక బ్రతుకడు.ఏ ఔషధములు కూడా పనిచేయవు.ఏ ప్రయత్నము చేసినా లాభము లేదు. ఆశ వదులుకోండి–అని అంటాడు. ఆ మాటలు విన్న భక్తులు హాహాకారాలు చేస్తూ విలపించసాగినారు. స్త్రీలు ఉచ్చస్వరముతో శోకిస్తున్నారు. అందరూ తీవ్రదుఃఖముతో ఏడుస్తూ ఏడుస్తూ దేహస్మృతిని కోల్పోయి మూర్ఛిల్లి భూమిపై పడిపోయినారు. మరికొందరు అంటారు. అయ్యో! మాకు ధైర్యమును ప్రాప్తముచేసి రక్షించే వారెవరు లేరే! ఏమిటి ఈ మా దుర్భరకర్మ. దయాసాగరుడైన సద్గురుదేవుడు అగాధమైన దుఃఖసాగరములో మమ్ములను పడవేసి వెళ్ళిపోతున్నాడే–అని తీవ్రతర వేదనతో కుమిలిపోతున్నారు. మరియు పరమాత్మను ఈవిధముగా వేడుకుంటున్నారు. ఓ పరమేశ్వరా! కరుణాకరా! మమ్ములను ఈ దుఃఖసాగరములో పడదోయకుము. మా సద్గురుదేవుని మాకు ప్రసాదింపుము. ఆయన ఆరోగ్యమును సరిచేయుము. ఒకవేళ మా సద్గురు దేవుడు దేహత్యాగము చేసినచో మాకు దిక్కెవరు? మాయొక్క ఆపదలను నివృత్తిచేసే వారెవరు? మమ్ములను రక్షించే వారెవరు కూడా లేరు. హే పరమేశ్వరా! నీవు తొందరగా వచ్చి మా తండ్రి, దాతయగు సద్గురుదేవుని రక్షింపుము. లేదా ఆయనతో పాటు మమ్ములను కూడా తీసుకెళ్ళు. ఆయన లేకుండా మేము బ్రతుకలేము. సద్గురుదేవుడే మా సర్వస్వము. ఆయనే మా ప్రాణము. ఆయనను విడిచి మేము ఘడియయైనా మనలేము. మమ్ములను విడిచి ఆయన ప్రాణత్యాగముచేసినచో మేము ప్రాణాలతో ఉండలేము. కావున,ఓ పరమాత్మ! మా సద్గురుదేవుని రక్షించుము. మా తండ్రిని మాకు ప్రసాదించుము. మా పెన్నిధిని మాకొసంగుము. మా దుఃఖమును దూరము చేయుము–అని గద్గద కంఠముతో చేతులుపైకెత్తి వేడుకుంటారు.అప్పుడు భక్తులయొక్క ఆర్తనాదమును విని సద్గురుదేవుడు తన అమృతహస్తముచేత మీరు ఏమి భయపడకుడు–అన్నట్లుగా సైగ చేసినాడు. అప్పుడు అందరికీ ధైర్యము చేకూరింది. మనసు ప్రశాంతతను పొందింది. వారు ఇలా అనుకుంటున్నారు. సద్గురు దేవుడు అభయమిచ్చాడు. మన తండ్రి మనకు దక్కినాడు. మనయొక్క ప్రార్థనను ఆ పరమేశ్వరుడు ఆలకించినాడు. మన దుఃఖమును దూరము చేసినాడు. ఈ ప్రకారముగా పదునైదు రోజులు స్వామి సేవ చేసుకుంటూ రాత్రిపగలు జాగరణతో, ఎవరుకూడా వారి ఇండ్లకు వెళ్లకుండా అక్కడనే స్వామి చెంతనే సేవచేస్తూ ఉన్నారు.

అంతటి బాధతో దుఃఖముతో ఉన్నప్పటికీ, నోటితో నీరు మ్రింగుటకుకూడా వీలులేని పరిస్థితుల్లో సద్గురుదేవుని ముఖకమలము ప్రసన్నముగా శాంతముగా ఉండెను. మాట్లాడుటకు వీలు

లేకపోయినా తాను ఏమాత్రము దుఃఖపడక ప్రసన్నతతో అందరికీ స్వస్థతను చేకూర్చినాడు. ఇటువంటి సంకటములోనైనా సద్గురుమూర్తి ప్రశాంతముగా మూర్తిలాగా ప్రసన్నవదనముతో స్వరూప స్థితియందున్నాడు. సద్గురుదేవుని చూసినంత మాత్రముననే ఆనందాశ్రువులు రాలుచుండెను. పదునైదు రోజులు గడచిన పిమ్మట స్వామి స్వస్థతను పొందినాడు. శరీరముపైగల బొబ్బలు, వాపులు పూర్తిగా తగ్గినవి. నాలుక యథాస్థితిని పొందింది. కండ్లు నిర్మలముగా అయినవి. సద్గురుదేవుని యొక్క ఆరోగ్యము స్వస్థతను పొందినదిగాంచి భక్తులహృదయము ఆనందముతోనుప్పొంగి సద్గురు దేవులకు జయజయకారములు చేసి మంగళధ్వనులు చేస్తూ హారతులిచ్చారు.

ఈ ప్రకారముగా దుష్టబుద్ధిచేత మూర్ఖులు సద్గురుదేవులకు అపాయమును కలిగించినాగాని దయాసాగరుడైన సద్గురుదేవుడు వారిపైనకూడా దయచూపి వారిని తరింపజేయుటకే ఉత్తమ ఉపాయములను చేసినాడు. కావున,

ఓ శ్రోతలారా!ఇప్పుడు ఈకథయొక్క గుహ్యమైన లక్షార్థమును సావధానచిత్తులై వినగలరు. కామాది ఆరు దుర్గుణములే ఆ ఆరుగురు దుర్జనులు. ఆత్మయే సద్గురుదేవుడు. ఆత్మసాక్షాత్కారమే ఉత్సవము. దైవీసంపత్తి సద్గుణములే భక్తులు. ఆత్మసాక్షాత్కారము చేసుకొనుటకు ప్రయత్నిస్తుంటే కామాది దుర్వృత్తులు ఆత్మఘాతకము చేయుటకు పూనుకొని ఆత్మసాక్షాత్కారమునకు అడ్డునిలుస్తాయి. సద్గుణములు ఆత్మను పొందడానికి ప్రయత్నిస్తుంటే వికారయుక్తమైన దుర్గుణములు దైవీసంపత్తిని నాశనముచేసి ఆత్మఘాతకమునకు పూనుకుంటాయి.ఆత్మసాక్షాత్కారము కలుగకుండా దుర్గుణములు విఘ్నము కలిగించడమే ఆత్మను సంహరింప చేసినట్లు (ఆత్మహత్య). కాని, సర్వజ్ఞుడైన ఈశ్వరుని కృపఉంటే,ఆత్మప్రాప్తికి తీవ్రముగా ఉత్కటజిజ్ఞాస కలిగిఉంటే,ఈశ్వరుడు కృపచేత దుర్వృత్తుల బారినుండి తప్పించి, ఆత్మప్రాప్తికి సహకరిస్తాడు. కవటీమఠమనేది దుర్గుణములకు నిలయమైన అజ్ఞానము. దీనిని ఆశ్రయించుకున్న దుర్గుణములు–కామాది షడ్రిపులు ఆత్మఘాతకము చేయుటకు, దుష్టసంకల్పము నెరవేర్చుకొనుటకు అనేక ఉపాయములు చేస్తాయి. కామమనే దుర్గుణము అనేక సంకల్పవికల్పములుచేసి అజ్ఞానమును వృద్ధిచేస్తుంది.దానికి–మిగిలిన దుర్గుణములు సహకరిస్తాయి. ఆత్మను అజ్ఞానముచేత బంధించి ఆనందపడతాయి.సద్వృత్తులు ప్రకటమై,ఆత్మను పొందుటకు వెతుకుతూ వెతుకుతూ ప్రశాంత స్థలములో ఆత్మకోసము ఎదురుచూస్తూ ఉంటాయి.

ఇక్కడ ముముక్షుజీవులు ఆత్మను పొందడానికి గృహములు, వనములు, వాగులు, వంకలు, నదులు, పర్వతములు అనేక ప్రదేశములు వెదకి వెదకి వేసటజెంది ఒక నిర్జన ప్రదేశమును, ప్రశాంత స్థలమునెన్నుకొని సద్గురుదేవుని గుణగణములను వర్ణిస్తూ అశ్రుపూరితనయనాలతో సద్గురుదేవుని దర్శనము కోసము (ఆత్మసాక్షాత్కారము కోసము) పరితపిస్తూ ఉంటారు. ఈ విధముగా తీవ్రతర ప్రయత్నముద్వారా పుణ్యముపండి సద్గురుదేవుడు ప్రాప్తమై ఐక్యజ్ఞానమును (ఆలింగనమును) ప్రసా-

దిస్తాడు.ఆత్మదేవుని హృదయమఠములోకి తీసుకొచ్చి సద్వృత్తులు(సద్భక్తులు)ఎంతోఆనందపడతాయి. ఆత్మానందమననుభవిస్తాయి.

ఇక్కడ షడ్రిపులు ఆత్మఘాతకము చేయుటకు అజ్ఞానములో మునిగి అనేక దుష్టసంకల్పములు చేస్తూ నిరంతరము దుష్టబుద్ధిచేత ఆత్మధ్యానమును చేస్తున్నాయి. దుష్టబుద్ధిచేతనైనా నిరంతరము ఆత్మధ్యానము చేయుటవలన, సర్వత్ర ఆత్మనే దర్శిస్తున్నాయి. (భ్రమరకీటక[1] న్యాయము వలె– షడ్రిపులు ఎల్లప్పుడూ ఆత్మ–ఆత్మ అంటూ ధ్యానిస్తూ ఒకదానినొకటి పరస్పరము ఘర్షణచేస్తూ తీవ్రతర రూపమును ధరించి వివేకమును కోల్పోయి తమ గుణదోషమే తమను బాధిస్తుంటే, ఎంతో దుఃఖమును అనుభవిస్తూ, హాహాకారాలు చేస్తుండగా, సద్వృత్తులు మేల్కాంచి చంచలయుక్తమైన వికారయుక్తమైన కామాది దుర్వృత్తులను బయటకు త్రోసివుచ్చినవి.

ఆత్మను హింసించుటకు ప్రయత్నించిన కామాదివృత్తులు విఫలమై ఆత్మను దర్శించలేక అనేక దుఃఖములను అనుభవిస్తుండగా, సద్వృత్తులు ఉదయించి వాటి దృష్టిని, దుర్వృవృత్తులపై ప్రసరింప జేసినపుడు కామాదివృత్తులకు లజ్జ(సిగ్గు) ఏర్పడి గుప్త(లుప్త)మైపోయినవి. తదనంతరము కామాది వృత్తులు పశ్చాత్తాపముజెంది సద్వృత్తులతోకలిసి సద్గురుదేవుని దర్శించి సత్సంగముచేయుటవలన దుర్గుణములను మాని సద్భక్తిని దృఢముచేసుకొని సద్వృత్తులుగా మారి ధన్యులైనారు.

కామాది వృత్తులను ఆత్మఘాతకమునకు పురికొల్పిన అవ్యక్తము(అజ్ఞానము) అప్పుడు దుష్ట బుద్ధిని పిలిపించి దానికి పంచవిషయాలనే ధనమును ఆశజూపి ప్రలోభపెట్టినది. స్థూలసూక్ష్మరూప విషయాలే విషము వంటివి. వీటిని అనుభవించుమని కుబుద్ధి ఆత్మను అర్థిస్తుంది. అప్పుడు ఆత్మరూప సద్గురుదేవుడు అంటాడు. నేను నిత్యతృప్తుడను, నాకు ఈ విషయాల పట్ల ఎలాంటి వాంఛ లేదు, పక్వాన్నము నాకవసరము లేదని నిరాకరిస్తాడు. అయినాగాని ఆ దుష్టబుద్ధి కపటముబూని ఆత్మను ద్వైతరూప పక్వాన్నమును అనుభవించమని బలాత్కారముచే విషమును తినిపించినది. ఎప్పుడైతే ఆత్మదేవుని ఆ దుష్టబుద్ధి దర్శించినదో, వెంటనే దానికి ఆత్మధ్యాస కలిగి, నిరంతరము ఆత్మధ్యానమే చేస్తూ పదునైదు రోజులకు ఆత్మలోనే ఐక్యమైనది. పదునైదురోజులు పదునైదుకలలు ఒకటొక్కటిగా తగ్గి తాపత్రయరూప సంసారదుఃఖమును అనుభవిస్తూ దుష్టబుద్ధి సమూలముగా నివృత్తమై ఆత్మలో ఐక్యమైనది. దుఃఖాకారవృత్తిచేతనైనా, పశ్చాత్తాపబుద్ధితోనైనా ఆశయము, ప్రయత్నము మంచిదైతే తప్పకుండా తరిస్తారు.

ఇక్కడ ఆత్మ ఎప్పుడైతే విషరూప ద్వైతపక్వాన్నమును అనుభవించినదో, వెంటనే సంసారరూప జ్వాలరగిలి ఆత్మను పీడిస్తూ ఇచ్ఛ అనే సంకల్పముచేత, వాసన అనే అగ్నిద్వారా తాపత్రయములనే

[1] భ్రమరకీటన్యాయేన ముక్తో భవతీత్యుపనిషత్ । (నారదపరివ్రాజకోపనిషత్ పంఞ్చమోపదేశాంతే)

బొబ్బలులేచి, ఆత్మను అతివేగముగా దుఃఖపెట్టి పీడించినవి. కర్తృత్వ భోక్తృత్వ ధర్మములచే చిదాభాసుడు సుఖదుఃఖములను అనుభవిస్తున్నట్లు ప్రతీతి అయినాగాని, వాస్తవముగా కూటస్థసాక్షిస్వరూపుడైన ఆత్మ, నిర్వికారమై ప్రశాంతంగా ఉంటుంది. సద్వృత్తులు(సద్భక్తులు)ఎంతో బాధపడతాయి. కాని, సద్గురురూప ఆత్మ దుఃఖమును నివారిస్తుంది. సద్వృత్తులకు అభయమిచ్చిన ఆత్మ క్రమముగా పదునైదురోజులు ప్రాణపంచకమును,కర్మేంద్రియపంచకమును,జ్ఞానేంద్రియపంచకమును నిరసించి, ఆత్మ స్వప్రకాశస్వరూపుడై భాసిస్తాడు. అభయప్రదాతయైన సద్గురుదేవుని చరణకమలముల నాశ్రయించిన వారు సద్గురుదేవుని కృపకు పాత్రులై సంసార తాపత్రయమునుండి విముక్తులై జ్ఞానమును పొంది శాశ్వత సుఖముననుభవిస్తారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినచో సకలపాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురుసిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ నలుబది తొమ్మిదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏబదియవ అధ్యాయము

పద్యానువాదము:–శ్రేష్టస్వరూపుడవైన ఓ పరమేశ్వరా! సకలపాపములను హరింపజేయగల ఓ పుణ్యస్వరూపా! మునిజనులయొక్క మనోహంసను మోహపాశమునుండి నివృత్తిజేయగలవాడ-వు. సకలలోకములకు ఆత్మబంధువై, ఉపమానరహితసుఖప్రదాతవగు ఓ సిద్ధసద్గురుదేవా!సద్వస్తు-వును దర్శింపజేయు సంతుమహాత్ముల సాంగత్యమును (సన్మార్గమును) చూపించి, మమ్ము రక్షిం-పుము స్వామీ!

ఓంకార స్వరూపుడవైన ఓ సద్గురుసిద్ధనాథా! నీకు హృదయపూర్వక నమస్కారములు.జీవు-లపై అత్యంత దయగలవాడవు. భక్తులను నీవారిగా భావించుకొని ఎల్లప్పుడు వారిని ఆపదలనుండి రక్షిస్తావు. సద్గురుదేవుని పరమపావన నామమును అనన్య భక్తిచేత చింతనచేసినచో సకలచింతలు తొలగి, సమస్తభయములు హరింపబడి, సంసారతాపములు సమూలముగా నష్టమగును. సద్గురు దేవునియొక్క సేవ అనన్య భావముచేత త్రికరణశుద్ధితో చేసినచో, చిత్తశుద్ధి కలిగి నిజజ్ఞానమును పొందుతాడు.శరీరమును సద్గురుసేవకు సమర్పించి,యుక్తాయుక్తములు విచారించక సద్గురుదేవుని ఆజ్ఞను ప్రమాణముగా స్వీకరించి, ఎల్లప్పుడూ సద్గురుదేవుని దివ్యనామమును హృదయమందు భక్తి శ్రద్ధలతో ప్రేమయుక్తముగా భజిస్తూ, నిష్కామసేవ చేసినట్లయితే సంసారము తప్పకుండా నివృత్తి కాగలదు. ఫలాపేక్ష లేకుండా సేవచేయడమే నిష్కామ సేవయొక్క లక్షణము. దానియందు అణు మాత్రమైన ఫలమును ఇచ్ఛగించినట్లయితే (కోరినచో) ఆ సేవ గుణమును ఇవ్వదు. అనగా చిత్తశుద్ధి కలుగజేయదు. లౌకిక శ్రేయస్సునుగూర్చి అనాత్మ పదార్థములనుగోరి సేవచేయడము అధమసేవ. మనసుయొక్క తృప్తికోసము స్వర్గాది సౌఖ్యములను కోరి చేయు సేవ మధ్యమ సేవ. నిష్కామ సేవద్వారా సద్గురుదేవుని తృప్తిపరచడమే తనయొక్క సుఖమని, సద్గురుదేవుని సేవ జరుగని రోజు నిరర్థకమని దుఃఖమును పొందడమే ఉత్తమ సేవ అనబడును. కాని, వీటన్నిటికంటే ఉత్తమోత్తమ సేవ ఏది అనగా–నేను నాది అనే భేదభావమును వీడి ఈ శరీరము మనోబుద్ధులు సర్వము సద్గురు దేవుని ప్రసాదముగా భావించి, వాటిని సద్గురుదేవుని సేవకు అర్పించి, ఏకత్వానుభూతినిగలిగి దాస్యత్వభావనచేత సేవ చేయడము.

ఇటువంటి దాస్యత్వ లక్షణాలనుగూర్చి చెబుతాను వినండి. సద్గురు ముఖకమలముద్వారా మహావాక్య శ్రవణమును ఏకాగ్ర చిత్తముతో చేయాలి. శ్రవణము చేసిన దానిని ఏకాంత స్థలములో అఖండముగా మననము చేయాలి. తద్వారా స్వరూపానుసంధానము మహావాక్య విచారముద్వారా పొందాలి.సద్గురుదేవుని సేవయందు యోగ్యాయోగ్యములనే భేదము లేకుండా సంలగ్నమగుటయే–ఉత్తమోత్తమ సేవ. ఈప్రకారముగా సేవ చేసేవాడే జ్ఞానమునకు అధికారి.అటువంటి వారినే ముక్తి-కాంత వరించి, వరమాలను మెడలో వేస్తుంది.

ఈవిధమైన సేవద్వారా ఎవరైనా కృతకృత్యులైనారా? దయచేసి తెలియజేయండి స్వామీ-అని శ్రోతలు అడుగగా,అప్పుడు సద్గురుదేవుడు చెప్పనారంభించినాడు.సిద్ధాశ్రమమునందు విరాజమాను-డై భక్తులపాలిట కల్పవృక్షస్వరూపుడైన సిద్ధారూఢ సద్గురుదేవుని సేవకొఱకు ప్రతిరోజు చనమల్లప్ప అనే సద్గుణసంపన్నుడైన భక్తుడు వచ్చేవాడు. సద్గురుదేవుని సేవాతత్పరుడై గృహకృత్యముల నన్నిటిని విస్మరించి, ఎల్లప్పుడూ సద్గురు సన్నిధానముననే ఉండేవాడు. సద్గురుదేవునియొక్క ఆజ్ఞానుసార-ముగా సేవచేస్తూ విరామ సమయములలో సద్విచారము చేసేవాడు. అప్పుడప్పుడు ఉదాసీనముగా ఉండేవాడు. దినమంతా సద్గురుసన్నిధిలో ఉంటూ, సద్గురుసేవ, మఠము సేవ చేసేవాడు. రాత్రిపూట ఇతరుల ఇండ్లకు వెళ్లి రాత్రంతా మగ్గము నేసి, దానితో వచ్చిన కొద్దిపాటి ధనముతో ఇద్దరు దంప-తులు జీవనము గడుపుకునేవారు. చాలీచాలని ద్రవ్యముతో దారిద్యమును అనుభవిస్తూ, ఒక రోజున ఆయన భార్యకు కోపమువచ్చి ఇలా అంటుంది.

ఏమయ్యా! నీవు పొద్దంతా సిద్ధారుఢస్వామివద్ద సేవచేస్తూ ఉంటే గృహ(ఇంటి)వ్యవహారము ఎవరు చూడాలి.వేళకు రాగానే ఇంట్లో భోజనము వడ్డిస్తున్నాను. హాయిగా తింటున్నావు.నిశ్చింతగా ఉంటున్నావు. కేవలము పొట్టపూర్తికే పనిచేసి చాలీచాలని ద్రవ్యము సంపాదించి, ఏ పూటకు ఆ పూట పొట్టగడుపుకొని జీవించడము, నీకు సిగ్గు అనిపించడము లేదా? ఇంతేనా మన బ్రతుకు? నీవు ఒకవేళ రోజంతా పనిచేస్తే పుష్కలంగా డబ్బు వస్తుంది. దానితో మన గృహావసరాలు (బట్టలు, పొట్ట, పండుగలు, అతిథులు, అభ్యాగతులు)మొదలైనటువంటి అవసరాలు తీరిపోగా, ఇంకా ఎంతో డబ్బు మిగులుతుంది. ఆ మిగిలిన డబ్బుతో నాకు కమ్మలు, బుట్టాలు, మెడలో నెక్లెస్, మరియు ఎన్నో భూషణములు తెచ్చుకోవచ్చు.అదిగో చూడు–ఇరుగుపొరుగు వారి భార్యలు ఎన్ని ఆభరణాలు ధరి-స్తున్నారు. నీలాంటి దరిద్రనారాయణుని అంటగట్టుకున్న నాకు ఆ భాగ్యమెక్కడిది? ఈజన్మలో నీతో సుఖపడేది లేదు(కాదు). ఇటువంటి దుర్గతి ఇకముందు రాకుండా ఉండాలంటే, నేను భవిష్యత్తులో హాయిగా సుఖపడాలంటే, వేరే ఒక పురుషుని కట్టుకుంటే గాని సుఖపడగలను. నీవల్ల కాదు.

అప్పుడు చనమల్లప్ప తన భార్యతో అంటాడు. నా పరిస్థితి గూర్చి, నా దారిద్ర అవస్థగూర్చి మీ తల్లిదండ్రులకు అంతా తెలిసి కూడా నిన్ను నాకు వివాహము చేసినారు. ఇప్పుడైనా నా దారిద్ర్య

అవస్థగూర్చి,నా దుర్బలత్వముగూర్చి తెలిసింది కదా!ఒకవేళ నీవు సుఖపడని యెడల,నీవు అన్నట్లు-గానే వేరే పురుషుని చేసుకుని సుఖపడుము. శ్రీమంతుని వివాహమాడి సుఖించుము-అని అంటూ చనమల్లప్ప శరీరముపైగల వస్త్రములను తీసి పారవేసి, కౌపీయమును ధరించి, ఒక జోలె చంకకు వేసుకొని బయలుదేరినాడు.ఇంటింటికి వెళ్లి ద్వారమందునిలబడి"జై శ్రీ సద్గురుదేవా"అంటూ సద్గురు నామమును ఉచ్చరిస్తూ "భిక్షాం దేహి మాత"అంటూ భిక్షను సేకరించుకుని సిద్ధాశ్రమమునకువచ్చి, సేకరించిన భిక్షను సద్గురుదేవుని ముందుంచి చేతులు జోడించుకొని దీనవదనముతో, నమ్రతతో నిలబడినాడు.

అప్పుడు సద్గురుదేవుడు చనమల్లప్పను ఏమిటిది?అని విచారించగా చనమల్లప్ప తన వృ-త్తాంతమును ఇట్లు చెప్పుచున్నాడు. ఓ సద్గురుదేవా! నా భార్య నాకు సద్బోధ చేసింది. ఆమె నాకు యథార్థమైన జ్ఞానమును, వైరాగ్యమును బోధించింది. ఆమెయొక్క కఠోరవచనముల ద్వారా నా హృదయమున పరివర్తనము కలిగింది.గృహస్థాశ్రమమునువీడి నీచరణకమలములనాశ్రయించితిని. నన్ను అనుగ్రహించుము స్వామీ! చనమల్లప్పయొక్క దీనవచనములను విని సద్గురు సిద్ధారూఢస్వామి చాలా సంతోషించి, ఇక్కడే ఈ మఠముయందే, నా సాన్నిధ్యములోనే ఉండుము-అని ఆశీర్వదించి నాడు.

ఈ ప్రకారముగా మఠములో సేవచేస్తూ మధ్యాహ్న సమయమునకు గ్రామంలోకి వెళ్లి భిక్ష అడుగుకొనివచ్చి సద్గురుదేవునిముందు సమర్పించేవాడు. సద్గురుదేవుడు దయదలచి ఇచ్చిన దానిని మాత్రమే స్వీకరించేవాడు. అహోరాత్రులు సద్గురు సేవచేస్తూ ఉన్నాగాని ఆయనకు తృప్తిగలగక చింతించేవాడు. సద్గురుసేవకు అంకితమైన తన జీవితమును సద్గురుసేవలో ఏమాత్రం సంకోచింపక నిర్లక్ష్యము చేయక వినియోగించాలని వ్యర్థజీవనము గడపకూడదని నిశ్చయించుకున్నాడు. సద్గురు సేవయందు ఎన్ని ప్రతిబంధకములు వచ్చినా,ఎన్ని కష్టాలు యెదురైనా స్వామి సేవమాత్రము వీడను. స్వామి పాదములు విడిచి గడియయైనా ఉండలేను. ఇట్టి దృఢనిశ్చయము చేసుకొని—

సద్గురు సిద్ధారూడస్వామి ప్రాతఃకాలమున నిద్రలేవకముందే లేచి స్వామి శయనగృహద్వార-ము ముందు స్వామి సేవకోసము చనమల్లప్ప ఎదురుచూస్తూ నిలబడేవాడు.వేడినీరు పాత్రలో తీసు కొని స్నానగదిలో ఉంచేవాడు. స్వామి వేకువనే నిద్ర లేవగానే, శయనగృహ ద్వారము వద్దనున్న చనమల్లప్ప స్వామియొక్క చేయిపట్టుకుని స్వామి మేనుపై వస్త్రమునుకప్పి స్వామి శౌచక్రియకు వె-ళుతుంటే, వెనుక చెంబులో నీరు పట్టుకొని వెళ్లేవాడు. శౌచక్రియ తర్వాత స్వామి చేయిపట్టుకొని తీసుకొచ్చి శుద్ధమైన నీరుతో ముఖప్రక్షాళనము చేసేవాడు. స్వామి నోటిలో నీరు పోసుకొని పుక్కి-లించి ఉమ్మిన నీరును తీర్థరూపముగా భావించుకొని త్రాగేవాడు. తదనంతరము ఉష్ణజలముతో స్నానము చేయించి వస్త్రములు కట్టేవాడు. మళ్లీ రాత్రి సమయము కాగానే స్వామియొక్క శయ్యను

శుభ్రపరచి బట్టలను ఉతికి శుభ్రపరచి పడకవేసి (పరిచి) స్వామి పడుకోగానే సద్గురుదేవుని కాళ్లు వత్తేవాడు. స్వామి నిద్రించేవరకు ఇక చాలులే–అని అనే వరకు చనమల్లప్ప స్వామియొక్క పాద-సంవహనము చేసేవాడు (వత్తేవాడు).సద్గురుదేవుని శయనగృహ ద్వారమువద్దనే చనమల్లప్ప పడు-కునేవాడు. లోపలనుండి ఏమాత్రము శబ్దము వినబడినా వెంటనే లేచి చూసేవాడు. స్వామి ఏమైనా ఆజ్ఞాపిస్తాడేమో అని ఎదురుచూసే వాడు. ఈప్రకారముగా రాత్రింబవళ్లు సద్గురుసేవకు అంకితమైనా గాని చనమల్లప్పకు స్వామి సేవలో ఇంకా ఏమైనా లోటు చేస్తున్నానేమోనని నిరభిమాన వృత్తితో తృప్తి చెందేవాడు కాదు. ఇంకా చాలా సేవ చేయాలి–అని తపనపడేవాడు.

ఒకానొక రోజున సద్గురుదేవుడు నిద్రించుచుండగా చనమల్లప్ప ద్వారమువద్ద పడుకొని ఉన్నాడు. కొంత రాత్రి గడిచిన పిమ్మట ఏదో వస్తున్నట్లుగా శబ్దము వినిపించింది. ఆ శబ్దమునువిని చనమల్లప్ప, స్వామి లేచినాడేమో ఆయనకు ఏమైనా ఉపచారము (సేవ) చేయాలి అనే ఉద్దేశముతో ఒక్కసారిగా దిగ్గునలేచినాడు. కాని, సద్గురుదేవుడు గాఢనిద్రలోనే ఉన్నాడు. అక్కడిక్కడ చూసేసరికి చనమల్లప్పకు సమీపములో ఒక గొప్ప సర్పము సద్గురుదేవుని శయ్యాగృహములోకి పోవుచున్నది. సద్గురుదేవునికి ఏమైనా అపాయము కలిగించునేమో అని చనమల్లప్ప వెంటనే దానిని పట్టుకోవ-డానికి ప్రయత్నిస్తాడు. సద్గురుదేవుని అపాయమునుండి తప్పించుటకు తాను ధైర్యమును చేబూని, దేహస్మృతిని విడనాడి సర్పముయొక్క తోకను పట్టుకొని బయటకు లాగినాడు. ఎప్పుడైతే చనమల్లప్ప తన ప్రాణాలనుగూడా లెక్కచేయక ధైర్యమునుబూని, సర్పమును బిగ్గరగా పట్టుకున్నాడో,అప్పుడు సర్పము క్రోధముచేత పడగవిప్పి, బుసలు కొడుతూ చనమల్లప్పను కాటువేసింది.అయినాగాని లెక్క చేయక, దానిని విడవకుండా అట్లే పట్టుకొని, ఇక్కడుంటే సద్గురుదేవునికి నిద్రాభంగము కలుగు-తుందని, దూరంగా వెళ్ళిపోతున్నాడు. ఈ పామువలన ఇతరులకు కూడా ప్రాణాపాయము కలు-గునని ఆలోచించి, చనమల్లప్ప ఆ సర్పమును దూరముగా తీసుకెళ్లి చంపివేసినాడు. తదనంతరము చనమల్లప్ప యథాస్థానమునకు వచ్చి సర్పము కాటు వేసినదని కూడా లెక్కచేయకుండా సద్గురు దేవుని శయ్యాగృహద్వారమువద్ద పడుకున్నాడు. సర్పవిషము శరీరమంతా వ్యాపించి చనమల్లప్ప మూర్ఛితుడైనాడు.

అకస్మాత్తుగా సద్గురు సిద్ధనాథస్వామి నిద్రనుండి మేల్కొని ద్వారము తెరుచుకొని బయటకు వచ్చినాడు. స్వామియొక్క చప్పుడు వినగానే వెంటనే లేచి స్వామియొక్క ఆజ్ఞకు ఎదురు చూసే చనమల్లప్ప–లేవకపోగా, స్వామి చెయ్యి తట్టి చనమల్లప్పను పిలిచినాడు. నాయనా! చనమల్లప్పా! లే నాయన లే! కాని, చనమల్లప్ప లేవలేదు. సద్గురుదేవుడు ఆశ్చర్యచకితుడైనాడు. ఎన్నో విధముల లేపుటకు ప్రయత్నము చేసి, స్వామి అనుకుంటాడు. ప్రతిరోజు నాకంటే ముందే లేచేవాడు. ఈరోజు ఈయన వ్యవహారము విరుద్ధముగా ఉందని విచారించి, చనమల్లప్పను లేపుటకు అనేక ప్రయత్న-

ములు చేసినాడు. ఎన్నో విధములుగా చనమల్లప్ప అంగములను కదిలించి అటు ఇటు ఊపినాడు. ఏమాత్రం కూడా కదలక మెదలక అట్లే పడిఉన్నాడు చనమల్లప్ప. అప్పుడు సద్గురుదేవుడు తనయొక్క జ్ఞానదృష్టితో చూసి ఈయనకు సర్పము కాటు వేసిందని తెలుసుకున్నాడు. విషప్రయోగము వలన మరణోన్ముఖుడైనాడని గ్రహించాడు.గొప్ప ఉపద్రవమునుండి నన్ను రక్షించుటకోసము తన ప్రాణా-లనుగూడా లెక్కచేయక సద్గురుసేవయందు దేహబుద్ధిని సమూలముగా నష్టము చేసుకుని కృత-కృత్యుడైనాడని మెచ్చుకున్నాడు స్వామి.ఇటువంటి సచ్ఛిష్యుని మరణమునుండి రక్షించకుంటే భక్తరక్షకుడను నాయొక్క బిరుదుకు కళంకము వస్తుందని,ఆయనను బ్రతికించడానికి నిశ్చయించుకొని–

"**ఓం నమశ్శివాయ**" అని ఉచ్చరిస్తూ సద్గురుదేవుడు తనయొక్క అమృత హస్తముచేత దంష్ట్ర స్థలమును (కాటువేసిన చోట) స్పర్శించినాడు. అప్పుడు చనమల్లప్ప సద్గురుదేవుని కృపవలన మెల్లగా లేచి కూర్చుని స్వామిని దర్శించినాడు. చనమల్లప్ప స్వామితో అంటాడు. ఓ సద్గురుదేవా! ఇంతవరకు నేను గాఢంగా నిద్రించాను.ఆ నిద్రలో నేనొక స్వప్నమును చూసినాను–అని తన స్వప్నానుభవము-ను తెలుపుచున్నాడు. నన్ను యమదూతలు తీసుకెళ్లి యమధర్మరాజు ముందు నిలబెట్టినారు. ఇంతలో నీవంటి సాధువు ఒకాయన వచ్చి నన్ను విడిచిపెట్టమని యమధర్మరాజును ఆజ్ఞాపించినాడు. అప్పుడు యమధర్మరాజు సాధువుయొక్క మాటలు శిరసావహించి, సాధువును శాస్త్రోక్తముగా పూజించి, ఈయనను విడిచిపెట్టి రమ్మని యమదూతలను ఆజ్ఞాపించగా, వారు నన్ను ఇక్కడ విడిచి వెళ్ళినారు. చనమల్లప్పయొక్క వచనములను విని సద్గురు సిద్ధారూఢస్వామి నవ్వుకొని నీవు ఆ సర్పమును ఎందుకు పట్టుకున్నావు? అని ప్రశ్నించాడు.

అప్పుడు చనమల్లప్ప సమాధానమిస్తూ–సద్గురుదేవా!నీవు సర్వజ్ఞుడవు.నీకు తెలియనిదంటూ ఏమీ లేదు. నేను నీతో ఏమని చెప్పాలి? అంటూ సద్గురుదేవుని చరణకమలములను ధరించి, ఇలా అంటున్నాడు. సద్గురుదేవా! ఈ శరీరము నీది. నీ శరీరమును నీవే రక్షించుకున్నావు. నీ పాదసేవ చేయుట కోసము ఈఉపాధిని రక్షించావు.నాదంటూ నాకు ఏమీ లేదు,కనుక నాది ఏమి పోలేదు, ఏమియును రాలేదు.నాకేమీ సుఖదుఃఖములు కలుగలేదు.ఇటువంటి ప్రేమపూర్వకమైన సంభాషణ-మును విని దయాసాగరుడైన సద్గురుదేవుడు ఎంతో సంతోషించినాడు.

ఒకానొకప్పుడు సద్గురుదేవుడు జ్వరపీడితుడై మంచముపట్టినాడు.చనమల్లప్ప రాత్రింబవళ్లు సద్గురు సన్నిధానముననేఉంటూ స్వామిసేవ చేయుచుండెను.స్వామికి జ్వరమువచ్చి కఫము ఎక్కువై దగ్గుచేత బాధపడుచుండెను. తీవ్రముగా దగ్గుటవలన నోటిలోకి కళ్ళె (శ్లేష్మము) వచ్చింది. దానిని ఉమ్మివేయుటకు స్వామికి మంచమునుండి లేవ వీలు లేకుండెను. అప్పుడు చనమల్లప్ప నోరు చాచి స్వామిని ఉమ్మమని అర్థించాడు. స్వామి ఉమ్మి వేయగా అమృత సమానముగా భావించి దానిని సేవించాడు. చిత్తశుద్ధిగల చనమల్లప్ప రాత్రింబవళ్లు సద్గురు సన్నిధానముననే ఉంటూ స్వామియొక్క

సేవ ప్రేమపూర్వకముగా చేస్తున్నప్పటికీ చనమల్లప్ప మనసులో ఏదో ఒక కలత మెదలుచుండెను. సద్గురుసేవలో నేను ఏమైనా పొరపాటు చేయుచున్నానేమో, స్వామి సేవలో లోటు జరుగుతున్న-దేమో అని చింతించుచుండెను. మరియు—

ఈ ప్రకారముగా భావన చేయుచుండెను. ఏమనగా–యథార్థమైన సద్గురుసేవ చేయుట గూర్చి నా శరీరముపై గల చర్మమును ఒలిచి స్వామికి పాదరక్షలు చేసినచో నిజమైన సేవ చేసిన వాడనగుదును.ఎల్లప్పుడూ సద్గురు పాదసేవచేసిన వాడనగుదును.నేను సద్గురుదేవునియొక్క(శయ్య) పడకబట్టలు అయితే స్వామి నాపైన హాయిగా నిద్రించితే నాజన్మ ధన్యమగును. నేను సద్గురుదేవుడు కప్పుకునే వస్త్రమునయితే స్వామి నన్ను కప్పుకున్నట్లైతే స్వామియొక్క అంగములనుండి వెలువడు సువాసనలను ఆఘ్రాణిస్తూ సుఖించేవాడిని. సద్గురుదేవునకు ఏయే వస్తువులు అవసరముండునో, ఆయా వస్తువులుగా నేను అయినట్లయితే పూర్ణసేవ చేసిన వాడనగుదును. నా జన్మ కృతార్థమగును. సద్గురు కృపకు పాత్రుడనుగుదును–అని ఈవిధముగా మనోకల్పన చేస్తూ, ఇంకా సద్గురు సేవగూర్చి నా శరీరమును జీర్ణింప చేసుకొని సద్గురు పూజించే పూజా పుష్పముగా మారి, ఆయన దివ్య పాదారవిందములకు అర్పణమై, నా జీవితమును ధన్యము చేసుకోగలను. ఈ ప్రకారమైన సేవచేసే అవకాశము నాకు ఎప్పుడు లభిస్తుందో, నాజన్మ పావనమయ్యేది ఎప్పుడో, అని మనసులో తల్లడిల్లి చింతించుచూ ఉండెను.

ఇంతలో సద్గురుదేవుడు మూత్ర విసర్జన కోసము లేచినాడు. అప్పుడు చనమల్లప్ప అంటాడు. సద్గురుదేవా! ఈ రాత్రివేళ బయటకు పోవుటకు వీలుకాదు. ఇక్కడే పాత్రను ఉంచుతాను, ఇందులో మూత్ర విసర్జనచేయుమని అన్నాడు. పాత్రను ఉంచుతున్నాను–అని చనమల్లప్ప చెప్పినందున, కారు చీకటి ఉన్నందున, పాత్ర కానరాకున్నప్పటికీ, నిజముగానే పాత్రను పెట్టినాడని భావించి స్వామి మూత్రవిసర్జన చేసినాడు. చనమల్లప్ప నోరు తెరిచి జ్ఞానామృతముగా భావించి గటా గటా త్రాగి-నాడు. చనమల్లప్పయొక్క జన్మ ధన్యము. ఇటువంటి శిష్యుడు దుర్లభము.

ఈ ప్రకారమైన సేవ గురించి వేదములలో, శాస్త్రములలో కూడా వర్ణించబడలేదు. వెతికినా దొరకదు. దేహాభిమాన రహితుడై అహర్నిశలు సద్గురుసేవలో తన్మయుడైనందున సద్గురుకృపకు పాత్రుడైనందున, దేవాదిదేవుడైన సద్గురుదేవుడు ఆత్మజ్ఞానమును ప్రసాదించినాడు. స్వయంప్రకాశ స్వరూపమైన ఆత్మజ్ఞానమును పొంది, దేహ (జీవ) భావమును వీడి స్వస్వరూప స్థితిని బడసినాడు. అపారమైన సద్గురు సేవాఫలమును పొంది చనమల్లప్ప ఎల్లప్పుడూ సద్గురుదేవుని ధ్యానిస్తూ, భజిస్తూ సద్గురుకృపకు పాత్రుడై మంగళ ధామమైన మోక్ష స్థితిని పొంది ధన్యుడైనాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును విన్న మాత్రముననే సకల పాపములు భస్మమైపోవును. శ్రీ సిద్ధారూఢ సద్గురు చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబదియవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏబది ఒకటవ అధ్యాయము

పద్యానువాదము:-వివేక,వైరాగ్యములచేత ఎవరైతే నీపాదపద్మముల నాశ్రయిస్తారో,వారికి సత్సంగమును కల్పించి, సద్విచారముద్వారా అంతఃకరణమునందు ఎలాంటి చింతలు లేకుండాచేసి సుఖశాంతులను ప్రాప్తముచేసి నిశ్చలమైన స్థితిని ప్రసాదిస్తావు.(జ్ఞానమార్గము)

ఒకవేళ భక్తిచేత నిరంతరము నీ నామమును స్మరిస్తూ ఆ నామామృతమును గ్రోలుతూ నీ భజనయందే తన్మయులై ప్రేమ, శ్రద్ధచేత నీయందే రమించినవారు నీయొక్క దివ్య పాదారవింద-ముల ఆశ్రయమును పొందుతారు.(భక్తి మార్గము)

మంగళ స్వరూపుడవైన ఓ సద్గురు సిద్ధనాథా! దశదిశలు వ్యాపించిన నీ కీర్తిని వర్ణించుటకు నాయొక్క వాక్కు సరిపోదు. సర్వత్ర వ్యాపించియున్న నీ నిజస్వరూపమును తెలుసుకోలేక మేము వ్యర్థముగా భ్రాంతిచేత సకల ప్రయత్నములు చేయుచున్నాము. కాని, యథార్థమైన అభేదజ్ఞానమును పొందలేక పోతున్నాము. త్రిగుణాత్మకమైన అజ్ఞానమనే దోషముచేత మా చిత్తము ఆవరణయుక్తమై పంచవిషయాలకు లోబడి, రాగద్వేషములకు గురియై తద్వారా వికారములను పొందుచున్నది. ఈ సంసారము పరిణామశీలమైనది. ఇది దీని స్వభావము, ధర్మము. నామరూప క్రియా స్వరూపమైన ఈ ప్రపంచమున మనసు నామరూపాలను సృష్టించుకుని వాటియందు రాగద్వేషాలను ఉత్పన్నము చేసుకొని, మాయలోబడి క్షణముకూడా స్థిరముగా ఉండక పరిభ్రమించుచున్నది. విషయాలనుండి ఉపరతిని పొందకున్నది. అజ్ఞానముచేత చేయకూడని నిషిద్ధకర్మలు చేసేవారి విషయము గూర్చి చింతించవలసిన పనిలేదు. కాని, అనేక సత్కర్మలు సకామకర్మలుచేసిన వారికికూడా సంసారము నివృత్తి అగుటలేదు. కాబట్టి, ఈ విషయముగూర్చి వివరిస్తాను. సావధానముగా వినగలరు. జీవుడు సత్సంగము చేయుటవలన ఈప్రపంచముయొక్క దోషదర్శనము చేసి, ఈజగత్తు అసారమైనదని, పరిణామశీలమని, వినాశవంతమైనదని, మిథ్యయని నిశ్చయించుకుంటాడు. సత్సంగమువలన ఇటు వంటి అభిప్రాయము ఏర్పడుతుంది. అదేవిధముగా వైరాగ్యమును దృఢముచేసుకొని విషయాసక్తిని నివృత్తిచేసుకుంటాడు.తదనంతరము జననమరణరూప సంసారమును నివృత్తిచేసుకొనుటకు తాప-త్రయహృదయముతో అనన్యభక్తిచేత సద్గురుదేవుని ఆశ్రయిస్తాడు.శరణవెళ్ళుతాడు.దృఢవైరాగ్యసంప-న్నుడైన తాను దేహబుద్ధిని త్యాగముచేసి నిరభిమానవృత్తిచేత అనన్యభావముచేత సద్గురుదేవుని

సేవచేస్తూ సద్గురు ముఖకమలమునుండి వేదాంతవాక్య శ్రవణముచేసి, శ్రవణముచేసిన దానిని మననముచేసి, యథార్థజ్ఞానమును పొంది పూర్ణశాంతిని బడయును. జీవుడు సంసార తాపత్ర-యములకు విసుగెత్తి సత్సంగమును ఆశ్రయించి, తద్వారా ప్రపంచముయొక్క దోషదర్శనము చేసు కొని విషయాలునుండి విముఖుడై, సంసారమునుండి నివృత్తిని బొందాలనే తాపత్రయముచేత సద్గురుదేవుని ఆశ్రయించి దృఢవైరాగ్యముచే సద్గురుసేవచేస్తూ, మహావాక్య శ్రవణముచేసి మననము చేసి అభేద జ్ఞానమును పొంది శాంతిని పొందుతాడు. ఇది అపర వైరాగ్యము.

ఆపైన పరవైరాగ్యముచేత సద్గురు కృపవలన సకలవాసనలను నివృత్తి చేసుకుంటాడు. ఒక జలపూరిత పాత్రను ప్రజ్వలిత అగ్నిపై పెట్టినప్పుడు పాత్రలోని నీరు వేడెక్కి మసలి మసలి నీరు ఏమి లేకుండా కాగలదు. కాని, ఒకవేళ ప్రజ్వలిత అగ్ని చల్లబడితే పాత్రలోని నీరు మసలుట ఆగిపోతుంది. కాని, నీరు అత్యుష్ణముగా ఉంటుంది. ఆ నీరు చల్లబడుట కోసము వేరే చల్లని నీటియొక్క సంబం-ధము అవసరము ఉంటుంది. చన్నీటి సంబంధముచేయగానే యథాస్థితిని పొందుతుంది. అదేవిధ-ముగా దేహరూపపాత్ర, జలరూప అంతఃకరణము, ప్రతిబింబరూప జీవుడు, ప్రవృత్తిరూప అగ్ని. అంతః కరణరూప దేహపాత్ర, ప్రజ్వలిత అగ్నిచేత సంబంధమైనప్పుడు నీరు ఏ విధముగా వేడెక్కి మసలునో, అదేవిధంగా అంతఃకరణము వ్యవహారములో లాభనష్టాలు ఏర్పడినప్పుడు హర్ష శోకములకు, సుఖ దుఃఖములకు గురి అవుతుంది. జీవుడు చాలా దుఃఖిస్తాడు. పూర్వజన్మపుణ్యవశాత్ దృఢవైరాగ్యము కలిగి ప్రవృత్తిని వీడి, విషయాలనుండి విముఖుడైనచో దుఃఖము పోవును.కాని,వాసనా (సంస్కార) యుక్త అంతఃకరణము విషయచింతనచేస్తూ దుఃఖపడుతుంది. (అనగా, జలముయొక్క ఉష్ణత తగ్గలేదు)తన్నివృత్తి కోసము చన్నీటిరూప సత్సంగము చేయాలి. (పర వైరాగ్యము)

అంతఃకరణముయందు సమూలముగా వాసన నివృత్తి కావాలంటే సచ్చింతన చేయాలి. అన్యథా కేవల వైరాగ్యముచేత కాదు.(పరవైరాగ్యము)ఆ సచ్చింతన మహావాక్య శ్రవణముచేత కలు-గును. మహావాక్య శ్రవణము సద్గురు ముఖకమలము నుండియే చేయవలయును. కావున, సద్గురు దేవుని తప్పకుండా ఆశ్రయించాలి. తద్వారా తనయొక్క స్వరూపాన్ని యథార్థముగా తెలుసుకున్న-ట్లయితే బుద్ధియందున్న వాసనలు సమూలముగా నివృత్తమగును. రాగద్వేషాలు దరికిజేరవు. ఇటు వంటి అపర-పరవైరాగ్యాదులద్వారా తరించిన భక్తులగూర్చి చెబుతాను సావధానచిత్తులై వినగలరు.

సిద్ధాశ్రమములో శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి సాన్నిధ్యంలో ఖాసగతప్ప మరియు నిర్వాణప్ప అను ఇద్దరు శిష్యులుండేవారు.అపరవైరాగ్యసంపన్నుడగు ఖాసగతప్ప అను శిష్యుడు దేహాభిమాన-మును త్యజించి, అనన్యభావముతో సద్గురుదేవునిపట్ల భక్తిగలిగి సద్గురుదేవుని ఆశ్రయించి ఏ విధ-ముగా ధన్యుడైనాడో, ఆయన కథను చెబుతాను వినండి.

తాళికోట నివాసియగు'ఖాసగతప్ప'కు అకస్మాత్తుగా అపరవైరాగ్యముగలిగి ఇల్లు గ్రామము సకలబంధుజనులను విడిచి శ్రీ సద్గురుసిద్ధారూఢస్వామి చరణకమలములనాశ్రయించినాడు.ఆయన యొక్క వైరాగ్యము అత్యంతదారుణమైనది.దేహము,దేహసంబంధమైన అనాత్మ పదార్థములయందు అహంకార మమకారములను వీడి మనసులో ఏ విషయముతో కూడా సంబంధము పెట్టుకొనక సద్గురుసేవ నిరభిమానయుక్తముగా చేస్తూ, సద్గురుదేవుని కృపకు పాత్రుడైనాడు. సిద్ధసద్గురుదేవుని వద్దకు ఖాసగతప్ప వచ్చి దీనభావముతో, ఓసద్గురు దేవా! నన్ను నీ పాదదాసునిగా స్వీకరింపుము. నీవుతప్ప నాకు గతియెవరు లేరు.నాయొక్కబుద్ధి విషయభోగములనుండి(సంసారమునుండి)విముఖమైనది. సర్వమును త్యజించి నీ దివ్యచరణాలను ఆశ్రయించి నీ పాదసేవచేసి జన్మసార్థకము చేసుకోవాలని నిశ్చయించుకొని వచ్చినాను–అనుగ్రహింపుము స్వామీ!

అని ఈ విధముగా దృఢవైరాగ్యముచేత దీనవదనుడై ప్రార్థించిన ఖాసగతప్పయొక్క వినతిని ఆలకించి, సద్గురుదేవుడు దయదలచి ఆయన కోరికను మన్నించి, ఆశ్రమములో ఆయన సాన్నిధ్యములో ఉంచుకొనుటకు అంగీకరించినాడు.అదేరోజు ఖాసగతప్ప భిక్షకోసము గ్రామములోకి వెళ్ళినాడు. ఒకానొక గృహస్థుని ఇంటిముందు నిలబడి భిక్షను అర్థించాడు. ఆ గృహస్థురాలు బయటకు వచ్చి ఖాసగతప్పను లోనికి వచ్చి కడుపునిండా భుజించి వెళ్లండి.మా ఇంట్లో కార్యక్రమ నిమిత్తముగా ప్రభోజనమును ఏర్పాటుచేసి ఉన్నాము. పక్వాన్న భోజనములు తయారు చేసియున్నాము.దయచేసి మీరు తృప్తిగా భుజించి మమ్ములను ఆశీర్వదించి కృతార్థులను చేసి వెళ్ళండి–అని ప్రార్థించింది. అప్పుడు ఖాసగతప్ప అంటాడు. మాతా! ఎవరి ఇంట్లో కూడా భోజనము చేయుటకు సద్గురుదేవుని ఆజ్ఞలేదు. భిక్షవేయండి తీసుకెళ్లి సద్గురుదేవునికి సమర్పించుకుంటాను. ఆ గృహస్థురాలు ఖాసగతప్పను ఎంతో బ్రతిమిలాడినది. కాని, ఖాసగతప్ప ఆవిడ మాటలు వినక, నీవు భిక్ష వేయకున్నా సరే, నేను నీ ఇంట్లో భోజనముచేయను అంటూ అక్కడినుండి వెళ్ళుటకు సిద్ధపడినాడు. సాధువును వట్టి చేతుల పంపించడము ధర్మము కాదని ఆ స్త్రీ ఖాసగతప్పకు చాలా భిక్షను సమర్పించి పంపించింది. ఆ బిక్షనుతీసుకెళ్లి నేరుగా సిద్ధారూఢస్వామి ముందుంచి చేతులుజోడించుకొని వినమ్రుడై నిలబడినాడు. సద్గురుదేవుడు ప్రసాదరూపముగా ఇచ్చిన భిక్షనుగూడా స్వీకరించలేదు.

ఆ రోజున ఖాసగతప్ప సద్గురుదేవుడు మరియు ఇతర శిష్యులు కలిసి అందరూ భుజించుచున్నప్పుడు ఖాసగతప్ప వారితో కలసి భుజించకపోగా, పైగా వారు భుజించిన ఉచ్ఛిష్ట అన్నమును (విస్తరులలోనిది) సేకరించుకొని సమీపములోని పంటచేనులోకి వెళ్లిపోయినాడు. విస్తరాకులలోని ఉచ్ఛిష్ట అన్నమును ఊర్చుకొని ఒకచోట కూర్చొని, సేవించుటకు సిద్ధపడగా ఇంతలో ఒక శునకము (కుక్క)వచ్చి సమీపములో నిలబడింది.ఖాసగతప్ప ఆ శ్వానమును దగ్గరకుపిలుచుకొని తాను సేకరించిన అన్నమును దానికి ఇచ్చినాడు. ఈ దృశ్యమును చూసిన ఇతర శిష్యులు ఆశ్చర్యపడినారు.

ఖాసగతప్ప ఇతర శిష్యులతో సహా భుజించేవాడు కాదు. కాకులు,కుక్కలు,తాను కలిసి ఉచ్ఛిష్టాన్నమును ఒకే విస్తరిలో భుజించేవారు.ఒకవేళ ఉచ్ఛిష్టాన్నము దొరకని రోజున ఊరిలోకి వెళ్లిగాని లేక ఇతర శిష్యులు సేవించగా మిగిలిన పాచిన లేక బూజుపట్టిన రొట్టెలు తెచ్చుకొని వాటితో జీవితము గడిపేవాడు. కాకులు, కుక్కలు, తాను కలిసి జీవించేవారు. ఖాసగతప్పయొక్క వ్యవహారమును చూసి సద్గురుదేవులయొక్క సన్నిహిత శిష్యుడైనట్టి చనమల్లప్ప ఇలా మందలిస్తాడు. ఏమయ్యా! పరిశుభ్రమైనట్టి వేడివేడి పక్వాన్నములను త్యజించి, పాచిన, బూజుపట్టిన ఉచ్ఛిష్టాన్నమును ఎందుకు భుజిస్తావు?

ఆయనకు ఖాసగతప్ప సమాధానమిస్తూ ఇలా అంటాడు. ఒకవేళ నేను షడ్రసోపేతమైన పక్వాన్నమును సేవించినట్లయితే నాలుకకు ఆ మధురమైన, రుచికరమైన పక్వాన్నముల సంబంధమగుటచేత లెస్సగా తింటుంది. అధికముగా ఆహారమును సేవించడమువలన అవయవములు సద్గురుసేవ,ధ్యానమునకు సహకరించకపోగా,పైగా దుఃఖమును కలుగజేస్తాయి. ఇంతేగాక ఒకసారి రుచికి అలవాటుపడిన మనసుయందు సంస్కారము ఏర్పడి మళ్లీమళ్లీ పక్వాన్నమును కోరును. తద్వారా అంతఃకరణము స్థిరతను కోల్పోయి దుఃఖమును కలుగజేయును.1.అధికముగా ఆహారమును సేవించుటవలన అవయవములు సద్గురుసేవయందు సహకరించవు. ౽.సంస్కారము దృఢమై రుచికరమైన పక్వాన్నమును భుజించవలయునని మనస్సు చంచలమై దుఃఖమునిస్తుంది. కావున, ఈ రెండు ప్రకారములైన దుఃఖములు ప్రాప్తమగును.అందుచే నేను పక్వాన్నములను త్యజించి ఉచ్ఛిష్టాన్నమును భుజిస్తున్నాను. అప్పుడు చనమల్లప్ప తనలో తాను ఇలా అనుకుంటాడు.

ఖాసగతప్పయొక్క జన్మ ధన్యము. ఈయన విరక్తి దృఢమైనది.ఇదే ప్రకారముగా నేను గూడా ప్రవర్తించుకుంటాను అని నిశ్చయించుకున్నాడు. ఈ ప్రకారముగా వ్యవహరించినట్లయితే సద్గురుకృప తప్పకుండా కలుగుతుంది. ఇంకా సంశయింపవలసిన అవసరము లేదు.

సద్గురుదేవుని దర్శనార్థము మఠములోనికి స్త్రీలు ప్రవేశించినచో ఖాసగతప్ప వారినిచూసి మఠమునువిడిచి దూరముగా వెళ్లిపోయేవాడు.స్త్రీలు తిరిగి మఠమునుండి వెళ్లిపోయేవరకు ఆయన తిరిగి వచ్చేవాడు కాదు. ఖాసగతప్పయొక్క వ్యవహారమును గమనించి, ఒకనాడు సద్గురుదేవుడు ఖాసగతప్పను దగ్గరకుపిలుచుకొని ఇలా అడిగినాడు.ఏమయ్యా!స్త్రీలనుచూసి ఎందుకలా భయపడి పోతావు? భేదబుద్ధిని వదులుము. అభేదజ్ఞానమును పొంది సర్వత్ర బ్రహ్మమునే దర్శించిన వారికి స్త్రీ, పురుష భేదము సంభవించదు. ఏ విధముగా పటమునందు చిత్రింపబడిన స్త్రీ, పురుష, వృక్ష, జంతు, నదీ, పర్వతాదులకు ఒకే పటము ఎలా ఆధారమో, అదే విధముగా నామరూప క్రియాత్మక ఈప్రపంచములోని స్త్రీ, పురుష, వృక్ష, జంతు, నదీపర్వతాలకు చైతన్యస్వరూపపరమాత్మయే ఆధా-

రము. అన్నిటియందు బ్రహ్మముయొక్క అస్తిత్వమే ఉన్నది.ఈవిధముగా బ్రహ్మభావన కలిగి భేద జ్ఞానమును వదులుము.

సద్గురుదేవునియొక్క వచనములను విని ఖాసగతప్ప స్వామితో ఇలా వేడుకుంటాడు.ఓ సద్గురుదేవా! బ్రహ్మాత్మలయొక్క ఏకత్వజ్ఞానము నాకు ఇంకా ప్రాప్తము కాలేదు. దయచేసి అటువంటి స్థితిని నాకు ప్రసాదించుము అని తన అభిప్రాయమును తెలుపుతూ–స్త్రీలను చూడగానే నామనసు యందు వికారభావముత్పన్నమగుచున్నది.ఎందుకనగా నాకు ఇంకా అభేద బ్రహ్మభావము కలుగ లేదు. అందుకనే నేను స్త్రీలను చూసి భయపడుచున్నాను. ఖాసగతప్ప తనయొక్క యథార్థ స్థితిని దాచుకొనకుండా చెప్పినందుకు సద్గురుదేవుడు చాలా సంతోషించినాడు. సద్గురుదేవుడు ఆనంద మొంది, ఈయనకు భవిష్యత్తులో తప్పకుండా బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలుగగలదని నిశ్చయించుకున్నాడు.

ఒకసారి ఖాసగతస్వామి జ్వరపీడితుడై బాధపడుచుండగా ఆయనకు చనమల్లప్ప రాత్రింబవళ్లు దగ్గర ఉండి ఉపచారము చేసినాడు. చనమల్లప్పయొక్క సేవకు ఖాసగతప్ప తన మనసులో చాలా దుఃఖించినాడు. నావలన చనమల్లప్పకుకూడా బాధకలుగుచున్నది గదా!నావలన మరెవరికి బాధకలుగకూడదని ఎవరికి చెప్పకుండా ఊరికి దూరముగా జనసంచారము లేని స్థలములో ఒక చెట్టుక్రింద విశ్రమించాడు. ఒక చినిగిన(జీర్ణమైన)వస్త్రమును పరుచుకొని పడుకున్నాడు. అక్కడున్నటువంటి రాళ్లు వగైరా శరీరమునకు గుచ్చుకున్నాగాని సహిస్తూ వాటిని లక్షపెట్టక పడుకున్నాడు. క్షణక్షణము జ్వరతాపము తీవ్రమగుచుండెను. అయినాగాని జ్వరముగూర్చిగాని, శరీరముగూర్చిగాని ఎలాంటి చింత చేయకుండా సదా సద్గురునామమును స్మరిస్తూ, సద్గురుదేవుని ధ్యానిస్తూ ఉన్నాడు. ఖాసగతస్వామికి ఒకే ఒక భయముండెను. ఏమనగా, మఠమునుండి ఎవరైనా మిత్రులు నన్ను వెతుకుతూ వస్తారేమో అని చింతిస్తూ పడిఉన్నాడు.నా కారణముగా ఇతరులకు బాధకలుగకూడదు. వారికి బాధ కలిగినట్లయితే నా జీవితనిష్ఠ వ్యర్థము కాగలదు. ఇతర ప్రాణులకు నా వలన బాధ కలిగితే నేను సహించలేను. ఎట్టి పరిస్థితుల్లో ఎవరికీ నా మూలముగా దుఃఖము కలుగవలదు. సాధ్యమైనంత వరకు సుఖమును కలుగజేసే ప్రయత్నమే చేయాలి.

ఇంతలో ఒక కాకి అరుచుకుంటూ ఖాసగతస్వామి దగ్గరకు వస్తుంటే, ఆయన అంటాడు. ఈ రోజు ఆహారము తీసుకురాలేదు.అయినాగాని నీవు ఈరోజు పస్తు ఉండేందుకు వీలులేదు.నా దేహమును నీకు ఆహారముగా ఇస్తాను,రా!తొందరగా రా!అని కాకిని ఆహ్వానించాడు.నేను భిక్షకోసము గ్రామములోకి వెళ్లినప్పుడు జనులు నానా ప్రకారముగా నిందజేస్తూ భిక్షవేస్తారు.ఎందుకు వ్యర్థమైన జన్మను ధరించావు?ఎవరింటికి వెళ్లినాగాని నిందజేయకుండా భిక్షవేయరు.అటువంటి నిందాయుక్తమైన భిక్షను స్వీకరించి దుఃఖించుట కంటె, ఈ అడవిలో పశుపక్ష్యాదులతో కలిసి జీవించడమే

మేలు. జనసమూహములో నివసిస్తే రాగద్వేషాలు కలిగి దుఃఖము కలుగును. స్త్రీలను చూసినప్పుడు మనసులో వికారము ఉత్పన్నమై అహర్నిశలు దుఃఖము కలుగును. ఇక్కడ వనములో ఉన్నట్లయితే రాగద్వేషములు కలుగుటకవకాశములేదు.సుఖముగా ఉండవచ్చును.కాని,సద్గురుదేవుని పాదపద్మ-ములకే అంకితమైన నామనస్సునకు సద్గురుదేవుని సన్నిధానమే ఆనందదాయకమనిపిస్తుంది. ఈ జ్వరతాపము తగ్గినాక మళ్ళీ సద్గురు సాన్నిధ్యమునకే వెళ్లి సద్గురుదేవుని సేవ చేసుకుంటాను అని అంత్య నిర్ణయము చేసుకుని, ఖాసగతస్వామి చింతిస్తుండగా—

అక్కడ ఆశ్రమములో ఏమి జరిగిందంటే–సిద్ధసద్గురుదేవునికి ఖాసగతప్ప అగుపించక పోయేసరికి సద్గురుదేవుడు చాలా చింతించినాడు. అప్పుడు శిష్యులందరిని పిలుచుకొని వారిని ఇలా అడుగుతాడు. నాయొక్క ప్రియమైన బాలుడు ఖాసగతప్ప ఎక్కడికి వెళ్ళినాడు. ఏమాత్రము గూడా దేహచింత చేయకుండా నా సేవయందే తత్పరుడై ఉండేవాడు. ఎక్కడున్నాడు చెప్పండి? నా పైననే సర్వభారము మోపి అణుమాత్రముగూడా దేహచింత చేయకుండా నిశ్చింతగా ఉండేవాడు. ఎక్కడున్నా తాను సుఖముగా ఉంటాడు. కాని, వాడినిగూర్చి నాకు చింత కలిగింది. అంటూ భక్త-రక్షకుడైన సద్గురుదేవుడు అశ్రుధారులు కారుతుండగా దుఃఖముతో విలపించాడు. ఈవిధముగా శిష్యులనుగూర్చి చెప్పుచున్నాడు. మీరందరూ ఇక్కడే ఆశ్రమముయందే ఉండండి.నేనొక్కడినే ఖాస-గతప్పను వెతికి తీసుకొస్తాను–అనుచు చనమల్లప్పను వెంటతీసుకొని బయలుదేరినాడు. జీవభావ-మును వ్యక్తముచేస్తూ విలపిస్తూ వెతుకుతున్నాడు. ఖాసగతప్పను అనేక చోట్ల వెతుకుతూ ఎదురైన వారిని అడుగుతూ మనసులో చింతచేయుచు పోవుచుండెను. ఖాసగతస్వామిని వెతుకుతూ వెతు-కుతూ చనమల్లప్ప మరియు సద్గురుదేవుడు ఇద్దరూ వనములో ప్రవేశించి ప్రతి చెట్లగుంపులో వెతుకుతూ ఉన్నారు. కాని, ఎచ్చటను ఖాసగతస్వామి కనిపించుటలేదు.

ఇక్కడ వృక్షము క్రింద ఖాసగతస్వామి ఆనందముగా సద్గురుదేవుని స్మరిస్తూఉండగా,దూర-మునుండి సిద్ధారూఢస్వామి ఖాసగతప్పను కనిపెట్టి పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. ఖాసగతప్పయే పడుకొని ఉన్నాడని ఎంతో ఆనందముతో పరుగెత్తుకొనివచ్చి,రెండుచేతులతో పట్టుకొని ఖాసగత స్వామిని లేపినాడు. సద్గురుదేవుడు అంటాడు. నా పుత్రుడవైన ఓ ఖాసగతా! నీవు లేనిచో నాకెంతో బాధ కలిగింది.ఎంతో ప్రయాసతో నిన్ను అడుగడుగునా వెతుకుతూ వస్తున్నాను. ఇప్పుడు ఇక్కడ లభించావా నాయనా! అంటూ హృదయము ద్రవించి దుఃఖము ఉప్పొంగి వచ్చి, దయాళువైన సద్గురుదేవుడు నేత్రములవెంట టప టపా అశ్రువులు రాల్చాడు.

ప్రేమయుక్త ఆలింగనముచేసుకొని, మమ్ములను విడిచి ఈఅరణ్యములోకి ఎందుకు వచ్చా-వు? ఎందుకిలా ఇక్కడ జ్వరతాపముతో దుఃఖిస్తున్నావు? మరియు నీయొక్క అభావముచేత మేము దుఃఖిస్తున్నాము. ఎందుకిలా చేస్తున్నావు? అని సద్గురు సిద్ధముని ఖాసగతస్వామిని విచారించగా,

అప్పుడు ఖాసగతస్వామి అంటాడు. లేదు స్వామీ! ఊరికే ఇలా రావాలని అనిపించింది. వచ్చాను, అంతే.

అప్పుడు చనమల్లప్ప అంటాడు. ఆయన జ్వరపీడుతుడై ఉండగా నేను ఉపచారము చేయడ-ము వలన ఖాసగతప్పకు బాధకలిగి ఇక్కడకు వచ్చాడు కాబోలు. ఇటువంటి వచనములను సద్గురు దేవునిద్వారా మరియు చనమల్లప్పద్వారా విని ఖాసగతప్ప వారిద్దరి చరణములపైవ్రాలి జరిగినదేదో జరిగిపోయింది. ఇకనైనా నన్ను క్షమించండి. నా అపరాధమును మన్నించండి అని ప్రార్థించి, ఇంకా ఇలా అంటాడు. ఈ నీచమైన శరీరము ఉండడము వల్లనే కదా మీరందరూ దుఃఖించడము–నేను దుఃఖించడము. అప్పుడు సిద్ధ సద్గురుదేవుడు అంటాడు.

ఖాసగతా!నీవు మమ్ములను విడిచి ఈవనమునకు రావడమువలన మాకందరికి దుఃఖము కలిగింది. ఇకముందు ఈ విధముగా చేయకుము. నీవు లేనిచో నాకు చాలా దుఃఖము కలుగును. ఈవిధంగా అంటూ సద్గురుదేవుడు ఖాసగతప్పను స్పర్శించాడు.వెంటనే జ్వరతాపము సమూలము గా దిగిపోయింది. తదనంతరము అందరు కలిసి సిద్ధాశ్రమమునకు బయలుదేరి చేరుకున్నారు.

ఇతర శిష్యులందరూ ఆనందమును పొందినారు.ఖాసగతస్వామియొక్క వైరాగ్యము అద్భుత మైనది. ఇటువంటి వైరాగ్యపరుడు చాలాదుర్లభము. ఆయన జన్మ ధన్యము. వైరాగ్యము ధన్యము. సద్గురు దేవులను ఖాసగతప్ప విడిచి వెళ్ళినాగాని, సద్గురుదేవుడు ఖాసగత స్వామిని వదలలేదు. ఆయన జన్మమే ధన్యము. చిన్నపిల్లవానినిగూర్చి తల్లి ఏ విధముగా వెతుకుతూ వెళ్తుందో, అదే విధ-ముగా సద్గురుదేవుడు ఖాసగతప్పను వెదకి వెదకి తీసుకొచ్చుకున్నాడు. సద్గురుదేవుని పూర్ణకృపకు పాత్రుడైనాడు. ఖాసగతప్ప ధన్యుడు ధన్యుడు–అని అందరూ అన్నారు. మరియు ఇతర శిష్యులందరూ ఆనందముతో అంటారు. ఈయనయొక్క వైరాగ్యస్థితిని చూచి సద్గురుదేవుడు సంతోషించినాడు. భక్తరక్షకుడైన సద్గురుదేవుడు ఎల్లప్పుడూ భక్తుల చిత్తమందే రమిస్తాడు. దయాసాగరుడైన సద్గురు నాథుడు తన, మన, ధనములను సద్గురుదేవునికి అర్పించి హృదయపూర్వకముగా సర్వస్వము సద్గురుదేవుడే–అని నమ్ముకుని ఎల్లప్పుడు అఖండముగా సద్గురుచింతనచేసిన భక్తులను పిలువ-కుండానే వెళ్లి ఆపదలనుండి రక్షిస్తాడు. ఇంతవరకు అపర వైరాగ్యయుక్తుడైన ఖాసగతప్పయొక్క కథను బోధించినాడు. రాబోవు అధ్యాయములో నిర్వాణప్పయొక్క చరిత్ర పరవైరాగ్యయుక్తమై, జ్ఞానరసమై ఉంటుంది.శ్రోతలు సావ- ధానచిత్తులై విని సద్గురు కృపకు పాత్రులు కాగలరు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచేతనే సకలపాపములు భస్మమైపోగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబది ఒకటవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.ఔ శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏబది రెండవ అధ్యాయము

పద్యానువాదము:−నిత్య తృప్తుడు, నిత్యముక్తుడు, ఉదారస్వరూపుడు, అపారగుణధాముడు అగు సిద్ధసద్గురుదేవులకు జయము జయము. సమస్త జనులచేత సేవింపదగినవాడు, భక్తుల హృదయమునగల తాపములను హరింపజేయు సద్గురుదేవులయొక్క చరిత్ర వర్ణింపనలవిగానిది.అయినా గాని,యథామతిగా బోధించుటకు ఆశీర్వదింపుము.ఎల్లప్పుడూ నామనసు(హృదయము) ప్రేమభరితమై, నీ పాద పద్మములయందే లగ్నమై యుండులాగున అనుగ్రహించుము స్వామీ!

ఓ సద్గురు సిద్ధారూఢ యతీంద్రా! నీవు స్వయంప్రకాశ స్వరూపుడవై, అనాద్యనంత, అవినాశి, జ్ఞానరాశి,అఖండ,అభయస్వరూపుడవై,సకలబ్రహ్మాండములను ప్రకాశింపచేయుచున్నావు.ఎల్లప్పుడూ స్వస్వరూపముయందు నిమగ్నుడవై ఉంటూ సర్వత్ర వ్యాపించియుండి భక్తులనిమిత్తముగా పరిచ్ఛిన్న రూపమును ధరించి సగుణుడిగా అవతరించినావు. సాంసారికభోగములను అనుభవించి, అనుభవించి వాటియందు సుఖము లభించక తిరుగా దుఃఖముల పాలయ్యి,మనసు విసుగుజెంది విషయ భోగములనుండి నివృత్తమైన మనసుతో,వాటినుండి విముఖులై విషయాలనన్నిటిని సంపూర్ణముగా వదిలేసి, నీ చరణకమలములను ఎవరైతే పూర్ణ విరక్తులై ఆశ్రయిస్తారో, అటువంటి భక్తులను నీవు ధన్యులనుజేస్తావు.

గత అధ్యాయమునందు వైరాగ్యయుక్తుడైన ఖాసగత స్వామియొక్క చరిత్రద్వారా విషయ ప్రవృత్తి సమూలముగా నివర్తించినవారికి జ్ఞానమార్గము అవశ్యముగా లభిస్తుందని తెలియజేయ బడినది. విషయాలనుండి భయపడి ఉండడము అపర వైరాగ్యమంటారు. ఇప్పుడు పరవైరాగ్యము గూర్చి చెబుతాను వినండి. విషయాలనుండి మనసు విముఖమైనను, విషయభోగ సంస్కారము చిత్తములో ఉంటుంది. ఆ భోగాసక్తి సమూలముగా నివృత్తి కావాలి. లేనిచో ఆరూఢ పతితులయ్యే సంభవముంది. కేవలము వైరాగ్యయుక్తుడై విషయవిరక్తిగలిగి జీవితాంతము కాలము వ్యతీతము చేసినా నిష్ఫలమే కాగలదు. సత్సంగము నాశ్రయించి సద్గురు సాన్నిధ్యములో సచ్ఛాస్త్రశ్రవణము చేయుటవలన వైరాగ్యము సార్థకమగును. అట్లయినచో ఏ ఉపాయముచేత నిర్భయవుడవుతాడు? మనసు నిర్విషయమౌవుతుంది? ఈ విషయము (ప్రసంగము) గూర్చి సద్గురు సిద్ధారూఢస్వామికి నిర్వాణస్వామికి జరిగిన సంవాదమును చెబుతాను−సావధానముగా వినగలరు.

కర్ణాటక దేశంలో 'ఉగరగోలు' అనే గ్రామంలో సద్గుణ సంపన్నుడు విరక్త పురుషుడు అయిన 'నిర్వాణప్ప' అను పేరుగల భక్తుడు, చిన్నతనమునుండి వైరాగ్యసంపన్నుడైయుండెను.చాలా రోజులు యోగాబ్యాసము చేసినాడు, కాని,యథార్థమైన సమాధానము–శాంతిని పొందలేదు. సద్గురుదేవుని ఆశ్రయించనిదే, ఆయన కృపలేనిదే సమాధానము కలుగదని నిశ్చయించుకొని 16 సంవత్సరముల ప్రాయంలో సద్గురుసిద్ధారూఢస్వామియొక్క కీర్తి వైభవమునుగూర్చి విని నేరుగా ఇల్లు వాకిలి విడిచి హుబ్లీ పట్టణమునకు వచ్చి,సద్గురుసిద్ధనాథుని కలుసుకున్నాడు సద్గురుదేవులకు సాష్టాంగనమస్కా-రములు సమర్పించుకొని వినమ్రుడై సద్గురు సాన్నిధ్యములో చేతులుజోడించి అత్యంత నిరభిమాన-యుక్తుడై నిలబడినాడు.నిర్వాణప్పయొక్క వినయవిధేయతలను,అత్యంత నిరభిమానస్థితిని మరియు అన్ని అధికారి లక్షణములను సద్గురుదేవుడు గమనించి, ఈయన యథార్థమైన అధికారి సాధకుడని తెలుసుకొని అప్పుడు అడుగుతాడు.

ఓ సద్భక్తుడా! నీవు ఏ కార్యనిమిత్తమై వచ్చినావు–తెలుపుమని అడుగగా–అప్పుడు సద్గురు దేవునితో నిర్మాణప్ప ఇలా అంటున్నాడు—దయానిధివైన ఓ సద్గురుదేవా! నీవు సర్వజ్ఞుడవు. నీకు తెలియని విషయమంటూ లేదు. నాయంతఃకరణ స్థితిని నీవెఱుగగలవు. అయినాగాని, నీవు అడిగి-నావు కావున, చెబుతాను. నేను ఈసంసారమందలి భోగములద్వారా ప్రాప్తమైన దుఃఖములను సహించలేక నీచరణకమలములను ఆశ్రయించినాను. సద్గురుసన్నిధానంలో సర్వదుఃఖములు భస్మ-మై పోయినవి. ఇక మళ్ళీ ఆ సంసారంలో పడి మృత్యువునకు ఆహుతియగుట నాకిష్టం లేదు. నీవు నాయొక్క అవస్థను తెలుసుకుని నన్ను కరుణించి చేరదీసి, నీ చరణసాన్నిధ్యంలో నాకు కొంచెము స్థానమిచ్చి,నన్ను తరింప చేస్తావని నిన్ను ఆశ్రయించినాను. నన్ను స్వీకరించండి సద్గురుదేవా! అని ఆర్తహృదయంతో వేడుకున్నాడు నిర్వాణప్ప. అప్పుడు సద్గురు దేవుడు నిర్వాణప్పయొక్క ప్రార్థన ఆలకించి ప్రేమ పూర్వక మధుర వచనముల చేత ఇలా పలుకుతాడు.

సరే నాయనా!ఒకవేళ నీకు సంసారమునుండి తరించాలనే యిచ్ఛ దృఢముగా ఉన్నట్లయితే, నీవు ఎల్లప్పుడూ నా సాన్నిధ్యంలో ఉండి, వేదాంత శ్రవణము చేసినచో, నీయొక్క సర్వదుఃఖములు సమూలముగా నివృత్తి కాగలవు. సద్గురుదేవునియొక్క ఆప్తవచనములను విని నిర్వాణప్ప సంతో-షించి,సద్గురుదేవుడు నాహృదయమును గుర్తించి నన్ను కరుణించి అభయమొసంగినాడు.ఇక నాకు ఏ విధమైన భయము లేదు–అని నిశ్చయించుకొని, నిర్భయుడై స్వామిచెంత ఉండిపోయినాడు.

ఈవిధముగా సద్గురుదేవుని ఆజ్ఞనుసారముగా మఠములో ఆనందంగా ఉంటున్నాడు. ప్రతి రోజు సద్గురుదేవుని ముఖకమలముద్వారా వేదాంత శ్రవణముచేస్తున్నాడు. కొంతకాలమునకు సర్వ సంశయములు నివృత్తమై, పూర్వము ప్రదీప్తమైయుండిన సకలవృత్తులు ఉపశమించి,ప్రశాంతచిత్తు-డైనాడు.చీకటిగదిలో దీపము వెలిగించినట్లైనది. హృదయకుహరములోని అనాద్యజ్ఞానాంధకారము

నివర్తించినది. నిర్వాణప్ప, శ్రవణముచేసిన వేదాంత విషయమును ఏకాంతముగా మననంచేస్తూ సద్గురువాక్యములను శ్రద్ధతోచింతనచేస్తూ,యథార్థమైన నిస్సంశయఆత్మానందమునొంది,వేరే సంకల్పములేకుండా నిశ్చలంగా ఉండిపోయినాడు.శ్రద్ధాభక్తులచేత సద్గురుసేవచేస్తూ జడవస్తువులను గూడా హింసించకుండా దయార్ధ్రహృదయుడై, సకలభూతములయెడ ప్రేమతో వ్యవహరించాడు.

ఒకానొక రోజున నిర్వాణప్ప హృదయమందు అత్యంత భయభక్తులుగలిగి సద్గురు సిద్ధారూఢ స్వామికి సాష్టాంగ ప్రణామములు చేసి దీనభావముతో ఈ విధముగా అడిగినాడు. ఓ సద్గురునాథా! దీనదయాళా!నీయొక్క కరుణాకటాక్షమువలన నేను చాలాలాభము పొందినాను.జననమరణరూప తాపత్రయములు సమూలముగా నివృత్తమైనవి. అయినాగాని, నాకొక సంశయము కలిగింది. ఒక వేళ మీరు కరుణించి ఆ సంశయ నివృత్తిగూర్చి అడుగుటకు ఆజ్ఞయిచ్చినట్లయితే నీ పాదపద్మముల చెంత విన్నవించుకుంటాను, అని వేడుకున్నాడు. అప్పుడు భక్తరక్షకుడు, దయాళువైన సద్గురుదేవుడు ఆ వాక్కులను విని నిర్వాణప్పయెడల దయగలిగి ఇలా అంటాడు.

ఓ నిర్వాణప్పా!ఏమాత్రము భయములేకుండా నీకుగలిగిన సంశయమును యిప్పుడే అడుగుము.ఒకవేళ దానికి సమాధానము చెప్పగలిగితే, నీసంశయ నివృత్తికి ఉపాయమును బోధించగలను. అప్పుడు నిర్వాణప్ప సద్గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి, మనసులో పూర్ణధైర్యమును చేబూని దీనవదనముచే తనయొక్క సంశయమును విన్నవించుకుంటాడు.ఓసద్గురుదేవా!నాయంతఃకరణమునందు సంకల్పవికల్పరహితస్థితి (గుణరహితస్థితి) ఏ ఉపాయముచేత కలుగుతుంది. దయ చేసి చెప్పండి స్వామీ!నేను విషయసేవనమును పూర్తిగా వదిలేసినాను.స్థూలదేహము నాశ్రయించుకొని ఉన్న సూక్ష్మశరీరము (అంతఃకరణమునందు)విషయవాసనలు దారుణముగా ఉన్నాయి.విషయ సేవనము వదిలినా,విషయవాసన నివృత్తమగుట లేదు. తద్వారా త్రిగుణాత్మకమైన మనసు వికారమునొంది, చాలా దుఃఖమునిస్తుంది. గుణయుక్తమైన మనసులో వాసనలు (పూర్వసంస్కారము వలన) చెలరేగి మనసు విషయములను నిరంతరము చింతన చేయుచున్నది. విషయములు ఎదుట లేకున్నను వాటిని స్మృతికి తెచ్చుకొని చింతన చేయుచున్నది. అందువలన పరమాత్మ విచారమునకు ప్రతిబంధకము కలిగి మనసు క్షణకాలముగూడా స్థిరములేక, చంచలమై క్షణక్షణము దుఃఖమునిచ్చుచున్నది.కావున,చిత్తమునందు వాసనలు క్షీణించి సంకల్పరహితస్థితి అఖండముగా ఉండాలంటే ఏమి చేయాలి? దయచేసి తెలియజేయండి.

నిర్వాణప్పయొక్క జిజ్ఞాసపూర్వక దీనవచనములను విని సద్గురుదేవుడు ఆనందమునొంది, ఈయన నిజమైన అధికారిలక్షణములు కలిగియున్నాడని తెలుసుకొని, నిర్వాణప్పయొక్క సంశయ నివృత్తికి ఉపాయమును తెలియజేయుచున్నాడు. నీయొక్క అపరవైరాగ్య స్థిరత్వమువలన ఇటువంటి సంకల్పము కలిగింది.ఇప్పుడు పరవైరాగ్యమును తెలుసుకొని తద్వారా నిర్వికారస్వరూప ఆత్మను

పొందవలెను. "నేను, నాది" అను ఈ వ్యవహారమువలన ఆత్మయందు బంధము కల్పింపబడినది. వాస్తవముగా ఆత్మ నిత్యముక్తము. త్రిగుణాలతోయుక్తమైన సంకల్పవికల్పాత్మకమైన మనస్సే బంధ-మునకు, మోక్షమునకు కారణము. ఈ త్రిగుణములు ప్రకృతికి చెందినవి, కాని ఆత్మకు చెందినవి కావు. నేను శరీరధారిని–అని ఈవిధముగా భావించుటయే ఆత్మఘాతకము చేసినట్లు. జీవత్వ-ధర్మములను అజ్ఞానాధ్యాసచేత ఆరోపించుకొని ఆత్మను విస్మరించడము జరుగుతుంది. ఇంద్రియ తాదాత్మ్యమువలన పంచభూతములయొక్క కార్యమైన పంచవిషయాలయందు రమించి, విషయ లోలుడై, నిర్బలుడై, భయభీతిని పొందుతున్నాడు. అజ్ఞానముచేత విషయాలయందు ప్రవృత్తుడు కావడమువలన విషయము ప్రాప్తించినప్పుడు రాగము, అప్రాప్తమైనప్పుడు ద్వేషము కలిగి, జీవుడు దృఢముగా విషయాలకు వశగతుడై భోగసంస్కారరూపవాసన దృఢమై,ఆ విషయవాసనలనుండి బయటపడలేక బద్ధుడైనాడు. ఒక విషయమువలన లభించిన సుఖముతో తృప్తిపడక అధికసుఖము కోసము మరొక విషయప్రాప్తికై ప్రయత్నించి దుఃఖమును అనుభవిస్తాడు. ఈవిధముగా ఎన్ని విష-యాలననుభవించిననూ పూర్ణసుఖము లభించక, అసంతృప్తుడై తీవ్రదుఃఖములకు గురియగుచు-న్నాడు. అనేక జన్మలయందు విషయాలననుభవించి, తత్ఫలితముగా విపరీతమైన దుఃఖములను అనుభవిస్తూ, మళ్ళీమళ్ళీ అనేక యోనులందు తిరుగుతూ–సుకృతవిశేషమువలన పరమాత్మయొక్క కృపచేత మానవజన్మ లభించి, మనుష్యత్వము ప్రాప్తమై, మహాపురుషుల సాంగత్యము లభించును. తదనంతరము యుక్తాయుక్త వివేకముదయించి, విషయసుఖములను త్యజించి, దుఃఖముయొక్క లేశసంబంధములేని నిర్విషయక నిరావృత పరిపూర్ణ నిరతిశయమగు శాశ్వతమైన ఆత్మసుఖమును కోరుతాడు. సత్పురుషుల సాంగత్యమును ఆశ్రయించి, దేహేంద్రియాదులకతీతుడౌతాడు.

**శ్లో ॥ న దేహో నేన్ద్రియ ప్రాణో న మనోబుద్ధ్యహఙ్కృతిః ।**

**న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమాదికం జగత్ ॥** (వరాహోపనిషత్ 3-18)

బోధకుయోగ్యమైన అధికారిలక్షణములుగల ఓ నిర్మాణప్ప(సచ్ఛిష్యా!)ఇంతవరకు నీవు(అపర వైరాగ్యముద్వారా) జ్ఞానమార్గముద్వారా సకల విషయములయందు మోహబుద్ధిని నివృత్తిచేసికొని విషయములను త్యజించినావు. పునర్జన్మకు హేతువైన విషయభోగముల సంస్కారము అంతఃకర-ణములో దృఢముగానున్నది, ఆ సంస్కారము ఇతర సాధనలద్వారా నివృత్తి కాదు. అందువలన, కేవలము యథార్థమైన ఆత్మజ్ఞానమువలననే వాసనాక్షయము గలిగి, తద్వారా జీవుడు సద్గురు కృపచేత భవబంధవిముక్తుడగును.

**శ్లో ॥ జన్మాంతరశతభ్యస్తా మిథ్యాసంసారవాసనా ।**

**సా చిరాభ్యాసయోగేనవినా న క్షీయతే క్వచిత్ ॥** (ముక్తికోపనిషత్ 2-14)

**శ్లో ॥ అసంగవ్యవహారత్వాద్భవభావనవర్జనాత్ ।**

**శరీరనాశదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే ॥**

**వాసనాసంపరిత్యాగాచ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్ ।** (ముక్తికోపనిషత్ ౨-౨౮)

**తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవ చ ।**

**మిథః కారణతాం గత్వా దుఃస్సాధ్యాని స్థితాన్యతః ।**

**భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేతత్సమాచర ॥** (అన్నపూర్ణోప. 4-81 & ౮౨)

**శ్లో ॥ వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే ।**

**సమకాలం చిరాభ్యస్తా భవన్తి ఫలదా మతాః ॥** (ముక్తికోపనిషత్ ౨-10)

**శ్లో ॥ దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్ ।**

**సంపన్నంచేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః ॥** (మహోప. ౨-38; యో.వా. 1-3-6; వే.పం.౨-64)

*(ఇంకా ఈ విషయములో అన్నపూర్ణోపనిషత్ 4 మరియు 5 వ అధ్యాయములు, ముక్తికోపనిషత్ ౨ వ అధ్యాయము మరియు శ్రీ యోగవాసిష్ఠము ఉపశమప్రకరణము ౭౨ వ సర్గను అవలోకించదగినది)*

ఇట్టి, సద్గురుదేవులయొక్క అమృతవాక్కులను విని నిర్వాణప్ప మనసులో ఎంతో ఆనందమును పొందినాడు. తదనంతరము చేతులుజోడించి వినమ్రుడై సద్గురుదేవులకు నమస్కరించి ఈ ప్రకారముగా అడుగుతాడు.

ఓ సద్గురుదేవా! ఇటువంటి అమోఘమైన ఆత్మజ్ఞానమును నేను ఏ సాధనలద్వారా పొంద గలను? దయచేసి తెలుపండి. అప్పుడు సద్గురు సిద్ధనాథుడు శిష్యునియొక్క వాక్కులను విని, ఓ సచ్ఛిష్యా! చెబుతాను సావధానముగా వినుము. ఏ ఆత్మజ్ఞానమువలన వాసనాక్షయము కలుగునో, దాని నిజస్వరూపమును తెలుపుతాను విను.

జీవుడు,కేవలము వస్తుమాత్రమైన తనయందు మూలావిద్య మరియు తత్కార్యమైన నామమాత్రము, అసత్యము, ఎండమావులవలె కేవలము ప్రతీతిమాత్రమైన ప్రపంచమును కల్పించుకొని, దాని గుణ-దోషాలను సత్యమనుకుంటున్నాడు.వాస్తవముగా నామరూపాలు యథార్థములు కావు. నామరూపములను తెలుసుకొనే నీవు సత్యస్వరూపుడవు. నీకంటె భిన్నమైన వికారయుక్తమైన,పరిణామశీలమైన ఈదేహాది ప్రపంచమును తెలుసుకునే నీవు నిర్వికారస్వరూపుడవు. శరీరరహితుడవు. జాగ్రత స్వప్న సుషుప్తి మొదలుకొని మూడవస్థలకు సాక్షివై, మూడు శరీరములకు ద్రష్టవై, పంచకోశములకు అతీతుడవై, స్వయంప్రకాశస్వరూపడవై, వీటన్నిటికి భిన్నముగాయుండి వీటిని తెలుసుకొనుచున్నావు. నీవే ఆత్మవు. నీవే సాక్షి స్వరూపడవు. జాగ్రదవస్థయందు "నేను నాది"అను వ్యవహారముచేస్తున్న స్థూలదేహాభిమాని జీవుడు విశ్వుడు.స్వప్నములో కతృత్వభోక్తృత్వములను ఆపాదించుకొని సూక్ష్మశరీరమును అభిమానించేవాడు తైజసుడు. సుషుప్తిలో అజ్ఞానరూప కారణ శరీరమును అభిమానించే ప్రాజ్ఞుడు. త్రిపుటియుక్తమగు ఈ మూడు అవస్థలలో విశ్వతైజసప్రాజ్ఞులుగా

వ్యవహరింపబడే నీవే అన్నింటినీ ప్రత్యక్షముగా తెలుసుకుంటున్నావు. సాక్షి స్వరూపుడవైన తురీయ ఘనుడవు నీవే ఉన్నావు. జాగ్రత స్వప్న సుషుప్త్యవస్థలను అభిమానించి, వాటియొక్క స్ఫురణ ఎంతవరకు ఉంటుందో, అంతవరకు అది అజ్ఞానకార్యమే. ఆత్మజ్ఞానము కాదు.

కావున, ఓ శిష్యరత్నమా!ఆత్మజ్ఞానముయొక్క లక్షణములను తెలుపుతాను, సావధానచిత్తుడవై వినగలవు. ఆ ఆత్మజ్ఞానమును పొంది సాధకుడు స్వయముగా తనను తాను తెలుసుకున్నవాడవుతాడు. ఇక ఆయనకు కర్తవ్యము(విధి)ఉండదు. ఆత్మజ్ఞానము ఎవరికైతే కలుగుతుందో,వారు అనుభవపూర్వకముగా ఈ విధముగా అంటాడు. ఇంతవరకు నేను జగత్తనే స్వప్నమందు ఉంటిని. అదే యథార్థమని భ్రమజెందితిని. అదొక స్వప్నతుల్యమే–అని నిశ్చయించుకుంటాడు.ఈ జగత్తు(దేహము)సృష్టికి పూర్వము ప్రాగభావముగలదై ఉంది. జగత్తు లయమైన పిదప ప్రధ్వంసాభావము గలదై ఉంటుంది. ఏది ఆద్యంతములు గలదై ఉండునో, అది మిథ్య.

**స్వప్నమాయే యథా దృష్టే గన్ధర్వనగరం యథా ।**

**తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః ॥** (మాం. కా. వైతథ్యప్ర. ౨-31)

**ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ।**

**వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః ॥** (మాండూక్య కారికా వైతథ్యప్ర. ౨- 6)

కావున, మిథ్యారూప జగత్తును అపేక్షించి కల్పింపబడిన కాలముకూడా మిథ్యయే. కావున, ఈ జగత్తును, కాలత్రయములను తెలుసుకుంటున్న ఏకైకస్వరూపుడను నేనొక్కడినే సత్స్వరూపుడను. నిర్వికారుడను.

**శ్లో ॥ దేశకాలాన్యవస్తూనాం కల్పితత్వాచ్చ మాయయా ।**

**న దేశాదికృతోఽన్తోఽస్తి బ్రహ్మోనన్త్యం స్ఫుటం తతః ॥** (వే. పం. 3-36)

గారడివాని విద్యచే కల్పించబడిన గంధర్వనగరము మొదలగువానిచేత ఆకాశమునకెట్లు యథార్థమైన పరిచ్ఛేదము లేదో, అట్లే, మాయాకల్పిత దేశకాలవస్తుకృతపరిచ్ఛేదము బ్రహ్మమునకు లేదు. కావున, బ్రహ్మమునకు అనంతత్వము యుక్తినిబట్టియు స్ఫుటమగుచున్నది.

ఏదేది ప్రతీయమానమై ఉంటుందో,అది నాకంటె భిన్నముగా లేదు.అది కేవలము నాయొక్క స్వరూపమే. *(అధ్యస్తము అధిష్ఠానముకన్న భిన్నముగా ఉండదు-దృష్టిసృష్టివాదము)* సర్వమునూ నేనే. నాయందు ద్వైతమునకు తావులేదు. ప్రతీతియగుచున్నదంటే–అది గొడ్రాలుకొడుకువలె అసత్తు.కేవలము నామమాత్రమే.త్రైకాలికాభావముగల ఈజగత్తు(దేహము)స్త్రీపుత్రాదులచే నామమాత్ర కాల్పనిక వ్యవహారము జరుగుచున్నది. ఒకవేళ నేను ఆకాశసదృశ ఆత్మస్వరూపుడనని అనుకుంటే, ఈ శరీరము ప్రతీతి కాదు. ఒకవేళ నేను దేహధారిని అని అనుకుంటే, అది హాస్యాస్పదమే అవుతుంది.

**అధ్యస్తస్యకుతోతత్త్వమసత్యస్య కుతో జనిః ।**

**అజాతస్య కుతో నాశః ప్రారబ్ధమసతః కుతః ॥** (అధ్యాత్మోపనిషత్ 58)

**దేహాదీనామసత్వాత్తు యథా స్వప్నో విబోధతః ।**

**స్వప్నదేహో యథాధ్యస్తస్తథైవాయం హి దేహకః ।** (నాదబిందూపనిషత్.23,24,25)

**అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావే హి తత్కుతః ॥** (అపరోక్షానుభూతిః 93;

**రజ్జుఖణ్డే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి ।** (నాదబిందూపనిషత్ 27, 28)

**అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపఞ్చః శూన్యతాం గతః ॥** (అపరోక్షానుభూతిః 96)

**బ్రహ్మాదిస్తమ్బపర్యన్తం మృషామాత్రా ఉపాధయః ।**

**తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్ ॥**

**స్వయం బ్రహ్మా స్వయం విష్ణుః స్వయమిన్ద్రః స్వయం శివః ।**

**స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కిఞ్చన ॥**

**స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తునిరాసతః ।**

**స్వయమేవ పరం బ్రహ్మా పూర్ణమద్వయమక్రియః ॥**

**అసత్కల్పో వికల్పోఽయం విశ్వమిత్యేకవస్తుని ।**

**నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః ॥**

**ద్రష్టృదర్శనదృశ్యాదిభావశూన్యే నిరామయే ।**

**కల్పార్ణవ ఇవాత్యన్తం పరిపూర్ణే చిదాత్మని ॥**

**తేజసీవ తమో యత్ర విలీనం భ్రాన్తికారణమ్ ।**

**అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః ॥**

**ఏకాత్మకే పరే తత్త్వే భేదకర్తా కథం వసేత్ ।**

**సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః ॥** (అధ్యాత్మోపనిషత్ 19 నుండి 25)

**విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే ।**

**ఆత్మనో బ్రహ్మణోర్భేదమసన్తం కః కరిష్యతి ॥** (జాబాలదర్శనోపనిషత్ 4-63; వి.పు. 6-7-96)

**క్వ గతం కేన వా నీతం కుత్రలీనమిదం జగత్ ।**

**అధునైవ మయా దృష్టం నాస్తి కిం మహదద్భుతమ్ ॥** (అధ్యాత్మోపనిషత్ 65)

ఒకవేళ నేను కర్తృత్వమును ఆపాదించు కుంటే, నాయందు కరణము లేదు. దేహమే లేదు. కావున,కార్యము జరగదు.కరణము మరియు కార్యము రెండు సిద్ధించనప్పుడు కర్తృత్వమెలా సిద్ధించును? కావున, నేను కర్తను కాను. భోక్తను కూడా కాదు. కర్మఫలమును భోగించుటకు నాకు ముఖము లేదు. బోగించుటకు నాకంటే అన్యమైన వస్తువే లేదు. సర్వత్ర సర్వవ్యాపకమై నిండినిభిడీకృతమై ఉన్న నాకు భోజనము భోజ్యము ఎక్కడిది?నేను భోక్తనెట్లగుదును? సకలేంద్రియముల

ద్వారా మిథ్యావ్యవహారము జరుగుచున్నదని అనుభవమునకు తెచ్చుకొని నామమాత్రమునకు బాహ్యములో వ్యవహరిస్తాను. చిత్రవిచిత్రములుగా ప్రతీతియగు ఈ జగద్రూపముగా నేనే భాసిస్తు-న్నాను. ఏవిధముగా ఘటము మృత్తికారూపమే ఉంటుందో, అదే విధముగా జగద్రూపముగా సర్వత్ర నేనే ఉన్నాను. అన్ని రూపాలలో నేనే భాసిస్తున్నాను–అని ఈ విధంగా సాక్షిగా ఉండి చూస్తాడు.

**నాహం కర్తా న భోక్తా చ న బాధ్యో న చ బాధకః ।**

**ఇత్యసఙ్గనమర్థేషు సామాన్యాసఙ్గనామకమ్ ॥** (అక్ష్యుపనిషత్ 22)

**న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్ ।**

**చిద్రూపోఽసి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర ॥** (అష్టావక్రగీత 15-4)

**ఉపాదానం ప్రపఞ్చస్య మృద్భాణ్డస్యేవ పశ్యతి ।**

**అజ్ఞానంచేతి వేదాన్తైస్తస్మిన్నష్టే క్వ విశ్వతా ॥**

**యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్ ।** (అపరోక్షానుభూతిః 94,95)

**తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః ॥** (నాదబిందూపనిషత్ 25,26,27)

ఇటువంటి యథార్థమైన ఆత్మజ్ఞానము ఏ ఉపాయముచేత ప్రాప్తమగునో చెబుతాను వినుము. ఓ సచ్ఛిష్యా!అహర్నిశలు నిరంతరము నామజపము చేయడమే ఏకైక ఉపాయము.పరమాత్మ యొక్క నామజపమువలన అంతఃకరణము శుద్ధమై దేహాభిమానము సమూలముగా నివృత్తమై తీవ్ర తర అభ్యాసబలముచేత చిత్తము స్థిరపడి ఏకాగ్రతను పొందును. ఏకాగ్రచిత్తమందు (శుద్ధాంతః కరణములో) తనయొక్క యథార్థ స్వరూపమును తెలుసుకోగలుగుతాడు. "అదే నేను నేనే అది" ఈ అభేదచింతనద్వారా "సోఽహంభావము" కలిగి అంతట పరిపూర్ణమైన తన యథార్థస్వరూపమును (బ్రహ్మమును) దర్శిస్తాడు. ఏదేని సూక్ష్మ వస్తువు(విషయము)మనసులో స్ఫురిస్తే దృఢనిశ్చయమైన "సోహంభావము"చేత దర్శించినట్లయితే ద్వైతభావన నివర్తించి, పూర్ణమైన యథార్థమైన ఆత్మస్థితి స్థిరపడుతుంది. ధ్యేయవస్తువుయొక్క ధ్యానము చేస్తూ, ధ్యానమునకు విషయమైన తానే (ఆత్మ) ధ్యాత అవుతాడు. కాని, ధ్యాత, ధ్యానము, ధ్యేయము ఈ త్రిపుటిలో తానే భాసిస్తూ స్వరూపాకార వృత్తిగలిగి నిజస్థితిని పొందుతాడు.ఈప్రకారమైన ధ్యానమును ఎల్లప్పుడూ ఏకాంతములోకూర్చుండి చేయవలెను. ఒక క్షణకాలముగూడా వృథా కాకుండా "సోహంభావన" యందే నిలకడగలిగి ఉండ వలెను. ఇటువంటి దృఢాభ్యాసముచేత తనయొక్క నిజస్వరూపమైన ప్రత్యగభిన్నపరమాత్మ, సహ-జముగా అనుభవమునకు వస్తుంది. ఆ అనుభవములో నేను శరీరమునని ఎప్పుడుగూడా ప్రతీతి కాదు. ఇక శరీరేతర నామరూప ప్రపంచముకూడా అత్యంతాభావమగును. ఇటువంటి నిరంతర దృఢాభ్యాసముచేత సోఽహంభావము అపరోక్షముగా అనుభవమునకు వచ్చినచో, వాసనారూప అనర్థము సమూలముగా నివృత్తమై అపరోక్షానుభూతి కలుగును. ఇటువంటి అద్భుతమైన బోధను

సద్గురు ముఖకమలముద్వారా యథార్థముగా శ్రవణముచేసి,తదాకారవృత్తిగలిగి,క్షణకాలము నిర్వి-కల్పస్థితిని అనుభవించి,తనయొక్క అనుభవమును, నిర్వాణప్ప–సద్గురుదేవునికి చెప్పుచున్నాడు.

**దృశిస్వరూపం గగనోపమం పరం,**

**సకృద్విభాతం త్వజమేకమక్షరమ్ ।**

**అలేపకం సర్వగతం యదద్వయం**

**తదేవ చాహం సకలం విముక్త ॐ ॥** (ముక్తికోపనిషత్ 2-73; ఉపదేశసాహస్రి 10-1)

జ్ఞానస్వరూపమును, ఆకాశమువలెనసంగమును,ఒకసారి సద్గురుప్రసాదమువలన స్ఫురించి సర్వదా భాసమానమును, జననమరణరహితమును,ఏకము,సకలవికారపదార్థగతదోషరహితము-ను, సర్వగతమును, ద్వైతవర్జితమునగు పరబ్రహ్మమే నేను. కావున, నిత్యముక్తుడను,ఓంకార లక్ష్య-మునగుదును.

ఓ సద్గురుదీననాథా! నేడు నేను కృతార్థుడనయ్యాను. అనాథుడనైన నన్ను నీయొక్క యథా-ర్థమైన జ్ఞానబోధచేత రక్షించి కరుణించి ధన్యుణ్ణి చేసినావు. సద్గురుదేవునియొక్క కృపకు పాత్రుడైన నిర్వాణప్ప ఎల్లప్పుడూ సద్గురు ముఖకమలముద్వారా శ్రవణముచేసిన వేదాంత జ్ఞానమును ఏకాంతములో మననముచేస్తూ ఆత్మయందే విశ్రమించేవాడు. సద్గురుదేవునిద్వారా దృఢజ్ఞానమును పొంది, యథార్థమైన సంపూర్ణమైన ఆత్మజ్ఞాని అయ్యాడు.

తదనంతరము పంచీకరణమనే వేదాంతగ్రంథమునొకదానిని రచించి సద్గురుదేవులకు సమ-ర్పించాడు. సురసమైన ఆ ఉత్కృష్ట గ్రంథము ముముక్షువులకు సులభమైన జ్ఞానసాధనముగా ఉప-కరించగలదు. నిర్వాణప్పయొక్క ప్రజ్ఞావిశేషము దానియందు గనందగును. ఈ అధ్యాయము అన్ని అధ్యాయములకన్న శ్రేష్టమైనది. శ్రవణముచేసిన వారికి, పఠించిన వారికి సద్గురుదేవుని కృప తప్పకుండా కలుగుతుంది. యథార్థ ఆత్మజ్ఞానము ప్రకటము కాగలదు. దయాసాగరుడైన సద్గురు దేవుని కృపకు పాత్రుడైన భక్తుడు ఎలాంటి వ్యథలు లేకుండా, ఈ ప్రపంచములో భయరహితుడై, జననమరణరూప సంసారమునుండి తరింపబడి విముక్తులగుదురు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణమాత్రముచేత సకలపాపములు భస్మమైపోవును. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబది రెండవవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నారు. ॐ శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏబది మూడవ అధ్యాయము

పద్యానువాదము:–ఓ సద్గురుదేవా! ఈ భవసాగరమునుండి తరింపజేయుటకు నీవొక్కడవే సమర్థుడవు.నీయొక్క పదపంకజములనాశ్రయించుటచేత ఈజగత్తులో సకలభయములు నిరసించి, సకల అనర్థములు నివృత్తి కాగలవు. కావున, నీవు ఎల్లప్పుడూ నా హృదయగుహలో వసించి నన్ను రక్షింపుము.

సకలవేదశాస్త్రములద్వారా స్తుతింపబడుటకు యోగ్యుడవైన, నిరాకారస్వరూపుడవైన, చైత-న్యఘనస్వరూపుడవై, ఈ జగత్తునకు ఆధారభూతుడవై, నిర్గుణ స్వరూపుడవైయుండిగూడా భక్తులను తరింపజేయుటకై సగుణసాకార రూపములో ప్రకటమైనావు.నీకు జయము జయము. కేవలము నీయొక్క నామస్మరణచేతనే భక్తులు భవసాగరమునుండి తరించగలరు. ఎవరు తమ అంతఃకరణ మునందు నీయొక్క నామమును ధరించి ఉంటారో,వారికి నీవు సర్వదా అండగానుండి కలిమాయ యొక్క భయము లేకుండాజేసి రక్షిస్తావు. ఎల్లప్పడు నీయొక్క దివ్యనామమును ఉచ్చరించినట్లయితే (ఆశ్రయించినచో) సకల సంసారదుఃఖములనుండి తరించి సుఖమును పొందగలరు. నీవు తప్ప భక్తులకు వేరే ఆశ్రయము లేదు. అందుకనే నిన్నే ధ్యానించి, నిన్నే ఆశ్రయించినాము. భవసాగరము లో మునకలు వేస్తూ, నిన్ను ఆశ్రయించిన అజ్ఞాని జీవులను నీయొక్క కృపాదృష్టిచేత భవసాగరము నుండి తొందరగా రక్షించినావు. నీవే సర్వస్వమని సంసారమునుండి తప్పకుండా తరింప చేయగ-లవని దృఢవిశ్వాసముతో నిన్ను ఆశ్రయించిన భక్తులను నౌకాస్వరూపుడవైన నీవు దయచేసి రక్షిస్తావు.

ఓ శ్రోతలారా! అతి రహస్యమైన సద్గురు సిద్ధారూఢ చరిత్రను సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. కేవలము సద్గురుదేవుని చరిత్ర శ్రవణము చేసినచో సకలతాపములు నివర్తించి, సుఖ-సుఖ శాంతులను పొందగలరు.

సముద్రతీరమునగల కుందాపురమనే గ్రామములో శ్రీధర్ అనే పేరుగల తెలివైన బ్రాహ్మణు-డొకడుండేవాడు. ఆయనయొక్క భార్య లక్ష్మీబాయి. ఆమెకు సిద్ధారూఢ సద్గురుదేవుని పట్ల చాలా శ్రద్ధ ఉండెను. ఎందుకనగా, ఆమె కన్యకగా ఉన్నప్పుడు ప్రతిరోజు సిద్ధసద్గురుదేవుని దర్శించుకునేది. ఆమె తల్లిగారిల్లు హుబ్లీపట్టణమే. కావున, ప్రతిరోజు సిద్ధాశ్రమమునకు వెళ్లి సద్గురుదేవులను కలుసు

కొని,ఆయన చరణములకు నమస్కరించి అత్యంతభక్తి శ్రద్ధ ప్రేమచేత ఆరూఢస్వామిని దర్శించుకొని పునీతురాలాయెను.ఇంతలో ఆమెకు వివాహము జరిగింది.అత్తవారింటికి వెళ్లే సమయమాసన్నమైనది. లక్ష్మీబాయి సద్గురుదేవుని వద్దకువచ్చి యథా ప్రకారముగా దర్శించి, భారమైన హృదయముతో దీనవదనురాలై, వినమ్రురాలై ఈ విధముగా ఆమెయొక్క బాధను చెప్పుకుంటుంది. నీవు మావులీ (తల్లి) స్వరూపుడవు. ఈనాటినుండి మన మధ్య వియోగము సంభవిస్తుంది. నాయందు ఎల్లప్పుడూ నీయొక్క కృపనుంచవలసింది. మిమ్ములను విడిచి చాలా దూరము వెళ్ళవలసి వస్తుంది. మీయొక్క వియోగమును భరించలేకున్నాను. కావున, మీయొక్క ఆశీర్వాదము ఎల్లప్పుడూ మాపైన ఉండవలసింది. ప్రతిరోజు మీయొక్క దివ్య దర్శనము ద్వారా పునీతురాలనయ్యే దానిని. సద్గురుదేవా! ఇప్పుడు దూరముగా మా అత్తగారింటికి వెళ్లి నిన్ను సేవించకుండా ఎలా జీవించగలను. నాయొక్క ఆర్త నాదమును తెలుసుకొని నన్ను కాపాడుము.

ఆ అమ్మాయియొక్క ప్రార్థనను ఆలకించి సద్గురుదేవులు ఆమె దుఃఖనివృత్తిగూర్చి ఉపాయమును బోధిస్తాడు. ఎల్లప్పుడు మీయొక్క గృహములో మీ ఇష్టదేవతను పూజించి, భజించండి అని ఆజ్ఞాపించినాడు. ఈప్రకారముగా నిత్యము,నియమముతప్పకుండా ఆచరించినచో నీయొక్క బాధలన్నీ నివృత్తమై సద్గురుదేవుడు తప్పకుండా రక్షిస్తాడు. నీకు సమాధానము కూడా లభిస్తుందని ఆశీర్వదించాడు. సద్గురుదేవునియొక్క అమృత వచనములను విని లక్ష్మీబాయి ఆనంద పరవశురాలై ప్రణామములు సమర్పించి ఆశీర్వాదమును పొందినది. ఎల్లప్పుడు నీ పాదదర్శనమును అభిలషిస్తున్న నన్ను తప్పకుండా రక్షించవలసిందని ఏడుస్తూ, సద్గురుదేవుల ఆజ్ఞను తీసుకొని ప్రయాణమునకు సంసిద్ధురాలయింది. మాతాపితరులను విడిచి అత్తగారింటికి వెళ్ళుచున్నప్పుడు ఆమెకు తల్లిదండ్రుల గూర్చి అంతగా బాధ కలుగుట లేదు. కాని, సద్గురుదేవుల యొక్క వియోగము చాలా దుఃఖమును కలిగించినది. సద్గురుదేవుని ఆజ్ఞను గైకొని అత్తవారింటికి వెళ్లిన పిదప సద్గురుదేవుల ఆజ్ఞానుసారముగా తమ ఇష్టదేవతను ప్రతినిత్యము పూజిస్తూ, భజిస్తూ, సద్గురుమూర్తిని హృదయములో ధరించి స్వామియొక్క ధ్యానమందే తత్పరురాలై యుండెను.

ఇట్లు, గృహస్థధర్మమును నిర్వహిస్తూ, పతిసేవచేస్తూండగా, కొంత కాలమునకు శివరాత్రి పర్వదినము సమీపమునకు వస్తుండగా, ఒకనాడు లక్ష్మీబాయి తన భర్తతో తనయొక్క అభిప్రాయమును ఈ విధముగా విన్నవించుకుంటుంది. ఏమండీ! హుబ్లీ పట్టణములో శివరాత్రి పర్వదినమున సిద్ధారూఢ మఠముయందు గొప్పఉత్సవము జరుగుతుంది. ఆ ఉత్సవమును దర్శించుటకు దూర దూర ప్రాంతములనుండి అనేకభక్తులు తండోపతండములుగా వచ్చి సద్గురుదేవుడగు సిద్ధారూఢస్వామియొక్క నామసంకీర్తనలయందు పాల్గొంటారు.హరిదాసులు మొదలగువారు స్వామి ముందు నామఘోషలు, సంకీర్తనలు, సద్గురుదేవుని మహిమ వర్ణనము చేస్తుంటారు. ప్రతినిత్యము సప్తాహ-

ములో ఉదయము వేదాంత శ్రవణము, అద్వైత జ్ఞానబోధ జరుపబడును. మధ్యాహ్నము వేలకొలది మందికి మహాప్రసాదమును అందజేస్తారు.సాయంకాలము సద్గురుదేవులయొక్క మహాపూజా విధానము జరుపబడును. ఇంకా ఎంతని వర్ణించను–ఆ ఉత్సవ వైభవమును స్వయంగా వెళ్లి కనులారా చూస్తేగానే తనివి తీరదు. ఈ ప్రకారముగా ఏడు దినములు ఆ ఉత్సవము అఖండముగా జరుగును. కావున,ఓ పతిదేవా! ఇద్దరము వెళ్లి ఆ దివ్యమైన ఉత్సవమును, సద్గురుదేవుని సందర్శించి వస్తాము పదండీ! వర్ణించరాని ఆ ఉత్సవము అఖండముగా ఏడు రోజులు సిద్ధాశ్రమమందు జరుగును. ఏడవ రోజున బ్రహ్మాండముగా రథోత్సవముజరుగుతుంది.ఆరోజున సద్గురుసిద్ధనాథుని దివ్యముగా అలంకరించినటువంటి రథముపై కూర్చుండబెట్టి ఊరేగింపుజేస్తారు. అటువంటి ఉత్సవమును దర్శించిన నేత్రములు ధన్యము కాగలవు. కావున, ఓ ప్రాణనాథా! వైభవోపేతమైన ఆ ఉత్సవమును దర్శించి తరించడానికి పవిత్రమైన సమయమాసన్నమైనది. కావున, మనము తప్పకుండా వెళ్లి ఉత్సవములో పాల్గొని వస్తాము పదండీ! అని సౌమ్యముగా వినమ్రురాలై లక్ష్మీబాయి తనయొక్క అభిప్రాయమును భర్తకు విన్నవించుకున్నది.

అప్పుడు ఆమెయొక్క భర్త శ్రీధర్ ఇలా అంటాడు. ఓ కాంతామణీ! నీవు చెప్పింది సత్యమే కావచ్చు. కాని, పోవుటకు సమయము దొరకదు కదా! ఎందుకంటె, నా ఉద్యోగమే అలాంటిది. అంతదూరము వెళ్ళుటకు వీలుకాదు. కాని, ఇక్కడికి సమీపములో ఉన్నటువంటి గోకర్ణ క్షేత్రములో గూడా శివరాత్రి సందర్భముగా ఘనంగా ఉత్సవము జరుగుతుంది. అనేక వేలజనము వస్తుంది. చాలా పవిత్రమైన స్థలమున్నది. అక్కడికి పోదాములే–అంటాడు.

అప్పుడు లక్ష్మీబాయి అంటుంది. ఓ ప్రాణసఖా! గోకర్ణలోని దైవము జడము. పిలిచిన పలుకడు. కాని, ప్రత్యక్షదైవ స్వరూపుడైన సద్గురుదేవుని దర్శనము కలుగుతుంది. మరియు భక్తులతో ప్రేమతో మృదువుగా మాట్లాడుతాడు. ఒక్కసారి ఆ సద్గురుదేవునియొక్క ముఖకమల దర్శనమైతే చాలు–జన్మజన్మాంతరములయొక్క పాపములన్నియు సమాప్తము కాగలవు.మరియు సద్గురుదేవుని పాదదర్శనమే చేసుకున్నట్లయితే, హృదయములో నిరతిశయ ఆనందము ప్రకటమగును. ఆయనయొక్క అమృతవచనములను శ్రవణము చేసినచో, అంతఃకరణములోని అనేక జన్మల వాసనారూప పాపసంస్కారములన్ని పటాపంచలై,అంతఃకరణము పరిశుద్ధమై సుఖశాంతులుచేకూరగలవు.సద్గురుదర్శనముద్వారా సాక్షాత్పరమశివుని దర్శించినట్లే అనిపిస్తుంది. ఆయనయొక్క కృపాదృష్టి మనపై పడినచో మన హృదయములో నిరతిశయ ఆనందము ప్రకటమవుతుంది. జన్మ ధన్యమౌతుంది. సద్గురుదేవుని హృదయములో ధరించి ప్రేమపూర్వకముగా ఉత్సవమును వర్ణించుచుండగా హటాత్తుగా లక్ష్మీబాయియొక్క నేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రకటమైనవి. ఆమెయొక్క ఉత్కటమైన,

తీవ్రతర అపేక్షను గుర్తించిన శ్రీధర్ యొక్క మనసు ద్రవించినది. అప్పుడు తన భార్యతో ఇలా అంటాడు.

సరే! నీకు అంతగా ఉత్కటమైన ఇచ్ఛ ఉంటే నిశ్చయముగా వచ్చే శుక్రవారము రోజున పొగ పడవలో (స్టీమర్ లో) కూర్చుని హుబ్లీకి పోదాములే, అని ఆశ్వాసనమిచ్చినాడు. తన భర్తయొక్క వచనములను విన్న లక్ష్మీబాయికి అమృతమువలె సమాధానము దొరికింది. ప్రయాణమునకు కావలసిన సామగ్రులను సర్దుకుని ప్రయాణమునకు సంసిద్ధులై స్టీమర్ (పెద్దనౌక)పై ఎక్కినారు. ఆమె అనుకున్నట్లుగా ప్రయాణము జరుగుతున్నందుకు ఆమె హృదయము ఆనందముతో పొంగిపోవు చుండెను. ప్రయాణము చేస్తూ రాత్రింబవళ్లు సద్గురుదేవునియొక్క దివ్యనామమును భక్తితో పదేపదే స్మరించుచుండెను.సద్గురుదేవుడు ఆమెకు అన్నిదిశలనుండి దర్శనమిచ్చుచున్నట్లుగా అనుభూతికలుగు చుండెను. సద్గురు నామామృతముయందు తన్మయురాలైన ఆమెకు–సముద్ర తరంగములు ప్రవహిస్తుంటే, సద్గురుదేవులు ఉప్పొంగుతున్న ప్రేమహృదయముతో నన్ను ఆశీర్వదించుచున్నాడని అనిపించింది. స్టీమర్ యొక్క యంత్రము శబ్దము చేస్తుంటే పూజాస మయములో భక్తులందరూ సద్గురు దేవుని స్తుతిచేస్తూ జయఘోషలు పలుకుతున్నట్లు అనిపించింది. ఆ నౌకలోని వేలమంది ప్రయాణీకులు అందరుగూడా సద్గురుదేవుని ఉత్సవ కార్యక్రమమునకే వచ్చుచున్నట్లు భావించింది. ఈ విధముగా తన్మయస్థితిలో సద్గురుదేవులను భజిస్తూ, ఆనంద హృదయముచేత పరవశించి పోతున్నది.

ఆ స్టీమర్ అతివేగముగా వెళుతున్నది. దానికి ఎదురుగా మరొక స్టీమర్ (నౌక) వేగముతో వచ్చి,వీరి నౌకకు ఢీకొని భయంకరమైన శబ్దముత్పన్నమైనది.ఏ నౌకయందైతే లక్ష్మీబాయి కూర్చుని ఉందో, అది రెండుగాపగిలి చీలిపోయింది.ప్రయాణీకులందరూ నౌక మునుగుచున్నదని భయము చేత దుఃఖితులైనారు. జనమంతా పిచ్చివారివలె వారి ప్రాణరక్షణ కోసము ఇటునటూ పరిగెత్తుచున్నారు. ఏమీ తోచక పక్కనే ఉన్నటువంటి రెండవ నౌకను తమతమ పిల్లలతోసహా ఆశ్రయించినారు.

నౌకయొక్క స్థితిని గమనించి దీనియందుంటే ప్రాణహాని కలుగగలదని, తనయొక్క ప్రాణరక్షణ కోసము, తన భార్యనుకూడా నౌకలోనే వదిలేసి, శ్రీధర్ ఒక్కడే రెండవ నౌకలోకి వెళ్లి పోయినాడు. ఆ రెండవ ఓడలోనికి పోయినాక, ఒకానొక ప్రయాణికుడు శ్రీధర్ ని విచారిస్తాడు. ఏమయ్యా! నీవొక్కడివే ఉన్నావు. నీ భార్యయేది?ఆమెను తీసుకురాలేదా?అప్పుడు శ్రీధర్ అంటాడు. నా ప్రాణరక్షణగూర్చి నేను పరుగెత్తుకొని వచ్చాను. ఆమెకోసము నేను వెతికితే నా ప్రాణాలే పోయే అవకాశముంది. ఇక ఆమెను గూర్చి ఏ చోట వెదకమన్నావు. మరియు ఒకవేళ నేను బ్రతికి ఉంటే నేను వేరే స్త్రీని వివాహమాడి సుఖముగానుండగలను గాని, నేనే చనిపోయినాక ఏమి ప్రయోజనము. ఆమెగూర్చి నేను చనిపోతే నన్ను నేను మోసగించుకున్నట్లేయగును.

ఇక్కడ లక్ష్మీబాయి ఉన్నటువంటి ఓడ మెల్లమెల్లగా మునుగుచున్నది. అటు ఇటు ఊగిసలా-డుతుండగా నీరు లోన ప్రవేశించెను. ఎప్పుడైతే నీరు ఓడలో ప్రవేశించిందో, అప్పుడు లక్ష్మీబాయికి స్పృహ వచ్చి కళ్ళు తెరిచి చూసింది. అంతవరకు సద్గురు స్మరణలోనే మగ్నమై ఉండెను. అటునిటూ చూసింది. ప్రయాణికులెవరును లేరు. తన భర్త కూడా లేడు. జనమంతా ఒకరి పైనొకరు పడుతూ ప్రాణరక్షణకోసము రెండవ నావను ఆశ్రయిస్తున్నారు.ఎక్కడ పోవాలో లక్ష్మీబాయికి దారిదెలియ-కుండెను. సద్గురు నామోచ్చారణ చేస్తూ తన భర్త కోసము అక్కడే నిలబడి నలువైపులా వెతికి చూసింది. కాని, ఆయన కానరాలేదు. ఆ నావను విడిచి వెళ్లడానికి దారి దొరకలేదు. అప్పుడు ఆమె తన భర్త కోసము అటు ఇటు చూస్తుండగా ఆమెకు అకస్మాత్తుగా ఒక బాలుడు ఆమెకు సమీపములో కనబడినాడు. ఆ బాలుని తల్లిదండ్రులు వారి ప్రాణరక్షణ కోసము, అతనిని విస్మరించి అక్కడే విడిచి గాబరాగా(గడపడగా)వెళ్ళిపోయినారు.అప్పుడు నీటిలో మునిగి పోతున్న ఆ చంటిబిడ్డను లక్ష్మీబాయి ఒక్కసారిగా దుమికి ఆ బాలుని తన ఒడిలోకి తీసుకున్నది. తనయొక్క ప్రాణాలను లెక్కచేయక దయార్థ్రహృదయముచేత ఆ బాలుని రక్షించింది. ఇంతలో నావలోకి అత్యధికముగా నీరు ప్రవేశించి జలముతో నిండి జలమయమైంది. ప్రయాణీకులంతా రెండవ నావను ఆశ్రయించినారు. లక్ష్మీబాయి ఒక్కతె మాత్రమే ఈ పడవలో ఉండిపోయింది. నౌక జలమయమైనది. దిక్కుదోచలేదు. కాపాడే వారు లేరు.ఈసంకటసమయములో ఆసద్గురుదేవుడుతప్ప నన్ను రక్షించు దాతలు లేరని మనమున నిశ్చయము చేసుకొని, సద్గురునామాన్ని ఉచ్ఛరిస్తూ నిశ్చింతగా ఉండిపోయింది. రెండవ నావలోకి పోవుటకు ఆశ్రయముగానున్న నిచ్చెనకూడా అకస్మాత్తుగా విరిగింది.లక్ష్మీబాయి ఆనౌకలోనే చిక్కు-కుపోయింది. క్షణక్షణమునకు నీరు అధికమవుతుంది. నౌకతోపాటు ఆమెకూడా సముద్రములో మునిగిపోయే సమయమాసన్నమైనది. నీరు నాభివరకు ఆవరించింది. బాలుని తన భుజములపై ఎత్తుకొని రెండు చేతులతో బిగ్గరగా పట్టుకుంది. అప్పుడు ఆర్తస్వరముతో సద్గురుసిద్ధారూఢస్వామిని గొంతెత్తి ప్రార్థిస్తున్నది.

హే సద్గురునాథా! హే దయానిధే! నన్ను ఈ జలనిధిలో ఎందుకు ఉంచినావు? నేను జల-ములో మునిగి పోవుచున్నాను. బయటకు వెళ్ళుటకు దారిలేకుండా ఉన్నది. నాభర్త నాచెంత లేడు. ఆయన ఎక్కడ వెళ్లిపోయినాడో జాడ తెలియదు. రెండవ నావకూడా దూరంగా వెళ్లిపోయింది. ఈ క్లిష్టపరిస్థితుల్లో నేనేమి చేయాలి? ఈ బాలుని రక్షించుటకు వెళ్లేలోగా ఉన్న కాస్త నిచ్చెన విరిగి పోయింది.రెండవ నావను ఆశ్రయించుటకు మార్గములేదు. ఇటువంటి ప్రాణసంకట సమయములో నీవు తప్ప నాకింకెవరు దిక్కు? ఓ సద్గురు దేవా! తొందరగా వచ్చి నన్ను రక్షింపుము.ఒకవేళ నన్ను రక్షించుటకు నీకు కనికరము లేకపోయినను, కనీసము ఈ బాలుని కోసమైనా తొందరగా వచ్చి మమ్ములను రక్షించ రాదా!

**సంసారసాగర నిమజ్జన ముహ్యమానం దీనం విలోకయ విభో కరుణానిధే మామ్ ।**
**ప్రహ్లాదఖేద పరిహార పరావతార లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్ ॥**

ఈ విధమైన ఆమెయొక్క ఆర్తవచనములను దయాసాగరుడైన సద్గురుదేవుడు విని, అక్కడి-కక్కడే ప్రత్యక్షమై, ఒక చిన్న పడవలో కూర్చుని లక్ష్మీబాయి సమీపమునకు వచ్చాడు. లక్ష్మీబాయి చేతులలోనున్న బాలుని సద్గురుదేవుడు తన అమృతహస్తములద్వారా తీసుకొని పడవలో కూర్చుండ బెట్టి, పిదప తనయొక్క అమృతహస్తమును లక్ష్మీబాయికి చేయూతగా ఇచ్చి తన చిన్న పడవలోనికి మెల్లగా తీసుకొని, కూర్చుండబెట్టుకున్నాడు. ఇట్లు,సద్గురుదేవుడు వారిద్దరిని మెల్లగా పెద్ద నావవద్దకు తీసుకెళ్లి ఓడలో వీరిని ఎక్కించినాడు. బాలుని ఒడిలో ఎత్తుకొని లక్ష్మీబాయి పెద్ద నావలోకి (స్టీమర్ లోకి) ఎక్కింది.

ఇంతలో–ఎప్పుడైతే సద్గురుదేవుడు బాలుని లక్ష్మీబాయిని ఓడలోకి ఎక్కించాడో, అంతలోనే చిన్న పడవతోసహా సద్గురుదేవుడు అదృశ్యమైనాడు. అందరు ప్రయాణీకులు ఆశ్చర్యచకితులైనారు.ఈ మాయ ఏమిటో ఎవరికి అర్థం కాలేదు.

అప్పుడు ఆ బాలునియొక్క తల్లి పరిగెత్తుకుంటూ వచ్చి లక్ష్మీబాయియొక్క పాదములు పట్టు కొని, ఈవిధముగా విలపిస్తూ అంటుంది. అమ్మా! నీవు సాక్షాత్ దేవి స్వరూపముగా వచ్చిన పర-మాత్మవు. నీవు నాబిడ్డను రక్షించుటకే వచ్చిఉంటావు అని వేడుకుంది.అప్పుడు లక్ష్మీబాయి ఆబాలుని తన తల్లి చేతులకిచ్చి,తన భర్తకోసము అటునిటు వెదకసాగింది.ఆమె భర్త తానుచేసిన పొరపాటుకు సిగ్గుపడి తలవంచుకొని కనిపించకుండా ఒకమూలకు దాగుకొనియున్నాడు.అప్పుడు ఎవరో ఒకరు ఆయనను పట్టుకొని ఆమెవద్దకు తీసుకొచ్చాడు.అప్పుడు లక్ష్మీబాయి ఎంతో దీనురాలై పతిభక్తి పరా-యణురాలై భర్తయొక్క చరణములకు ప్రణామములు చేసినది. మరియు ఇలా అంటుంది. ఏమండీ! చూశారా!సద్గురుదేవుడు మన ఆర్తనాదమును విని,అతి తొందరగా పరిగెత్తుకుంటూవచ్చి మనలను ఈ ప్రాణాపాయమునుండి రక్షించాడు.

ఆమెకుగల ప్రేమానురాగమును,భక్తిని అందరు ప్రత్యక్షముగా దర్శించినందున అందరియొ-క్క అంతఃకరణము ద్రవించి ప్రేమహృదయముతో కన్నీరుకార్చినారు.లక్ష్మీబాయి తన భర్తవద్ద కూ-ర్చుని జరిగిన వృత్తాంతమును అంతా సవిస్తరముగా వినజెప్పింది. కాని, ఆయనపట్ల ఎలాంటి దుర-భిప్రాయము పెట్టుకుని దూషించలేదు.

ఆమె చెప్పినదంతా విని శ్రీధర్ ఇలా అంటాడు.నా ప్రాణరక్షణ కోసము స్వార్థబుద్ధిచేత నిన్ను సంకటపరిస్థితుల్లో వదిలేసి పలాయనమైనాను.నేను చాలాదుష్టుడిని నన్ను క్షమించు లక్ష్మీ! ఇప్పటికీ దైవవశాత్తు మళ్లీ నిన్ను కలుసుకోగలిగాను.నేను చాలాధన్యుడనైతిని. మనము సద్గురుకృపకు పాత్రు- లమైనాము. లక్ష్మీబాయి, పతియొక్క పశ్చాత్తాప బుద్ధికి సాంత్వన (ఊరడింపు) చెప్పింది.

పోనీలెండి! ఒకసారి పొరపాటైందని అన్నారు కదా! చాలు. మళ్ళీ మళ్ళీ పొరపాటైంనదని అనకండి. నేనేమీ అనుకోవడం లేదు కదా! అని సమాధానపడింది.

శ్రీధర్ అంటాడు–నీయొక్క అచంచలమైన భక్తి మూలముగా శ్రీ సద్గురుదేవుడు నిన్ను ఆపద-లోనుండి రక్షించి అదృశ్యమైనాడు.దీనియందు కించిన్మాత్రముగూడ సంశయములేదు.సద్గురుదేవుని మహిమను కేవలము భక్తులే తెలియగలరు. కాని, ఇతరులకు శక్యము కాదు–అని సద్గురుదేవుని గుణగణములను,కీర్తిని,మహిమలను వర్ణించుకుంటూ సద్గురు నామస్మరణచేస్తూ మిగతా ప్రయాణ-మును క్షేమంగా ముగించుకొని, గోవారేవులో దిగి, అక్కడనుండి రైలుద్వారా హుబ్లీ పట్టణమందు సిద్ధాశ్రమమునకు చేరుకొని, సద్గురుదేవుని కలుసుకొని, అపరిమితానందముతో స్వామియొక్క పాదదర్శనముము చేసుకున్నారు.

సద్గురు సిద్ధారూఢస్వామియొక్క దర్శనమువలన లక్ష్మీబాయియొక్క హృదయములో ఆనం-దము పట్టలేక తొణకిసలాడసాగింది. ఆనందాశ్రువులు రాల్చుతూ, సద్గురుదేవునితో మార్గములో జరిగిన వృత్తాంతమును సవిస్తరముగా తెలియజేసింది.

సద్గురుదేవుడు ఆమెయొక్క విషయమంతా విని, ఇట్లు అంటున్నాడు. అమ్మా! తల్లీ! నీవు ధన్యురాలివి. నీయొక్క భక్తి శ్రద్ధలు నామస్మరణకు దయాఘనుడైన సద్గురుదేవుడు నిన్ను కరుణించి కాపాడినాడు. సకలభూతములయొక్క అంతరంగమున విరాజమానమై ప్రకాశిస్తున్న,ఆ అంతర్యామి సద్గురుదేవుడు నిన్ను సంకటమునుండి కృపావంతుడై కాపాడినాడు–అని ఆమెను సమాధాన పర-చినాడు. సద్గురుదేవునియొక్క ఆశీర్వచనములను విని లక్ష్మీబాయి అంటుంది.

సద్గురునాథా! నాకు సిద్ధాశ్రమమును విడిచి నీయొక్క పరమపావనమైన సాన్నిధ్యమును వదిలి మళ్లీ తిరిగి వెళ్లేందుకు నా మనసు ఒప్పుకోవడము లేదు–అని చెప్తూ ఎల్లప్పుడూ నీ సాన్ని-ధ్యములోనే ఉండాలని కోరింది.

ఈ ప్రకారముగా ఉత్సవ కార్యక్రమము పూర్తి అయ్యేవరకు అక్కడే హుబ్లీ సిద్ధాశ్రమమందే ఉన్నారు. ఉత్సవవైభవమును తిలకించారు. కార్యక్రమము ముగిసిన పిమ్మట సద్గురుదేవుడు ఇద్దరు దంపతులను చెంతకుపిలుచుకొని వారిని ఆశీర్వదిస్తూ,ఎల్లప్పుడూ ఇలాగే భక్తిశ్రద్ధలతో సద్గురుదే-వుని స్మరిస్తూ మీగ్రామములోనే ఉండండి.సద్గురుదేవుడు సర్వదా మిమ్ములను అనుసరించి కాపాడు గాక! సమయభేదమును లక్ష్యపెట్టక మీకు ఆనందానుభూతిని ప్రసాదించి,కళ్యాణమును చేకూర్చి రక్షిస్తాడు. సద్గురు ఆశీర్వచనములను విని లక్ష్మీబాయియొక్క చిత్తము ప్రశాంతతను పొందింది.

తదనంతరము ఉత్సవవైభవమును తిలకించి సద్గురుదేవుని ఆజ్ఞను తీసుకొని,వారి స్వగ్రా-మమునకు చేరుకొని అహర్నిశలు సద్గురు చింతన చేస్తున్నారు. ఎల్లప్పుడూ వారి చెంతనే ఉన్నట్లు

భావించి, ఎల్లప్పుడూ ఆనందానుభూతిని పొందుతున్నారు. ఈ విధముగా దయాలువైన సద్గురు కృపకు పాత్రులైన భక్తులు అనాయాసముగా భవసాగరమునుండి తరింప బడగలరు.

ఓ శ్రోతలారా! ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధానచిత్తులై వినండి. శ్రీధరుడనే జీవునికి సద్భక్తి అనే లక్ష్మీబాయి(భార్య)ద్వారా సద్గురునాథుని (పరమాత్మ)యొక్క ప్రాప్తి కలుగును.లక్ష్మీబాయి పెళ్లి చేసుకుని గృహస్థసంసారములో పడినట్లు సద్భక్తి జీవునితోకలిసి,భవసాగరములోనున్న జీవున్ని సద్గురుదేవునివద్దకు తీసుకెళుతుంది.భవసాగరములోనుండి తరింపగోరి,జీవుడు సద్గురు(పరమాత్మ) ప్రాప్తినికోరి వక్రమార్గము నవలంబించి,ఆసక్తిరూప(ఓడ)సాధనను చేపడతాడు.ఈవిధమైన సాధనల నవలంబించి, భవసాగరములో ప్రయాణము కొనసాగించుచున్న జీవునియొక్క ఆసక్తిరూపనౌకను మరొక విరక్తిరూప నౌక వచ్చి ఢీకొని(ఘర్షణ జరిగి) ఆసక్తిరూప నౌకను భేదిస్తుంది. జీవుడు వెంటనే సద్భక్తిని విడిచిపెట్టి, దంభాచారయుక్తమైన విరక్తిని ఆశ్రయించాడు.కాని,జీవునికి అంతఃకరణములో సమాధానము కలుగలేదు. ఎందుకనగా, యథార్థమైన సద్భక్తి నివృత్తమైనది.

అప్పుడు సద్భక్తి ఏమి చేస్తుందంటే–దయారూపమైన(బాలుని)ధరించి (ఉత్పన్నము) చేసుకుని, ఆసక్తిరూప నౌకలో మునిగిపోవుచుండెను. జీవునికి సద్గురుప్రాప్తి అయితే దూరమే అయ్యింది. పైగా దాంభిక విరక్తినవలంభించినాడు. కావున, సమాధానము దొరుకుట లేదు.

ఇక్కడ సద్భక్తి భవసాగరములో మునిగి ప్రాణాపాయ సమయములో చూపరానివారిపై దయ (రాగము) చూపి (దయనుఆశ్రయించి) జలధిలోముంచు ఆసక్తినుండి బయటపడే మార్గములో (నిచ్చెన)సమయమును పోగొట్టుకొని ఆసక్తియందే చిక్కుకొనిపోయి భవసాగరములోనే మునిగి పోయే ప్రసంగము వచ్చినది.అప్పుడు ఇక గత్యంతరములేక సద్గురుదేవునికి మొరపెట్టుకొనగా, సద్గురుదేవుడు కరుణించి తత్క్షణమే వేంచేసి, దయాయుక్తమైన భక్తిని(ఇద్దరినీ) ఆసక్తిరూప నౌకనుండి రక్షించి, జీవునితో సంబంధము ఏర్పరచినాడు. ఎప్పుడైతే భక్తిరూప భార్య ప్రాప్తించినదో, సమాధా-నము లేకుండా ఉన్న జీవునికి, సమాధానము దొరికి ఎంతో ఆనందమును పొందినాడు. అప్పుడు జీవుడు మరియు భక్తి ఇద్దరూ సద్గురుదేవుని కృపకు పాత్రుడై మళ్లీ మునగకుండా సద్గురుదేవుని చేరు కున్నారు. సద్గురుదేవుడు వారిని ఎల్లప్పుడూ సద్గురు నామస్మరణ చేయండి. మీకు ఏ సంకటములు రాకుండా, ఆ సద్గురుదేవుడు కాపాడగలడని ఆశీర్వదించాడు.అదే ప్రకారముగా జీవుడు,భక్తి నిరం-తరము సద్గురు చింతనచేసి సద్గురు కృపకుపాత్రులై, సద్గురునామజపముచేస్తూ భవసాగరము నుండి తరించారు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృత శ్రవణ మాత్రముచే సకలపాపములు భస్మమై పోగలవు. శ్రీ సిద్ధారూఢ సద్గురు చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబది మూడవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.ఔ శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.





ౘ శ్రీ గణేశాయ నమః ౘ శ్రీ గురుభ్యోనమః ౘ శ్రీ సరస్వత్యై నమః

# ఏబది నాలుగవ అధ్యాయము

పద్యానువాదము:-జ్ఞానానందమును పొందుటకు సచ్ఛిష్యుడు సద్గురుప్రాప్తిగూర్చి చాతక పక్షివలె అహర్నిశలు పరితపించినచో, జ్ఞానామృత వర్షబిందువులు తప్పకుండా కురుస్తాయి. సకల జీవులయొక్క సమిష్టి పుణ్యపాపకర్మనిమిత్తక సంసారముయందు తగులుకున్న జీవుల యథాగతిని సద్గురుదేవుడు సాక్షిగా ఉండి చూస్తుంటాడు. ఎవరికైతే సంసార తాపత్రయములచేత పీడింపబడి విసుగెత్తి వాటినుండి బయటపడాలనే(శుభేచ్ఛ)వివేకరూప సద్గుణముదయిస్తుందో,వారు సద్గురుకృపకు పాత్రులై భవబంధమునుండి విముక్తులై పరమసుఖస్వరూపమగు మోక్షమును బడయగలరు.

శ్రీ సిద్ధారూఢ సద్గురుదేవుడు భక్తులను తరింపజేయు నిమిత్తముగా లీలామాత్రుడుగా హుబ్లీ పట్టణముయందు అవతరించినాడు.ఆయనయొక్క నామస్మరణ ఎల్లప్పుడూ చేసినట్లయితే జీవభావమునుండి విముక్తిగలిగి బ్రహ్మస్వరూపాన్ని పొంది, కాలాతీతమైన నిత్యముక్తస్వరూపాన్ని పొందుతాడు. ప్రేమ, భక్తులచేత ప్రతినిత్యము సద్గురు నామస్మరణము, జపము, గుణగణములను కీర్తించినట్లయితే దయాసాగరుడైన సద్గురుదేవుడు భవరోగమును నివృత్తి చేయగలడు. నామస్మరణ, భక్తికి మించిన శ్రేష్ఠమైన సాధనాంతరము లేదు. యథార్థమైన చైతన్యస్వరూప పరమాత్మను పొందుటకిదే సుగమమార్గము. సకలసాధనలలో భక్తి-శ్రేష్ఠమని పురాణములు, వేదములు మరియు సంతుమహాత్ముల చరిత్రలుగూడా చెబుతున్నాయి.సద్గురుభక్తికన్న శ్రేష్ఠమైన అన్యసాధనలేదని శ్రోతలు యథార్థముగా తెలుసుకొని,దీనినే ఆశ్రయించి తరించగలరు.సకలసౌఖ్యములలో భక్తిద్వారాపొందే సుఖమే ఉత్తమమైనది, సులభమైనదికూడా. భక్తులయొక్క సాంగత్యమే శ్రేష్ఠము. అదియే పరమానంద దాయకము. ఇటువంటి సత్సంగ సుఖముద్వారా అనర్థమునకు హేతువైన భ్రమబుద్ధి నివృత్తమై, సకల దుఃఖములు సమూలముగా నష్టమై అలౌకికానందమును జీవుడు పొందగలడు.

ఓ శ్రోతలారా! దేనిని శ్రవణము చేసినంత మాత్రముచే హృదయము పవిత్రమగునో, నిరతిశయానందము లభించునో, శాశ్వతమైన సుఖశాంతులు కలుగునో, అటువంటి పరమ పావనమైన సద్గురు సిద్ధారూఢస్వామియొక్క చరిత్రను సావధానచిత్తులై శ్రవణము చేయగలరు. దీనియందు ఏ విధమైన సంశయము ఉండవలసిన ఆవశ్యకత లేదు.

ఒకానొక రోజున సద్గురు సిద్ధారూఢస్వామి మూడవ ప్రహర సమయమున (సుమారు 9 నుండి 12 గంటల సమయమున) తనయొక్క శిష్యులందరిని తన సమీపమునకు పిలుచుకొని, మనము ఈరోజు మన ఆశ్రమమునకు పశ్చిమదిశకుగల ఎత్తైన పర్వత ప్రాంతమునకు పోవుదము పదండి–అని ఆజ్ఞాపించి, అందరికీ సరిపడు రొట్టెలు తీసుకొని ఒక పెద్ద కడవ నిండుగా పప్పు, (రసము)చారు వగైరా తీసుకురమ్మన్నాడు. అదే ప్రకారముగా శిష్యులు అన్నము రొట్టెలు చారు మొదలగునవి సిద్ధము చేసినారు. సద్గురుదేవుడు తన శిష్యులలో ముఖ్యమైన వారిని 25 మందిని వెంటనిడుకొని బయలుదేరినాడు. రెండు ఘటికల కాలపర్యంతము శిష్యులందరూ సద్గురు నామామృతమును ఉచ్చరిస్తూ, సద్గురుభజనచేసి మఠమునుండి మెల్లగా పర్వతమువైపు నడక ప్రారంభించినారు. సద్గురు భజనచేస్తూ చేస్తూ పర్వతముపైకి ఎక్కి, ఒకానొక సమతల ప్రదేశమును ఎన్నుకొని "**శ్రీ సిద్ధారూఢ సద్గురు మహారాజుకీ జై**" అంటూ కూర్చున్నారు.

సద్గురుదేవులను ఎత్తైన శిలాసనముపై కూర్చుండబెట్టి స్వామిని అద్భుతముగా అలంకరించుటకు సంసిద్ధులై, రకరకములైన పత్రపుష్పాదులచేత ఆపాదమస్తకము వరకు సరిపడు పొడవైన మాలను అల్లి, చిత్రవిచిత్రమైన అలంకారములచే శోభించునట్లు స్వామిని అలంకరించినారు. సద్గురు దేవుడు శిలా సింహాసనముపై కూర్చున్నాడు. సద్గురుపూజ ముగిసిన పిమ్మట, శిష్యులందరూ ఒకరి చేతులు ఒకరు పట్టుకొని సద్గురుదేవుని చుట్టూ చక్రాకారముగా నిలబడి సద్గురు నామామృతమును భజిస్తూ ఆడుతూ పాడుతూ ఆనందముచే తన్మయులైనారు.ఈప్రకారముగా నాలుగు ఘటికలకాలపర్యంతము ఆనందసాగరములో ఓలలాడుతూ ఆడినారు.సద్గురుదేవుల ముఖకమలము ఆనందముతో (ప్రసన్నతతో) ప్రకాశించెను. అప్పుడు సద్గురుదేవుడు భజనయందు శిష్యులు శ్రమించి అలసట పొందినారని గ్రహించి,వారిని తన సమీపమునకు పిలుచి కూర్చుండబెట్టుకుని,సరసమైన, ప్రియమైన తన అమృత వాక్కులచేత వారి శ్రమ నివృత్తి చేసినాడు. మరియు భోజనము గూర్చి తెచ్చుకున్న రొట్టెలు చిన్నచిన్న ముక్కలుగా చేసి అచటనే గల ఒక రాయియొక్క–రోలు మాదిరిగాగల గుంటలో వేసి దానిలోనే చారు పోసి గుజ్జు గుజ్జుగా కల్పినారు. ఏవేవి తినుబండారములు తెచ్చినారో–అవి అన్ని ఏకముగా చేసి పెద్ద మొత్తములో "**కాలా**" ప్రసాదమును తయారుచేసి, దానిని కొద్ది కొద్దిగా సద్గురుదేవుడు తన అమృత హస్తముతో తీసుకొని ప్రతి ఒక్క శిష్యుని నోటిలో స్వయముగా వేసి తినిపించాడు. తానుగూడా కొంచెము సేవించినాడు. అందరూ ఎంతో ఆనందమును పొందినారు.

తదనంతరము భక్తులందరూ చుట్టూ కూర్చొని ఒకరికొకరు భుజింపజేసుకుంటూ పరస్పరము ప్రేమభావముతో ఆనందమును పంచుకుంటారు. ఐక్య(సమ)భావముచేత అందరూకలిసి అనుభవిస్తున్న ఆ అమోఘమైన ఆనందవైభవమును వినువీధిలో విమానములపై కూర్చుండి దేవతలు తిలకించారు.ఆకాశమార్గములో దేవతలందరూ గుంపులు గుంపులుగావచ్చి ఆ వైభవమును చూసి

సద్గురుదేవులపై ప్రేమ దృష్టిని నిలిపి ముల్లోకములు ఆనందించగా పుష్పవృష్టిని కురిపించారు. సద్గురు సిద్ధనాథుడు భూలోకములో అవతరించి, కాలాప్రసాదమును తయారుచేసి జీవులను కాలుని బాధ నుండి తప్పించుచున్నాడు. మేము వ్యర్థముగా స్వర్గాదిలోకములలో నశ్వరమైన భోగములనను-భవిస్తూ భోగరూప బంధములో ఇరుక్కుపోయామని పరితపిస్తున్నారు.ఒకవేళ మేము మానవులమై జన్మించి ఉంటే, సిద్ధారూఢస్వామిని ఆశ్రయించి ఆయన ముఖకమలముద్వారా జ్ఞానామృతమును గ్రోలి, సకలబంధములనుండి విముక్తులమై తరించే అవకాశము లభించియుండేది–అని పశ్చాత్తాప పడుచుండిరి. మేము అనుభవించెడి కేవల నామమాత్ర అమృతము పతన భయమునకు కారణమై-నది. సద్గురు సాన్నిధ్యములో లభించే జ్ఞానామృతము నిశ్చయముగా జన్మమరణరూప భవరోగమునే నివృత్తి చేస్తుంది.

అదే సమయానికి పార్వతీ పరమేశ్వరులు నందీశ్వరునిపై కూర్చుండి, అదే ఆకాశమార్గము గుండా పయనిస్తుండగా దేవతలయొక్క గుంపునుచూసి, అక్కడ ఏమి జరుగుచున్నదోచూసి తెలుసు కోవాలను కౌతుకము పార్వతీదేవికి కలిగినది. అప్పుడు భవానిమాత బోలానాథునితో అంటుంది. హే పరమేశ్వరా! భూలోకములో ఏమి వింత జరిగింది? దేవతలందరూ విమానములలో కూర్చుండి అలా భూలోకమువైపు గుంపులు గుంపులుగా ఎందుకు చూస్తున్నారు? నాకు తెలుసుకోవాలని ఇచ్ఛ కలిగుచున్నది స్వామీ! అని ప్రార్థించినది. అప్పుడు శంకరుడంటాడు. సరే! మనము కూడా చూద్దాం పద–అంటూ పార్వతీ పరమేశ్వరులు వచ్చి చూసినారు. అక్కడ చూసేసరికి సద్గురు సిద్ధారూఢస్వామి తన శిష్యులతో కలసి అద్భుతమైన కాలా ప్రసాదమును భుజించుచున్నాడు. ఈ దృశ్యమును చూసి పార్వతీదేవి శంకరుని అడుగుతుంది. స్వామీ! ఈ యతీశ్వరుడెవరు?

మహేశ్వరుడు అంటాడు. ఆయనను సిద్ధముని అంటారు.

మహేశ్వరి అడుగుతుంది–ఈ సిద్ధముని ఎవరు? అప్పుడు హిమవంతుని పుత్రిక అయిన గిరిజతో శంకరుడంటాడు.ఆ సిద్ధారూఢస్వామి నాయొక్క అవతారమేయైయున్నాడు.ఎప్పుడైతే పాప ము భూలోకములో పెచ్చుపెరిగిందో,అప్పుడు సకలదేవతలు నావద్దకు వచ్చి, నన్నిట్లు ప్రార్థించిరి. మహేశ్వరా!పృథ్వియందు పాపము అత్యధికముగా పెరిగినది.దానిని నీవే నిర్మూలించ సమర్థుడవు. ఈ ప్రస్తుత కలికాలములో సకలజీవులు–భక్తులు కావడానికి, దుర్జనులు సజ్జనులుగా మారడానికి, పాపదోషములు సమూలంగా నివర్తించుటకు నీయొక్క అవతారము అత్యంత ఆవశ్యకమైయున్నది. నీయొక్క అవతారము ఎలాఉండాలంటే—పాపములనుండి సకలజీవులు ఉద్ధరింపబడాలి.దుర్జనుల యందు పాపబుద్ధికి స్థానముండకూడదు.అనగా అందరూ సజ్జనులుగామారాలి.కాని,వారిని నాశ-నము చేయకూడదు. కరుణ, ప్రేమ కలిగి ఉండి వారిని తరింపజేసి వారిద్వారా అనేకులు తరించ బడాలి. ఈ విధమైన అవతారమును ధరించవలసినది.

దుష్టులను శిష్టులుగా మార్చి, వారిలో అచంచలమైన భక్తిని కలుగజేసి, జ్ఞానముద్వారా మోక్షమును ప్రసాదించి, వారిపై యేవిధమైన అస్త్రశస్త్రములను ప్రయోగించక శాంతియుతముగా బ్రహ్మైస్థితిని ప్రసాదించి భవసింధువు నుండి కాపాడుతానని వాగ్దానము చేసినాను. పూర్వము నేను అనేక అవతారములు ధరించి ఎంతోమంది దుష్టులను వధించితిని. కాని, దుష్టవాసన సంబంధము చేత యథావత్తుగా పునః జన్మలెత్తి అల్లకల్లోలములను సృష్టించి, జగత్తునకు దుఃఖమును కలుగజేసి వినాశమునకు కారణమవుతున్నారు. నా అవతారముయొక్క ఉపయోగము కాలేదు. ఇట్లు, ధారా-వాహికముగా ప్రాప్తమగుచున్న జన్మలయొక్క సమూల నివృత్తిగూర్చి మరియు అందరుగూడా పాప బుద్ధిని సంపూర్ణముగా నివృత్తి చేసుకొని తరించేలాగున ఉపాయమును శోధించినాను. ఈ ప్రకార-ముగా దేవతలందరికీ దుష్టులయొక్క బాధ మళ్ళీ రాకుండా చేస్తానని అభయమిచ్చి, ఆశీర్వదించి పంపించినాను.

ఈ విధమైన సద్గురుమూర్తి అవతారమును ఎన్నడును నేను ధరించలేదు. దుష్టులను శిక్షించ కుండా, నాశనముచేయకుండా వారియొక్క బుద్ధినిమార్చి వారిని తరింపజేయుటకు యోచించి-నాను. ఇట్లు అనేక దినములు ఆలోచించి సకల జీవులు మోక్షధామమును పొందే మార్గముగూర్చి విలక్షణమైన అవతారయోజన కోసము చాలా కాలపర్యంతము విచారించి, ఈ అవతారమును ధరించినాను. తదనంతరము నేను అవతారమునకు రాకపూర్వమే దేవతలను అక్కడక్కడ భక్తులుగా జన్మించమని ఆజ్ఞాపించినాను.ఆతర్వాత సమయముచూసి నేను అవతరిస్తానని సెలవిచ్చాను. నేను అవతరించిన పిమ్మట నాకు అండగా ఉండుటకు దేవతలనుగూడ అక్కడక్కడ జన్మించమని ఆజ్ఞా-పించితిని.

ఓ పార్వతీ! ఆపైన నేను సిద్ధారూఢ యతీంద్రునిగా భూలోకములో జన్మించాను. దేవత-లందరూ నా భక్తులుగా జన్మించారు. ఈ అవతార విశేషమేమనగా! అస్త్రశస్త్రాదులచే ఎవరినికూడా శిక్షించక దయార్ద్రహృదయముచే దుష్టులను రక్షించి పరమశాంతిని నెలకొల్పుటయే.నా అవతార-ము కాలధర్మముననుసరించి సమాప్తమైనాగాని, ఈ నాయొక్క గురుశిష్య పరంపర– జ్ఞానగంగను ధారావాహికముగా ప్రవహింపజేస్తూ, అజ్ఞానముచే దుఃఖింపబడుతున్న సకలజీవుల ఉద్ధరణ కార్య-మును నెరవేర్చుతారు. ఇటువంటి పరమేశ్వరునియొక్క వచనామృతమును విని, పార్వతీదేవి మన-మున సంతసించి సంతృప్తి చెందినది. తదనంతరము పార్వతీ పరమేశ్వరులు కైలాసమున కేగిరి.

ఇక్కడ భక్తులతో కలిసి సద్గురుదేవులు, ఒకరి నోటిలో ఒకరు కాలాప్రసాదమును అనుభవి-స్తుంటే, దేవతలు విమానములోనుండి హర్షహృదయముతో వీక్షిస్తున్నారు.ఇలా ఉండగా సిద్ధారూఢ స్వామి చెంతకు ఒక కుష్టురోగి వచ్చి, స్వామి చరణకమలములపై వ్రాలి సాష్టాంగ నమస్కారములు చేసినాడు.శరీరమంతటా తీవ్రగాయములు,వ్రణములతోగూడి అసహ్యముగా వికృతరూపుడై,కుష్టు-

రోగముతో ఎంతో బాధపడుతున్నాడు. కుష్టురోగి సద్గురుదేవునితో ఇలా వేడుకుంటున్నాడు. ఓ సిద్ధరాయా! దీననాథా! నాయొక్క జన్మ వ్యర్థముగా గతించి పోవుచున్నది. నేను ఈ నికృష్ట జీవి-తము ఎందుకు గడపాలి? నీయొక్క దివ్య చరణారవిందములను ఆశ్రయించి నీ పాదాలచెంత ప్రాణత్యాగము చేసుకున్నచో, నీయొక్క కృపచేత నేను యథార్థముగా ధన్యుడవుతాను. అసహ్యమైన రోగయుక్తమైన ఈ దుర్గంధమైన శరీరమును చూసి, నా పరివారమంతా ఏవగించుకొని, నన్ను తరిమివేసినారు. అందరూ వెలివేసిన నన్ను నీవు అంగీకరించి నీ చరణాలచెంత ఆశ్రయమిచ్చిన-ట్లైన,ఈ అంత్యసమయమున నేను ధన్యుడనగుదును–అని ఆర్తనాదముచేత, తీవ్రఆవేదనచేత సద్గురు దేవుని కుష్టురోగి పదేపదే వేడుకున్నాడు.

ఆ కుష్టురోగియొక్క దురవస్థనుచూసి సమీపములో నుండిన శిష్యవర్గము సద్గురుదేవుని చరణాలను తాకవద్దని, పట్టుకోకూడదని కుష్టురోగిని నిరోధించారు. అప్పుడు సద్గురుదేవుడు వారిని వారించి, ఆయనను నిరాకరించకండి, ఇక్కడే ఉండనివ్వండి–అని ఆజ్ఞాపించినాడు.

అప్పుడు శిష్యులు స్వామిని ఈప్రకారముగా అడుగుతారు. ఓ సద్గురుదేవా! మహా భయంక-రమైన ఈ కుష్టివ్యాధి జీవులకు ఏయే కర్మలు చేయుటవలన ప్రాప్తిస్తుంది? దానికి నివారణోపాయ మేమిటి? అని అడుగుతారు.

అప్పుడు వారి ఆగ్రహముమేరకు సద్గురుదేవులు సమాధానమిస్తూ—ఏకాగ్ర చిత్తముచేత వినవలసినదని ఆజ్ఞాపిస్తూ చెబుతున్నాడు. కుష్టురోగము స్థూల సూక్ష్మ భేదముచే రెండు విధము-లుగా ఉంటుంది. ఈ కుష్టి రోగికివలె స్థూలకుష్టురోగము స్థూల శరీరమునకు సంక్రమిస్తుంది. ఈ స్థూలకుష్టు ఎలా ప్రాప్తిస్తుందో దానికి హేతువులగు దోషములను చెబుతాను వినండి.

ఎవరైతే పరదారాగమనము చేస్తారో, (పరస్త్రీలను కోరుతారో), మందిని వంచనజేసి ద్రవ్య-మును సముపార్జన చేస్తారో, ఎవరైతే సద్గురుదేవుని నిందిస్తారో, వారికి ఈ రోగము ప్రాప్తించును. మాతృగమనము చేసినటువంటి మహా దుర్మార్గులకు, సద్గురు శయ్యాగమనమును చేరిన వారికి, సద్గురుదేవులను విస్మరించి ఆరాధించని వారికి, సద్గురుసేవ చేయని వారికి, నిరపరాధులను చంపు వానికి, తల్లిదండ్రుల సేవచేయక-కొట్టి తిట్టి ద్వేషించువారు జన్మజన్మాంతరములలో నికృష్టమైన జీవితము గడుపుతూ, దారుణమైన ఈ కుష్టువ్యాధికి గురి అవుతారు. శైవులు వైష్ణవులను, వైష్ణవులు శైవులను నిందించినచో కుష్టువ్యాధి గ్రస్తులౌతారు.ఈప్రకారముగా అనేకపాపకార్యములు చేయుట వలన ఈ వ్యాధి సంభవించును. ఇంకా అనేకములు ఉన్నాయి. మీరు ఊహించి విచారించండి.

ఇక సూక్ష్మకుష్టు సూక్ష్మశరీరమునకు ఎలా సంక్రమిస్తుందో వినండి.దాని లక్షణములు స్పష్ట ముగా బహిర్గతముకాక బుద్ధియందుండి జీవుని పతనమునకు కారణమవుతాయి. బుద్ధిని భ్రష్టము చేయును. ఇతరులను చూసి మత్సరపడడము, కోపించడము, రాత్రింబవళ్లు ఇతరులగూర్చి అసూయ

పడడము, ఈర్ష్య, ద్వేషము, కపటము హృదయములో పెట్టుకుని బహిర్గతముగా నిందించడము వలన ఈ రోగము ప్రాప్తించును. ఇతరులకు ఘాతకముచేయుటకు ఏప్రకారముగా మోసగించాలి- అని ఎల్లప్పుడూ సంకల్పము చేయుట– ఇటువంటి లక్షణము సూక్ష్మ శరీరములో ఉంటుంది. కావున ఇది సూక్ష్మకుష్టు రోగమని గుర్తించాలి.

పైన చెప్పబడిన పాపకర్మల దుష్టసంస్కారములు అంతఃకరణమునందుండి పాపకార్యము-లలో ప్రవృత్తుడైనందున జీవునిబుద్ధి భ్రష్టమై, ఎల్లప్పుడూ దుఃఖములకు గురి అవుతాడు. ఈ రెండు రకములైన కుష్టు రోగము ఎటువంటి ఔషధములచేతగూడా నివృత్తి కాదు. అది కేవలము సద్గురు దేవునియొక్క సేవ మరియు సత్సంగము చేతనే నివృత్తి కాగలదు. ఇతర ఉపాయములచేత నివృత్తి కాదు–అని సద్గురుదేవుడు శిష్యులతో, కుష్టివ్యాధి ఏ విధముగా వస్తుందో, దానికి కారణమేమిటో, దానికి నివారణోపాయము కూడా తెలియజేసినాడు.

సద్గురు ముఖకమలముద్వారా ఇటువంటి అమృత వచనములను విని, సకల శిష్యవర్గము ఆనందించినారు. అప్పుడు కుష్టరోగియొక్క వ్యాధి నివారణగూర్చి సంకల్పము చేస్తూ సద్గురుదేవుడు అద్భుతమైన లీలను ప్రదర్శిస్తాడు. అమృత సమానమైన కాలాప్రసాదమును సిద్ధారూఢస్వామి "**ఓం నమశ్శివాయ**" అంటూ నామస్మరణ చేస్తూ, తనయొక్క అమృత హస్తముచేత కుష్టరోగియొక్క నోట్లో వేస్తాడు. ఎప్పుడైతే, సద్గురుదేవుని దివ్యహస్తము ద్వారా గ్రహించిన కాలాప్రసాదము కుష్టు-రోగి యొక్క శరీరములో ప్రవేశించినదో,వెంటనే ఒక శీతలమైన కంపనము ఏర్పడి దేహమందలి వ్రణములు పూర్తిగా మాయమైపోయినవి. శరీరము పరిశుద్ధమైనది. దివ్యదేహము ప్రాప్తమైనది. ఏమాత్రముకూడా రోగ చిహ్నములు లేకుండా సమూలముగా కుష్టువ్యాధి నివృత్తమైనది. అప్పుడు ఆయన సద్గురుదేవుని ఇలా స్తుతి చేస్తున్నాడు. ఓ దేవాదిదేవా!సద్గురునాథా! నీ దివ్యపాదార విందములను ఆశ్రయించినందున, నాజన్మ సార్థకమైనది. ఈ దీనునిపై దయదలచి రక్షించినావు. నీ యొక్క కరుణాకటాక్షముద్వారా లభ్యమైన ఈ దివ్యశరీరమును నీయొక్క పాదసేవలోనే వినియోగించుటకు ఆజ్ఞాపించండి. ఇట్లు, అనేక విధములుగా సద్గురుదేవుని స్తుతిచేస్తూ నేత్రములనుండి అశ్రువులు ధారావాహికంగా ప్రవహిస్తుండగా, ఒక కర్రలాగా భూమిపైపడి సాష్టాంగ దండవత్ ప్రణామములు చేసినాడు.దయాసాగరుడైన సద్గురుదేవుడు ఆ భక్తునియొక్క ప్రార్థన నాలకించి ఈ శరీరము సద్గురు దేవునిదేయని భావించి,ఎల్లప్పుడూ నాయందే సంలగ్నచిత్తుడవై, భక్తియుక్తుడవై ఉండుమని ఆశీర్వదించాడు.ఎల్లప్పుడూ సద్గురు నామస్మరణచేస్తూ సర్వభూతములయెడ దయతో ఉపకారము చేస్తూ, ప్రతినిత్యము సద్గురుదర్శనము చేసుకుంటూ,ఆయన ఆజ్ఞయందే ఉన్నట్లయితే మళ్లీ ఈ రోగము నిన్ను ఆవరించదు.

ఇటువంటి అద్భుతమైన లీలను అంతరిక్షమునుండి చూస్తున్న దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. ఈ చమత్కారమును దర్శించి ఆశ్చర్యచకితులై యక్ష, కిన్నర, గంధర్వులు జయజయ ధ్వనుల చేత గానముచేస్తూ మంగళవాద్యములు, దుందుభినాదమును మ్రోగించారు. ఆ మంగళఘోషలు దశదిశలు వ్యాపించాయి. తదనంతరము దేవతలు వారి స్వస్థానములకు వెళ్ళిపోయినారు.

ఇక్కడ సద్గురుదేవుడు కాలాప్రసాదమును పూర్తిగా అందరూ సేవించిన తర్వాత శిష్యసమవేతుడై మఠమునకు వెళ్ళుటకు సంసిద్ధుడైనాడు. అప్పుడు శిష్యులు అంటారు. సద్గురుదేవా! మాకు చాలా దప్పిక అవుతుంది. ఎక్కడనూ జలాశయము లేదు. మాకు తీవ్రముగా దాహమేస్తుంది–అని వారి బాధను సద్గురుదేవునికి విన్నవించుకున్నారు. వారి విన్నపమును మన్నించి సద్గురుదేవులు ఒక చోటికి వెళ్లి శిష్యులందరినీ తన వద్దకు పిలిచి, అక్కడ ఉన్నటువంటి ఒక మురికి గుంటను వారికి చూపించినాడు. దానిలో అనేక క్రిమికీటకాదులు ఉండి, నీరు అపరిశుద్ధముగా ఉండెను. ఈ క్రిములను తొలగించి ఈ నీటిని సేవించండి–అని స్వామి అంటాడు. కాని, ఆ నీటిని త్రాగుటకు ఎవరు గూడా సాహసించలేదు.అప్పుడు సద్గురుదేవుడంటాడు.శిష్యులారా!మీరు ఈజలమును స్వీకరించుట లేదు కదా! ఎందుకని? సరే! అయితే నేనే మొదలు త్రాగుతాను, చూడండి. అని ఆ నీటిని త్రాగుటకు ముందుకువెళ్లి తన ముఖకమలముచేత ఆనీటిని స్పర్శించినాడు. శిష్యులందరూ చూస్తూనేఉన్నారు. వెంటనే జలము క్రిములులేకుండా స్వచ్ఛముగా నిర్మలమైనది.అందరూ ఎంతో ఆశ్చర్యమును పొందినారు. దప్పికతో ఉన్నవారుగనుక అందరూ గబగబా ఆనీరును త్రాగి సేదతీర్చుకున్నారు. ఆగుంటలో కొద్దిగా నున్న నీరు అందరికీ సరిపోగా, ఇంకా అందులో మొదట ఎంత నీరు ఉండెనో, మళ్లీ అందరూ సేవించిన పిదపగూడ అంతే నీరు మిగిలి యుండెను.

ఇంతలో సాయంకాల సమయమైనది. సద్గురుదేవులు శిష్యులందరితో కలసి ఆనందముతో భజనలుచేస్తూ మఠమునకు బయలుదేరి,సంధ్యాసమయము వరకు గమ్యస్థానమును చేరుకున్నారు.

ఓ శ్రోతృబంధువులారా! మీరందరూ ఈ కథయొక్క లక్ష్యార్థమును సావధానచిత్తులై వినగలరు. ఇరువది ఐదుమంది శిష్యులు ఇరువదిఐదు తత్త్వములుగా ఎఱుగవలెను. ఇరువది ఆరవ వాడు సద్గురునాథుడు (సాక్షి). ఆయన ముందు ఈ ఇరువదిఐదు తత్త్వముల జన్మమరణరూప ఆట చక్రాకారముగా జరుగుతూ ఉంటుంది.సద్గురుమూర్తి సాక్షిగా సత్తామాత్రముగా ఉండి ఆటనుచూస్తున్నాడు.జీవుడు జన్మమరణరూప చక్రములో తగులుకొని తీవ్రమైన దుఃఖమునకు గురియై బాధలు అనుభవిస్తూ, దానికి ఓర్వలేక సద్గురుదేవుని ఆశ్రయించి వేడుకుంటాడు. ఆత్మరూప సద్గురుదేవుడు సద్గుణములన్నిటిని ఒకచోటచేర్చి కాలాప్రసాదమును (దైవీసంపత్తిని ప్రసాదించి) సద్గుణసంపన్నుడైన జీవునియందు జ్ఞానోదయము కలిగించి, జనన మరణరూప సంసార కుష్ఠురోగమును సమూలముగా నివృత్తి చేస్తాడు. సద్గురుసేవ నిరంతరము చేయుటవలన మోక్షేచ్ఛయను దాహముచేత పరి-

తపిస్తుండగా, సద్గురుదేవులకు కృపగలిగి అమృతతుల్యమైన జ్ఞానామృతమును సేవించడము కొరకు అనగా జ్ఞానప్రాప్తికొరకు సాధన చేయమని సద్గురుదేవులు ఆజ్ఞాపిస్తాడు. సాధనయందు దుఃఖము ఎదురవుతుంది. దానిని సహించలేక పోతే అమృతతుల్యమైన మోక్షము దుర్లభమవుతుంది. అప్పుడు సాధనయందు కలిగే దుఃఖములకు భయపడి (క్రిములకు భయపడి) శిష్యులు సద్గురుదేవుని ప్రార్థించగా, వారిని తరింపజేయుటకు సద్గురుదేవులు దయదలచి మోక్షసాధనలో కలిగే అనర్థములను నివృత్తిచేసి జ్ఞానామృతమును ప్రసాదించి తృప్తిరూప మోక్షమును కలుగజేస్తాడు.

ఈ అధ్యాయము చాలా ఉత్తమోత్తమమైనటువంటిది. సిద్ధారూఢస్వామియొక్క అవతార విశేషముగూర్చి వివరించడమైనది. దీనిని భక్తియుక్తులై శ్రవణము చేసినచో సద్గతి లభిస్తుంది. పరమానందరూప మోక్షము ప్రాప్తించును. వారివారి ఇచ్ఛానుసారముగా ఇహపరలోకముల వాంఛితములుగూడా ప్రాప్తిస్తాయి. శ్రద్ధాభక్తులచేత శ్రవణము చేసిన వారి కోరికలు పూర్ణముగా సద్గురునాథుని కృపచేత నెరవేరగలవు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేయుటవలన సకలపాపములు భస్మమైపోగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢస్వామి చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబదినాలుగవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీ గురుభ్యోనమః ఓం శ్రీ సరస్వత్యై నమః

# ఏబది ఐదవ అధ్యాయము

పద్యానువాదము:–సకల జీవులయొక్క ఆధారస్వరూపుడవై, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపుడవై ఉన్నావు. దైవీసంపత్తిచేత సద్గుణసంపన్నుడవై పుణ్యలీలలు గావిస్తున్నావు. దయాసాగరుడవైన నీవు అందరియొక్క భవబంధరూప భవపాశమును దయచేసి నివృత్తిచేస్తున్నావు. నీ భక్తుడనైన నాపై నీయొక్క కృపామృతమును వర్షించి, నన్ను ధన్యుణ్ణి చేయుము. నీయొక్క నిజపదవిని నాకు ప్రాప్తము జేయుము.

ఓ సద్గురుసిద్ధనాథా! నీకు జయము జయము.నీయొక్క దివ్య పాదారవిందములను ఆశ్రయించినాను. సకల అనర్థములను నివృత్తిచేసి భవదుఃఖమునుండి రక్షించి స్వస్వరూప ప్రాప్తి కలుగ జేయవలసింది. అమృతతుల్యమైన నీయొక్క పుణ్యచరిత్రను శ్రవణముచేసిన మాత్రముననే సకల దుఃఖములు నివృత్తమై మనోకామనలు పూర్తికాగలవు.మాయామోహితులైన మూఢజనుల అజ్ఞానరూప నిద్రను సమూలముగా నివృత్తి చేస్తావు. గత అధ్యాయములో సర్వజ్ఞ పరమాత్మ ఈశ్వరుడు సిద్ధారూఢ యతీంద్రులుగా ఈభూలోకములో అవతరించినాడని స్వామియొక్క అవతార విశేషమును వర్ణించడమైనది. సద్గురుదేవునియొక్క అవతారకార్యము నిర్విఘ్నముగా జరగడానికి సహాయముగా దేవతలందరూ భూలోకములో భక్తులుగా జన్మించండి–అని స్వామి ఆజ్ఞాపించుటవలన అందరూ మానవులుగా జన్మించారు. వారియొక్క చరిత్రలను విస్తారభయముచేత వర్ణించలేదు. సద్గురుదేవునియొక్క దివ్యచరిత్ర లీలలతోపాటు కొందరి భక్తులయొక్క చరిత్రను కూడా వర్ణించడమైనది. కాని, ఇంకా చాలామంది భక్తులచరిత్ర వ్రాయకుండానే ఈగ్రంథమును సమాప్తి చేయుటకు సంకల్పము చేసినాను.అందరిభక్తులయొక్క నామస్మరణమాత్రముననే అంతఃకరణమునందు శాంతి కలుగును. సేవద్వారా జన్మ ధన్యమగును. అనంత జన్మలయొక్క తపస్సు ఫలించి, ఈ జన్మయందు సద్గురుదేవునియొక్క ప్రాప్తి కలిగినది. సద్గురుసేవ చేయుటకు ప్రేమ ఉద్భవించినది. సద్గురుదేవుని యొక్క సేవాభాగ్యమువలన ఆనందమును అనుభవిస్తారు. సేవచేయడమే తప్ప మరే ఇతర కోరికలు గాని, లౌకికవాంఛలు ఇచ్ఛగించుట లేదు. ఇటువంటి వారే సచ్ఛిష్యులు. సద్గురుదేవుని సేవయందు లభించే ఫలమునుగూర్చి ఆదిశేషుడుగూడా వర్ణించలేడు.అలాంటప్పుడు,అల్పమతినైన నేను సద్భక్తుల యొక్క భక్తిగూర్చి స్తుతించే శక్తి నాయందు లేదు. సద్గురుదేవునియొక్క స్వరూపాన్ని వర్ణించుటకు

వేదములు కూడా మూగబోయినవి.అటువంటి స్వరూపాన్ని భక్తులు అనుభూతి పొంది ధన్యులైనారు. సకల వేదశాస్త్రములు సద్గురుస్వరూపాన్ని వర్ణించుటకు ప్రవృత్తమై "నేతి నేతి" అని చెప్తూ చెప్తూ, చివరకు సద్గురు స్వరూపాన్ని తెలుప సామర్థ్యమును కోల్పోయి మూగబోయినవి. వర్ణనాతీతమైన స్వరూపముగల ఆ కైలాసనాథుడే అజ్ఞజనులను ఉద్ధరించుటకు సగుణరూపముగా సిద్ధయతీంద్రునిగా అవతరించాడు.వర్ణింపశక్యముగాని సద్గురుదేవునియొక్క అనంతమైన చరిత్ర సంపూర్ణముగా వర్ణించుటకు నా మతి సరిపడదు. కావున, యథామతిగా ఇక్కడికే ముగిస్తున్నాను. సద్గురుదేవులయొక్క సద్భక్తుల స్మరణచేస్తూ నామమాత్రముగా స్తుతి చేస్తున్నాను. ఆ సద్గురుదేవుడు నన్ను క్షమించు గాక!

ప్రప్రథమముగా అనంత మహారాజు సద్గురుదేవునియొక్క మహిమను కీర్తిని ప్రకటముచేయుటకు మొట్టమొదటగా కీర్తన ధ్వజమును ఎత్తి నలుమూలల చాటి శ్రోతలను, వక్తలను ప్రేమ కల్లోలములో ముంచెత్తి దేహవిస్మృతిని కలుగజేసేవాడు. అనేక సంవత్సరములు సద్గురుదేవులకు సేవచేస్తూ అతి సన్నిహితముగా ఉండి, సద్గురుసేవాతత్పరుడై అంత్యకాలమున కైలాసమునకేగెను.

రామదాసు అను సద్గురుభక్తుడు సద్గురుదేవునియొక్క కీర్తిని మహిమను కీర్తనద్వారా అత్యద్భుతముగా వర్ణిస్తుంటే, శ్రోతలు కీర్తనలో తన్మయులై హృదయములో ఆనందము ఉప్పొంగి నేత్రముల వెంట అశ్రుధారలు రాల్చేవారు.

మిశ్రికోటకు చెందిన శంకరశాస్త్రి ప్రతి సంవత్సరము కార్తీక పౌర్ణమినుండి ఒక వారము రోజులు సప్తాహ కార్యక్రమమును ఏర్పాటుచేసి,అందులో శ్రీమద్భాగవత కథామృతమును బోధించి సద్గురుసేవచేసి సద్గురుకృపకు పాత్రుడైనాడు.

కృష్ణశాస్త్రి అనే సద్గురు భక్తుడు ప్రతిదినము సద్గురు సాన్నిధ్యములో భాగవత పురాణమును ప్రవచన రూపముగా శ్రోతలకు బోధించేవాడు. శ్రోతలు దేహభానమును వీడి తల్లీనులయ్యేవారు. ఆయనయొక్క భక్తిపూర్వకమైన సేవలను సద్గురుదేవుడు అందుకొని ఎంతోఆనందించేవాడు.అందుకని సద్గురుదేవుడు ఆ కృష్ణశాస్త్రిని స్మరించుటకు నాకు ప్రేరణ కలిగించాడు.

బాబా కృష్ణగర్దే అను సద్గురుభక్తుడు అనేక కవితలద్వారా సద్గురుదేవుని మహిమను వర్ణించి ధన్యుడైనాడు. తాను రచించిన కవిత్వమును సద్గురు సాన్నిధ్యములో బోధిస్తూ వేదాంత రహస్యములను అతిసులభముగా బోధించేవాడు. అది విన్న శ్రోతలయొక్క చిత్తము పరిణామమును పొంది అంతఃకరణ శుద్ధిగలిగి స్త్రీలు, పురుషులు, బాలురు అందరుకూడా వేదాంత శ్రవణమునకు అధికారులయ్యేవారు.

బాలా దీక్షితుడు అనే పండితుడు సద్గురు సిద్ధారూఢస్వామియొక్క సమక్షమున శ్రీ శంకరాచార్య విరచిత బ్రహ్మసూత్ర భాష్యమును అతి సులభశైలిలో ప్రబోధించేవాడు.

సద్గురుభక్తుడైన శ్రీపాదశాస్త్రి అనే ఉపాధ్యాయుడు అనేక భాషా గ్రంథములను సులభముగా శ్రోతలకు బోధించి, సద్గురు కృపకు పాత్రుడై ధన్యుడైనాడు.

విరూపాక్షశాస్త్రి అను సద్గురుభక్తుడు ప్రతినిత్యము సద్గురు సమక్షమున పంచమవేదమైన శ్రీమన్మహాభారతము, పురాణములను శ్రోతలకు బోధిస్తూ వారియొక్క మనసును రంజింప చేసే వాడు. ప్రతి సంవత్సరము ఉత్సవ సమయములో సద్గురుదేవునియొక్క కీర్తిని మహిమలను కీర్తన రూపముగా శ్రోతలకు బోధించి సద్గురుదేవుని సంతోషపెట్టి, వారి మన్ననలను పొంది స్వామి కృపకు పాత్రుడై, సద్గురుదేవుని ఆజ్ఞానుసారముగా మెదిలేవాడు.

గోవింద సంతు హలియాల్ కర్ అనే భక్తుడు సంసారముయందు విరక్తిగలిగి భార్యతోసహా సద్గురు సిద్ధారూఢస్వామియొక్క ఆశ్రమమునకు వచ్చి, అత్యాదరముతో సేవా కార్యములో పాల్గొని ధన్యులైనారు.సద్గురు సాన్నిధ్యమున ప్రతిరోజు కీర్తనగావిస్తూ ఉదరపోషణ నిమిత్తము గ్రామములోకి వెళ్లి మధుకరి అర్థించి దొరికిన భిక్షతో సంతృప్తుడై జీవించేవాడు. కొందరు భక్తులు బెంగుళూరు నుండి సిద్ధాశ్రమమునకు వచ్చి కాకతాలీయ న్యాయమువలె అకస్మాత్తుగా గోవింద సంతుయొక్క కీర్తనను ఆలకించి ముగ్దులైనారు. వెంటనే వారిలో ఒక సత్సంకల్పము స్ఫురించి, సద్గురుదేవుని సమీపించి ఇలా ప్రార్థిస్తారు. ఓ సద్గురుదేవా! హే ప్రభో! మీ శిష్యులలో ఎవరినైనా ఒక సజ్జనుని మా బెంగులూరి పట్టణమునకు పంపించి మీయొక్క అద్భుత మహిమలను లీలలను కీర్తనద్వారా మాకు అందజేసి మమ్ములను కృతార్థులను చేయండి అని వేడుకుంటారు. మీరు ఇతర గ్రామాలకు ఏ విధంగా సద్భక్తులను పంపించి మీయొక్క కీర్తిని అద్భుత మహిమలను ప్రకటముచేసి సకలజీవులను ఉద్ధరించుచున్నారో, అదేవిధంగా మాయందు దయగలచి గోవింద సంతు హలియాల్ కర్ గారిని పంపించి మమ్ములను కృతార్థులను చేయండి అని వేడుకున్నారు. భక్తులయొక్క ప్రేమ పూర్వకమైన విజ్ఞప్తిని సద్గురుదేవులు ఆలకించి,గోవింద సంతను పిలుచుకొని,నాయనా!నీవు బెంగుళూరు పట్టణమునకు వెళ్లి ప్రతిరోజు కీర్తనలను గావించి, అక్కడి నివాసులైన సద్భక్తులకు సచ్ఛాస్త్రమును, సద్గురుకీర్తిని బోధించి అహోరాత్రులు నామస్మరణ చేయించి, వారు ఉత్తమమైన సద్గురు భక్తులగునట్లుగా తీర్చిదిద్దుము–యని ఆజ్ఞాపించినాడు. సద్గురుదేవులయొక్క ఆజ్ఞను శిరసావహించి గోవింద సంతు బెంగుళూరు పట్టణమునకేగి, అక్కడి భక్తులకు యథార్థమైన సద్గురు మహిమను, గురుభక్తిని ప్రబోధిస్తూ వారికి చాలా ఆనందమును కలుగ జేసేవాడు. కొన్నాళ్లకు ఆ బెంగుళూరి భక్తులకు సద్గురుదర్శనము చేసుకోవాలనే ఉత్కటజిజ్ఞాస కలిగి గోవిందసంతుకు వారి అభీష్టమును వ్యక్తము చేయగా,ఆయన వారిని హుబ్లీకి తీసుకొచ్చి సద్గురుదేవుని దర్శనముచేయించి ధన్యులనుచేసినాడు. సద్గురుదేవునియొక్క ఆశీర్వాదమును ఇప్పించి మళ్లీ వారి స్వస్థానమునకు తీసుకెళ్లేవాడు.

బ్రహ్మీభూత షణ్ముఖ స్వామిగూడా పూర్వము కొంతకాలము క్రితము సద్గురు సిద్ధారూఢ స్వామి చెంత నిత్యము వేదాంతశ్రవణముచేసి జ్ఞానవంతుడైనాడు.ఆయన చాలాకాలము సిద్ధారూఢ స్వామి సాన్నిధ్యములో ఉండి తదనంతరము బీజాపూర్ కు వెళ్లి అక్కడ ఒక ప్రశాంతస్థలములో కుటీరమును నిర్మించుకొని పదునాలుగు సంవత్సరములు ఒకేఆసనములో కూర్చుండి,బ్రాహ్మీస్థితిని పొందినాడు. అన్నపానములను అక్కడే స్వీకరిస్తూ ఆ స్థలమును వీడక, ఎక్కడకు వెళ్లకుండా ఒకే ఆసనమునందు కూర్చొని అఖండముగా ఆత్మజ్ఞానమునందు నిమగ్నుడై మౌనవ్రతమును పాటించి మహత్తరమైన యోగసాధనలను కూడా పొందినాడు. పదునాలుగు సంవత్సరములు పూర్తి అయిన పిమ్మట తన ఆసనమునుండి ఉత్థానమై లోకోద్ధరణ కోసము ముముక్షువులకు భక్తి జ్ఞానములను ప్రబోధించి మోక్ష ప్రాప్తిని గావించినాడు. షణ్ముఖ స్వామి యొక్క తపోభూమి అయిన బీజాపూర్ లో ఇప్పటివరకుకూడా ప్రతిసంవత్సరము శ్రావణమాసములో చాలాగొప్పగా ఉత్సవసప్తాహములు జరుగుచుండును.

రామాచార్య కడలాస్కర్ అనే భక్తుడు సద్గురుదేవునియొక్క పూజాసమయములో ఉపకరించు పూజామంత్రములను,సద్గురుస్తోత్రములను రచనగావించి సద్గురుపాదపద్మములకర్పించాడు.

సదాశివప్ప ఇటగీ అను సద్గురుభక్తుడు అనేక భక్తులను ప్రోగు చేసుకొని సిద్ధాశ్రమమునకు వచ్చి ఉత్సవ సమయమున అఖండమైన భజనకార్యక్రమము ఏర్పాటు చేయించి జనులను రంజింప జేసి, సద్గురుకృపకు పాత్రుడై తన జీవితమును ధన్యము గావించుకున్నాడు.

అన్నిగేరి తోటప్ప దేశాయి అనే సద్గురు భక్తుడు సద్గురు సేవ నిమిత్తముగా తన గ్రామములో సద్గురుదేవులయొక్క రథోత్సవమును జరిపించేవాడు.

కాశీనాథ పంత్ ఛత్రే అను సద్భక్తుడు ప్రతి ఉత్సవసమయములోనూ అనేక భక్తులను వెంటబెట్టుకొని సిద్ధాశ్రమమునకు వచ్చి సద్గురు దర్శనము గావించేవాడు.

సిద్ధిరామయ్యస్వామి అనే మహావైరాగ్యసంపన్న సద్భక్తుడు సద్గురు ముఖకమలముద్వారా వేదాంత శ్రవణముచేసి మనన నిదిధ్యాసములద్వారా బ్రహ్మాత్మల ఏకత్వ జ్ఞానమును పొంది, తాను అనుభూతిబడసిన ఆ జ్ఞానమును దేశదేశములు తిరుగుతూ, అనేక గ్రామములు పర్యటిస్తూ భక్తులకు బోధించి, వారియొక్క అజ్ఞానమును సమూలముగా నష్టము చేసినాడు. మరియు ప్రతి శివరాత్రి మరియు శ్రావణమాసములో జరుగు ఉత్సవసమయములో వచ్చి మహావైభవముగా జరిగే కార్యక్రమాలలో పాల్గొనేవాడు. ప్రతి శ్రావణ సోమవారమునాడు జరుగు సద్గురుదేవునియొక్క విశేష పూజకు పాల్గొని సహకరించి సద్గురుదేవునియొక్క అపారమైన కృపకు పాత్రుడై తరించినాడు.

మరియు ఇదే ప్రకారముగా సద్గురుసేవయందు సమర్పణ బుద్ధిచేత సేవలో పాల్గొన్న అనేక అగ్రగణ్యులైన భక్తులలో తుక్కప్ప సపారే, తులజప్ప, మల్లార్, గోవింద్ మొదలగువారు స్వామికి అతిసన్నిహిత భక్తులుగూడ గలరు.

ముఖ్యపూజారియైన సిద్ధప్ప ఉజ్జన్నవర్ ప్రతిదినము రాత్రిపూట సిద్ధారూఢస్వామిని తమ ఇంటికి తీసుకెళ్లి అచ్చట భజన మరియు శాస్త్రమును జరిపించేవాడు. ఈ ప్రకారముగా భక్తులందరూ ప్రేమ, భక్తిశ్రద్ధలతో అత్యాదరముచేత ఉత్సవ కార్యక్రమాలలో పాల్గొని వారి వ్యాపారములను త్యజించి సద్గురు సేవలోనే తత్పరులై ఉండేవారు.

సేవక బృందమునందు అగ్రగణ్యులైన బ్రహ్మీభూత శివయ్య, సంగప్ప, గోరఖనాథ్, సిద్దయ్య, గంగప్ప, గణప్ప శాంత–ఇంకా అనేకులు మొదలుకొని ఉండేవారు.

విరూపాక్షప్ప కాతర్కి అనే భక్తుడు ప్రతి సోమవారము భక్తులతో సహా మఠమునకు వచ్చి సద్గురుదేవులను అత్యంత భక్తితో పూజించేవాడు.

నిరుపాదప్ప దోడ్వాడ్ అనే భక్తుడు సంసార జీవితమునకు స్వస్తిచెప్పి సద్గురు సాన్నిధ్యములోనే ఉండి, ఆశ్రమసేవ చేస్తూ ఉండేవాడు.

రామానంద, మంగేష్ గోవింద అనే భక్తులు మొదలుకొని ఇంకా అనేకులు సద్గురు భక్తులు, సేవక జనులు ఆశ్రమమునందుండి, అనేక విధములైన ఆశ్రమసేవలు, సద్గురుసేవలు చేసేవారు.

వీరభద్రప్ప మరియు రాచప్ప వంటశాలయందుండి కఠినమైన సేవలు చేస్తూ భక్తులకు అన్న ప్రసాదములను తయారు చేయుటలో శ్రమకోర్చి రాత్రులందు, పగటియందు రకరకములైన వంటలు చేసేవారు. వారి భార్యాబిడ్డలను, ఇండ్లను వదిలి ఎంతో శ్రమపడి భక్తుల కోసము సద్గురుసేవగా భావించి, వంటలు తయారు చేసేవారు.

శివభక్త చిన్నబసప్పసేర్ అనుభక్తుడు సద్గురుదేవులను అత్యాదరముతో మహావైభవముచేత తమ స్వగ్రామమైన మంటూరుకు తీసుకెళ్లి విధిప్రకారము సద్గురుదేవులను పూజించేవాడు. సప్తాహ కార్యక్రమములను ఏర్పాటుచేసి గ్రామస్తులందరికీ సద్గురుదేవుని దర్శనభాగ్యమును కలుగజేసేవాడు.

సద్గురుదేవుడు వేరే గ్రామమునకు పోయినప్పుడు స్వామియొక్క దర్శనము లేనందున స్వామియొక్క పాదతీర్థమును సేవించనందున, మేము జీవించలేము–అని ఇక్కడ ఆశ్రమములోని భక్తులంతా అన్నపానాదులను వదిలేసి మూడురోజులు ఉపవాసమున్నారు. తనగూర్చి తహతహపడే భక్తులయొక్క అత్యంత ప్రేమను గ్రహించినవాడై సద్గురుదేవుడు హుబ్లీ విడిచి ఎక్కడకు వెళ్లేవాడు కాదు. ఒకవేళ వెళ్లవలసిన అవసరము వస్తే మఠములోని భక్తులయొక్క అనుమతి అయితేనే పోయేవాడు, లేనిచో పోయేవాడు కాదు. ఈ విధమైన నియమమును స్వామి ఏర్పరచుకున్నాడు.

వసంతరావు దాబోల్కర్ అను సద్భక్తుడు సద్గురు సిద్ధారూఢస్వామియొక్క పవిత్రమైన, దివ్యమైన చరిత్రను గ్రంథరూపమున రచన గావించి, దానికి "సిద్ధారూఢ విజయము" అను నామ-కరణము చేసి, ఆ సద్గ్రంథమును సద్గురుదేవునకు అర్పించాడు.

పరుశురామ సబలీస్ అనే సద్భక్తుడు కూడా సద్గురుదేవుని యొక్క మహిమలను, లీలలను, చరిత్రను గద్యపద్య రూపముగా రచించి, అచ్చువేయించి సద్గురు పాదపద్మములకు అర్పించినాడు.

భక్తబంధువు, సద్గురుభక్తుడు అయిన దాబోల్కర్ అనువాడు ఎల్లప్పుడూ ఆశ్రమములోనే ఉంటూ ఆశ్రమసేవ, సద్గురుసేవ చేస్తూ సద్గురు సాన్నిధ్యంలోనే ఉండేవాడు.

లక్ష్మణప్ప ఖమిత్కర్ అనే సద్భక్తుడు కొల్లాపూర్ నివాసి. ఆయనయొక్క కుమారుడు విషమ జ్వరముతో పీడితుడై ప్రాణసంకట పరిస్థితిలో ఉన్నప్పుడు, లక్ష్మణప్ప ఆర్తనాదముతో తన కుమారుని రక్షింపమని సద్గురుదేవుని వేడుకున్నాడు. ఆ భక్తునియొక్క ప్రార్థనలాలకించి, సద్గురుదేవుడు ప్రసాద రూపముగా విభూతిని పంపినాడు. ఆ ప్రసాదరూప విభూతిని సద్గురు నామోచ్ఛారణచేస్తూ రోగి యొక్క ముఖమున వేయగా తత్క్షణమే రోగి నిరోగిగా అయి విషమజ్వరము సమూలముగా నివృ-త్తమై ఆరోగ్యవంతుడైనాడు. అప్పటినుండి లక్ష్మణప్ప ప్రతి ఉత్సవసమయమునకు హుబ్లీ ఆశ్రమము-నకు వచ్చి సద్గురుదేవుని దర్శించి, పాకశాలలో కఠినమైన శ్రమచేస్తూ అన్నప్రసాదములను తయారు చేయుటలో రాత్రింబవళ్లు పాల్గొని సేవచేసేవాడు.

సంకప్ప మరియు ఉచ్చప్ప అనే 'గోపన్ కొప్ప' గ్రామభక్తులు సద్గురుదేవుని, వారి గ్రామ-మునకు తీసుకెళ్లి మహావైభవముగా ఉత్సవములు, స్వామి పూజలు జరిపేవారు. వారి భక్తిశ్రద్ధలకు స్వామి చాలా సంతోషించినాడు.

'పరప్ప హుబ్లీకర్' అనే పరమ సద్గురుభక్తుడు ఆమరణ పర్యంతము సద్గురు సాన్నిధ్యంలోనే ఉంటూ, సద్గురుదేవునియొక్క సేవాపరాయణుడై అక్కడనే తన శరీరమును త్యాగము చేసినాడు. ఆయన మరణానంతరము ఆయనయొక్క కుమారులు, మనుమలు కూడా ఆశ్రమమందే ఉంటూ, సద్గురు సేవలోనే నిమగ్నులై ఉండేవారు.

ఖండప్ప మరియు దివిటే అనే భక్తులు మరియు వారి కుటుంబ సభ్యులతోసహా తనువు, ధనము, మనస్సులను సద్గురుదేవులకు అర్పించి, అనన్యమైన భక్తిచేత ఉత్సవకాలములో సేవా కార్యక్రమములో పాల్గొనేవారు.

ఒకానొకప్పుడు సద్గురుసిద్ధారూఢస్వామి విషజ్వరపీడితుడైనప్పుడు, మౌనిబువా అనే భక్తుడు ఇల్లువాకిలి, భార్యాబిడ్డలను వదిలి మూడురోజులు అన్నపానాదులను వదిలేసి రాత్రింబవళ్లు సద్గురు సేవలో పాల్గొన్నాడు. సద్గురుదేవునికి అనేక ఉపచారములు చేస్తూ తపించాడు. మూడు రోజులు కఠిన ఉపవాసముచేస్తూ సద్గురు సేవాపరాయణుడై స్వామివద్దనే నిలబడినాడు. సద్గురుదేవుని

జ్వరము తగ్గేవరకు అక్కడినుండి కదలక రాత్రింబవళ్లు స్వామి సేవలో నిమగ్నమైనాడు. ఎప్పుడైతే స్వామియొక్క జ్వరము తగ్గినదో, అప్పుడు మౌనిబువా ఆహారమును స్వీకరించినాడు. అంతవరకు నిద్రాహారాలను మానేసినాడు.

ఈ విధముగా అసంఖ్యాకమైన భక్తులు సద్గురుదేవుని సేవయందే నిమగ్నులై ఉండేవారు. అందరియొక్క నామములు ప్రకటము చేయాలంటే గ్రంథవిస్తారభయముచేత వర్ణించ లేదు. వారం-దరుకూడా సద్గురుదేవునియొక్క ప్రేమకు, అపారమైన కృపకు పాత్రులై, వారివారి జన్మలు సార్థకము చేసుకున్నారు. అనేక జన్మల పుణ్యఫలముగా వారికి సద్గురుదేవులతో సంబంధము కలిగి ఉద్ధరింప బడినారు. సిద్ధసద్గురుదేవుడు భక్తులయొక్క పెన్నిధి. భక్తులయొక్క భక్తిశ్రద్ధలను పరికించి, వారిపై కరుణబూని వారినందరిని భవసాగరమునుండి తరింప చేసేవాడు.

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రముననే సకల పాపములు భస్మమై పోగలవు. శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణకమలములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబది ఐదవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు.







ఓ౦ శ్రీ గణేశాయ నమః ఓ౦ శ్రీ గురుభ్యోనమః ఓ౦ శ్రీ సరస్వత్యై నమః

# ఏబది ఆరవ అధ్యాయము

పద్యానువాదము:–ఓం శ్రీసద్గురుసిద్ధనాథా! నా హృదయకమలమందుండి–నిన్ను విస్మరించనటువంటి, నీ పాదపద్మములయందే ఎల్లప్పుడూ రమించునటువంటి సద్బుద్ధిని ప్రసాదించుము. నిరంతరము నీయొక్క దివ్యనామ చింతన చేయుటవలన భవభయము నివృత్తి కలుగును. నీ యొక్క ధ్యానము చేయుటవలన దేహవిస్మృతి కలిగి, సదా నీ పదపంకజములయందే లగ్నమగు సద్బుద్ధిని ప్రసాదించుము స్వామీ!

ఓ సిద్ధారూఢ సద్గురుదేవా! భక్తులను ప్రేమచేత, దయచేత రక్షించి, ఆశీర్వదించి వారియొక్క సకల విఘ్నములను నివృత్తి చేయుదువు. నీయొక్క ఆశీర్వాదరూపమైన ప్రేమ నా హృదయమందు నింపుకొని, ఈ సద్గ్రంథమును వ్రాయుటకు నన్ను నిమిత్తముగా చేసుకొని, కలము నా చేతికిచ్చి, నీయొక్క పరమపావనమైన కథామృతమును వ్రాయుటకు పూనుకున్నావు. ఇటువంటి అద్భుతమైన నీయొక్క దివ్యచరిత్రను ప్రకటము చేయుటకు నీవు ఆజ్ఞాపించినందున నిర్విఘ్నముగా ఈ అధ్యాయముతో గ్రంథసమాప్తి చేస్తున్నాను. భక్తి, జ్ఞాన,వైరాగ్యము మరియు సద్గురుదేవునిపట్ల అత్యంత ప్రేమను కలుగజేయునటువంటి ఈ సద్గ్రంథమును నన్ను నిమిత్తము చేసుకొని నీవే స్వయముగా నీయొక్క దివ్య కథామృతమును వ్యక్తము చేసుకున్నావు. వ్రాయుటకు ఉపయోగపడే కలమువలె అల్పజ్ఞుడనైన నా హృదయములో వసించి, అద్భుతమైన ఈ సద్గ్రంథరచన గావించినావు. జడప్రాయుడనైన, అల్పమతి గలవాడినగు నాయందు ప్రేమ, భక్తి లేదు. నేను సంసార విషయాలయందే ఆసక్తుడనైన అల్పజ్ఞ జీవున్ని. నీ యొక్క కృప, ఆశీర్వాదముద్వారా నిర్విఘ్నముగా పరమ పావనమైన నీయొక్క దివ్యకథామృతమును, ఈఉపాధిద్వారా ప్రకటము చేయించుకున్నావు. నాయొక్క మాతృభాష మరాఠీ కాదు. మరాఠీ పాఠశాలలో విద్యనభ్యసించ లేదు. అయినాగాని, మరాఠీభాష లోపము లేకుండా నన్ను నిమిత్త ముగా చేసుకొని గ్రంథరచన గావించినావు. సద్గురుదేవునియొక్క లీలలు, మహిమలు అత్యద్భుతములు. వాటిలో ఈ గ్రంథరచన ఒకటి. ఈ సద్గ్రంథరచన ఎలా జరిగిందో నాకే చాలా ఆశ్చర్యకరముగా దోస్తున్నది. ఈ విధముగా దయాసాగరుడైన సద్గురుదేవుడు భక్తులందరినీ తరింపజేయు నిమిత్తముగా ఈ సద్గ్రంథమును రచించినాడు. కృపాసాగరుడైన సద్గురు దేవునియొక్క అపార ప్రేమరూప సాగరతరంగాలయందు ఎవరైతే మునకలు వేస్తారో,వారు సద్గురు

దేవునియొక్క కృపాకటాక్షమునకు పాత్రులై తప్పకుండా అమరులవుతారు. అత్యంత పవిత్రమైన, మనోహరమైన సద్గురుదేవుని ఈ దివ్యచరిత్రను శ్రద్ధాభక్తులతో ఎవరైతే శ్రవణముచేస్తారో, వారు సద్గురుదేవుని కృపకు పాత్రులై పరమానందమును పొందుతారు.

కొందరు శ్రోతలు వక్తను ఈ ప్రకారముగా అడుగుతారు. స్వామీ! మేము సద్గురుదేవుని యొక్క దివ్యకథామృతమును చాలా రోజులనుండి శ్రవణము చేస్తున్నాము. అయితే ప్రమాద వశాత్తు మేము ఎక్కడైనా శ్రవణము చేయలేకపోయి ఉండవచ్చు.

కొందరంటారు–స్వామీ!మనోహరమైన ఈకథామృతమును సవిస్తరముగా వినలేక పోయి-తిమి. కావున, దయచేసి సంక్షేపముగా మళ్లీ ఒకసారి బోధించండి–అని ప్రార్థిస్తారు. శ్రోతలయొక్క అభిప్రాయమును తెలుసుకొని వక్తాపురుషుడు మళ్లీ సంక్షేపముగా సారభూతమైన సద్గురు చరిత్రను ప్రకటించుటకు పూనుకున్నాడు.

ఓ శ్రోతలారా! మీయొక్క ఆగ్రహముమేరకు గ్రంథముయొక్క సంక్షేప సారమును తెలిపెదను వినండి. ప్రథమాధ్యాయము నందు, సద్గురు వందనము మరియు చతుర్విధ అధికారి లక్షణములు చెప్పబడినవి.

ద్వితీయాధ్యాయమునందు,సిద్ధనాథునియొక్క అవతరణము,బాలక్రీడ వైచిత్ర్యము సులభశైలి చేత బోధించబడినది.

తృతీయాధ్యాయమునందు, సద్గురుశోధనలో సిద్ధనాథుడు సోమ,భీముల సమవేతుడై బ-యలుదేరుతాడు. మార్గములో అనేకదుఃఖములు కలుగుటవలన,వాటిని సహించలేక సోమభీములు చాలా శ్రమనొంది, సిద్ధకుమారుని విడిచి మళ్లీ ఇంటికి తిరిగి వస్తారు.

నాలుగవ అధ్యాయములో, సిద్ధనాథుడు గజదండ మహాస్వామిని ఆశ్రయించి ఆయనయొక్క సేవలు అనేకముగా చేసినాడు. ఒకనాడు సుబ్బయ్య శాస్త్రియొక్క ప్రశ్నను ఖండించి గజదండ మహాస్వామియొక్క మన్ననలను పొంది, గజదండ మహాస్వామిచేత "సిద్ధరూఢుడు"అనే బిరుదును పొందినాడు.

ఐదవ అధ్యాయములో, సిద్ధారూఢస్వామి గజదండస్వామియొక్క ఆశీర్వాదమును పొంది, ఆయన ఆజ్ఞమేరకు, తీర్థయాత్రలకై బయలుదేరినాడు. చింతామణి ఆశ్రమమును దర్శించి, అచ్చట కర్మనిష్ట బ్రాహ్మణులద్వారా వాదోపవాదములు చేస్తాడు. శాస్త్రసమ్మతమైన కర్మ, ఉపాసన, జ్ఞాన-మును క్రమముగా బోధించినాడు. వారియొక్క కర్మనిష్ఠత్వమును నివృత్తి చేసినాడు.

ఆరవ అధ్యాయములో సద్గురు సిద్ధారూఢస్వామి పిచ్చండయ్య, మలయనాథులనే భక్తుల యొక్క శంకలు నివృత్తిచేసి మహావాక్యార్థమును–జీవబ్రహ్మైక్య జ్ఞానమును బోధించి వారిని ధన్యులను చేసినాడు.

ఏడవ అధ్యాయములో, గోకర్ణ క్షేత్రమును సిద్ధారూఢస్వామి దర్శించి, ఆ క్షేత్రమందున్న బ్రాహ్మణులకు విగ్రహపూజకన్నా సాధుపూజ శ్రేష్టమని బోధించినాడు.

ఎనిమిదవ అధ్యాయమునందు, కాశీక్షేత్రమును దర్శించి, న్యాయశాస్త్ర పండితులయొక్క వాదవివాదములను ఖండించి, వారికి యథార్థమైన జ్ఞానమును బోధించినాడు. అక్కడనుండి పంచ క్రోశయాత్ర పూర్తిచేసుకుని, ఒకానొక షావుకారియొక్క ఆగ్రహముమేరకు, ఆయన ఇంట్లో విడిది చేసి, అతని తల్లియొక్క కడుపునొప్పిని నివృత్తి చేసినాడు.

తొమ్మిదవ అధ్యాయమునందు, ఒక విరక్త పురుషుడైన సాధువుద్వారా బింబప్రతిబింబ వాదానుసారము సిద్ధాంతమును విస్తారముగా బోధించాడు.మరియు ఒక మార్వాడి బహుకాలము నుండి దీర్ఘవ్యాధిచేత బాధపడుతూ చివరకు ఆ రోగబాధను తట్టుకోలేక ఒక గుట్టమీదనుండి దుమికి ఆత్మహత్య చేసుకొనుటకు పూనుకొనగా, వానిని మరణమునుండి తప్పించి రోగ నివృత్తిచేసి ఆయనను ఉద్ధరించినాడు.

దశమాధ్యాయమందు, సద్గురు సిద్ధారూఢస్వామి అభిచార (నిషిద్ధ)కర్మలను నిషేధించి, వైదిక కర్మలను ఆచరించి పుణ్యమును ఆర్జించమని బోధించినాడు. తదనంతరము స్వామి బీజాపూర్ కు వెళ్లి అక్కడ నివసిస్తూ అనేక మానావమానములను సహించి జనసంపర్కమును త్యజించినాడు.

పదునొకొండవ అధ్యాయమునందు,సిద్ధారూఢస్వామి కర్మనిష్ఠ జంగమునియొక్క మూర్ఖ-త్వమును నివృత్తి చేసి, వానికి జంగమస్వరూపుడైన పరమాత్మయొక్క జ్ఞానమును ప్రబోధించినాడు. అదే గ్రామములో సిపాయిలద్వారా అనేక హింసలకు గురియై శాంతమును వహించినాడు.

ద్వాదశాధ్యాయమునందు, స్వామి-హుబ్లీ పట్టణములో నివసిస్తూ అద్భుతమైన లీలలను ప్రదర్శించినాడు. తనయొక్క వైభవమును చూసి ఓర్వలేని దుష్టులు స్వామిని అనేక విధములుగా హింసించినాగాని వారిని మన్నించి అనేక బాధలను సహించినాడు.

పదమూడవ అధ్యాయమునందు, హుబ్లీ భక్తులందరూ కలిసి రథోత్సవ సందర్భంగా స్వామిని అలంకరించి రథములో కూర్చుండబెట్టి ఊరేగిస్తారు. కబీర్ అనే శిష్యుడు తనను శరణుజొచ్చినం-దున, కబీర్ కు ఆత్మజ్ఞానమును బోధించి ధన్యుణ్ణి చేసినాడు.

పదనాలుగవ అధ్యాయమునందు, హరిహర సరస్వతులను వ్యాఘ్ర(పులి) వాతనుండి రక్షించినాడు. వారు సద్గురుదేవుని అహర్నిశలు స్మరించుతూ, సద్గురుదేవుని ఆశ్రయించి స్తుతించి తరించినారు.

పదునైదవ అధ్యాయమునందు, రూపకృష్ణ-భాగ్యవతి అనే పుణ్యదంపతులయొక్క పుత్రరత్న-మును గ్రంథిరోగమునుండి కాపాడినాడు.

పదహారవ అధ్యాయమునందు, ఒకానొక పిల్లవాడు సర్పదంష్టుడై పీడితుడగుచుండగా సద్గురుదేవుడు ఆ పిల్లవానిని సర్పబాధనుండి విడిపించి, సర్పవిషమును నివృత్తిచేసి రక్షించినాడు.

పదిహేడవ అధ్యాయములో, దుండగులైన నలుగురు అయ్యలు స్వామి వైభవమునకు ఓర్వ లేక సద్గురుదేవుని అనేక రకములుగా నిందజేస్తుంటే, వారి మెడలోని లింగములను మాయము చేసినాడు. అప్పుడు వారు సద్గురుదేవుని క్షమాపణ వేడుకోగా వారి అహంకారమును నివృత్తిచేసి క్షమించినాడు.

పదునెనిమిదవ అధ్యాయమున, పూర్వజన్మలో పులిగా (వ్యాగ్రముగా) ఉండి అంత్యదశలో సద్గురు సాన్నిధ్యములో స్వామి పాదముల నాశ్రయించి మృతినొంది, మరుజన్మయందు గురప్పగా జన్మించినాడు.

పందొమ్మిదవ అధ్యాయములో, హుబ్లీ పట్టణమునందు రానున్న ఆరునెలలలో కలరావ్యాధి వ్యాపించునని హెచ్చరిక చేసినాడు. సరిగ్గా ఆరునెలల పిదప వ్యాధిగ్రస్తురాలైన బెనకప్పయొక్క భార్యను రక్షించినాడు. మరియు జీవప్ప యొక్క అంధత్వమును నివృత్తి చేసినాడు.

ఇరవదియవ అధ్యాయమునందు, సాతప్ప అనే భక్తుడు భక్తులగూర్చి మహాప్రసాదమును తయారుచేస్తుండగా, అకస్మాత్తుగా మసులుతున్నటువంటి నెయ్యిపాత్ర తొలికి బోర్లబడి సాతప్ప యొక్క శరీరమంతా చిలికి, ఆ ఉష్ణతకు తట్టుకొనలేక మూర్ఛుడైనాడు.భీకరమైన,వికారయుక్తమైన బొబ్బల బాధకు ఓర్చుకోలేక తపించుచున్న సాతప్పను సద్గురుదేవుడు తనయొక్క అమృతహస్తము చేత స్పర్శించి, సాతప్పయొక్క సకలతాపములను నివృత్తి చేసినాడు.

ఇరువది ఒకటవ అధ్యాయమున, సిద్ధనాథుని తమ ఇంటికి తీసుకొచ్చి సగౌవురవముగా పాదపూజ చేయ సంకల్పించిన కృష్ణాబాయికి తన భర్త రమానాథుడు నిరోధించి విఘ్నము కలిగించగా, ఆమెయొక్క తాపత్రయమును నివారించుటకు సద్గురుదేవుడు వారి ఇంటియందలి అన్ని మూర్తులలో సద్గురుమూర్తి దర్శనమిచ్చినాడు.

ఇరువది రెండవ అధ్యాయంలో, ములికి బావి అనే గ్రామములో భక్తులందరూ సప్తాహ ఉత్సవమును జరుపుతూ అతివైభవముగా సద్గురు పూజలు గావిస్తుండగా భక్తులందరూ నిరాశ జెందగా, సద్గురుదేవుడు వెంటనే అక్కడ ప్రకటమై భక్తులకు దర్శనమిచ్చి ఆశీర్వదించినాడు.

ఇరువది మూడవ అధ్యాయమునందు రామరాయుడనే భక్తునికి స్వప్నమందు సద్గురుదేవుడు దర్శనమిచ్చి, అభయమిచ్చి మరునాడు సంతు భోజన పంక్తియందు ఆశ్చర్యముగా ప్రకటమై ఇతర బ్రాహ్మణులయొక్క అహంకారమును నివృత్తి చేసినాడు.

ఇరువది నాలుగవ అధ్యాయమునందు, కటిక దారిద్ర్య గ్రస్తురాలైన గురవ్వ అనే అభాగ్యు-రాలు బావిలోదూకి ప్రాణత్యాగమును చేయదలచుకున్న–ఆమెను రక్షించి ఆశీర్వదించి, ఆమెయొక్క దారిద్ర్యమును నివృత్తిచేసి సకల వైభవములను ప్రసాదించినాడు.

ఇరువది ఐదవ అధ్యాయమున, గురవ్వయొక్క భర్త బసవన్నకు ధనమదమువచ్చి సద్గురు దేవుని విస్మరించినందున, ఆయనయొక్క అభిమానమును నివృత్తి చేయదలచి సద్గురుదేవుడు సక-లైశ్వర్యములను హరించి జైలులో తన లీలద్వారా బంధితున్ని చేయించినాడు. అప్పుడు బసవన్న యొక్క భార్య గురవ్వ అనేక విధములుగా ప్రార్థించగా, ఆమెయొక్క ప్రార్థనను మన్నించి సద్గురు దేవుడు ఆమె భర్తను జైలునుండి విడుదల గావించినాడు.

ఇరువది ఆరవ అధ్యాయమునందు, సద్గురుదేవుని ఆరుగురు మంది మహమ్మదీయులు యథేష్టముగా అనేక హింసలు పెట్టినారు. సద్గురుదేవుడు భక్తులయొక్క ఆగ్రహము మేరకు రథోత్సవ సందర్భముగా ఆరుమంది మూర్ఖులను కూడా కరుణించి ఆశీర్వదించినాడు.

ఇరువది ఏడవ అధ్యాయమున, సకాలమున వర్షములు కురియక శివరాత్రి ఉత్సవము నిర్విఘ్నముగా జరగడానికి భక్తులయొక్క ప్రార్థనలాలకించి సద్గురుదేవుడు వారికి మేఘవిద్య ఉపాసనద్వారా వర్షమును కురిపించి, అంతా జలమయముగాజేసి కోనేరును నింపి భక్తులకు నీటి కొరత లేకుండా చేసి ఉత్సవమును నిర్విఘ్నముగా జరిపించినాడు.

ఇరువది ఎనిమిదవ అధ్యాయమున, "శివాయ నమః" అను భక్తుడు అహర్నిశలు పంచాక్షరి మంత్రోచ్చారణ చేస్తూ వేకువనే భక్తులను మేల్కొనజేసేవాడు. ఆయనను ఒకనాడు రక్షకభటులు బంధించగా స్వామి ఫౌజుదారు వేషములో వెళ్ళి తన భక్తుడైన "శివాయ నమః" భక్తుని విడుదల చేస్తాడు.

ఇరువది తొమ్మిదవ అధ్యాయమునందు, శివప్ప అనే భక్తుడు సద్గురు సేవాతత్పరుడై తొందర తొందరగా నిచ్చెన ఎక్కుతుండగా కాలుజారి బండమీద పడి మరణోన్ముఖుడు కాగా సద్గురుదేవుడు తన అమృతహస్తముచేత "ఓం నమశ్శివాయ" అంటూ జలమును శివప్ప ముఖముపై ప్రోక్షించి ఆయనను బ్రతికించాడు. మరియు ఒకానొకప్పుడు సద్గురుదేవుడు రోగ పీడితుడైనప్పుడు భక్తులు అత్యాదరముతో తెచ్చి ఇచ్చిన మందు బిళ్ళలను ఒకేసారి మ్రింగినాడు.

ముప్పదియవ అధ్యాయములో, దానవ్వ అనే భక్తురాలియొక్క మూడవ కాన్పులో జన్మించ బోయే పుత్రుని గర్భములోనే మాయముచేసి, ఆ బాలుని సద్గురుదేవుడు తీసుకెళ్ళి సత్పురుషుల సాన్నిధ్యములో ఉంచుతాడు. వారికి త్వరలోనే మళ్లీ ఒక పుత్ర రత్నమును ప్రసాదిస్తాడు.

ముప్పది ఒకటవ అధ్యాయమునందు, సద్గురుదేవుడు శరణప్ప అనే భక్తునకు ఆయన యందున్న భక్తి శ్రద్ధలను పరీక్షింపగోరి ఫలముల నిమిత్తము వృక్షముపై ఎక్కించినాడు. అప్పుడు

శరణప్ప పట్టుదప్పి అక్కడినుండి క్రిందపడగా అపారమైన కృపచేత కాపాడి ఆత్మజ్ఞానమును ప్రసాదించినాడు.

ముప్పది రెండవ అధ్యాయమునందు, గురుపాదయ్య అనే భక్తునకు స్త్రీ,పుత్రాదులు విరోధులై ప్రతిబంధకమును ఏర్పరచగా భార్యాపుత్రులను త్యజించి, సద్గురు సాన్నిధ్యమునుజేరి సేవాతత్పరుడై, సద్గురుదేవుని కృపకుపాత్రుడై తరించినాడు.

ముప్పది మూడవ అధ్యాయమునందు, గర్గ గ్రామములో నివసించే మడివాలస్వామి వద్దకు సద్గురు సిద్ధారూఢస్వామి వెళ్లి అక్కడ మడివాలస్వామియొక్క ప్రశ్నలకు యోగ్యమైన సమాధానమిచ్చి అద్భుత లీలను ప్రకటముచేసి అక్కడి భక్తులను ఆశీర్వదించినాడు.

ముప్పది నాలుగవ అధ్యాయమున, నిరుపాదప్పకు బంధువులు, సద్గురుభక్తిలో ప్రతిబంధక-ము గావించి అనేక హింసలుపెట్టి పీడించగా, ఆత్మఘాతమునకు పూనుకొనగా, అదే క్షణమందు సద్గురుదేవుడు అక్కడికక్కడే ప్రత్యక్షమై నిరుపాదప్పను రక్షించాడు.

ముప్పది ఐదవ అధ్యాయములో, సద్గురుదేవుడు భోలాభక్తునికి జ్వరమును ఇచ్చినాడు. భోలాభక్తుడు బావిలో పడి బాధపడుతుండగా సద్గురుదేవుడు దర్శనమిచ్చి కాపాడినాడు.

ముప్పది ఆరవ అధ్యాయమునందు,పరుశురామపంతు సద్గురుదేవుని దివ్యమహిమను ప్రవ-చనముద్వారా వర్ణించడానికి 'రోణా' గ్రామమునకు సప్తాహముగూర్చి వెళ్లినప్పుడు సద్గురుదేవుడు వారికి టిక్కెట్లు తెచ్చి ఇచ్చి అద్భుత లీలను చూపించినాడు.

ముప్పది ఏడవ అధ్యాయమునందు, కృష్ణ అనే పేరుగల శ్రీరామ భక్తుడైన బాలుడు,(కాలాం-తరములో గోవిందానందుడు) సద్గురు సిద్ధారూఢస్వామికి శరణాగతుడు కాగా అతనిని ధన్యుణ్ణి చేసినాడు.

ముప్పది ఎనిమిదవ అధ్యాయమునందు, తుక్కప్ప అనే భక్తునియొక్క పుత్రుడు హనుమంతు జ్వరపీడుతుడై మరణోన్ముఖుడై సద్గురుదేవుని ఆర్తనాదముతో వేడుకోగా ఆయనను రక్షించాడు.

ముప్పది తొమ్మిదవ అధ్యాయములో, సద్గురుదేవుని యొక్క దర్శనార్థము తాయిబాయి అనే భక్తురాలు తన కుటుంబ సభ్యులతోసహా సద్గురు సాన్నిధ్యమునకు రాగా, తన మనుమరాలైన నళినీబాయికి తీవ్రమైన విషజ్వరము ప్రాప్తమై చాలా క్లిష్టపరిస్థితిలో ఉండగా, తాయీభాయి సద్గురుదేవుని అనేక విధములుగా ఆర్తస్వరముతో వేడుకోగా సద్గురుదేవుడు తత్క్షణమే అక్కడికక్కడే ప్రత్యక్షమై ప్రాణసంకట పరిస్థితుల్లో ఉన్నటువంటి నళినిని రక్షించాడు.

నలుబదియవ అధ్యాయములో, సద్గురుదేవుని దర్శనము గూర్చి యాత్రాభక్తులు హుబ్లీకి వస్తుండగా మార్గమధ్యములో దొంగలు అడ్డగించుకొని వారిని పీడించుచుండగా, ఆ యాత్రికులు

సద్గురుదేవుని ఆర్తనాదముతో వేడుకొనగా, వెంటనే సద్గురుదేవుడు దొంగలకు వికృతరూపములో ఉన్న కాళికాదేవిగా కనిపించి, వారి చోరవృత్తినుండి విముఖులను చేసి భక్తులను రక్షించినాడు.

నలుబది ఒకటవ అధ్యాయములో, హీరూబాయి అను భక్తురాలు యమదూతలచే పీడింప బడుతుండగా సద్గురుదేవుడు శివభటులను పంపి ఆమెను మృత్యువునుండి కాపాడినాడు.

నలుబది రెండవ అధ్యాయమున, శంకరుడు అనే భక్తుడు సద్గురుదేవుని దర్శనార్థమై హుబ్లీకి వెళ్తుంటే ప్రవాహరూప నదియందు చిక్కుకొని బాధపడుతుండగా అక్కడికక్కడే సద్గురుదేవుడు ప్రత్యక్షమై ఆ క్లిష్టపరిస్థితులనుండి రక్షించాడు.

నలుబది మూడవ అధ్యాయములో, 'గోందువలేకర్' మహారాజు హుబ్లీ పట్టణమునకు వచ్చి శ్రీ సిద్ధారూఢ సద్గురుదేవుడు సాక్షాత్ జ్ఞానేశ్వర్ అవతారమని ప్రకటించినాడు.

నలుబది నాలుగవ అధ్యాయములో, సద్గురుదేవుడు ఉపదేశించిన తారకమంత్రము "శ్రీరామ్ జయరాం జయ జయ రామ్" ను ఏకాగ్రతతో జపించి శ్రీరామచంద్రుని దర్శన ప్రాప్తిని పొంది తమన్నశాస్త్రి ధన్యుడైనాడు.

నలుబది ఐదవ అధ్యాయములో, నారాయణ అనే భక్తునియొక్క కూతురుకు లగ్నసమయ-మున కలిగిన ఆపదను సద్గురుదేవుడు నివృత్తిచేసి ఆమెయొక్క వివాహమును నిర్విఘ్నముగా జరిపించినాడు.

నలుబది ఆరవ అధ్యాయమునందు అక్కల్ కోట శరణప్ప 'ఉణకల' గ్రామస్తులచే సేకరించ బడిన పదివేల మందికి సరిపడు ప్రసాదమును లక్షమందికి సరిపడినట్లుగా సద్గురు సిద్ధనాథుడు అనుగ్రహించినాడు.

నలుబది ఏడవ అధ్యాయమునందు, పాండిత్య గర్వముచే సుబ్బయ్యశాస్త్రి సిద్ధారుడస్వామి చేత వాదముచేసి తరువాత తనయొక్క పొరపాటును తెలుసుకొని పశ్చాత్తాప హృదయముతో,తన అంత్యకాలమున సద్గురుదేవుని పాదాలచెంత బ్రహ్మలీనుడై, తరువాత జన్మలో శివపుత్రప్పగా జన్మించి సద్గురు సాన్నిధ్యమును బడసి ధన్యుడైనాడు.

నలుబది ఎనిమిదవ అధ్యాయములో, భూతబాధచే పీడితురాలైన రుక్మిణి అను భక్తురాలును ఉద్ధరించుట కోసము సద్గురు యతిరూపమును ధరించి వచ్చి ఆమె నోటిలో విభూతిని వేసి భూత-బాధనుండి విముక్తురాలిని చేసినాడు.

నలుబది తొమ్మిదవ అధ్యాయమునందు, సద్గురుదేవునియొక్క వైభవమును ఓర్వలేని వంచకుల ప్రేరణచేత విషప్రయోగము గావించిన స్త్రీయొక్క బుద్ధిభ్రష్టమై తన తప్పును ఒప్పుకొని పశ్చాత్తాప హృదయముతో సద్గురుదేవుని స్మరిస్తూ ప్రాణత్యాగముచేసి సద్గురుదేవుని కృపకు పాత్రురాలయ్యింది.

ఏబదియవ అధ్యాయములో, పరమవైరాగ్యపరుడైన చనమల్లప్ప సద్గురు సేవయందు సర్పకాటుకు గురికాగా ఆయనను సద్గురుదేవుడు రక్షించినాడు.

ఏబది ఒకటవ అధ్యాయములో, ఖాసగతస్వామి జ్వరపీడుతుడై ఉన్నప్పుడు చనమల్లప్ప మరియు ఇతరులు ఆయన సేవ చేస్తుంటే భరించలేని ఖాసగతప్ప, వీరి సేవనుండి తప్పించుకొని అడవిలోకి వెళ్లి ఏకాంతములో జ్వరతాపముచే పీడింపబడుతుండగా, సద్గురు సిద్ధారూఢస్వామి ఖాసగతప్పను వెదుకుతూ వెదుకుతూ వచ్చి ఆయనను తిరిగి ఆశ్రమములోకి తీసుకెళ్లినాడు.

ఏబది రెండవ అధ్యాయమునందు, నిర్వాణప్ప అను భక్తుడు అనేక జన్మలకు కారణమైన అజ్ఞానము మరియు దానియొక్క కార్యమైన సంస్కారములు ఎలా నివృత్తి అవుతాయి స్వామీ! అని సద్గురుదేవుని ప్రశ్నించగా, స్వామి ఆయనకు సమాధానముగా ఆత్మోపదేశముచేసి కృతకృత్యుడిని చేసినాడు.

ఏబది మూడవ అధ్యాయమునందు, తన్ను దర్శించుటకు ప్రయాణమై నౌకలో వస్తున్న లక్ష్మీబాయి నౌక, ఆకస్మాత్తుగా మునిగి ప్రమాదములో చిక్కుకొనగా వెంటనే స్వామి అక్కడే ప్రత్యక్షమై లక్ష్మీబాయిని రక్షించినాడు.

ఏబది నాలుగవ అధ్యాయములో,కాలాప్రసాదము తయారీ, సద్గురుదేవునియొక్క మహిమ, వైభవముగూర్చి శివపార్వతుల సంవాదము, కుష్టురోగియొక్క రోగనివారణము మరియు భక్తుల-కుపదేశము చేయబడినది.

ఏబది ఐదవ అధ్యాయములో, ఏ భక్తులైతే చాలా కాలము సద్గురుసేవలో పాల్గొని సద్గురు కృపకు పాత్రులైనారో, ఏభక్తుల నామములను స్మరిస్తే సద్గురుదేవుడు మనలను కరుణిస్తాడో, అటువంటి నామావళిని ప్రకటించడమైనది.

ఈ ఏబది ఆరవ అధ్యాయములో, సద్గురు సిద్ధారూఢ స్వామియొక్క పరమపావనమైన పుణ్యప్రదమైన చరిత్రయొక్క సమగ్ర సారాంశము (గ్రంథముయొక్క సారము) సంక్షేపముగా వివరించడమైనది.

పరిశుద్ధాంతఃకరణముచేత నిశ్చలమైన భక్తిగలిగి ప్రసన్నహృదయముచేత లక్ష్యార్థ సహిత-ముగా ఈ గ్రంథమును పఠించినట్లైన, హృదయములో పరమానందముదయించ గలదు.

ఈ గ్రంథము సప్తాహములో (ఏడు రోజులలో) పారాయణము చేయవలసిన పద్ధతిని చెబుతాను వినండి. మొదటి రోజున ఎనిమిది అధ్యాయములను పూర్తిగా పఠించాలి. రెండవ రోజున పదహారవ అధ్యాయము వరకు, మూడవ రోజున ఇరువది నాలుగవ అధ్యాయము వరకు, నాలు-గవ రోజున ముప్పది రెండవ అధ్యాయము వరకు పూర్తిగా పఠించాలి. ఐదో రోజున నలుపది అధ్యాయముల వరకు, ఆరవ రోజున నలుపది ఎనిమిదవ అధ్యాయముల వరకు మరియు ఏడవ

రోజున ఏబది ఆరు అధ్యాయములను నిశ్శేషముగా ప్రేమ, శ్రద్ధాభక్తులచే పఠించవలెను. ఇటువంటి అద్భుతమైన సద్గురుసిద్ధారూఢ చరిత్రను హృదయపూర్వకముగా భక్తిచేత పఠించినట్లైన సకలమనో-రథములు పూర్తి కాగలవు. తత్కాలమే సద్గురుదేవుడు కరుణించగలరు. సద్గురు సిద్ధారూఢస్వామి యొక్క కృప అపారమైనది. ఏ భక్తులైతే సంపూర్ణముగా సకలభారమును సద్గురుదేవునిపై వేసి ఆయన పైననే పూర్ణ విశ్వాసమునుబెట్టి ఎల్లవేళలా సద్గురుదేవునే స్మరించినట్లయితే, వారియొక్క సకల మనోఽభీష్టములు నెరవేర్చి, వారియొక్క చిత్తచాంచల్యమును తొలగించి, మల విక్షేప దోషములను నివృత్తి చేసి, పరిశుద్ధ అంతఃకరణమునందు క్షణకాలములో ఆత్మసాక్షాత్కారమును కలుగజేసి,ముల్లోకములలో దుర్లభమైనమోక్షమును ప్రసాదిస్తాడు.అనగా స్వస్వరూపమును పొం-దిన జీవుడు శివుడౌతాడు. (పరబ్రహ్మమే అవుతాడు) "**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి**"(ముం.3-2-9) మాయాకార్యమైన ఈ సకలజగత్తును బ్రహ్మస్వరూపముగానే దర్శిస్తాడు. (కల్పితవస్తువు అధిష్టాన-ముకంటె భిన్న ముగా ఉండదు. మరేమగా, అధిష్టానరూపమే ఉంటుంది). శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో కూడిన ఈ సర్వజగత్తు బ్రహ్మజ్ఞానికి తనయొక్క అంగముగానే (తన స్వరూప ముగానే) గోచరిస్తుంది.

**శ్లో ॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**

**సుఖం వా యది వా దుఖం స యోగీ పరమోమతః ॥** (గీత 6-32)

పవిత్ర హృదయముచేత పరిశుద్ధమైన భావముచేత, పరిపూర్ణ విశ్వాసముచేత ఏ భక్తులైతే ఈ సద్గురు దివ్యచరిత్రను పఠనము చేస్తారో, వారు అగాధమైన మహిమగల ఆ సద్గురుకృపకు పాత్రులవుతారు. వారికి, దేనిని పొందిన పిదప మళ్ళీ వేరొకటి పొందదగినది ఉండదో, అటువంటి మోక్షము ఆత్మజ్ఞానముద్వారా లభిస్తుంది.

**శ్లో ॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**

**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥** (గీత 6-22)

ఇట్టి, దేవతలకు సహితము దుర్లభమైన మోక్షలాభమును పొందినాక, ఇహలోక సంబంధ అల్పమైన లాభములను గూర్చి వేరే చెప్పవలెనా? సకల సంపత్తులు ప్రాప్తమౌవుతాయి. సద్గురు దేవుడు కరుణిస్తే మకుటములేని మహారాజు (చక్రవర్తి) కూడా కాగలడు. ఇక గ్రామముల మాటేమి-టి? కావున, ఈ సద్గ్రంథ పఠనమువలన అద్భుతమైన అమోఘమైన లాభము ప్రాప్తిస్తుంది.

అద్భుతమైన సద్గురు సిద్ధారూఢస్వామియొక్క దివ్యచరిత్ర పఠనమువలన విషయప్రాప్తి (భౌతికసంబంధమైనవి) లభించుట అనునది చాలా సిగ్గుచేటు. ఎందుకనగా, రాజు వద్దకు అర్థించుటకు వెళ్లిన వారికి తృణము అనగా గడ్డి లభిస్తుందా? కాదు. వజ్రవైఢూర్యములు లేదా ధనము వగైరా ఇచ్చి పంపిస్తాడు. అదేవిధముగా సకల బ్రహ్మాండనాయకుడైన ఆ సద్గురుదేవుడు నశ్వరమైన విషయ

సంపత్తిని ప్రసాదిస్తాడా? లేదు. ఎప్పుడు తరుగనటువంటి, ఎంత పంచినా తరగని అమూల్యమైన శాశ్వతమైన పరమ శ్రేష్టమైన జ్ఞానధనమును ఇచ్చి **"సర్వదుఃఖ నివృత్తి పరమానంద బ్రహ్మప్రాప్తి"** రూప మోక్షమును ప్రసాదిస్తాడు. సకల జగత్తును సృష్టించి పరిపాలిస్తున్నాడు. ఎవరికి ఏ లోటు లేకుండా తగిన వ్యవస్థలు చేసి, వారివారి మనోఽభీష్టములను అడగకుండగనే ప్రసాదిస్తున్న సద్గురుదేవుని ఇంకా యేమి అడిగేది? యేమి కోరేది?

**శ్లో ॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।** (గీత 10-8)

**శ్లో ॥ పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।** (గీత 9-17)

**శ్లో ॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్ ।** (గీత 9-10)

**శ్లో ॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।** (గీత 7-10)

సకల జగత్తుకు సృష్టికర్త, ఆధారము, పాలనకర్త ఆ సద్గురు దేవుడుండగా ఇంకా ఏమని ఆ సద్గురుదేవుని కోరేది.

**శ్లో ॥ తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ।** (గీత 9-22)

**శ్లో ॥ తేషాం మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్ ॥** (గీత 12-7)

**శ్లో ॥ దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ।** (గీత 10-10)

**శ్లో ॥ తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః ।**

**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥** (గీత 10-11)

ఇట్లు, ప్రతిజ్ఞచేసిన సద్గురుదేవుని–నశ్వరమైన, క్షణికమైన లౌకిక సుఖోపభోగములను యాచించడము హాస్యాస్పదము. కావున, సద్గురు సిద్ధారూఢస్వామియొక్క పవిత్రమైన చరిత్ర పఠనమువలన లౌకికమైన క్షణికమైన నశ్వరమైన విషయోప భోగములు ప్రాప్తిస్తాయని శ్రోతలను ప్రలోభపెట్టి వ్రాయడము లేదు. మరేమనగా, శ్రద్ధాభక్తులచేత ఎవరైతే సద్గురుదేవునియొక్క దివ్య కథామృతమును పఠించినగాని, శ్రవణముచేసినగాని, వారియొక్క అంతఃకరణము శుద్ధిగలిగి వారిలో కామవాసనల సహితము నివృత్తమౌతాయి. కామసంకల్పమే లేనప్పుడు కోరుకునేది అసంభవము. ఈ ప్రకారముగా సద్గురు సిద్ధారూఢస్వామియొక్క పరమపావనమైన చరిత్రరూప కథామృతము ఇంతటితో సంపూర్తి అయినది.

అయితే, శ్రోతలు ఈ సద్గ్రంథమును ఎవరు వ్రాసినారు? దీనికి నిమిత్తమెవరు?అని సద్గురు దేవున్ని ప్రశ్నించగా, వారికి సమాధానము చెప్తున్నాడు. నాయొక్క దివ్య కథామృతమును నేను చెప్తుండగా 'శివరామ' అను భక్తుడు నిమిత్తమాత్రుడై రచన గావించినాడు. ఆయనయొక్క తండ్రి లక్ష్మణయ్య మరియు తల్లి పద్మావతి. వీరు పరమవైరాగ్య వృత్తిగలిగిన వారు. జ్ఞాతి (జాతి) గౌడ సారస్వత బ్రాహ్మణులు. కౌశిక గోత్రము, విశ్వామిత్ర ఋషివంశము. ఇటువంటి మాతా పితరులకు

శివరామ వందనములు సమర్పించి, సద్గురు సేవలో (గ్రంథరచనలో) నిమగ్నుడైనాడు. వీరియొక్క మూల (ముఖ్యమైన) గ్రామము ముక్తాపురము. సద్గురుదేవుని కృపకు పాత్రులై సద్గురుసేవలో పాల్గొని సిద్ధాశ్రమమునందే నివసిస్తున్నారు. క్రీ.శ.1844 దుందుభి నామ సంవత్సర కార్తీక శుద్ధ షష్ఠి గురువారము నాడు, ఈ సద్గురుదేవుని చరిత్రరూప సద్గ్రంథము వ్రాయడము సమాప్తి అయినది. దయాసాగరుడైన సద్గురు సిద్ధారూఢస్వామియొక్క దివ్య పాదారవిందములకు సాష్టాంగ దండవత్ ప్రణామములు చేస్తూ మరియు సద్భక్తులైన శ్రోతృమహాపురుషులకు, స్త్రీమాతలకు, బాలురకు అందరికీ శిరసా వందనములు చెల్లిస్తూ, ఈ సద్గ్రంథరచన మంగళోచ్చారణముతో ముగిస్తున్నాను.

**శ్లో ॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**

**ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ ।**

**ఏకం నిత్యం విమలమచలం సర్వ ధీ సాక్షిభూతం,**

**భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ॥**

స్వస్తి శ్రీ సిద్ధారూఢ కథామృతమును శ్రవణము చేసినంత మాత్రముననే సకల పాపములు భస్మమైపోవును. శ్రీ సిద్ధారూఢ సద్గురు చరణారవిందములకు శ్రీ శివదాసస్వామి ఈ ఏబది ఆరవ అధ్యాయమును సమర్పిస్తూ ముగిస్తున్నాడు.

ఓం శ్రీ సద్గురు సిద్ధారూఢ చరణారవిందార్పణమస్తు



## ॥ శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి హారతి ॥

శ్రీ సిద్ధారూఢాయ మంగళం, శ్రీ శివావతారాయ మంగళమ్ ।

గజదండ శిశ్యాయ ముఖమండలాభాయ, బ్రహ్మాండ పూజ్యాయ మంగళమ్ ॥ శ్రీ శివా ॥

భక్తైక్యపాలాయ మంగళం, శ్రీ ముక్తాత్మవంద్యాయ మంగళమ్ ।

శివశక్తిరూపాయ పరముక్తిదాతాయ, వరభక్తివేద్యాయ మంగళమ్ ॥ శ్రీ శివా ॥

అజ్ఞాననాశాయ మంగళం, వరసుజ్ఞానకోశాయ మంగళమ్ ।

విజ్ఞానమూలాయ సర్వజ్ఞరూపాయ, బ్రహ్మజ్ఞశ్రేష్ఠాయ మంగళమ్ ॥ శ్రీ శివా ॥

వంశదుర్గేశాయ మంగళం, తవ వంశానుకంపాయ మంగళమ్ ।

దాసకుమారేశాయ శివపుత్ర శిష్యాయ, శ్రీపాదసేవ్యాయ మంగళమ్ ॥ శ్రీ శివా ॥



॥ శ్రీ సద్గురు సిద్ధారూఢ స్వామి హారతి ॥

గురురాజ సిద్ధారూఢ సమర్థ, బెళగువె నారతియా ।

గురూవర బెళగువెనారతియా ॥ధృ ॥

మోక్షాపేక్షగె తత్త్వంపదద, అర్థవ బోధిసిదీ ।

గురూవర అర్థవ బోధిసిదీ ॥

ఉక్షావాహన శంకర నామోచ్చారవ మాడిసిదీ ।

నామోచ్చారవ మాడిసిదీ ॥ 1 ॥

శ్యామధామ శ్రీరామభిన్న శంకర నీనిరువి ।

గరూవర శంకర నీనిరువి ॥

కామక్రోధవనాశిసి జగదొళు శాతియ బీరిదీ ।

గురూవర శాంతియ బీరిదీ ॥ 2 ॥

చరణ భజకరా దురిత వృందవా త్వరితది నాశిసిది ।

గురూవర త్వరితది నాశిసిది ॥

వరభూలతాపుర దైవదిందలి నిరుతది వాసిసిదీ ।

గురూవర నిరుతది వాసిసిదీ ॥ 3 ॥

గురురాజ సిద్ధారూఢ సమర్థ, బెళగువె నారతియా ।

గురూవర బెళగువెనారతియా ॥ధృ ॥



## పరిశిష్టము – స్తోత్రములు

## శ్రీ సద్గురు పాదుకాస్తవమ్

శ్లో॥శ్రీ సమంచిత మవ్యయం పరమ ప్రకాశ మగోచరం
భేద వర్జిత మప్రమేయ మనన్త మాద్య మకల్మషం ।
నిర్మలం నిగమాన్త మద్వయ మప్రతర్క్య మబోధకం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥1॥
శ్లో॥నాదబిన్దు కళాత్మకం దశనాద భేద వినోదకం
మంత్రరాజ విరాజితం నిజమండలాంతర భాసితం ।
పంచవర్ణ మఖండ మద్భుత మాదికారణ మచ్యుతం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥2॥
శ్లో॥వ్యోమ వద్బహిరన్తరస్థిత మక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిశుద్ధ మేక మజన్మహి ప్రతి రూపకమ్ ।
బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతాను మోక్ష సుబోధకం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥3॥
శ్లో॥బుద్ధిరూప మబుద్ధికం త్రితయైక కూట నివాసినం
నిశ్చలం నిరత ప్రకాశక నిర్మలం నిజమూలకమ్ ।
పశ్చిమాన్తర ఖేలనం నిజశుద్ధ సంయమి గోచరం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥4॥
శ్లో॥హృద్గతం విమలం మనోజ్ఞ విభాసితం పరమాణుకం
నీల మధ్య సునీల సన్నిభ మాది బిన్దు నిజాం శుకమ్ ।
సూక్ష్మ కర్ణిక మధ్యమస్థిత విద్యుదాది విభాసితం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥5॥
శ్లో॥పంచ పంచ హృషీక దేహ మనశ్చతుష్క పరస్పరం
పంచభూత సకామ షట్క సమీర శబ్ద ముఖేతరమ్ ।
పంచ కోశ గుణత్రయాది సమస్త ధర్మ విలక్షణం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥6॥
శ్లో॥పంచ ముద్ర సులక్ష్య దర్శన భావమాత్ర నిరూపణం
విద్యుదాది ధగద్ధగిత్వ రుచిర్వినోద వివర్ధనమ్।
చిన్ముఖాన్తర వర్తినం విలసద్విలాస మమాయకం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥7॥
శ్లో॥పంచ వర్ణ రుచిర్విచిత్ర విశుద్ధ తత్త్వ విచారణం
చంద్ర సూర్య చిదగ్ని మండల మండితం ఘన చిన్మయం ।
చిత్కళా పరిపూర్ణ మంతర చిత్ సమాధి నిరీక్షణం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥8॥
శ్లో॥హంసచార మఖణ్డనాద మనేక వర్ణ మరూపకం
శబ్ద జాలమయం చరాచర జన్తు దేహ నివాసినమ్ ।
చక్రరాజ మనాహతోద్భవ మేక వర్ణ మతః పరం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥9॥
శ్లో॥జన్మకర్మ విలీన కారణ హేతుభూత మభూతకం
జన్మకర్మ నివారకం రుచి పూరకం భవతారకం।
నామరూప వివర్జితం నిజ నాయకం శుభదాయకం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥10॥
శ్లో॥తప్తకాంచన దీప్యమాన మహాణు మాత్ర మరూపకం
చన్ద్రికాన్తర తారకైరవ ముజ్జ్వలం పరమాస్పదమ్।
నీల నీరద మధ్యమస్థిత విద్యుదాది విభాసితం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥11॥
శ్లో॥స్థూల సూక్ష్మ సకారణాన్తర ఖేలనం పరిపాలనం
విశ్వతైజస ప్రాజ్ఞచేతస మన్తరాత్మ నిజాంశుకమ్ ।
సర్వకారణ మీశ్వరం నిటలాన్తరాళ విహారకమ్
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥12॥

*ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత శ్రీమద్గురు పాదుకాస్తవ స్సంపూర్ణమ్*

## అద్వైత పఞ్చరత్నమ్

**నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గో, నాహఙ్కారః ప్రాణవర్గో న బుద్ధిః ।**
**దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః, సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్ ॥ 1 ॥**

**రజ్జ్వజ్ఞానాద్భాతి రజ్జౌ యథాహిః, స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః ।**
**ఆప్తోక్త్యాఽహిభ్రాన్తినాశే స రజ్జుర్జీవో నాహం దేశికోక్త్యా శివోఽహమ్ ॥ 2 ॥**
**ఆభాతీదం విశ్వమాత్మన్యసత్యం, సత్యజ్ఞానానన్దరూపే విమోహాత్ ।**
**నిద్రామోహాత్ స్వప్నవత్తన్న సత్యం, శుద్ధః పూర్ణో నిత్య ఏకః శివోఽహమ్ ॥ 3 ॥**
**నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో, దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః ।**
**కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహఙ్కారస్యైవ హ్యాత్మనో మే శివోఽహమ ॥ 4 ॥**
**మత్తో నాన్యత్కిఞ్చిదత్రాస్తి విశ్వం, సత్యం బాహ్యం వస్తు మాయోపక్లృప్తమ్ ।**
**ఆదర్శాన్తర్భాసమానస్య తుల్యం, మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్ ॥ 5 ॥**

॥ ఇతి శ్రీ పూజ్యపాద ఆద్య శంకరాచార్య విరచిత అద్వైత పఞ్చరత్నమ్ ॥



## మహ్యామేవ నమో నమః

సర్వభావాన్తరస్థాయ చైత్యముక్తచిదాత్మనే ।
ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యామేవ నమో నమః ॥(సంన్యాసోప. ౨-25; వరాహోప. ౨-33)
త్వం వాఽహమస్మి భగవో దేవ తేఽహం వై త్వమసి ।
తుభ్యం మహ్యమనన్తాయ మహ్యం తుభ్యం చిదాత్మనే ॥ (వరాహోప. ౨-34)
నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ ।
కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్ ॥ (వరాహోప. ౨-35)
ఏకస్మై కృతకృత్యాయ నిత్యాయ విమలాత్మనే ।
నిర్వికల్పచిదాఖ్యాయ మహ్యామేవ నమో నమః ॥
న శోకోఽస్తి న మోహోఽస్తి నచైవాహమహం స్వయమ్ ।
న చ నాహం నచాన్యోఽహం మహ్యామేవ నమో నమః ॥
న మమాశా న కర్మాణి న సంసారో న కర్తృతా ।
న భోక్తృతా న దేహో మే మహ్యామేవ నమో నమః ॥

నాహమాత్మా న వా కోఽన్యో నాహమస్మి నచేతరః ।
సర్వమేవాహమేతస్మై మహ్యమేవ నమో నమః ॥
అహమాదిరహం ధాతా చిదహం భువనాన్యహమ్ ।
మమ నాస్తి వ్యవచ్ఛేదో మహ్యమేవ నమో నమః
నిర్వికారాయ నిత్యాయ నిరంశాయ మహాత్మనే ।
సర్వస్మై సర్వకాలాయ మహ్యమేవ నమో నమః ॥
నీరూపాయ నిరాఖ్యాయ ప్రకాశాయ మహాత్మనే ।
స్వయమాత్మైకసంస్థాయ మహ్యమేవ నమో నమః ॥
సమాం సర్వగతాం సూక్ష్మాం జగదేకప్రకాశినీమ్ ।
సత్తాముపగతోఽస్మ్యన్తర్మహ్యమేవ నమో నమః ॥
సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం నాహమేవాహమేవ వా ।
జగత్సర్వం పదార్థాఖ్యం మహ్యమేవ నమో నమః ॥ (యో.వా.ఉపశమ ప్ర.80-40 నుండి 48)
ఇదం సత్యమిదం సత్యం సత్యమేతదిహోచ్యతే ।
అహం సత్యం పరం బ్రహ్మ మత్తః కిఞ్చిన్న విద్యతే ॥ (వరాహోప.2-38)

ఓం తత్సత్ ఓం

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వామి ఆశ్రమము - సోలాపూర్



శ్రీ సద్గురు మలయాళ స్వాముల వారు



శ్రీ నారాయణ మహరాజ్



స్వామి బ్రహ్మవిద్యానన్ద